# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అప్పకవీయము, గిడుగు రామమూర్తిపంతుల విమర్శతో | ... | 3 | 0 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము | ... | 8 | 0 |
| „ ఉత్తమప్రతి, 2 సంపుటములు | ... | 10 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| „ టీక | ... | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు గల సంపుటము | ... | 3 | 0 |
| ఆరణ్యపర్వము | ... | (అచ్చు) | |
| విరాటోద్యోగపర్వములు | ... | (అచ్చు) | |
| భీష్మద్రోణపర్వములు | ... | „ | |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | „ | |
| శాంతిపర్వము | ... | 3 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 3 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | (అచ్చు) | |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | „ | |
| శాంతిసప్తకము | ... | 5 | 4 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, అట్టబైండు | ... | 1 | 4 |
| డిటో క్యాలికోబైండు | ... | 1 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 1 | 12 |
| కవికర్ణరసాయనము, (మాంధాతృచరిత్ర) | ... | 1 | 8 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు ... | 10 | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) ... | 1 | 0 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, పద్యము కేతనకవి ... | 1 | 8 |
| దశావతారచరిత్ర, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, భాగవతములోనిది ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 1 | 0 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్య ప్రణీతము ... | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 1 | 0 |
| ,, క్యాలికోబైండు ... | 1 | 6 |
| ,, వేంకటనాథరాజకవికృతము ... | 1 | 4 |
| ,, క్యాలికోబైండు ... | 1 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము ... | 3 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు, శ్రీధరమల్లె వేంకటరామకవి ... | 1 | 8 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి ... | 2 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 6 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 4 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 2 | 8 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు ... | 3 | 0 |
| ,, II ,, ... | 3 | 0 |
| ,, III ,, ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, ... | 3 | 0 |
| రంగనాథరామాయణము; ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము | ... | 3 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 4 |
| వసుచరిత్రవిమర్శనము | ... | 1 | 4 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము | ... | 5 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది | ... | 1 | 4 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణము | ... | 3 | 8 |
| వివేకసింధు, కొండనార్యప్రణీతము | ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 8 |
| వైశ్యపురాణము, శ్రీగురు భాస్కరాచార్యకృతము | ... | 1 | 4 |
| వీరభద్రవిజయము, పోతనకృతము | ... | 1 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 1 | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 1 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది | ... | 1 | 8 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి | ... | 1 | 0 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | ... | 1 | 8 |
| సమీరకుమారవిజయము, నూతనముద్రితము | ... | 1 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవి విరచితము | ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, తాత్పర్యము | ... | 4 | 8 |
| ,, అట్టబైండు | ... | 2 | 8 |
| సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయకవి (క్రొత్తకూర్పు) | ... | 1 | 0 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రగడ | ... | 4 | 8 |
| హరవిలాసము, శ్రీనాథకవి | ... | 1 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి | ... | 1 | 0 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణకవి | ... | 3 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

శ్రీ ర స్తు

శ్రీకృష్ణాయపరబ్రహ్మణే నమః.

# ఆంధ్ర శ్రీవిష్ణుపురాణము

శ్రీ వెన్నలకంటి సూరనార్యప్రణీతము.





చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1939



Vavilla Press, Madras.




విష్ణుపురాణమును దెనిఁగించినది వెన్నెలకంటి సూరయకవి. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. తాత సూరనామాత్యుఁడు, తండ్రి అమరనామాత్యుఁడు. హారితస గోత్రుఁడు. విష్ణుపురాణముదక్క నితరగ్రంథము లేవి రచించెనో తెలియదు. గద్యములో నీకవి విష్ణుపురాణము బ్రహ్మాండపురాణములోని దని తలంచి కాఁబోలు "ఆదిపురాణం బగుబ్రహ్మాండంబునందలి పరాశరసంహిత యైనవిష్ణుపురాణమునందు" అని వ్రాసినాఁడు. ఇది యెట్లు పొసఁగునో తోఁపదు. అష్టాదశపురాణములలో విష్ణుపురాణ మొక్కటి. చూడుఁడు—

*శ్లో. "బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం లైంగం చ గారుడం
నారదీయం భాగవతమాగ్నేయం స్కాందసంజ్ఞికమ్
భవిష్యం బ్రహ్మవైవర్తమ్ మార్కండేయం చ వామనమ్
వారాహామత్స్యకౌర్మాణి బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్."

పురాణములయందు బ్రహ్మాండాంతర్గతమని విష్ణుపురాణము నేరేని చెప్పిరేమో? విచారణీయము.

విష్ణుపురాణము మూలమును నెనుబదివేలగ్రంథముగా (పరాశరమహర్షి చెప్పినటుల) వ్యాసులవారు రచించిరి. ఇది రెండుభాగములు. దాదాపుగా మొదటిభాగమును వెన్నెలకంటి సూరనకవి తెనిఁగించినాఁడు. రెండవభాగమునందు వివిధధర్మములు, వ్రతనియమాదులు, ధర్మశాస్త్రరహస్యములు, అర్థశాస్త్రము,

---

*బ్రహ్మాండము, విష్ణుపురాణములకు సంబంధములేదని యీకవియే చెప్పినాఁడు. చూడుఁడు.—

మ. "భువిబ్రహ్మాండము వామనంబు గరుడంబుఁ స్కాందముఁ గూర్మభా
గవతాగ్నేయకమాత్స్యలైంగములు మార్కండేయముఁ బాద్మవై
ష్ణవశైవంబులు నారదీయము భవిష్యద్బ్రహ్మవైవర్తది
వ్యవరాహంబులు నాఁబురాణములు మువ్వాఱయ్యె విప్రోత్తమా." (విష్ణుపు. ఆ 4-ప 99.)

వేదాంతము, జ్యోతిషము నిరూపింపఁబడెను. రెండవభాగమును సూరన తెనిఁగింప లేదు. పూర్వభాగము విష్ణుప్రభావాదికములు, శ్రీకృష్ణజీవితము తెలుపుచిత్రకథలు కలది గావుననే యిక్కవి వలయుచోటులఁ బెంచియుఁ గుదించియు నాంధ్రీకరణ మునఁ గ్రొత్తత్రోవలు దీసి యొక్క చక్కనికావ్యగ్రంథముగాఁ దెనిఁగించినాఁడు. సంస్కృతముననున్న విష్ణుపురాణమునకుఁ జరిత్రదృష్టితోఁ జూచినను గొప్పవిలువ గలదు. పురాణములన్నియు వ్యాసకల్పితములుగావను పాశ్చాత్యనాగరకులు సైతము భారతముతోఁబాటు దాదాపుగా విష్ణుపురాణముగూడఁ బూర్వతరమని విశ్వసించుచున్నారు. పురాణలక్షణములని చెప్పఁబడు,

శ్లో. "సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశమన్వంతరాణి చ
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్."

అను నైదులక్షణములు విష్ణుపురాణమున సక్రమముగా సరిపడియున్నవి. అన్ని విధముల గణనీయమని వేరొండి సాత్త్వికపురాణరాజములలో నొకటి యని ప్రసిద్ధిగాంచిన యీవిష్ణుపురాణమును సరసముగాఁ దెనిఁగించి యాంధ్రలోకమునకుఁ బ్రసాదించిన వెన్నెలకంటి సూరనార్యుఁడు ఆంధ్రలోకమునకుఁ బ్రశంసాపాత్రుఁడు. విష్ణుపురాణప్రశస్తి నీక్రిందివిధముగా సూరనార్యుఁడు పేర్కొనినాఁడు.

సీ. "వేదంబులకు నెల్ల వేదంబు ధర్మశాస్త్రంబులలోపల ధర్మశాస్త్ర
మాగమార్థములలో నాగమార్థం బగు జ్యోతిషంబులలోన జ్యోతిషంబు
బహుపురాణములలోపల పురాణం బితిహాసంబులం దితిహాస మఖిల
నీతిశాస్త్రములలో నీతిశాస్త్రము మహాయోగవిద్యలలోన యోగవిద్య
తే. కావ్యములలోనఁ గావ్యంబు భవ్యతరము, సకలలోకైకవేద్యంబు సకలసుకవి
చిత్తరంజనకారణం బుత్తమంబు,క్షోణి నొప్పారు విష్ణుపురాణ మనఘ."

భాగవతమునందుఁ బేర్కొనఁబడిన విష్ణుభక్తులకథలలోఁ జాలభాగ మిందుఁ గలవు. శ్రీకృష్ణావతారఘట్టము హరివంశమునందును భాగవతమునందును విష్ణుపురాణము నందును గలదు. గాని కథాభాగములలోఁ గొంచెము వ్యత్యాసము గలదు. చారిత్రకదృష్టితో నరయువారు విష్ణుపురాణమునుండి శ్రీకృష్ణునిజీవితరహస్యములు గ్రహించుచున్నారు. సకలపురాణసారభూతము పవిత్రతరమునగు నీవిష్ణుపురాణము నందలి యుత్తరభాగము కవితాకళ కంతగా సంబంధించినది కాదని కాఁబోలును సూరనార్యుఁడు తెలిఁగింపక విడిచినది!

విష్ణుపురాణము నంకితముగాఁ గొన్న ధన్యుఁడు రావూరి రాఘవరెడ్డి. ఈయన పంటరెడ్డికులజుఁడు. యానపాలగోత్రుఁడు. రాజధాని గుడ్లూరు. సూరనార్యుఁడు గుడ్లూరు నీవిధముగా నభివర్ణించియున్నాఁడు—

సీ. "గౌరీసమేతుఁడై గరిమతో నేవీట నేపారు నీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నేవీట గిరిభేదినుతుఁడైన కేశవుండు
యోగినీసహితయై యొప్పారు నేవీఁట బసిఁడిపోలేరమ్మ భవునికొమ్మ
పాపవినాశయై ప్రవహించు నేవీట మన్నేఱు మిన్నేటిమాఱటగుచు
ఆ. కుంజరములు వేయి కొలువంగ నేవీట, గొడగుచక్రవర్తి పుడమి యేలె
నట్టిరాజధానియై యొప్పు గుడ్లూరి, నొనర నేలుచుండి యొక్కనాఁడు." (ఆ. 1 ప. 16)

ఇందుఁ జేర్కొనఁబడిన గుడ్లూరును, భారతాంధ్రికర్తలలో నొకఁడగు శంభుదాసు నివాసస్థలమగు గుడ్లూరును నొకటియె. శంభుదాసుఁడు తనగుడ్లూరునుగూడ నీలకంఠస్థానమని యభివర్ణించినాఁడు.

సీ. ... ... ... ... ... ... ...
నందనుం డిలఁ బాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసఁగి మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పుధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ"
డెఱ్ఱనార్యుఁడు—(భారతారణ్యపర్వము.)

భారత, హరివంశ, నృసింహపురాణాదిమహాగ్రంథరచనమున కాలవాలమైన గుడ్లూరు విష్ణుపురాణరచనమునకుఁగూడ మాతృభూమి యగుట స్థలవిశేషము కానోపు. కృతిభర్తయగు రాఘవరెడ్డి సప్తమచక్రవర్తి యనియు, ధర్మమూర్తి యనియు, భాషాపోషకుఁ డనియుఁ బ్రఖ్యాతిగాంచిన అనవేమారెడ్డివంశమున జనించినవాఁడు. కవియో అనవేమారెడ్డికిని ఆయనసహోదరుఁడగు అనపోతారెడ్డికిని గ్రంథసముదాయ మంకితముగా నొసంగిన వెన్నెలకంటి సూర్యకవివంశములోనివాఁడు. కృతికర్తకును గృతిభర్తకును గల్గిన యీవిష్ణుపురాణవిషయికసంబంధ మాకారణముచే నెంతయుఁ బొసఁగియున్నది. మహాకవియగు సూరనార్యునిచే విష్ణుపురాణము వ్రాయించి యంకితముగొని వాఙ్మయప్రపంచమున యశఃకాయుఁడై పేరొందిన రాఘవరెడ్డిసుకృతము ప్రశంసాపాత్రము. కృతిభర్త వంశావతారము విష్ణుపురాణమునుబట్టి నిర్ణయించినవిధ మిది.—




వీరిలో బసవన్న ప్రముఖుఁడు. కృతిరచనాకాలమునకు వలయుఁ జరిత్రాంశము లీతని ప్రశంసాపద్యములనుండియే గ్రహింపవలసియున్నది. బసవన్న భార్య అమ్మలాంబ పాకనాటిలోని అల్లూరి అనమారారెడ్డి మనుమరాలు. పెమ్మమహీపతి కుమార్తె. బసవన్నను గూర్చి సూరనార్యుఁ డిటులఁ బ్రశంసించినాఁడు.—

క. "వారలలోపల బసవ, క్ష్మారమణుఁడు పేరుపెంపు గలమన్నీఁడై
భూరిప్రతాపజయల, క్ష్మీరతుఁడై వెలసె నుదయగిరిరాజ్యమునన్." (ఆ. 1 ప. 37)

సీ. "కటకాధిపతి యైనగజపతిరాజుచేఁ బ్రతిలేనిపల్లకి పదవులందె
మహిమచేఁ గర్ణాటమండలాధిపుచేతఁ గడలేని రాజ్యభాగములు గాంచె
ప్రౌఢపౌరుషమున రాజిల్లి మెఱయఁగా మలకవజీర్ల కుమ్మలికఁ జేసె
తెలగాణభూములఁగల మన్నెవారిచే బలవంతమునను గప్పములు గొనియె
తే. చాటుధాటీ నిరాఘాటఘోటకావ, లీఖురోద్ధూతనిబిడధూళీవిలిప్త
మండితాశాంగనాకుచమండలుండు, బాహుబలశాలి తమ్మయబసవవిభుఁడు." 41

కృతిభర్త తండ్రియగు బసవనృపాలుఁడు గజపతులకాలమునందుండి యాందోళికాదిగౌరవములు బడసెను. కర్ణాటనృపులచే రాజ్యములను బడసెను. గజపతుల యనంతరము ఉదయగిరిదుర్గాధిపత్యముగూడ వహించెను కాన బసవభూపాలుని కాలము తెలిసికొన యత్నించుదము. కృష్ణదేవరాయలకాలమున కొండవీడు,

కొండపల్లి, ఉదయగిరిగజపతుల స్వాధీనములో నుండెను. కృష్ణదేవరాయలే యీ మూఁడుదుర్గములను జయించెను; గజపతులమన్ననలను బొందుటయుఁ గర్ణాట రాజులమన్ననలచే నుదయగిరిరాజ్యము బడయుటయు కృష్ణదేవరాయలకు బసవ నృపతి సమకాలికుఁడు గాకున్నఁ బొసఁగదు తరువాత అచ్యుతదేవరాయలకాలము ననో రామరాజుకాలముననో కృతిభర్తయగు రాఘవరెడ్డి సూరనకవియు నుండి యుందురు. ఇందులకుఁ దగు నుపపత్తులను విచారింపవలసియున్నది.

వెన్నెలకంటి వెంకటాచలకవి శ్రీకృష్ణవిజయమను ప్రబంధము రచించుచు నందుఁ దనవంశజుఁడును బూర్వుఁడు నగు ప్రకృతసూరకవి నీవిధముగ స్తుతించెను.

సీ. "సూరపకాంతిచే సూర్యప్రకాశుండు వేదాదివిద్యల వెలసినాఁడు
విష్ణుపురాణంబు వేడుకఁ దెనిఁగించి విమలయశంబున వెలసినాఁడు
రావూరిబసవన్న రమణతో నిచ్చిన యల మొగుళ్లూరగ్రహారమంది
వెలుగోటి తిమ్మ భూవిభునిచేఁ గొనియె దా నాందోళికాచ్ఛత్రమగుపదవిని
తే. కవితపుట్టిల్లు వెన్నెలకంటియిల్లు, నసెడు పౌరుషనామధేయంబు నిలిపె
సరసగుణములు గలిగిన సాధుసుకవి, మాననీయుండు సూరనామాత్యవరుఁడు."

ఈసూరనార్యునకు వెంకటాచలకవి ఆఱవపురుషుఁడు. సూరనార్యునికుమారుఁడు లక్ష్మన్న అతనికొడుకు చక్రప్ప వానికొడుకు గంగయ్య వానికొడుకు సూరపరాజు. అతనికొడుకు జగ్గన్న. జగ్గన్నకుమారుఁడు వెంకటాచలకవి. వెంకటాచలకవి తన పితామహునకుఁ బితామహుఁ డని విష్ణుపురాణకర్తను జెప్పి యతనినుండి వరుసగా వంశవృక్షము నొసంగినాఁడు. తనపితామహునివలన వెంకటాచలకవి ఆతనిపితామహుఁడగు నీసూరనకవి పుట్టుపూర్వోత్తరములు వినియుండును. సూరనార్యునియెడఁ జెప్పినవిశేషములు విశ్వాసపాత్రము లనుటలో సంశయింపఁ బనియుండదు. ఈపద్యసహాయమునఁ గవికాల మిఁక స్పష్టపడును. సూరనార్యునకు అందలము గొడుగు ఇచ్చి మన్నించిన వెలుగోటి తిమ్మనృపాలుఁ డెవఁడో శోధింప వలసియున్నది. గురుజాడ రామమూర్తిగారు. రేచెర్ల అనపోతనాయకుని కుమారుఁ డగు తిమ్మనాయనినే వెలుగోటి తిమ్మభూపతి యని చెప్పి సూయలు చెప్పినటుల నితనికాలము క్రీ. శ. ౧౩౬౦ కాదనియు ౧౩౦౦ అనియు జెప్పిరి. ఈనిర్ణయము సర్వవిధములఁ బ్రమాదభూయిష్ఠమైనది.

రేచెర్లగోత్రీయులగు వెలమవీరులు ప్రతాపరుద్రదేవునికాలమువఱకుఁ గాకతీయులకడ సేనానాయకులుగ నుండిరి. ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. ౧౩౨౩ లో

బంధీకృతుఁ డైనది మొదలు వీరు స్వతంత్రులైరి. స్వతంత్ర రాజ్యస్థాపకులలో అనపోతనాయకుఁడు మొదటివాఁడు. ఈతఁడు మహాసంగరములలో గెల్చి దక్షిణాపథమునందలి యాంధ్రదేశమునంతఁయుఁ బాలించెను. క్రమముగా నీతనివంశజులు మ్లేచ్ఛరాజుల యొత్తిడి కాగఁజాలక పూర్వార్జితరాజ్యములు గోలుపోయి చివరకు దేవరకొండదుర్గమును రక్షించుకొనిరి. అక్కడగూడ నిలువ వీలుచిక్కకపోవుటచేఁ దుంగభద్ర దాటి కృష్ణదేవరాయకాలములో కర్నూలుమండలములోని వెలుగోటిలో రాజ్యము స్థాపించి రాయల కంకితులైరి. ఇట్లొనరించినది నిర్వాణరాయఁడప్ప. ఈయంశము లోకల్‌రికార్డులందును కర్నూలుజిల్లా మాన్యుయల్‌లోను వెలుగోటివంశచరిత్రమునందును జెప్పఁబడినది. నిర్వాణరాయఁడప్ప వెలుగోటిలోఁ గోటకట్టినది. క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమనసుండె నని చెప్పఁబడెను. అది మొదలు రేచెర్లగోత్రీయులు వెలుగోటివారని పేరొందిరి. తరువాత యాచనామము, వేంకటగిరిసంస్థానపాలనము సిద్ధించినది. ఇందుచేఁ బైనిపేర్కొనఁబడిన వెలుగోటి తిమ్మనృపాలుఁడు క్రీ. శ. ౧౫౩౦ కు ఈవలివాఁ డగుట స్పష్టము. నిర్వాణరాయఁడప్ప కుమారుఁడు మనుమఁడు మునిమనుమఁడు గూడ తిమ్మానాయకులె. ఈముప్వురికిఁబైనఁ దిమ్మానాయకుఁడు లేఁడు. ఉండెఁబో వానికి వెలుగోటివంశనామము లేదు. ముప్వురు తిమ్మానాయకులలోఁ జివర తిమ్మానాయకుని కాలము క్రీ. శ. ౧౫౭౨ అనఁగా చంద్రగిరిలో తిరుమలదేవరాయలకుమారుఁడు రాజ్యమేలుకాలము. వెలుగోటి తిమ్మభూపాలునిశాసనములు రెండు లభించినవి. అందొకటియగు నెల్లూరు రంగనాయకులగుడి ఉత్తరపుగోడమీఁదిశాసనము.

స్వస్తిశ్రీజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౯౫ అగునేటి శ్రీముఖసం॥ వైశాఖ శు ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర ప్రతాప శ్రీరంగరాయదేవ మహారాయలు అయ్యవారి కార్యకర్తలయిన వెలుగోటి తిమ్మపనాయనింగారి ముద్రకర్త వెంకటప్పనాయండు రాయలవారికిన్ని తిమ్మప నాయనికిన్ని పుణ్యముగాను......వివరం

వేంకటగిరి సంస్థానమునకుఁ జెందిన పొదిలెదుర్గాలయములో నున్నశిలాశాసనము.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౫౧౫ అగు స్వభాను సంవత్సర శ్రావణ శు ౧౦ లు శ్రీమతు రేచెర్లగోత్రోద్భవులైన వెలిగోటి పెద తిమ్మానాయనింగారి పౌత్రులైన కొమారతిమ్మానాయనింగారి పుత్రులైన కుమార

కుమార చినతిమ్మానాయనింగారు పొదిలెస్థలం దేవబ్రాహ్మణులకు..........
ఇచ్చిన ధర్మశాసనము.

మొదటిశాసనము క్రీ. శ. 1573 లోను రెండవది క్రీ. శ. 1583 లోను నెలకొల్పఁబడినవి. నిర్వాణ రాయడప్ప వెలుగోటి యను నుపనామము సంపాదించినది. 1530 ప్రాంతమునందు వెన్నెలగంటి సూరనార్యుఁడు ఈముగ్గురు వెలుగోటి తిమ్మానాయకులలో రెండవతిమ్మానాయకుని కాలమునందున్నందున నీకవి క్రీ. శ. 1530 మొదలు 1555 లోఁగా నుండియుండెననుట సత్యము. ఈనిర్ణయమువలన బసవరెడ్డి కృష్ణరాయల కాలమునను దసువాతి కాలమున నాతనితనయుఁడగు రాఘవరెడ్డియు నుండిరనుట సరిపడును. ఇదియె నిర్వివాదమగు నిర్ణయము. *

గురుజాడ శ్రీరామమూర్తిగారు విష్ణుపురాణరచనాకాలము క్రీ. శ. ౧౩౦౦ అనిరి. వీరేశలింగము పంతులువారు క్రీ. శ. ౧౩౫౦—౧౩౬౦ అనిరి. లాక్షణిక కవులలో నెల్ల ప్రసిద్ధులగు నప్పకవ్యాదులు విష్ణుపురాణమునుండి యుదాహరణములు గైకొనలేదు. అల్లయవీరభద్రుని (కాలము ౧౪౨౬—౧౪౪౦) గూడఁ గూటస్థునిగఁ గృతిపతిఁజెప్పుకొనినాఁడు. ప్రకృతకవికి అనవేముని మెప్పించిన వెన్నెలకంటి సూర్యండును కృతిభర్తకు అనవేమారెడ్డి కూటస్థులు. ఆవలి తరములు తెలియవు. వీని నన్నింటిని సమన్వయించి చూడ విష్ణుపురాణరచనాకాలము పదునాఱవశతాబ్దాంతమనుట పొసఁగియున్నది. వంశీయుఁడొసంగిన యాధారము కృతిభర్తతండ్రినిగూర్చిన యాధారములుగూడ సాక్ష్యములైనవి. కృతిభర్తగురువగు తిరుమలతాతాచార్యునిబట్టి కాలనిర్ణయముసేయుట నిరాధారశ్రమ పదునెనిమిదవ శతాబ్దములోని ముద్దుపళని గురువుగూడ నొకతిరుమలతాతాచార్యులె. ఇంక మధ్యకాలమున నెందఱో కలరు. ఇట్టినిర్ణయముల విమర్శించుట వృథాకాలహరణము.

వెన్నెలకంటివారి కుటుంబము పూర్వవాసస్థలము నెల్లూరుమండలము. "కవులపుట్టిల్లు వెన్నెలకంటియిల్లు" అనువిశేషణమున కనుకూలముగా నీకుటుం

---

* విష్ణుపురాణ కృతిభర్తయగు బసవయరాఘవుఁడు క్రీ. శ. 1526-29 ప్రాంతమున నుండెననియు నితనిశాసనము బట్టరువర్తుగారి శిలాశాసనముల వాల్యూము ౨ లో నెల్లూరుజిల్లా కనిగిరిశాసనములలోఁ జూడుమని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రబంధరత్నావళి పీఠికలోఁ జెప్పిరి. ఆశాసనము చూచి విమర్శింపవలసిన యవసరమున్నది. ఈ యంశము పీఠికయంతయు ముగిసినపిదపఁ జూచుటచేఁ జర్చింపఁజాలక పోతిమి. ఈ నిర్ణయము మేము నిరూపించినకాలమునకు సరిపడియున్నది.

బమునందుఁ బలువురుకవు లుండియుందురు. మనకు అనపోతరెడ్డి కాలమునాటి వెన్నలకంటి సూర్యుఁడు, ప్రకృతగ్రంథకర్తయగు సూరనార్యుఁడు, కృష్ణవిజయ కర్తయగు వేంకటాచలకవి మాత్రమె పరిచితులు. ఇంక నీకుటుంబమున నెందఱు కవులుండిరో యేగ్రంథములు రచించిరో యెఱుంగరాదు. జక్కనచే విక్రమార్క చరిత్రము అంకితముగాఁగొన్న సిద్ధమంత్రి వెన్నెలకంటి వంశజుఁడె. ఈయనకవియుఁ గవిపోషకుఁడునునై యున్నాఁడు. ఇంక నీకుటుంబములో నెందఱుకవు లుండి యుండిరో? వెన్నెలకంటివారి యిండ్లలో నెంతయో తాళపత్రపుస్తకభాండాగారముగలదు. అది యేనాఁటికి శోధింపఁబడునో యెప్పటికి నూతనవిశేషములను గ్రహింపఁ గల్గుదుమో!

కృతిభర్తయగు రాఘవరెడ్డి అనవేమారెడ్డి వంశజుఁడని కవి స్పష్టముగాఁ జెప్పినాఁడుగాని వంశసంబంధము చెప్పలేదు. దౌహిత్రసంతతిలోనివాఁడో పౌత్రసంతతివాఁడో రాఘవరెడ్డిని గురుతింప వీలుఁగాకయున్నది. రాఘవరెడ్డికి నాతనిపూర్వులకుఁ జెప్పఁబడిన పల్లవాదిత్య, రాయవేశ్యాభుజంగ, చంచుమల చూరకార, హేమాద్రిదానచింతామణి మున్నగుబిరుదములు అనవేమాదులవే! రాఘవరెడ్డియు నతనిపూర్వులును రెడ్డిసామ్రాజ్యము అస్తమించినపిదప సామాన్య గృహస్థులుగానుండి రాజసేవతోఁ గాలముగడిపిన భాషాభిమానులు. కృతిభర్తతండ్రి మఱలఁ గొంచెముగనొ గొప్పగనో పూర్వగౌరవము నిలువఁ బెట్టినాఁడు. ఇతఁడు సూరకవికి మొగల్లూరను అగ్రహారమిచ్చినటులఁ జెప్పఁబడినది.

సూరనార్యుని కాలనిర్ణయమునుగూర్చి చర్చ యింతతో ముగించి యతని కవితా నైపుణ్యమునుగూర్చి యించుక ప్రసంగించుదము. ప్రబంధరచనమునకుఁ బెద్దనార్యుఁడు త్రోవదీసినదాది ఆంధ్రవాఙ్మయమున కొకనూతన పరివర్తన మేర్పడెను. తలుచుగాఁ గవు లుపజ్ఞను గోలుపోయి వసుచరిత్రమునో మనుచరిత్రమునో దృక్పథమునందుంచుకొని ప్రాఁత త్రోవలఁబోవ మొదలిడిరి. సూరనార్యుఁడీయుగసంధిలో నున్నవాఁడు. ఆదికవుల నిరుపమానధారాశుద్ధియుఁ బ్రబంధకవుల చిత్రకవితావిలాసము సూరనకవియెడఁ జూపట్టుట యొకవిశేషము. ఈతఁడు సంస్కృతసమాస జటిలముగను మిశ్రరీతిగను దేటతెనుంగుగను గవితరచించుటలో మిగుల గడుసరి. మొత్తముమీఁద నీతనికవిత ద్రాక్షాపాకములో నలరి యాపాత రమణీయముగా నున్నది. తిక్కన, శ్రీనాథుఁడు, ప్రబంధపరమేశ్వరుఁడు కథాభాగములలోఁ, జూపునుద్వేగము వర్ణనాంశములలోఁ జూపు భావసౌష్టవము ప్రకృతి

వర్ణనములలోఁ జూపునిసర్గరమణీయభావసమృద్ధి సూరనార్యుని విష్ణుపురాణములోఁ దక్క నితరాధునికగ్రంథములలోఁ గానరాదు. నిరర్గళమగునీతనిశైలి కొన్ని కొన్నియెడల శ్రీనాథునిశైలి ననుకరించినతావులు గలవు. కొలఁదిగ కృత్యాది యందుఁ బ్రబంధకవుల వర్ణనపద్ధతి ననుకరించినాఁడు. అంతియగాని యితరస్థలము లలో సూరనార్యుఁడు తనకవిత స్వతంత్రరీతి నలరించినాఁడు. కథాంశములలో వచ్చు నాయారసముల నౌచితి నెఱింగి సమయానుకూలముగ వర్ణించుటయందును గథాంశమును బెంచి గ్రంథప్రశస్తి నినుమడించుటయందును నీకవివరున కుత్సాహము మెండు. ఇంతియగాదు. మధ్యకాలపుఁ గవులవలె శృంగారము నతిమాత్రముగ వర్ణించి కథోద్వేగము చల్లార్చుట యీకవియెడఁ గానరాదు. విష్ణుపురాణము వంటి మహాపురాణము వ్రాయుట కీకవి యన్నివిధములఁ దగినవాఁడు. ద్వితీయాశ్వాసములోని మారిషవృత్తాంతము పంచమాశ్వాసములోని తారాశశాంకచరిత్రము జూచిన నీకవికిఁ గల శృంగారరసకల్పనమున నౌచితిఁగూడఁ గొంతవఱకుఁ బాటించువాఁడని తెలిసికొనవచ్చును.

నరకాసురవధము, ప్రహ్లాదచరిత్రము, ధ్రువోపాఖ్యానము, శ్రీకృష్ణావతారఘట్టము, రుక్మిణీకల్యాణము లోనగుకథాభాగము లీవిష్ణుపురాణమున సంగ్రహరూపముగ నున్నవి. పోతనరచనమునకుఁ దీసిపోవుచున్నది. ఈభేదము పోతన చిత్రకవితాప్రియుఁడు, సూరన నిరర్గళధారావశంవదుఁడు నగుటచే నేర్పడినది. కావున నాయాభాగములు గైకొని తారతమ్యచర్చగావించుట యుచితముగాదని మాతలంపు.

విష్ణుపురాణమునందలి కథలకును భాగవతమునందలి కథలకును గొంత మార్పు కానవచ్చుచున్నది. కారణము తెలియదు. భాగవతమున ఉత్తానపాదునకు సునీతి పెద్దభార్యగను సురుచి చిన్నభార్యగను జెప్పఁబడియుండ విష్ణుపురాణములోఁ దలక్రిందుగా నున్నది. విష్ణుపురాణములో ధ్రువుఁడు తనంత తపమునకుఁ బోయి నటులుండ భాగవతములో తల్లిమాటలమీఁద నేగినటులను, విష్ణుపురాణములో సప్తర్షులు ధ్రువునకు ద్వాదశాక్షరి నుపదేశించినటులుండ భాగవతములో నారద మహాముని వాసుదేవమహామంత్ర ముపదేశించినట్లును గలదు. విష్ణుపురాణములో దేవతలు మాయావినిబంపి ధ్రువునితపము కలచినటులుండ భాగవతములో నావిషయమే లేదు. ఈకథలో నింకనెన్నియో మార్పులు గలవు. ఇటులే దక్కిన కథలలోఁగూడ మార్పు లారయనగును. పురాణములను జరిత్రదృష్టితో సమన్వ

యుంచువారి కీభేదములు ముఖ్యముగాఁ బరిగణనీయములు. కథాభాగములందలి యాయా భేదములకతన సంస్కృతవిష్ణుపురాణము ప్రాచీనతరమని సుబోధమగును.

సుధీలోకమున కీకవి విన్నవించుకొనిన ప్రార్థనారూపముగానున్న యీ క్రింది

ఉ. "ఏను పరాశరుండు రచియించినవిష్ణుపురాణ మాంధ్రభా
షానిపుణోక్తులం బలుకఁజాలెదనంచుఁ దలంచినాఁడ శే
షానిలభుగ్విభుం డురుసహస్రశిరంబులఁ దాల్చు లోకముల్
హీనపుఁ బూరిపాము ధరియించెద నంచుఁ దలంచు చాడ్పునన్."

అనుపద్యమును, దానిక్రింద నాల్గుపద్యములును కుకవినింద యొనరింపమియుఁ జూడ సూరనార్యుఁడు సత్త్వగుణప్రధానుఁడనియు విద్యావివాదములలోఁ బాల్గొని జీవితము గడపినవాఁడు కాఁడనియుఁ దోఁచును. విష్ణుపురాణము మొత్తముమీఁద నిర్దుష్టముగా నున్నది. వ్యాకరణదోషములుగఁ బూర్వులచే గణింపఁదగినవి కొన్నితావులలో లేకపోలేదు.

క్త్వార్థక ఇకారసంధులు.

మ. హిమవత్పర్వత కూటసానువులనుం డేతెంచు (ఆ. 2 ప. 322)

క. ఇయ్యాహారంబులచే, నయ్యా బడలికలు దీరె నాసంతోషం బయ్యున్నదె (ఆ. 3 ప. 352)

ఇ కా ర సం ధు లు.

మ. బెడఁకుంజూపులు క్లిన్నదంతచయముర్ వెట్టాటలుర్ (ఆ. 3 ప. 274)

సీ. శైశవక్రీడాప్రసంగముల్ కొన్నేండ్లు కొన్నేండ్లు ముద్దుపల్కులబెడంగు (ఆ. 5 ప.187)

ఇటులె యింకఁ గొన్ని స్వల్పలోపములు గలవు. సర్వసుగుణభరితమగు నీయుద్గ్రంథమునఁ గలస్వల్పలోపములు బరిగణనీయములు కావు. మొత్తముమీఁద నీకవిని రాచికుఁడనియు నుచితజ్ఞుఁడనియు లాక్షణికుఁడనియుఁ జెప్పక తప్పదు. విష్ణుపురాణమున సూరనార్యుఁడు సందర్భానుసారముగా నవరసములకుఁ దావొసంగినాఁడు ఏరసమునందేని యితరకవుల ననుకరించినటులఁ గానరాదు. దుర్వాసునిశాపము పరశురామకథలో బీభత్సరౌద్రభయానకరసముల యుచ్ఛస్థితియుఁ బురూరవుఁడు భరతుఁడు లేడికొఱకును ఊర్వశికొఱకును బరితపించుఘట్టమునఁ గరుణరసము. ఇటులె యాయాస్థలములలో నితరరసములు యథాయోగ్యముగఁ బోషించి

నాఁడు. భూదేవి పృథుచక్రవర్తికి వెఱచి పాఱుటయు సముద్రమథనమును జడభరతచరిత్రమును మనోహరముగా నున్నవి. రామకథయుఁ గృష్ణాదులు బ్రాహ్మణకుమారుల బ్రదికించినకథయు నరకాసురవధయు మిగుల సంక్షేపింపఁబడుటచే నాభాగములలో రసము కొంతతగ్గినది. అవకాశమును బురస్కరించుకొని సూరనార్యుఁడు కవితానైపుణ్యము ప్రదర్శించినతావులు గొన్ని కలవు.

అంత్యనియమము.

"మ. కనియెన్ భాగవతోత్తముండు త్రిజగత్కల్యాణవర్ధిష్ణునిన్
వనజాతాసనవాసవప్రభృతిదేవప్రాభవాధిష్ణునిన్
ఘనగర్వాంధనిశాచరేంద్రవరభాగ్యప్రక్రియాజిష్ణునిన్
కనదంభోధరకృష్ణునిన్ సుజనరక్షాతృష్ణునిన్ గృష్ణునిన్." (ఆ. 7 ప. 335)

ఉత్ప్రేక్షాలంకారము.

చ. పడమటివంకఁ గ్రుంక నురుభాస్కరబింబము తూర్పుకొండపైఁ
బొడిచిన చంద్రమండలముఁ బోల్పెసలారెఁ బయోజసంభవుం
డెడపక రాశి మాసగతు లెక్కువ తక్కువ లైనకాలముల్
తడఁబడు నంచుఁ దూఁచునెడఁ ద్రాసునఁ దేలెడుచిప్పలో యనన్." (ఆ. 7 ప. 333)

అచ్చతెనుఁగుఁ గూర్పులు.

"క. పచ్చనికసవులు పసులను, విచ్చలవిడి మేయఁదోలి వేడుకతోఁగ
న్నిచ్చకువచ్చిన యచ్చట, మెచ్చులతాళములలోన మెలఁగుచు నున్నన్." (ఆ. 7 ప. 192)

విష్ణుపురాణమును ఈసూరనార్యుఁడేగాక పశుపతిపుత్త్రుఁ డగునాగనాథుఁ డనుకవియు క్రీ. శ. ౧౩౮౦ ప్రాంతమునఁ దెనిఁగించినాఁడు. ఇతఁడు ప్రౌఢకవి యని యాతనిశాసనశ్లోకములును విష్ణుపురాణములోనిదని ప్రబంధరత్నావళిలో నుదాహరింపఁబడిన యీక్రిందిపద్యమువలనను దెలియవచ్చును.

"ఉ. మాసరమయ్యె నంతె మధుమాసము పాంథవిలాసినీజన
త్రాసము పుష్పబాణనవరాజ్యవిలాసము వల్లరీవధూ
హాసము మత్తకోకిల సమంచితపంచమనాదమంజిమ
వ్యాసము జీవలోకహృదయంగమసౌఖ్యవికాస మెంతయున్.

ఇంతవఱ కీగ్రంథరాజము లభింపకపోవుట సంతాపకరము. ఆధునికుఁ డగు సీతారామసిద్ధాంతికవికూడ విష్ణుపురాణమును బద్యకావ్యముగఁ దెనిఁగించెనట గాని

దానిని మేము చూడలేదు. తుపాకుల అనంతభూపతి విష్ణుపురాణమును వచన కావ్యముగా వ్రాసెను. అది ముద్రితమైనదటగాని మే మా ప్రతిని జూడకుండుటచే నం దెంతవఱ కీపద్య కావ్యమునకు సంబంధముగలదో నిశ్చయింపలేకపోతిమి.

సూరనార్యుఁడు కవితారచనమున శ్రీనాథాదిపురాణకవులకు జోడైన వాఁడు. కొన్ని యెడల ధారాశుద్ధి పద్యగమనము సమాసకల్పనము మున్నగువాని కీకవిరాజు శ్రీనాథునియెడ లక్ష్యభావ ముంచె ననుటకుఁ దార్కాణలు విష్ణుపురాణమున లేకపోలేదు. చర్చింప మొదలిడినవిషయము విస్తరమగునని విడిచితిమి.

విష్ణుపురాణము చిరకాలముక్రిందట బాజారుప్రతిగ ననేకదోషములతో ముద్రితమై ప్రతులు చెల్లిపోయెను. తదాదిగ నీమహాగ్రంథము ఆంధ్రభాషా ప్రియులకు లభించుటయే కష్టమయ్యెను. సులలితముగ నాగ్రంథమును వ్రాతప్రతులతోఁ బోల్చి శుద్ధప్రతివ్రాయించి లఘుటిప్పణముగూడ సమకూర్చి యాంధ్రలోకమునకు సమర్పించిన ఆంధ్రభాషాభిమానులగు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారి ప్రయత్నము ప్రశంసాపాత్రము. ఈ యుద్గ్రంథము మూలముతోఁ బోల్చి చూపుదమన్న ఎంతప్రయత్నించినను మూలము లభింపకపోయెను. త్వరగఁ బీఠికవలయు నని ప్రకాశకులు సెలవిచ్చుటచే విశ్రాంతిభాగ్యమునకు నోఁచుకొనకున్నను బరిశ్రమజేసి యెటులో వ్రాసితిమి. సాహసమునకు క్షంతవ్యులము.

నందిగామ.
20-8-1928.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

# విషయసూచిక.

విషయము. | పుట.

తృతీయాశ్వాసము



చతుర్థాశ్వాసము.



పంచమాశ్వాసము.



షష్ఠాశ్వాసము.

| విషయము. | | పుట. |
|---|---|---|
| నహుషక్షత్రవృద్ధరజిప్రముఖులజననము | ... | 248 |
| రజియనువాని కింద్రపదము వచ్చుట | ... | 249 |
| యయాతిచరిత్రము | ... | 251 |
| యదువంశమహిమానువర్ణనము | ... | 252 |
| తనపుత్రుండగువిదర్భునకు వయోధికస్త్రీని పెండ్లిసేసిన జ్యామఘునివంశానుక్రమము | | 255 |
| సత్రాజిత్తునకు సూర్యునివలన శ్యమంతకమణి లభించుట | ... | 258 |
| శ్యమంతకమణిమూలంబున శ్రీకృష్ణునకు జాంబవతీసత్యభామలు భార్యలగుట | ... | 261 |
| సత్రాజిత్తునిజంపి శ్యమంతకము నపహరించిన శతధన్వుని శ్రీకృష్ణుండు సంహరించి అక్రూరుని యొద్దనున్న ఆశ్యమంతకమణిని గ్రహించుట | ... | 263 |
| శ్రీకృష్ణుండక్రూరునకు శ్యమంతకమణి నొసంగుట | ... | 270 |
| అనమిత్రప్రభృతులవంశానుక్రమము | ... | 271 |
| పౌరవవంశానుక్రమము | ... | 276 |
| కలియుగదోషాదివివరణము | ... | 277 |

## సప్తమాశ్వాసము.

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణావతారకథా ప్రస్తావము | ... | 281 |
| భూదేవి ప్రజాభారపీడితయై తనమనఃక్లేశమును బ్రహ్మకుఁ దెలుపుట | ... | 282 |
| శ్రీకృష్ణావతారఘట్టము | ... | 286 |
| వసుదేవుఁడు శ్రీకృష్ణునిఁజూడ గోకులంబునకు వచ్చుట | ... | 292 |
| పూతనావధశకటాసురవిధ్వంసనాదివివరణము | ... | 293 |
| రామకృష్ణుల జాతకర్మ నామకరణాదిప్రశంసనము | ... | 295 |
| గోపికలు శ్రీకృష్ణునిదుండగములు యశోదతోఁ జెప్పుట | ... | 296 |
| శ్రీకృష్ణుండు ఉలూఖలబద్ధుండై యమళార్జునభంజనంబు చేయుట | ... | 297 |
| నందాదిగోపకులు రామకృష్ణసమేతులై బృందావనంబునకుఁబోవుట | ... | 298 |
| కాళియమర్దనము | ... | 302 |
| ధేనుకాసురసంహారము | ... | 305 |
| బలభద్రుండు ప్రలంబాసురుని సంహరించుట | ... | 306 |
| శరత్కాలవర్ణనము | ... | 308 |
| శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట | ... | 309 |
| శ్రీకృష్ణునిసన్నిధికి నింద్రుండు వచ్చుట | ... | 313 |
| శ్రీకృష్ణుండు వేణుగానముసేయఁగా గోపికలు విని మోహించుట | ... | 315 |
| రాసక్రీడావిహారము | ... | 318 |
| అరిష్టాసురవధ | ... | 319 |
| కంసుండు నారదువలన రామకృష్ణులప్రభావము విని సహింపక ధనుర్యాగవ్యాజంబున వారల మధురకుఁ దోడ్కొనిరమ్మని యక్రూరు నంపుట | ... | 319 |
| కేశి యనువాని వధించుటవలన నారదుండు కృష్ణునికిఁ గేశవుఁ డని పేరిడుట | ... | 321 |
| అక్రూరుండు వ్రేపల్లెకువచ్చి భగవత్సందర్శనంబు సేయుట | ... | 322 |
| గోపికలు శ్రీకృష్ణవిరహభీతలై చింతించుట | ... | 325 |

సవరణ:—149 పు. 21 ప. లో 'మానులు' అనుటకు 'మనువులు' అనియు, 117 పు. 162 ప. లో 'శ్రీకరంబుగ విభావరి' అనుటకు "శ్రీకరంబు విభావరీ" అనియుఁ జదువుకొనవలయును.

శ్రీరస్తు.

# శ్రీవిష్ణుపురాణము.

(సటిప్పణము)

## పీఠిక.

---



కాంతాకుచహేమకుంభములపైఁ జెల్వారుకాశ్మీరమ
స్తోకంబై తనపేరురంబునఁ గరంబున్ శోభిల్లి దీప్తిచ్ఛటా
వ్యాకోచంబుగఁ గౌస్తుభంబునను గూడై యున్న మోదించుచున్
శ్రీకంఠాబ్బసవేంద్రరాఘవున కిచ్చుఁ గాత సుస్థిరైశ్వర్యముల్. 1

ఉ. సల్లలితాస్యపంచకము శాఖలు చారుజటారుణద్యుతుల్
పల్లవకాంతి చందురుఁడు పక్వఫలంబు శిరోగ్రగంగ సం
ఫుల్లసుమంబు సత్కరుణ పుష్పరసం బగుచున్న పార్వతీ
వల్లభకల్పశాఖ బసవప్రభురాఘవు ధన్యుఁ జేయుతన్. 2

చ. సరసిజనాభునాభిజలజాతము పుట్టినయిల్లు సత్కవీ
శ్వరులకుఁ బుట్టుదోడయినశారద పట్టపుదేవి వేదముల్
పరగుచు వేదశాస్త్రముల పద్ధతులై కనుపట్టు భారతీ
వరుఁడు శుభంబు లిచ్చు బసవప్రభురాఘవభూమిభర్తకున్. 3

మ. జననీస్తన్యము గ్రోలుప్రాయమున నుత్సాహంబుతోఁ దేవతా
వనితల్ పెనుకపుట్టఁ దాళగతులన్ వాయించుచుం బాడఁగాఁ
ఘనసోల్లాసముతోడ బొజ్జ గదలంగా నాడులంబోదరుం
డనుఁ గారుణ్య రాఘవప్రభుని నిత్యశ్రీయుతుం జేయుతన్. 4

---

1 హేమకుంభములు = బంగారుకుండలు, కాశ్మీరము=కుంకుమపువ్వు - కుంకుమపువ్వు చేర్చిన గంధమని యర్థము. అస్తోకము=అల్పముకానిది-మిక్కుటము అనుట, పేరురంబునన్=విశాలమైన రొమ్మునందు, దీప్తిచ్ఛటావ్యాకోచంబు = కాంతిసమూహముచేత వికాసమునొందినది, సుస్థిరము=మంచిస్థిరముగలది. 2 ఆస్యపంచకము=అయిదుముఖములు, అరుణద్యుతులు=ఎఱ్ఱనికాంతులు, శిరోగ్రగంగ=తలమీఁదనుండు గంగానది, సంపుల్లసుమంబు=చక్కఁగా వికసించినపువ్వు, కల్పశాఖి=కల్పవృక్షము. 3 జలజాతము=తామర, శారద=సరస్వతి, పద్ధతి=మార్గము-సరణి, కనుపట్టు=కానఁబడు. 4 స్తన్యము=చనుబాలు, గ్రోలు=త్రాగు, లంబోదరుఁడు=పెద్దబొజ్జగలవాఁడు-వినాయకుఁడు,

చ. అరుదుగ నాదిలక్ష్మిసరియైనమహీసుతతోడఁ బంకజో
దరనిభుఁడై యయోధ్యఁ బ్రమదంబు చెలంగఁగ నుండుకైవడిన్
వరవిభవంబుతోఁ జెదలువాడపురంబున నుండు రాఘవే
శ్వరుఁ డిలువేలుపై యొసఁగు సంతతమున్ గృతినాథుకోరికల్. 5

చ. మెఱసి శశాంకపోత మను మెచ్చులక్రొవ్విరికొప్పు చెంగటన్
దుఱిమి కృపారసామృతము తొంగలిఱెప్పలతోడికన్నులన్
నెఱయఁగ యోగినీజనులు నెమ్మిమెయిన్ భజియింప నున్న మా
కరిముఖదేవుతల్లి దయఁ గాచుఁ గృతీశ్వరుఁ డైన రాఘవున్. 6

శా. వేదంబుల్ పరమార్థచోదితములై విఖ్యాతసాంగంబులై
యాదిం బంకజగర్భుచే రచితమైన ట్లంశషట్కంబునం
బాదై యుండ నొనర్చె వైష్ణవపురాణం బట్టివిజ్ఞానవి
ద్యాదీక్షాగురునిం బరాశరుని నిత్యప్రీతితోఁ గొల్చెదన్. 7

శా. ఆరూఢస్థితి నెల్లలోకములఁ బ్రఖ్యాతంబుగా భారత
శ్రీరామాయణముల్ రచించినమనీషిస్తుత్యచారిత్రులన్
సారస్ఫారగభీరచారుకవితాసంపన్నవాచాసుధా
ధారాసారవిహారులన్ గొలుతు వేదవ్యాసవాల్మీకులన్. 8

ఉ. మున్నిటి కాళిదాసకవిముఖ్యులకుం బ్రణమిల్లి వారిలో
నెన్నికగాఁ బ్రబంధపరమేశ్వరుఁ దిక్కనసోమయాజినిన్

---

నిత్యశ్రీయుతున్ = శాశ్వతమైన ఐశ్వర్యముతోఁ గూడుకొన్నవానిఁగా, 5 మహీసుతతోన్ =సీత తోడ, పంకజోదరనిభుఁడు = విష్ణువుతోసమానుఁడు, ప్రమదము=సంతోషము, చెలంగఁగన్ = అతిశయింపఁగా, ఇలువేలుపు = పరంపరగా తమ పెద్దలు సేవించెడుదేవత - గృహదేవత. 6 శశాంకపోతము=బాలచంద్రుఁడు, మెచ్చులక్రొవ్విరి = మెచ్చుకోఁదగిన క్రొత్తగా పూచినపువ్వు, చెంగటన్ = సమీపమునందు-దీని ప్రథమైకవచనము చెంగలి, తుఱిమి=చెరివి, కృపారసము = దయారసము, తొంగలి ఱెప్పలతోడికన్నులన్ = వాలుగలకంటెఱెప్పలతోడి కన్నులయందు, నెఱయఁగన్ = వ్యాపింపఁగా, నెమ్మిమెయిన్=భక్తితో, భజియింపన్=సేవింపఁగా, కరిముఖదేవుతల్లి = వినాయకుని తల్లి యగు పార్వతి. 7 పరమార్థచోదితములు = పరతత్త్వభావమును బోధించునవి, విఖ్యాతసాంగంబులు=ప్రసిద్ధములైన శిక్షాదిఅంగములతోఁగూడినది, పంకజగర్భుచేన్ = బ్రహ్మచేత, అంశషట్కంబునన్=ఆఱు అంశములతో, పాదై=నెలకొనినదై, విజ్ఞానవిద్యాదీక్షాగురునిన్=విశేషజ్ఞానయుక్తమైన విద్యకు దీక్షవహించిన యాచార్యుఁడైనవానిని. 8 ఆరూఢస్థితిన్ = మిక్కిలి నిలుకడచెందినయునికి చేత, మనీషిస్తుత్యచారిత్రులన్ = విద్వాంసులచేత స్తోత్రముచేయఁదగిన చరిత్రగలవారిని, సారస్ఫారగభీరచారుకవితాసంపన్నవాచాసుధాధారాసారవిహారులన్ = రసవంతములును అర్థస్ఫురణకలవియు గంభీరములును మనోజ్ఞములునై కవిత్వసంపత్తిగలవాక్కులనెడు అమృతధారావర్షమునందు విహరించునట్టివారిని. 9 ప్రణమిల్లి=నమస్కరించి, ఎన్నికగాన్ = లెక్కపెట్టినట్లు, ఇందుచెప్పఁబడినవారు

నన్నయభట్టు భాస్కరుని నాచనసోముని రంగనాథునిన్
వెన్నెలగంటిసూర్యుఁ బదివేలవిధంబులఁ గొల్చి భక్తితోన్. 9

ఉ. ఏను పరాశరుండు రచియించినవిష్ణుపురాణ మాంధ్రభా
షానిపుణోక్తులం బలుకఁజాలెద నంచుఁ దలంచినాఁడ శే
షానిలభుగ్విభుం డురుసహస్రశిరంబులఁ దాల్చులోకముల్
హీనపుఁబూరిపాము ధరియించెద నంచుఁ దలంచుచాడ్పునన్. 10

మ. హరిసంకీర్తన మైననాకవితయం దాక్షేపముల్ గల్గినన్
సరసత్వంబుల కామదిం దలఁపుఁడీ సర్వజ్ఞులై సత్కవుల్
కర మొప్పారెడుచంద్రబింబము కళంకప్రస్థమయ్యున్ సుధా
పరిపూర్ణస్థితి నెల్లలోకముల సంభావ్యంబునం బొందదే. 11

ఉ. పన్నగశాయిసత్కథ లపారము లన్నియుఁ జెప్పనోపుదే
సన్నపుబుద్ధివాఁడవని సత్కవులాఁడిన విన్నవించెదన్
మున్ను పితామహుండు మునిముఖ్యులు విష్ణుపురాణపద్ధతుల్
కొన్నియె కాక యన్నియును గోరి నుతించిరె యేయుగంబులన్. 12

ఉ. తామరసాక్షుపుణ్యచరితంబు లనంతము లందులోపలన్
నామది భక్తియుక్తియును నానిపుణత్వము నెట్టి దట్టివా
చామలవృత్తి నెన్నెద సుధాంబుధిలోపలినీరు చూచి తృ
ట్కాముఁడు వచ్చి దప్పి యడఁగందగుమాత్రము గ్రోలుచాడ్పునన్. 13

ఉ. ఆదర మొప్పఁగా సుకవు లారసి చాటుతరప్రబంధసం
పాదము మేలుమే లనుచుఁ బల్కిన నొప్పు జగత్ప్రసిద్ధమై
కాదని తప్పుఁబట్టి కొఱగామిఁ దలంచినఁ దొంటికాళిదా
సాదిమహాకవీశ్వరులకైనను నేరము లేకయుండునే. 14

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, పురాతనకవిస్తోత్రంబును, మదీయచిత్తసమా

---

ఆంధ్రకవులలో ముఖ్యులు అని తెలియవలెను. 10 అనిలభుగ్విభుండు = గాలిని భుజించునవియైన పాములకురాజు, పూరిపాము = పసిరికపాము. 11 ఆక్షేపములు = ఆక్షేపింపఁదగినవిషయములు, సర్వజ్ఞులు = అన్నియు తెలిసినవారు, కళంకప్రస్థము = కళంకముయొక్క మంచియునికిగలది, సుధాపరిపూర్ణస్థితిన్ = అమృతముయొక్క నిండినయునికి చేత, సంభావ్యము = సంభావింపఁదగినది-గౌరవింపఁదగినది. 12 పన్నగశాయి=శేషుఁడుపఱపుగాఁగల విష్ణువు, అపారములు=దరిలేనివి, సన్నము=అల్పము, పితామహుఁడు = బ్రహ్మ. 13 తామరసాక్షుఁడు = తామరలవంటి కన్నులుగల విష్ణువు, అనంతములు = అంతములేనివి, యుక్తి = కూడిక, నిపుణత్వము = నేర్పరితనము, వాచామలవృత్తి = వాక్కులయొక్క నిర్మలమైన వ్యాపారము, సుధాంబుధి = పాలసముద్రము, తృట్కాముఁడు=దప్పిచేత కోరఁబడినవాఁడు - దప్పిగొన్నవాఁడనుట. 14 చాటుతరప్రబంధసంపాదము = మిక్కిలి స్తోత్రార్హమయిన ప్రబంధమునుకలుగఁజేయుట, మేలుమేలు = ఇది ప్రశంసార్థము, కొఱగామి=పనికిమాలినతనమునుగా, తలంచినన్ = తలంచెడుపక్షమున. 15 ముద్రితము = ముద్రవేయ

థానంబునుం జేసి శ్రీవిష్ణుపురాణనిర్మాణప్రవీణహృదయుండనై యుండునప్పుడు సకలసముద్రముద్రితాఖిలవసుంధరాచక్ర పరిపాలనపరాయణుండును, రూప నారాయణుండును, చటులకుటిలవిరోధియూథగహనధనంజయుండును, సంగ్రామధనంజయుండును, సంగరోత్సాహసంగత చతురంగసేనాసమేతారాతిగర్వాంధకారసముజ్జ్వలాదిత్యుండును, పల్లవాదిత్యుండును, సముద్దండప్రచండవిరోధిమండలేశ్వర ప్రాణానిలమండలాగ్రభుజంగుండును, రాయవేశ్యాభుజంగుండును, అనవరతసుకవినికరస్తోత్రవచనరచనాసమయనిర్వికారుండును, చంచుమలచూఱకారుండును, వేదశాస్త్రపురాణప్రవీణ భూసురాశీర్వాదప్రవర్ధమానగోత్రుండును, యానపాలగోత్రుండును, పంటవంశపయఃపయోరాశిరాకాశర్వరీశ్వరుండును, రాపూరిపురవరాధీశ్వరుండును నైనబసవభూపాలురాఘవుండు. 15

సీ. గౌరీసమేతుఁడై గరిమతో నేవీట నేపారు నీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నేవీట గిరిభేదినుతుఁడైన కేశవుండు
యోగినీసహితయై యొప్పారు నేవీటఁ బసిఁడిపోలేరమ్మ భవునికొమ్మ
పాపవినాశయై ప్రవహించు నేవీట మన్నేఱు మిన్నేటిమారటగుచుఁ
ఆ. కుంజరములు వేయి గొలువంగ నేవీటఁ, గోడగుచక్రవర్తి పుడమియేలె
నట్టిరాజధాని యై యొప్పుగుడ్లూరి, నొసర నేలుచుండి యొక్కనాఁడు. 16

సీ. వేదాంతవిదులైన విద్వాంసు లొకవంక నుభయభాషాకవు లొక్కవంక
సకలాప్తబాంధవ సంబంధు లొకవంక నుదుటుమన్నెకొమారు లొక్కవంక
నీతికోవిదులైన నెఱమంత్రు లొకవంక నుద్దండరణశూరు లొక్కవంక
సంగీతసాహిత్యసర్వజ్ఞు లొకవంకఁ జొక్కపుభరతజ్ఞు లొక్కవంక
తే. రాజరాజులు పంచిన రాయబారు, లొక్కవంక విలాసిను లొక్కవంక

బడినది—ఆవరింపఁబడినదనుట, పరాయణుఁడు = ఆసక్తుఁడు, చటులకుటిలవిరోధియూథగహనధనంజయుండు = గడుసైనవారును చెడ్డనడతగలవారునగుపగవారిగుమియనెడు అడవికి అగ్నిహోత్రుఁడైనవాఁడు, సంగ్రామధనంజయుఁడు = యుద్ధమునందు అర్జునుఁడు, సంగరము=యుద్ధము, సంగతము = కూడుకొన్నది, అరాతి=శత్రువు, పల్లవాదిత్యుఁడు=బాలసూర్యుఁడు, సముద్దండప్రచండవిరోధిమండలేశ్వర ప్రాణానిలమండలాగ్రభుజంగుండు = గర్వించిన ప్రతాపవంతులగు శత్రురాజులయొక్క ప్రాణవాయువులను (హరించునట్టి) కత్తియనెడు సర్పముగలవాఁడు, రాయవేశ్యాభుజంగుండు = రాచబోగమునారికి విటుఁడు, చూఱకారుఁడు=కొల్లపెట్టినవాఁడు, ఈరెండును బిరుదుపేళ్లు, ఇట్టివి గ్రామ్యములైనను గ్రహింపఁబడును. గోత్రము=భూమి-వంశము, పంటవంశపయః పయోరాశిరాకాశర్వరీశ్వరుఁడు = పంటవంశమనెడు పాలసముద్రమునకు పున్నమనాటిచంద్రుఁడు. 16 గరిమ=గౌరవము, వీటన్=పట్టణమునందు, వారాశికన్య=లక్ష్మి, గిరిభేది=ఇంద్రుఁడు, మారట=మాఱు, కుంజరము = ఏనుఁగు. 17 వేదాంతవిదులు=వేదాంతము నెఱిఁగినవారు, ఒకవంక=ఒకతట్టు, ఉభయభాషాకవులు = సంస్కృతాంధ్రకవులు, ఉదుటు=గర్వము, మన్నెకొమారులు=రాజపుత్రులు-లేక, సామంతరాజపుత్రులు,

బలసి కొలువంగ నతులవైభవముతోడ, రమణఁ గొలువుండె బసవయరాఘవుండు.

సీ. కరమూలరుచులబింకపుఁబంకజాక్షులు రమణతో వింజామరములు వీవ
గుబ్బపాలిండ్లనిగ్గులుదేర నొకయింతి ప్రమదంబుతో నడపంబుఁ బూన
వాలుచూపులచే నివాళించి యొకలేమ కాళాంజి పూని చెంగట నటింప
పంచమస్వరమునఁ బద్మాక్షి యొక్కతె యవధారు చిత్తేశ యనుచుఁ బలుక
తే. లలితబిబ్బోకహేలావిలాసములను, రాజబింబాస్య లుభయపార్శ్వములఁ గొలువ
రాజసంబున బసవయరాఘవుండు, నిండుకొలువుండెఁ గన్నులపండు వగుచు. 18

క. పౌరాణికు లఖిలకళా, పారీణులు బహుపురాణపద్ధతు లతిగం
భీరోక్తుల వినిపింపఁగ, గారవమున వినుచుఁ బరమకౌతుక మొప్పన్. 19

క. అనవేమమండలేశ్వరుఁ,డును నల్లయ వీరభద్రుఁడును మొదలుగఁ గ
ల్గినతొంటిరెడ్డిరాజులు, ఘనకీర్తులు గనిరి కృతిముఖంబున ననుచున్. 20

తే. కృతిముఖంబునఁ దానును గీర్తివడయఁ, బూని పెద్దలయనుమతంబునఁ దెనుంగు
బాస విష్ణుపురాణ ముపన్యసింప, సరసుఁ డైనట్టిసత్కవీశ్వరుని నరసి. 21

ఉ. ఈనిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చినరావుతుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచినవేమయయన్నపోతభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటివారిలోన్. 22

సీ. భవ్యచరిత్రు నాపస్తంబమునిసూత్రు శుద్ధసారస్వతస్తోత్రపాత్రు
హరితగోత్రపవిత్రు నాంధ్రభాషాకావ్యరచనాభినయవిశారదుఁ బ్రబంధ
కర్తను వెన్నెలకంటిసూర్యునిమనుమనిఁ జెరుకూరియమరయమంత్రి
సత్పుత్రు నాశువిస్తారవిచిత్రమాధుర్యకవిత్వచాతుర్యశీలు
తే నిజకులాచారమార్గైకనిపుణుఁ బరమ,సాత్వికోదయహృదయు వైష్ణవపురాణ

---

భరతజ్ఞులు = భరతశాస్త్రము నెఱిఁగినవారు, రమణన్ = ఒప్పిదముగా. 18 కరమూలరుచులు=చంకలయందలికాంతులు, నిగ్గులుదేరు=వన్నెమీఱు, నివాళించి = ఆరతులెత్తి, కాళాంజి=తమ్మపడిగము, అవధారు=అవధరింపుము, చిత్తేశ=మనోనాయకా, బిబ్బోకము=స్త్రీలయొక్క విలాసవిశేషము, రాజబింబాస్య=చంద్రబింబమువంటి ముఖముకలది, కన్నులపండువు = నేత్రోత్సవము. 19 అఖిలకలాపారీణులు=ఎల్లవిద్యలు తుదముట్టనెఱిఁగినవారు. 21 కృతిముఖంబునన్=గ్రంథమూలమున, ఉపన్యసింపన్ = చెప్ప, అరసి=విచారించి. 22 వెన్నడిచి = వీఁపుతట్టి, భూజాని=రాజు. 23 నయవిశారదుఁడు = నీతివిద్యయందు నేర్పరి, పరమసాత్వికోదయహృదయున్=శ్రేష్ఠమైన సాత్వికగుణమునకు జన్మస్థానమైన హృదయముగలవానిని - మిక్కిలి సాత్వికగుణము కలవానిననుట, సారస్యము=

వేది సారస్యవిద్యాప్రవీణు సుకవి, మాననీయుని సూరనామాత్యవరుని. 23

క. నన్నుఁ బిలిపించి పెద్దయు, మన్నించి గురూపచారమార్గంబులు సం
పన్నములుచేసి వినయము, దన్నెంతయుఁ బ్రోదిసేయఁ దగ నిట్లనియెన్. 24

క. నీ విప్పు డాంధ్రభాషం, గావించుచు నున్నచంపుకావ్య మ్మగునీ
శ్రీవిష్ణుపురాణము నా, కీవలయు మదీయకీర్తి యిలలోఁ నెగడన్. 25

క. క్షితిలోనఁ బసిఁడి పరిమళ,యుతమై రత్నమును గూడి యున్నట్లు సుమీ
కృతి శ్రీవిష్ణుపురాణము, కృతికర్తవు నీవు నేను గృతిపతి నగుటల్ 26

వ. అని బహుమానపూర్వకంబుగా గంధాక్షతంబు లొసంగి కనకమణిభూషణాం
బరంబులు గట్టనిచ్చి కర్పూరసహితంబుగాఁ దాంబూలంబు సమర్పించి తమతండ్రి
పేర బసవాపురం బనునగ్రహారం బేకభోగంబుగా నొసంగి గారవించిన నేనును
బరమసంతోషపరిపూర్ణహృదయుండనై మదీయప్రణీతకావ్యకన్యా మనోహరుం
డగు రావూరిబసవభూపాలురాఘువువంశం బభివర్ణించెద. 27

ఆ. జలజనాభునాభిజలజాతమున బ్రహ్మ, జనన మొందె నతనిచరణపంక
జమున శూద్రజాతి జన్మించి వారల, యందుఁ బంటవంశ మతిశయిల్లె. 28

ఆ. అట్టిపంటకులంబునందు నేడవచక్రవర్తి యన్న వేమవసుమతీశుఁ
డుద్భవించి కీర్తియును సత్ప్రతాపంబు, నెసఁగ భూమియెల్ల నేలుచుండె. 29

క. తన బ్రతుకు భూమిసురులకుఁ, దనబిరుదులు పంటవంశధరణీశులకున్
దననయము భూమిప్రజలకు, ననవేమన యిచ్చెఁ గీర్తినధికుం డగుచున్. 30

క. ఆపంటవంశమునఁ గుల,దీపకుఁ డగులింగశౌరి తేజోధికుఁడై
యేపారెఁ గీర్తిలక్ష్మికిఁ, బ్రాపై తొల్లింటిరెడ్డిరాజులకరణిన్. 31

క. ఘనుఁ డాలింగారెడ్డికి, తనయుఁడు కీర్తిప్రతాపధాముఁడు తేజో
ధనుఁడై పేరమరెడ్డి సుజనవినుతుఁడు పుట్టె భాగ్యసంపద వెలయన్. 32

క. పేరుగల లింగయప్రభు, పేరన నుదయించె సుతుఁడు పెంపున్ సొంపున్

---

సరసభావము. 24 పెద్దయున్=మిక్కిలి, గురూపచారమార్గంబులు = గొప్పయుపచారములను నడ పెడుత్రోవలను, సంపన్నములు = కలిమికలవి-గొప్ప యుపచారములను నడపి యనుట, ప్రోది సేయన్=గొప్పపఱుపఁగా. 25 చంపుకావ్యము = పద్యములును వచనములునుగల కావ్యము, ఇల లోన్=భూమియందు, నెగడన్ = వ్యాపింపఁగా. 26 పసిఁడి=బంగారు, కృతికర్త=ప్రబంధరచన చేయువాఁడు, కృతిపతి=ప్రబంధమును రచింపించినవాఁడు. 27 కనకమణిభూషణాంబరంబులు = బంగారుమయములును రత్నమయములునగు సొమ్ములను వస్త్రములను, మదీయప్రణీతము = నాచేఁ జేయఁబడినది. 28 జలజనాభుఁడు=విష్ణువు, చరణపంకజమునన్ = పాదకమలమునందు. 29 సత్ప్ర తాపము=మేలైనప్రతాపము. 30 నయము=నీతి. 31 ఏపారి=అతిశయించి, ప్రాపు=రక్షకము. 32 కీర్తిప్రతాపధాముఁడు=కీర్తికిని ప్రతాపమునకును ఇల్లయినవాఁడు, తేజోధనుఁడు=పరాక్రమమే

పౌరుషము యశము గలతమ్మారెడ్డి సమస్తజనులు ప్రస్తుతిసేయన్. 33

సీ. తనగుణశ్రేణి దిగ్ధరణీశకోటీరసముదయంబులకు రత్నములు చేసెఁ
దనసాహసము సముద్యద్దర్పవిద్వేషిజగతీశులకు గుండెదిగులుచేసెఁ
దనకీర్తి తారకాధవతారకాతారవసుధాధరములకు వన్నె చేసెఁ
దనదానమహిమ మందారగుహ్యకరాజశిబిదధీచులకును సిగ్గుచేసెఁ
తే. దనవిభవలక్ష్మి మిత్రబాంధవకవీంద్ర, నీలపంకేరుహంబుల నెలవుచేసె
బసవశంకరజగరక్షపాలబిరుద, ధనుఁడు రావూరివేరయతమ్మవిభుఁడు. 34

క. ఆతమ్మక్షితిపాలుఁడు, పాతివ్రత్యమున సకలభాగ్యశ్రీలన్
సీతకుఁ బ్రతివచ్చినవిఖ్యాతగుణాలంబ మాచమాంబ వరించెన్. 35

తే. ఆవధూటికి నుదయించి రమితగుణసమగ్రవైభవు లత్యంతమహితయశులు
బసవశౌరియు నన్నయప్రభువరుండు, లింగవిభుఁడు ననంగ నుత్తుంగయశులు. 36

క. వారలలోపల బసవక్ష్మారమణుఁడు పేరుపెంపు గలమన్నీఁడై
భూరిప్రతాపజయలక్ష్మీరతుఁడై వెలసె నుదయగిరిరాజ్యమునన్. 37

సీ. కుటిలతరారాతికుంభినీధవమహాభూభృత్కదంబదంభోళిధరుఁడు
దారుణాహితపయోధరపాటనవ్యగ్రబంధురఝంఝాప్రభంజనుండు
పటుతరప్రతిపక్షపక్షఘోరారణ్యసముదగ్రచటులవైశ్వానరుండు
కఠినాహితవ్రాతగాఢాంధకారలుంటాకప్రచండప్రభాకరుండు

---

ధనముగాఁగలవాఁడు. 33 పెంపు=అభివృద్ధి, సొంపు=బాగు, యశము=కీర్తి, ప్రస్తుతిసేయన్=పొగడఁగా. 34 దిగ్ధరణీశకోటీరసముదయంబులకున్=ఎల్లదిక్కులయందునుండెడు రాజులయొక్క కిరీటములయొక్క సమూహములకు, సముద్యద్దర్పవిద్వేషిజగతీశులకున్=పూనికయుఁ గర్వమునుగలశత్రురాజులకు, తారకాధవతారకాతారవసుధాధరములకున్=చంద్రునకును నక్షత్రములకును వెండికొండకును, మందారగుహ్యకరాజశిబిదధీచులకున్ = కల్పవృక్షకుబేరచంద్ర శిబిచక్రవర్తి దధీచిమునులకు, వీరు మిక్కిలి దాతలని చెప్పుదురు, నీలపంకేరుహము = నల్లకలువ, ఇట్టిచోట్ల పంకేరుహశబ్దమునకు కమలమనియర్థము చెప్పుట సరికాదు, నెలవు=స్థానము, బసవశంకరజగరక్షపాల బిరుదధనుఁడు-ఇది బిరుదును దెలుపునదికాన జగరక్షపాల యనునది దుష్టముగా గ్రహింపఁదగదు. 35 పాతివ్రత్యము=పతివ్రతాత్వము, విఖ్యాతగుణాలంబ = ప్రసిద్ధగుణములకు అవలంబమైనది. 36 ఉత్తుంగయశులు=అధికకీర్తి గలవారు. 37 మన్నీఁడు=రాజు (మన్నెము=సర్వాదాయము ననుభవింపఁదగినభూమి అదికలవాఁడు అని వ్యుత్పత్త్యర్థము. 38 కుటిల...ధరుండు=మిక్కిలి క్రూరులగు శత్రురాజులనెడు గొప్పకొండలకుమికి ఇంద్రుఁడైనవాఁడు, దారుణా...ప్రభంజనుండు=భయంకరులగు శత్రువులనెడు మేఘములను ఎగురఁగొట్టుటయందు భయంకరమై యతిశయించిన వానగాలి, పటు...వైశ్వానరుండు = మిక్కిలి సామర్థ్యముగల శత్రువులపక్షము నవలంబించినవారనెడు భయంకరమయిన అడవికి మిక్కిలి విజృంభించిన వేండ్రముగల అగ్నిహోత్రుఁడు, కఠినా...ప్రభాకరుండు=కఠినులైన శత్రువులసమూహమనెడు దట్టమైనచీఁకటిని హరించెడు మిక్కిలి వేఁడిమిగల యెండను కలుగఁజేయునట్టి సూర్యుఁడు,

తే. సమదవిద్వేషిరాజన్యసైన్యజలధి, ఘోరసంరావశోషణకుంభజుండు
భీమబలశాలి నిస్సీమభూమిదాన, పరశురాముఁడు తమ్మయబసవవిభుఁడు. 38

సీ. నిరుపమగుణశీల నిజబంధులోచనోత్పలకలాపమున కుత్సవ మొనర్చి
నిఖిలభూజనచిత్తనిస్తంద్రనవచంద్రకాంతరత్నంబులఁ గరఁగఁజేసి
సంభృతైశ్వర్యప్రశస్తవంశామృతాంభోనిధానంబు నుప్పొంగఁజేసి
సన్నుతసత్కవీశ్వరగాయకచకోరసమితి కానందంబు సంతరించి

తే. వైరిరాజన్యకామినీపదనపంకజములు ముకుళింపఁజేయుచు జగములందు
నెసఁగు రావూరితమ్మయబసవవిభుని, కీర్తిచంద్రుఁడు సత్కళాకీర్ణుఁ డగుచు. 39

సీ. కపటారివాహినీకాంతారములఁగాని దరికొల్పఁ డతులప్రతాపవహ్ని
బంధుమిత్రనిశాంతపంకజంబులఁగాని భాసిల్లనీఁడు సౌభాగ్యలక్ష్మి
బ్రహ్మాండమండలోపఘ్నసీమలఁగాని వర్తింపనీఁడు సత్కీర్తిలతల
రాజరాజాస్థానరంగస్థలులఁగాని యాడనీఁ డురుచరిత్రాప్తినటుల

తే. సకలసుకవీంద్రబంధునిర్జరులఁగాని, యానసీఁడు వచోమధురామృతంబు
నవ్యసంగ్రామకేళీధనంజయుండు, పల్లవార్కుండు రావూరిబసవవిభుఁడు. 40

సీ. కటకాధిపతియైన గజపతిరాజుచేఁ బ్రతిలేనిపల్లకిపదవి నొందె
మహిమచేఁ గర్ణాటమండలాధిపుచేతఁ గడలేనిరాజ్యభాగములు గాచెఁ
బ్రౌఢపౌరుషమున రాజిల్లి మెఱయఁ గామలకవజీర్ల కమ్మలికఁ జేసెఁ
దెలగాణభూములఁ గలమన్నెవారిచే బలవంతమునను గప్పములు గొనియెఁ

తే. జాటుథాటీనిరాఘాటఘోటకావళీఖురోద్ధూతనిబిడధూళీవిలిప్త
మండితాశాంగనాకుచమండలుండు, బాహుబలశాలి తమ్మయబసవవిభుఁడు. 41

క. ఆతనిసహోదరుఁడు జలజాతప్రియతేజుఁ డహితశాసనకేళీ
కౌతూహలుఁ డన్నయధాత్రీతలనాథుండు వెలసెఁ దేజోధికుఁడై. 42

సమద...కుంభజుండు=మదించిన శత్రురాజులసేనయనెడు సముద్రముయొక్క భయంకరమైన ధ్వనిని అణఁచుటయందు అగస్త్యుఁడైనవాఁడు, భీమబలశాలి=భీమునితో సమానమయిన బలముగలవాఁడు, నిస్సీమభూమిదాన పరశురాముఁడు = ఎల్లలేనిభూమిని దానముచేయుటయందు పరశురాముఁడయినవాఁడు. 39 ఉత్పలకలాపమునకున్ = నల్లగలువలసమూహమునకు, నిస్తంద్ర = చలింపని, అమృతాంభోనిధానము = పాలసముద్రము, సంతరించి = బాగుపఱచి-కలిగించి యనుట, కళాకీర్ణుఁడు=కళలను వెదచల్లినవాఁడు. 40 వాహిని=సేన, దరికొల్పఁడు=కాల్పఁడు, నిశాంతము= ఇల్లు, ఉపఘ్నము=ప్రాఁకుడు, రంగస్థలి = నాట్యమాడెడుచోటు. 41 రాజిల్లి=ఒప్పి, మలకవజీర్లకున్=తురకయోధులకు, ఉమ్మలిక=పరితాపము, చాటు...మండలుండు = స్తుతిచేయఁదగిన యుద్ధయాత్రయందు తడఁబాటులేని గుఱ్ఱపుబారులయొక్క గొరిసెలచేత ఎగురఁజిమ్మఁబడిన దట్టమయిన దుమ్ముచే పూయఁబడుటచేత అలంకృతములైన దిక్కులనెడు స్త్రీలయొక్క గుండ్రనైన స్తనప్రదేశములుగలవాఁడు. 42 జలజాతప్రియతేజుఁడు=సూర్యుని తేజస్సువంటి తేజస్సుకలవాఁడు, అహితశాసన కేళీకౌతూహలుఁడు=పగవారిని శిక్షించుట యనెడు క్రీడయందు కుతూహలము కలవాఁడు,

సీ. గురుభుజాస్తంభాసికుంభీనసస్వామి కరినృపప్రాణానిలాన్న మొసఁగి
లలితసత్కీర్తివల్లరుల కుల్లసితోరుసుగుణాలవాలంబు నిగుడఁజేసి
భవ్యప్రతాపదీపజ్వాలికకును దామరసగర్భాండమందిర మొనర్చి
సుకవిగాయకచకోరకనికాయములకు నిజకృపాపాంగచంద్రికల నొసఁగి
తే. గగనజగతీహరిత్కుడుంగప్రకీర్ణ, దానధారాభిరామచేతఃప్రవర్తి
యతఁడు పంటకులాంబుధి కబ్జవైరి, సన్నుతోదారి తమ్మయయన్న శౌరి. 43
చ. అరుదుగఁ దమ్మభూవిభునియన్నిదాడికి నోడి శాత్రవుల్
దిరుగనిడొంకలుం బడనితెక్కలిటెంకులు పాదచారులై
యరుగనికానలుం జొరనియీఱమికోనలు భీతచిత్తులై
సురుఁగని త్రోవలున్ నిలువఁజూడనిక్రేవను లేవు భూస్థలిన్. 44
ఆ. అట్టితమ్మరెడ్డి యన్నభూపాలుని, యనుగుఁదమ్ముఁ డైనవినుతయశుఁడు
లింగభూమిభర్త సంగీతసాహిత్య, సరసవిద్యలందుఁ జతురుఁ డయ్యె. 45
సీ కుంభినీభృత్కుంభికుంభీనసేంద్రుల కూఱట యెవ్వనియురుభుజంబు
పాథోధిరాధేయపారిజాతములకు వీడుదో డెవ్వనివితరణంబు
కందర్పచంద్రసంక్రందనసుతులకుఁ దలవంప దెవ్వనిలలితమూర్తి
రాధేయబాహులేయాదితేయజులకు వెక్కసం బెవ్వనివిక్రమంబు
తే. కంజబాంధవశంపాధనంజయులకు, వెఱపుఁ బుట్టించు నెవ్వనివిపులతేజ
మతఁడు సంతతదానవిద్యావినోది, లేఖనిభుఁ డైనతమ్మయలింగవిభుఁడు. 46
సీ పరమయోగజ్ఞానపారీణతలయందు ఖాండిక్యజనకులకంటె మేలు
సంతతత్యాగసిద్ధాంతవిద్యలయందుఁ గమలాప్తసూనునికంటె మేలు
సమ్మోహనాకారసౌందర్యములయందుఁ గమ్మవిలుకానికంటె మేలు

---

43 గురు...స్వామికిన్ = గొప్పభుజమనెడు స్తంభమునందలి కత్తియనెడు సర్పరాజునకు, వల్లరులకున్=తీఁగలకు, ఆలవాలము=పాది, జ్వాలికకున్=జ్వాలకు, తామరసగర్భాండ మందిరము=బ్రహ్మాండ మనెడి యిల్లు, అపాంగచంద్రికలన్=కడగంటి చూపులనెడు వెన్నెలలను, గగన...ప్రవర్తి= ఆకాశమునందును లోకమునందలి యెల్లదిక్కులనెడు పొదరిండ్లయందును చల్లఁబడినదానోదక ధారలచేత మనోజ్ఞముగా చేయఁబడిన మనోవ్యాపారము గలవాఁడు, అబ్జవైరి = చంద్రుఁడు. 44 దాడికిన్ = ధాటికి - యుద్ధయాత్రకు, తెక్కలిటెంకులు = దొంగచోట్లు—రహస్యప్రదేశములనుట, కానలు=అడవులు, ఈఱమికోనలు=చెట్లచే తఱుచైనకొండలు, సురుఁగని=దాఁగని, క్రేవలు= పార్శ్వములు. 46 కుంభినీ...కుంభీనసేంద్రులకున్ = భూమిని భరించునట్టి దిగ్గజములకును ఆదిశేషునకును, ఊఱట=అలఁపుదీర్చుకొనఁదగిన సహాయము, పాథోధి=సముద్రము, వీడుదోడు=అంపుదోడు, కందర్పచంద్రసంక్రందన సుతులకున్ = మన్మథచంద్రజయంతులకు, తలవంపు = అవమానకరము, బాహులేయుఁడు = కుమారస్వామి, ఆదితేయజుఁడు=అర్జునుఁడు, కంజబాంధవశంపాధనంజయులకున్ = సూర్యునకు మెఱుపునకు అగ్నికిని, లేఖనిభుఁడు = దేవసముఁడు. 47 కమలాప్తసూనుఁడు=కర్ణుఁడు, కమ్మవిలుకాఁడు=మన్మథుఁడు, కౌరవాధీశ్వరుఁడు = దుర్యోధనుఁడు, కనక

సకలభోగాస్పదసంపత్కరములందుఁ గౌరవాధీశ్వరుకంటె మేలు
తే. గురుతరస్ఫారధీరతాగుణములందుఁ, గనకధరణీధరేంద్రునికంటె మేలు
చటులకుటిలవిరోధిరాజన్యశైల, లేఖవిభుఁడైనతమ్మయలింగఘనుఁడు. 47

క. ఘనుఁ డగుతమ్మయలింగన, వినుతజ్ఞానమున నీగి విభవమునందున్
జనకునిఁ బయోధికన్యా, జనకుని మఱి పుష్పబాణజనకునిఁ బోలున్. 48

క. వీరలకెల్లను గులగురుఁ, డై రాజులపూజలింగమై సుకవిమనః
పూరితఘనవితరణవిద్యారసికుఁడు పంగులూరియన్నయ వెలసెన్. 49

సీ. వినుతనానావేదవేదాంగశాస్త్రపురాణేతిహాసనిర్వాహకుండు
శైవవైష్ణవసౌరశాక్తగాణాపత్యమంత్రతంత్రాగమమర్మవిదుఁడు
పరమపావనపరాపశ్యంతిమధ్యమావైఖరిమార్గప్రవర్తకుండు
ఆధారమణిపూరకాదిపంకజపత్రనిక్షిప్తపంచదశాక్షరుండు
తే. కావ్యనాటకాలంకారభవ్యమూర్తి, పరమగురుసంప్రదాయప్రభావనిరతుఁ [డు.
డగుచు ఘోడియరాయవిఖ్యాతి నొందెఁ,బంగులూరన్నయార్యుండు బ్రహ్మవిదుఁ

ఆ. అట్టిపంగులూరియన్నయాచార్యుని, కరుణ వడసి సిరులఁ గాంచి మించె
రసికశేఖరుండు రావూరితమ్మయ, బసవభూవిభుండు వసుధయందు. 51

వ. అతనికాంతారత్నంబు. 52

ఆ. ఘనత నశ్వదానగజదానదీక్షాగురుండు నాఁగ నవని రూఢికెక్కి
నట్టిమేటితాత యల్లూరియనమార, విభుఁడు పాకనాట విస్తరిల్లె. 53

క. ఆయన మారనపుత్త్రుఁడు, పాయనిపౌరుషము యశము భాగ్యము విభవ
శ్రీయును గలపెమ్మమహీ, నాయకరత్నంబు పాకనాటను వెలసెన్. 54

వ. అతనికుమారులు. 55

సీ. నానాజనప్రమోదానూనపంచపర్వాన్నదానవినోది యన్నఘనుఁడు
కంటకాచలపక్షలుంటాకనాకాధివాసవల్లభుఁడైనవల్లభుండు

---

ధరణీధరేంద్రుఁడు=పర్వతరాజగు మేరువు, లేఖవిభుఁడు = ఇంద్రుఁడు. 48 వినుతజ్ఞానమునన్ = పొగడఁబడిన తెలివియందును, ఈగిన్ = ధాతృత్వమునందును, పయోధికన్యాజనకునిన్=సముద్రుని. 49 సుకవి మనఃపూరితఘనవితరణ విద్యానిపుణుండు = సత్కవులయొక్క మనస్సులను నిండించునట్టి (తృప్తినొందించునట్టి) దాతృత్వవిద్యయందు నేర్పరి. 50 వేదాంగములు శిక్షావ్యాకరణాదులు, పురాణములు = బ్రాహ్మము మొదలగునవి, ఇతిహాసములు = పూర్వకాలపువృత్తాంతములు, సౌరము=సూర్యునికి పరత్వమును స్థాపించెడుమతము, పరాపశ్యంతిమధ్యమా = (ఇవి యీపేళ్లచే ప్రసిద్ధములైన) శాస్త్రవైఖరులు, పంచదశాక్షరుఁడు=పంచదశాక్షరీ విద్యను నేర్చినవాఁడు, భవ్యమూర్తి=శుభస్వరూపుఁడు. 56 నానాజనప్రమోదానూనపంచపర్వాన్నదానవినోది = సకలజనులకు సంతోషకరమయి మిక్కుటమైన పంచపర్వములయందలి అన్నదానముచేత వినోదించువాఁడు, (పంచపర్వ

సకలవిద్వత్కవీశ్వరమనోరథదానచింతామణినిభుండు చింతవిభుఁడు
చటులాహితవ్రాతసంహారదోస్సారగాంగేయసదృశుండు గంగశౌరి
ఆ. దాశరథులకరణి ధరణీధరునిబాహు, దండములవిధమునఁ దమ్మిచూలి
మోము లనఁగ ధర్మమూర్తుల నలువురఁ, బెమ్మవిభుఁడు గాంచెఁ బెంపుతోడ.
క. ఆనలుగురికి సహోదరి, యై నెగడినయమ్మలాంబ యతులితభాగ్య
శ్రీ నుల్లసిల్లి తనసరి, మానవతులలోన నెల్లమహిమలు గాంచెన్. 57
సీ. ప్రకటసౌభాగ్యసంపదల నాదిమలక్ష్మి యఖిలశోభనముల నద్రికన్య
చతురభాషావిశేషముల సరస్వతి సౌకుమార్యంబున జనకతనయ
పరమపతివ్రతాగరిమ నరుంధతి ధైర్యంబుపెంపున ధరణికాంత
రూపలావణ్యనిరూఢి రతీదేవి సంతానమహిమచేఁ గుంతిదేవి
తే. తోడఁ బ్రతివచ్చుఁ గీర్తులు దొంగలింపఁ, బరఁగు రావూరితమ్మయబసవవిభుని
కులవధూమణియై మహి నలరి మించె, నమితసౌభాగ్యనికురుంబ యమ్మలాంబ.
క. కులశీలంబులఁ బుట్టిన, యిలు చొచ్చిన యిల్లు వన్నెకెక్కఁగఁ జేసెన్
లలనలు రావురిబసవయ, కులసతి యగునమ్మలాంబకును సరిగలరే. 59
క. ఆరమణీరమణు లతి, శ్రీరమ్యునిఁ జెదలువాఁడ శ్రీరఘునాథున్
గోరి భజించిరి యవ్విభు, కారుణ్యమువలన సుతులఁ గాంచిరి ముగురిన్. 60
వ. అం దగ్రజుండు. 61
సీ. చూడ నేర్చిననాఁడె చూడంగ నేర్చెను గవిగాయకులయిండ్లఁ గలిమిగలుగ
నవ్వ నేర్చిననాఁడె నవ్వంగ నేర్చెను ధనలోభు లైనదుర్మనుజపతులఁ
బలుక నేర్చిననాఁడె బలుకంగ నేర్చెను సుజనసమ్మతముగా సూనృతంబు
నడవ నేర్చిననాఁడె నడవంగ నేర్చెను మహనీయ మగుధర్మమార్గమునను
తే. జదువ నేర్చిననాఁడె తాఁ జదువ నేర్చెఁ, దా్యగసిద్ధాంతవేద్యంబు లైనకథలు

---

ములు, పున్నమ, అమావాస్య, కృష్ణాష్టమి, కృష్ణచతుర్దశి, సంక్రాంతి.) కంటకా...వల్లభుఁడు = క్షుద్రశత్రువులనెడు పర్వతములయొక్క రెక్కలను విఱుగఁగొట్టుటయందు దేవేంద్రుఁడు, సకల...చింతామణినిభుండు = ఎల్లవిద్వాంసులయొక్కయు కవీశ్వరులయొక్కయు కోరికలను యిచ్చుటయందు చింతామణిని పోలినవాఁడు (చింతామణి = కోరినదాని నియ్యఁజాలినరత్నము), చటుల...సదృశుండు=క్రూరులైన శత్రువులసమూహమును చంపఁజాలిన భుజపరాక్రమమునందు భీష్మునితో సమానుఁడు, ధరణీధరుఁడు = విష్ణువు, తమ్మిచూలి=బ్రహ్మ, ధర్మమూర్తులన్ = ధర్మస్వరూపులను, 57 అతులితభాగ్యశ్రీమహిమలన్=సరిపోల్పరాని మంచియదృష్టము కలిమివలని గొప్పతనములచేత. 58 సౌభాగ్యము=సుభగత-సౌందర్యము, పెంపు=సమృద్ధి, ప్రతివచ్చు=సమానమగు, తొంగలింపన్ = అతిశయింపఁగా. 59 వన్నెకెక్కన్=ప్రసిద్ధివహింప, కులసతి=ఇల్లాలు. 60 రమణీరమణులు = ఆలుమగలు, .అతిశ్రీరమ్యున్ = అధికైశ్వర్యముచేత మనోజ్ఞుఁడైనవానిని, భజించిరి = ఉపాసించిరి. 62 సూనృతము = సత్యము, నడవంగన్ = ప్రవర్తింప, వేద్యములు=తెలియఁదగినవి. 63 ఖద్యో

రాయవేశ్యాభుజంగుండు రమ్యకీర్తి, రతుఁడు రాపూరిబసవయరాఘవుండు. 62

మ. అవలీలన్ జయలక్ష్మితోడను విహారుండైన రాపూరిరా
ఘవభూపాలునకున్ దిశావనితలాఖద్యోతనీరాజనో
త్సవము ల్సేయఁ దదీయదీపకలికాసంభూతధూమాసితం
బవలంబింపఁగ నల్లనై మెఱసె నయ్యాకాశమాద్యంతమున్. 63

సీ. తనప్రతాపాగ్ని శాత్రవగర్భనిర్భరాంభోనిధానమున కౌర్వానలంబు
తనకీర్తిబింబ ముద్దండారివదనాబ్జమండలంబున కబ్జమండలంబు
తనబాహుదండ ముద్ధతవిరోధికడంగరీయంబులకు శిరోధీయయష్టి
తనగుణశ్రేణి మత్తవిరోధిసామంతపాఠీనతతులకు బడిశరజ్జు
తే. తనసముజ్జ్వలతేజ ముద్దామవిమత, గర్వతమసంబులకుఁ బ్రభాకరమరీచి
చేసె జగనబ్బగండఁ డక్షీణవిజయ, రతుఁడు రాపూరిబసవయరాఘవుండు. 64

చ. ఇతఁడు భుజంగవల్లభుఁడు హీనవివేకి యనంతభోగసం
శ్రితుఁ డిటువంటి శేషునియశేషసుఖంబులు పాముతోడిపొ
త్తతివలకంచు రోసి వసుధాంగన చెందె నవక్రమవిక్రమ
వ్యతికరుఁ డైనరెడ్డిబసవప్రభురాఘవుబాహుపీఠమున్. 65

సీ. అఖిలలోకాధీశుఁ డయ్యుఁ దాపసవృత్తి నడవినుండిననాఁటిహైన్య మొకటి
యమరేంద్రసేవితుఁ డయ్యు వానరులతోఁ గూడియుండిననాఁటికొంచె మొకటి
యసహాయరణశూరుఁ డయ్యు మాటుననుండి శత్రుఁజంపిననాఁటిశంక యొకటి.
యతిదయారసచిత్తుఁ డయ్యుఁ దమ్ముని నిల్లువెడలఁ ద్రోచిననాఁటివెలితి యొకటి.

---

తనీరాజనోత్సవము = సూర్యుఁడనెడు కర్పూరహారతివేడుకలు, తదీయదీపకలికాసంభూత ధూమాసితంబు = దానిదైనదీపపుకొడివలనపుట్టినపొగచేత నల్లదనమును. 64 శాత్రవగర్భనిర్భరాంభోనిధానమునకున్ = శత్రువులగర్భములనెడునిబ్బరముగల సముద్రమునకు, ఔర్వానలము=బడబాగ్ని, ఉద్దండారివదనాబ్జమండలంబునకున్ = గర్వించినశత్రువులమొగములనెడు కమలములగుబురులకు, అబ్జమండలము = చంద్రబింబము, ఉద్ధతవిరోధికడంగరీయంబులకున్ = అణఁగనిపగవారనెడువృషభములకు, శిరోధీయయష్టి = తలమీఁదికట్టె, మత్తవిరోధిసామంత పాఠీనతతులకున్ = మదించినవిరోధులైన సామంతరాజులనెడు చేఁపలసమూహములకు, బడిశరజ్జు = గాలాపుత్రాడు, సముజ్జ్వలతేజము=లెస్సగా వెలుఁగునట్టిప్రతాపము, ఉద్దామవిమతగర్వతమసంబులకున్ = అణఁపరానిశత్రువుల గర్వమనెడుచీఁకట్లకు, ప్రభాకరమరీచి = సూర్యకిరణము, అక్షీణవిజయరతుఁడు = తక్కువకానిగెలుపునందు ఆసక్తిగలవాఁడు. 65 భుజంగవల్లభుఁడు = సర్పరాజు - విటులకుప్రియుఁడు, హీనవివేకి = వివేకముచేత తక్కువైనవాఁడు, సర్పముతిర్యగ్జంతువు కనుక వివేకహీనతస్వాభావికము, అనంతభోగసంశ్రితుఁడు = మితిలేనిపడగలచేత పొందఁబడినవాఁడు—పెక్కుపడగలుగలవాఁడు, మేరలేనిభోగములచే ఆశ్రయింపఁబడినవాఁడు—బహువిధభోగముల నపేక్షించువాఁడు, అవక్రవిక్రమవ్యతికరుఁడు = క్రమమైన పరాక్రమముచేత మీఱరానివాఁడు. 66 తాపసవృత్తిన్=తపస్వియొక్క వ్యాపారముతో, మాటు

తే. మానకుండినఁ గాదని మదిఁ దలంచి, యుర్విఁ గీర్తిప్రతాపంబు లుల్లసిల్ల
రాఘవేంద్రుండు బసవయరాఘవేంద్రుఁ, డై ధరిత్రీతలంబున నవతరించె. 66

క. ఆతనియాచార్యుఁడు వి,ఖ్యాతయశోధనుఁడు సింగనార్యుఁడు వెలసెన్
భూతలమునందుఁ దిరుమల, తాతయవంశమున సకలధర్మజ్ఞుండై. 67

సీ. వేదాంతవిద్యావివేకిషడ్దర్శనపారంగతుఁడు పరాపరరహస్య
వేది బ్రహ్మాండాదివివిధపురాణజ్ఞుఁ డసమానధర్మశాస్త్రాభిజ్ఞేయ
కుశలుఁడు పరమార్థకోవిదుం డఖిలాధ్వరక్రియానిపుణుఁ డవక్రకావ్య
నాటకాలంకారనానాకళాభిజ్ఞుఁ డుభయభాషాకవితోజ్జ్వలుండు
తే. పరమవైష్ణవమార్గతత్పరుఁడు కీర్తి, ధనుఁడు తిరుమలతాతయ్యమనుమఁ డైన
సింగరాచార్యు గురువుగా సేవసేసి, రమణఁ జెలువొందె బసవయరాఘవుండు. 68

క. ఆరాఘవునిసహోదరుఁ, డై రమణీయప్రతాపహరిదశ్వుఁడు త
మ్మారెడ్డి తేజరిల్లెను, నారీనికురుంబములకు నవమన్మథుఁడై. 69

ఉ. మండితకాంతిభూతిమహిమన్ బసవప్రభుతమ్మభూవిభున్
రెండవచందురుండు పదిరెండవశంకరమూర్తి యంచు భూ
మండలిఁ బ్రస్తుతింతురు సమస్తజనంబులు నవ్విధంబు గా
కుండినఁ గల్గునే కళలయొప్పిదముల్ జితమన్మథత్వమున్. 70

మ. అసకృత్తేజము మిన్నుముట్టి రిపుభార్యానేత్రనీలోత్పల
ప్రసవంబుల్ నలఁగించి యాశ్రితముఖాబ్జశ్రేణికిన్ సంతసం
బెసఁగం జేసి విరోధిగర్వతమసం బింకింప దీపించుఁబో
బసవక్ష్మావిభుతమ్మయప్రభుప్రతాపద్వాదశాత్మప్రభల్. 71

సీ. భాగ్యసంపదలచే భాసిల్లు టరిదియే రంజిల్లురూపనారాయణునకు
రిపుభూపతుల విదారించుట కడిఁదియే నవ్యసంగ్రామధనంజయునకు
భూమిభరంబెల్లఁ బూనుట చోద్యమే భాసిల్లుజగరక్షపాలకునకు
సంగీతసాహిత్యసరసత చిత్రమే తలపోయ రాయపితామహునకు
తే. నీప్సితము లర్థులకు నిచ్చు టెంత పెద్ద, తలఁప హేమాద్రిదానచింతామణికిని
అనుచుఁ గొనియాడుదురు జను లనుదినంబు, ధర్మమతి యైనబసవనితమ్మవిభుని.72

---

నన్ = మఱుఁగున. 68 పరాపరరహస్యవేది=పరతత్త్వరహస్యము నెఱిఁగినవాఁడు. 69 హరిదశ్వుఁడు = సూర్యుఁడు, నికురుంబము = సమూహము. 70 మండిత = అలంకరింపఁబడిన, భూతి= ఐశ్వర్యము, కళలయొప్పిదము=పదియాఱుకళలచేనైన ఒప్పిదము, విద్యలచేతనైనఒప్పిదము. 71 అసకృత్తేజము = ఎడతెగనిప్రతాపము, విరోధిగర్వతమసంబు=పగవారిగర్వమనెడు చీఁకటి, ఇంకించి = అణఁచి, ద్వాదశాత్మప్రభ = సూర్యకాంతి. 72 అరిది = దుర్లభము, విదారించుట = భేదించుట, కడిఁది = అశక్యము, హేమాద్రిదానచింతామణికిన్ = బంగారుకొండనుదానముచేయుటయందు చింతామణివంటివానికి-కొండవలె మితిమీఱిన ధనమును యాచకులకిచ్చుటయందు వెనుదీయనివాఁడని

క. ఆతమ్మ రెడ్డితమ్ముఁడు, చేతోజాతోపమానశృంగారకళా
చాతుర్యుఁ డైనలక్ష్మయ, భూతలమున వెలసెఁ గల్పభూరుహ మనఁగన్. 73

ఉ. చెంగటిబోటికత్తియలు సిగ్గులు రేఁచఁగ లేఁతనవ్వుతోఁ
దొంగలిఱెప్పలన్ వలపు దూఁకొనఁ బయ్యెదకొంగు జాఱఁగా
ముంగిటిమేడపైఁ జిలుక ముద్దులుచూచుచు నిల్చియున్న య
య్యంగన నిన్నరేత్రి బసవాధిపులక్ష్ముని గూడెనే చెలీ. 74

చ. రసికపుమాటలన్ మనసు రంజిలఁజేయఁగ నేర్చునీగులన్
బిసిడితనంబు లేదు వలపించి యలంపఁడు మోహనాకృతిన్
బసగన జాణరాయఁడని పల్కినఁ దల్లికిఁ గూడ దక్కటా
బసవయలక్ష్మునిన్ రతులఁ బాయుట కంతునిఁ బాయుటే చెలీ. 75

షష్ఠ్యంతములు.

క. ఈతమ్ము లిరువురును దన, చేతులయందమున బనులు సేయఁగఁ ద్రిజగ
త్పూతాత్ముఁ డగుచు వెలసిన, యాతతగుణశీలునకు దయాలోలునకున్. 76

క. శ్రీమత్పంటకులాంబుధి, సోమునకు ననంతభోగసుత్రామునకున్
హేమాద్రి దానవరచింతామణికిఁ బ్రతాపసంభృతనభోమణికిన్. 77

క. తిరుమలతాతయదేశిక, వరశిష్యున కనుపమేయవైదుష్యునకున్
పరభూపాలతమస్సం, హరణాదిత్యునకుఁ బల్లవాదిత్యునకున్. 78

క. హరిపాదపద్మసేవా, పరచిత్తున కధికతరకృపామత్తునకున్
నిరుపమవినయసమన్విత, గురువాచాలునకు రాయగోపాలునకున్. 79

యర్థము. 73 చేతోజాత...చాతుర్యుఁడు = మన్మథునితో సరిపోల్పఁదగిన శృంగార విద్య[illegible] నేర్పరియైనవాఁడు. 75 పిసిడితనము = లోభిత్వము, కంతునిన్ = మన్మథుని. 76 చేతు[illegible] దమునన్ = చేతుల విధమున, త్రిజగత్పూతాత్ముఁడు=మూఁడులోకములను పావనములనుగ[illegible] మనస్సుగలవాఁడు. 77 పంటకులాంబుధిసోమునకున్ = పంటకులమను సముద్రమునకు చం[illegible] డైనవానికి, అనంతభోగసుత్రామునకున్ = మేరలేనిభోగమునకు దేవేంద్రుఁడైనవానికి, హేమా[illegible] బంగారుకొండ, ప్రతాపసంభృతనభోమణికిన్ = ప్రతాపమును భరించుటయందు సూర్యు[illegible] వానికి—మిక్కిలి ప్రతాపము కలవానికనుట. 78 తిరుమలతాతయదేశికవరశిష్యునకున్ = తిరు మలతాతాచార్యులనెడు గురుశ్రేష్ఠునికి శిష్యుఁడైనవానికి, అనుపమేయవైదుష్యునకున్ = [illegible] విద్యాప్రవీణతకలవానికి, పరభూపాలతమస్సంహరణాదిత్యునకున్ = శత్రురాజులనెడు [illegible] హరించుటయందు సూర్యుఁడైనవానికి, పల్లవాదిత్యునకున్ = పల్లవాదిత్యుఁడు అను బిరుదు [illegible] వానికి. 79 హరిపాదపద్మసేవాపరచిత్తునకున్ = శ్రీవిష్ణువుయొక్క పాదకమలములను సే[illegible] యందు ఆసక్తమైనమనస్సుగలవానికి, అధికతరకృపామత్తునకున్ = మిక్కిలి అధికమయిన ద[illegible] పరవశుఁడయినవానికి, వినయసమన్విత గురువాచాలునకున్ = అడఁకువతోఁ గూడుకొన్న గొ[illegible]

క. విజయరమాపరిశోభిత, భుజబలపార్థునకు నమితపురుషార్థునకున్
సుజనహృదయాంబురుహాపంకజమిత్రున కమ్మలాంబికాపుత్రునకున్. 80

క. రావురితమ్మయబసవ, క్ష్మావరసూనునకు బంధుసన్మానునకున్
సేవాగతరిపుభూపా, లావనశుభమతికి రాఘవావనిపతికిన్. 81

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినయాదిమహాపురాణం బగు బ్రహ్మాండపురాణంబునందలిపరాశరసంహితయైన శ్రీవిష్ణుపురాణంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన. 82

## ప్రథమాశ్వాసము.

సీ. వేదశాస్త్రపురాణవిద్యలు దమతల్లి యుదరంబులోననయుండి నేర్చి
శైశవంబునఁ దపస్సామర్థ్యమునఁజేసి రాక్షసప్రళయసత్త్రంబుఁ జేసె
నిజకోపదావాగ్ని నిశ్శేషముగఁ బుచ్చి పర్వతాటవులపైఁ బాఱవైచె
నంబుజాసనపుత్త్రుఁ డగుపులస్త్యబ్రహ్మచేత దివ్యజ్ఞానసిద్ధిఁ బడసె
తే. భక్తియుక్తిప్రసన్నతఁ బంకజాక్షు, పాదపద్మంబులందునె పాదుకొల్పెఁ
జారుతరమూర్తి మునిలోకచక్రవర్తి, రమ్యతేజోధరుండు పరాశరుండు. 1

వ. అమ్మహానుభావుం డాచార్యుండుగా మైత్రేయుం డతనివలన వేదవేదాంగంబులు ననేకధర్మశాస్త్రంబులు నభ్యసించి కృతకృత్యుండై యనేకకాలంబు శుశ్రూష సేయుచున్న సమయంబున నొక్కనాఁడు ప్రభాతకాలోచితకృత్యంబులు నిర్వర్తించి సుఖాసీనుండై యున్నయాచార్యునకు నమస్కరించి బహువిధంబుల స్తుతియించి యిట్లనియె. 2

క. మునినాథ నీప్రసాదం,బున సాంగములైనవేదములు శాస్త్రములున్

---

గల మాటలాడువానికి. 80 విజయరమాశోభితభుజబలపార్థునకున్ = జయలక్ష్మిచేత ప్రకాశించునట్టి భుజబలమునందు అర్జునుఁడయినవానికి, సుజనహృదయాంబురుహపంకజమిత్రునకున్ = సజ్జనుల మనస్సులనెడు కమలములకు సూర్యుఁడయినవానికి. 82 అభ్యుదయపరంపరాభివృద్ధిగాన్ = శుభపరంపరలు మిక్కిలి పెరుగునట్లుగా.

1 శైశవము=శిశుత్వము, ప్రళయము = నాశము, అంబుజాసనపుత్త్రుఁడు = బ్రహ్మకొడుకు, భక్తియుక్తిన్ = భక్తితో, పంకజాక్షుఁడు = విష్ణువు, పాదుకొల్పెన్ = స్థిరముగా నిలిపెను, చారుతరమూర్తి = మిక్కిలి మనోజ్ఞమైన యాకృతికలవాఁడు, చక్రవర్తి = శ్రేష్ఠుఁడు. 2 కృతకృత్యుఁడు=కృతార్థుఁడు, శుశ్రూష = సేవ, ప్రభాతకాలోచితకృత్యములు = తెల్లవాఱుసమయమున చేయఁదగిన పనులు, నిర్వర్తించి = నడపి, ఆసీనుఁడు = కూర్చున్నవాఁడు. 3 ప్రసాదము = అను

ఘనముగ నేర్చితి సంవి, జ్జనకంబై మనసు సుప్రసన్నతఁ బొదలెన్. 3

తే. ఇంక నొక్కటి యడుగంగ నిచ్చపుట్టె, నాకు నీకంటె నుత్తమశ్లోకు లొరులు
లేరు గావున నడుగంగ లేను దగిన, యుత్తరంబులు నాకు నీనొప రొరులు. 4

మైత్రేయుండు పరాశరమునివరునిఁగూర్చి కొన్ని ప్రశ్నలు సేయుట.

సీ. ఏవేల్పుమూలమై యెల్లలోకంబుల వర్తిల్లు నేవేల్పు వాసవాది
సురులకు నొడయఁడై శోభిల్లు నేవేల్పుచేత భక్తులకోర్కి సిద్ధిఁ బొందు
నేవేల్పు సచరాచరావళియందుండు నేవేల్పు సకలయోగీంద్రవినుతుఁ
డేవేల్పు వేదంబులెల్లను దానయై కనుపట్టు నేవేల్పుకథలు విన్న

తే. నిహపరోన్నతసౌఖ్యంబులెల్ల నాకుఁ, గలుగు నేవేల్పు విజ్ఞానకారణంబు
భువన మేవేల్పుమూలమై పుట్టు నడఁగు, నట్టివేలుపుమహిమ నా కానతిమ్ము. 5

వ. మఱియు పృథివ్యాదిభూతప్రమాణంబులు, సప్తసాగరవిస్తారంబులు సప్తద్వీపప్రకారంబు, సప్తకులాచలసంస్థానంబులు, సప్తాశ్వప్రముఖగ్రహతారకాసంచారంబులు, దేవాదిచతుర్విధభూతనిర్మాణంబు, చతుర్దశమన్వంతరప్రమాణంబులు, చతుర్యుగప్రమాణంబులును, కల్పకల్పవిభాగంబులు, యుగధర్మంబులు, దేవర్షిచరితంబులు, రాజవంశానుకీర్తనంబు, వేదశాఖాప్రమాణంబులు, బ్రాహ్మణాదివర్ణధర్మంబులు, బ్రహ్మచర్యాదిచతురాశ్రమక్రమంబులు మొదలుగా నఖిలంబును వినవలతు నానతిమ్మని యడిగినఁ బరాశరుండు పరమానందహృదయుండై యిట్లనియె. 6

క. నను నీ వడిగినయర్థము, వినిపింపందగినమతి వివేకము నాకున్
బనుపడి యున్నది పూర్వం,బున నది దలఁపింప నెఱుక పొడమెను నీచేన్. 7

శ్రీపరాశరునకు సకలపురాణకర్తృత్వము గలిగినప్రకారము.

మ. విను మైత్రేయ మదీయశైశవకథావృత్తాంత మంభోరుహా
సనపుత్త్రుండు జగన్నుతుం డగుపులస్త్యబ్రహ్మ యేతెంచి మ
న్నన లేపారఁగ నన్నుఁ గన్గొని పురాణశ్రేణికిం గర్త వీ
వని నాకున్ వరమిచ్చి పోయెఁ బ్రమదవ్యాపార మేపారఁగన్. 8

---

గ్రహము, సంవిజ్జనకంబు = జ్ఞానమునకు జన్మస్థానము, ప్రసన్నతన్ = తేటదనముచేత, పొదలెన్ = అతిశయించెను. 5 మూలము = ఆదికారణము, ఒడయఁడు = ప్రభువు, కనుపట్టున్ = కానఁబడునో, భువనము=లోకము, అడఁగున్ = నశించునో. 6 సప్తాశ్వప్రముఖ=సూర్యుఁడు మొదలుగాఁగల, దేవాదిచతుర్విధభూతనిర్మాణంబు = దేవతలు మనుష్యులు తిర్యక్కులు స్థావరములునను నాలుగు విధములైన భూతములయొక్క సృష్టి, వినవలతును = వినఁగోరెదను. 7 అర్థము = విషయము, పనుపడి = అభ్యస్తమై. 8 అంభోరుహాసనపుత్త్రుఁడు = బ్రహ్మకొడుకు, ప్రమదవ్యాపా

క. అదికారణంబుగా నా, కొదవెఁ బురాణప్రవీణయోగ్యత నీ వె
ట్టిది గోరి నన్ను నడిగితి, వది నీకుం జెప్పువాఁడ నాద్యంతంబున్. 9

వ. అనిన శక్తితనయునకు మైత్రేయుం డిట్లనియె. 10

క. మునివర పురాణములకెల్లను గర్తవుగాఁగ మును పులస్త్యుఁడు నీకే
మినిమిత్తంబున వర మిచ్చె ననిన వాసిష్ఠసూతి సెప్పె నతనితోన్. 11

సీ. మున్ను విశ్వామిత్రమునినాయకుండు మాతాతవసిష్ఠుతో జాతవైర
మానసుం డగుచుఁ దత్సూనుల నూర్వురఁ జంపించెఁ గ్రూరరాక్షసులచేత
మాతండ్రి శక్తి యష్టానిపుత్రులతోనె మృతిఁబొందె నాఁడు జన్మింప నేను
నిండుగర్భంబుతో నుండినమాతల్లియుదరంబులోనన యుండి క్రమత

తే. వేదశాస్త్రపురాణాదివిద్యలెల్ల, నభ్యసించితి మఱికొన్ని యబ్దములకు
జననమొంది తపోనిష్ఠ సలుపుచున్న, నంబ దృశ్యంతి నాపాలి కరుగుదెంచి. 12

ఉ. ఆగ్రహ మాత్మలోఁ బొడమునట్లుగఁ దండ్రి నకారణంబ య
త్యుగ్రనిశాచరప్రతతు లుక్కణఁగించుటఁ జెప్పి నిగ్రహా
నుగ్రహశక్తి గల్గినఘనుండవు నీవు జనించి రాక్షసో
దగ్రబలంబు మాన్పమి వృథా యని పల్కె ననేకభంగులన్. 13

ఉ. ఏనును దీవ్రకోపము వహించి కులాగతశాంత మంతయున్
మాని యథర్వణంబు లగు మానితమంత్రములన్ జగంబు లా
హానినదంబులన్ భయము నందఁగ రాక్షసలోకసత్రముం
బూని యొనర్చితిన్ సురలు బోరన వర్ణనసేయుచుండఁగన్. 14

వ. అమ్మహాప్రళయం బగుసత్రంబున ననేకశతసహస్రసంఖ్యలం గలరాక్షసులు భస్మీ
భూతులై రప్పుడు. 15

ఉ. మారణహోమకృత్యముల మ్రందకనిల్చినదైత్యవర్గముల్
బోరన మత్పితామహునిపొంతకుఁ బోయి నమస్కరించి నా
దారుణమైనకోపమున దాసవనాశముఁ జెప్పి సత్కృపా
పూరితుఁగాఁగ దైన్యమునఁ బొందుచుఁ బ్రార్థనచేసి రర్థితోన్. 16

వ. ఇవ్విధంబునం బ్రార్థించినఁ బరమదయాగరిష్ఠుం డైనవసిష్ఠుండు రాక్షసుల కభయం
బిచ్చి నాపాలికి వచ్చి పరమాదరంబు లైనవాక్యంబుల నాతో నిట్లనియె. 17

---

రము=సంతోషవృత్తి. 9 ఒదవెన్ = లభించెను. 11 వాసిష్ఠసూతి=వసిష్ఠునికొడుకైనశక్తియొక్క కుమారుఁడు. 12 జాతవైరమానసుఁడు = పుట్టినపగగల మనస్సుకలవాఁడు, తత్సూనులన్ = ఆయన కొడుకులను, అబ్దము = సంవత్సరము, అంబ=తల్లి. 13 ఉక్కణఁగించుట = చంపుట, నిగ్రహానుగ్రహశక్తి=శిక్షింపను రక్షింపను జాలిన సామర్థ్యము. 14 కులాగతము = తనవంశస్థులైన పెద్దలనాట నుండివచ్చినది. మానితమంత్రములన్ = పూజ్యములైన మంత్రములచేత, సత్రమున్ = దుష్టనాశకమైన యజ్ఞవిశేషము. 16 మ్రందక = చావక, బోరనన్ = శీఘ్రముగా, పొంతకున్ = దగ్గఱకు 17 పరమదయాగరిష్ఠుఁడు = మేలైనదయచేత మిక్కిలి గొప్పవాఁడు.

ఉ. ఏమిటి కింతకోపము వహించితి వన్న కుమార రాక్షస
స్తోమముఁ జంపఁగా నకట దోషము చెందదె క్షత్రియోచితం
బీమహనీయకృత్యము మునీశ్వరధర్మముగాదు జీవహిం
సామతులైనవారలకు సద్గతి లేమియు నీ వెఱుంగవే. 18

క. కోపము గల్గినచోటన, పాపము వర్తిల్లుఁ బాపపరులకుఁ గోప
వ్యాపారంబులె తోఁచును, గోపము పాపంబు నొక్కకుదురై నడుచున్. 19

క. అపవర్గము స్వర్గంబును, దపమును సుకృతంబు యశము ధర్మము బాపున్
విపులక్రోధము గావునఁ, దపసులకుం గ్రోధ మింత దగునే తండ్రీ. 20

తే. తండ్రిఁ జంపినపగఁ దీర్పఁ దలఁచి యిప్పు, డింతచేసెద విది నీకు నేల వారి
వారికర్మఫలంబు లవశ్యభుక్తి, కారణంబులు గా కెందుఁ గడవవశమె. 21

వ. కావున బరమశాంతుండవై నిరపరాధులై దైన్యంబుతోడ నున్న రాక్షసుల
రక్షింపు మని యనేకప్రకారంబులం బ్రార్థించుచున్న పితామహువచనంబు లా
రించి యుపసంహృతరక్షస్సత్త్రుండ నైతి నిట్లు పరమశాంతుండ నైననాపాలికి
దైత్యదానవచోదితుండును మహామునిగణసమేతుండును నై పులస్త్యబ్రహ్మవచ్చి
మాతాతచేత నర్చితుండై కూర్చుండి నిజకులప్రసూతు లైనరాక్షసులయందు
నత్యాదరచిత్తుండ నై యున్నన న్నవలోకించి యిట్లనియె 22

ఉ. నిష్ఠురకోపముం విడిచి నిర్మలశాంతి వహించితీవు వా
సిష్ఠభవన్మనోరథవిశేషము లిచ్చెదఁ జెప్ప మిమ్ముని
శ్రేష్ఠులు మెచ్చ నంచు విలసిల్లుచుఁ బల్కిన నేను దేవతా
జ్యేష్ఠతనూజుపాదములు చేరి ప్రణామముచేసి పల్కితిన్. 23

శా. నాచిత్తంబు నిరంతరంబును పురాణగ్రంథశాస్త్రక్రియా
వైచిత్రిన్ విలసిల్లుచున్న యది భవ్యజ్ఞానసంసిద్ధియున్
వాచామాధురియున్ మహాప్రతిభయున్ వైదగ్ధ్యముం బెంపుతో
నౌచిత్యంబుగ నాకు నిమ్మని పులస్త్యబ్రహ్మఁ బ్రార్థించితిన్. 24

క. నాకోరినట్ల వర మ, స్తోకంబుగ నిచ్చి బ్రహ్మసూనుఁడరిగె సు
శ్లోకుఁడు తాతయు నేత, త్ప్రాక్కామ్యము కరుణచేసి పలికె సదయుఁడై. 25

వ. అదికారణంబుగా నమ్మహానుభావులయనుగ్రహంబునం జేసి. 26

ఉ. దేవరహస్యకార్యములు దీపము వెట్టినయట్ల వేదవి
ద్యావిషయస్థితుల్ కరతలామలకంబు లనేకధర్మశా

---

20 అపవర్గము=మోక్షము. 21 భుక్తి=అనుభవము, కడవన్=మీఱుటకు. 22 ఉపసంహృతరక్షస్స త్త్రుండను=ఉపసంహరింపఁబడిన రాక్షససంబంధిసత్త్రముగలవాఁడు-రాక్షసులను నశింపఁజేయుచున్న సత్త్రయాగమును నిలిపినవాఁడనుట, నిజకుల ప్రసూతులు=తనవంశమునఁబుట్టినవారు. 23 దేవతాజ్యేష్ఠ తనూజుఁడు=బ్రహ్మకొడుకు, ప్రణామము=నమస్కారము. 24 ప్రతిభ=సమయోచితస్ఫురణగలబుద్ధి, వైదగ్ధ్యము=విదగ్ధత-మిక్కిలి నేర్పరితనము. 25 అస్తోకంబుగన్=ఘనముగా, సుశ్లోకుఁడు=మంచికీర్తి

ప్రాసళు లాటపాటసచరాచరభూతగణప్రవర్తనం
బీవిధమంచుఁ జెప్పఁగలనేను బులస్త్యువరంబుపెంపునన్. 27

వ. కావున నీ వడిగినయర్థంబులు పురాణరూపంబుగా వక్కాణించెద. 28

ఉ. విష్ణుఁడె భక్తవత్సలుఁడు విష్ణుఁడె దేవమయుండు వేల్పులన్
విష్ణుఁడె ప్రోవనేర్చు మఱి విష్ణుఁడె విశ్వగురుండు సర్వమున్
విష్ణుమయంబులై నడుచు వేయును జెప్పఁగనేల నీవు శ్రీ
విష్ణుపురాణమున్ వినుము వేదసమానముఁ దాపసోత్తమా. 29

సీ. వేదంబులందెల్ల వేదంబు ధర్మశాస్త్రంబులలోపల ధర్మశాస్త్ర
మాగమార్థములలో నాగమార్థం బగుజ్యోతిషంబులలోన జ్యోతిషంబు
బహుపురాణములలోఁ బురాణం బితిహాసంబులం దితిహాస మఖిల
నీతిశాస్త్రములలో నీతిశాస్త్రము మహాయోగవిద్యలలోన యోగవిద్య

తే. కావ్యములలోనఁ గావ్యంబు భవ్యతరము, సకలలోకైకవేద్యంబు సకలసుజన
చిత్తరంజనకారణం బుత్తమంబు, క్షోణి నొప్పారు విష్ణుపురాణ మనఘ. 30

క. పరమాత్ముఁడైనవిష్ణుని, చరితంబులు గలపురాణసంహిత లోకో
త్తరుఁడైనబ్రహ్మదేవుఁడు, వివరించెం దొల్లి మతివివేకము పేర్మిన్. 31

వ. అప్పురాణము భావుం డఖిలమునిగణసమేతుం డైనదక్షప్రజాపతికిం జెప్పె నతండు
నర్మదాతీరంబునఁ జక్రవర్తిత్వంబునకుఁ దపంబునేయుచున్న పురుకుత్సుం డనురా
జన్యునకుం జెప్పె నతండు సారస్వతునకు వక్కాణించె నతనిచేత నేను విన్న
విధంబు నీ కెఱింగించెద సావధానుండవై వినుమని యిట్లనియె. 32

మ. అవికారున్ జగదేకవీరు మహిమాయత్తుం గృపాచిత్తు దా
నవసంహారు మహాఘదూరుఁ బరమానందుం జగద్వంద్యు భా
గవతానీకసమాశ్రయుం బునిలోకస్తుత్యు నిత్యున్ రమా
ధవునిన్ బన్నగశాయిఁ గొల్చెను గృతార్థంబయ్యె నాజన్మమున్. 33

సీ. అనఘ భగవద్ధ్యానపరాయణుండగు నా భాగవతుండై నవాసుదేవున కభివాదనంబు
చేసి వసిష్ఠపుత్రుల స్వబ్రహ్మాంగ మరలఁ జని నిమీలితలోచనుండై యున్న కొండొక

గలవాఁడు, ప్రాకామ్యము=ఐశ్వర్యము. 29 వేదసమానమున్ - ఇది విష్ణుపురాణమున్ అనుదానికి విశేషణము. 32 సావధానుఁడు=ఎచ్చరికగలవాఁడవు. 33 అవికారుఁడు=వికారము లేనివాఁడు జగదేకవీరుఁడు = జగత్తునందు ఒక్కఁడైన వీరుఁడు.—ఇతనికంటె వీరుఁడు లోకమునందు లేఁడు. అనుట, మహిమాయత్తుఁడు = మహిమకు అధీనుఁడు—మిక్కిలి మహిమగలవాఁడు, మహాఘదూరుఁడు = గొప్ప పాపములకు దూరమైనవాఁడు - పాపము లేనివాఁడు, సమాశ్రయుఁడు = మ్రొక్కిన దేవతలు గలవాఁడు, నిత్యుఁడు = శాశ్వతుఁడు, మాధవుఁడు = లక్ష్మీపతి, కృతార్థము = ధన్యము. 34 అభివాదనము = నమస్కారము, నిమీలితలోచనుఁడు = మూయఁబడిన కన్నులుగలవాఁడు - కన్నులు మూసికొన్నవాఁడు, కొండొక = కొంత. అతీతము=కడచినది, అనాగతము = రాఁగలది,

నేపునకు నతీతానాగతవర్తమానంబులుం దనకు జ్ఞానగోచరంబు లగుటయుఁ దెలివినొంది యతిప్రసన్నహృదయుండును సకలజనశ్రవణానందవచనరచనా విశారదుండును నై యిట్లనియె. 34

వాసుదేవశబ్దనిర్వచనము.

క. విను మైత్రేయ జగంబులు, దనలోనను జగములోనఁ దానును వసియిం
చునిమిత్తంబునఁ జూమ్మీ, యనఘాత్ములు వాసుదేవుఁ డండ్రు ముకుందున్. 35

ఆ. అట్టివాసుదేవుఁ డఖిలంబుఁ దనరూప, మై వెలుంగు నీచరాచరములు
లేక సర్వశూన్యమై కనుపట్టెడు, నపుడు కాలపురుషుఁడై చెలంగు. 36

మ. అమలం బచ్యుత మప్రమేయ మఖిలవ్యాపార మాద్యంతశూ
న్య మశేషంబు సమస్తముం దనమయంబై మించి వర్తించుఁ గా
లము కాలం బన వాసుదేవునకు లీలారూప మాకాలరూ
పము నిత్యంబు దివానిశాప్రకృతిఁ జూపట్టుః మునీంద్రోత్తమా. 37

ఆ. విను మనాదినిధనుఁడును విశ్వమయుఁడును, నైనవాసుదేవుఁ డనఁగఁ గాల
పురుషుఁ డనఁగ వేదములమున్ను వెనుకయుఁ, జెప్పలేదు విత్తు చెట్టునట్లు. 38

వ. అట్టివాసుదేవుండు కాలరూపధరుండును నిరపాయశీలుండును నిర్వికారాకారుండును నిరాలంబవర్తియును నిష్కళంకతేజుండును నైననతనియందును. 39

మ. దినముల్ రాత్రియు భూనభోంతరముల్ తేజోంధకారంబుల్
ఘనశీతోష్ణము లాదియౌ నొకటియుం గా కంతయుం దానయై
జననంబొందెఁ బ్రధానపూరుషుఁడు శశ్వద్బోధ్యబోధానువ
ర్తనవృత్తిం బ్రకృతిస్వరూపమహిమల్ రంజిల్లి విప్రోత్తమా. 40

ఆ. ఆప్రధానపురుషుఁ డన వాసుదేవస్వ, రూప మతఁడు కాలరూపవృత్తి
సర్గకాలవేళ సంక్షోభ మొనరింప, నందు శబ్ద ముదయమయ్యెఁ జూవె. 41

---

విశారదుఁడు = నిపుణుఁడు. 35 అనఘాత్ములు = పాపములేని మనసుకలవారు. 36 చరాచరములు=చరములునుఅచరములును. (చరములు=తిరిగెడి మనుష్యాదులు,అచరములు=తిరుగని వృక్షాదులు.) 37 అమలము=నిర్మలము, అచ్యుతము = చ్యుతిలేనిది, (చ్యుతి=జాఱుట - నాశము,) అప్రమేయము= ఇట్టిదని నిశ్చయింపరానిది, ఆద్యంతశూన్యము = మొదలు తుదలులేనిది, అశేషము = మిగులులేనిది, దివానిశాప్రకృతిః=పగలు రేయి యను స్వభావముతో, చూపట్టుః = కనఁబడును. 38 అనాదినిధనుఁడు = పుట్టుకయు చావు లేనివాఁడు, విశ్వమయుఁడు = ప్రపంచస్వరూపుఁడు. 39 నిరపాయశీలుఁడు = అపాయములేని మంచినడవడికలవాఁడు, నిర్వికారాకారుండు = వికారములేని ఆకృతిగలవాఁడు, నిరాలంబవర్తి = అవలంబములేక వర్తించువాఁడు, నిష్కళంకతేజుఁడు = కళంకములేని తేజస్సుకలవాఁడు. 40 శశ్వద్బోధ్యబోధానువర్తనవృత్తిః = మేలైన బోధింపఁదగిన బోధమును అనువర్తించునట్టి వ్యాపారముచేత. 41 సర్గకాలవేళః = సృష్టికాలమైనసమయమందు.

## సృష్టిక్రమము.

వ. అట్టిశబ్దతత్త్వంబువలన నాకాశతత్త్వంబు పుట్టె నయ్యాకాశంబునకు శబ్దంబు గుణం బయ్యె నాశబ్దంబునకు స్పర్శంబు తన్మాత్రగుణంబయ్యె నాస్పర్శగుణంబు వలన వాయుతత్త్వంబు పుట్టె నవ్వాయువునకు రూపంబు తన్మాత్రగుణంబయ్యె నా రూపంబువలన వహ్నితత్త్వంబు పుట్టె నావహ్నికి రసంబు తన్మాత్రగుణంబయ్యె నారసగుణంబువలన నుదకతత్త్వంబు పుట్టె నయ్యుదకంబునకు గంధంబు తన్మాత్ర గుణంబయ్యె నాగంధంబువలన భూమితత్త్వంబు పుట్టె నాభూమికి శబ్దాదులేనును తన్మాత్రగుణంబులయ్యె నివ్విధంబున. 42

క. ఈపంచభూతములు దమ, లోపలిశబ్దాదిగుణములు ప్రవర్తింపఁగ
వ్యాపించి విశ్వమయమై, చూపట్టుట విష్ణుశక్తి చూవె నరేంద్రా. 43

వ. అట్టిపృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లనుభూతపంచకంబును, శబ్దస్పర్శరూపరసగంధంబు లనుగుణపంచకంబును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబు లనుబుద్ధీంద్రియ పంచకంబును, వాక్పాణిపాదపాయూపస్థ లనుకర్మేంద్రియపంచకంబును, మనోబుద్ధ్యహంకారంబులతోడ రాజసతామససాత్వికగుణోద్రిక్తంబుగాఁ బ్రజాసృష్టి విస్తరిల్లె. 44

ఉ. ఈవిధమై నిరస్తగతి నేచినయిన్నియు నాదిభూతముల్
గావున నీప్రపంచ మనఁగా నొకదేహము దేహధారి ల
క్ష్మీవసుధాకళత్రుఁ డగుకేశవుఁ డాతఁడు గాని వెవ్వియుఁ
లేవు తదీయకృత్యముల లీలలు సూవె చరాచరస్థితుల్. 45

క. ఈసకలభూతసర్గ, వ్యాసక్తిం దగిలి విశ్వమంతయుఁ దానై
భాసిల్లువాసుదేవుఁడు, శ్రీసంపద మెఱసి యేమిచెప్ప మునీంద్రా. 46

క. ఈయాదిభూతసర్గ, శ్రీయంతయు వాసుదేవుచేత వినోద
ప్రాయమున విస్తరిల్లెఁ జుఁమీ యబ్జభవాండసృష్టి యింకను వినుమా. 47

మ పరమాత్ముండును బంచభూతమయుఁడుఁ బ్రహ్మణ్యుఁడుఁ దానయై
హరినారాయణమూర్తి తా ననుపమంబై యొప్పి యంభోధిపై
నురగాధీశ్వరతల్పుఁడై మెఱసి తా నున్నప్పు డాత్మీయమూ
ర్తి రజోవృత్తి వహింప మానసమునఁ దీపించె సర్గక్రియల్. 48

వ. అంత. 49

మ. అమలంబై జలబుద్బుదప్రతిమమై యంభోధిలో నొక్కయం

45 నిరస్తగతిఁ = తడఁబడినవిధముగా, ఏచిన=విజృంభించిన, లక్ష్మీవసుధాకళత్రుఁడు = శ్రీభూములు భార్యలుగాఁ గలవాఁడు. 46 భూతసర్గవ్యాసక్తిఁ = భూతసృష్టివ్యాసంగమును, తగిలి = పూని. 48 బ్రహ్మణ్యుఁడు = వేదోక్తాచారములను నడపువాఁడు. ఉరగాధీశ్వర తల్పుఁడు= శేషశయ్య గాఁగలవాఁడు, ఆత్మీయమూర్తి = తనదైన ఆకృతి, సర్గక్రియలు = సృష్టికార్యములు. 50 జల బుద్బుద ప్రతిమము = నీటిబుగ్గతో సమానమైనది, నిరూఢధ్వాంతమధ్యంబునఁ ... దటము



డము జన్మించి క్రమక్రమంబున నిరూఢధ్వాంతమధ్యంబునన్
సుమహత్త్వంబున నుండె దాని వెలి నస్తోకంబులై వారివ
హ్నిమరుద్విష్ణుపదంబు లావృతములై యేపారె గాఢంబుగన్. 50

క. ఆనాలుగుభూతంబులు, మానుగ నొక్కొకటి యేనునూఱులు పొదువన్
బానీయంబునఁ దేలుచుఁ, గానంబడు నారికడపుకాయయుఁబోలెన్. 51

తే. అట్టియండంబులోన మహానుభావుఁ, డైనవిష్ణునిరాజసం బవతరించి
సర్గకారణకర్తయై సంభవించె, బ్రహ్మదేవుండు నా నొక్కభవ్యమూర్తి. 52

ఉ. ఆతనిగుల్ఫకంబు కనకాద్రిజరాయువు ధారుణీధర
వ్రాతము గర్భవారిజల రాసులు మూర్తివిశేష మున్నత
జ్యోతియునై వెలుంగ మధుసూదనుఁ డంతకుఁ దాన కర్తయై
యాతతశక్తిపెంపున నజాండము మున్ సృజియించెఁ బెంపుతోన్. 53

ఉ. అట్టియజాండమధ్యమున నచ్యుతు రాజస మబ్జగర్భుఁడై
పుట్టి సృజించు లోకములఁ బూర్వపుతత్త్వము విష్ణురూపమై
నెట్టన భూతరాసులకు నెమ్మి యొనర్చుఁ దమంబు రుద్రుఁడై
పుట్టి చరాచరప్రళయముల్ వెసఁ జేయు ననేకభంగులన్ 54

క. ఇమ్మెయి బ్రహ్మాండప్రళ, యమ్ము లనేకములు సనియె నవియెల్ల వినో
దములు నారాయణునకు, నమ్మహిమలఁ జెప్ప బ్రహ్మకైనను వశమే. 55

వ. అనిన మైత్రేయుం డతని కిట్లనియె. 56

క. నిర్గుణుఁడని శ్రీరమణు న, నర్గళముగఁ జెప్పు వేద మట్టివిభుం డీ
సర్గస్థిత్యంతము లగు, మార్గములం జెందు టేమి మహిమ మునీంద్రా. 57

చ. అనినఁ బరాశరుం డనియె నంబుజనాభున కీజగంబు లె
ల్లను జననస్థితిప్రళయలక్షణవృత్తులఁ బొందఁజేయుటన్
విను సహజంబుగాని మఱివేఱొకచందము గాదు వహ్నికిన్
ఘనతరమయినయుష్ణము జగన్నుత నైజము నొప్పు చాడ్పునన్. 58

---

గా కమ్ముకొన్న చీఁకటినడుమ, వారి=జలము, వహ్ని=అగ్ని, మరుత్=వాయువు, విష్ణుపదము = ఆకాశము, ఆవృతములు = ఆవరించినవి - కమ్ముకొన్నవి. 51 మానుగన్ = క్రమముగా, పానీయంబునన్=జలమునందు, నారికడపుకాయ = టెంకాయ. 53 గుల్ఫకము = గుల్ఫము - చీలమండ, కనకాద్రి=మేరుపర్వతము, జరాయువు=మావి, ధారుణీధరవ్రాతము = కొండలసమూహము, ఉన్నత జ్యోతి=గొప్పతేజస్సు, ఆతతశక్తి పెంపునన్ = మిక్కుటమైన బలముయొక్క అతిశయముచేత, అజాండమున్=బ్రహ్మాండమును, పెంపుతోన్=మహిమతో. 54 నెట్టనన్=క్రమముగా, నెమ్మి=మేలు - రక్షణమనుట. 57 నిర్గుణుఁడు = త్రిగుణవ్యాపార శూన్యుఁడు, అనర్గళముగన్ = అడ్డిలేక, సర్గస్థిత్యంతములగు మార్గములన్ = సృష్టిస్థితిసంహారములైన నడవళ్లను, 58 సహజంబు=తనతోడఁబుట్టినది - సాధారణవృత్తియనుట, నైజము నొప్పుచాడ్పునన్ = స్వభావగుణముగా ఒప్పు

వ. అదియట్లుండె నారాయణాభిధానంబునకు నిర్వచనంబుఁ జెప్పెద. 59

నారాయణశబ్దనిర్వచనము.

క. నారములు నాఁగ నుదకము, చారుతరాయనము నాఁగ సంచారం బా
నీరధిశయనుని కిమ్మెయి, నారాయణుఁ డనఁగ దివ్యనామము గలిగెన్. 60

తే. అట్టినారాయణుం డైనయాదిమూర్తి, భూతరాసులనెల్లను బుట్టఁజేయఁ
దాఁ బ్రజాపతిరూపంబుఁ దాల్చి నూఱు, హాయనంబులుపరమాయువై జనించు.

తే అబ్జగర్భునిపరమాయు వైననూఱు, వత్సరంబులలో మనవంటివార
లకుఁ దలంప ననేకకాలములు వోవు, నట్టికాలక్రమము విను మనఘచరిత. 62

నిమేషాదిమహాకల్పపర్యంతకాలవిభాగక్రమము.

సీ. లఘు వుచ్చరించుకాలము నిమేషం బగు నవి పదునెనిమిదియైన కాష్ఠ
కాష్ఠలు ముప్పది కళ కళ లన్నియ క్షణమగుఁ బండ్రెండుక్షణము లొకము
హూర్తము త్రింశన్ముహూర్తంబు లొకయహోరాత్రకం బయ్యహోరాత్రపంచ
దశకంబు పక్షంబు తద్ద్వితయంబు మాసంబు మాసద్వితయంబు ఋతువు

తే. అయనమగు మూఁడుఋతువుల నవియు నుత్త
రాయణంబును మఱిదక్షిణాయనంబు
ననఁగ నవి రెండు వత్సరంబై తనర్చు
నది యహోరాత్రమై చెల్లు నమరులకును. 63

వ. అది సౌరమానం బనంబడు నివ్విధంబున. 64

సీ. పదియేడులక్షలపై నిరువదియెనిమిదివేలవర్షముల్ మొదలియుగము
సమలుపండ్రెండులక్షలమీఁదఁ దొంబదియాఱుసహస్రంబులయ్యెఁ ద్రేత
యష్టలక్షలమీఁద నిరువదినాలుగువేలేండ్లు ద్వాపరవేళ చెల్లె
మొగి నాల్గులక్షలు ముప్పదిరెండువేలబ్దముల్ కలియుగమై తనర్చు

తే. నోలి నాలుగుయుగములు నొకదివ్య
యుగము నాఁ జను నమ్మహాయుగము సంఖ్య
వెలయ నలువదిమూఁడులక్షలు నిరువది
వేలహాయనములు గల్గి విప్రముఖ్య. 65

తే. ఇట్టియుగములు వేయివోయినపితామ, హునకు నాలుగుజాములదినము వోవు
నిండు నన్నూటముప్పదిరెండుకోట్ల, హాయనంబుల వర్తిల్లు నాదినంబు. 66

క. అంతియకాలము వాణీ, కాంతునిరాత్రియును దానిఘస్రము లామ

---

నట్లు. 59 నిర్వచనము - అర్థ వివరణము. 60 నీరధిశయనునికిఁ = సముద్రమునందు శయనించిన వానికి - వటపత్రశాయియైన విష్ణుమూర్తికి. 61 హాయనము = సంవత్సరము, పరమాయువు = పూర్ణాయుస్సు, 63 త్రింశన్ముహూర్తంబులు = ముప్పదిముహూర్తములు, పంచదశకము=పదియేను, అహోరాత్రము=పగలు రాత్రియు. 64 సౌరమానము=సూర్యుని - తిరుగుటచేత అగునట్టి కాలపరిమాణము, 65 సమలు=సంవత్సరములు' 67 ఘస్రము=పగలు.

న్వంతరములు పదునాలుగు, సంతతమును జెల్లుచుండు సరియై యెందున్. 67

క. ఒక్కొక్కమనువు డెబ్బది, యొక్క మహాయుగము లింతయును నేలు సుధా
భుక్కులము మునులు నింద్రులు, నక్కాలమునందు మనువులట్ల మునీంద్రా. 68

ఆ. మనువు మనువు మాని మనువు వచ్చినదాఁక, నంబురాసు లేకమై చెలంగు
నట్టిప్రళయకాల మాదియుగప్రమా, ణాబ్దకాలమయ్యె ననఘచరిత. 69

క. వినుము పితామహ్నదివసం, బును సృష్టియు రాత్రి ప్రళయమును బాటిల్లున్
మునివర యిది నైమిత్తిక, మనుకల్పం బిట్లచెల్లు ననవరతంబున్. 70

క. ఇట్టిదినంబులు ముప్పది, నెట్టనఁ బద్మజున కొక్కనెల యట్టినెలల్
గట్టిగఁ బంద్రెండగు సమ, మట్టిసమలు నూఱు బ్రహ్మాయాయుస్సు సుమీ. 71

తే. అది మహాకల్పమై చెల్లు నంబుజాత, భవుని ప్రథమపరార్థంబు పద్మకల్ప
మగు ద్వితీయపరార్థంబు దగు వరాహ, కల్ప మిప్పాట వర్తిల్లుఁ గాలగతులు.

క. కల్పాదులఁ బరమేష్ఠియు, నల్పీకృతసత్వయుక్తుఁడై లోకంబుల్
కల్పించును నారాయణ, కల్పంబగు దివ్యమూర్తిఁ గైకొని గరిమన్. 73

క. అనవుడు మైత్రేయుం డి, ట్లనుఁ గల్పాదిని బయోరుహాసనుఁ డేలా
గున లోకము సృజియించెను, మునుకొని నారాయణత్వమున సాత్వికుఁడై. 74

## శ్రీమన్నారాయణుండు వరాహరూపంబునొంది సముద్రమగ్నంబై యున్న భూమిని నుద్ధరించుట.

వ. అనిన నతం డిట్లనియె నతీతకల్పావసానకాలంబున నిశాకాలనిద్రాప్రబుద్ధుం డైన బ్రహ్మదేవుండు పరమసాత్వికుండును నారాయణధ్యానసమాధానమానసుం డును నై పరమశూన్యం బైనలోకం బాలోకించి తొల్లింటిమత్స్యకూర్మావతా రంబులచందంబున మహావరాహరూపంబు ధరియించి యగాధం బైనపాథోని ధానంబున మునింగినవసుంధర నుద్ధరింపం దలంచి యమ్మహార్ణవంబుఁ బ్రవేశించి.

శా. భూదారాధిపుఁ డుగ్రఘుర్ఘురరవంబుల్ నింగిఁ బొంగార హే

---

68 సుధాభుక్కులము = దేవతాసమూహము. 69 మనువు మాని=జీవితకాలముపోయి-గతించి. 72 ఇప్పాటన్=ఈచొప్పున. వర్తిల్లున్=ఉండును. 73 పరమేష్ఠి=బ్రహ్మ, అనల్పీకృతసత్వయుక్తుఁడై=అధికముగాఁజేయఁబడిన సత్వగుణముతోఁ గూడినవాఁడై, కల్పించున్=సృజించును, నారాయణకల్పము=నారాయణమూర్తితో తుల్యము, గరిమన్=గురుత్వముతో-మహిమతో. 74 పయోరుహాసనుఁడు=బ్రహ్మ, సాత్వికుఁడై = సత్వగుణయుక్తుఁడై. 75 అతీతకల్పావసానంబునన్ = కడచిన కల్పము ముగియుకయందు, నిశాకాలనిద్రాప్రబుద్ధుండు = రాత్రికాలమునందలి నిద్రవలన మేలుకొన్నవాఁడు, ఆలోకించి=చూచి, అగాధము = మిక్కిలి లోఁతుగలది, పాథోనిధానంబునన్ = సముద్రమునందు, వసుంధరన్=భూమిని, ఉద్ధరింపన్ = మీఁదికెత్తను, మహార్ణవము = గొప్పసముద్రము 76 భూదారాధిపుఁడు = వరాహప్రభువు, నింగిన్ = ఆకాశమునందు, పొంగారన్=ఉప్పొంగఁగా-

లాదరోద్ధతశక్తియుక్తి నవలీలఁ గహ్వరిం జేరి దం
ష్ట్రాదండంబునఁ గ్రుచ్చి యెత్తె నఖిలాశావిహ్వలీభూతసం
పాదస్ఫారసటాకలాపనిబిడప్రక్రీడసంధిల్లఁగన్. 76

క. ధరణీచక్రము నీగతి, వరాహదేవుఁడు మహార్ణవంబునఁ దేల్చెన్
శరనిధి మునిఁగిననావను, దరిఁజేర్పఁగఁ దెచ్చుకర్ణధారుఁడుఁబోలెన్. 77

క. నాళీకదళము సరసిం, దేలినచందమున వసుమతీసతి జలధిం
దేలిన నుదకంబులుపా, తాళతలంబునకుఁ జనియెఁ దద్రంధ్రములన్. 78

క. సూకరవరఘోణోద్గత, భీకరవాయువులవలనఁ బృథ్వీస్థలిపైఁ
బైకొన్న యడుసుఁ బడుసున్, లేక కడున్ సుపథగతిగలిగె నెల్లెడలన్. 79

మ. ధరణీమండల మమ్మహాంబునిధిమీఁదన్ నిల్పి నల్దిక్కులన్
ధరణీధ్రంబులు గెంటకుండ నిడి యాధారంబుగాఁ గచ్ఛపే
శ్వరశేషాహుల క్రిందఁ బూన్చి మఱి విశ్వవ్యాపియై యింతయున్
భరియింపం దనవిశ్వశక్తి నునిచెం బద్మాక్షుఁ డత్యున్నతిన్. 80

## నారాయణుండు బ్రహ్మరూపంబుదాల్చి దేవాసురమనుష్యాదుల సృజించినక్రమము.

వ. ఇవ్విధంబున వసుంధరాచక్రంబు నిర్వక్రపరాక్రమంబున నుద్ధరించి యన్నారాయణుండు ప్రజాపతిబ్రహ్మరూపంబు ధరించి రాజసగుణోద్రిక్తుండై సకలసరిత్సాగరపర్వతద్వీపంబులును దేవాసురమనుష్యపితృలోకంబులును గరుడగంధర్వసిద్ధవిద్యాధరపశుపక్షిమృగాది నానావిధభూతజాలంబులును మొదలుగాఁ గలచరాచరంబుల బురాతనసర్గంబులచందంబున నిర్మించి గుణరూపస్వభావచేష్టలు గలుగునట్లుగా నొనరించె ననినవిని మైత్రేయుం డిట్లనియె. 81

క. మునివర సంతోషముగా, వినిపించితి బ్రహ్మసృష్టి విస్తారముగా
వినవలయు ననిన వాసి, ష్ఠనందనుఁడు వినిచె వేడ్కఁ జతురప్రౌఢిన్. 82

---

వ్యాపింపంగా, హేలాదరోద్ధతశక్తియుక్తిన్ = విలాసరూపమైన గర్వముచేత నిక్కినబలముతో, అవలీలన్ = అనాయాసముగా, గహ్వరిన్=భూమిని దంష్ట్రాదండంబునన్=కోఱపల్ల నెడు దుడ్డుకఱ్ఱతో, అఖిలాశావిహ్వలీభూతసంపాదస్ఫారసటాకలాపనిబిడప్రక్రీడ=ఎల్లదిక్కులుచేష్టలు తక్కినవి యగునట్టి (విధమును) కలిగించునట్టి నిక్కబొడుచుకొన్న పెడవెండ్రుకల సమూహముచేత అతిశయించిన మేలైనఆట్లాట, సంధిల్లఁగన్ = కలుగఁగా. 77 ధరణీచక్రమున్ = భూమండలమును, శరనిధిన్= సముద్రమునందు, కర్ణధారుఁడు = ఓడనడుపువాఁడు. 78 నాళీకదళము = తామరపాకు, సరసిన్= సరస్సునందు. 79 సూకరవరఘోణోద్గత భీకరవాయువులవలనన్ = వరాహమూర్తియొక్కముట్టెవలన మీఁదికివ్యాపించిన భయంకరమైనవాయువులచేత. పైకొన్న=అతిశయించిన, సుపథగతి=మంచిత్రోవవిధము. 80 ధరణీధ్రంబులు=కొండలు, గెంటకుండన్=చలింపకయుండ, కచ్ఛపేశ్వరశేషాహులన్ = ఆదికూర్మమును ఆదిశేషునిని, విశ్వవ్యాపి = అంతట వ్యాపించినది, విశ్వశక్తిన్ = సర్వశక్తిని. 81 ప్రజాపతి బ్రహ్మరూపంబు = దక్షాదిప్రజాపతులయొక్కయు బ్రహ్మయొక్కయు రూపమును, ఉద్రిక్తుఁడు = ఉద్రేకించినవాఁడు = విజృంభించినవాఁడు, సరిత్సాగరపర్వత ద్వీపంబులును = ఏళ్లసముద్ర

క. విను వత్స యాదికాలం, బున బ్రహ్మ ప్రజాపతిత్వమునఁ జతురాస్యుం
డును రాజసగుణసంవ, ర్ధనుఁడును నై నిలిచి సావధాన ప్రౌఢిన్. 83

వ. సృష్టిఁ జింతించునప్పుడు బుద్ధిపూర్వకంబు గాని ధ్యానంబునఁ దమోమయంబును తమోమోహంబును మహామోహంబును దమిస్రంబును నంధతమిస్రంబునుఁ బుట్టె నయ్యేనును జగంబులకు ముఖ్యభూతంబు లయ్యుం దనకు సాధనంబులు గాకున్న మఱియును. 84

క. ఆనలినగర్భుఁ డాత్మ, జ్ఞానాజ్ఞానములఁ దామసం బగుతిర్య
గ్ధ్యానము తిర్యక్స్రోతం, బై నెగడెను దానఁ బశుమృగాదులు పుట్టెన్. 85

ఆ. కమలభవునిసాత్వికము సుఖప్రీతుల, వెలసి కడుఁ బ్రకాశవృత్తి నూర్ధ్వ
మగుట నట్టియూర్ధ్వ మైన స్రోతంబునఁ, బొదలె నందు నమరు లుదయమైరి. 86

తే. రాజసోద్రిక్తమఁను దమోరంజితంబు, నై ప్రకాశబాహుళ్యత నమరు నజుని
తలఁ పధోగతి వర్తింపఁ దాన మనుజు, లవతరించి రవాక్స్రోత మయ్యె నదియు.

క. ఆవనజసంభవుని నిఖి, లావయవంబుల జనించె నత్యున్నతితో
దేవాసురపితృమనుజో, చ్చావచభూతములతోడిసచరాచరమున్. 88

వ. మఱియు నానావిధంబు లగుచరాచరభూతజాలంబులు పురాతనసర్గంబులచందంబున వారివారికర్మంబులు కారణంబులుగా నుద్భవించి హింసాహింసలును మార్దవక్రౌర్యంబులును నిందానిందలును ధర్మాధర్మంబులును సత్యాసత్యంబులును జ్ఞానాజ్ఞానంబులునుం గలిగి యింద్రియవ్యవహారంబులం దగిలి నానావిధంబు లగు రూపంబులును వర్తనజాతిస్వభావచేష్టాగుణంబులును తత్తత్ప్రకారంబులు నేర్పడునట్లుగా సృజించె ననిన విని మైత్రేయుం డిట్లనియె. 89

క. మనుజుల నర్వాక్స్రోతులె, యని చెప్పితి వారు బ్రహ్మయంగమ్ముల నే
యనువున నేగుణములతో, జనియించిరి చెప్పవయ్య సన్మునితిలకా. 90

వ. అనినం బరాశరుం డిట్లనియె. 91

సీ. సాత్వికోదయుఁ డైనశారదావల్లభువదనంబులను విప్రు లుదయమైరి
రాజసోన్నతుఁ డైనరాజీవగర్భునిభుజములఁ బుట్టిరి భూమిభుజులు
రాజసతామసప్రకృతిఁ జెందినవిధి యూరులయందు వైశ్యులు జనించి
రతితామసోద్రిక్తుఁ డైనప్రజాపతిపదముల శూద్రు లుద్భవము నొంది

ఆ. రిట్లు వెలయువీరి కెల్ల వేదాధ్యయ, నంబు భూమిపాలనంబు కృషియు
విప్రభక్తి మఱియు విహితకర్మంబులై, యవనియందుఁ బరఁగె ననఘచరిత. 92

---

ములు కొండలుదీవులును, పురాతనసర్గంబుల చందంబునన్ = పూర్వసృష్టులవలె 83 చతురాస్యుఁడు= నలువ - బ్రహ్మ సంవర్ధనుఁడు = చక్కఁగా వృద్ధిపొందినవాఁడు 84 ఏను = అయిదు. 95 నలిన గర్భుఁడు = బ్రహ్మ, స్రోతము = ప్రవాహము. 87 ప్రకాశబాహుళ్యతన్ = ప్రకాశాతిశయము చేత, 88 ఉచ్చావచ = నానావిధములైన. 89 మార్దవక్రౌర్యములు = మృదుత్వక్రూరత్వములు.

క. ఇలఁ బరఁగినయీనాలుగు, కులములమానవులు సాధకులు క్రతుతంత్రం
బులకు నటుగాన వీరలు, వలయుఁ జుమీ యజ్ఞముల కవశ్యం బనఘా. 93

తే. యజ్ఞములచేత నమరు లాప్యాయనంబుఁ
బొందుదురు దేవతలకు నానందమైన
నఖిలమునకుఁ బ్రజావృద్ధి యవనిఁ గల్గుఁ
గానఁ గ్రతువులు కల్యాణకారణములు. 94

చ. బలువిడిఁ బాపకర్మములపై మనమూఁదక దుర్జనక్రియల్
దలఁపక ధర్మమార్గములు దప్పక నిందలు వచ్చుత్రోవలన్
మెలఁగక యెల్లవారుఁ దమమెచ్చఁగ నొచ్చెము లేకయుండుమ
ర్త్యులు దలపోయ దేవతలతో సరివత్తురు గాక తక్కువే. 95

క. మానవులు దాము చేసిన, దానఫలంబులను దేవతలకు నగమ్యం
బై నయపవర్గభోగం, బానందముతోడఁ గాంతు రతిసులభమునన్. 96

వ. మఱియు సమ్యక్ఛ్రద్ధాసమాచారప్రవణులును యథేచ్ఛాచారరతులును సర్వ
బాధావివర్జితులు నంతఃకరణశుద్ధులు నైనవిష్ణుభక్తిపరాయణులు తమతమపూర్వ
జన్మంబులం జేసినపుణ్యఫలంబులు కారణంబులుగాఁ గొందఱు మానవులు
బ్రహ్మచేత నిర్మింపఁబడుదురు. 97

ఉ. తామసలోభమోహమదతాపములం బడి పుణ్యసంశ్రయం
బేమియు లేక రోగముల నింద్రియముల్ పెనుపంగ ద్వంద్వదుః
ఖామయబాధలం దగిలి యెంతయుఁ గాననిపాతకంబులం
బామరులైనమానవులఁ బద్మభవుండు సృజించుఁ గొందఱన్. 98

ఉ. కొందఱు పుణ్యవంతులును గొందఱు కేవలపాపకర్ములుం
గొందఱు రాజులున్ భటులు గొందఱుఁ గొందఱు మాననీయులుం
గొందఱు సంపదున్నతులు గొందఱు పేదలు నైనయట్లుగా
నందఱ నన్నిచందముల నబ్జభవుండు సృజించె మర్త్యులన్. 99

---

94 ఆప్యాయనము=ఊఱట. 95 బలువిడిన్=మిక్కిలి విజృంభణముతో, ఊఁదక=నిలుపక, ఒచ్చెము=తక్కువ, మర్త్యులు = మనుష్యులు, సరివత్తురు = సరిపోలుదురు. 97 సమ్యక్ఛ్రద్ధాసమాచారప్రవణులు=మేలైనశ్రద్ధతోడి వృత్తియందు ప్రీతికలవారు, యథేచ్ఛాచారరతులు=ఇచ్చవచ్చినట్టు ప్రవర్తించుటయందు ఆసక్తులు, సర్వబాధావివర్జితులు = ఎల్లకష్టములచేతను విడువఁబడినవారు - కష్టములేనివారనుట, అంతఃకరణశుద్ధులు = మనశ్శుద్ధిగలవారు = నిర్మలచిత్తులనుట. 98 పుణ్యసంశ్రయము=పుణ్యముయొక్క ఆశ్రయించుట - పుణ్యముయొక్క కలిమి, పెనుపంగన్ = పెంచఁగా, ద్వంద్వదుఃఖామయబాధలన్ = (పుణ్యపాపములు శీతోష్ణములు శత్రుమిత్రులు అనెడు) ద్వంద్వములవలనిదుఃఖము లనెడు రోగబాధలను, తగిలి = అంటి-పొంది, పామరులు = అజ్ఞానులు. 99 మాననీయులు = పూజ్యులు, సంపదున్నతులు = సంపదచేత అధికులు, మర్త్యులన్ = మనుష్యులను.

సీ. అన్యోన్యధనకాంక్షులై పోరుధరణీశులకు నెల్ల నాడ కాడకును శైల
దుర్గంబులను వనదుర్గంబులను జలదుర్గంబులను మహీదుర్గములను
బుట్టించి వారికిఁ బురములుఁ దగినయావరణంబులును గృహావళులు నస్త్ర
శస్త్రాదిసంగరసాధనంబులు రథవారణహయభటావళులుఁ దగిన
తే. చటులచతురంగబలములు సంపదలును
గ్రామములుఁ బొలిమేరలుఁ గాణయాచి
దేశములు మరియాదలు దేటపడఁగ
నబ్జగర్భుండు గల్పించె నాదియందు. 100
తే. శీతవాతోష్ణబాధలచేత నరులు, నలఁగకుండంగ నుపకరణములు దగిన
భంగి సృజియించి భూషణాంబరవిలేప, నాదులెల్లను గల్పించె నవ్విధాత. 101
క. ఒక్కొకపని సాధింపఁగ, నొక్కొకసాధనము గల్గి యుండఁగఁజేసెఁ
బెక్కువిధంబులయుపమల, నక్కమలాసనునిబుద్ధి యది యెట్టిదొకో. 102
క. పైరును వ్యవహారంబును, గోరక్షయు యాచనంబుఁ గూలియు సేవా
పౌరుషము లాదిగాఁగల, కారణముల నరుల బ్రతుకఁగాఁ గల్పించెన్. 103
వ మనుష్యులకు జీవనోపాయంబులుగా వ్రీహులును, గోధూమంబులును, యవ
లును, అణువులును, తిలలును, ప్రియంగువులును ఉదారంబులును, కోద్రవంబు
లును, సతీనకంబులును, మాషంబులును, ముద్గంబులును, మసూరంబులును,
నిష్పావంబులును, కుళుత్థంబులును, ఆఢక్యంబులును, చణకంబులును, శణంబు
లును అనుధాన్యంబులు పదియేడు గల్పించె నందుఁ గోద్రవంబులును, కుళు
త్థంబులును, చణకంబునుం దక్కఁ దక్కినపదునాలుగు ధాన్యంబులును యజ్ఞం
బులకు యోగ్యంబులని పురాణవిదులచేతఁ జెప్పంబడు. ఈధాన్యంబులచేత
యజ్ఞకర్మంబులు నడచు, యజ్ఞంబులచేత మహీతలంబున సస్యసమృద్ధంబగుఁ
గావున ధాన్యంబులు మానవులయట్ల యజ్ఞంబుల కవశ్యంబులై యుండు నని
చెప్పి మఱియు నిట్లనియె 104

100 అన్యోన్యధనకాంక్షులు=ఒకరొకరిధనము నపేక్షించువారు, పోరు=కలహించు, దుర్గము=అగడ్త మొదలగువానిచే చొరరానికోట మొదలగునది. ఇక్కడ ఇతరులకు చొరరానిచోటు అనియర్థము. ఆవరణంబులు = వెలుగుమరుగు మొదలగునవి, సంగరము = యుద్ధము, వారణము = ఏనుఁగు, కాణయాచి=నిక్షేపము, మరియాద = మేర, తేటపడఁగన్ = విశదమగునట్లు. 101 విలేపనము = పూఁత విధాత=బ్రహ్మ. 102 ఉపమలన్ = ఉపాయములచేత. 103 పైరు=పైరుపెట్టుట-సేద్యము, వ్యవహారము=వర్తకవ్యాపారము, పౌరుషము = పురుషప్రయత్నము=ఒకనికొలువుచేయక జీవించుట, యనుట. 104 వ్రీహులు=వడ్లు, గోధూమంబులు=గోదుములు, అణువులు=చిఱువడ్లు, తిలలు=నువ్వులు, ప్రియంగువులు=కొఱ్ఱలు, ఉదారంబులు=ఊదర్లు, కోద్రవంబులు=ఆళ్లు, సతీనకంబులు=లంకలు, మాషంబులు=మినుములు, ముద్గంబులు = పెసలు, మసూరంబులు = చిఱుసెనగలు, నిష్పావంబులు = అనుములు, కుళుత్థంబులు = ఉలవలు, ఆఢక్యంబులు = కందులు, చణకంబులు = సెనగలు, శణంబులు = జనుములు,

ఉ. అంబుజగర్భుఁ డీక్రియ నొకప్పుడు నూఁటలేక సర్వలో
కంబులఁ బ్రాణులం గడుఁ బ్రకాశమతిన్ సృజియింప శూన్యభా
వంబునఁ బొందుఁగాని బహువంశపరంపరలన్ జగంబులె
ల్లం బరిపూర్ణతామహిమలన్ విలసిల్లక యున్న వేసటన్. 105

క. తనతో సరియగువారల, ఘనులఁ బ్రజాపతుల మునులఁ గల్పించి జగం
బునను బ్రజాపరిపూర్ణం, బొనరించెద ననుచుఁ దలఁచి యున్నతబుద్ధిన్. 106

## భృగుపులస్త్యాదులసృష్టిక్రమము.

వ. తనమానససృష్టియందు భృగుపులస్త్యపులహక్రత్వంగిరోమరీచిదక్షాత్రివసిష్ఠులన నవబ్రహ్మలం బుట్టించి మఱియు ఖ్యాతియు భూతియు సంభూతియు క్షమయుఁ బ్రీతియు సన్నతియు నూర్జయు ననసూయయు నరుంధతియు ననువారినిఁ దొమ్మండ్రు కన్యకలం బుట్టించి క్రమంబున నవబ్రహ్మలకు భార్యలం జేసె మఱియును. 107

చ. అహిమకరోపమానుల దయాపరతంత్రుల సౌష్ఠవక్రియా
మహితుల వీతరాగుల విమత్సరులన్ సనకాదిమానులన్
బహుళతమోగుణాపనయభాస్కరులన్ శమచిత్తులన్ బితా
మహుఁడు సృజించెఁ దొల్లి తనమానసపుత్రులుగా ముదంబునన్. 108

క. వారు జితేంద్రియులై సం, సారసుఖశ్రీలయందు సంయములై యి
చ్ఛారతుల బ్రహ్మవిద్యా, పారగులై చనిరి పటుతపశ్చరణలకున్. 109

క. ఆయోగీశ్వరు లీగతిఁ, బోయిన నాత్మప్రయత్నములు విఫలములై
తోయజగర్భుఁడు రోపర, సాయత్తుం డగుచు నున్నయప్పుడు కణఁకన్. 110

## రుద్రోత్పత్త్యాదికథనము.

క. కుటిలభ్రూకుటి యగుత, న్నిటలస్థలియందుఁ గానిసీసహితుండై

పురాణవిదులు = పురాణములు తెలిసినవారు. 105 ఊఁటు = నిలుపుదల, వేసటన్ = వేసరికచేత. 107 మానససృష్టి = తలఁచుటచేతనే అగుసృష్టి. 108 అహిమకరోపమానులన్ = సూర్యునిఁబోలిన వారిని, సౌష్ఠవక్రియామహితులన్ = చక్కని పనులచేత గొప్పవారైనవారిని, వీతరాగులన్ =పోయిన ఆశలుగలవారిని, విమత్సరులన్ = మత్సరములేనివారిని, తమోగుణాపనయభాస్కరులన్ = తమోగుణము నెడు చీఁకటిని పోఁగొట్టుటయందు సూర్యులైనవారిని, శమచిత్తులన్ = ఇంద్రియనిగ్రహమానసులను. 109 జితేంద్రియులు = ఇంద్రియజయముగలవారు, సంయములు=ఇంద్రియవ్యాపారములను అణఁచినవారు, ఇచ్ఛారతులన్ = ఇచ్ఛవచ్చినలీలలతో, బ్రహ్మవిద్యాపారగులు = తత్త్వవిద్యతుదముట్ట నెఱిఁగినవారు, పటుతపశ్చరణలకున్ =దృఢమైన (చలింపని) తపముచేయుటలకు. 110 విఫలములు= ఫలములేనివి-వ్యర్థములు, కణఁకన్ = పూనికతో. 111 కుటిలభ్రూకుటి = వంకరైన బొమముడి కల వాఁడు, తన్నిటలస్థలియందున్ = ఆతనినొసటిప్రదేశమునందు, నిటలాక్షుఁడు = నొసటకన్నుగల

నిటలాక్షుఁడు రుద్రుఁడు ప్ర, స్ఫుటమధ్యాహ్నార్కుఁబోలెఁ బుట్టె మునీంద్రా.

వ. ఇట్లర్ధనారీసహితుండును ప్రచండదేహుండును నై తనయం దుద్భవించినరు
ద్రునివలన వెండియు నట్టిరూపంబులు పది జన్మించె నవి స్త్రీపురుషభావంబులును
సౌమ్యాసౌమ్యంబులును శాంతాశాంతంబులును శ్యామధవళవర్ణంబులును
నై వెలయ వా రేకాదశరుద్రు లైరి మఱియును. 112

క. అంభోరుహగర్భుఁడు పటు, గాంభీర్యప్రాభవములు గల్గినమతితో
డింభకుఁ బుట్టించెను స్వా, యంభువుఁ దనవంటివాని నాదిమమనువున్. 113

క. ఆతఁడు విమలతపోని, ర్ఘాతమహాకలుష యైనతొయ్యలిఁ బుణ్యో
పేతను శతరూప నతి, ప్రీతిఁ బ్రజావృద్ధికొఱకుఁ బెండిలి యయ్యెన్. 114

తే. ఆవధూవరులందుఁ బ్రియవ్రతుండు, నాఁగ నుత్తానపాదుండు నాఁగ నిరువు
(?)రాత్మజులుఁ బ్రసూతియాకూతియనఁ గన్య, కాద్వయంబుఁబుట్టెగరిమతోడ.

క. ఆతరలాక్షులయందుఁ బ్ర, సూతిని దక్షుఁడు వరించె సుందరి యగునా
కూతిని రుచికుఁడు పరిణయ, మై తనరెను వారియందు యజ్ఞుఁడు పుట్టెన్. 116

క. ఆయజ్ఞుఁడు దక్షిణయం, దాయతమతి నర్కసంఖ్యయాములఁ బడసెన్
స్వాయంభువమనుకాలం, బాయాములు దేవగణము లైరి మహిమతోన్. 117

క. దక్షునకు సకలవిద్యా, దక్షునకుఁ బ్రసూతికిని ముదంబున జలజా
తేక్షణ లిరువదినలువురు, దాక్షాయణు లుదయమైరి తాపసముఖ్యా. 118

వ. వారియందు శ్రద్ధయు లక్ష్మియు ధృతియు తుష్టియు పుష్టియు మేధయు క్రియయు
బుద్ధియు లజ్జయు వపువును శాంతియు సిద్ధియుఁ గీర్తియు ననుపదుమువ్వురను
ధర్ముండు వరియించె. ఖ్యాతియు సతియు సంభూతియు స్మృతియు ప్రీతియు
క్షమయు సన్నతియు ననసూయయు నూర్జయు స్వాహయు స్వధయు ననుపదు
నొక్కండ్రఁ గ్రమంబున భృగుండును భవుండును మరీచియు నంగిరసుండును
పులస్త్యుండును పులహుండును క్రతువు నత్రియు వసిష్ఠుండును వహ్నియుఁ బితృ
దేవుండును వరించిరి. మఱియును. 119

మ. అనురాగం బొదవం బితామహుఁడు కల్పారంభకాలంబునం
దనతోడన్ సరియైనపుత్రకుని నుత్పాదింతు నంచున్ ముదం

---

వాఁడు, ప్రస్ఫుటమధ్యాహ్నార్కుఁబోలెన్ = చక్కఁగా వెలుఁగుచున్న పట్టపగటి సూర్యునివలె, 112 అర్ధనారీసహితుఁడు = సగము ఆఁడురూపముతోఁ గూడుకొన్నవాఁడు, సౌమ్యాసౌమ్యములు= తిన్నఁదనమును బెట్టిదమును గలవి, శ్యామధవళవర్ణంబులు = నలుపును తెలుపునైన వర్ణములుఁగలవి. 113 గాంభీర్యము=గంభీరత, ప్రాభవము = ప్రభుత్వము, డింభకునిన్ = బిడ్డని, ఆదిమమనువున్ = మొట్టమొదటి మనువును. 114 విమలతపోనిర్ఘాతమహాకలుష = నిర్మలమైన తపస్సుచేత తొలఁగఁ గొట్టఁబడిన గొప్పపాపములు గలది, తొయ్యలిన్ = స్త్రీని, పుణ్యోపేతన్ = పుణ్యముతోఁ గూడు కొన్నదానిని. 115 గరిమతోడన్ = గురుత్వముతో. 116 పరిణయమై = పెండ్లాడి. 118 సకల

బునఁ జింతింప నిజాంక దేశమున నుద్భూతంబునుం బొందె లో
కనుతుం డప్పుడు నీలలోహితుఁ డనంగాఁ బుత్త్రుఁ డత్యున్నతిన్. 120

ఆ. పుట్టి తనకుఁ బేరుపెట్టు మటంచు నా, నలువయెదుర రోదనంబు సేయ
రోదనంబుకతన రుద్రుండ వీ వని, నీరజాసనుండు పేరువెట్టె. 121

వ. వెండియు నతం డేడుమాఱు లెలుంగెత్తి యేడ్చిన వారించి యతనికి భవుండును శర్వుండును మహేశ్వరుండును పశుపతియు భీముండును నుగ్రుండును మహాదేవుండు ననునామధేయంబులు నేసి రుద్రాద్యష్టనామసహితుం డైనయతనికి సూర్యజలపృథ్వీపవనవహ్ని గగనదీక్షితచంద్రులను శరీరంబులుగా నొనర్చి యాసూర్యాదులకు సువర్చలోమాసుకేశిశివాస్వాహాదగ్దీక్షారోహిణులం గ్రమంబునఁ బత్నులం గావించె మఱియును.* 122

క. హిమగిరికిని మేనకకును, బ్రమదంబుగఁ బుట్టినట్టిపరమేశ్వరి యా
దిమశక్తిగౌరిసతియై, యమరెఁ జుమీ యష్టమూర్తి యగురుద్రునకున్. 123

ఆ. ఖ్యాతియందు భృగుఁడు ధాతృవిధాతృలు, నాఁగ సుతుల లక్ష్మి నాఁగఁ గూఁతు
నర్థితోడఁ గాంచి యట్టిమహాలక్ష్మి, బ్రియముతోడ హరికిఁ బెండ్లి సేసె. 124

వ. అనినవిని మైత్రేయుం డిట్లనియె. 125

## { క్షీరసముద్రపుత్త్రి యని ప్రసిద్ధినొందియున్నలక్ష్మీదేవి భృగుపుత్త్రి యెట్లయ్యె ననుశంకను పరిహరించుట. }

క. భృగుకన్యక యని లక్ష్మిని, దగఁ జెప్పితి వంబురాశితనయ యటంచున్
జగమెల్లఁ జెప్ప విందుము, జగదేకస్తుత్య యేమిచందం బనినన్. 126

వ. పరాశరుఁ డతని కిట్లనియె సర్వభూతమయుం డైనవాసుదేవుని మాయాశక్తి లక్ష్మీరూపంబున నతనికి సహాయయైవిహరించుం గావున జగంబులకు సంపత్కరంబు లైన పరికరంబు లెన్నిగల వన్నియును శ్రీచిహ్నంబు లనిచెప్పి మఱియు నిట్లనియె. 127

సీ. బోధబుద్ధులు శైలభూములు ధర్మక్రియలు స్రష్టృసృష్టులు జలధివేల
లును దినయామినులును హుతాగ్నిస్వాహాలును శంకరాంబికలును దినేశ్వ
రప్రభలును మఘుప్రాగ్వంశశాలలు శ్రీపతిశ్రీలును యూపచితులు
సామగీతులు సుధాధామకాంతులు నిధ్మదర్భలు మఱియజ్ఞదక్షిణలును

---

విద్యాదక్షునకున్ = ఎల్లవిద్యలయందు సమర్థుఁడై నవానికి. 122 దీక్షితుఁడు = యజమానుఁడు. 123 ప్రమదంబుగన్=సంతోషముగా 124 నాఁగన్ = అనఁగా. 125 భృగుకన్యక=భృగువు కూఁతురు, అంబురాశితనయ = సముద్రునికూఁతురు, జగదేకస్తుత్య = లోకమునకును ఒక్కఁడవయి స్తుతింపఁ దగినవాఁడా. 127 సంపత్కరములు = సంపదను కలుగఁజేయునవి, ఉపకరంబులు = ఉపకరణములు, చిహ్నములు = గుఱుతులు. 128 బోధబుద్ధులు=వివేకమ్మును బుద్ధియు, స్రష్టృసృష్టులు = సృజించువాఁడును సృష్టియు, జలధివేలలు = సముద్రమును చెలియలికట్టయు. దినయామినులు=

* అష్టమూర్తి యనునభిధానంబు చేసె మఱియున్న, - అనిపాఠాంతరము.

తే. శక్రపౌలోములును నవష్టంభశక్తు
లును నిమేషోరుకాష్ఠలు లోభతృష్ణ
లును మనోరాగవతులును లోనుగాఁగఁ
గలుగుపుంస్త్రీత్వములువిష్ణుకమల లగును. 128

మ. గరువంబారఁగ నీకు నిన్నియును వక్కాణింపఁగా నేటికిన్
సురతిర్యఙ్మనుజాదిలోకములలోఁ జూపట్టునానాచరా
చరభూతంబులయందు నందమగుస్త్రీసంజ్ఞల్ రమారూపముల్
పురుషాకారము లన్నియున్ హరిమయంబుల్ గా విచారింపుమీ. 129

ఉ. నెట్టన దుగ్ధవార్ధిని జనించి రమాసతి దైత్యవైరికిం
బట్టపుదేవియై జగతిఁ బ్రస్తుతికెక్కుట వేదచోదితం
బట్టిచరిత్ర మంబుజభవాత్మజుఁ డైనమరీచిచేత నే
గట్టిగ విన్న చందము దగన్ వినిపించెద నీకుఁ బెంపుతోన్. 130

దుర్వాసునిశాపంబువలన నింద్రునిసంపద సముద్రముపాలైపోవుట.

మ. అనసూయాపతి యైనయత్రికి సుతుండై శంకరాంశంబునన్
జననం బొంది పటుప్రచండతరశశ్వత్కోపదావాగ్ని చే
వనజాతాసనముఖ్యదేవతలగర్వంబైన వారింప నో
పినదుర్వాసుఁడు తాపసోత్తములలోఁ బెంపారు నత్యున్నతిన్. 131

శా. ఫాలాక్షప్రతిమానుఁ డమ్మునిమహాభాగుండు యోగీంద్రుఁ డై
బాలోన్మత్తపిశాచరూపముల భూభాగంబు సర్వంబు ని
చ్ఛాలంకారవిహారియై తిరిగి జంభారాతిలోకంబుఁ దా
నాలోకింపఁగఁ గోరి యొక్కఁడు వినోదార్థంబుగా నేగుచోన్. 132

మ. ఒకవిద్యాధరకాంత వాసవవిహారోద్యానహృద్యానవ
స్తబకశాఖాన్వితపారిజాతసుమనోదామంబు సౌరభ్యముల్

పగలును రాత్రియు, మఘప్రాగ్వంశశాలలు = హవిర్గృహమున కెదుటిసభాగృహములును యజ్ఞశాలలును, పుంస్త్రీత్వములు = మగతనమును ఆఁడుఁదనమును, 129 గరువంబారఁగన్ = విపులముగా, వక్కాణింపన్ = చెప్పను, చూపట్టు = కనఁబడు. 130 దుగ్ధవార్ధి = పాలసముద్రము, దైత్యవైరి = విష్ణువు, వేదచోదితము = వేదమునందు తెలుపఁబడినది, అంబుజభవాత్మజుఁడు = బ్రహ్మకొడుకు, పెంపుతోన్ = సవిస్తరముగా. 131 పటుప్రచండతరశశ్వత్కోపదావాగ్నిచేన్ = సమర్థమై మిక్కిలిపెంపైనయెడతెగనికోపమనెడి కార్చిచ్చుచేత. 132 ఫాలాక్షప్రతిమానుఁడు = శివునితో తుల్యుఁడు, మహాభాగుఁడు = మహాత్ముఁడు, బాలోన్మత్తపిశాచరూపములన్ = పసివానివంటియు పిచ్చివానివంటియు పిశాచమువంటియు ఆకృతులతో, ఇచ్ఛాలంకారవిహారి = ఇచ్ఛవచ్చినఅలంకారముతో విహరించువాఁడు, జంభారాతిలోకంబు = ఇంద్రలోకము - స్వర్గము, ఒక్కఁడును = ఒక్కఁడే. 133 వాసవ...సౌరభ్యములు = ఇంద్రునియుద్యానవనమునందలియు యింపైనదియు

సకలాశాపరిపూర్తిదైకమహిమల్ సంధిల్లఁగాఁ గొంచు స
త్త్రికుమారుం డరుదెంచుమార్గమున నేతేరంగ దౌదవ్వులన్. 133

మ. కనియెన్ మౌని శరత్సుధాకిరణరేఖాసంగ్రహస్ఫూర్తిమై
ఘనతం బొల్చువిభావరీసతిగతిన్ గల్పద్రుమామ్లానపు
ష్పనిబద్ధాంచితదామమును గొని యథేచ్ఛన్ వచ్చువిద్యాధరిన్
వినుతానంగరతిప్రసంగమహిమావిర్భూతబింబాధరన్. 134

చ పొడఁగని చేరఁబోయి మునిపుంగవుఁ డామదిరాక్షిచే బెడం
గడరెడుపువ్వుదండఁ బ్రియమారఁగ నిమ్మని సన్న చేసి త
న్నడిగిన మాఱువల్కఁగ భయంపడి చయ్యన నిచ్చి మ్రొక్కుచుం
బడఁతి నిజేచ్ఛ నేగెఁ బులిబారికిఁ దప్పినలేడికైవడిన్ 135

క. ఆదండ జడలదండను, వేదండఁ జెలంగఁ జెరివి వేదండగతిన్
వేదండముచే వీచుచు, నాదండధరారిపోలె నాడుచు వచ్చెన్. 135

వ. అట్టియెడ దేవేంద్రుండు నైరావతారూఢుండై దేవగంధర్వకిన్నరసిద్ధవిద్యాధరపతులు గొలువ నాకలోక బాహ్యంబున వాహ్యాళిగా వెడలి విహరించుచున్న సమయంబున దుర్వాసుండు దుర్వారగర్వంబున గీర్వాణవిభునిపాలికిం బోయి నీలకంధరజటామకుటమండితం బైనశశాంకరేఖయుంబోలెఁ దనజడలలోపలి మందారకుసుమదామంబుఁ గైకానుకఁగా నొసంగి దీవించిన నతం డంకుశంబున నందుకొని. 137

ఘనమైనదియు చేతపట్టుకొఁబడినదియునైన పూదండవలని పరిమళములు, సకల...మహిమలు=ఎల్ల దిక్కులనునిండిన ప్రతిలేనిమాహాత్మ్యములు, సంధిల్లఁగాన్ = కలుగఁగాన్, కొంచున్=తీసికొని, ఏతేరంగన్=రాఁగా, దౌదవ్వులన్=కడుదూరమునందు 134 శర...స్ఫూర్తిమైన్=శరత్కాలమునందలి చంద్రరేఖను (రేఖాకారమైనబాలచంద్రుని) సంగ్రహించుటవలని ప్రకాశముతో, విభావరీసతిగతిన్ = రాత్రియనెడుస్త్రీవలె, కల్పద్రు...దామమున్ = కల్పవృక్షమునందలి వాడనిపూవులచేత కట్టఁబడిన - ఒప్పిదమైనసరమును, యథేచ్ఛన్ = స్వేచ్ఛగా, వినుత...బింబాధరన్=పొగడఁదగ్గినమన్మథక్రీడావ్యాపారముయొక్క గౌరవముజనించిన (తోఁచుచున్న) దొండపండువంటి అధరముగలదానిని. 135 మదిరాక్షిచేన్ = మైకమును తోఁపించునట్టిచూపుతోడి కన్నులుగలదియైన ఆవిద్యాధర స్త్రీచేత, బెడంగడరెడు = అందమతిశయించుచున్న, ప్రియమారఁగన్ = ఇష్టము పూర్తిగాఁగా - మిక్కిలియిష్టముతో, సన్న = సంజ్ఞ, చయ్యనన్ = తటాలున, బారికిన్ = వశమునకు, 136 జడలదండను = జడలవెంబడి - జడలలో, వేదండన్ = (వేదు, అండన్) చెమటకంపుతోడ, చెరివి=తుఱిమి. వేదండగతిన్ = ఏనుఁగునడకవంటినడకతో, వేదండముచేన్ = ఏనుఁగుతొండమువంటిచేతిని, వీచుచున్ =ఊఁచుకొనుచు 137 ఐరావతారూఢుఁడు=ఐరావతమనుఏనుఁగు నెక్కినవాఁడు, నాకలోకబాహ్యంబునన్=స్వర్గలోకమునకు వెలుపల, వాహ్యాళిగాన్=షికారుగా, దుర్వార=అణఁపఁగూడని, గీర్వాణవిభునిపాలికిన్ = ఇంద్రునియొద్దకు, నీలకంధరజటామకుటమండితంబు = శివునిజడముడియందు అలంకరింపఁబడినది, శశాంకరేఖ = చంద్రరేఖ, మందారకుసుమదామంబు=

ఉ. ఏపున మూఁడులోకముల నేలెడు రాజ్యమదంబు పెంపునన్
దాపసి చూడఁగాఁ గుసుమదామము నప్పుడు భద్రదంతికుం
భోపరిఁ జుట్టెఁ జుట్టుటయు నొప్పెసలారెను రాజతాద్రిచూ
తాపరిశోభితస్థితి బెడంగగు వేలుపుటేటికై వడిన్. 138

వ. అట్టిమందారకుసుమదామాభిరామసౌరభంబులకుం జొక్కి యైరావతగండమం
డలనిష్యందదానధారావారంబులకుం జొక్కి చిక్కినచంచరీకంబు లనేకంబులు
రేఁగి మూఁగి ఝుంకారంబులు చేసిన ఘీంకారంబుతోడ నగ్గజేంద్రంబు దిగ్గన
బెగ్గడిలి తొండంబు సాఁచి పూవుదండ మహీమండలంబునం ద్రోచి యేచి చెలఁగి
నలంగునట్లుగాఁ బదంబులం ద్రొక్కి చిక్కుచీఱునుం జేసి చెల్లాచెదరుగాఁ
బాఱఁజల్లిన. 139

ఉ. ఏనుఁగుచిట్టకంబులకు నెంతయు మెచ్చి సురాధినాథుఁ డౌ
నౌ నని సారె సారె కొనియాడె సమీపనివాసు లెల్ల న
ప్మానివిధంబుఁ జూచి పలుమాఱును నవ్విరి నవ్వినన్ మహో
గ్రానలకీలలొల్కెడుకటాక్షములం గడుదుర్నిరీక్ష్యుఁడై. 140

ఉ. ఆమునినాథుఁ డప్పుడు సురాధిపుఁ జూచి త్రిలోకరాజ్యల
క్ష్మీమహనీయసంపదల మించినపువ్వులదండఁ దెచ్చి సు
త్రాముఁడ వంచు నీకుఁ బ్రమదంబున నిచ్చిన నాదరింప కే
లా మదియించి తింతయని యక్షుల నిప్పులురాల నుగ్రుఁడై. 141

చ. అతిశయమై జగత్త్రయమునందు వెలుంగుచునున్న దేవతా
పతిసిరియంతయున్ జలధిపాలగు నంచు శపించి కోపసం

---

కల్పవృక్షపుపువ్వులదండ. కైకానుక = చేతికియ్యఁబడినకానుక. 138 ఏపునన్ = గర్వముతో, తాపసి = తపస్వి - దుర్వాసుఁడు, భద్రదంతికుంభోపరిన్ = భద్రజాతిదైన తనయేనుఁగుయొక్క కుంభస్థలముమీఁద, ఎసలారెన్ = అతిశయించెను, రాజతా...స్థితిన్ = వెండికొండశిఖరమునందు శోభించునట్టియునికిచేత, వేలుపుటేఱు=దేవగంగ. 139 అభిరామసౌరభంబులకున్ = మనోజ్ఞమైన మంచివాసనలకు, చొక్కి=పరవశమై, ఐరావత...వారంబులకున్ = ఐరావతముయొక్క చెక్కిళ్ల యందుండిజాఱుచున్న మదధారలయొక్క సమూహములకు, చిక్కిన = చిక్కుకొన్న-ఆసక్తములైన, చంచరీకంబులు = తుమ్మెదలు, రేఁగి = విజృంభించి, మూఁగి = ముసురుకొని, ఘీంకారంబుతోడన్ = గీఁకతో - గీఁపెట్టుచుననుట, దిగ్గనన్ = మనసుచెదరఁగా, బెగ్గడిలి = కలఁతనొంది, ఏచి = విజృంభించి, చెలంగి = ఉత్సహించి, చిక్కుచీఱు = ఛిన్నభిన్నము. 140 చిట్టకంబులకున్ = వింతపనులకు, ఔనౌను = బాగుబాగు—ఇది ప్రశంసార్థకము, కొనియాడెన్=పొగడెను. మహోగ్రా...కటాక్షములన్=మిక్కిలిభయంకరమైన అగ్నిజ్వాలలు వెడలుచున్న కడగంటిచూపులతో, దుర్నిరీక్ష్యుఁడు= చూడనశక్యమైనవాఁడు. 141 సుత్రాముఁడవు = చక్కఁగా లోకములను పాలించువాఁడవు, ఆదరింపక = లక్ష్యపెట్టక, మదియించితింత = ఇంతమదించితివి, అక్షులన్=కన్నులయందు. 142 విప్రత్రాస్యుఁడై = తెలుపఁబడినవాఁడై - నోరు తెఱచుకొన్నవాఁడై, విశ్వజగత్ప్రియంబు = ఎల్లలోక

ంవృతాస్యుఁడై చనియె విశ్వజగత్ప్రళయంబు చేసి తా
*దనుఁబోనిరోషమున మండెడునాదిమరుద్రుఁడో యనన్. 142

కపియించి పార్ష్ణిఘాతప్రకంపితధరాధరుండును సంచలితాధరుండును కుటి
కుటిలకుటిలభ్రూకుటిభాగుండును రోషారుణవిస్ఫులింగలోచనారుణరాగుండును
కరప్రకంపమానదేహుండును నూర్ధ్వబాహుండును నై మొఱపెట్టుచుం
బాకశాసనుండు విహ్వలీభూతచేతస్కుండై యై రావతంబు డిగ నుఱికి
నుసి కడ్డంబు పోయి సాష్టాంగదండప్రణామంబు లాచరించి నాచేసిన
నంబు సహియించి నన్ననుగ్రహింపు మని యనేకభంగులం బ్రార్థించుచుండ
తంతకంతకు నేయివోసినయగ్నియుంబోలె మండి యాఖండలున కిట్లనియె.

రాత్మ నీకు మొగమోట యొకింతయు లేదు నీవు నీ
ము గూడి నాయెడ నవజ్ఞ యొనర్చితి రిట్టినీయెడన్
తెవృత్తి నున్ననునుఁ దక్కులఁ బెట్టఁగఁ జూచెదేని నీ
పెంపుఁ దూలఁగ శపింతుఁ జుమీ యికఁ నొండు పల్కినన్. 144

నీవు నాఁడు మునిపత్ని నహల్యను గానితప్పు చే
యుఁ బట్టి దండనము సేసి పదంపడి సత్కృపామతిం
గాని మెచ్చ గౌతముఁడఁ గాను భయంకరకోపహవ్యవా
పూర్ణమానసుఁడ నత్రితనూజుఁడఁ గాని వాసవా. 145

నీ వెంత ప్రార్థించినం గోపంబు నిలుపరాదు గావున నాకు నీయందు నను
ంబు సేయఁ జిత్తంబు గొలుపకున్నయది పొమ్మని దుర్వాసుండు పోయినం
రుండును డెందంబు గుందుచుండ నైరావతంబు నెక్కి. 146

---

సాకషుఁడు, దనుఁబోని=తన్నుఁబోలిన (తనివోని = తనివితీరని - తృప్తిపడని). 143 ప్రకంపితధరాధరుండు = పదఘట్టనచేత వడఁకుచున్న కొండలుగలవాఁడు, సంచలితాధ రుదరునట్టి పెదవులుగలవాఁడు. కుటి...భాగుండు = వంకరైన బొమముడిచేత ముడుతలు పడిన ప్రదేశముగలవాఁడు, రోషారుణ...రాగుండు = కోపముచేత ఎఱ్ఱనిమిణుఁగుఱుగులురాలు రయొక్క ఎఱ్ఱదనముగలవాఁడు, ప్రకంపమానదేహుండు = మిక్కిలివడఁకుచున్న శరీరము ఊర్ధ్వబాహుండు = మీఁదికెత్తఁబడిన చేతులుగలవాఁడు, విహ్వలీభూతచేతస్కుఁడు= వశముగానిమనస్సు కలవాఁడు, అజ్ఞానము = అవివేకము. 144 మొగమోట = అవజ్ఞ = అవమానము, తక్కులఁబెట్టఁగన్ = మోసపుచ్చుటకు, పేరు = కీర్తి. గౌరవము, తూలఁగన్ = నశింపఁగా, ఒండు = మఱియొకటి - వేఱొకమాట యనుట. = పూని, కానితప్పు = చేయరానితప్పు, భయంకర...మానసుఁడును = వెఱపును నట్టి కోపాగ్నిచేతనిండిన మనస్సుకలవాఁడను. 146 చిత్తంబుగొలుపకున్నయది=మనసు వానిరోషమున - అని పాఠాంతరము.

మ. అమితక్రోధపరీతుఁ డై నమునిచే నాక్షిప్తతేజస్కుఁడై
భ్రమతం జెందినమోముతోడఁ బరితప్తస్వాంతుఁడై బాష్పపూ
రము లొక్కుమ్మడిఁ గన్నులం దొరఁగ నారాటించుచున్ వేఱుపా
యముఁ జింతించియుఁ గాన కొక్కరుఁడ పోయెన్ వీటికిన్ దీనుఁడై. 147

ఉ. ఆమఘవుండు గన్గొనఁగ నచ్చరలేమలుఁ గల్పవృక్షచిం
తామణి కామధేనుసితదంతితురంగమకోశముఖ్యనా
నామహనీయసంపదలు నాశములయ్యెను నింద్రజాలవి
ద్యామయమయ్యెనో యనఁగ నయ్యమరావతి యుండె శూన్యమై. 148

సీ. మునిశాపదోషంబు ముట్టియుండుటఁజేసి దానధర్మములు భూస్థలిఁ దొలంగె
దానధర్మములు భూస్థలిఁ దొలంగుటఁజేసి వివిధదేశము లనావృష్టిఁ బొందె
వివిధదేశము లనావృష్టిఁ బొందుటఁజేసి సస్యంబులెల్ల నాశంబునొందె
సస్యంబులెల్ల నాశంబునొందుటఁజేసి ధనధాన్యములసొంపు దఱిఁగిపోయెఁ
తే. బుడమి ధనధాన్యములసొంపు చెడినకతన, యజ్ఞకర్మంబులెల్లను నణఁగిపోయె
యజ్ఞకర్మంబు లణఁగిన నమరవరుల, కెల్లఁ దేజోబలంబులు పొల్లువోయె. 149

వ. ఇట్లు సర్వంబు నిశ్శ్రీకంబయ్యె నప్పుడు. 150

ఉ. శ్రీమహనీయసంపదలఁ జెందక యుండుటఁజేసి సాత్త్వికం
బేమియు లేకపోవుటఁ జుమీ మఱి రాజసతామసంబులుం
గామము క్రోధలోభములు గల్గి మనుష్యులు క్రూరకర్ములై
క్షామజరాదిరోగములక్రందున నాశముఁ జెంది రెంతయున్. 151

వ ఇవ్విధంబునం బాకశాసనప్రముఖదేవగణంబులు ధైర్యశౌర్యతేజోబలశూన్యులై
రప్పుడు. 152

చ. అమరపురంబుమీఁదఁ జతురంగబలంబులఁ గూడి విప్రజి
త్ప్రముఖనిశాచరుల్ చని యపారపుసంపదలెల్లఁ గొల్లలా
డి మఘువుమీఁద సంగరపటిష్ఠతఁ జూపిన నాతఁ డుగ్రశౌ
ర్యము పఱివోయి యొక్కరుఁడుఁ బరాజితుఁడై చనియెన్ భయంబుతోన్. 153

---

రాకయున్నది, పురందరుండు = ఇంద్రుఁడు. 147 అమితక్రోధపరీతుఁడు = అధికమైన కోపముచేత ఆక్రమింపఁబడినవాఁడు, ఆక్షిప్తతేజస్కుఁడు=ఆక్షేపింపఁబడిన తేజస్సుగలవాఁడు, ఆరాటించుచు= ఆరాటపడుచు, వీటికిన్ = పట్టణమునకు. 148 మఘువుఁడు = ఇంద్రుఁడు, అచ్చరలేమలు = అప్సరస్త్రీలు, సితదంతి = తెల్లయేనుఁగు - ఐరావతము, కోశము=బొక్కసము. 149 ముట్టి=ఆక్రమించి, అనావృష్టి = వఱపు, సొంపు = బాగు - పంటయనుట. 150 నిశ్శ్రీకము = సంపదలేనిది. 151 క్షామజరాదిరోగములక్రందునన్ = కఱవుముసలితనము మొదలైన రోగములసందడిచేత. 153 మఘువుమీఁదన్=ఇంద్రునిమీఁద, సంగరపటిష్ఠతన్ = యుద్ధమునందలి నేర్పును, పఱివోయి=కొల్ల

సంపద్విహీనుం డైనయింద్రుండు బ్రహ్మపురస్సరుండై శ్రీమన్నారాయణసన్నిధి కేఁగుట.

మ. చని పద్మాసనుఁ గాంచి మ్రొక్కి తనదుష్టం బైనదుర్వాసుశా
పనిమిత్తంబున మూఁడులోకములసౌభాగ్యంబు లెల్లన్ మహా
బునిధిం గూలినచందముం దనబలంబుం దేజముం బోయినన్
దనుజుల్ నాకముఁ గొల్లలాడుటయు దైన్యవ్యక్తితోఁ జెప్పినన్. 154

ఉ. ఆపురుహూతుఁ జూచి జలజాసనుఁ డిట్లనుఁ దప్పెఁ గార్య మీ
పాపము నీకు నెట్లొదవె బ్రాహ్మణమాత్రుఁడె యత్రినందనుం
డాపురుదాలినోరిమునికడ్డము నారయ లేదు వానికిం
గోపమె కాని శాంతియును గూర్మియు లే దెటువంటివారితోన్. 155

తే. నాకవల్లభ నీమీఁద నాటుకొన్న, మౌనికోపాగ్ని దివిజసంపదలమీఁదఁ
బోయె నంతియ చాలు నీపుణ్యమునను, వేయు నేటికిఁ బులి నాకి విడిచినట్లు. 156

ఆ. నీవు కల్గియున్న నిఖిలసంపదలను, బడయవచ్చు నేఁటిబారితప్పె
నదియ చాలు వానియలుకకు నేనైన, గుండె గూఁడఁబెట్టి యుండ వెఱతు. 157

ఉ. ఆపద లెల్ల మాన్చి సుఖమైనపదంబులఁ బూన్చి యాత్మసం
తాపము లెల్లఁ బుచ్చి విదితం బగుసంపద లిచ్చి భక్తులం
దేపయుఁబోలె దుఃఖజలధిం బడకుండఁగఁ దేల్చి ప్రోవ ల
క్ష్మీపతి యున్నవాఁడు మదిఁ జింత దొఱంగుము పాకశాసనా. 158

వ. అని యతనిం బురస్కరించుకొని హుతాశనప్రముఖదిక్పతులును బృహస్పతి
ప్రముఖమునిలోకంబునుం గొలువఁ గదలి. 159

మహాస్రగ్ధర. చని కాంచెం బంకజాతాసనుఁడు సతతసంచారనక్రాదిసత్వం
బును గంధర్వాప్సరస్సన్మునిజనసుమనోముఖ్యసంస్తూయమానం
బును రంగత్తుంగభంగస్ఫురదురునినదాపూరితాశావిడంబం
బును గంభీరాంబుమధ్యప్రకటమణిగణోద్భాసిదుగ్ధాంబురాశిన్. 160

---

పోయి=అడఁగి. 154 దుష్టము=చెడ్డది, చందము=విధము, కొల్లలాడుట=కొల్లపెట్టుట, వ్యక్తితోన్-విధముతోననుట. 155 పురుదాలినోరిమునికిన్ = దుడుకునోటిఋషికి. 156 నీపుణ్యమునన్ = నీవు చేసికొన్న పుణ్యముచేత = నీవు నశింపక నీసంపదలు మాత్రము నశించుటకు నీవుచేసికొన్న పుణ్యఫలముచేతననుట. 157 బారి = ఆపద, గుండెగూడఁబెట్టి=మనస్సుదృఢపఱచుకొని. 158. పదము=స్థానము, పుచ్చి=పోఁగొట్టి, తేప = తెప్ప. 159 పురస్కరించుకొని = ముందుపెట్టుకొని, హుతాశనప్రముఖ = అగ్ని మొదలగు. 160 సతతసంచారనక్రాదిసత్వంబున్ = ఎల్లప్పుడు మెలఁగుచుండెడు మొసళ్లు మొదలగు ప్రాణులుగలదానిని, సుమనోముఖ్య సంస్తూయమానంబున్ = దేవతలు మొదలుగాఁ గలవారిచేత స్తోత్రము చేయఁబడుచున్నదానిని, రంగత్తుంగ...విడంబంబు = చలించుచున్న గొప్పఅలలచేత అతిశయించుచున్న మిక్కుటమగుధ్వనిచే నిండింపఁబడినదిక్కులయొక్క వ్యాప్తికలదానిని, గంభీరాంబు...ద్భాసిన్ = లోఁతైననీటినడుమ నుండెడు ప్రసిద్ధములైన రత్నములసమూ

వ. అమ్మహామహిమంబునకు నద్భుతచిత్తులై యరిగి తదీయమధ్యంబున శ్వేతద్వీ
పంబుఁ గని రందు. 161

సీ. ఘనమైనతోఁపులై కల్పవృక్షంబులు చూపట్టుచుండు నెచ్చోట నైనఁ
గామధేనువులు పెఱగదుపులై దమయిచ్చఁ బొలముల నోరంత ప్రొద్దు దిరుగు
నేడఁజూచిన నాడకాడకుఁ దిప్పలై చింతామణిశ్రేణి చెన్ను మెఱయు
నమృతంబు పరిపూర్ణమై సర్వకాలంబుఁ బ్రవహించి నదులలోఁ బాఱుచుండు
తే. సురల పెన్నుద్దులై జరామరణభయము
లని యెఱుంగక వర్తింతు రెందుఁ బ్రజలు
సకలపుణ్యఫలైకనిష్యంద మగుచు
నుల్లసిల్లుచు నుండునా తెల్లదీవి. 162

వ. అమ్మహాద్వీపమధ్యంబున. 163

మ. కని రబ్జాసనముఖ్యనిర్జరవరుల్ కల్పావనీజావళీ
కనదుద్యానవనోపకంఠముఁ బతాకావ్రాత హేలావిడం
బనసూర్యప్రతిభావకుంఠము నిలింపస్వాంతసంతోషసం
జనితోత్కంఠముఁ బద్మలోచననివాసావాసవైకుంఠమున్. 164

శా. ఆవైకుంఠపురంబులోపల సముద్యద్రత్నకాంతిచ్ఛటా
శ్రీవిభ్రాజిత మైనయానగరలక్ష్మీమండపం బందు ని
చ్చావృత్తిన్ సనకాదిసంయములు శశ్వద్వేదవేదాంతవి
ద్యావేదుల్ ప్రమదంబునం గొలువఁ గొల్వై యున్నయద్దేవునిన్. 165

సీ. శతకోటిభాస్కరసందీప్తతేజునిఁ బ్రావృట్పయోధరభవ్యగాత్రు
శంఖసుదర్శనశార్ఙ్గగదాహస్తుఁ బీతకౌశేయశోభితకటీరు

---

హాముచేత మిక్కిలి ప్రకాశించుదానిని, దుగ్ధాంబురాశిన్ = పాలసముద్రమును. 161 అద్భుతచిత్తులు = ఆశ్చర్యము నొందినమనస్సుగలవారు. 162 తోఁపు = గొప్పవృక్షములు గలవనము, పెఱగదుపులు = గొప్పమందలు, ఓరంతప్రొద్దు = ఎల్లప్పుడు, చెన్ను = బాగు-ఒప్పిదము, పరిపూర్ణము = కొఱఁతలేక నిండినది, ప్రవహించి=వెల్లువయై. 164 కల్పావ...కంఠమున్ = కల్పవృక్షపజ్క్తులచేత ఒప్పుచున్న ఉద్యానవనములు గలదానిని, పతాకా ... కుంఠమున్ = టెక్కెములసమూహముల యొక్క విలాసమును ప్రకటించుటచేత సూర్యకాంతిని మఱుఁగుపఱచుదానిని, నిలింప...త్కంఠమున్ = దేవతలమనస్సులకు సంతోషమును పుట్టించునట్టి వేడుకలుగలదానిని, పద్మ...వైకుంఠమున్ = = శ్రీవిష్ణునియునికితోడి గృహములు గలవైకుంఠపట్టణమును. 165 సముద్య...విభ్రాజితము=మిక్కిలి వెలుఁగుచున్న రత్నములకాంతిజాలముల కలిమిచేత ప్రకాశించునది, నగరన్ = రాజసౌధమునందు, శశ్వద్వేద...వేదులు = అపారములైన వేదములు వేదాంతములు నయిన విద్యలనెఱుఁగువారు. 166 శతకోటిభాస్కరసందీప్తతేజునిన్ = నూఱుకోట్లసూర్యులు వెలుంగునట్లు వెలుఁగుచున్న తేజస్సుగలవానిని, ప్రావృట్పయోధరభవ్యగాత్రున్ = వానకాలపు మేఘమువలె (ఒప్పునట్టి) పూజ్యమైన దేహము గలవానిని, పీతకౌశేయశోభిత కటీరున్ = పచ్చపట్టుతాపితాచేత శోభించు

లాలితశ్రీవత్సలాంఛనలాంఛితుఁ గౌస్తుభగ్రైవేయకప్రభావు
నిందిరామందిరాయితపీనవక్షునిఁ దారుణ్యకోటికందర్పమూర్తి
తే. బుండరీకాక్షు జగదేకపూతచరితు, సతతకరుణాకటాక్షవీక్షణు సమస్త
యోగినిర్మలహృదయపయోజనిలయు. విష్ణుఁ బొడగాంచి సంతోషవివశులగుచు.

వ. పంకజాసనప్రముఖదేవతలు సంభ్రమభయభక్తితాత్పర్యంబులు చిత్తంబులం బెనంగొనఁ బునఃపునః ప్రణామంబులు సేయుచున్న సమయంబున నత్యంతవిషాదవేదనం బొగులుచున్న యింద్రునకు నింద్రావరజుం డిట్లనియె. 167

తే. ఏమి దేవేంద్ర యెన్నఁడు లేమి నీవు
చిన్నవోయినమోముతో నున్నవాఁడ
వకట బ్రాహ్మణక్షోభ నీ కయినయట్లు
తేటపడుచున్న దిదియేమొ తెలుపుమనిన. 168

క. కోపనుఁ డగుదుర్వాసుని, శాపంబున దివిజరాజ్యసంపద లెల్లన్
రూపఱినచంద మబ్జజుఁ, డాపురుషోత్తమునితోడ నంతయుఁ జెప్పెన్. 169

వ. ఇట్లు చెప్పి దేవా దీనికిఁ బ్రత్యుపాయం బెయ్యది యానతియ్యవలయు నని ప్రార్థించినఁ గరుణాతరంగితలోచనుండై పరమేశ్వరుండు నిర్జరేశ్వరు నవలోకించి యిట్లనియె. 170

సీ. ఈవు దిక్పతులలో నిప్పుడు మున్నేగి కపటంపుసంధి రాక్షసులతోడఁ
జేసి వారును మీరు నాసహాయంబున నతిసత్త్వసంపన్నులై కడంగి
యోషధీలతలు దుగ్ధాబ్ధిలో వైచి మందరమహీధరము మంథంబుఁ జేసి
వాసుకిఁ దెచ్చి కవ్వపుత్రాడుగా నిడి మథియింపుఁ డమృతాదిమహితవస్తు
తే. చయముతోఁగూడఁ ద్రైలోక్యసంపదలకుఁ, గారణం బైనవిభవంబు గల్గు నమృత
పాన మొనరించెదవు దైత్యపతుల మొఱఁగి, నీవు లోకంబులేలెదు నెమ్మితోడ.

వ. అని యానతిచ్చి వీడ్కొల్పిన నప్పుడు. 172

### ఇంద్రుఁడు శ్రీమన్నారాయణాజ్ఞచే రాక్షసులతోఁగూడి సముద్రమథనంబు సేయుట.

లయగ్రాహి. మందరధరుండు దము నందఱఁ గృపాంబునిధి
యందుఁ బోరయించె నని డెందముల నత్యా

---

నట్టి కట్టి ప్రదేశముగలవానిని, లాలిత...లాంఛితున్ = ఒప్పిదమైన శ్రీవత్సమనుమచ్చచేత గుఱుతు పెట్టఁబడినవాఁడు, ఇందిరా...పీనవక్షునిన్ = లక్ష్మీదేవికి ఇల్లుగా చేయఁబడిన విశాలమైన ఱొమ్ము గలవానిని, తారుణ్య మూర్తిన్ = తరుణభావముతోడి కోటిమన్మథులరూపమువంటి రూపముగల వానిని, జగదేకపూతచరితున్ = లోకమునకు ఒక్కఁడైన పావనమైన నడవడిగలవానిని, సమస్త... నిలయున్ = ఎల్లయోగులయొక్క నిర్మలములైన మనఃపద్మములు ఉనికిపట్టుగాఁ గలవాఁడు, వివశులు = పరవశులు. 169 రూపఱిన = నశించిన. 171 మంథము=కవ్వము, మొఱఁగి=వంచించి. 173 డెందములన్ = మనసులయందు, పూరములు = ప్రవాహములు, నిలింపమునిబృందములు =

సందరసపూరములు వింటఁగ నిలింపముని
బృందములు పద్మజపురందరులతో నం
దంద చెలరేఁగుచు నమందగమనంబు లొద
వం దిరిగి వచ్చి దితినందనులతోడం
బొందుపడ సంధియొక చందమునఁ జేసి రిరు
కందువలవారు నరవిందభవునాజ్ఞన్. 173

క. అమరాసురు లటఁ గాంచిరి, ప్రముదితగంధర్వయక్షవరకృతకేళీ
రమరమణీకందరమును, రమణీయము హేమాద్రిసుందరము మందరమున్. 174

వ. అమ్మహానగం బగలించి తెచ్చి. 175

ఉ. అవ్వనజాయతేక్షణునియానతిఁ జేసి మహౌషధీలతల్
జువ్వన నమ్మహాంబునిధిలోపల వైచి సురాసురావళుల్
మవ్వమెలర్ప మందరము మంథముగా వెసఁ ద్రోచి వాసుకిం
గవ్వపుత్రాడు సేయ సమకట్టుచు నున్నతఱిన్ మునీశ్వరా. 176

క. ఆధరణీధర మడుగున, నాధారము లేక మునిఁగె నాసమయమునం
దాధరణీధరమర్దనుఁ, డాధరణీధరునిఁ దలఁచె నతులితభక్తిన్. 177

వ. ఇట్లు దలంచినసహస్రాక్షునకుఁ బుండరీకాక్షుండు ప్రత్యక్షంబై. 178

సీ. జలధిలో లక్షయోజనవిశాలంబైన కూర్మమై కవ్వపుకొండ యెత్తి
యాకాశభాగంబునందు శైలముమీఁద జడియకుండఁగఁ దనశక్తి నిలిపి
తరిత్రాడుగా నున్న యురగవల్లభునిగాత్రముఁ బ్రవేశించి సత్వంబు నొసఁగి
సమసత్వులైనదానవసదివౌకసులలోఁ గలసి యెచ్చరికలు గలుగఁజేసి
తే. యాదరంబున బ్రహ్మరుద్రాదిదివిజ, సమితితోఁ గూడి సుఖగోష్ఠి సలుపుచుండెఁ
దనమహత్త్వంబునకు సనందనసనత్సు, జాతసనకాదిమానులు సంతసిల్ల. 179

ఆ. భోగితలలపట్టు పూర్వదేవతలును, దోఁకపట్టు సురలు వీఁకఁబట్టి
త్రచ్చునట్లుగాఁగ దామోదరుఁడు సమ, కట్టె వారివారికడల నిలిచి. 180

క. వాసుకిసహస్రముఖని, శ్వాసవిషోద్రేకచటులవహ్నిజ్వాలల్

---

దేవతలయొక్కయు మునులయొక్కయు సమూహములు, పొందుపడఁగన్ = సరిపడునట్లు, కందువ = స్థానము-తెగ. 174 ప్రముదిత...కందరమును = సంతోషించిన గంధర్వులును యక్షులు నైనభర్తలచే చేయఁబడిన క్రీడచే మనోజ్ఞురాండ్రైనవిలాసస్త్రీలుగల గుహలుగలదానిని. 175 అగలించి = పెల్లగించి, 176 జువ్వనన్ =జువ్వుఅనుధ్వని కలుగునట్లుగా, మవ్వము = బాగు - పూనికయనుట, సమకట్టుచున్ = యత్నించుచు. 177 ధరణీధరము = కొండ, ధరణీధరమర్దనుఁడు = ఇంద్రుఁడు, ధరణీధరుఁడు = విష్ణుఁడు. 178 సహస్రాక్షుఁడు = ఇంద్రుఁడు. 179 కవ్వపుకొండ = మందరపర్వతము, జడియకుండఁగన్ = తొలఁగకుండ, తరిత్రాడు = కవ్వపుత్రాడు, ఉరగవల్లభుని = సర్పరాజుయొక్క = వాసుకియొక్క, గాత్రమున్ = దేహమునందు, సత్వంబు=శక్తిని, దివౌకసులు = దేవతలు. 180 భోగి=సర్పము, వీకన్ = పూనికతో. 181 పర్విన్ = వ్యాపిం

డాసి తమమీఁదఁ బర్విన, నాసురనాయకులబలిమి యల్పంబయ్యెన్. 181

తే. విషధరాధీశునిశ్వాసవిపులవాయు, ఘాతమునఁజేసి రాక్షసగణము దిక్కు
వారిధరములు వోయి దేవతలదిక్కు, శీకరాసారములనీడ సేయుచుండె. 182

వ. ఇవ్విధంబున దేవదానవులు మహామత్సరంబున సముద్రంబు మథియించునపుడు దేవధనంబు లైనకల్పవృక్షకామధేనుచింతామణులును రూపౌదార్యగుణోపేత లైనరంభాద్యప్సరసలును నైరావతోచ్చైశ్శ్రవంబులును బుట్టిన నారాయణుండు వాని నన్నింటినిఁ బురందరున కిచ్చె మఱియును. 183

క. నవనిధులును బుట్టిన వై, శ్రవణునిఁ గొమ్మనుచు నిచ్చెఁ జంద్రునికళసం
భవమైన నద్రికన్యా, ధవుఁడు శిరోభూషణముగఁ దాల్పఁగ నొసఁగెన్. 184

క. మది రాజసంబు మెఱయఁగ, మదిరాకుంభంబుఁ బూని మదఘూర్ణితయై
మదిరాసతి పుట్టిన నె, మ్మది రాక్షసవరులు గొనిరి మాధవువలనన్. 185

క. గీర్వాణమహిమఁ జెఱిచిన, దుర్వాసునికోపవహ్ని దోఁచినకరణిన్
దుర్వారవిషము పుట్టిన, దర్వీకరవరులు దానిఁ దాల్చిరి వత్సా. 186

ఉ. అంతహరీతకీఫలసమంచితహస్తుఁడు దివ్యభూషణా
త్యంతవికాసుఁడున్ విలసితామృతకుంభధరుండు నౌషధా
త్యంతపరిశ్రముండు ధవళాంబరధారుఁడు నై జనించె ధ
న్వంతరి దుగ్ధసాగరమునన్ దివిజావళి సంతసిల్లఁగన్. 187

ఉ. అట్టియెడన్ ధృతాంబురుహయై జనియించె రథాంగపాణికిం
బట్టపుదేవి లోకములపాలిటివేలుపు వజ్రిముంగిటం
బెట్టిన పెన్నిధానము మనీషిజనంబులతల్లి వార్ధికిం
బట్టి త్రిలోకసుందరి యపారకృపామతి లక్ష్మి పెంపుతోన్. 188

వ. ఇట్లు జనియించిన శ్రీదేవి నవలోకించి మునిగణంబులు శ్రీసూక్తంబులం గొని యాడిరి విశ్వావసుప్రభృతు లైనగంధర్వులు సంగీతంబులు సేసిరి ఘృతాచీప్ర

---

పఁగా, ఆసురనాయకుల = రాక్షస రాజులయొక్క. 182 విషధర...ఘాతమునఁజేసి = సర్పరాజగు వాసుకియొక్క బుసతోడిగొప్పగాలియొక్క పెట్టుచేత, దిక్కు = తట్టు, వారిధరములు = మేఘములు, శీకరాసారములన్ = తుంపురువానలతో. 184 వైశ్రవణునిన్ = కుబేరుని, అద్రికన్యాధవుఁడు=గౌరీపతి-శివుఁడు. 185 మదిర = కల్లు 186 దర్వీకరవరులు = సర్పరాజులు. 187 హరీతకీఫలసమంచిత హస్తుఁడు = కరకకాయచేత ఒప్పిదమైనచేయిగలవాఁడు, దివ్యభూషణాత్యంతవికాసుఁడు = దివ్యము లైన ఆభరణములచేత మిక్కిలి వెలుఁగువాఁడు, విలసితామృతకుంభధరుఁడు = ప్రకాశించునట్టి అమృత కలశమును ధరించినవాఁడు, ఔషధాత్యంతపరిశ్రముఁడు = మందులవిషయమున మిక్కిలి వాడుకపడిన వాఁడు, ధవళాంబరధారుఁడు = తెల్లనివస్త్రమును కట్టుకొన్నవాఁడు, దుగ్ధసాగరము = పాల సముద్రము. 188 ధృతాంబురుహ = ధరియింపఁబడిన కమలముగలది, వజ్రిముంగిటం బెట్టిన పెన్నిధానము = ఇంద్రునియొక్కయింటి ముందఱిభాగమునందు ఉంచిన గొప్పనిధి, పట్టి = బిడ్డ.

ముఖంబు లైనయప్సరోగణంబులు నృత్యంబులు సల్పె నైరావతాదిదిగ్గజంబులు కనకపాత్రంబుల గంగాజలంబులు దెచ్చి యభిషేకించె సముద్రవల్లభుం డమ్లాన పంకజంబులమాలిక లిచ్చె విశ్వకర్మ దివ్యరత్నవిభూషణంబు లొసంగె బ్రహ్మ రుద్రాదిదేవతలు దివ్యమాల్యాంబరంబులఁ జందనంబునం గైసేసి రిట్లు మహావిభవాభిరామ యైనయద్దేవి దేవదేవుం డైనవిష్ణుదేవునిచేతం బరిగ్రహింపంబడి తదీయవక్షఃస్థలంబునన విలసిల్లెఁ ద్రిలోకంబులు సకలసంపత్సంపాదకంబు లయ్యె నప్పుడు. 189

తే. తనకు విద్వేషు లైనట్టిదానవులకు, నొకపదార్థంబు నీక దామోదరుండు
తనకు దాసానుదాసులై యనుసరించు, వాసవాదుల ధన్యులఁ జేసె నపుడు. 190

తే. విప్రజిత్తిపురోగము లప్రమేయ, బలులు దైతేయదానవబలముతోడ
బలిసి యేతెంచి యమృతకుంభంబు గొనిరి, విబుధు లెల్లను భీతులై విహ్వలింప.

క. తోయజనాభుం డప్పుడు, మాయాసతియై నిశాటమధ్యంబునకుం
బోయి కుసుమబాణవికా, రాయత్తులఁ జేసె మోహనాకృతివలనన్. 192

చ. పలికెడులాగులుం గురుల బాగులు బింకపుఁజన్నుదోయిమిం
చులు నిడువాలుగన్నుఁగవచూపులు తిన్ననినెమ్మొగంబునం
గలచెలువంబు మోహనవికాసము నన్నువకౌనుగల్గు న
ప్పొలఁతుకఁ జూచి చిత్తరువుబొమ్మలకైవడి నుండి రందఱున్. 193

క. ఆమాయాసతిరూపసు, ధామృతపానంబువలన ననిమిషులై తా
మేమియు నెఱుఁగక దైత్య, స్తోమంబులు పారవశ్యదోహలు లైనన్. 194

క. జగదపకారపరాక్రము, లగుదైత్యులచేత నున్న యయ్యమృతముఁ దా
మగుడంగఁ దెచ్చి దయతో, నగభేదిప్రముఖసురగణంబుల కొసఁగెన్. 195

---

189 కొనియాడిరి = స్తుతించిరి, సముద్రవల్లభుఁడు = వరుణుఁడు, అమ్లాన=వాడని, కైసేసిరి=అలంకరించిరి, సంపత్సంపాదకంబులు = కలుములను సంపాదించునవి. 190 విద్వేషులు = విరోధులు, దాసానుదాసులు = దాసులను అనుసరించినదాసులు, (దాసుఁడు = భక్తుఁడు.) 191 అప్రమేయబలులు=మితి లేనిబలముగలవారు, బలసి = ఆవరించి, విబుధులు = దేవతలు, విహ్వలింపన్ = అవయవపాటవము లేనివారు కాఁగా. 192 తోయజనాభుఁడు = విష్ణువు, మాయాసతి = కపటస్త్రీ, నిశాటమధ్యంబునకున్ = రాక్షసులనడిమికి, కుసుమబాణవికారాయత్తులన్ = మన్మథవికారమునకుఁ లోబడినవారినిగా, మోహనాకృతివలనన్ = మోహింపఁ జేయఁజాలిన ఆకారముతో. 193 బింకము=బిగువు, మించులు=మెఱుఁగులు - కాంతులు, నిడువాలుగన్నుఁగవ=విశాలములై మనోజ్ఞములైనకన్నులజంట, తిన్నని = మేలైన, చెలువంబు = అందము, అన్నువకౌను = సూక్ష్మమైననడుము, పొలఁతుకన్ = స్త్రీని. 194 అనిమిషులు = ఱెప్పపాటు లేనివారు, దైత్యస్తోమము = రాక్షససమూహము, పారవశ్యదోహలులు = పరవశత్వముచేత అతిశయించినవారు - మిక్కిలిపరవశులైనవారు. 195 జగదపకార పరాక్రములు = లోకమునకు చెఱుపును గలుగఁజేసెడు పరాక్రమముకల

ఆ. పాకశాసనుండు పరమానురాగియై, దివిజగణముతోడఁ దేజమెసఁగ
సమృత మారగించి యత్యంతబలపరా, క్రమధురీణుఁడయ్యెఁ గడిమి మెఱసి. 196

వ. ఇట్లు విజృంభించి జంభారికుంభినీభృద్భయదదంభోళిధారావిజృంభణంబువలన రాక్షసులతోడ మహాఘోరయుద్ధంబుఁ జేసిన వెఱచి పఱచి యందఱును పాతాళ లోకంబునకుం జని రప్పుడు. 197

క. మందరశైలము నెప్పటి, కందువ నిడి యురగవిభునికారుణ్యరసా
నందపయోనిధిలోపల, నందంబుగ విడిచి చనిరి యమరులు ప్రీతిన్. 198

వ. అనంతరంబ పాకశాసనుండు మధుకైటభశాసనునకు నభివాదనంబు చేసి తదీయ కృపావిధేయుండై త్రిలోకంబులను నిజశాసనంబున నిలిపె సూర్యుండు ప్రసన్న దీప్తిమంతుండై తేజరిల్లె గ్రహతారకాగణంబులు పూర్వప్రకారంబున విలసిల్లె నగ్నిహోత్రంబులు ప్రదక్షిణార్చులై వెలింగె సర్వభూతంబులహృదయంబులును ధర్మజ్ఞానంబున విలసిల్లె మహీమండలంబును ననావృష్టిదోషంబును రాజవిద్ధూరం బును నుడిగి బహుసస్యసమృద్ధియును బ్రజాభివృద్ధియునుం గలిగె సకల లోకం బులును సంపత్కారంబు లయ్యె నిట్లు లక్ష్మీవిలాసంబున సమస్తలోకంబులు పరిపూ ర్ణంబు లయ్యె నపుడు. 199

క. శతమన్యుఁడు దివిజులతో, నతిముదమున విష్ణుచేత నామంత్రితుఁడై
యతులితవిభూతి నమరా, వతికిం జని ధర్మబుద్ధి నదలక యుండెన్. 200

వ. ఇట్లు నిరంతరోపాసకుం డైనపాకశాసనునకు నిరంతరతామరసవాసిని యైనమహా లక్ష్మి ప్రత్యక్షంబైన నతండు దండవన్నమస్కారంబులు నేసి కరంబులు మొగిచి యిట్లని స్తుతించె. 201

ఇంద్రుండు తనకుఁ బ్రత్యక్షం బైనలక్ష్మీదేవిని స్తోత్రము నేసి వరంబులు గొనుట.

క. అంబుజభవుండు మునివ, ర్గంబును జిత్తమున వెదకి కాన నలవిగా
వంబ భవదీయదివ్యప, దంబులు నే నిపుడు గాంచి ధన్యుఁడ నైతిన్. 202

---

వారు, మగుడంగన్=మరల, నగభేది=ఇంద్రుఁడు. 196 పాకశాసనుఁడు=ఇంద్రుఁడు, పరమానురాగి =అధికమైన అనురాగముగలవాఁడు, కడిమి = శౌర్యము. 197 జంభారి = జంభునిశత్రువు, కుంభినీ ...విజృంభణంబువలనన్ = కొండలకుభయమును కలుగఁజేయునట్టి వజ్రాయుధముయొక్క వాదరయొక్క విజృంభణముచేత, పఱచి=పరుగెత్తి. 198 కందువ=స్థానము, పయోనిధి=సముద్రము, అందంబుగన్ = చక్కగా. 199 మధుకైటభశాసనునకున్ = మధుకైటభులకు శిక్షకుఁడైనవిష్ణువునకు, అభివాదనము = నమస్కారము, కృపావిధేయుఁడు=కృపకు అధీనుఁడు, నిజశాసనంబునన్ = తనఆజ్ఞ యందు, ప్రసన్నదీప్తిమంతుఁడు = మసకలేనిప్రకాశము కలవాఁడు, తేజరిల్లె = వెలిఁగెను, ప్రదక్షి ణార్చులై = ప్రదక్షిణములైన మంటలుగలవై, రాజవిద్ధూరంబు = రాజులవలని తొందర, ఉడిగి= అణఁగి, 200 శతమన్యుఁడు = ఇంద్రుఁడు, ఆమంత్రితుఁడు = పంపఁబడినవాఁడు, అతులిత విభూతిన్ = సరిపోల్పరాని సంపదతో. 201 ఉపాసకుఁడు = సేవకుఁడు, తామరసవాసిని = తామరయందు వాసముచేయునది, 202 అలవికావు = లభింపవనుట. 203 మూర్తిన్ = దేహ

ఉ. ఎవ్వనిమూర్తి నార్తి యొకయించుక లేదు సభాంతరంబులం
దెవ్వఁడు పూజ్యుఁడై మఱియు నీజనులెల్ల సదావిధేయులై
యెవ్వని నాశ్రయింపుదు రహీనవచోవిభవాభిరాముఁడై
యెవ్వఁడు తేజరిల్లు నతఁ డెప్పుడు నీకృపవాఁడు భార్గవీ. 203

క. నేరములు పెక్కుచేసిన, నేరుపులై చెల్లుచుండు నీకృపగలచో
నేరుపున నెట్లు నడచిన, నేరములై కీడుసేయు నీకృప లేమిన్. 204

క. కలిమిగల కల్లచూపుల, కలిమి నిరంతరము నీవు గైకొని ప్రోవం
గలవారి నాశ్రయింపం, గలవారు జగంబులోనఁ గలవారెల్లన్. 205

వ. అని యిట్లు వినుతింప నిలింపవల్లభునకు విష్ణువల్లభ యిట్లనియె. 206

క. స్వారాజ భక్తితో నను, నారాధన సేసినాఁడ వటుగావున నీ
కోరినవర మే నిచ్చెద, నారయ నేమేని యడుగు మని పలుకుటయున్. 207

సీ. అంబ మదభ్యస్తమైనవిద్యలయందు శరచాపఖడ్గాదిసాధనముల
రథపత్తివాజివారణచయంబులయందు గోమహిష్యాదిసద్ధామములను
మణిహేమవజ్రభూషణధాన్యములయందుఁ బరిమళద్రవ్యసంపదలయందుఁ
బుత్రమిత్రకళత్రపౌత్రబాంధవులందు శక్తిగుణేంద్రియసముదయముల

తే. రాష్ట్రముల దుర్గములయందు రాజధాను
లందుఁ గ్రీడావిహారంబులైనయట్టి
రమ్యభూముల నాశరీరంబునందు
నీవు వసియింపుదువుగాక యింపుతోడ. 208

క. నిను నీనుతిచే నెవ్వఁడు, పనుపడి నుతియించు రాత్రిఁ బగలును వానిం
దనయుండువోలెఁ గృపతో, మునుకొని రక్షింపవలయు మురహరురాణీ. 209

క. అని యతఁ డడిగినయావర, మనురాగముతోడ నిచ్చి యంతర్ధానం
బును బొందె నాఁటనుండియు, వనజాలయ యింద్రుపీడు వదలక యుండున్. 210

వ. మఱియు దేవదేవుం డైనవాసుదేవుండు కృతయుగంబునఁ బరశురామావతారంబు
నొందిననాఁడు భూమిదేవి యయ్యెఁ ద్రేతాయుగంబున రామావతారంబు
నొందిన నాఁడు సీతాదేవి యయ్యె ద్వాపరయుగంబునఁ గృష్ణావతారంబు
నొందిననాఁడు రుక్మిణీదేవి యయ్యెఁ గలియుగంబున సూర్యావతారంబు నొందిన
నాఁడు పద్మిని యయ్యె నివ్విధంబునఁ బద్మాలయ పద్మాక్షునకు సహాయయై

మునందు, ఆర్తి = పీడ, సభాంతరంబులందుఁ = సభలలో, నీకృపవాఁడు = నీదయకు అధీనుఁడు. 205 కల్లచూపులఁ = కపటపుచూపులతో. 206 నిలింపవల్లభునకుఁ = దేవేంద్రునితో, విష్ణువల్లభ = లక్ష్మీదేవి. 207 స్వారాజ = స్వర్గమునకురాజైన యింద్రుఁడా, ఆరాధన = అర్చన. 208 అంబ = తల్లీ, మదభ్యస్తము = నాచే అభ్యసింపఁ బడినది, పత్తి = పదాతి - కాలుబలము, వాజీ=గుఱ్ఱము, వారణము = ఏనుఁగు, మహిషి = ఎనుము - బఱ్ఱె, హేమ = బంగారు, రాజధానులందుఁ=ప్రధానపట్టణములయందు. 210 అంతర్ధానంబునుబొందెఁ = మఱుఁగువడిపోయెను, వనజా

యుండు నతండు దేవరూపంబు ధరించిన దేవత్వాస్త్రీరూపంబును మనుష్య
రూపంబు ధరించిన మనుష్యస్త్రీరూపంబును నై శబ్దంబు ననుసరించు నర్థంబు
నుంబోలె ననుసరించునని లక్ష్మీచరిత్రంబు చెప్పిన విని మైత్రేయుం డిట్లనియె. 211

భృగ్వాదిముని కర్తృకసృష్టిక్రమము.

తే. అనఘ భృగుమౌని యాదియైనట్టిమునుల, సర్గములు వేఱువేఱ విస్తారఘణితి
నానతిమ్మని పల్కిన నవ్వసిష్ఠు, మనుమఁ డిట్లని చెప్పె నమ్మౌనితోడ. 212

క. ఖ్యాతికి భృగునకుఁ బుట్టిన, ధాతవిధాతలును మేరుధరణీధ్రతనూ
జాతలనాయతనియతుల, నాతతమతిఁ బెండ్లియైరి యం దాయతికిన్. 213

తే. ప్రాణుఁ డుదయించె నియతికి భవ్యమూర్తి
యగుమృకండుండు జనియించె నతనివలన
దురితహరుఁడు మార్కండేయవరమునీంద్రుఁ
డవతరించెను దీర్ఘాయు రమలుఁ డగుచు. 214

వ. మఱియుఁ బ్రాణునకు వేదశిరుండును వానికి ద్యుతిమంతుండును అతనికి నజ
రుండునుం బుట్టిరి వారివంశంబు లసంఖ్యాతంబులై జగంబుల విస్తరిల్లె మఱి
యును. 215

తే. విను మరీచికి సంభూతి యనులతాంగి
యందు నుదయించెఁ బౌర్ణమాసాఖ్యసుతుఁడు
పరఁగ నతనికి విరజుండు పర్వతుండు
ననఁగఁ బుత్త్రులు జన్మించి రతులయశులు. 216

తే. అంగిరసునకు స్మృతియందు ననుమతియును
రాకయును సినీవాలియు నాఁ గుహూవును
నాఁగ నలువురు పుట్టి నానాజగత్ప్ర
సిద్ధమహిమలు గాంచి రక్షీణముగను. 217

క. అత్రికి ననసూయకు స, త్పుత్త్రకులై చందురుండు దుర్వాసుఁడు ద
త్తాత్రేయుఁడుఁ బుట్టిరి శత, పత్త్రభవాభవరథాంగపాణులు దామై. 218

వ. మఱియుఁ బ్రీతి యనుదానికి దత్తాగ్ని పుట్టె నతండు స్వాయంభువమన్వంతరం
బున నగస్త్యుం డయ్యెఁ బులహునకు క్షమయును దానికిఁ గర్దముండును సహి
ష్ణుండు నూర్ధ్వరేతుండునుం బుట్టిరి. క్రతువునకు సన్నతి యనుదానికి సంగుష్ఠ
పర్వమాత్రదేహులు నూర్ధ్వరేతస్కులును నైన వాలఖిల్యాదు లఱువదివే
వురు పుట్టిరి. వసిష్ఠునకు నూర్జ యనుదానికి విరజుండును గోత్రుండును నూర్ధ్వ
బాహుండును సవనుండును ననఘుండును సుతపుండును శక్రుండును నన

లయ=లక్ష్మీదేవి, వీడు=పట్టణము. 212 సర్గములు = సృష్టులు, ఫణితిక = పక్కికచేత. 213 ధరణీ
ధ్రము=కొండ. 218 శతపత్త్ర... పాణులు = బ్రహ్మశివవిష్ణువులు. 219 విశోనపంచాశత్సంఖ్యులు=

నేడ్వురు పుట్టిరి. వా రుత్తమ మన్వంతరంబున సప్తమహర్షులైరి వహ్నికి స్వాహ యనుదానికిఁ బావకుండును పవమానుండును శుచియునుం బుట్టిరి వారు మువ్వురను నలువదియేవురు పుట్టిరి. ఇట్టు లేకోనపంచాశత్సంఖ్యులైన వహ్నులు విస్తరించిరి. పితృదేవునకును స్వధ యనుదానికిని బితృగణంబులును మేనకయును వైతరణీయు నను కన్యకలు పుట్టిరి. అయ్యిరువురును దివ్యజ్ఞానమూర్తులును బ్రహ్మవాదినులును యోగినీదేవతలును నైరి. అనిన మైత్రేయుం డిట్లనియె. 219

క. మునివల్లభ స్వాయంభువ, మనువంశజులైనయట్టిమనుజేంద్రులవ
ర్తనములుఁ దదన్వయంబులు, వినవలతుం జెప్పు మనిన వేడుకతోడన్. 220

శా. సారాచారవివేకవైభవకళాసంపన్న సంటాన్వయ
క్షీరాంభోనిధిపూర్ణచంద్ర విజయశ్రీవైభవోపేత శృం
గారాకార కవీంద్రయాచకసురక్ష్మాదక్షమందారచిం
తారత్నప్రతిమానదానగుణ మానంబాలగోత్రోద్భవా. 221

క. భరతభగీరథభార్గవ, మరుత్తశశిబిందురంతిమాంధాతృయయా
తిరఘుదిలీపసగరశిబి, నరరామనహుషసుహోత్రనరనాథనిభా. 222

మాలిని. అమందగుణరాజితా హరిపదాబ్జసంపూజితా
సమస్తశుభలక్షణా సకలధీరసంరక్షణా
సమగ్రవిభవాకరా సమదశత్రురాడ్భీకరా
యమానుషపరాక్రమా యఖిలదుష్క్రియాపక్రమా. 223

గద్య. ఇది శ్రీమదమరనామాత్యపుత్ర హరితగోత్ర పవిత్ర సుకవిజనవిధేయ వెన్నెలకంటిసూరయనామధేయప్రణీతం బైనయాదిమహాపురాణంబగు బ్రహ్మాండపురాణంబునందలి పరాశరసంహితయైన శ్రీవిష్ణుపురాణంబునందు నాదిభూతసర్గప్రకారంబును బ్రహ్మాండోత్పత్తియు మహావరాహాకీర్తనంబును బ్రజాపతిసర్గంబును దుర్వాసుశాపంబున నింద్రుండు నిశ్శ్రీకుం డగుటయు సముద్రమథనంబును లక్ష్మీమాహాత్మ్యంబును భృగ్వాదిమహామునిసర్గంబును ననుకథలం గల ప్రథమాశ్వాసము.

---

నలువదితొమ్మిదిసంఖ్యలు గలవారు. 221 సారాచారవివేక = సారవత్తైననడవడియు వివేకమునుగలవాఁడా, వైభవకళాసంపన్న = విభవమనువిద్యచేత సంపన్నుఁడా, విజయశ్రీవైభవోపేత = గెలుపుసంపదయనెడు వైభవముతోఁ గూడుకొన్నవాఁడా. మందార...దానగుణ = కల్పవృక్షముతోడను చింతామణితోడను సమానమైన యీవిగుణముగలవాఁడా. 223 అమందగుణరాజితా = గొప్పవగల గుణములచేత బ్రకాశించువాఁడా, హరిపదాబ్జ సంపూజితా = విష్ణువుయొక్క పాదకమలములను పూజించువాఁడా, సమగ్రవిభవాకరా = సంపూర్ణమైన వైభవమునకు గనియైనవాఁడా, సమదరాడ్భీకరా = మదించినరాజులకు భయంకరుఁడైనవాఁడా, అమానుషపరాక్రమా = సామాన్యమనుష్యులయందు లేనిపరాక్రమము గలవాఁడా, అఖిలదుష్క్రియాపక్రమా = సమస్తదుష్టకృత్యములను తొలఁగించువాఁడా.



శ్రీరస్తు.

# శ్రీ విష్ణుపురాణము

## ద్వితీయాశ్వాసము.

---



విష్ణుపురాణకథా
ప్రావీణ్యాగణ్యహృద్యభాగ్యరమాసం
భావితకటాక్షవీక్షణ
గోపురబసవక్షితీంద్రరాఘవభూపా. 1

వ. సకలపురాణవిద్యాధురంధరుం డైనపరాశరుండు మైత్రేయున కిట్లనియె. 2

తే. ఆదిమనువైనయట్టి స్వాయంభువునకుఁ, దనయులైరి ప్రియవ్రతోత్తానపాదు
లందు నుత్తానపాదున కాత్మసూను, లుత్తముండు ధ్రువుండు నా నుదయమైరి. 3

వ. మైత్రేయుం డతని నవలోకించి మహాత్మా ధ్రువుండు పరమభాగవతుండని పెద్దలచేత వింటి నతనిచరిత్రంబు సవిస్తరంబుగాఁ జెప్పు మనినఁ బరాశరుం డిట్లనియె. 4

### ధ్రువునిచరిత్రము.

మ. ఘనుఁ డుత్తానపదుండు భూవలయమేకచ్ఛత్రమై యొప్పఁగా
ననురాగంబున నేలె పెక్కుమఖముల్ సాంగంబులై యుండఁజే
సి నిలింపప్రభుపైనఁ గైకొనక శాసీభూతవిద్వేషిరా
జనికాయుం డగుచుఁ మహిం బరఁగె శశ్వత్కీర్తిసంపన్నుఁడై. 5

క. సురుచియు సునీతియును నన, నిరువురుభార్యల వరించి యెంతయు నొప్పెన్
ధరణిఁ బయోనిధికన్యను, బరిణయమైనట్టిచక్రపాణియుఁ బోలెన్. 6

వ. అందు సురుచికి నుత్తముండును సునీతికి ధ్రువుండునుం బుట్టి సమానరూపరేఖావిలాసవిద్యావివేకంబులం బెరుగుచున్నంత నొక్కనాఁడు. 7

---

1 అగణ్యహృద్య...వీక్షణ = ఎన్నరానిమనోజ్ఞురాలైనభాగ్యలక్ష్మిచేత గౌరవింపఁబడిన కడగంటి చూపులుగలవాఁడా. 5 ఏకచ్ఛత్రము = ఒక్కగొడుగుగలది, ఇతనిరాజ్యమునందు ఇతరు లెవరును బిరుదుగొడుగును ధరియింపశక్తులు కాక యుండిరని తాత్పర్యము. మఖము = యజ్ఞము, కైకొనక = లక్ష్యపెట్టక, శాసీభూత...నికాయుఁడు = శిక్షితులగుచున్న శత్రురాజులయొక్క సమూ-

క. ఉత్తానపదుఁడు గొలువున, నుత్తమునిం దొడలమీఁద నునిచి ముదముతో
నుత్తమపీఠంబున ముని, సత్తములు భజింప నున్న సమయమునందున్. 8

ఆ. జనకుతొడలమీఁద సంతోషముననున్న, సవతితల్లికొడుకు సంభ్రమంబు
తోడఁ జూచి వచ్చిధ్రువుఁడు తానును తదీ, యాంకపీఠ మెక్క నాసపడుచు. 9

తే. రాజసింహాసనం బెక్క రాఁ గడంగి, నిక్కి చేఁ జాఁప సురుచి సునీతితోడి
సవతిమత్సరమున రాజసమ్ముఖమున, వెఱప కిట్లను సతనితోఁ గఱకుమతిని. 10

క. ఈసకలరాజ్యభోగ, శ్రీసంపదచేత నుల్లసిల్లి ఘనుండై
నాసుతుఁడుగాక యీసిం, హాసన మెక్కంగ నీకు నర్హం బగునే. 11

ఉ. ఎల్లవిధంబులన్ వినుతి కెక్కినయీనృపుకూర్మిపత్ని నై
మొల్లములైనసంపదలు మోచి వెలుంగుచు నున్న నాకు నీ
తల్లి సపత్ని నౌదునని తాఁ బలుమాఱును వచ్చి నాకడం
బ్రల్లదముల్ వచించు నది పల్కులు నే వినఁజాల నెన్నఁడున్. 12

తే. నాథుమన్నన వడసిన నాకుఁ దన్ను, నాడఁ జెల్లినఁ జెల్లెఁగా కంతరాంత
రములు దెలియక మీతల్లి రాజుపత్ని, ననుచు గర్వించె నవి పతి కప్రియములు.

క. ఉత్తానపాదుఁ డెక్కిన, యుత్తమసింహాసనమున నుండఁదగినవాఁ
డుత్తముఁడు వీనికంటెను, నుత్తముఁ డగుదేని నీవు నుండుము వేడ్కన్. 14

క. అని బెట్టిదంబు లాడుచు, జనపతి జూడంగ సురుచి సవతికొడుకుఁ జ
య్యన రెట్టఁబట్టి పొమ్మని, వెనుకకుఁ బడఁ ద్రోసి వీఁపు వ్రేసెం బెలుచన్. 15

చ. కనుఁగవ నశ్రుపూరములు గ్రమ్మఁగ వీడినకాకపక్షముల్
వెనుకకు వీల దైన్యరసవేదన నిల్వఁగలేక యేడ్చుచున్
జననినికేతనంబునకుఁ జయ్యనఁ బోయి ధ్రువుండు దీనుఁడై
తన పెదతల్లి చేతయును దండ్రియుపేక్షయుఁ జెప్పెఁ జెప్పినన్. 16

తే. కొడుకుకన్నులబాష్పముల్ దుడిచి తల్లి
శిరసు మూర్కొని కౌఁగిటఁ జేర్చి యేడు
పుడిపి తనకును గన్నీ రొలుకుచుండ
సతనితో గద్గదస్వర యగుచు ననియె. 17

ఆ. అన్న సురుచి చెప్పినన్నియు నిక్కంబు, లవనివిభుఁడు దానియందుఁ బ్రియము

హాములుగలవాఁడు-ఎల్లశత్రువులను అణఁచినవాఁడు. 8 అంకపీఠము = పీఁటవంటిఒడిని. 10 కఱకు= కఠినమైన, 12 కూర్మి = ప్రియమైన, మొల్లములు = అధికములు, మోచి = వహించి, సపత్నిని = సవతిని, ప్రల్లదములు = గర్వపుమాటలు. 13 ఆడన్ = నిందింప, అంతరాంతరములు= తారతమ్యములు. 15 బెట్టిదంబులు = నిష్ఠురములు, వీఁపువ్రేసెన్ = వీఁపునచఱచెను. 16 కాక పక్షము = పిల్లజుట్టు, నికేతనంబునకున్ = ఇంటికి, చయ్యనన్ = శీఘ్రముగా, చేఁత = పని, ఉపేక్ష= అనాదరము. 17 బాష్పములు = కన్నీళ్లు, మూర్కొని = మూచూచి, ఉడిపి = పోఁగొట్టి, ఒలుకు చుండన్ = కాఱుచుండఁగా, గద్గదస్వర = డగ్గుత్తికగలది. 18 అన్న = నాయనా - ఇది ప్రేమ

గలఁడు తత్తనూజు గారవింపక యేల, మాను నంతచనువు మాకుఁ గలదె. 18
తే. సురుచి సౌభాగ్యవతి గాన సుతుఁడుఁ దాను, మనుజనాథునివలన మన్ననలు గనిరి
మందభాగ్యుల మైనట్టిమనకు నేల, మనుజనాథునివలన మన్ననలు గలుగు. 19
చ. పుడమి సమస్తముం గని సురుచిపుత్త్రకుఁ డేలుచు రాజమన్ననల్
వడసి మహోన్నతాసనముపై విలసిల్లఁగ వానిపాదముల్
విడువక గొల్చుచుం గృపణవృత్తి కొడంబడ నున్న యన్న నా
కడుపున నేలపుట్టితివి కష్టపుఁబాటున కై తనూభవా. 20
వ. అని యెలుంగెత్తి యేడ్చిన తల్లి నూరార్చి ధ్రువుం డిట్లనియె. 21
ఉ. ఏమిటి కింతదుఃఖమున నేడ్చెద వుత్తమలీల నుత్తముం
డీమహనీయభూవలయ మేలుచు రాజ్యము సేయనిమ్ము త
ల్లీ మనుజేంద్రుఁ డిట్టిసిరి యెవ్వరిచే మును గాంచె నవ్విభుం
డేమియనుగ్రహించి మన కీఁడొకొ యీపరిపాటిసంపదల్. 22
ఉ. తండ్రి ప్రియవ్రతానుజునిదత్తము లైనసమస్తధారుణీ
మండలభోగముల్ నిమిషమాత్రసుఖంబులు గాన నిందు నే
నుండఁగనొల్ల వేల్పులకు నున్నతమైనపదంబునందు నే
నుండెదఁ జంద్రసూర్యులు పయోనిధులుం గలకాల మెప్పుడున్. 23
ఆ. ఏను దపముసేయ నేగెద నెమ్మది, నుండు మనుచుఁ దల్లి నూఱడించి
పలికి యొక్కరుండు పరమనిర్వేదన, పరుఁడు రాజసుతుఁడు పురము వెడలె. 24
వ. ఇట్లు పురంబు నిర్గమించునప్పుడు తదీయసమీపోద్యానవనమధ్యంబునఁ గృష్ణా
జినంబులు విష్టరంబులుగా నిడి కూర్చున్నసప్తమహర్షులం బొడగాంచి నమస్క
రించి యున్న యన్నరేంద్రనందనునకు నమ్మునీంద్రు లిట్లనిరి. 25
ఆ. ఎందునుండి వచ్చి తెవ్వరివాఁడవు, తెలియఁ జెప్పు నామధేయ మేమి
యిప్పు డొంటి నేల యీ విచ్చటికి వచ్చి, తనిన మునులతోడ నాతఁ డనియె. 26
తే. ఏను ధ్రువుఁ డనువాఁడ నుత్తానపాదు, నాత్మజుండఁ దపంబు సేయంగఁ గోరి
పోవుచున్నాఁడ నాతొంటిపుణ్యఫలము, కతన మీదర్శనము నాకుఁ గలిగె ననిన.
క. మునులందఱు నాశ్చర్యం, బున నాతనిఁ జూచి రాజ్యభోగ్యములుం గై
కొననొల్లక నిర్వేదిం, చినకారణమేమి యిట్లు చెల్లునె నీకున్. 28

సంబోధనము, నిక్కంబులు = నిశ్చయములు, ప్రియముగలఁడు = ప్రియముకలవాఁడు, చనువు = స్వాతంత్ర్యము. 19 సౌభాగ్యవతి = మంచియదృష్టముగలది, మన్ననలు = సన్మానములు, కనిరి = పొందిరి, మందభాగ్యులము = భాగ్యహీనులము. 20 మహోన్నతాసనము = మిక్కిలి యెత్తైన పీఠము, కృపణవృత్తికిన్ = నికృష్టవ్యాపారమునకు. 22 మహనీయము = గొప్పది, సిరి = సంపద, ఈపరిపాటి = ఈమాత్రము. 24 నెమ్మదిన్ = కొఱఁతలేని మనస్సుతో, ఊఱడించి పలికి = దుఃఖము చల్లాఱునట్టి మాటలుచెప్పి. పరమనిర్వేదనపరుఁడు=మిక్కిలి విచారముచేతనైన త్రొక్కుట కలవాఁడు. 25 విష్టరంబులు = ఆసనములు. 28 కైకొననొల్లక = గ్రహింప నపేక్షింపక, నిర్వేదించిన కారణము=

తే. నాలుగైదువత్సరముల బాలకుఁడవు, మోహనం బైనసుకుమారమూర్తి వీవు
లేశమాత్రంబు వ్యాధులు లేవు మేనఁ, దల్లిదండ్రులు గల్గినధన్యమతివి. 29

క. నీ వెక్కడఁ దప మెక్కడ, భావిశుభశ్రీదమైనఫల మెక్కడ నీ
వీవెఱ్ఱిపడుచుబుద్ధులు, పోవిడువుము వేగ మగిడిపొమ్ము కుమారా. 30

చ. అనిన ధ్రువుండు వారలకు నంజలిచేసి వివేకబుద్ధితో
జనకునిసమ్ముఖమ్మున విచారవివేకము లేశమాత్రముం
దనమదిలేక యాసవతితల్లి దురాగ్రహవృత్తితోఁడఁ బ
ల్కినకొఱగానిమాటలు నికృష్టతయున్ వినిపించి వెండియున్. 31

క. ఏనింక నట్టిచోటికిఁ, బోనొల్లను మీప్రసాదమునఁ బుణ్యతప
శ్శ్రీనొంది మిగుల నున్నత, మైనపదంబున వసింతు నని పలుకుటయున్. 32

తే. అతనిదృఢనిశ్చయంబును నతనిసద్వి, వేకబుద్ధియు నతనియస్తోకమహిమ
యును గనుంగొని యమ్మహామునివరేణ్యు, లందఱును దమలోన నిట్లనిరి నగుచు.

చ. అనిమొన ముట్టి శాత్రవచయంబులు దారుణదివ్యబాణముల్
ఘనముగ నేయఁగాఁ దనువుగాఁడిన నోర్వఁడు గాని రాజనం
దనుఁ డవమానపూర్వక విధానము లైనదురుక్తు లిమ్మెయిన్
మనమున నాట నన్న నొకమాటకు నోర్వఁడు వేయుఁ జెప్పినన్. 34

వ. అని పలికి యతని నవలోకించి. 35

ఉ. నీమది నిట్టిపాటిదృఢనిశ్చయ మొందెనయేని భక్తితోఁ
దామరసాయతాక్షు వినతాసుతవాహను భక్తలోకచిం
తామణి భుక్తిముక్తిఫలదాయకు సర్వసుపర్వనాయకున్
శ్రీమహిళాకళత్రుని భజింపు కుమారక యిష్టసిద్ధికిన్. 36

వ. తొల్లి మీవంశకర్త లైనస్వాయంభువుండును బ్రియవ్రతోత్తానపాదులును

---

నిర్వేదమునొందిన నిమిత్తము, మోహనము = మోహింపఁజేయునది. 30 భావిశుభశ్రీదము = ఇఁకమీఁద శుభమును సంపదను ఇచ్చునది, ఈవెఱ్ఱిపడుచుబుద్ధులు = ఈపిచ్చితనపు పసివానిబుద్ధులు 31 అంజలి = చేమోడ్పు, దురాగ్రహవృత్తితోడన్ = చెడ్డకోప వ్యాపారముతో, కొఱగానిమాటలు = పనికిమాలిన మాటలు - నీచపుమాటలు, నికృష్టత = (తన) నీచత్వము. 32 పదంబునన్ = స్థానమునందు. 33 అస్తోకమహిమ = గొప్పమహత్వము. 34 శాత్రవచయంబులు = శత్రుసమూహములు, దారుణదివ్యబాణములు = భయంకరములును అమోఘములునైన బాణములు, ఘనముగన్ = దట్టముగా, కాఁడినన్ = నాటినను, దురుక్తులు = చెడ్డమాటలు, ఓర్వఁడు = సహింపఁడు. 36 ఇట్టిపాటన్ = ఈవిధముగా, వినతాసుతవాహనున్ = గరుడవాహనుని, భుక్తిముక్తిఫలదాయకున్ = భుక్తిముక్తి ఫలములను ఇచ్చువానిని, (భుక్తి = ఈలోకమునందలి అనుభవము, ముక్తి = మోక్షము.) సర్వసుపర్వనాయకున్ = ఎల్లదేవతలకు అధిపతియైనవానిని, శ్రీమహిళాకళత్రునిన్ = లక్ష్మీదేవిభార్యగాఁగలవానిని, భజింపు = సేవింపుము. 37 అవ్వాసుదేవునకున్ = ప్రసిద్ధుఁడైన శ్రీహరినిగూర్చి

నవ్వాసుదేవునకుం దపంబుఁ జేసికాదె కృతార్థులై మహనీయమహిమం బడసిరి. అస్మదాదు లైనమహామునులును నద్దేవు నుపాసించి కాదె జగంబుల నందఱి కంటె నధికుల మైతిమి. కావున నీవును భక్తరక్షణపరాయణుం డైన నారాయణు నారాధింపు మతండు నీకు నభీష్టఫలంబు నిచ్చునని విధివంతంబుగా నతనికి ద్వాదశాక్షరమంత్రం బుపదేశించి తపశ్చరణప్రకారంబునుం జెప్పి కృతార్థుండవు గమ్మనిన నౌత్తానపాదియుం బ్రమోదభరితహృదయుండై యచ్చోటు గదలి చని. 37

సీ. ఆదికాలంబున యమునాతటంబున మధుఁ డనుదానవుం డధికతపముఁ
గావించి యిందిరాకాంతుఁ బ్రత్యక్షంబు చేసి యాత్మీయనివాసభూమి
యైనయీవనభూమియందు నానాదేవయుక్తుఁడై యద్దేవుఁ డుండునట్లు
గా వర మర్థితోఁ గైకొని తనపేర మధురాపురంబును మధువనంబు
తే. ననఁగ లోకప్రసిద్ధిగా నలవరించె, సార్వకాలంబు పద్మలోచనుఁడు సకల
సురగణంబులు గొలువ నచ్చోట నుండు, నది తపోధనులకు నెల్ల నాస్పదంబు.

ఆ. ఆకుమారచంద్రుఁ డచ్చోటు దనకుఁ ద, పంబు సేయఁదగినపట్టుగాఁగ
నిశ్చయంబు సేసి నిష్ఠతోఁ గాళింది, యందుఁ దీర్థమాడి యభిమతముగ. 39

క. ఔత్తానపాది మునినా, థోత్తము లెఱిఁగించినట్టియుపదేశవిధిం
జిత్తంబు యోగవిద్యా, యత్తంబై చెంగలింప నప్పుడు కడఁకన్. 40

తే. షోడశాబ్దవయోమూర్తి సుందరాంగు, శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్తుఁ
బీతకౌశేయు లక్ష్మీసమేతవక్షు, నాదిదేవుని విష్ణుని నాత్మఁ దలఁచి. 41

క. బాలకుఁడు బ్రహ్మవిద్యా, శీలుండై చిత్సుధాభిషేచనమతితో
లోలోనిచవులమిక్కిలి, లోలుండై బాహ్యరుచులు లోఁ గొనకుండెన్. 42

చ. ముదమున సర్వలోకములు మోచి వెలింగెడివాసుదేవునిన్

---

అస్మదాదులు = మేము మొదలైనవారు, ఉపాసించి=సేవించి, భక్తరక్షణపరాయణుండు = భక్తులను రక్షించుటయందు ఆసక్తుఁడు, ఆరాధింపుము = అర్చింపుము, విధివంతంబుగాన్ = శాస్త్రమునందు చెప్పినక్రమముతో కూడుకొనునట్లుగా, తపశ్చరణప్రకారంబు = తపస్సుచేయువిధము, ఔత్తానపాది = ఉత్తానపాదునికొడుకు - ధ్రువుఁడు, ప్రమోదభరితహృదయుఁడు = సంతోషములో నిండుకొన్న మనస్సు కలవాఁడు. 38 అర్థితోన్=ప్రియముతో, అలవరించెన్=చేసెను, సార్వకాలంబు = ఎల్లకాలము, ఆస్పదము=స్థానము. 39 పట్టు=స్థానము, కాళిందియందున్ = యమునానదియందు, తీర్థమాడి = స్నానముచేసి. 40 చెంగలింపన్ = అతిశయింపఁగా. 41 షోడశాబ్దవయోమూర్తిన్ = పదియాఱేండ్ల వయస్సుగల ఆకృతిగలవానిని, పీతకౌశేయున్ = ప[illegible] వస్త్రము ధరించిన వానిని. 42 చిత్సుధాభిషేచనమతితోన్ = జ్ఞానామృతము[illegible] తలఁపుతో, లోలోనిచవులన్ = తనయందలి జ్ఞానామృతరుచులయందు - జ్ఞానా[illegible]మునందు, లోలుండు = ఆసక్తుఁడు, బాహ్యరుచులు = బయటిచవులు-భక్ష్య భోజ్యాదులవలని [illegible],

హృదయములోన నిల్పి తప మిమ్ములఁ జేయుచునున్న రాసుతున్
సదమలవృత్తిఁ బూన ధృతిచాలక భూమి వడంకె నొక్కటన్
విదితనదీనదాబ్ధిపృథివీధరఘోరవనాళి గూడఁగన్. 43

తే. ఒక్క పాదంబు ధర మోపి యూర్ధ్వబాహుఁ
డగుచు నుగ్రతపంబు సేయంగ నతని
పదముదిక్కు వసుంధరాభాగ మెల్ల
నొరగు వారిధిలోనిపేరోడవోలె. 44

ఇంద్రుఁడు ధ్రువునితపము విఘ్నము చేయఁ బూనుట.

వ. ఇట్లు సకలలోకక్షోభంబుగా నుగ్రతపంబు సేయునతని తపోవహ్ని సకలచరా
చరభూతంబులకు నసహమానం బయ్యె నప్పుడు. 45

క. దేవపతియాము లనియెడు, దేవతలును దాను వాసుదేవధ్యాన
శ్రీవిభవుఁ డైనధ్రువునిత, పోవిఘ్నం బర్థిఁ జేయఁ బూని కడంకన్. 46

శా. భూతప్రేతపిశాచరూపములతోఁ బొల్పారుకూశ్మాండక
వ్రాతంబుం బిలిపించి మీరు భయదవ్యాపారులై పోయి ని
ర్ఘాతక్రూరకఠోరఘోరరవముల్ గల్పించి యబ్బాలకున్
భీతుం జేసి తపంబు మాన్పుఁ డనుచుం బ్రేరేచినన్ ధీరులై. 47

సీ. చటులదంష్ట్రావిషజ్వాలాకరాళభీకరభుజంగంబులై కఱవవచ్చుఁ
గేసరిశార్దూలకిరిగండభేరుండరూపంబులై పొడచూపుచుండు
దైత్యపిశాచభూతప్రేతడాకినీసంరావములతోడ సందడించుఁ
జిటచిటార్భటిఁ బరిస్ఫుటదావపావకకీలలఁ గ్రొమ్మంటలోలిఁ బొదవు

గొనక=గ్రహింపక. 43 ఇమ్ములన్=సుఖముగా, రాసుతున్ = రాజకుమారుని, సదమలవృత్తిన్ = నిర్మలమైన వ్యాపారము గలవానిని, పూనన్=వహింపను, ధృతి=ధైర్యము - ఓర్పు, విదిత...వనాళి=ప్రసిద్ధమయిననదులు నదములు సముద్రములు పర్వతములు భయంకరములైన అడవుల పఙ్క్తులును. 44 ఊర్ధ్వబాహుఁడు = మీఁది కెత్తఁబడిన చేతులు గలవాఁడు, పదము దిక్కు = కాలితట్టు, ఒరగున్ = మ్రొగ్గును, వారిధి=సముద్రము, పేరోడ=పెద్దఓడ. 45 క్షోభము = కలఁతపాటు, వహ్ని=అగ్ని, అసహమానము=సహింపరానిది. 47 పొల్పారు=ఒప్పునట్టి, కూశ్మాండక వ్రాతము= ఒక విధమైన రాక్షసులయొక్క సమూహము, భయదవ్యాపారులు = భయంకరమైన వ్యాపారము గలవారు, నిర్ఘాత...రవములు = పిడుగును బోలినవియు హింసకములును కఠినములును భయంకరములునైన ధ్వనులను, భీతున్ = భయపడినవానిఁగా, ప్రేరేచినన్=ప్రేరేపింపఁగా. 48 చటుల... భుజంగంబులై=వాఁడియైన కోఱలవలని విషపుమంటలచేత విశాలముఖము గలిగిన భయంకరములైన పాములై, కేసరి...రూపంబులై = సింహము పులి పంది గండభేరుండము వీనియొక్క రూపములు గలవై, పొడచూపుచుండున్ = కనఁబడుచుండును, దైత్య...తోడన్ = రాక్షసులు పిశాచములు భూతములు ప్రేతములు డాకినులు వీనియొక్క కూఁతలతో, సందడించున్ = సందడిని కలుగఁజేయును, చిటచిటార్భటి...కీలలన్ = చిటచిటయను ధ్వనితో చక్కగా వెలుఁగుచున్న కార్చిచ్చు

తే. వదనముల మంట లొలుకంగ ముదిసినట్టి, జంబుకంబులు క్రొమ్మిదయ్యంబులట్లు
బెట్టు రాత్రులఁ గూఁతలు పెట్టుచుండు, నవిరళధ్యానపరుఁ డైనధ్రువునికడను.

వ. ఇట్లనేకవిధంబులం దపోవిఘ్నంబు సేయునెడ నొక్కనాఁ డొక్కమాయావి
యైనరాక్షసి సునీతిరూపంబు గైకొని యతనిపాలికి వచ్చి బాష్పపూరితలోచ
నయై గద్గదస్వరంబున నిట్లనియె. 49

ఉ. అన్న కుమారచంద్ర తగునయ్య నిరంతరదుఃఖవార్ధిలో
నన్నిటు ముంచి యీవిధమునన్ భయదాటవులం దపంబు సే
య న్నడ తెంచితిట్టినిను నన్యులు మెత్తురె పిన్నబిడ్డలన్
వెన్నుఁడు మెచ్చి యెన్నఁ డొసవెన్ వరముల్ నినువంటివారికిన్. 50

ఉ. అందనిపంటి కేమిటికి నట్టు నిగిడ్చెదు విష్ణుఁ డున్నయా
కందువచందమామగుటకల్ విను మీపని గట్టిపెట్టి నా
డెందములోనియుమ్మలిక డిందుపడం జనుదెమ్ము పొంద మిం
పొంద సమస్తభోగములఁ బొందెడుతండ్రికి వేడ్క సేయఁగన్. 51

శా. ఆరం బండినపైరు వోవిడిచి దుర్వ్యాపారచిత్తంబుతో
ఘోరారణ్యములోన మోడునఱకన్ గొడ్డండ్లు సేయించిన
ట్లీరాజ్యంబు సమస్తమున్ విడిచి నీ వేలా తపోనిష్ఠకుం
జేరన్ వచ్చితి భావికాలఫలముల్ చింతించి సత్పుత్రకా. 52

శా. బాలక్రీడలఁ దల్లిదండ్రుల నదభ్రప్రీతి నొందించి యి
చ్ఛాలంకారవిహారముల్ సలిపి పూజ్యం బైనరాజ్యస్థితుల్
చాలం గైకొని వార్ధకంబునఁ దపస్సంపత్తిఁ గైకొంటగా
కేలా దేహము దుఃఖపెట్టెదవు తండ్రీ చిన్నిప్రాయంబునన్. 53

ఉ. దట్టపులజ్జతో సవతితల్లి దురుక్తులు నెమ్మనంబునం
బెట్టి విరక్తిపుట్టి పటుభీషణవృత్తిఁ జరింపనేల నీ
కిట్టిచలంబు చాలఁ గలదేని మహీతలమెల్ల నేలఁగాఁ
బట్టముఁ గట్టునేర్పున నుపాయ మెఱింగితి రమ్ము పుత్రకా. 54

---

మంటలచేత, క్రొమ్మంటలు=క్రొత్తమంటలు, ఓలిన్=వరుసగా, పొదువున్ = క్రమ్ముకొనును, వదనము లన్ = ముఖములందు, బెట్టు = భయంకరముగా, అవిరళధ్యానపరుఁడు = ఎడతెగని ధ్యానసమాధి యందు ఆసక్తుఁడు. 49 బాష్పపూరితలోచన = కన్నీళ్లచే నిండిన కన్నులు గలది, గద్గద = డగ్గుత్తిక గల. 50 నడతెంచితి = నడచితివి - వచ్చితివి, ఒసవెన్=ఒసఁగెను - ఇచ్చెను. 51 పంటికిన్= పండునకు, అట్టు=మెడ, నిగిడ్చెదు = చాఁచెదవు, కందువ=స్థానము, చందమామగుటకలు = పొంద రానిదనుట, కట్టిపెట్టి - మానుకొని, ఉమ్మలిక = దుఃఖము, డిందుపడన్=అడఁగ. 52 ఆరన్ = పూర్ణముగా-చక్కగా, మోడు=మోటు. భావికాలఫలములు = రాఁగల కాలపు ప్రయోజనములు. 53 అదభ్రము=సార్థకము, చాలన్=తృప్తిగా, వార్ధకంబునన్=ముదిమియందు, కైకొంట=కైకొనుట-గ్రహించుట. 54 దట్టపు = అధికమైన, దురుక్తులు = చెడ్డమాటలు, భీషణవృత్తిన్ = భయంకర

శా. నోముల్ పెక్కులు నోచి యుజ్జ్వలతపోనుష్ఠానకర్మంబు లు
ద్దామప్రీతి నొనర్చి సత్సుతునిఁగాఁ దండ్రీ నినుం గాంచితిన్
నామాటల్ విను రాజ్యభోగములకున్ ర మ్మింక రాకుండినన్
నీమీఁదం బడి ప్రాణముల్ విడిచెదన్ నిక్కంబుగా నిచ్చటన్. 55

మ. అనుచుం దెంపుతలంపునన్ బలుక మాయామాతదుర్వాక్యముల్
వినఁగా నొల్లఁడు చూడ నొల్లఁడు మనోవీథిన్ వినోదించు న
వ్వనజాతాక్షునిమూర్తియందు లయమై వర్తించుచిత్తంబుతో
నొనరన్ బాహ్యవివేకశూన్యుఁడు ధ్రువుం డుద్యచ్ఛిలారూపమై 56

వ. అట్టిసమయంబున ననేకశస్త్రాస్త్రపాణులును భయంకరసింహనాదులును వికృతవేషధారులును నైనరాక్షసు లనేకసహస్రసంఖ్యలు వచ్చి యబ్బాలునిం బొదివి వెఱపించి యుద్ధతిఁ జూపిన నవియెల్లను భగవద్ధ్యానపరాయణుం డైనయౌత్తానపాదియందు దురాత్మునకుం జేసినయుపకారంబులుంబోలె విఫలంబు లగుటయు నప్పుడు. 57

ఉత్సాహ. యామగణసమేతుఁడై మహాభయంబుతోడ సు
త్రాముఁ డప్పు డక్కుమారుతపముఁ జెఱుప నుపమ యొం
డేమియును నెఱుంగలేక హృదయతాప మగ్గలం
బై మునీంద్ర యావద్రాగినట్టికంటకంబునన్. 58

క. ఆతనితపోమహత్త్వము, శ్రీతరుణీశ్వరునితోడఁ జెప్పి యుడుపలే
కీతఁడె నుపేక్ష సేసిన, భూతగణంబులకు హాని పుట్టు నటంచున్. 59

మ. చని వైకుంఠమునందు మందరధరుం జంద్రార్కనేత్రున్ సురా
వనకేళీరతు నంబురాశితనయావక్షోజకుంభోపగూ
హనబాహాపరిశోభితుం గని తదీయశ్రీపదాంభోరుహా
వనతోదంచితమస్తకుం డగుచు దేవస్వామి దా నిట్లనున్. 60

---

వ్యాపారముతో, చరింపన్=మెలఁగ.= 56 తెంపుతలంపునన్ = తెగువ గలతలఁపుతో, లయమై= ఐక్యమై, బాహ్యవివేకశూన్యుఁడు = బయటి తెలివి లేనివాఁడు = ప్రపంచజ్ఞానము లేనివాఁడనుట. 57 శస్త్రాస్త్రపాణులు = శస్త్రములును అస్త్రములును చేతులయందు గలవారు శస్త్రము = కత్తి మొదలైనది, అస్త్రము = మంత్రపూతమైన (బ్రహ్మాస్త్రము మొదలగునది), పొదివి = చుట్టుకొని. ఔత్తానపాది = ఉత్తానపాదునికొడుకు, దురాత్మునకున్ = దుష్టస్వభావము కలవానికి. 58 సుత్రాముఁడు=ఇంద్రుడు, ఉపమ=ఉపాయము, ఒండు=అన్యము, అగ్గలంబు=అధికము, కంటకంబునన్ = సంకటముతో. 59 శ్రీతరుణీశ్వరుఁడు=లక్ష్మీపతి-విష్ణువు, ఉడుపలేక=మాన్పలేక. 60 సురావనకేళీరతున్ = దేవతలను రక్షించుట యనెడు క్రీడయందు ఆసక్తుఁడైనవానిని. అంబురాశి...శోభితున్ = లక్ష్మీదేవియొక్క కుచకలశములను ఆలింగనము చేసికొనెడు చేతులచే ప్రకాశించువాఁడు, తదీయ...మస్తకుఁడు=అతనిదైన పూజ్యమైన పాదకమలములయందు (సోఁకునట్లు) వంపఁబడిన తల

శా. ఓలోకేశ్వర చిత్తగింపుము ధ్రువుం డుత్తానపాదక్షమా
పాలశ్రేష్ఠునినందనుండు మిగులన్ బాలుండు నీభక్తుఁడై
యేలోకాని మహాతపోనిరతుఁడై యిట్లున్నవాఁ డాతనిం
బోలంజాలరు తొంటితాపసులు మాబోంట్లున్ విరించాదులున్. 61

తే. చెక్కుమీటినవసగాఁడు శిశువుభక్తి, నుగ్రతప మాచరించుచు నున్నయతని
యతులతపము విఘ్నంబు సేయంగఁబూని, పెక్కుమాయలు పన్నితి బెళకు లేదు.

చ. అతులతపంబు పెంపున రమాధిప నీవలనన్ ధ్రువుండు దా
నమరపదంబుఁ గైకొనునొ యంబుజమిత్రునిఁ బాఱఁదోలునో
హిమకరురాజ్యమేలునొ దిగీశులలో నొకఁడై చెలంగునో
ప్రమదముతోడఁ దానె మనుపట్టములన్నియు నాక్రమించునో. 63

వ. అనిన నందకపాణి వజ్రపాణి కిట్లనియె. 64

ఉ. ఇంద్రపదంబుఁ గోరఁడు దిగీశులరాజ్యము లాససేయఁ డా
చంద్రునికల్మిపై మనసుఁ జూపఁడు తా మును పంకజాప్తదై
త్యేంద్రులలోకముల్ దలఁపఁ డెన్నఁడు వీరికి లేనిమేలు రా
జేంద్రసుతుండు వేఁడొకటి యిచ్చుఁ దలంచుట నే నెఱుంగుదున్ 65

ఉ. ఆతనికోర్కె లెల్లఁ బ్రియమారఁగ నిచ్చి తపంబు మాన్పెదన్
భీతిఁ దొఱంగి యుండు మని పెంపున నింద్రునిఁ బంచి భక్తలో
కాతిశయప్రమోదకరుఁడై నముకుందుఁడు వచ్చెఁ జిన్మయో
పేతమనోరథుం డగునరేంద్రతనూజునిపాలి కున్నతిన్. 66

సీ. వారివాహముఁ బోలువక్షస్థ్సలంబున నిందిరాశంప పెంపొందుచుండ
భూమిపద్మమువంటిబొడ్డుదామరయందుఁ గమలజచంచరీకంబు మెఱయఁ
గల్పవృక్షంబుశాఖలమించుబాహుల నరిశంఖఫలయుగం బందమొందఁ
బరిపూర్ణచంద్రుతోఁ బ్రతివచ్చుమోమున దరహాసనవసుధాధారలొలుక

---

కలవాఁడు, దేవస్వామి=దేవేంద్రుఁడు. 61 చిత్తగింపుము=వినుము, ఏలొ=ఏమిటికో. 62 చెక్కు=చెక్కిలి, మీటినన్=కొట్టినను, బెళుకు=చలనము. 63 అమరపదము=దేవస్థానము, అంబుజమిత్రునిన్=సూర్యుని, హిమకర=చంద్రునియొక్క, చెలంగున్=విజృంభించునో, ప్రమదముతోడన్ = సంతోషముతో - ఉత్సాహముతో. 64 నందకపాణి=విష్ణువు, వజ్రపాణి=ఇంద్రుఁడు. 65 చాఁపఁడు=వ్యాపింపఁజేయఁడు, ఇచ్చన్ = మనసునఁదు. 66 తొఱంగి = విడిచి, పంచి = పంపి, భక్త... కరుఁడు=భక్తులసమూహమునకు మిక్కుటమైనసంతోషమును కలుగఁ జేయువాఁడు, చిన్మయోపేతమనోరథుఁడు = జ్ఞానస్వరూపముతోఁ గూడుకొన్న కోరికగలవాఁడు. 67 వారివాహము = మేఘము, శంప = మెఱపు, భూమిపద్మము = మెట్టదామర, చంచరీకము తుమ్మెద, అరిశంఖఫలయుగంబు = చక్రముశంఖమును నెడు పండ్లయొక్కజత, ప్రతివచ్చు=సమానమగు, మోము=ముఖము, దరహాస,,, ధారలు = చిఱునవ్వనెడు క్రొత్తయమృతపుధారలు, నభముతోన్ = ఆకాశముతో,

తే. నభముతోఁ బ్రతిరైన నెన్నడుమునందుఁ
గనకకౌశేయసాంధ్యరాగంబు మెఱయ
భక్తలోకైకరక్షణోపాయధుర్యు
డై జనార్దనుఁ డపుడు ప్రత్యక్షమయ్యె. 67

వ. ఇట్లు ప్రత్యక్షంబై. 68

స్వాగతావృత్తము. ఆనరేంద్రతనయాగ్రణి యోగ, ధ్యానధారణవిధాననిధానం
బైనచిత్తము లయంబగుటెల్లం, దా నెఱింగి కృపఁ దార్కొనుదృష్టిన్. 69

వ. అతనినవలోకించి కుమారా నీతపోమహత్త్వంబునకు మెచ్చితి నీయిచ్చకువచ్చిన
వరంబు లిచ్చెద వేఁడు మని తెలిపిన నతం డున్మీలితలోచనుండై. 70

ఆ. యోగదృష్టిచేత నోరంతప్రొద్దును, భావవీథిఁ గానఁబడినమూర్తి
బాహ్యదృష్టిఁ గానఁబడిన నిక్కంబుగాఁ, దలఁచి రాజసుతుఁడు తెలివినొంది. 71

వ. భయభక్తితాత్పర్యంబులు చిత్తంబునం బెనంగొన సాష్టాంగదండప్రణామంబులు
సేసి నిలిచి కరకమలంబులు మొగిచి. 72

తే. కమలలోచనురూపంబుఁ గన్నులారఁ, జూచి యానందరసకేళిఁ జొక్కి యతఁడు
తన్నుఁ దానేమి యెఱుఁగనితలపుతోడ, నుండియును గద్గదస్వరయుక్తిఁ బలికె.

క. వరమిచ్చెద నని లక్ష్మీ, వర వచ్చితినాకు నిన్ను వర్ణింప మనో
హరమై యున్నది యఘుసం, హారమగువాక్ప్రతిభ నాకు నందింపఁగదే. 74

చ. అనుటయుఁ బద్మనాభుఁడు దయామృతపూరితదివ్యచిత్తుఁడై
జనపతిసూతిమస్తమునఁ జారుతరోపనిషద్రహస్యసం
జనితమృదూక్తిసంఘు మగుశంఖము మోపిన నమ్మహాత్ము నె
మ్మనము మహాప్రకాశమహిమం జెలువొందె ననేకభంగులన్. 75

ఉ. అప్పుడు రాజపుత్రుఁడు మహాప్రతిభావిభవాభిరాముఁడై
యప్పరమేష్ఠిముఖ్యులకు నైన నగమ్యము లైనయర్థముల్
చొప్పడ నాగమోక్తఘనసూక్తులఁ జేతులు మోడ్చి భక్తితో

---

కనకకౌశేయ సాంధ్యరాగము = పీతాంబరముయొక్క కాంతియనెడు సంధ్యారాగము. 69 నిధానము = నిధి, తార్కొను = చేరు - పొందు. 70 వేఁడుము=కోరుము, ఉన్మీలితలోచనుఁడు=తెఱవఁబడిన కన్నులుగలవాఁడు. 71 ఓరంతప్రొద్దును = ఎల్లప్పుడును, భావవీథిన్ = మనస్సునందు. 72 తాత్పర్యము = తత్పరత్వము, మొగిచి = ముకుళించి. 73 చొక్కి = పరవశుఁడై, తలంపుతోన్ = ఎన్నికతో-ధ్యానముతో. 74 వాక్ప్రతిభన్=మాటలకలిమిని, అందింపఁగదే=పొందింపుమా - కలిగింపుమనుట. 75 పూరితము = నిండింపఁబడినది, జనపతిసూతిమస్తమునన్ = రాజకుమారుఁడైన ధ్రువునిశిరస్సునందు, చారుతర...సంఘము=మిక్కిలిమనోజ్ఞములైన ఉపనిషత్తులలోని రహస్యములను పుట్టించెడు (తెలిపెడు) తిన్ననిమాటలయొక్క కూటమిగలది. 76 మహా...రాముఁడు = అధికమగుప్రతిభాసంపత్తిచేత ఒప్పినవాఁడు, (ప్రతిభ=సమయోచితస్ఫూర్తిగలబుద్ధి) పరమేష్ఠి = బ్రహ్మ, ఆగమ్యములు = తెలియరానివి, ఆగమోక్తఘనసూక్తులన్=వేదమునందు చెప్పఁ

నప్పరమేశ్వరేశుఁ గొనియాడఁ దొడంగె వికాసభాసియై. 76

ఉ. శ్రీవనితాకళత్ర సరసీరుహసన్నిభనేత్ర భాగధే
యావహ దివ్యరూప నిగమాంతరహస్యకళాకలాప నా
నావరయోగినిర్మలమనస్సరసీరుహభృంగ చిత్సుధా
ప్లావితభక్తసంగ నిరపాయగుణోన్నత లోకసన్నుతా. 77

ఉ. కాష్ఠగతాగ్నివోలెఁ ద్రిజగంబులభూతములన్ గుణంబులం
గాష్ఠలయామినీదినవికారములన్ ఘటికాశరత్కళా
కాష్ఠలు మేరగాఁ గలుగుకాలములన్ భవదీయమూర్తిసు
శ్రేష్ఠతఁ జూపురూపమునఁ జెందుచు నుండుఁ బయోజలోచనా. 78

చ. అగణితలీల నొప్పు సచరాచరభూతసమగ్రమైనయీ
జగములపుట్టువున్ బ్రతుకుఁ జావును నీవలనన్ స్వభావమై
నెగడినరాజసాదికమనీయగుణత్రయచేష్టితంబు లి
ట్లగుట యెఱింగియుం దలఁప రక్కట నిన్ను దురాత్ము లీశ్వరా. 79

ఉ. ఆవులచేతఁ బాలుగొని యందుఁ గ్రమంబున నెయ్యి పుచ్చి య
య్యావుల కాఘృతం బిడి ప్రియం బొనరించినయట్లకాదె నీ
చే వరవాక్యవైఖరులు చేకొని నిన్ను నుతింపఁగా ముదం
బీవు వహింతు వీనటనలెల్లను జిత్రములో జనార్దనా. 80

వ. అని యనేకప్రకారంబుల గొనియాడుచున్న యన్నరేంద్రనందను నవలోకించి భవదీయస్తోత్రారాధనంబువలన సంతుష్టహృదయుండనైతి మద్దర్శనంబు వృథ గాదు వరంబు వేఁడు మనినఁ బరమేశ్వరునకు నతం డిట్లనియె. 81

క. సర్వప్రాణులయందును, సర్వాంతర్యామి వైనసర్వేశుఁడవున్
సర్వజ్ఞుండవు నగునీ, కుర్వీధర కోర్కి సెప్ప నుచితమె కృష్ణా. 82

---

బడిన గురుత్వము గలమేలైనమాటలచేత, వికాసభాసి = తేటదనముచేత ప్రకాశించువాఁడు. 77 శ్రీవనితాకళత్ర=లక్ష్మీదేవి భార్యగాఁ గలవాఁడా, సరసీ...నేత్ర=కమలములను బోలినకన్నులుగల వాఁడా, భాగధేయావహ=భాగ్యమును పొదించువాఁడా, దివ్యరూప = దేవతామూర్తివైనవాఁడా, నిగమా...కలాప=వేదాంతరహస్యము లైనవిద్యలే అలంకారముగాఁ గలవాఁడా, నానా...భృంగ= పెక్కండ్రు ఉత్తమయోగులయొక్క నిర్మలమైన హృదయకమలములకు తుమ్మెదలైనవాఁడా, చిత్సు ధా...సంగ=జ్ఞానామృతమున ముంచఁబడిన భక్తులయొక్క కూడికగలవాఁడా, నిరపాయగుణోన్నత= చెఱుపులేనిగుణముల చేత గొప్పవాఁడా. 78 కాష్ఠగతాగ్ని=కట్టెయందలినిప్పు. కాష్ఠలన్ = దిక్కుల యందు, యామినీ=రాత్రి, ఘటికా...కాష్ఠలు=గడియలు సంవత్సరములు కాష్ఠ అనుకాలవిశేషము లును. 79 అగణితలీలన్ = ఎన్నరానివిలాసముతో, సమగ్రము=పూర్ణము, నెగడిన = అతిశయించిన, చేష్టితములు=చేష్టలు. దురాత్ములు=చెడ్డమనస్సుగలవారు. 80 నటనలు=నడవళ్లు, చిత్రములు=వింతలు, 82 సర్వాంతర్యామి = అంతటనిండివర్తించువాఁడు, ఉర్వీధర=భూమినిధరించినవాఁడా, 83 చిత్త

శా. వినం జెప్పెదఁ జిత్తగింపుము మహాత్మా తండ్రి సింహాసనా
సీనుండై కొలువున్న నే నచటికిం జేరంగ నాసించితిన్
దానిం గన్గొని పెద్దతల్లి కినుకన్ ధట్టించి యిందుండ మ
త్సూనుం డర్హుఁడుగాని నీవుదగవంచున్ నన్నుఁ బల్కెన్ వెసన్ 83

శా. ఏ నవ్వాక్యము లాత్మలో నిలిపి లోకేశుండ వైనట్టినీ
చే నత్యున్నత మైనదివ్యపద మక్షీణప్రభావంబునుం
బూనన్ వచ్చితి నాకు నవ్వరము సంపూర్ణంబుగాఁ జేయవే
ధ్యానారూఢమునీంద్రహృత్కమలసద్మా పద్మపత్రేక్షణా. 84

వ. అనిన నద్దేవుండు నరదేవనందనునకుఁ గరుణారసకందళితహృదయుండై యి
ట్లనియె. 85

## ధ్రువునిపూర్వజన్మవృత్తాంతము.

సీ. భూమీశనందన పూర్వజన్మంబున నీవు బ్రాహ్మణుఁడవై నిఖిలవేద
శాస్త్రంబులును నేర్చి సాధుసమ్మతిఁ గులాచారముల్ దప్పక జననియందు
జనకునియందును సద్భక్తి వదలక జపతపోనుష్ఠాన సద్విధులను
నను నుపాసించుచు నాయందు లగ్నమై యున్న చిత్తంబుతో నుండి యుండి
తే. యఖిలసౌభాగ్యనిరతుఁడు నధికరూప, వంతుఁడును నవయౌవనవైభవుండు
నైనయొకరాజుతోడ సఖ్యంబుచేసి, యతనివంటిప్రభుత్వము నాత్మఁ గోరి. 86

తే. ప్రాభవమునఁ గులస్థానపౌరుషములు, నాధిపత్యంబు గలిగినయట్టిరాజ
వరతనూజుఁడవై పుట్టవలయు ననుచు, నన్ను నారాధనము చేసినాఁడ వీవు. 87

తే. అదినిమిత్తంబు నీవు జన్మాంతరమున, వచ్చి కులశీలగుణవైభవములు గలిగి
నట్టియుత్తానపాదున కాత్మసుతుఁడ, వై జనించితి తొల్లిపుణ్యంబువలన. 88

## ధ్రువుండు విష్ణుదేవునివలన ధ్రువస్థానంబుఁ బడయుట.

మత్తకోకిల. ఓకుమారక శైశవంబున నుల్లసిల్లుచు నుండియున్
మాకు భక్తుఁడవై తపోనియమవ్రతంబులు సల్పి య
స్తోకపుణ్యపరుండ వైతివి తొంటిజన్మము కోరికల్
నీకు నేడు ఫలించునట్లుగ నెమ్మితో వరమిచ్చెదన్. 89

క. త్రిదశగ్రహతారామునిపదముల కన్నిటికి నుపరిభాగంబునఁ బెం

---

గింపుము = వినుము ఆసించితిన్ = ఆశపడితిని, కినుకన్ = కోపముతో, ధట్టించి = ఉద్ధతిని పొంది, 84 ధ్యానా... సద్మా = నిశ్చలధ్యానయుక్తులైన మునిశ్రేష్ఠుల హృదయకమలములు ఉనికిపట్టుగాఁ గలవాఁడా. 86 ఉపాసించుచు = సేవించుచు, లగ్నమై = అంటినదై. 87 ప్రాభవమునన్ = ప్రభుత్వముతో - ఘనతతో, పౌరుషము = మగతనము - శూరత్వము, అధిపత్యము= అధికారము, ఆరాధనము చేసినాఁడవు = ఆరాధించితివి. 89 శైశవంబునన్ = శిశుత్వమున-కడుబాల్యమున ననుట, అస్తోక=అధికమైన, నెమ్మితోన్=ప్రేమతో. 90 త్రిదశ...పదములకున్=

పొదవుధ్రువస్థానం బున్నది యచ్చోటిత్తు నీకు నరవరపుత్రా. 90

క. అమ్మహనీయపదంబున, సమ్మదమున నీవు మాతృసహితుఁడవై మో
దమ్మును నొందుచు నుడురూ, పమ్మున విలసిల్లు కల్పపర్యంతంబున్. 91

క. అంతంబున మోక్షము న, త్యంతగరిమతోడ నిత్తు ననుచు ధరిత్రీ
కాంతసుతుఁ బలికి దేవుం, డంతర్ధానంబు నొందె నాసమయమునన్. 92

క. నరనాథసుతుఁడు దనుజా, మరకిన్నరసిద్ధసాధ్యమహితస్తుతులం
బరఁగుచు జననియుఁ దానును, సరసవిమానంబు లెక్కి చనిరి మహిమతోన్ 93

వ. ఇవ్విధంబున సూర్యమండలంబునకుం జని సూర్యునిచేతఁ బూజితుండై చంద్రమండలంబుఁ బ్రవేశించి చంద్రునిచేత సంభావితుండై నక్షత్రమండలంబునకుఁ బోయి నక్షత్రరూపంబుల నున్నపుణ్యవంతులచేఁ బ్రీణితుండై బుధమండలంబున కరిగి బుధారాధనశీలుండై శుక్రమండలంబుఁ బ్రవేశించి యతనిచేత స్తోత్రంబులుగొని యంగారకమండలంబుఁ జొచ్చి యతనివలనఁ దేజోలాభంబునుం బొంది బృహస్పతిమండలంబున నిలిచి తదీయగౌరవంబున కర్హుండై శనైశ్చరమండలంబు దర్శించి యతనిచేత ననుగ్రహంబు వడసి సప్తర్షిమండలంబుఁ జూచి వారలవలన మహనీయమహిమలు గాంచి. 94

క. చని ధ్రువలోకంబున న, త్యనుపమసౌభాగ్యయుక్తుఁడై లోకంబుల్
దనక్రిందను వర్తింపఁగ, ననుపమసంపదల నేఁడు నందెడుగరిమన్. 95

క. మానుగ నీధ్రువచరితము, మానవు లెవ్వారు వినిన మహనీయయశ
శ్శ్రీనిరతి నొందుదురు మఱి, స్థానభ్రష్టతయు లేక తనయులుఁ దారున్. 96

వ. అట్టిధ్రువుండు శంభు .వనుభార్యయందు శిష్టియు భవ్యుండు ననుపుత్రద్వయంబుఁ బడసె నందు శిష్టి యనువాఁడు సుచ్ఛాయ యనుభార్యయందు రిపుండును రిపుంజయుండును విప్రుండును వృకలుండును వృకతేజుండును ననువారి నేవురం బడసె నందు రిపునకు బృహతి యనుదానియందుఁ జాక్షుషుండు పుట్టె వానికి వరుణవంశజాత యైన పుష్కరిణి యనుదానియందుఁ జాక్షుషమనువు పుట్టె. వానికి వైరాజప్రజాపతిపుత్త్రియైన నడ్వలయనుదానియందునూరుండును బూరుండును శతద్యుమ్నుండును తపస్వియు సత్యవాక్కును శుచియు నగ్నిష్టోముండును నతిరాత్రుండును సుద్యుమ్నుండును నభిమన్యుండును నను పదుండ్రు పుట్టి రందు నూరునకు నాగ్నేయి యనుదానియందు నంగుండును సుమనసుండును స్వాతియును క్రతువును నంగిరసుండును శిబియు ననునా

దేవతలు గ్రహములు నక్షత్రములు సప్తమహర్షులు (వీరియొక్క) స్థానములకు, ఉపరిభాగంబునన్ = మీఁదిభాగమునందు, పెంపు = మేలిమి. 91 మోదమ్మును = సంతోషమును, ఉడురూపమ్మునన్ = నక్షత్రాకృతితో, కల్పపర్యంతంబున్ = ప్రళయమువఱకు. 92 గరిమ = గౌరవము, ధరిత్రీకాంతసుతున్ = రాజకుమారునితో. 94 ప్రీణితుండై = సత్కరింపఁ బడినవాఁడై, 97 పదుండ్రు=

రువ్వురు పుట్టిరి. అందు నంగునకు మృత్యుపుత్రి యగుసునీథయందు వేనుండు
పుట్టె. 97

చ. జనసుత వేనుదక్షిణభుజంబు మునుల్ మథియింపఁగాఁ బృథుం
డనునరనాయకుం డుదయమై జనలోకము బాహువిక్రమం
బొనరఁగ నేలి భూవలయ మున్నతి ధేనువుఁజేసి దుగ్ధదో
హన మొనరించి తన్పె సచరాచరభూతములం బ్రియంబుతోన్. 98

చ. అనవుడు శిష్యుఁ డగ్గురున కంజలిచేసి మహాత్మ యమ్మహా
మునివరులేల వేనుభుజముల్ మథియించిరి యాపృథుండు దా
జననము నొందు టెట్టులు రసాసతి ధేనువుఁ జేసి లోకముల్
గెనయఁగ నేలపాలు పిదికెన్ వినిపింపుము నాకు నేర్పడన్. 99

వ. అనినం బరాశరుం డిట్లనియె. 100

## వేనునిచరిత్రము.

ఉ. అంగుఁడు మృత్యుపుత్రి యగునట్టి సునీథను బెండ్లియాడి య
య్యంగనయందు వేనుఁ డనునాత్మజునిం గని రాజయోగ్యభో
గాంగము లైనభాగ్యముల కాతని పట్టముగట్టుచుం దప
స్సంగతి నేగె నానృపతిసత్తముఁ డాలును దానుఁ గానకున్. 101

క. మాతామహదోషంబున, నాతఁడు రాజ్యంబు సేయునప్పుడు పుణ్యో
పేతక్రియ లొనరింపక, పాతకములు సేయుచుండె బహుగర్వమునన్. 102

సీ. ఆదికాలమునాఁటియగ్రహారంబులు బందెలు గల్పించి పాడుసేయు
నన్యాయమున విత్త మార్జించి పరలోకసాధనంబులు గానిజాడ నొసఁగు
వేదాంతవిదు లైన విద్వజ్జనంబుల వెదకించి దేశంబు వెడల నడుచు
పరశుభప్రద మైనవైష్ణవధర్మంబు మఱచి పాషండధర్మముల నడపు
తే జారచోరదురాచారసమితిఁ బ్రోచు
ననృతమును నాస్తికతయును బెనుచుచుండు
ధర్మ మొల్లఁ డతిక్రూరదండనంబు
సాధుజనులందుఁ గావించు జనవిభుండు. 103

చ. శ్రుతులు పరిత్యజించి విధిచోదితకర్మము లుజ్జగించి సు
వ్రతములు గట్టిపెట్టి గరువంపుఁదపంబులు వీటఁబుచ్చి స
త్క్రతువుల యాస మాని సతతంబును దన్నునె కొల్వఁడంచు నా

---

పదిమంది. 98 మథియింపఁగా = తరుపఁగా, దుగ్ధదోహనము = పాలుపిదుకుటను, తన్పెన్ = తని యించెను - తృప్తినొందించెను. 99 అంజలి = చేమోడ్పు, రసాసతి = భూదేవి, గెనయఁగన్ = తనియఁగా. 103 బందెలు = పన్నులు, పాషండధర్మములు=వేదవిరుద్ధాచారములు, జారచోర... సమితిన్ = విటులయొక్కయు దొంగలయొక్కయు చెడునడవడికలవారియొక్కయు గుంపును, నాస్తికత = దేవుఁడు లేఁడనుతలఁపు. 104 ఉజ్జగించి = విడిచి, వీటఁబుచ్చి = వ్యర్థపఱిచి, సింధు

క్షితిపతి చాడఁగాఁ బనిచె సింధుపరీతమహీతలంబునన్. 104

సీ. తనదుర్గుణంబులఁ గొనియాడ నొల్లనిసాధులోకంబుల సంహరించుఁ
దనకుఁ జెప్పక మహాధ్వరములు సేసినసోమయాజులయిండ్లు చూఱలాడుఁ
దనదురాచారవర్తనములు గాదన్న గురుజనంబులనైనఁ బరిభవించుఁ
దనుఁగూర్చి బుద్ధిసెప్పినబంధువులనైనఁ బ్రాణాభిమానముల్ భంగపఱచుఁ

తే. దనకు ననుకూలవృత్తి నుద్దండలీల, నుండుపాపాత్ములకు నెల్ల నూళ్లొసంగుఁ
దన్ను దైవంబుగాఁ గొల్చుచున్నవారి, కొసఁగ రానిపదార్థంబు లొసఁగు నతఁడు.

క. ఇల నెవ్వఁడు తనయాజ్ఞకు, వెలియై వర్తించు వేదవిప్రునినైనన్
దలఁ ద్రెవ్వనేసి చంపుఁడు, తొలఁగక మీరనుచుఁ బల్కె దుష్టభటాలిన్.

శా. వేనుం డీగతిఁ బాపకర్మములు గావింపంగ నాకీడున
న్వాన ల్గల్గక మానె నారబము లెండన్ జొచ్చెఁ బెక్కాపదల్
గాన న్వచ్చె సమస్తదేశముల మొక్కల్ దాఁక నన్యోన్యదు
ర్మానక్రోధమునం బ్రజ ల్చెడిరి క్షామంబయ్యె నానాఁటికిన్. 107

చ. మునివరులెల్ల నానృపతిమూఢవివేకముఁ బాపకర్మవ
ర్తనమును జూచి యీతనికి ధర్మగుణంబులు బోధచేసి స
జ్జననుతమార్గము న్దెలిపి సాత్వికబుద్ధియు విష్ణుభక్తియుం
బనుపడఁ జెప్పి పాపములఁ బాపి కృతార్థునొనర్త మర్థితోన్. 108

చ. అని తలపోసి యాతపసు లంగతనూజునిపాలి కేగి యా
తనిబహుమానపూర్వకవిధానము లైననృపాలయోగ్యపూ
జనములఁ దన్పి తొల్లిటిధరాతలనాథులసచ్చరిత్రముల్
మునుకొని చెప్పి యాకుమతిముక్కునఁ గోపము పిక్కటిల్లఁగన్. 109

తే. తొంటి నీవంశకర్తల ధీరతనములఁ, బ్రబలుసచ్చరితంబులు భావికాల
మేదినీనాథులకు నెల్ల మేలుబంతి; గాఁ బ్రవర్తింప కేల దుష్కర్మి వైతి. 110

చ. తపసుల నేలచంపెదవు ధర్మము లేటికి సాగనీవు పా
పపతుల నేలఁగూడెదవు బ్రాహ్మణనింద యొనర్చెదేల స

---

పరీత = సముద్రముచే చుట్టఁబడిన. 104 చూఱలాడున్ = కొల్లపెట్టును, ఉద్దండలీలన్ = ఉద్ధతిగలరీతితో. 106 వేదవిప్రుఁడు = వేదముచదివిన బ్రాహ్మణుఁడు, ద్రెవ్వనేసి = తెగఁగొట్టి, తొలఁగక = తప్పక. 107 కీడునన్ = దోషముచేత, అరబములు = పైరులు, మొక్కల్ దాఁకన్ = కొఱఁతలుతోఁచఁగా. 108 మూఢవివేకమున్ = తెలివిమాలినతనమును, వర్తనమున్ = ప్రవర్తించుటను, పనుపడన్ = అలవాటుపడ. 109 విధానములు=విధులు, తన్పి = తనియఁజేసి-తేర్చియనుట, మునుకొని = పూని, అకుమతి = కుత్సితబుద్ధిగలవానియొక్క, పిక్కటిల్లఁగన్ = అతిశయింపఁగా. 110 తొంటి=తొల్లిటి, భావికాలమేదినీనాథులకున్ = ఇఁకమీఁదటిరాజులకు, మేలుబంతి = శ్రేష్ఠము-సరియైనదని గ్రహింపఁదగినది, దుష్కర్మివి=చెడ్డనడతకలవాఁడవు. 111 సాగనీవు = జరగనియ్యవు, పాపపతులన్ = పాపకృత్యములు చేయునట్టిరాజులను, కీల్కొనెదు =

త్కృపచెడి దుష్టకర్మములఁ గీల్కొనెదేటికి వేద మొల్ల వే
ల పరమవైష్ణవంబును దొలంగితివేమి నరేంద్రనందనా. 111

తే. అప్రసాదంబు నన్నృతంబు నాదియైన, రాజదోషంబు లేల తిరస్కరింప
నఖిలదేవతాప్రీతిగా నార్యజనులు, మెచ్చఁ గ్రతువులు నడప వేమిటికి నధిప.

చ. క్రతువులు చేసినన్ సురనికాయము సంతసమందుచుండు దే
వత లతితృప్తులైన మహి వానలు గల్గు సువృష్టిగల్గినన్
క్షితిబహుసస్యసంపదలఁ జెన్నగుఁ బంటలచేత మర్త్యు లు
న్నతి వహియింతు రందు నరనాథుఁడు సుస్థితిఁ గాంచు నెప్పుడున్. 113

వ. అదియునుంగాక యజ్ఞంబులు చేయురాజ్యంబుల యజ్ఞమూర్తి యైననారాయణుండు ప్రత్యక్షంబై యుండుఁ బుండరీకాక్షుండు విహరించురాష్ట్రంబున ఫలసస్యసమృద్ధియు గోతురంగమాతంగాదిమహిమలుం గలుగుం గావున యజ్ఞంబులు రాజులకుఁ గల్యాణకారణంబులు భవదీయవంశకర్తలైనరాజులచరిత్రంబులు దలంచి ధర్మంబులు నిలుపుము యజ్ఞంబులు గావింప ననుజ్ఞ యిమ్మనినం గోపించి వేనుండు మునీంద్రులతో నిట్లనియె. 114

క. నాకంటె నధికుఁ డెవ్వఁడు, లోకంబునఁ గలఁడు విష్ణులోకోత్తరుఁగాఁ
జేకొని చెప్పెదరే యవి, వేకంబున మీర లిట్టి వెఱ్ఱులు గలరే. 115

తే. బ్రహ్మవిష్ణుమహేశ్వరప్రముఖులైన, దేవతలయంశములచేతఁ దేజరిల్లి
భూమిపాలించుకొఱకునై పుట్టినాఁడ, నేను నాకంటె దైవంబు లెంత పెద్ద. 116

తే. భర్తృశుశ్రూష కాంతకుఁ బరమధర్మ, మయినవిధమున నాయాజ్ఞ నఖిలజనులుఁ
బూని నడచుట ధర్మంబు దీని నెఱిఁగి, కాదె మాన్చితి ధరలోనఁ గ్రతువులెల్ల.

### మునులు వేనుని శపించుట.

తే. అనిన మునినాథులందఱు నంగసుతునిఁ
బ్రియము పుట్టంగఁ బ్రార్థించి పెద్దఁజేసి
యెన్ని చెప్పిన నన్నిటి కన్ని చెప్పి
దేవతానింద యొనరించి ధిక్కరించె. 118

క. అప్పుడు మునివరు లందఱు, నప్పాపాత్మకునివలన నవమానితులై

---

అంటెదవు - అవలంబించెదవు. 112 అప్రసాదంబు = మొగము ముడుచుకొనియుండుట. రాజదోషంబులు = రాజులవలని లోపములు, క్రతువులు = యజ్ఞములు. 113 నికాయము = సమూహము, సువృష్టి = మంచివాన. చెన్నగున్ = అందమగును - ఒప్పును, ఉన్నతిన్ = గొప్పను, సుస్థితిన్ = మంచియునికిని. 114 యజ్ఞమూర్తి = యజ్ఞస్వరూపుఁడు, గోతురంగమాతంగాదిమహిమలు = ఆవులు గుఱ్ఱములు ఏనుఁగులు మొదలగువానికలుములు, కల్యాణకారణంబులు=మేలుగలుగుటకు మూలములు. 116 ఎంతపెద్ద = ఎంతగొప్ప-హెచ్చుకాదనుట. 117 భర్తృశుశ్రూష= పెనిమిటియొక్క సేవ, కాంతకున్ = ఆఁడుదానికి - భార్యకనుట.

కప్పిన కోపాగ్నిశిఖల్, ముప్పిరిగొనఁ గలుషవాక్యములు దమలోనన్. 119

మ. మునిలోకస్తుతిపాత్రుఁ డైనకరుణామూర్తిన్ హరిన్ బద్మలో
చను నిందించినపాపకర్ముఁడు మహీన్ సామ్రాజ్యభోగంబుఁ గై
కొనఁగా నర్హ్ముఁడు గాఁడు వీని నతులక్రోధాగ్నిచేఁ జంపి లో
కనిరూఢం బగుధర్మ మొండ మఖముల్ గావింత మత్యున్నతిన్. 120

క. అని నిశ్చయించి దర్భలు, గొని మారణమంత్రములను ఘోరతరముగాఁ
జొనిపినదివ్యాస్త్రములై, మునుకొని యానృపతిదేహమున నాటుటయున్. 121

క. దేవబ్రాహ్మణనిందలు, గావించినయతఁడు పాపకర్మపరుండై
జీవంబు విడిచె ధరణీ, దేవత లానందవార్ధిఁ దేలిరి వేడ్కన్. 122

వ. ఇట్లు విగతజీవుం డైనవేనునికళేబరంబు తైలపాకంబు చేయించి యవనీరాజ్యంబుఁ బాలింపఁ బ్రధానుల నియమించి మహీసురవరులు తదీయవంశసంభవుండు బలపరాక్రమధురీణుండు పరమధర్మశీలుండు విష్ణుభక్తిపరాయణుండు నైనరాజు నెవ్వని నభిషిక్తుం జేయుద మని విచారించుచున్నసమయంబున. 123

సీ. బలిమితో దుర్గాధిపతు లొండొరులతోడఁ బోరాడి తమలోనఁ బొలిసి చనిరి
హావళిమూకలై యాడకాడకుఁ గుత్రమన్నీలుసాదుల మన్నిగొనిరి
చోరసంచయ ముగ్రహారముల్ బందెలు పట్టి సమస్తసంపదలు గొనియె
నాకతాయలు మూఁకలై దేశమంతయుఁ జెఱచి పుణ్యస్త్రీల చెఱలుగొనిరి
తే. దండుతఱచున ధారుణీమండలమున, వివిధధనధాన్యసస్యము ల్వీటివోయెఁ
బ్రజలు వనవాసములుచేసి భంగపడిరి, యవనియందు నరాజకం బైనకతన 124

వ. ఇవ్విధంబున నరాజకం బైనకతన రాజవిద్వరంబున రాజ్యంబునఁ బ్రజానాశం బయ్యె నప్పుడు. 125

తే. రాజులేనిరాష్ట్రంబునఁ బ్రజలకెట్లు, నిర్వహింపంగ నగునని నిర్జరులకు
ధరణి మొఱపెట్టఁబోవుచందమున నెగసె, నిబిడతరమైన పెంధూళి నిఖిలదిశల.

తే. రేణుపటలసంఛన్నగీర్వాణపదవి, లోకనాలోలమానసులును మహోద్భ

---

121 మారణ=చంపునట్టి, ఘోరతరముగాన్=మిక్కిలి భయంకరముగా, చొనిపినన్=(వానియందు) -నాటింపఁగా-ప్రయోగింపఁగా. 123 కళేబరము=దేహము, తైలపాకంబు చేయించి=నూనెలోఁ బ్రేల్పించి, ప్రధానులన్=మంత్రులను, విచారించుచున్=ఆలోచించుచు, 124-దుర్గాధిపతులు=పాళెపట్టు దొరలు, హావళి=ఉపద్రవము, కుత్రమన్నీలు= కుత్సితులైన సామంతరాజులు, మన్నిగొనిరి = చంపిరి, బందెలు = బందిపోట్లు, ఆకతాయలు = ధూర్తులు, మూఁకలై = గుంపులుగూడి, పుణ్యస్త్రీలన్ = ఇల్లాండ్రను, దండుతఱచునన్ = సేనాబాహుళ్యముచేత, వీటిఁబోయెన్=నశించెను, అరాజకము = రాజులేనిది-ఇక్కడరాజులేమియనియర్థము. 125 రాజవిద్వరంబునన్ = రాజులవలని యుపద్రవముచేత. 126 రాష్ట్రంబునన్ = రాజ్యమునందు, నిర్జరులకున్ = దేవతలకు, నిబిడతరము= మిక్కిలిదట్టము, పెంధూళి = మిక్కుటమగుదుమ్ము. 127 రేణుపటల...మానసులు = రేణుజాలము

తత్ప్రకంపితవర్తనోద్యములు నగుచు, క్షోణిదేవత లాదిక్కు చూచునపుడు. 127

క. పొరిఁబొరిఁ బోరులవలనన్, ధరణీసురవరులు సంపదలు సకలంబున్
బఱివోయి రక్తధారలు, దొరఁగెడు దేహములతోడఁ దూలుచుఁ బెలుచన్. 128

క. పరిదేవన మొనరించుచు, నరుదేరఁగఁజూచి మిగుల నాశ్చర్యరసం
భరితాత్ము లగుచు మీకీ, పరిభవ మెట్లయ్యె నని తపసు లడుగుటయున్. 129

ఉ. ఈధరణీతలంబునకు నేలిక యెవ్వఁడు లేఁడు గావునన్
సాధుమతంబు లెవ్వియును సాగవు మ్లేచ్ఛకిరాతు లొక్కటన్
బాధ యొనర్పఁగాఁ బ్రజలు ప్రాణభయంబున నున్న వారు నా
నాధనధాన్యసంపదలు నాశమునొందె ననేకభంగులన్. 130

ఉ. బందులఁ బట్టి చోరకులు బాధ యొనర్పఁగ ధారుణీసురుల్
గుంది సమస్తసంపదలు గోల్పడి కానలలోన నుండఁగాఁ
గొంద ఱెఱింగి కట్టి వెసఁగొట్టుచు భంగము లెల్లఁ జేయఁగాఁ
గొందలమంది యేడ్చుచును గూఁతలు పెట్టెద రాలకింపుఁడా. 131

చ. అదె ధరణీపరాగము భయంకరమై వినువీథిఁ బర్వుచు
న్నది పరికించి చూడుఁడి యనాథజనంబులదీననాదముల్
పొదలి వినంగవచ్చె మునిపుంగవు లందఱు వచ్చి యిట్టియా
పద లుడిగింపరే యనుచుఁ బ్రార్థనచేసి రనేకభంగులన్. 132

ఉ. ఆవసుధామరుల్ పటురయంబున నచ్చటి కేగి దోఁపులన్
బోవుట కెంతయుం బొగిలిపోయినవారలఁ దోడితెచ్చి సం
భావన చేసి రిట్లు తమబాసటచేత సమీపదేశముల్
హావళిఁ బోవకుండఁ దగునట్లుగ నారయుచుండి రెంతయున్. 133

వ. ఇవ్విధంబున నరాజకం బైన రాజ్యంబు నిర్వహింపం దగినరాజు నభిషిక్తుఁ జేయ కున్నఁ బ్రజానాశం బగునని విచారించి మహీసురవరులు సుస్వరంబులుగా వేద

చేత కప్పఁబడిన ఆకాశమును చూచుటయందు ఆసక్తమైన మనస్సుకలవారు, మహోద్భూత...ఉద్య ములు = మిక్కిలియాశ్చర్యముచేత తడఁబడిన వ్యాపారప్రయత్నములు గలవారు, క్షోణిదేవతలు = బ్రాహ్మణులు. 128 పొరిఁబొరిన్ = క్రమక్రమముగా, పఱివోయి=కొల్లపోయి, తొరఁగెడు = కాఱుచున్న, తూలుచు = వివశులగుచు. 129 పరిదేవనము = విలాపము, అరుదేరఁగన్ = రాఁగా, పరిభవము = అవమానము - భంగము. 131 బందులన్ = బందిపోటులతో, కుంది = ఖిన్నులై, చోరకులు = చోరులు - దొంగలు, కోల్పడి = పోఁగొట్టుకొని, కొందలము = దుఃఖము, ఆలకింపుఁడా = వినుఁడు. 132 పరాగము=దుమ్ము, వినువీథి = ఆకాశమార్గము, పర్వుచున్ = వ్యాపించుచు, దీననాదములు = పేదలయొక్క (మొఱ) చప్పుడులు, పొగిలి=అతిశయించి. 133 వసుధామరులు = బ్రాహ్మణులు, దోఁపులన్ = దోఁపిడులచేత, పొగిలి = పరితపించి, సంభావన= మన్నన, బాసటచేతన్ = సహాయముచేత, హావళిన్ = ఉపద్రవముచేత, ఆరయుచుండిరి = విచా

మంత్రంబు లనుష్ఠించుచు వేనునియూరుదేశంబు మథియింపఁ దొడంగి రప్పుడు.

ఉ. కాలినమోటునంటికొఱగానిశరీరము పల్లవెండ్రుకల్
గ్రాలెడుబూచిగడ్డమును ఖల్వాటకంబును నీరెలుంగునన్
బేలగుమూఢవాక్యములు బీఱనరంబులతోడికుక్షియున్
దూలెడువక్రదంతములనోరును గల్గి యొకండు పుట్టినన్. 135

క. మునులెల్ల వెఱఁగుపడి తనుఁ, గనుఁగొనుచుండంగ వాఁడు గలఁగుచు నేనే
పనియొనరింపుదుఁ జెప్పుం, డనుటయు నందఱు నిషీద యని యుడుపుటయున్.

వ. అది నిమిత్తంబుగా వాఁడు నిషాదుం డనునామంబునం బరఁగె నట్టినిషాదుని నృశంసాకారం బుపలక్షించి వీఁడు రాజ్యపరిపాలనంబున కర్హుండు గాఁడని వింధ్యదేశవనశైలంబుల మ్లేచ్ఛకిరాతాధిపత్యంబునకుఁ దగుదు వం దరుగు మని నియమించి పంచిరి. ఇట్లు వేనునిశరీరంబున నున్నపాతకంబు నిషాదరూపంబై తదీయదేహద్వారంబున వెడలె నంత నమ్మహీపతిదురితరహితశరీరంబునందు దక్షిణభుజంబు నమందానందంబున నుదాత్తానుదాత్తస్వరితప్రచయంబులు గల వేదమంత్రంబు లనుష్ఠించుచు మథియించిన.

## పృథుచక్రవర్తిచరిత్రము.

శా. అక్షీణప్రకటప్రతాపనిధిబాహాగర్వదుర్వారశ
త్రుక్షోణీశభయంకరుండు సుజనస్తోత్రుండు సర్వంసహా
రక్షాదక్షుఁడు విష్ణుమూర్తి పృథుఁ డుగ్రస్ఫారతేజంబుతో
సాక్షాదగ్ని యుఁబోలె వేనునిభుజస్తంభారణిం బుట్టినన్. 138

ఆ. పుష్పవృష్టి గురిసె బోరన దేవదుం, దుభులు మ్రోసె జగము లభినుతించె
గరుడఖచరసిద్ధగంధర్వపన్నగ, పతులు సంతసములఁ బరఁగి రపుడు. 139

వ. ఇవ్విధంబున నుదయించి సంప్రాప్తయౌవనుండై వైన్యుండు మహనీయమహిమం దేజరిల్లుచుండె నంత. 140

తే. అతులకరవాలమును విల్లు నక్షయోగ్ర, బాణతూణీరయుగము నక్షీణవజ్ర

---

రించుచుండిరి. 134 ఊరుదేశంబు = తొడచోటు, మథియింపన్ = తరువ. 135 బూచి = వికృతమైన, ఖల్వాటకంబును = తలబట్టయు, ఈరెలుంగు...వాక్యములు = హీనస్వరముతో దైన్యమును దెలుపునట్టి తెలివిమాలిన మాటలు, బీఱ = పెద్దవైన, కుక్షి = కడుపు, తూలెడు = మీఁది కెగసిన—మిట్టలైన. 137 నృశంసాకారంబు = ప్రాణిహింసచేయువాని యాకృతివంటి యాకృతి, ఉపలక్షించి = చూచి. 138 అక్షీణ...సిథి = తఱుఁగని ప్రసిద్ధమైనపరాక్రమమునకు గనియైనవాఁడు, బాహా... భయంకరుండు = భుజగర్వముచేత అణంపరాని శత్రురాజులకు భయమును కలుఁగఁజేయువాఁడు, సుజనస్తోత్రుఁడు = మంచివారిచేత పొగడఁబడువాఁడు, సర్వంసహారక్షాదక్షుఁడు = భూమినిరక్షించుటకు చాలినవాఁడు, ఉగ్రస్ఫారతేజంబుతోన్ = భయంకరమై యతిశయించిన తేజస్సుతో, భుజస్తంభారణిన్ = స్తంభమువంటి చేయియను అరణియందు. (అరణి = అగ్నికొఱకు తరువఁబడుమాను.) 140 వైన్యుఁడు = వేనునివలన జనించినవాఁడు, మహనీయ = పూజ్యమైన. 141 కరవాలము = కత్తి, అక్షయ...

కవచమును వచ్చె దేవలోకముననుండి, యవిమహాసాధనములయ్యె నవ్విభునకు.

క. అపరిమితపాపకర్మము, లపగతమై యంగసూనుఁ డగువేనుఁడు ధ
ర్మపరాయణశీలుం డగు, సుపుత్రజననంబువలన సుగతికిఁ జనియెన్. 142

క. ఉదధులగంగాదిమహా, నదులందును మునులు మణికనకపాత్రములం
దుదకంబు దెచ్చి భద్రము, లొదవఁగఁ బుణ్యాభిషేక మొనరించి రొగిన్. 143

క. అట్టియెడ సకలసురలును, నెట్టనఁ గొలువంగ వచ్చి నీరజభవుఁ డా
జెట్టిని భూలోకమునకుఁ, బట్టము తగఁ గట్టి సార్వభౌమునిఁ జేసెన్. 144

క. హరిచక్ర మతనిదక్షిణ, కరమున విలసిల్లె నపుడు కమలజుఁడు చరా
చరభూతంబులు వినఁగా, నరుదారఁగఁ జక్రవర్తి యని కొనియాడెన్. 145

వ. ఇవ్విధంబునఁ బృథుచక్రవర్తి యత్యంతధర్మమూర్తియు మహదైశ్వర్యసమేతుం
డు ననవరతసేవాగతచరాచరభూతుండును నై రాజ్యంబు సేయు నపుడు. 146

క. జున్నులు గలయడవుల మహి, దున్నక విత్తక ఫలించుఁ దొరపు మొదవుల్
చన్నవిసి పాలు పిదుకును, వన్నెగ నెలనెలకు మూఁడువానలు గురియున్. 147

క. పృథుచక్రవర్తి యప్పుడు, పృథివీవలయమున సకలపీడలు వొలియన్
పృథుపైతామహయజ్ఞము, ప్రథితంబుగఁ జేసె సురలు ప్రస్తుతిసేయన్. 148

క. క్రతుహోమసూత్రసూత్యా, హుతులవలన శిశువు లిరువు రుదయించిరి య
ప్రతిమానవాక్సమంచిత, మతుల న్విలసిల్లి సూతమాగధు లనఁగన్. 149

ఉ. వారలసౌకుమార్యములు వారల సొంపులు వారి పెంపులున్
వారలవాగ్విలాసములు వారలకోమలకంఠనాదవి
స్తారము చూచి మెచ్చి మునిసంఘములందఱు మీఱ లీధరి
త్రీరమణుం బృథుం బృథుమతిన్ వినుతింపుఁడు నేటనుండియున్. 150

---

యుగము = అక్షయములై భయంకరములైనబాణములుగల అమ్ములపొదులజంట, వజ్రకవచము=రవలు చెక్కినలోహపుచొక్కాయ. 142 అపగతమై = తొలంగి, సుగతికిన్ = సద్గతికి. 144 నెట్టనన్ = పూనికతో, జెట్టిని = శూరుని, సార్వభౌముని = చక్రవర్తిని. 146 అనవరత... భూతుండును = ఎడతెగకకొలువ వచ్చునట్టి చరములును అచరములునైన భూతములుకలవాఁడు. (చరములు = తిరుగునవి. అచరములు = ఉన్నచోటనుండికదలనివి.) 147 జున్నులు = తేనెతెట్టెలు, చన్నవిసి = చన్నులనుండి తనంత నుబికి. 148 వొలియన్=నశింప, పృథుపైతామహయజ్ఞమున్ = పృథుపైతామహము అనుయజ్ఞమును (పృథు = గొప్పది, పైతామహము = పితామహుఁ డనఁబడిన బ్రహ్మసంబంధమైనది,) ప్రథితంబుగన్ = ప్రసిద్ధముగా. 149 సూత్యాహుతులవలనన్ = బిడ్డలుకలుగునట్టి మంత్రములుచెప్పి వేల్చునట్టి ఆహుతులవల్లనుండి, (అహుతి = ఒకసారి అగ్నిలో వేల్వఁబడు ద్రవ్యము,) అప్రతిమానవాక్సమంచితమతులన్ = సరిపోల్పరానిమాటలతోను ఒప్పిదమైన బుద్ధితోను. 150 సౌకుమార్యములు = సుకుమారత్వములు, సొంపులు = చక్కఁదనములు, పెంపులు = గొప్పతనములు, వాగ్విలాసములు = మాటలచమత్కృతులు, కోమలకంఠనాదవిస్తారము = మృదువైనకంఠధ్వనియొక్క అతిశయము, పృథుమతిన్ = గొప్పబుద్ధితో, నేటనుండియున్ = ఈ

క. అని సూతమాగధులకును, ఘనతరవాగ్వైభవమహిమ గలిగింపఁగ న
మ్మునులెల్లను విని ప్రమదం, బునఁ బొందఁగ వారు రాజుఁ బొగడిరి గరిమన్.

ఉ. ఆతతధర్మశీలుఁడు దయాపరతంత్రుఁడు సర్వలోకవి
ఖ్యాతయశుండు సాధుహితకారి మహీసురరక్షణక్రియా
కౌతుకుఁ డున్నతోన్నతవికాసితభాసితుఁ డంచు నాధరి
త్రీతలసార్వభౌము వినుతింతురు నిత్యము సూతమాగధుల్. 152

వ. ఇట్లు సూతమాగధస్తోత్రంబులకు మెచ్చి పృథుచక్రవర్తి స్తోత్రంబులకు నర్హంబు
లైనచరిత్రంబులం బ్రవర్తించుచుండె. 153

తే. ధరణిపులు నాటనుండియుఁ దమకుఁ గలిగి, నట్టికీర్తిప్రతాపాదు లహరహమును
సూతమాగధనిర్మలస్తోత్రవచన, రచనలను వినుచుండుదు రుచితగతుల. 154

తే. ఇట్లు పృథుచక్రవర్తి యనేకక్రతువు
లొనరఁ గావించి మించి యథోక్తభూరి
దక్షిణలు భూమిసురులకుఁ దనియ నిచ్చి
భూమి పాలించె సంపూర్ణకాముఁ డగుచు. 155

శా. క్షోణీమండలిలోపలం గలప్రజల్ క్షుత్తృట్ప్రపీడార్తులై
ప్రాణంబుల్ నిలుపంగ నోపక శరీరంబుల్ వేసం దూలఁగాఁ
ద్రాణల్ దప్పి త్వగస్థిమాత్రు లగుచున్ దైన్యంబు నొందంగఁ బ్ర
క్షీణప్రాభవులై వెసం జనిరి దుఃఖీభూతచేతస్కులై. 156

చ. ఇట్లరిగి పృథుచక్రవర్తిం బొడఁగాంచి యిట్లనిరి. 157

వ. నరవర యెల్లధర్మములు నష్టములయ్యెను దానఁ జేసి లే
బరములు సర్వదేశములఁ బాటిలె దానను జేసి వర్షముల్
గురియక మానె దైవ మనుకూలము చాలనికీడు చెంది చె
చ్చెర బహుసస్య మోషధులు జీర్ణములై చెడిపోయె మేదినిన్. 158

---

దినము మొదలుకొని. 151 ఘనతరవాగ్వైభవమహిమ = మిక్కిలిగౌరవమును (సూచించునట్టి) మాటల యొక్క వైభవాతిశయమును, గరిమన్ = గురుత్వముతో. 152 ఆతతధర్మశీలుఁడు = అధికధర్మము చేయుటయే స్వభావముగాఁగలవాఁడు, సర్వలోకవిఖ్యాతయశుఁడు = ఎల్లలోకములయందు ప్రసిద్ధమైనకీర్తిగలవాఁడు, సాధుహితకారి = యోగ్యులకు మేలుచేయువాఁడు, మహీసురరక్షణక్రియాకౌతుకుఁడు = బ్రాహ్మణులను రక్షించెడుపనియందు కుతూహలముగలవాఁడు, ఉన్నతోన్నతవికాసితభాసితుఁడు = గొప్పవారియందు గొప్పవాఁడై వెలయుటచేత ప్రకాశించువాఁడు. 154 ధరణిపులు = రాజులు, అహరహము = ప్రతిదినము, ఉచితగతులన్ = తగినరీతులతో. 156 క్షోణీమండలి = భూమండలము, క్షుత్తృట్ప్రపీడార్తులు = ఆఁకలిదప్పులచేత మిక్కిలి పీడింపఁబడినవారు, తూలఁగాన్ = బలహీనములుకాఁగా, త్రాణలు = సత్తువలు, త్వగస్థిమాత్రులు = తోలుఎముకలు మాత్రము కలవారు, ప్రక్షీణప్రాభవులు = క్షీణించిన ప్రభుత్వములుగలవారు, దుఃఖీభూతచేతస్కులు=దుఃఖము నొందినమనస్సుకలవారు. 158 లేబరములు = దారిద్ర్యములు, పాటిలెన్ = కలిచెను, బహుసస్యము = అనేకవిధములైనపైరు, ఓషధులు = ఫలించుటతోడ నేనశించునట్టి అరఁటిమొదలైనవి, జీర్ణ

తే. అదినిమిత్తంబు సకలధాన్యములు లేక, పెద్దకాలంబు కఱవయ్యె పృథివియందుఁ
గందమూలఫలాశులై కానలందుఁ, గుందుచున్నారు మనుజులు కువలయేశ. 159

క. అన్నంబు ధాన్యమూలం, బన్నంబు సమస్తజనుల కాధారంబా
యన్నంబు లేక ప్రాణము, లెన్నం డెవ్వారికైన నేగతి నుండున్. 160

శా. అన్నోపాయము మాకుఁ జేయుమని త న్నర్థింప నుగ్రక్షుధా
పన్నానేకజనావనుం డగుచు భూపాలుండు కారుణ్యసం
పన్నంబైనమనంబుతోడ నుచితోపాయంబు వేఱొండు లే
కున్నన్ క్షత్రియధర్మ మూఁది పటుకోపోద్యుక్తుఁడై యుద్ధతిన్. 161

తే. సస్యనాశంబు గావించి జనులకెల్లఁ, గర్వచేసినయామహీకాంతఁ బట్టి
సంహరించెద నని శరాసనముఁ బట్టి, దివ్యబాణంబు సంధింపఁ దివురుటయును. 162

క. ఆరాజన్యునిచలమును, వీరత్వముఁ జూచి వెఱచి విశ్వంభర దా
గోరూపంబునఁ బఱచెను, సారసభవలోకమునకు సంభ్రమ మెసఁగన్. 163

మత్తకోకిల. ఎక్కు వెట్టినవింట సాయక మేర్చుచున్ వసుధావరుం
డక్కజంబుగ మార్విటంకృతు లాకసంబున నొక్కటన్
బిక్కటిల్ల భయంకరాకృతిఁ బృథ్వి వెన్కొని యింక నీ
వెక్కడెక్కడఁ బోయిన న్వధియింతు నెవ్వరు గాచినన్. 164

ఉ. నావుడు భూమిపల్కు నరనాథునితో భయకంపితాంగియై
భూవరచంద్ర నీవు ననుఁ బూని వధింపఁగ నింతయేటికిన్
స్త్రీవధపాపమూల మటుసేయఁగ నీ కగులాభ మేమి నే
జావఁగ నేవిధంబునఁ బ్రజాపరిపాలన మాచరించెదో. 165

వ. అనినం బృథుండు పృథివి కిట్లనియె. 166

క. విను నిన్ను దుష్టచారిణిఁ, దునిమిన మానవులు గరిమతో నుండుదు రీ
జనులం గాచినపుణ్యము, నినుఁ జంపినపాతకంబు నీఁగఁగ లేదే. 167

తే. నీవు లేకున్న నేమి నేదైవయోగ, బలము పెంపున భరియింతుఁ బ్రజలనెల్ల

---

ములు = సారహీనములు. 159 పెద్దకాలంబు = చిరకాలము, కందమూలఫలాశులు=దుంపలు వేళ్లు పండ్లు తినువారు, కానలందున్=అడవులయందు, కుందుచున్ = దుఃఖించుచు, కువలయేశ = పుడమిఱేఁడా. 161 ఉగ్రక్షుధాపన్నానేకజనావనుండు=భయంకరమైన (ఓర్వరాని) ఆఁకలిచేత ఆపద నొందినవారైన పెక్కండ్రు జనులనురక్షించువాఁడు, కారుణ్యసంపన్నంబు=దయకలిమికలది, ఊఁది= అవలంబించి, పటుకోపోద్యుక్తుఁడు దృఢమైనకోపముపూనిక కలవాఁడు. 162 మహీకాంతన్ = భూదేవిని, తివురుటయున్ = ఉద్యుక్తుఁడుకాఁగానే. 163 విశ్వంభర = భూమి, సారసభవలోకమునకున్ = బ్రహ్మలోకమునకు, సంభ్రమము = తొట్రుపాటు, ఏర్చుచున్ = జ్వలింపఁజేయుచు, 164 మార్వి = అల్లెత్రాడు, పిక్కటిల్లన్ = నిండఁగా, వెన్కొని = వెంబడించి. 165 భయకంపితాంగి = భయముచేత వడఁకుచున్న దేహముగలది. 167 దుష్టచారిణిన్ = చెడ్డనడవడిగలదానిని, ఈఁగఁగ లేదే = పోఁగొట్టఁజాలదా. 169 జీర్ణంబులు = అడఁగినవి, వత్సంబు=

ననుచు గర్వించి పల్కిన యవనికాంత, వెఱచి యతనికి నెంతయు వినతిచేసి. 168

వ. నీవు నిష్కారణంబుగ నన్ను వధియింప వలవదు ప్రజాసంరక్షణ కుపాయంబు చెప్పెద వినుము సమస్తసస్యంబులు మహౌషధులు నాయందు జీర్ణంబులై యున్నయవి యిప్పుడు గోరూపంబున నున్ననాకు వత్సంబు గలిగెనేని నీవలన దుగ్ధదోహనంబు సేయంబడఁ దదీయక్షీరప్లావనంబునం జేసి మహీమండలంబున నోషధులును బీజంబులు నుద్భవిల్లు నీప్రయత్నంబు చేయు మనిన నొడంబడి.

తే. తఱుచుగా నున్నకుత్కీలతతులవలన, మిట్టుపల్లంబు లైనట్టిమేదినీత
లంబు సకలంబును సమతలంబు సేయ, కున్నఁ గాదని తనలోన నూహజేసి. 170

ఉ. చండతరప్రతాపగుణశాలి పృథుం డురుబాహుదండకో
దండముల న్మహీధ్రములు ధన్వములన్ బడమీటి ధాగుణీ
మండలదంతురావళులు మాన్చి సమస్థలిగా నొనర్చె నా
ఖండలుఁ డాదిగా సురనికాయము నివ్వెఱఁ గంది చూడఁగన్. 171

ఉ. ఆమనుజేశ్వరుండు మహియందు సమస్థలు లైనతావులన్
గ్రామములం బురంబులను ఖర్వటకంబుల రాజధానులన్
సీమలు వేఱువేఱ విభజించి ఫలాశను లైనమానవ
స్తోమము నన్నపానపరితుష్టులఁ జేయఁ దలంచి పెంపుతోన్. 172

క. సుకర మగువ్రీహిధాన్య, ప్రకరాఖిలకాలఫలితభవ్యనదీమా
తృకదేవమాతృకాదులు, సకలావనియందుఁ గలుగ సంపాదించెన్. 173

వ. మఱియు మనుష్యులకుం దగినజీవనోపకరణంబులు సర్వసంపన్నంబులుగా సమ
కూర్చి. 174

క. పాయక భూధేనువునకు, స్వాయంభువుఁ గ్రేపుగాఁగ సమకట్టి మహీ
నాయకుఁడు పిదికె దుగ్ధ, ప్రాయంబై జగము లెల్లఁ బరిపూర్ణముగన్. 175

---

దూడ, దుగ్ధదోహనంబు = పాలుపిదుకుట, ప్లావనంబునం జేసి = తడియుటచేత, ఒడంబడి = ఒప్పుకొని. 170 కుత్కీలతతులవలనన్ = పర్వతసమూహముల వలన, ఊహ చేసి = ఊహించి. 171 చండతర ... శాలి = మిక్కిలి తీక్ష్ణమైనప్రతాపగుణముచేత ఒప్పినవాఁడు, మహీధ్రములు = కొండలు, ధన్వములన్ = మరుభూములయందు - నీళ్లు లేనిభూములయందు, మీటి = ఎగఁజిమ్మి, దంతురావళులు = మిట్టలసముదాయములను, సమస్థలిగాన్ = చదరపునేలగా, ఆఖండలుఁడు = ఇంద్రుఁడు, నికాయము = గుంపు, నివ్వెఱఁగంది = అత్యాశ్చర్యమునుపొంది. 172 తావులన్ = ప్రదేశములయందు, ఖర్వటకంబులన్ = బోయపల్లెలను, రాజధానులన్ = రాజునివసించు పట్టణములను, సీమలు=ఎల్లలు, విభజించి = విభాగించి, ఫలాశనులు = పండ్లుఆహారముగా చేసికొనువారు, పరితుష్టులన్ = మిక్కిలితృప్తి పొందినవారినిగా, పెంపుతోన్=గౌరవముతో, 173 వ్రీహి... ఆదులు = వరిధాన్యపుతెగలయొక్క యెల్లకాలులపంటచేత మేలైన యేటినీళ్ల పాఱుదలకలవియు సైన్యపాలములు మొదలగునవి. 174 జీవనోపకరణములు = బ్రదుకుఁదెరువు కొఱముట్లు, సర్వసంపన్నంబులుగాన్ = కొఱఁతలేకుండునట్లుగా. 175 క్రేపు = దూడ, సమకట్టి=జతపఱిచి, దుగ్ధప్రా

శా. ఆదుగ్ధంబులచేత భూమివలయం బాప్లావమై సస్యముల్
ప్రాదుర్భూతము నొందె మానవులకుం బాటిల్లె సౌఖ్యంబు నా
నా దేశంబులయందుఁ గల్గె ధనధాన్యంబు ల్సమగ్రంబుగా
మోదం బారఁగఁ గోరినట్లు పిదుకన్ ముప్పేళలన్ ధేనువున్. 176

క. తోరముగ వత్సదోగ్ధృ, క్షీరంబులు దేవదైత్యకిన్నరగంధ
ర్వోరగనరమృగముల కా, యారూపము లైనయట్టియశనము లయ్యెన్. 177

వ. ఇవ్విధంబున దేవతిర్యఙ్మనుష్యాదినానాలోకంబులకును వృక్షలతాపర్వతనికరంబులకుం దగినయాహారంబులు గల్పించి నిర్వక్రపరాక్రమంబున సకలప్రజానురంజనంబుగా ననేకకాలంబు రాజ్యంబు సేయుచుఁ దనపేర భూమికి పృథివి యనునామంబు గల్పించె ననిచెప్పి మఱియును. 178

ఉ. ఈపృథుచక్రవర్తికథ యెవ్వరు విన్నను వారి కెన్నఁడుం
బాపము లేదు తేజమును భవ్యసుఖంబును నిత్యరాజ్యల
క్ష్మీపరిపాలనస్థితియుఁ గీర్తియుఁ జేకుఱు నిత్యకృత్యముల్
శ్రీపతి యశ్వమేధ మొనరించినపుణ్యము నిచ్చుఁ బెంపుతోన్. 179

వ. అట్టిపృథుచక్రవర్తికి నంతర్ధియు వాద్ధియు నన నిరువురు పుట్టి రందు నంతర్ధికి శిఖండి యనుదానికి హావిర్ధానుండు పుట్టె వానికి నాగ్నేయి యైనధిషణ యనుదానికి నొక్కతనయుండు పుట్టె వాఁడు కుశలుండై యజ్ఞకాలంబునంగుశనిచయంబుఁ బ్రాచీనాగ్రంబుగా నొనరించుటంజేసి ప్రాచీనబర్హి యనంబరఁగె అట్టి ప్రాచీనబర్హికి సముద్రపుత్రి యైనసౌవర్ణ యనుదానికి ధనుర్వేదపారగు లగు ప్రచేతసులు పదుండ్రు పుట్టిరి వారు పృథగ్భేదంబులు లేనిధర్మంబులం బ్రవర్తిల్లుచు దశసహస్రవర్షంబులు సముద్రమధ్యంబునం దపంబు చేసి రనిన మైత్రేయుం డిట్లనియె. 180

## ప్రచేతసులు తపస్సుచేసి శ్రీహరివలన వరంబులు వడయుట.

తే. ఆప్రచేతసు లబ్ధిలో నధికతపము, దశసహస్రవర్షంబులు దమకుఁ జేయఁ
గారణంబేమి నాకు నీకథ వినంగ, వలయు ననుటయు నిట్లనిపలికె నతఁడు. 181

క. ప్రాచీనబర్హి పటుధ, ర్మాచరణసమగ్రవైభవాతిశయములన్
ప్రాచీనబర్హికైవడి, నేచి మహీరాజ్యమెల్ల నేలె గరిమతోన్. 182

---

యంబు = కొంచెమెచ్చుతక్కువగా పాలవంటిది. 176 ఆప్లావము = అంతటతడపఁబడినది, ప్రాదుర్భూతము నొందెన్ = పుట్టెను, పాటిల్లెన్ = కలిగెను, సమగ్రంబుగాన్ = పూర్తిగా, ముప్పేళలన్ = మూఁడువేళలయందును. 177 వత్సదోగ్ధృక్షీరములు = దూడయు పిదుకువాఁడును పాలును. 178 నిర్వక్రపరాక్రమంబునన్ = మొక్కపోని పరాక్రమముతో, ప్రజానురంజనంబుగాన్ = ప్రజలకు ఉల్లాసము కలుగునట్టివిధముగా. 179 భవ్యసుఖంబును = మేలైనసౌఖ్యమును, చేకుఱున్ = సిద్ధించును. 180 ఆగ్నేయి = అగ్నివలనఁబుట్టినది, పృథగ్భేదంబులు = వేఱువేఱుమాటుదలలు, ధర్మంబులన్ = నడవళ్లతో. 182 ప్రాచీనబర్హికైవడిన్ = ఇంద్రునివలె, ఏచి =

క. సతతంబును దనయాజ్ఞకు, మితిదాఁటక భక్తియుక్తి మెలఁగుచు వినయా
న్వితు లగుసుతులకు లోక, స్తుతచరితులకును బ్రచేతసుల కిట్లనియెన్.          183

తే. వేఱులేనిధర్మంబుల విస్తరిల్లు, మీకుఁ బడయంగ రానిదేమియును లేదు
కాన నాయాజ్ఞఁ బూని యుగ్రంపుఁదపము, సలిపి పంకజనాభుఁ బ్రసన్నుఁజేసి.

తే. భావికాలంబునకుఁ బ్రజాపతివిలాస, ములు వహించి చరాచరభూతసృష్టి
నర్థిఁ గావింపుఁ డనుటయు నట్లకాక, యని యొడంబడి రంధలు నధికభక్తి.          185

క. జనకునినియోగమున వా, రొనరఁ బ్రజార్థంబు సాగరోదకమధ్యం
బునఁ బదివేలేండ్లు దపం, బొనరించిరి విష్ణుఁ గూర్చి యున్నతభక్తిన్.          186

వ. ఇవ్విధంబున ఘోరతపంబు సేయుచున్న వారలకుఁ బ్రసన్నుఁడై వెన్నుండు. 187

శా. ఆదిత్యప్రతివీరవాహనముతో నత్యుజ్జ్వలప్రావృడం
భోదప్రాయశరీరవైభవముతో భూరిప్రభాజాలసం
పాదోదంచితశంఖచక్రములతోఁ బ్రస్ఫీతపీతాంబరుం
డై దామోదరుఁ డేగుదెంచెను బ్రమోదాయత్తచిత్తంబునన్.          188

తే. ఇట్లు ప్రత్యక్షమై జగదీశ్వరుండు, వారిఁ గనుఁగొని మీరెల్లఁ గోరినట్టి
వరము లెల్లను గృపసేయువాఁడ నగుదు, ననిన నభివాదనముచేసి యధిపసుతులు.

ఉ. ఓకమలామనోరమణ యోజగదేకపవిత్ర యోశుభా
లోకన యోపయోజదళలోచన యోమహనీయకౌస్తుభ
స్వీకృతవక్ష యోసుగుణశేఖర యోకరుణాపయోనిధీ
మాకుఁ బ్రజాపతిత్వములు మన్ననతోడ ననుగ్రహింపవే.          190

వ. అనిన నద్దేవుండు వారుకోరినట్ల భవదీయపుత్త్రుండు దక్షనామంబునం బ్రజాపతి
యగునని వరం బిచ్చి యంతర్ధానంబునుం బొందెఁ బ్రచేతసులును సముద్రంబు
వెడలి వచ్చి.          191

---

అతిశయించి. 183 మితిదాఁటక = మేరమీఱక, వినయాన్వితులు = అడఁకువతోఁ గూడుకొన్న వారు. 185 భావికాలంబునకున్ = భవిష్యత్కాలమునకు - రాఁగల కాలమునకు, 186 నియోగమునన్ = నియమనముచేత. 187 వెన్నుండు = విష్ణువు. 188 ఆదిత్యప్రతివీరవాహనముతోన్ = గరుత్మంతునితో (గరుత్మంతుఁడు అమృతముకొఱకు దేవతలతో ఎదిరించినవాఁడు కాఁబట్టి ఆదిత్యప్రతివీరుఁడని ప్రయోగింపఁబడెను). అత్యుజ్జ్వల... వైభవముతోన్=మిక్కిలివెలుఁగుచున్న వానకాలమునందలి మేఘమువంటి దేహకాంతిసంపత్తితో, భూరి...చక్రములతోన్ = మిక్కుటమైన కాంతిసముదాయమును కలిగించుటచేత ఒప్పిదమైన శంఖచక్రములతో, ప్రస్ఫీతపీతాంబరుండు = ఆధిక్యమును దెలుపునట్టి పచ్చపట్టుతాపితానుధరించినవాఁడు. 189 అభివాదనము చేసి = కులగోత్రనామములను చెప్పి నమస్కరించి. 190 కమలామనోరమణ=లక్ష్మీదేవికి ప్రియుఁడా, శుభాలోకన=మేలుకలిగించెడు చూపుగలవాఁడా, పయోజదళలోచన=తామరరేకులవంటి కన్నులుగలవాఁడా, మహనీయ=మహాత్ముఁడా, కౌస్తుభస్వీకృతవక్ష=కౌస్తుభమను మణినితాల్చిన ఱొమ్ముగలవాఁడా, కరు

క. వారాశిజలములోపల, నారీతిం దపము దశసహస్రాబ్దంబుల్
వారలు సేయ నరాజక, మై రాష్ట్రములందు నెల్ల నడవులు పెరిగెన్. 192

క. ఋక్షకిరిహరిణగజహ, ర్యక్షులులాయాదిమృగభయంకర మగుచున్
వృక్షంబులట్లు పెరిగి ప్ర, జాక్షయ మొనరించు టెఱిఁగి జనపతితనయుల్. 193

వ. నిజతపోమహత్త్వంబులం జేసి ఝంఝానిలంబు గల్పించి మహీరుహంబు లున్మూలంబుగాఁ జేసి యాత్మీయకోపానలంబునభస్మీభూతంబు సేయుచున్న సమయంబున.

క. మానుగఁ గించిచ్ఛేషము, లై నమహీరుహములందు నతులితకరుణా
నూనమతితోడ నాసిత, భానుఁడు చను దెంచి వృక్షపతి దా నగుటన్. 195

క. చటులక్రోధపరీత, స్ఫుటమానసులై వెలుంగుభూపతిసుతులం
బటుగతి శాంతులఁగాఁ జే, యుటకై మఱియొండు వెరవు లోదవక యున్నన్.

సీ. ముఖమనుశశిబింబమునకుఁ గస్తూరికాతిలకకళంకంబు చెలువు మెఱయ
ధమ్మిల్ల మనుగాఢతమసంబులోఁ బుష్పచయతారకావళి సొరు మీఱఁ
గనుచూపులను మన్మథునిమోహనాస్త్రంబులందుఁ గాటుకమచ్చు సందడింప
శృంగార మనుసుధాసింధుమధ్యంబున వళితరంగశ్రేణి వన్నె కెక్క

తే. ఘనకుచములను కిన్నెరకాయలకును, బట్టుపయ్యెద గవుసెన బాగుసూప
సకలసౌభాగ్యలక్షణచారుమహిమ, నుల్లసిల్లెడుకన్యక నొర్తుఁ దెచ్చి 197

క. మానవపతినందనులకుఁ, గానుకగా నిచ్చి వారిఘనకోపంబుల్
మానిచి వినయవిధేయుం, డై నలినవిరోధి వారి కనియెం బ్రీతిన్. 198

ఆ. మీరు లేనినాఁడు మేదినీజనులకు, బాధ చేసినట్టిపాదపముల
నింతయాజ్ఞ వెట్టు టెంతయు నర్హమె, యైనదీర్ఘ కోప మనుచితంబు. 199

---

ణాపయోనిధీ=దయాసముద్రుఁడా. 192 వారాసి=సముద్రము, దశసహస్రాబ్దంబులు=పదివేలసంవత్సరములు. 193 ఋక్ష...భయంకరము = ఎలుఁగుగొడ్లు అడవిపందులు జింకలు ఏనుఁగులు సింహములు కారుదున్నపోతులు మొదలుగాఁ గలమృగములచేతభీతినికలుఁగఁజేయునది. 194 ఝంఝానిలంబుక్ = వానగాలిని, ఉన్మూలంబులు = పెల్లగిల్లినవి, ఆత్మీయ = తమదైన. 195 మానుగక్ = చక్కఁగా, కించిచ్ఛేషములు = కొంచెముమిగిలినవి, అతులిత...తోడక్ = సరిపోల్పరానిదయచేత తక్కువగాని బుద్ధితో - మిక్కిలిదయగలవాఁడై, సితభానుఁడు చంద్రుఁడు. 196 చటుల...మానసులు = అధికకోపముచేత ఆక్రమింపఁబడుటచే ప్రకటిల్లుచున్న మనస్సులుకలవారు, ఒండువెరవులు ఇతరమైన యుపాయములు. 197 శశిబింబమునకుక్ = చంద్రబింబమునకు, కళంకము = చిహ్నము, ధమ్మిల్లము = కీలుగంటు, గాఢతమసంబుతోక్=దట్టపుఁజీఁకటిలో, పుష్పచయతారకావళి = పూసరమనెడు నక్షత్రపఙ్క్తి, సొరు = అందము, మచ్చు = చొక్కుమందు, సందడింపక్=అతిశయింపఁగా. .సుధాసింధుమధ్యంబునక్ = సముద్రమునడుమ, వళితరంగశ్రేణి=కడుపుమీఁద ముడుతలనెడుఅలలవరుస. 198 నలినవిరోధి = చంద్రుఁడు. 199 లేనినాఁడు = లేకుండునట్టికాలమున, పాదపములక్ = వృక్షములను, ఆజ్ఞ పెట్టుట = శిక్షించుట, ఎంతయునర్హమె =

తే. కానఁ దరువులు మీరు సఖ్యంబు సేయ
వలయు నీకన్య బహుపుణ్యవతి మహీరు
హముల కుదయించె మారిష యంద్రు నాసు
ధామయూఖములను ప్రవర్ధనము నొందె. 200

క. ఈకన్యను మీరందఱుఁ, జేకొని పాణిగ్రహణము సేయుండీ నా
ళీకనిభాయతనేత్రకు, మీకును జన్మించు సుతుఁ డమేయబలుండై. 201

వ. వాఁడు యుష్మదస్మత్తేజోభాగంబులఁ గైకొని దక్షనామంబునం బ్రజాపతి యగు
నతనివలనఁ బ్రజాసమృద్ధి యగు ననిన నొడంబడి ప్రచేతసులు చంద్రున కిట్లనిరి.

ఆ. ఈలతాంగిజన్మ మెవ్విధం బవనిరు, హంబులందు నెట్టు లవతరించె
నీసుధామయూఖనివహంబుతో నెట్లు, వృద్ధిఁ బొందెఁ జెప్పవే మహాత్మ. 203

మారిషవృత్తాంతము చంద్రుండు ప్రచేతసులకుఁ జెప్పుట.

వ. అనినం జంద్రుం డిట్లనుఁ దొల్లి కంధుం డనుమునీంద్రుండు గోమతీతీరంబున ఘోర
తపంబు సేయుచున్న నతనితపోమహత్వంబునకు సంక్షోభించి దేవేంద్రుండు
ప్రమ్లోచన యను నప్సరసం బిలిచి బహుమానపురస్సరంబుగా నిట్లనియె. 204

ఆ. కాంత నీవు వోయి కంధమునీంద్రుని, మదనరాగతంత్రమగ్నుఁ జేసి
వానితపము చెఱిచి వలసినయప్పుడ, రమ్ము పొమ్ము చెలుల నెమ్మిఁగూడి. 205

వ. అని నియమించి పంచిన. 206

సీ. పడఁతిబింకపుగుబ్బపాలిండ్లు కంతునిగిరిదుర్గములతోడఁ గ్రీడ సేయఁ
గమలాక్షినిడువాలుకన్నులు కుసుమాస్త్రక్రొవ్వాడితూపులఁ గొఱఁతపఱప
నలివేణినూగారు సౌరు శంబరవైరినిడువాలువాలుతో నెయ్యమాడఁ
జిగురాకుబోఁడిభ్రూయుగ మంగజాతునిచెఱకుసింగిణివింటి కొఱపుగఱప

మిక్కిలియుక్తమే. 200 సుధామయూఖములన్ = అమృతకిరణములచేత, ప్రవర్ధనము=వృద్ధిని. 201 పాణిగ్రహణము సేయుఁడు = పెండ్లియాడుఁడు, నాళీకనిభాయతనేత్రకున్ = తామర (ఱేకుల) వలె విశాలములైన కన్నులుగలదానికిని, అమేయబలుఁడు = మేరమీఱినబలముగలవాఁడు. 202 యుష్మదస్మత్తేజోభాగంబులన్=మీయొక్కయు నాయొక్కయు తేజస్సునందలి యంశములను. 203 లతాంగి=తీఁగవంటిదేహము గలది-ఆఁడుది. 204 సంక్షోభించి=కలఁతనొంది. 205 మదనరాగతంత్రమగ్నున్ = కామాసక్తమైన క్రియయందు మునిఁగినవానిఁగా - మిక్కిలి కామాసక్తినొందినవానిఁగాననుట. 207 బింకపుగుబ్బపాలిండ్లు = బిగువైనగుబ్బలవంటి స్తనములు, కంతునిగిరిదుర్గములతోడన్=మన్మథునియొక్క పర్వతదుర్గములతో, (దుర్గము=ఇతరులకు చొరనశక్యమైనకోట,) నిడువాలు=మిక్కిలిదీర్ఘములైన మిక్కిలి విశాలమైనఅనుట, క్రొవ్వాఁడి=క్రొత్తగా చేయఁబడిన వాఁడిమిగల, సౌరు=అందము, శంబరవైరి=మన్మథునియొక్క, నిడువాలువాలుతోన్=మిక్కిలినిడుపైన కత్తితో - నెయ్యమాడన్ = చెలిమిసేయఁగా, భ్రూయుగము = కనుబొమలజంట, అంగజాతుని = మన్మథుని యొక్క, సింగిణివింటికిన్ = శృంగధనుస్సునకు, ఒఱపు = నాగరికతను, జఘనయుగము = పిఱుఁదులజంట, (ఇచ్చట రథచక్రములతోడ పోల్చియుండుటచేత జఘనశబ్దమునకుఁ గలమడికట్టు అను

తే. సరసిజాయతలోచనజఘనయుగము, మరునిరథచక్రములతోడ మాఱుమలయ
మేఘమండలిలోనుండి మెఱుఁగుదీఁగె, వెడలివచ్చినకైవడిఁ బుడిమికి డిగి. 207

క. వనజాక్షి కాంచె నపుడ, త్యనుపమతేజఃప్రభాసితాంబుజబంధున్
జనవిమతసత్యసంధుని, ననవరతానూనచిత్సుధాంధున్ గంధున్. 208

మ. అతులధ్యానపరాయణత్వమున బ్రహ్మానందుఁడై యున్న యా
క్షితిదేవోత్తముఁ జేరఁగా వెఱచి యాశీతాంశుబింబాస్యయు
న్నతపీనస్తనభారనమ్ర యగుచు న్వర్తించె నాళీజనా
న్వితయై తద్వనవాటికానిచయములన్ లీలావినోదంబులన్. 209

క. ఆకాంత చెలులతో బి, బ్బోకవినోదములవలనఁ బుష్పాపచయా
నేకానోకహవనకే, ళీకౌతుకవృత్తిమదిఁ దలిర్పఁగ నుండెన్. 210

వ. అప్పుడు. 211

మ. మలయక్ష్మాధరకూటదంతురశిలామార్గంబులన్ డస్సి త
ద్విలసన్నిర్ఝరవారిదీర్ఘికలలో విశ్రాంతిఁ గావించి పు
ష్పలతామంజులకుంజపుంజముల నిచ్ఛావృత్తి వర్తించుచున్
బొలసెన్ దక్షిణవాతపోతములు సంపూర్ణప్రమోదంబునన్. 212

వ. ఇట్లు మనోహరం బైనసమయంబున. 213

సీ. తనశరీరము కమ్మతావిమూర్కొనునట్లుగా వినోదమునఁ బైగాలిఁ బొలయుఁ
దనమోహనాకృతిఁ గనుఁగొనునట్లుగా ముందరబిబ్బోకముగ నటించుఁ

---

అర్థమును మాని పిఱుదుఁలు అనిప్రాయనయ్యెను.) మాఱుమలయన్=ప్రతిఘటింపఁగా. 208 అను పమ...అంబుజబంధున్=ఈడులేని తేజస్సుచేత వెలుఁగుచున్న సూర్యుఁడైనవానిని, అనవరత...సుధాంధున్=ఎడతెగక తక్కువకాని జ్ఞానామృతమును పానముచేయువానిని. 209 అతులధ్యానపరాయణత్వమునన్ = సరిపోల్పరానిధ్యానమునందు ఆసక్తికలవానితనముచేత, బ్రహ్మానందుఁడై = బ్రహ్మానందము కలవాఁడై, క్షితిదేవోత్తమున్ = బ్రాహ్మణశ్రేష్ఠుని, శీతాంశుబింబాస్య=చంద్రబింబమువంటి ముఖముగలది, ఉన్నత...నమ్ర = నిక్కినవియు బలిసినవియు నైన స్తనములవలని బరువుచేత వంగినది, వర్తించెన్ = ఉండెను, ఆళీజనాన్విత = చెలికత్తెలతో కూడుకొన్నది. తద్వనవాటికానిచయములన్ = ఆవనపఙ్క్తుల సమూహములందు. 210 బిబ్బోకము = స్త్రీవిలాసచేష్టావిశేషము, పుష్పా...వృత్తిన్=పువ్వులుకోయుచు పెక్కువృక్షములు గలవనములో విహరించుటయందలివేడుక గలిగిన వ్యాపారము. 212 మలయ...మార్గంబులన్ = మలయపర్వతపు శిఖరములయందలి మిట్టపల్లములైన ఱాళ్లదారులయందు, తద్విలస...దీర్ఘికలలోన్ = ఆగందపుకొండయందలి యొప్పిదములైన సెలయేటినీళ్లచే నిండిననడబావులలో, విశ్రాంతిఁగావించి = బడలికదీర్చుకొని, పుష్ప...పుంజములన్ = పూఁదీఁగెలచేత మనోజ్ఞములైన పొదరిండ్లగుబురులందు, ఇచ్ఛావృత్తిన్ = ఇచ్చవచ్చిన వ్యాపారముతో, వర్తించుచున్=మెలఁగుచు, పొలసెన్ = ప్రసరించెను, దక్షిణవాతపోతములు = దక్షిణదిశనుండి వచ్చునట్టి పిల్లవాయువులు - చల్లగాలియనుట. 214 కమ్మతావి = ఇంపైనసువాసన, పొలయున్ = వ్యాపించును - మెలఁగుననుట, మోహనాకృతి = మోహమును కలిగించునట్టి

దనకంఠరవములు వినవచ్చునట్లుగాఁ బరివాదినులు మ్రుట్టి పాడుచుండుఁ
దనమోవిరుచికిఁ బైకొని వచ్చునట్లుగాఁ దియ్యనిఫలములు దెచ్చియిచ్చుఁ
తే. దనకరాలింగనమునకుఁ దగులునట్లు, గా శరీరంబుమోవంగఁ గదిసి మ్రొక్కు-
నిత్తెఱంగున నమ్మునిచిత్తవృత్తిఁ, గలఁచి మదనాతురునిఁజేసె కమలనయన. 214

వ. ఇవ్విధంబున మదనాతురుండై యమ్మునివరుండు. 215

తే. పొలఁతికెమ్మోవి చవిచూచి పొదలుగుబ్బ
గబ్బిపాలిండ్లు గదియంగఁ గౌఁగిలించి
సురతసుఖములఁ దనివోవఁ జొక్కకున్నఁ
గానిపుష్పాస్త్రుచే బ్రతుకంగఁజాల. 216

వ. అని యయ్యింతికిఁ దనయభిప్రాయం బెఱింగించి యిట్లనియె. 217

తే. తరుణి నీచేత మదనతంత్రంబు లెఱుఁగఁ
గోరి యున్నాఁడ నాయాస కొంచెపడక
యుండ సురతసుఖాంభోధి నోలలార్చి
యింపు సొంపార నన్ను మన్నింపవలయు. 218

వ. అనుటయు నయ్యింతి యమ్మునికాంతు నంతరంగంబునఁ గంతుకుంతంబులు నాటు
టెఱింగి యిట్లనియె. 219

తే. మీరు నామీఁద మిక్కిలి మేలు గలిగె,నేని దేవర యాడిగం బిచ్చవచ్చి
నట్లు గావింపకుండ నే నంతకుమతి,నయ్య మీచిత్త మెట్లుండె నట్ల నడతు. 220

క. అని యొడఁబడుటయు నమ్ముని, యనురాగము చెంగలింప నంబురుహానిభా
ననతోడిసురతసుఖమున, ననువై పెక్కేఁడులు నటనంబులు చేసెన్. 221

వ. ఇవ్విధంబున నయ్యిందువదనతోడికందర్పరతిక్రీడానందంబులం జెంది మందర
గిరికందరంబున నూఱుసంవత్సరంబులు వినోదించుచున్నంత నొక్కనాఁడు. 222

క. చొక్కపుమరుమంత్రంబులఁ, జొక్కించి వినోదకేళిఁ జూపుచుఁ గళలం

---

రూపమును, బిబ్బోకముగన్ = బిబ్బోకమనువిలాసచేష్టతో, నటించుచున్ = మెలఁగును, పరివా
దినులు = ఏడుతంతులవీణెలు, రుచికిన్ = చవికి, మోవంగన్ = తాఁకునట్లు, కలఁచి = కలఁత
నొందించి. 216 కెమ్మోవి = ఎఱ్ఱనిఅధరము, పొదలు = వర్ధిల్లు, తనివోవన్ = తృప్తికలుగున
ట్లుగా, చొక్కక = పరవశత్వము నొందక, పుష్పాస్త్రుచేన్ = మన్మథునిచేత. 218 ఓలలార్చి =
ఈఁదునట్లుగాఁజేసి, సొంపారన్ = సంతోషమతిశయించునట్లుగా. 219 అంతరంగంబునన్ =
మనసునందు, కంతుకుంతంబులు = మన్మథునియీఁటెలు. 220 మేలు = మంచి - అపేక్షయనుట,
దేవరయాడిగంబు = దేవరవారియొక్కసేవ, కుమతినయ్య = కొంచెపు బుద్ధిగలదాననా - బుద్ధి
హీనురాలనా. 221 చెంగలింపన్ = అతిశయింపఁగా, ననువై అనురాగము గలిగి, నటనంబులు
చేసెన్ = నటించెను. 222 కందర్పరతిక్రీడానందంబులన్ = కామాసక్తితోడి కేళివలనిసంతోష
ములను, కందరంబునన్ = గుహయందు. 223 చొక్కపు = నిర్దుష్టములైన, చొక్కించి =

పెక్కుఁగ నధరం బిచ్చుచు, నక్కమలదళాక్షి పలికె నమ్మునితోడన్. 223
క. మునినాథ యేను నిరతము, ననిమిషపతి కొలువులంజియను సురపురికిన్
జనియెద నెన్నాళ్లైనను, నినుఁ గూడి రమింపఁ జెల్లునే నా కనినన్. 224
ఆ. ఇపుడు నీవు వచ్చి యించుకడడవులే, దిట్టిసురతసుఖము లెల్ల విడిచి
పోవఁ జూచెదేనిఁ బుష్పాయుధునిచేత, భంగపడుదుఁ గాని బ్రతుకనోప. 225
ఆ. అనిన నమ్మృగాక్షి యతనికామాతుర, భావ మెఱిఁగి యొండుపలుక వెఱచి
వేడ్క నతనిఁ గూడి వెండియు నూఱేడు,లర్థి సురతసుఖము లనుభవించి. 226
క. ఒకనాఁ డమ్ముని తనతో, మకరధ్వజుకేళిఁ దేలి మమకారమునన్
వికసిల్లుచున్నఁ గరములు, ముకుళించి ప్రియంబుతోడ ముద్దియ పల్కెన్. 227
ఆ ఎంతకాలమైన నీరీతి మీతోడఁ,గలసి మదనకేళి సలుప నాకుఁ
దగదు లంజెగాని యొగి నీకు భార్యఁగా, నది యెఱింగి నన్ను ననుపవలదె, 228
క. అనుటయు నమ్ముని యిట్లను, వనజాయతనేత్ర నీవు వచ్చి ముహూర్తం
బును లేదు పోవఁ దమకిం,చిన నేమని నీకుఁ బ్రియము చెప్పుదు గరిమన్. 229
ఉ. ఇప్పుడు నామనోరథములెల్ల వితాకులవిత్తుచేసి యీ
తప్పులు వెట్టెదేమిటికిఁ దక్కుఁ దలంచెద వెన్ని చెప్పినం
జెప్పుము కమ్మక్రొవ్విరులసెజ్జపయి న్నినుఁగూడి యుండలే
నప్పుడె మంటమారికుసుమాస్త్రుఁడు నన్ బ్రదుకంగనిచ్చునే. 230
తే. అనిన నొండాడ వెఱచి యయ్యబలరుబోఁడి,వలపు లేపార నిన్నూఱువత్సరములు
వెండియును పంచశరుకేళి విస్తరిల్లు, చుండి యమ్మునిఁ గనుఁగొని యొక్కనాఁడు.
ఆ. కమలనయన మౌనిఁ గనుఁగొని యప్సరః, కాంత నగుట నమరకాంతుపురికి
నాకుఁ బోవవలయు నానతి యిమ్మన్న, నతఁడు మదనభూత మావహించి. 232
క. మగువ ప్రియోక్తులు పలుకుచు, బిగియంగాఁ గౌఁగిలించి బింబాధర మిం
పుగ నానుచు సిగ్గెఱుఁగని, తగులున నిట్లనియె మిగులఁ దమకం బొదవన్. 233
ఉ. మొల్లసుగంధి నామనసుమోహము నాఱిడివెట్టి నీవు న
న్నొల్లక పీడనాడెద వయో తగవా మగవారిచిత్తముల్
వ్రుల్లసిలంగఁ జేయఁ బొరపొచ్చెములాడఁగ నాఁడువారికే
చెల్లును జెల్లఁబో వ్రతముచెడ్డ సుఖంబును దక్కదయ్యెఁగా. 234

---

పరవశతనొందించి. 224 నిరతము = ఎల్లప్పుడు, అనిమిషపతికొలువులంజియను = ఇంద్రునిసభయందుఁడు భోగముదానను. 227 మకరధ్వజుకేళిన్ = మన్మథక్రీడయందు. తేలి = విహరించి, మమకారమునన్ = మమత్వముచేత. 229 తమకించినన్ = తమకపడినను. 230 మనోరథములు = కోరికలు, వితాకులవిత్తు = నిశ్చేష్టతలకు బీజము - వ్యర్థము, తక్కున్ = మోసపుచ్చుటకు, క్రొవ్విరులసెజ్జ = క్రొత్తపూలపాన్పు, మంటమారి = మండిపడునట్టి స్వభావముగలవాఁడు. 232 అమరకాంతుపురికిన్ = ఇంద్రుని పట్టణమునకు, మదనభూతము = మన్మథుఁడనుదయ్యము. ఆవహించి = సోఁకి. 233 తగులునన్ = ఆసక్తిచేత. 234 మొల్లసుగంధి=మొల్లపూవులపరిమళమువంటి

వ. అని యివ్విధంబున నమ్మునివరుండు. 235

చ. అది యొడఁబాటులేక తను నాడుచునున్నఁ గడుం గలంగి య
మ్మదవతి శాపభీతి మఱుమాటలు వల్కక తాపసోత్తముఁ
మదనకళావిలాసరసమగ్నునిఁ జేయుచుఁ దొంటికంటె నిం
పొదవఁగఁ బెక్కుకాల ముపయోగముచేసె రతిప్రసంగముల్. 236

వ. అంత నొక్కనాఁ డపరసంధ్యాసమయంబున నమ్మునీంద్రుండు పర్ణశాలవెడలి నదీతీరంబున కరుగ నవలోకించి యెందుఁబోయెద వని యడిగిన ప్రమ్లోచికిఁ గంధరుం డిట్లనియె. 237

శా. సాయంకాలము వచ్చె నిప్పు డిదిగో సంధ్యాద్యనుష్ఠానముల్
సేయం బోయెద బ్రాహ్మణక్రియ లధిక్షేపించి వర్తించు ట
న్యాయం బన్న మృగాక్షి నవ్వుచు మహాత్మా యెన్నఁడుఁ లేనిమీ
కీయుద్యోగము గల్గు టెట్లనిన మౌనీంద్రుండు దా నిట్లనున్. 238

ఉ. ఏనిట నేటి రేపకడ నీనదిలోనఁ బ్రభాతకాలసం
ధ్యానియమంబు లెల్ల నుచితస్థితిమై నొనరించుచుండఁగా
మానిని నీవు వచ్చితి దె మాపటిసంధ్య యొనర్పఁ బోవఁగా
దీనికి నేల నవ్వితివి తెల్లము నాకెఱిఁగింపు నావుడున్. 239

ఉ. అచ్చపలాక్షి యిట్లనియె నాతనితోడఁ బ్రభాతకాలమే
వచ్చుటయు న్నిజంబు మునివర్య పితృప్రసు విప్పుడౌటయుఁ
బొచ్చెమునొంద దీనడుమఁ బోయినయేఁడులు తొమ్మనూటిపై
నచ్చుగ నేఁడు మీఁద నెల లాఱు దినంబులు మూఁడు నేఁటితోన్. 240

మ. అనిన న్నివ్వెఱఁగంది మౌని యిది మిథ్యావాదమో నిక్కమో
వనితా చెప్పుము నీవు నేను మదనవ్యాపారవారాశిలో
ననురాగంబున నుండు టేకదిన మైనట్లుండెఁ జూడంగ నీ
యనుమానం బుడిగింపవే యనిన నయ్యబ్జాక్షి తా నిట్లనున్. 241

క. మౌనీంద్ర నీవు బ్రహ్మజ్ఞానివి నీతోడ నా కసత్యము పలుకఁ

---

పరిమళముగలదానా (ఇది అనింద్యగ్రామ్యము), ఆఱడిపెట్టి = వ్యర్థముచేసి, తగవా = న్యాయమా. వుల్లసిలంగఁ = ఉవ్విళ్లూరఁగా, పొరపొచ్చెములు = భేదవాక్యములను, చెల్లఁబో = ఔరా, 236 ఒడఁబాటు=సమ్మతి. 238 అధిక్షేపించి=విడిచి, వర్తించుట=మెలఁగుట, ఉద్యోగము=ప్రయత్నము. 239 రేపకడఁ=ప్రాతఃకాలమునందు, మాపటిసంధ్య=సాయంసంధ్య, తెల్లము=విశదముగా. 240 ప్రభాతకాలము=ప్రాతఃకాలమునందు, పితృప్రసువు=సాయంసంధ్య, పొచ్చెమునొందదు=న్యూనతనుపొందదు-అబద్ధము కాదనుట, అచ్చుగఁ=సరిగా. 241 నివ్వెఱఁగంది=నిశ్చేష్టత్వమునుపొంది, మిథ్యావాదమో=అసత్యపువాదో-నన్నువంచించుటకై యిట్లు చెప్పెదవా యేమి యనుట, వారాశిలో=

గానేల చెప్పినన్నియు, సూనృతములు యోగదృష్టిఁ జూడుము తెలియన్. 242

వ. అనిన నమ్మునీంద్రుం డట్లకావగచి మదనభూతావేశంబు మాని మానిని దెలిపినం దెలివినొంది నిరర్థక ప్రయోజనంబునం దపోధనంబుఁ గోలుపోయితినని దుఃఖించుచు బ్రమ్లోచితో నిట్లనియె. 243

క. చపలాక్షి నీనిమిత్తము, తపమెల్లను సేగిఁ బోయెఁ దథ్యంబుగ నీ
యుపమ సురేంద్రుఁడు చేసిన, కపటము నీవింక తప్పు గలదానవైనన్. 244

తే. ఇంతకాలంబు నాతోడ నెరవులేక, కూడి యుండితి వటుగాన కోపమెల్ల
నుపశమించితి నీవింక నుండవలదు, పొమ్ము పోకుండితేని యిప్పుడ శపింతు. 245

క. అని మొగము జేవురింపఁగఁ, గనుఁగవఁ గోపాగ్ని లొలుకఁగాఁ బల్కిన న
మ్మునియెదుర నిలువ భయపడి, తనువునఁ బెంజెమట లొదవఁ దరుణి వడంకెన్.

వ. ఇట్లు భయాకులితమానసయై గగనంబున కెగసి చనుచోఁ దనలేఁతచూలుగల గర్భంబు స్రవించి శరీరంబునవయవంబులయందు నమ్మునివీర్యంబు స్వేదరూపంబున నుద్గమించినం జలించి యాచంచలాక్షి బాలతరుపల్లవంబులఁ జెమటఁ దుడుచుకొనుచు దేవలోకంబున కరిగె కంథమునీంద్రుండును నచ్చోటువాసి పురుషోత్తమతీర్థంబునకుం జని పరసతీసంగమదోషంబును జిరకాలం బనుష్ఠానలోపంబైన పాపంబునుం బాయునట్లుగా బ్రహ్మపారస్తోత్రంబు లనుష్ఠించుచు నూర్ధ్వబాహుండై జనార్దను నారాధించుచుఁ దపంబు సేయుచుండె నంత నిట. 247

క. తరుపల్లవముల నమ్ముని, వరువీర్యము నిలిచి వాయువశమున నమృతో
త్కర మగునాకిరణంబులఁ, బరివృతమై యాలతాంగి ప్రభవించె నొగిన్. 248

క. మును కంధునకును బ్రమ్లో, చనకు సమీరునకు నాకు సాలంబులకున్
వినుఁ డొక్కరూప మారిష, యనఁబరఁగిన యీమృగాక్షి కతివలు సరియే. 249

---

సముద్రమునందు 242 సూనృతములు=సత్యములు. 243 అట్లకావగచి=అట్లెయగుట విచారించి, నిరర్థక ప్రయోజనంబునన్=వ్యర్థమైనవ్యాపారము చేత, కోలుపోయితిని = పోఁగొట్టుకొంటిని, 244 సేఁగిబోయెన్=చెడిపోయెను, తథ్యంబుగన్=నిజముగా, ఉపమ=ఉపాయము, తప్పుగలది=తప్పుగల దానవు. 245 ఎరవు = భేదము, ఉపశమించితి = అణఁచితిని. 246 జేవురింపఁగన్ = ఎఱ్ఱబాఱఁగా, కనుఁగవన్ = కన్నులజంటయందు, ఒలుకఁగాన్ = రాలఁగా, పెంజెమటలు = అధికమైన చెమటలు, ఒదవన్ = కలుగఁగా, 247 భయాకులితమానస = భయముచేత కలఁతనొందిన మనసు గలది, గగనంబునకున్ = ఆకాశమునకు, స్రవించి = (స్రై) కాఱి, శరీరంబు నవయవంబుల యందున్ = దేహముయొక్క అవయవములయందు. వీర్యంబు = రేతస్సు, స్వేదరూపంబునన్ = చెమటయాకృతితో, ఉద్గమించినన్ = పైకుబుకఁగా, బాలతరుపల్లవంబులన్=లేఁతయైన చెట్లయందలి చిగురాకులచేత, బ్రహ్మపారస్తోత్రంబులు=వేదపారస్తోత్రములను, అనుష్ఠించుచున్=చేయుచు, ఇట = ఇక్కడ. 248 తరుపల్లవములన్ = చెట్లచిగుళ్లయందు, అమృతోత్కరము = అమృతరాశి పరివృతమై=లెస్సగా ఆవరింపఁబడినదై, ప్రభవించెన్=పుట్టెను, ఒగిన్=క్రమముగా. 249 సాలం

## మారిష యను స్త్రీ పూర్వజన్మవృత్తాంతము.

వ. కావున వృక్షరక్షణార్థంబుగా నీమృగాక్షిం బాణిగ్రహణంబు సేయించెద భవదీయం బైనభావికాలకార్యగౌరవంబునకు దీనిపూర్వజన్మప్రకారంబుఁ జెప్పెద వినుండు. 250

క. తొల్లి యిది యొక్కధరణీ, వల్లభునిల్లాలు బాల్యవైధవ్యమునం
దెల్లసుఖంబులు విభవము, నొల్లక హరిఁ గొల్చుచుండె నుస్నతభక్తిన్. 251

క. ఆపడతికిఁ బ్రత్యక్షం, బై పురుషోత్తముఁడు నిలిచి యంబుజముఖి నీ
వేపుణ్యఫలముఁ గోరితి, వాపుణ్యఫలంబు నిత్తు నడుగుము ప్రీతిన్. 252

వ. అనిన నక్కాంత లక్ష్మీకాంతునకు సాష్టాంగనమస్కారంబు చేసి దేవా నాకు బాల్యవైధవ్యం బారోహించినకతంబునఁ గామభోగేచ్ఛ పెద్దయుం గలదని మఱియును. 253

ఆ. మదనపరవశత్వ మొదవంగఁ బతిఁ గృప, సేయు మనుచు నమ్మృగాయతాక్షి
మదనగురునిఁ గదిసి పదిమాఱు లడిగిన, నతఁ డనుగ్రహింప నతివ చూచి. 254

వ. దేవా యివ్విధంబున వరంబు గృపచేసి పదుగురుపతుల నొసంగెదేని నే నయోనిజనై జన్మించి ప్రజాపతిత్వంబు గలపుత్త్రునిం బడసి మహావిభవంబు లనుభవించునట్టివరంబుఁ గృపసేయు మనిన నద్దేవుం డట్లకాక యని యనుగ్రహించి యంతర్ధానంబు నొందె నయ్యింతి యీజన్మంబున నిక్కాంతయై జన్మించె దీనిమీరు పరిగ్రహంబు సేయునది మీకు దీనియందు మహాభాగుండును నతివీర్య పరాక్రముండును బ్రజాపతిగుణోపేతుండు నైనపుత్త్రుండు జన్మించు వాఁడనేకవంశంబులకుఁ గర్తయై చరాచరంబులు నిర్మింప సమర్థుం డగునని సోముండు ప్రచేతసులకు మారిషం బాణిగ్రహణంబు సేయించె నంత. 255

క. ఆరాజన్యతనూభవు, లారమణిఁ బరిగ్రహించి రాసతివలనన్
నీరజభవనిభుని మహో, దారునిఁ బుత్త్రకునిఁ గనిరి దక్షుం డనఁగన్. 256

వ. ఆదక్షప్రజాపతివలన దేవదానవగరుడగంధర్వసిద్ధవిద్యాధరాది నానాభూతంబులును ద్విపదచతుష్పదాదినానాజంతుజాతంబును బుట్టె ననిన మైత్రేయుం డిట్లనియె. 257

---

బులకున్ = వృక్షములకును. 250 భావికాలకార్య గౌరవంబునకున్ = రాఁగలకాలమున (జరగవలసిన) పనులయొక్కగురుత్వమునకు. 251 ధరణీవల్లభునిల్లాలు = రాజుభార్య, బాల వైధవ్యమునన్ = పసితనమునందేముండమోయుటచేత. 253 ఆరోహించిన = ఎక్కిన - కలిగినయనుట. 254 పరవశత్వము = పరాధీనత్వము, కదిసి = చేరి. 255 పరిగ్రహంబు సేయునది = భార్యగాఁజేసికొవలసినది, మహాభాగుఁడు = గొప్పమహిమగలవాఁడు. 256 రాజన్య తనూభవులు = రాచకొమారులు, నీరజభవనిభుని = బ్రహ్మను పోలినవానిని, ఉదారునిన్ = తిన్నని మనసుగలవానిని. 257 ద్విపద...జాతంబును = రెండుకాళ్లుగలమనుష్యులు నాలుగుకాళ్ల

తే. అజునిదక్షిణాంగుష్ఠంబునందు దక్షుఁ, డవతరించి నవబ్రహ్మలందు నొక్కఁ
డై తనర్చె నతండు ప్రచేతసులకుఁ, దనయుఁడై పుట్టు టేమివిధంబు చెపుఁడ.258

వ. అనినం బరాశరుం డిట్లనియె బ్రహ్మమానసపుత్త్రుం డైనదక్షప్రజాపతి మహాతపోధనుండు గావున నతనికి నెన్నండునుఁ గల్పంబులు లేవు. సృష్ట్యర్థంబుగాఁ బ్రతిమన్వంతరంబునందును యుగంబుల నొక్కొక్కప్రజాపతి దక్షనామంబున జన్మించి సృష్టికిం గర్తయై యుండుఁ గావునఁ బ్రచేతసపుత్త్రుం డైనదక్షునిచరిత్రంబు సవిస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము. 259

ప్రచేతసపుత్త్రుం డగుదక్షునిచరిత్రము.

ఉ. అక్షయపుణ్యమూర్తియు సమంచితకీర్తియు నైనయట్టియా
దక్షుఁడు పెద్దకాలము ముదంబున ఘోరతపంబు పుండరీ
కాక్షునిఁ గూర్చి చేసి సచరాచరభూతగణైకసృష్టికిన్
దక్షుఁడుగా వరంబుఁ గొని తామరచూలియనుజ్ఞ పెంపునన్. 260

ఉ. కిన్నరసిద్ధసాధ్యమునిఖేచరభూచరదేవదైత్యులం
బన్నగమానవాలి మృగపక్షుల మానససృష్టియందుఁ దా
వన్నియగా సృజింప బహువంశపరంపరలం బ్రవృద్ధి లే
కున్న నతండు వేసటె పయోరుహగర్భునిచే నియుక్తుఁడై. 261

వ. మిథునకర్మంబుచేతఁగాని ప్రజావృద్ధి లేదనుచుఁ దలంచి వరుణప్రజాపతిపుత్త్రియైన యసిక్ని యనుదానిం బాణిగ్రహణంబు చేసి దానియందు హర్యశ్వులనుపంచసహస్రసంఖ్యలం గలకుమారులం బడసి వారల నందఱఁ బ్రత్యేకంబ ప్రజాపతులగునట్లుగా నియమించిన నారదుండు విఘ్నంబు సేయం దలంచి వారిపాలికి వచ్చి యిట్లనియె. 262

క. జలజభవాండము సర్వముఁ, గలయంగాఁ జూచి దేశకాలక్రమముల్
దెలియక ప్రజఁ బుట్టింపం, దలఁచుట మీకెల్ల వెఱ్ఱితన మౌఁగాదే. 263

---

గలమృగములు మొదలుగాఁగలిగిన అనేకములైన ప్రాణిసమూహమును. 258 అజునిదక్షిణాంగుష్ఠంబునందున్ = బ్రహ్మయొక్క కుడిబొటనవ్రేలియందు, అవతరించి = జనించి, తనర్చెన్ = ప్రసిద్ధినొందెను. 259 కల్పములు = ప్రళయములు - నశించుటలు, సృష్ట్యర్థంబుగాన్ = సృష్టికొఱకు, ఆకర్ణింపుము = వినుము. 260 అక్షయపుణ్యమూర్తి = తఱుఁగనిపుణ్యమే స్వరూపముగాఁగలవాఁడు, సమంచితకీర్తి = ఒప్పిదమయినకీర్తిగలవాఁడు, పెద్దకాలము = చిరకాలము, దక్షుఁడుగాన్ = చాలినవాఁడు అగునట్లు, తామరచూలి = బ్రహ్మ. 261 ఖేచర=ఆకాశమునందు తిరుగునట్టివారును, భూచర = భూమియందు తిరుగునట్టివారును, పన్నగమానవాలి = పాములయొక్కయు మనుష్యులయొక్కయు సమూహము, మానససృష్టియందున్ = తలంపుననే సృజియించుటయందు, వన్నియగాన్ = ప్రశస్తముగా. ప్రవృద్ధి=అభివృద్ధి, వేసటె = ఉత్సాహముచెడి. పయోరుహగర్భునిచేన్ = బ్రహ్మచేత, నియుక్తుఁడై = నియోగింపఁబడినవాఁడై - నియమింపఁబడినవాఁడై, 262 మిథునకర్మంబుచేతన్ = దంపతులకూటమిచేత, పాణిగ్రహణంబుచేసి= పెండ్లియాడి. 263 జలజభవాండము = బ్రహ్మాండము,

వ. అని చెప్పి నారదుండు వోయె వారలందఱు నన్నిదిక్కులకుం బోయి సముద్రంబు ప్రవేశించినయేఱులచందంబున మరల నెఱుంగక పోయిరి. దక్షుండు వెండియు వైతరణియందు వేవురుకొడుకులం బడసి వారికి శబళాశ్వు లనునామధేయం బులుచేసి పూర్వప్రకారంబునఁ బ్రజాపతిత్వంబునకు నియమించిన నారదుండు వెండియును వచ్చి తొంటిహర్యశ్వులం బలికినయట్ల పలికి పోయిన. 264

ఆ. అప్పు డతనిమాట లగుఁగాక యని వార, లగ్రజన్ము లరిగినట్ల యరిగి
మరల కెందుఁబోయి మడిసిరో నేఁడును, దెలియ నలవిగాదు దివిజులకును. 265

వ. అదికారణంబుగా నాఁటనుండియు. 266

క. పరదేశము చరియింపఁగ, నరిగినయగ్రజుల వెదక ననుజన్ములు వో
యిరయేని వారు వారును, మరలక యెందైనఁ బోయి మడియుదు రనఘా. 267

వ. ఇవ్విధంబున దక్షుండు నష్టసంతానుండై నారదునిం గోపించి వెండియుఁ దనభార్య యైనవైతరణియందు నఱువండ్రు కన్నియలం బుట్టించె వారియందుఁ బదుండ్ర ధర్మునకును, పదుమువ్వురఁ గశ్యపప్రజాపతియును, ఇరువదియేడ్గురఁ జంద్రుండును నలుగుర నరిష్టనేమియు, ఇరువుర బహుపుత్రుండును, ఇరువుర నంగిరసుండును, ఇరువురఁ గృశాశ్వుండును వరియించి రందు. 268

తే. ధర్మపత్నులు పదుగురు ధర్మమతులు, వారు హరిఁ గూర్చి తపము పెంపారఁజేసి
వివిధసంతానవతులైరి విప్రముఖ్య, వినుము నీ కవ్విధంబెల్ల విస్తరింతు. 269

వ. అది యెట్లనిన ధర్మునిపత్నులు పదుండ్రయందు విశ్వయనుదానికి విశ్వేదేవతలు పుట్టిరి. సాధ్య యనుదానికి సాధ్యులు పుట్టిరి. అరుణ యనుదానికి నరుణ్వంతులు పుట్టిరి. భాన వనుదానికి భానుండు పుట్టె. ముహూర్తయనుదానికి ముహూర్తం బులు పుట్టె. లంబయనుదానికి ఘోషాదులు పుట్టిరి. జామి యనుదానికి జామీగణంబులు పుట్టె మరుత్వతి యనుదానికి పృథ్వివిషయంబులు పుట్టె సంకల్ప యనుదానికి సంకల్పంబులు పుట్టె. వసువనుదానికి నావుండును ధ్రువుం డును సోముండును ధర్ముండును అనిలుండును అనలుండును ప్రత్యూషుండును ప్రభాసుండును ననెనమండ్రు వసువులు పుట్టిరి. అందు నావునకు శ్రముండును విశ్రాంతుండును బుట్టిరి. ధ్రువునకు కాలుండు పుట్టె. సోమునకు వత్సరుండు పుట్టె. ధర్మునకు ద్రవిణుండును హుతవహుండును బుట్టిరి. అనిలునికిఁ బురోజ వుండు నవిజ్ఞాతియుఁ బుట్టిరి. అనలునకుఁ గుమారుండు పుట్టె. ప్రత్యూషునకు దేవలుండును క్షమావంతుండును బుట్టిరి. ప్రభాసునకు బృహస్పతిచెలియ లైన యోగశిద్ధకు విశ్వకర్ముండు పుట్టె. 270

---

కలయంగాక = కడవెళ్ళ. 264 వేవురు = వేయిమంది. తొంటి = మునుపటి. 265 అగ్రజన్ములు = ముందు జనించినవారు - అన్నలు, ఎందుఁ బోయి మడిసిరో = ఎక్కడ పోయి చచ్చిరో, దివిజు లకును = దేవతలకును. 267 అనుజన్ములు = వెనుకపుట్టినవారు - తమ్ములు, మరలక = తిరిగిరాక. 268 నష్టసంతానుఁడు = చెడిన సంతతిగలవాఁడు, అఱువండ్రు = అఱువదిమంది, పదుండ్రను =

వసంతతిలకావృత్తము. ఆవిశ్వకర్మసముదంచితశిల్పవిద్యా
ప్రావీణ్యతం ద్రిదశపట్టణతక్షకుండై
భావంబునందు బహుభంగుల నేమియైనన్
గావించుచుండుఁ దనకౌశల ముల్లసిల్లన్. 271

వ. అట్టి విశ్వకర్మ ప్రజాపతికిఁ ద్వష్ట పుట్టె. వానికి మహాతపోధనుం డైనవిశ్వరూపుండు పుట్టె. వానికి హరుండును బహురూపియు త్ర్యంబకుండును అపరాజితుండును వృషాకపియు శంభుండును కపర్దియు రైవతుండును మృగవ్యాధుండును శర్వుండును కపాలియు నన నేకాదశరుద్రులు పుట్టిరి మఱియును. 272

ఆ. ఆమరీచిపుత్త్రుఁ డగుకశ్యపప్రజా, పతివరించినట్టిభామినీత్ర
యోదశంబునందు నుద్భవించినవారిఁ, దెలియ వినుము భూమిదేవముఖ్య. 273

వ. అదియెట్లనినఁ గశ్యపుభార్య లైనయదితియు దితియు ధనువును నరిష్టయు సురసయు శ్వసనయు సురభియు వినతయు తామ్రయు క్రోధవశయు నిరయు కద్రువయు మునియు ననుపదుమువ్వురయందును బుణ్యవతి యైనయదితికి శక్రుండును చక్రధరుండును బుట్టిరి మఱియును. 274

క. మును చాక్షుషమన్వంతర, మున దేవగణంబునందు ముఖ్యులు తుషితుల్
జనియించి రదితికడుపున, ననఘాత్ములు వారు ద్వాదశాదిత్యు లనన్. 275

వ. వారు వైవస్వతమన్వంతరంబున నర్యముండును ధాతయుఁ ద్వష్టయుఁ బూషుండును రవియు వివస్వంతుండును సవితయు మిత్రుండును వరుణుండు నంశుండును భగుండును తేజుండు నన ద్వాదశాదిత్యులై పుట్టిరి బహుపుత్త్రునకుఁ బదునలువురు మనువులు పుట్టిరి. అంగిరసునకు రుచికుం డను బ్రహ్మర్షి పుట్టె. కృతాశ్వుం డను దేవమునికి దేవప్రహరణంబులు పుట్టె. 276

క. ఈయమరావళియంతయు, వేయిమహాయుగము లైనవిధిదివసమునం
దాయాయుగముల మఱియును, బాయకపుట్టుదురు యజ్ఞభాగంబులకై. 277

## ప్రహ్లాదచరిత్రము.

వ. మఱియుఁ గశ్యపప్రజాపతికి రెండవభార్య యైనదితియందు హిరణ్యకశిపుహిరణ్యాక్షులును సింహికయునుం బుట్టిరి. అందు సింహికను విప్రచిత్తి యనురాక్షసుండు పరిగ్రహించె హిరణ్యకశిపునకుఁ బ్రహ్లాదుండు ననుహ్లాదుండును సంహ్లాదుండును హ్లాదుండు నన నలువురు పుట్టి రందుఁ బరమభాగవతుం డైనప్రహ్లాదునిచరిత్రంబు చెప్ప నవాఙ్మానసగోచరం బది యెట్లనిన. 278

పసిమందిని. 271 సముదంచిత...ప్రావీణ్యతన్ = మిక్కిలి యొప్పిదమైన శిల్పవిద్యలయందలి నేర్పుచేత, త్రిదశపట్టణ తక్షకుఁడు = దేవలోకమునకు వడ్లవాఁడు, ఏమియైనన్ =ఏశిల్పమునైనను. కౌశలము = నేర్పు. 274 శక్రుండును = ఇంద్రుఁడును, చక్రధరుండును = విష్ణువును - వామనుఁ డనుట. 276 ప్రహరణంబులు = ఆయుధములు. 277 అమరావళి = దేవతాపఙ్క్తి - దేవసమూహము, విధిదివసమునన్ = బ్రహ్మదినమునందు. 278 అవాఙ్మానసగోచరంబు = నోటికిని మన

క. దితిజుఁడు హిరణ్యకశిపుఁడు, పితామహునిఁ గూర్చి తపము పెద్దయుఁ గాలం
బతిభక్తిఁ జేసి త్రిభువన, పతి యగువర మతనిచేతఁ బడసి కడంకన్. 279

వ. సర్వలోకకంటకంబుగా రాజ్యంబు చేయుచు నశేషంబులుగా యజ్ఞభాగంబులు తాన కైకొనిన దేవతలు వెఱచి మనుష్యరూపంబులఁ బృథివియందు వర్తించుచుండ నైశ్వర్యదర్పితుండై నిఖిలలోకంబుల బాధించుచు సిద్ధగంధర్వపన్నగాదులు దన్నునుపాసింప సకలరాక్షసదైత్యదానవలోకంబులు, జయజయశబ్దంబులు గావింపఁ బొంపిరివోవుచు నొక్కనాఁడు మద్యపానమత్తుండై మణికనకమయ ప్రాసాదతలంబున సకలలోకంబులు గొలువఁ గొలువుండి బాలపాఠ్యంబు లైన చదువులు నేర్చుచున్న ప్రహ్లాదుని గురుసమేతంబుగా రావించి గారవించి యిట్లనియె 280

ఉ. ఏమిసుభాషితంబు పఠియించితి పుత్రక రాజనీతు లే
మేమి యెఱుంగఁజెప్పె గురుఁ డిప్పుడు నీదగుపుస్తకంబునం
దేమి లిఖించి యున్నయది యిప్పుడు పాఠకశక్తిఁ జూచెదన్
మామది కింపుగాఁ జదువుమా యొకపద్యము వీరిముందఱన్. 281

వ. అనినఁ దండ్రికిఁ గొడు కిట్లనియె. 282

ఆ. ఏను సారభూత మైనసుభాషితం, బెఱేఁగినాఁడ దానవేంద్ర వినుము
విష్ణుభక్తికంటె విష్ణువినుతికంటె, నెక్కుడైనచదువు లెందుఁ గలవు. 283

చ. అనవుడు దైత్యలోకవిభుఁ డవ్వచనంబు నిశాతశూలమై
తనదగుకర్ణరంధ్రములఁ దాఁకిన మిక్కిలి కోపరక్తలో
చనములతోడఁ బుత్రకుని సన్నిధియం దుచితాసనంబునం
దనరుచు నున్నతద్గురునిఁ దప్పక చూచి యదల్చి యిట్లనున్. 284

చ. కటకట బ్రహ్మబంధుఁడవుగాని గురుండవుగావు చిన్నకూఁ

---

సునకును కానరానిది - చెప్పను తలఁపను శక్యము కానిదనుట. 279 పితామహునిన్ = బ్రహ్మను, త్రిభువనపతి = స్వర్గమర్త్యపాతాళము లనెడు మూఁడులోకములకు ప్రభువు, పడసి = పొంది, కడంకన్ = ఉత్సాహముతో. 280 సర్వలోకకంటకంబుగాన్ = ఎల్లలోకములకు ముల్లుగా - సమస్తలోకములకు బాధకుఁడుగా ననుట, అశేషంబులుగాన్ = మిగతలేకుండునట్లుగా, పృథివియందున్ = భూమియందు, వర్తించుచుండన్ = మెలఁగుచుండఁగా, ఐశ్వర్యదర్పితుఁడు = సంపదచేత గర్వించినవాఁడు, ఉపాసింపన్ = సేవింపఁగా, పొంపిరివోవుచు = విఱ్ఱవీఁగుచు, మద్యపానమత్తుండై = మద్యముత్రాగుటచేత దేహము తెలియనివాఁడై, మణి...తలంబునన్ = రత్నములు చెక్కిన బంగారు మేడమీఁద, బాలపాఠ్యంబులు = బాలకులకు చదువఁదగినవి. 281 సుభాషితంబు = మంచిమాట = నీతియనుట, 283 సారభూతము = సత్తైనది. 284 నిశాత = వాఁడియైన, కోపరక్తలోచనములతోడన్ = కోపముచేత ఎఱ్ఱనైనకన్నులతో, సన్నిధి = సమీపప్రదేశము, ఉచితాసనంబునన్ = తగినపీఠమునందు, తనరుచున్ = ఒప్పుచు, తద్గురునిన్ = ఆకొడుకును చదివించునట్టి యయ్యవారిని, తప్పక = చూపుతప్పక. 285 కటకట = అయ్యయో. బ్రహ్మబంధుఁడవు =

కటిపసిబిడ్డనిన్ దనుజకంటకుఁ డైనపయోరుహాక్షు నే
మిటికి నుతింపుమంచు నియమించితి వేమనుహాఁడ నిన్ను నీ
కుటిలచరిత్రము ల్వినినఁ గోపము పుట్టదె యెట్టివారికిన్. 285

చ. అనవుడు నాగురుండు దివిజాంతక నాయెడఁ దప్పులేదు నీ
తనయునిచేత లీదనుజదారకకోటి యెఱుంగు వీఁడు నా
పనుపున గద్యపద్యములు పాఠముచేయఁడు చేసెనేనియున్
మనసున విష్ణుచింతనము మానఁడు వీనివిరాళి యెట్టిదో. 286

ఉ. నావుడు దానవేశ్వరుఁడు నందనుఁజూచి గురుండు చెప్పిన
ట్లీవు పఠింతుగాని యిఁక నెన్నఁడు నాకు విరోధి యైనల
క్ష్మీవిభుఁ బ్రస్తుతించెదు సుమీ మనవంశములోన లేనియీ
కావల మేల నామహిమకంటెను వానిమహత్వ మెక్కుడే. 287

ఆ. పొమ్ము పుత్ర నీవు బుద్ధిమంతుండవై, చదువు మనుచు బుద్ధి చాలఁ జెప్పి
పనుప నింటి కరిగి ప్రహ్లాదుతోడ న, గ్గురుఁడు పలికెఁ జాలఁ గుస్తరించి. 288

మ. విను మీతండ్రి సమస్తలోకములకు న్వీరుండు పంకేరుహా
సనునిం గూర్చి తపంబుచేసి మహిమన్ సంధిల్లుచున్నాఁడు గా
వున లక్ష్మీవిభుఁ గొల్వ నొల్లఁ డివె నీవుం జూడ నాతోడ నా
డినవాక్యంబులపద్ధతుల్ చదువురాఢి న్నీతిశాస్త్రావళుల్. 289

వ. అనిన దైత్యనందనుం డతని కిట్లనియె. 290

క. విను నాతండ్రికిఁ బుట్టిన, వెనువేదుఱు నీకుఁ బుట్టె పీతాంబరునిన్
వినుతించి కొలువఁగా వల, దని పలికెద వకట యెంత యజ్ఞానివొకో. 291

ఉ. కేవలపాపకర్మములఁ గీల్కొని యున్ననిశాటకోటి నీ
కైవసమై పురోహితము గైకొని నేఁయుటఁజేసి నీకు ల
క్ష్మీవిభుని న్భజించుటకుఁ జిత్తము గొల్పదు గాన నెంతయున్
నీవు వివేకహీనుఁడవు నీచదువు ల్వినవొల్ల నెన్నఁడున్. 292

చ. అనిమిషలోకరక్షణపరాయణు దానవదైత్యభీకరున్
వనరుహలోచనున్ సుజనవత్సలునిన్ గరుణాపయోనిధిన్

---

జాతిమాత్రమునబ్రాహ్మణుఁడవు - నీచబ్రాహ్మణుఁడవు అనుట, చిన్నికూఁకటి పసిబిడ్డనిన్ = మిక్కిలి పసివాఁడైన పిన్నవానిని, దనుజకంటకుఁడు = రాక్షసబాధకుఁడు, పయోరుహాక్షున్ = కమలముల వంటి కన్నులుగలవానిని - విష్ణువును, కుటిలచరిత్రములు = వంకరనడతలు. 286 దివిజాంతక = దేవతలకు యముఁడవైనవాఁడా, చేతలు = చేష్టలు, దారకకోటి = బాలురసమూహము, నాపనుపునన్ = నాయాజ్ఞచొప్పున, విరాళి = ఆసక్తి. 287 కావలము = మూఢత్వము, 288 కుస్తరించి = బుజ్జగించి, 289 సంధిల్లుచున్నాఁడు = కూడుకొనుచున్నాఁడు, పద్ధతులు = మార్గములను. 291 వేదుఱు = పిచ్చి, పీతాంబరునిన్ = విష్ణుని, అకట = అయ్యో. 292 కీల్కొని = అంటి, నిశాటకోటి = రాక్షససమూహము, కైవసము = స్వాధీనము, కొల్పదు = ఉత్సహింపదు. 293 అనిమిష...పరాయణున్ = దేవతాసమూహమును కాపాడుటయందు ఆసక్తుఁడైనవానిని, దైత్య

మనమునఁ గొల్వలేక యభిమానమునం జెడిపోవ నున్న నా
జనకునియట్ల నీవును విచారవిహీనుఁడ వైతి వక్కటా. 293

క. అని యిట్లు పెక్కువిధముల, దనుజేశ్వరనందనుండు తద్దయుఁ గోపం
బున ధిక్కరించి యాడిన, విని గురుఁ డొండాడలేక వివశత నుండెన్ 294

వ. అంత నొక్కనాఁడు హిరణ్యకశిపుండు శతయోజనప్రమాణోన్నతంబై కనక
శైలంబు ననుకరించు హిరణ్యప్రాసాదతలంబున శీధుపానవినోదంబులఁ దగిలి
యంగనాజనసహితుండై యుండి ప్రహ్లాదుని రావించి నీతిశాస్త్రంబులు పరి
యింపు మనిన నతం డిట్లనియె. 295

ఉ. శ్రీతరుణీకళత్రు సరసీరుహనేత్రుని సర్వలోకవి
ఖ్యాతచరిత్రు దైత్యమదగర్వవిదారణు వాసుదేవునిం
బ్రీతిమెయిన్ భజించి వలపించితి ధన్యుఁడ నైతి నింక నీ
నీతులుగీతులున్ జదువు నేర్పులుగీర్పులు నాకు నేటికిన్. 296

చ. అనవుడు రాక్షసేంద్రుఁడు భయంకరకోపవిఘూర్ణమానలో
చనములతోఁ దనూభవునిఁ జక్కఁగఁ జూచి దురాత్మ నీవు నా
తనయుఁడవై కులోచితముఁ దప్పి నిశాచరవైరి యైనదు
ర్జనుని ముకుందు నెన్నెదవు సారెకు నాదగుసమ్ముఖమ్మునన్. 297

ఉ. ఎల్లజగంబులన్ బలిమి నేలెడునామహనీయవైభవం
బొల్లక నేఁడు నీవు పురుషోత్తమునిన్ భజియింపఁ గోరితీ
కల్ల సహింపఁజాల నినుఁ గట్టి వధించెదఁ జూత మింక నా
బల్లిదుఁ డైనవిష్ణుని ప్రభావము నీదగుభక్తి యుక్తియున్. 298

భీకరున్ = రాక్షసులకు భయమును కలుగఁజేసెడువానిని, వనరుహాలోచనున్ = కమలములవంటి కన్నులు గలవానిని, సుజనవత్సలునిన్ = సజ్జనులయందు వాత్సల్యముగలవానిని, కరుణాపయోనిధిన్ = దయాసముద్రుని, అభిమానమునన్ = అహంకారముచేత. 294 ధిక్కరించి = తిరస్కరించి, ఒండు = వేఱొకమాటను, వివశతన్ = పరవశత్వమును. 295 శతయోజనప్రమాణోన్నతంబు = నూఱామడలోలఁది పొడువుగలది, కనకశైలంబు = బంగారుకొండ, అనుకరించు = సరిపోలు, ప్రాసాదతలంబునన్ = మేడమీఁద, శీధుపాన = మద్యపానము నందలి, తగిలి = ఆసక్తుఁడై, అంగనాజన = స్త్రీసమూహముతోడ. 296 శ్రీతరుణీకళత్రున్ = లక్ష్మీదేవిభార్యగాఁ గలవానిని, సరసీరుహనేత్రునిన్ = కమలములవంటి కన్నులుగలవానిని, సర్వ...చరిత్రున్=ఎల్లలోకములయందు ప్రసిద్ధినొందిన నడవడికలవానిని, దైత్య...విదారణున్ = రాక్షసులయొక్క మదమును అహంకారమును భేదించునట్టివానిని, భజించి = సేవించి, వలపించితిన్ = ప్రీతినొందించితిని. 297 భయంకర...లోచనములతోన్ = వెఱపును కలుగఁజేయునట్టి కోపముచేత తిరుగుచున్నకన్నులతో, దురాత్మ = చెడ్డబుద్ధిగలవాఁడా, కులోచితమున్ = కులమునకుఁదగిన నడవడిని, నిశాచరవైరి = రాక్షసులకు పగవాఁడు, సారెకున్=మాటిమాటికి, సమ్ముఖమ్మునన్=ఎదుట. 298 కల్ల = తప్పును, బల్లిదుఁడు = బలవంతుఁడు, ప్రభావము = మహిమము.

వ. అని యతండు గోవిందపదారవిందస్మరణాహ్లాదుం డగు ప్రహ్లాదునిసర్వాంగంబులు కాలపాశంబులంబోని ఘోరపాశంబులతో బంధించిన నతండు విశ్వంభరధ్యానామాననూనసుండు గావునఁ దద్బంధంబు లెల్లం దెగియె అప్రమాదంబు లైనదిగ్గజంబులచేఁ జొడిపించిన నతండు నరసింహాస్తోత్రపవిత్రుండు గావునఁ దద్వారణవిషాణంబు లంగంబున భంగంబులయ్యె మఱియు నొక్కనాఁడు సూపకారు లగురాక్షసులచేత విషం బన్నంబుతోడం బెట్టించిన నతండు భగవద్ధ్యానామృతపాననిరతుండు గావున నవ్విషం బన్నంబుతోడన జీర్ణంబయ్యె వెండియు నొక్కనాఁడు భార్గవనిర్మిత యగుకృత్తిచేతం జంపింప సమకట్టిన నతండు జనార్దనభక్తజనబంధుండు గావునఁ దదీయమాయాపనేయుండయ్యె. వెండియు నొక్కనాఁడు శంబరాదిరాక్షసులచేత మహామాయాంధకారంబు గల్పించిన నతండు సుదర్శనధరమంత్రానుష్ఠానపరుండు గావునఁ బ్రకాశదేహుండయ్యె. మఱియొక్కనాఁడు మహాప్రళయవాయువుఁ గల్పించి శోషింపం జేసిన నతండు భుజంగశయనసంగతహృదయుండు గావున సప్రాణుండయ్యె. ఇట్లు హిరణ్యకశిపుమాయోపాయనికషణంబులు ప్రహ్లాదభక్తిజాంబూనదం బొరయుచుండె నంత.

ఉ. విస్మయ మొప్పఁగా దనుజవీరులమాయలచేత బ్రుంగుఁడై
భస్మములోపల న్మెఱయు పావకమూర్తియుఁ బోలె వాసుదే
వస్మరణప్రభావమున వర్ధితుఁడై వెలుఁగొందుచుండె మం
దస్మితసుందరాననమునన్ దనుజేంద్రసుతుండు పెంపుతోన్. 300

చ. ఒకమరి విష్ణుభక్తిగలయుత్తములన్ గొనియాడు మెచ్చు వే
ఱొకమరి విష్ణునిం గొలువ నొల్లనిమూఢులఁ జూచి నవ్వు నొం
డొకమరి విష్ణుభక్తి మది నుబ్బిన నిబ్బరమందుచుండు నా

---

299 గోవింద...హ్లాదుండు = శ్రీహరియొక్క పాదపద్మములను స్మరించుటచేత సంతోషమునొందినవాఁడు, కాలపాశంబులంబోని = యమపాశములవంటి, ఘోరపాశంబులతోన్=భయంకరములైన త్రాళ్లతో, విశ్వంభర...మానసుండు = ఎల్లలోకములను భరించునట్టివాఁడైన శ్రీహరియొక్క ధ్యానముచేత కొఱఁతలేనిమనసుకలవాఁడు, అప్రమాదంబులు=ఏమఱుపాటులేనివి, తద్వారణవిషాణంబులు= ఆయేనుఁగులకొమ్ములు, సూపకారులు = వంటవారు, కృత్తిన్ = కృత్రిమభూతమును, అపనేయుండు = పోఁగొట్టఁదగినవాఁడు, సుదర్శన...పరుఁడు = చక్రధరుఁడైన శ్రీవిష్ణునిమంత్రమును, అనుష్ఠించుటయందు ఆసక్తుఁడు, భుజంగ...హృదయుండు = శేషశాయితో కూడుకొన్న హృదయము గలవాఁడు - శ్రీవిష్ణువును మనసున నిలిపి ధ్యానము చేయువాఁడు అనుట, నికషంబులు = ఒరగండ్లు, జాంబూనదంబు = బంగారు. 301 విస్మయము = ఆశ్చర్యము, బ్రుంగుడు = పూడినది - కప్పఁబడినదనుట, పావకమూర్తి = అగ్నియొక్క ఆకృతి, వర్ధితుఁడు = పెంపఁబడినవాఁడు, మందస్మితసుందరాననమునన్ = చిఱునవ్వుచేత అందమైన మొగముతో. 300 ఒకమరి = ఒకసారి, గొనియాడున్ = పొగడును, నవ్వున్ = పరిహసించును, ఉబ్బినన్ = పొంగినను, నిబ్బరము =

ప్రకటగుణాభిరాముఁ డగుభాగవతోత్తముఁ డాత్మఁ జొక్కుచున్. 301

వ. ఇట్లు వినోదించుచుండి యొక్కనాఁడు హిరణ్యకశిపుకడకుం జని నమస్కరించి కరకమలంబులు మొగిచి యిట్లనియె. 302

హిరణ్యకశిపుఁడు తనకు జ్ఞానోపదేశము చేయవచ్చినకొడుకును శిక్షించుట.

మ. దనుజాధీశ్వర నీకు నేమిటికి మిథ్యావైర మానీరజా
సనసంకల్పిత లైనయాయసురరాజ్యశ్రీల నీనెమ్మనం
బున నిక్కంబులుగాఁ దలంచి సకలంబుం దానవై తేజరి
ల్లినవిష్ణుం భజియింప కేల కడుజాలిం బొందఁగా నక్కటా. 303

క. నిన్నింతవానిఁ జేసిన, యన్నలినజుతండ్రి విష్ణుఁ డట్టివిభునిచే
మన్ననలు గన్నవారల, కెన్నఁడు దుఃఖములు చెంద వెఱుఁగుము తండ్రీ. 304

క. నీవంటిఘనుఁడు సాత్త్వికుఁ, డై విష్ణునిఁ గొలువ కేల యతితామసమో
హావేశబుద్ధి మూఢుఁడ, వై విడిచితి మోక్షకరము లగుమార్గంబుల్. 305

మ. అనినం దానవచక్రవర్తి పటుకోపావేశదుర్వారుఁడై
ఘనహుంకారముతోడ లేచి వెస వక్షం బుద్ధతిం దన్నెఁ ద
న్నినగోవిందపదారవిందములపై నెక్కొన్న చిత్తంబుతో
ననురాగంబున నుండె ధైర్యనిధి ప్రహ్లాదుండు సాహ్లాదుఁడై. 306

వ. అంత దేవాంతకుం డంతకాకారుండై పౌలోమకాలకేయవిప్రచిత్తిరాహు ప్రముఖు లైనదానవులం బిలిచి యిద్దురాత్ముని పాశంబుల బంధించి సముద్రంబులోన వైచి చదియునట్లుగాఁ బర్వతంబులు శతయోజనప్రమాణంబులు వైచి వధియించి రం డనినఁ దత్క్షణంబ వార లమ్మహాత్మునిం గొనిపోయి. 307

ఉ. క్రన్నన నాగపాశములఁ గట్టి మహాంబుధిలోన వైచి మీఁ
ద న్నిబిడంబు లైనవసుధాధరముల్ శతయోజనంబు ల

కదలక మెదలకయుండుటను, ప్రకటగుణాభిరాముఁడు = ప్రసిద్ధమైన గుణములచేత ఒప్పినవాఁడు, చొక్కుచున్ = పరవశత్వమునొందుచు. 303 మిథ్యావైరము = అబద్ధపువిరోధము - వ్యర్థపుపగయనుట, ఆనీరజాసన సంకల్పితలు = ప్రసిద్ధుఁడైన బ్రహ్మచేత కలుగఁజేయఁబడినవి, తేజరిల్లిన = వెలిఁగిన, జాలిన్ = దుఃఖమును. 304 నలినజు = బ్రహ్మయొక్క, మన్ననలన్ = ఆదరణలను, కన్నవారలకున్ = పొందినవారికి. 305 సాత్త్వికుఁడు = సత్త్వగుణమువలనఁగలిగిన సాధుభావముగలవాఁడవు, తామసమోహావేశబుద్ధిన్ = తమోగుణమువలనఁగలిగిన అజ్ఞానమును పొందినబుద్ధితో, మోక్షకరములు = ముక్తిని కలుగఁజేయునవి. 306 దుర్వారుఁడు = అడ్డగింపఁగూడనివాఁడు, వెసన్ = వేగముగా, వక్షంబు = ఱొమ్మును, ఉద్ధతిన్ = మిడిసిపాటుతో, నెక్కొన్న = నెలకొనిన - చలింపకనిలిచిన, సాహ్లాదుఁడు = ఆహ్లాదముతో కూడుకొన్నవాఁడు. 307 అంతకాకారుఁడు = యమునివంటి ఆకృతిగలవాఁడు. ప్రముఖులు=మొదలగువారు, చదియునట్లుగాన్ = నలఁగి అణఁగి పోవునట్టుగా. 308 క్రన్ననన్ = శీఘ్రముగా, నాగపాశములన్ = పాములనెడుత్రాళ్లచేత, నిబిడంబులు = దట్టములైనవి, వసుధాధరములు = కొండలు, ఉద్ధతిన్ = నిక్కుతో, వెన్ను

త్యున్నతభంగిగా నసురు లుద్ధతి వైచిన భక్తిభావసం
పన్నుని వెన్నునిన్ హృదయపద్మములో నిడియుండె నవ్వుచున్. 308

క. వారిధి సంక్షోభించి మ, హారభసముతోడఁ దరఁగలను హస్తములన్
దీరంబుఁ జేర్చె విష్ణుస,మారాధనసంప్రమోదు నాప్రహ్లాదున్. 309

వ. ఇట్లు హిరణ్యకశిపుప్రయత్నంబులైన యుపద్రవంబులవలన ముక్తుండైనభగవ ద్భక్తుని మహానుభావంబును చూచి సకలభూతంబులు నతని వాసుదేవునియప రావతారమూర్తి యని కొనియాడుచుండె నట్టిసమయంబున. 310

భక్త్యతిశయముచే వినుతించు ప్రహ్లాదునకు శ్రీహరి ప్రత్యక్షంబగుట.

తే. తనకు నట్టిమహామహత్వంబు కరుణ, నొసఁగి మన్నించినట్టిపయోజనాభు
డెందమున నిడి సంతతానందహృదయుఁ, డగుచు వేదార్థయుక్తి నిట్లని నుతించె

సీ. నారాయణాయ పంకేరుహనేత్రాయ వాసుదేవాయ శ్రీవల్లభాయ
నిత్యాయ పరమాత్మనే నిర్వికారాయ శుద్ధరూపాయ జగద్ధితాయ
గోబ్రాహ్మణహితాయ గురుధర్మమూర్తయే బ్రహ్మణ్యదేవాయ పరమపావ
నాయ సదైకరూపాయ గోవిందాయ సనకాదియోగీంద్రసన్నుతాయ

ఆ. త్రిగుణవిరహితాయ శ్రీహృషీకేశాయ, కీర్తితాఖిలాయ కేశవాయ
దురితనిరసనాయ తుభ్యం నమోనమో, యనుచు భక్తి యుక్తి నభినుతించె. 312

చ. అని వినుతించుచున్న సమయంబున శ్రీతరుణీకుచోపగూ
హనపరిశోభితంబు లగుహస్తపయోజవిరాజితంబులై
యనుపమశంఖచక్రము లుదంచితచంద్రదినేశ కాంతులన్

నిన్ = విష్ణుదేవుని. 309 వారిధి = సముద్రము, సంక్షోభించి = కలఁగి, మహారభసముతోన్ = అధికమైనత్వరతో, తరఁగలు=అలలు, విష్ణుసమారాధన సంప్రమోదున్=విష్ణుని లెస్సగా నారాధించుట చేత సంతోషమునొందినవానిని. 310. ముక్తుఁడు = విడువఁబడినవాఁడు, మహానుభావంబులు=ప్రభావములు, అపరావతారమూర్తి=రెండవయవతారమునొందినమూర్తిగలవాఁడు. 311 మహామహత్వంబు=మహిమకలిగినవానితనమును, డెందమునన్ = మనసునందు, సంతతానందహృదయుఁడు = ఎడతెగనియానందముతోడి మనసుగలవాఁడు. 312 పంకేరుహనేత్రాయ = తామరలవంటి కన్నులుగల, నిత్యాయ = శాశ్వతుఁడయిన, నిర్వికారాయ = వికారరహితుఁ డయిన, జగద్ధితాయ = లోకములకు మేలుచేయునట్టి, గురుధర్మమూర్తయే=పూజ్యమైన ధర్మమే స్వరూపము గాఁగల, బ్రహ్మణ్యదేవాయ = బ్రహ్మజ్ఞానులకు దేవుఁడైన, సదైకరూపాయ = సత్తై ఒక్కటియైన రూపముగల, త్రిగుణవిరహితాయ = సత్వరజస్తమస్సులనెడుమూఁడుగుణములు లేని, హృషీకేశాయ = ఇంద్రియాధిదేవతయైన, కీర్తితాఖిలాయ = స్తోత్రముచేయఁబడిన సర్వలోకములుగల - ఎల్లవారిచేతను పొగడఁబడిన, దురితనిరసనాయ = పాపములను పోఁగొట్టునట్టివాఁడైన, తుభ్యమ్ = నీకొఱకు, నమోనమో = మాటిమాటికి నమస్కారము (చేసెదను), అభినుతించెన్ = స్తోత్రముచేసెను. 313 శ్రీతరుణీ... శోభితంబులు = లక్ష్మీదేవియొక్క స్తనములను కౌఁగిలించుకొనుటచేత మిక్కిలి శోభిల్లునవి, హస్తపయోజవిరాజితంబులు=కమలములవంటి హస్తములయందు ప్రకాశించునవి, ఉదంచిత...కాంతులన్ =

దనరఁగ శౌరి వచ్చె వినతాసుతు నెక్కి రమాసమేతుఁడై. 313

వ. ఇట్లు ప్రత్యక్షం బైనపుండరీకాక్షునకు దండప్రణామస్కారంబులు చేసి కరంబులు మొగిచి యానందబాష్పధారానిష్యందలోచనారవిందుండును హర్షపులకాంకుర దంతురితాంగుండును బరమసంతోషసముద్గతగద్గదస్వరుండును నైనయబ్బాలకు శరీరంబు నాభికమలసంభూతచతుర్ముఖగండమండలస్పర్శోపలాలననిపుణ ప్రశస్తంబు లైనహస్తంబుల నిమిరి గారవించి యిట్లనియె. 314

క. నీతండ్రి నీకుఁ జేసిన, పాతకములఁ జెడక పరమపరిశోభితపు
ణ్యాతిశయంబున ననుఁ గడుఁ, బ్రీతునిఁ జేసితివి పిన్నబిడ్డఁడవయ్యున్. 315

వ. కావున నీకోరినవరం బిచ్చెద వేఁడు మనిన. 316

క. ఏయేజన్మంబులయం, దేయేజంతువులయందు నెచ్చో నెచ్చో
నేయేగతి జన్మింపుదు, నాయాజన్మంబులందు నాకాలములన్. 317

క. అవివేకికి సంసార, వ్యవహారమునందుఁ గల్గువాంఛ నిరతముగ్
భవదీయపదంబులపైఁ, దవుల న్వరమిచ్చి నన్ను దయఁ జూడఁగదే. 318

వ. అనినం బరమేశ్వరుం డిట్లనియె. 319

ఉ. నీవు మహానుభావుఁడవు నీహృదయంబు మదీయభక్తితోఁ
జేవ వహించి యుండుట ప్రసిద్ధము ముక్తియె కాని యెమ్మెయిగ్
భావిభవంబు లే దసురబాలక వైష్ణవకోటికెల్ల నీ
త్రోవయ మేలుబంతి యఘదూరుఁడ వైతివి చెప్పనేటికిన్. 320

వ. అదియట్లుండె నింక నొక్కవరం బడుగుమనిన నతం డిట్లనియె. 321

మ. అమరారాతిదితిప్రసూతి మదగర్వాంధుండు నీభక్తి వై
రమునగ్ నాయెడ పెక్కుదోషములు దుర్వారస్థితిం జేసె నా

---

ఒప్పిదములైన చంద్రసూర్యులకాంతులవంటి కాంతులతో, తనరఁగన్ = ఒప్పుచుండఁగా, వినతాసుతున్ = గరుత్మంతుని, రమాసమేతుఁడై = లక్ష్మీదేవితోఁ గూడుకొన్నవాఁడై. 314 దండప్రణామస్కారంబులు = సాగిలఁబడిచేయఁబడిన నమస్కృతులు, ఆనంద...విందుండు = సంతోషబాష్పముల ధారలు జాఱుచున్నకన్ను లనెడుకమలములు కలవాఁడు - కన్నులయందు ఆనందబాష్పములను విడుచుచున్నవాఁడు, హర్ష...అంగుండు = సంతోషముచేత కలిగిన గగుర్పాటుచేత ఎగుడుదిగుడయిన అవయవములు గలవాఁడు, పరమ...స్వరుఁడు = అధికసంతోషముచేత వెడలుచున్న డగ్గుత్తికతోఁడి కంఠస్వరముగలవాఁడు, నాభి...ప్రశస్తంబులు = బొడ్డుదామరయందు జనించిన బ్రహ్మయొక్క చెక్కిళ్లనుఅంటి బుజ్జగించుటయందలి నేర్పుచేత ప్రశంసింపఁబడినవి, గారవించి = మన్నించి. 315 పాతకములన్ = పాపకృత్యములచేత, పిన్నబిడ్డఁడవు = పసిబాలుఁడవు. 320 చేవ = బలమును - దార్ఢ్యమును, భావిభవంబు = పునర్జన్మము, అఘదూరుఁడవు = పాపముల కెడమైనవాఁడవు - పాపములుపొందనివాఁడవు. 322 అమరారాతి = దేవతలకుపగవాఁడయిన, దితిప్రసూతి=హిరణ్యకశిపువు, మదగర్వాంధుండు = క్రొవ్వుచేతను అహంకారముచేతను కన్నుగాననివాఁడు, నీభక్తివైరమునన్ = నీయందలి భక్తివలనఁ గలిగిన విరోధముచేత, దోషములు = తప్పులు, దుర్వారస్థితిన్=

కుమతిఁ దప్పులు పట్టఁగాఁ జనదు తద్ఘోరాఘము ల్వాపి పు
ణ్యమతిం జేయుము భక్తరక్షణకళావ్యాపారపారాయణా. 322

మ. హిమవత్పర్వతకూటసానువులనుం డేతెంచు హైమాంబుపూ
రముఁ జండాలగృహాగ్రభాగజలధారాసారభూరిప్రవా
హము భాగీరథిలోనఁ గూడి సమమైన ట్లొక్కరూపంబ హృ
త్కమలజ్ఞానియుఁ బాపకర్ముఁడుఁ ద్రిలోకాధీశ లక్ష్మీశ్వరా. 323

ఆ. అనిన దేవదేవుఁ డాతనిగురుభక్తి, యుక్తి మెచ్చి నీకు నుచితమేని
నీదుతండ్రిపుణ్యనిధిఁ జేసి మోక్షంబు, నర్థితోడ నిత్తు నంతమునను. 324

క. ఇంకొక్కవరము వేఁడుము, శంకాతంకములఁ బొందఁ జనదనినఁ గృపా
లంకారమూర్తి యగునా, పంకజనేత్రునకు దైత్యబాలకుఁ డనియెన్. 325

క. ధర్మార్థకామమోక్షద, కర్మంబుల శైశవాదికాలంబుల నీ
నిర్మలభక్తియుఁ గల్గఁగఁ, బేర్మిం గృపసేయు మిదియె ప్రియము ముకుందా. 326

వ. అనిన నద్దేవుం డతనికిఁ గైవల్యపదంబు మొదలుగాఁ గోరినవరంబు లొసంగి యంత
ర్హితుం డైనంత దితిజబాలకుండు నిజపురంబునకుం జని తండ్రికి నమస్కరించి
కరంబులు మోడ్చియున్న యప్పుడు. 327

క. హరివరమువలన నప్పుడు, హిరణ్యకశిపుఁడును దొంటియీరసమెల్లన్
బరిహృతమై సత్వగుణ, స్ఫురణమెయిం గౌఁగిలించె సుతుఁ బ్రహ్లాదున్. 328

వ. ఇట్లు గౌఁగిలించి మూర్ధాఘ్రాణంబు చేసి యానందబాష్పపూరితలోచనుండై
కుమారా నాచేత ననేకదురవస్థలం బొందిన బొంది యిందిరామందిరుం డైనము
కుందుభక్తిపెంపునఁ జెడక నిలిచె. నాభాగ్యంబుగదా యని యతని నాశ్వాసించి

అడ్డములేనివిధమున, కుమతిన్ = బుద్ధిహీనుని, తద్ఘోరాఘములు = అతనియొక్క భయంకరములైన పాపములను, పాపి = పోఁగొట్టి, పుణ్యమతిన్ = ధర్మబుద్ధిగలవానిఁగా, భక్త...పారాయణా = భక్తులను రక్షించునట్టి విద్యయనెడు వ్యాపారమునందు ఆసక్తుఁడయినవాఁడా, 323 హిమ... సానువులనుండి = మంచుకొండయొక్క శిఖరమునందలి చఱులనుండి, హైమాంబుపూరమున్=మంచు నీళ్లవెల్లువయు, చండాల...ప్రవాహమున్ = మాలవానియింటి ముందటి వాననీళ్ల చేతనైన గొప్ప వెల్లువయుఁ, భాగీరథిలోనన్ = గంగానదిలో. 324 గురుభక్తియుక్తిన్ = తండ్రియందలి భక్తితోడి కూడికను - తండ్రియందు భక్తికలిగియుండుటను, ఉచితమేని = తగునని తోఁచిన పక్షమున. 325. శంకాతంకములన్=సంకోచభయములను. 326 శైశవాది = శిశుత్వము మొదలైన, పేర్మిన్ = ప్రేమతో. 327 కైవల్యపదము = ముక్తిస్థానము, దితిజబాలకుండు = రాక్షసకుమారుఁడు - ప్రహ్లాదుఁడు, నిజపురంబునకున్=తనయింటికి. 328 ఈరసము=ఈర్ష్య - విడువనిపగ, పరిహృతమై= పోయి, సత్వస్ఫురణమెయిన్ = సత్వగుణముయొక్క ప్రకాశించుటచేత. 329 మూర్ధాఘ్రాణంబు= నడితల మూర్కొనుట, ఆనందబాష్పపూరితలోచనుండు = ఆనందబాష్పములచేత నిండిన కన్నులు గలవాఁడు, దురవస్థలన్ = దుర్దశలను - బాధలను, ఇందిరామందిరుఁడు = లక్ష్మికి ఉనికిపట్టయిన

కొడుకుతోడివినోదంబులం దగిలి యనేకదివ్యసహస్రవర్షంబులు రాజ్యంబుఁజేసి తనిసి విష్ణుసాయుజ్యంబుఁ బొంద నిశ్చయించియుఁ దనకు జన్మత్రయావసానంబునం గాని కైవల్య ప్రాప్తి లేకుండుటంజేసి రజోగుణప్రేరితుండై క్రమ్మఱ విష్ణుదేవునితో బద్ధవైరుండైన. 329

శా. అంభోజాక్షుఁడు దుర్నిరీక్ష్య మగుఘోరాకారమూర్తిన్ సభా
స్తంభస్థానమునం జరాచరభయత్రస్తంబుగా భీమసం
రంభం బొప్ప నృసింహుఁడై పొడమి యారాత్రించరాధీశ్వరున్
శుంభద్గర్వుని ప్రాణముం గొనియె నస్తోక ప్రభావంబునన్. 330

వ. ఇవ్విధంబున. 331

ఉ. మోదముతోడ దైత్యవిభు మోక్షపదంబున నుండఁజేసి ప్ర
హ్లాదుఁ దదీయరాజ్యమున కర్హునిఁగా నభిషిక్తుఁ జేసి దే
వాదిసమస్తలోకముల నంచితసంపద నొంద నిల్పె దా
మోదరుఁ డమ్మహాత్ముని గుణోన్నతు లిట్లని చెప్పవచ్చునే. 332

మ భగవద్భక్తిపరాయణుం డయినయా ప్రహ్లాదుఁ డత్యున్నతిన్
జగమెల్లం దనధర్మమార్గము నిరస్తక్రోధవాక్యంబులం
బొగడన్ రాక్షసలోక మేలి మహిమం బొల్పారె సర్వంకషం
బగుకీర్తిన్ బహుపుత్రమిత్రసహితుండై యున్నచందంబునన్. 333

తే. అనఘ యష్టమి ద్వాదశి నమవసలను, బౌర్ణమాసినిఁ బ్రహ్లాదు భవ్యచరిత
మర్థిఁ బఠియించువారల కర్థసిద్ధి, గలిగి భూదానగోదానఫలము లొదవు. 334

వ. అట్టి ప్రహ్లాదునకు విరోచనుండును ఆయుష్మంతుండును శిబియును భాష్కలుండును నన నలువురు పుట్టిరి. అందు విరోచనునకు బలి పుట్టె. బలికి బాణాసుర ప్రముఖులగురాక్షసులు నూర్వురు పుట్టిరి. మఱియుఁ బ్రహ్లాదవంశసంభవులై నివాతకవచులు మూఁడుకోట్లు పుట్టిరి. హిరణ్యాక్షునికి ఝర్ఝరియు శకునియు భూత

---

వాఁడు, పెంపునన్=అభివృద్ధితో, ఆశ్వాసించి=ఊరడించి, తగిలి=ఆసక్తుఁడై, జన్మత్రయావసానంబునంగాని = మూఁడుపుట్టుకల ముగియుకయందుఁగాక, బద్ధవైరుండు=కట్టఁబడిన విరోధముగలవాఁడు-స్థిరమైనవిరోధముకలవాఁడు. 330 అంభోజాక్షుఁడు = తామరలవంటి కన్నులుగలవాఁడు - విష్ణువు, దుర్నిరీక్ష్యము = చూడశక్యముగానిది, ఘోరాకారమూర్తిన్ = భయంకరమైన ఆకృతిగల దేహముతో, చరాచరభయత్రస్తంబుగాన్ = చరములును అచరములును అగుప్రాణులు భయము చేత చలించినవి కాఁగా, భీమసంరంభంబు=భయంకరమైన ఆటోపము, శుంభద్గర్వుని=అతిశయించిన గర్వముగల హిరణ్యకశిపునియొక్క, అస్తోక = అల్పముకాని. 332 మోక్షపదంబునన్ = ముక్తిస్థానమునందు, గుణోన్నతులు = గుణాధిక్యతలు, చెప్పవచ్చునే = చెప్పశక్యమగునా. 333 భగవద్భక్తిపరాయణుండు = భగవంతునిభక్తియం దాసక్తుఁడు, అత్యున్నతిన్ = మిక్కిలి ఘనతతో, నిరస్తక్రోధవాక్యంబులన్=తొలఁగఁద్రోయఁబడిన కోపముతోడిమాటలతో - ఈర్ష్యలేని మాటలతో, సర్వంకషము=అంతటవ్యాపించినది. 334 అమవస=అమావాస్య, పౌర్ణమాసి=పున్నమ,

సంతాపనుండును మహానాగుండును మహాభాగుండును కాలనాభుండును నన నార్వురు పుట్టిరి. కశ్యపునిమూఁడవభార్య యైనదను వనుదానికి వైశ్వానరుండును ద్విమూర్ధుండును శంకుండును శంకుశిరుండును అయోముఖుండును కపిలుండును శంబరుండును ఏకచక్రుండును దారకుండును దుర్వాహుండును వృషపర్వుండును పులోముండును విప్రచిత్తియు ననుదానవులు పదుమువ్వురు పుట్టి రందు. 335

తే. దానవజ్యేష్ఠుఁ డైనవైశ్వానరునకు, ననఘ కాలకపౌలోమ లనఁగఁ గన్య
లిరువు రుదయించి మించి రయ్యిందువదన, లను మరీచి వరించె నాలలనలకును.

వ. కాలకేయపౌలోము లన నఱువదివేవురు పుట్టిరి. విప్రచిత్తి యనువానికి సింహిక యందుఁ ద్ర్యంశుండును శల్యుండును నభుండును వాతాపియు నిల్వలుండును నముచియు ఖసృముండును నంధకుండును నరకుండును కాలనాభుండును స్వర్భా నుండును వక్రయోధియు ననం బుట్టిరి మఱియుఁ దార యనుదానికి శుకియును శ్యేనియు భాసియు సుగ్రీవియు శుచియు గృధ్రయు నననార్వురు పుట్టిరి అందు శుకికి శుకంబులు పుట్టె. శ్యేనికి శ్యేనకపోతంబులు పుట్టె. శుచికి జలపక్షులు పుట్టె. సుగ్రీవికి నశ్వోష్ట్రగార్దభంబులు వుట్టె. 337

క. వినత కనూరుఁడు గరుడుఁడు, జనియించిరి వారిలోన సర్పాశనుఁడై
పెనుపొందెను దార్క్ష్యుఁడు మఱి, వనరుహనాభునకు నతఁడు వాహనమయ్యెన్.

క. సురసకుఁ గశ్యపునకు ఖే, చరులు భయంకరులు సర్పసత్తము లుదయిం
చిరి వేవురు బహువదనులు, నురుదీర్ఘశరీరులును విషోల్బణయుతులై. 339

తే. కద్రువకు శేషవాసుకికాలనాభ, శంఖపద్మమహాభోగశంబతక్ష
కాదులై వేవు రుదయించి రందఱును సు, పర్ణునికి వశులైరి దృక్కర్ణపతులు

వ. మఱియుఁ గ్రోధవశ యనుదానికిఁ గ్రోధమూర్తులై దంష్ట్రాసమేతంబు లయిన క్రూరజంతుజాలంబులు వుట్టె. సురభి యనుదానికి గోమహిష్యాదులు వుట్టె ఇల యనువానికి యక్షరాక్షసులు వుట్టిరి. ముని యనుదానికి నప్సరోగణంబులు వుట్టె అరిష్ట యనుదానికి గంధర్వులు వుట్టిరి. 341

తే. ఇట్లు కశ్యపవంశ మనేకశతస, హస్రసంఖ్యలఁ బుత్రపౌత్రాంతరముగ
వెలసె జంగమస్థావరంబులు జగంబు, లందుఁ బరిపూర్ణమై మించె ననఘచరిత. 342

క. శాంతినిధి యైనలక్ష్మీ, కాంతుని రాజసగుణప్రకల్పిత మిది తా
నింతయు స్వారోచిషమ, న్వంతరసర్గంబు మునిగణాధిప వినుమా. 343

---

భవ్య = మేలైన, అర్థిఁ = శ్రద్ధతో. 337 శ్యేనకపోతంబులు = డేగలుపావురములు, 338 సర్పాశనుఁడు = పాములను భక్షించువాఁడు, తార్క్ష్యుడు = గరుత్మంతుఁడు, వనరుహనాభునకున్ = విష్ణువునకు. 339 విషోల్బణయుతులై = విషముయొక్క పొంగుటతో కూడుకొన్నవారై. 340 వేవురు=వేగురు-వేయిమంది, సుపర్ణునికిన్ = గరుత్మంతునికి, దృక్కర్ణపతులు = సర్పరాజులు. 343 శాంతినిధి=ఓర్పునకుస్థానమైనవాఁడు, ప్రకల్పితము = కల్పింపఁబడినది, ఇంతయుఁ=ఈసమస్తమును,

చ. అదితితనూజుఁ డైనయమరాధిపుదారుణవజ్రధారచే
మదమఱి దైత్యదానవసమాజము గూలిన నష్టపుత్రయై
హృదయము విహ్వలింప దితి యిమ్ములఁ గశ్యపుఁ బెక్కుకాలముల్
వదలక సేవచేసెఁ దనవంటిసపత్నులు తన్ను మెచ్చఁగన్. 344

క. అంతట వైవస్వతమన్వంతరమునఁ గశ్యపుఁడు నయంబునఁ బ్రీత
స్వాంతుండై యిచ్చెద నో,కాంతా నీ కేమివరము గావలయునొకో. 345

క. అనవుడు దితి దా నిట్లను, మునివర దేవేంద్రుఁ జంపి ముదమున శచితో
ననిమిషరాజ్యం బేలెడు, తనయుని నిమ్మనిన నతఁడు తగ నిట్లనియెన్. 346

ఆ. ఏను నీకు గర్భ మిచ్చెద నూఱేఁడు, లంగశుద్ధి యైనయట్టివ్రతము
సలుపు మట్లయైన సత్పుత్త్రుఁ డుదయించు, నశుచివైన గర్భ మంతరించు. 347

క. అనిచెప్పి పుత్త్రదానం, బొనరించి మునీంద్రుఁ డరిగె నుత్పలదళలో
చన మగఁడు చెప్పినట్టుల, ఘనముగ శుద్ధాంగి యగుచు గర్భముఁ దాల్చెన్. 348

క. దేవేంద్రుం డంతయు విని, తా వేడుకపుట్ట సవతితల్లికిఁ గడుమి
థ్యావినయంబులు సేయుచు, సేవించుచు నుండెఁ గపటశీలము మెఱయన్. 349

వ. ఇవ్విధంబునఁ దొంబదితొమ్మిదివత్సరంబులు చనిన నొక్కనాఁడు భోజనంబుచేసి పాదప్రక్షాళనంబు సేయ మఱచి వికీర్ణశిరోజయై నిద్రించుచున్నసమయంబున నింద్రుండు గర్భంబు ప్రవేశించి యర్భకుండు రోదనంబు సేయుచుండ నతండు మారోదీ ర్మారోదీ యని పలుకుచు వజ్రంబుచేత శరీరంబు సప్తఖండంబులు చేసి వానిన వెండియు నలువదితొమ్మిది తునియలు చేసి యింద్రుండు వోయె. అట్టి యేకోనపంచాశత్ఖండంబులు రూపంబులు ధరియించి యింద్రునకు సహాయు లైరి. ఇంద్రుండు మారోదీ యనుటంజేసి వారు మరుద్గణంబు లైరి యని చెప్పి మఱియు నిట్లనియె. 350

క. మును వైన్యుఁ డైనపృథునిన్, మునులందఱు గూడి రాజ్యమున కధిపతిఁగా
నొనరించినయది మొదలుగ, వనజాసనుఁ డధిపతుల నవశ్యము నిలుపున్. 351

---

సర్గంబు=సృష్టి. 344 దారుణవజ్రధారచే=భయంకరమైన వజ్రాయుధముయొక్క [illegible], మదమఱి=క్రొవ్వుచెడి, సమాజము=సమూహము, నష్టపుత్ర=నశించినకొడుకులు గలది, విహ్వలింపన్=దుఃఖపరవశముకాఁగా, ఇమ్ములన్ = బాగుగా, సపత్నులు = సవతులు. 345 నయంబునన్=తిన్ననినడవడిచేత, ప్రీతస్వాంతుండు = ప్రీతినొందినమనసుగలవాఁడు. 347 అంగశుద్ధి = అవయవముల పరిశుద్ధతగలది, అంతరించున్ = నశించును. 348 ఉత్పలదళలోచన = నల్లగలువరేకులవంటికన్నులు గలది - దితి. 349 వేడుక = కుతూహలము - ప్రియము, మిథ్యావినయంబులు = అబద్ధపువినయములను, కపటశీలము = వంచనతోఁగూడిన మంచినడవడి. 350 వికీర్ణశిరోజ = విరియఁబోసికొన్నవెండ్రుకలుగలది, మారోదీర్మారోదీః = ఏడువకేడువకుము, సప్తఖండంబులు = ఏడుతునుకలు, ఏకోనపంచాశత్ఖండంబులు = నలువదితొమ్మిదితునియలు. 351 వైన్యుఁడు = వేనునికొడుకు, వన

చంద్రాదులయాధిపత్యవివరణము.

వ. అదియెట్లనిన నక్షత్రగ్రహవిప్రవృక్షలతాగుల్మతపోయజ్ఞంబులకుఁ జంద్రుండును, రాజులకు వైశ్రవణుండును, జలంబులకు వరుణుండును, ఆదిత్యుల కింద్రానుజుం డైనవిష్ణుండును, వసువులకుఁ బావకుండును, ప్రజాపతులకు దక్షుండును, మరుద్గణంబులకు వాసవుండును, మునులకుఁ గపిలుండును, దైత్యదానవులకుఁ బ్రహ్లాదుండును, పితృగణంబులకు యముండును, గజంబులకు నైరావతంబును, పక్షులకు గరుత్మంతుండును, మహానాగంబులకు వాసుకియు, అశ్వంబులకు నుచ్చైశ్శ్రవంబును, గోవులకు వృషభంబును, మృగంబులకు సింహంబును, వనస్పతులకు ప్లక్షంబును, పర్వతంబులకు హిమవంతంబును నధిపతులుగా నొనరించె. ఇట్లు సప్తద్వీపసమేతం బైనపృథివిం పృథివీపతి పాలనంబు సేయుచుండు. 352

ఉ. ఇప్పుడు చెప్పఁగాఁబడినయిందఱు విష్ణునియంశజాతులై
చొప్పడుచున్నవారు మధుసూదనమూర్తి వహింపనుండినన్
జెప్పఁగలేదు పాలనవిశేషములన్ సచరాచరంబులం
దెప్పుడు నొక్కొకొండు గలఁ డేలికధర్మము నిర్వహింపఁగన్. 353

సీ. అయనర్తుపక్షమాసాబ్దకళాక్షణకాష్ఠానిమేషాదికాలములును
బంకజాతభవాండభవ్యసప్తద్వీపబహుసరిత్సాగరపర్వతములు
సురగరుడోరగాసురయక్షగంధర్వనరమునియక్షకిన్నరచయంబు
లధ్యాత్మవిద్యామహాధ్వరజపతపోమంత్రార్థగురుదేవమంత్రములును
తే. మహితభూతవ్రజంబు తన్మాత్ర లింద్రి, యాదిగా నాదిగుణమయభేదములు న
భేదములు బుద్ధికర్మేంద్రియాదివిధులు, విష్ణురూపంబు లెఱుఁగుము విప్రముఖ్య.

వ. మఱియు ఋగ్యజుస్సామాథర్వణవేదంబులును వేదాంతరహస్యంబులును నీతిశాస్త్రంబులును మన్వాదిగ్రథితంబు లైనధర్మశాస్త్రంబులును పురాణాఖ్యానంబులును అనువాకంబులును కావ్యాలాపంబులును సంగీతాదివిద్యలును మూర్తామూర్తంబులును పురుషోత్తమునిమూర్తిభేదంబులై చెల్లునని పలికి మఱియును.

ఉ. ఇమ్ముల వైష్ణవవ్రతము నెంతయు భక్తి నొనర్చి ద్వాదశా
బ్దమ్ములు గార్తికంబున ముదంబునఁ బుష్కరిణీపవిత్రతో
యమ్ములఁ దీర్థమాడినమహాఫలము ల్సమకూఱు నీపురా
ణమ్మును నిచ్చరిత్రము వినంగలపుణ్యులకున్ మునీశ్వరా. 356

వ. అనిన సంతోషపరిపూర్ణహృదయుండై మైత్రేయుం డిట్లనియె. 357

ఉ. భూనుతకీర్తియాదిమనుపుత్రకులందుఁ బ్రసిద్ధు లైనయు
త్తానపదాన్వయక్రమముఁ దప్పక చెప్పితి వాప్రియవ్రతా

జాసనుఁడు = బ్రహ్మ. 352 వైశ్రవణుండు = కుబేరుఁడు, వాసవుండు = ఇంద్రుఁడు వనస్పతులకున్ = వృక్షములకు. 354 పంకజాతభవాండము = బ్రహ్మాండము, సరిత్సాగరపర్వతములు = ఏఱ్లు సముద్రములు కొండలు. 355 గ్రథితములు=కూర్పఁబడినవి-రచితములు. 359 శుంభద్విక్రమ

ఖ్యానము దత్తనూభవులయన్వయసంభవులైనరాజులం
బూని వినంగఁ గోరెదను బూర్వగతి న్వినుపింపు నావుడున్. 358

శా. శుంభద్విక్రమవిక్రమార్క సుజనస్తోత్రైకసంపర్క సం
స్తంభీభూతరిపుప్రతాపమృదువాచాచారసల్లాపదు
గ్ధాంభోరాశిమహాగభీరవిజయవ్యాపారదోస్సార ని
ర్దంభానేకశుభప్రయోజనజగద్రమ్యార్థసంయోజనా. 359

క. సుకవిప్రణీతవాచా, సకలపురాణేతిహాససంశ్రవణసురేం
ద్రకుమారకుమారనిభ, ప్రకటపరాక్రమవివేకభాషాచతురా. 360

స్వాగతము. గర్వితారిలతికాలవిత్రా, పూర్వరాజనిభపూర్వచరిత్రా
నిర్వికారకమనీయసుగాత్రా, గీర్విలాసశుభకీర్తికళత్రా. 361

గద్య. ఇది శ్రీమదమరనామాత్యపుత్త్ర హారితసగోత్ర సుకవిజనవిధేయ వెన్నెలగంటి సూరయనామధేయప్రణీతం బైనయాదిమహాపురాణం బగు బ్రహ్మాండపురాణంబునందలి పరాశరసంహిత యైనశ్రీవిష్ణుపురాణంబునందు ధ్రువచరిత్రంబును బృథూపాఖ్యానంబును బ్రచేతసులకథయును గంధమునితపోమహత్త్వంబును బ్రహ్లాదచరిత్రంబును హరికీర్తనంబును సకలభూతసంభవంబు నన్నది ద్వితీయాశ్వాసము.

---

విక్రమార్క = అప్రతిహతమైన పరాక్రమముచేత విక్రమార్కుఁడా, సుజనస్తోత్రైకసంపర్క=సజ్జనుల యొక్క పొగడ్తయొక్కటిచేతనే కూడుకొన్నవాఁడా, సంస్తంభీభూతరిపుప్రతాప = నిలుపఁబడిపోయిన పైనశత్రువుల ప్రతాపముగలవాఁడా, మృదువాచాచారసల్లాప = మెత్తనిమాటలతోడిసంభాషణముగలవాఁడా, దుగ్ధాంభోరాశి మహాగభీర = పాలసముద్రమువంటి అధికగాంభీర్యగుణముగలవాఁడా, విజయవ్యాపారదోస్సార = గెలుచుటయే వ్యాపారముగాఁ గలభుజబలము గలవాఁడా, నిర్దంభానేకశుభప్రయోజన=దంభములేని పెక్కుశుభప్రయోజనములు గలవాఁడా, జగద్రమ్యార్థసంయోజనా = లోకమునకు ఇంపైన ప్రయోజనములను కూర్చువాఁడా. 360 సుకవి...సంశ్రవణ=సత్కవులచేత కూర్పఁబడినవాక్కులచేనైన యెల్లపురాణములయొక్కయు వినికిగలవాఁడా, సురేంద్ర... పరాక్రమ=ఇంద్రపుత్త్రుఁడైన యర్జునునితోడను కుమారస్వామితోడను సరిపోల్పఁదగిన ప్రసిద్ధమైన పరాక్రమముకలవాఁడా, వివేకభాషాచతురా=వివేకయుక్తములైన మాటలయందు నిపుణుఁడైనవాఁడా. 361 గర్వి...లవిత్రా=గర్వించిన శత్రువులనెడు తీఁగలపట్టుకలకు కొడవలియైనవాఁడా, పూర్వ...చరిత్రా=తొల్లిటిరాజులనుపోలిన పురాతనప్రవర్తనముకలవాఁడా నిర్వి...సుగాత్రా=వికారరహితమై మనోజ్ఞమైన మంచిశరీరముగలవాఁడా, గీర్వి...కళత్రా = సరస్వతియొక్క విలాసమువంటి ధావళ్యము కలిగి వెలుఁగునట్టి కీర్తియను భార్యనుగలవాఁడా.



# శ్రీ విష్ణుపురాణము

## తృతీయాశ్వాసము.

---



చతురకీర్తినయధ
ర్మోచితకారుణ్యలబ్ధగురువైష్ణవధ
ర్మాచరణహృదయసుమనా
రాచప్రతిమానరూప రాఘవభూపా. 1

### ప్రియవ్రతునివంశానువర్ణనము.

వ. సకలవిద్యాధురంధరుం డైనపరాశరుండు మైత్రేయుని కిట్లనియె స్వాయంభువనందనుం డైనప్రియవ్రతుండు కర్దమప్రజాపతిపుత్త్రి కుక్షి యనుదానిం బాణిగ్రహణంబుచేసి దానియందు నాగ్నీధ్రుండును మేధాతిథియును వపుష్మంతుండును జ్యోతిష్మంతుండును ద్యుతిమంతుండును హవ్యుండును సవనుండును మేధుండును నగ్నిబాహుండును బుత్త్రుండును ననుకుమారులం బదుండ్రం గాంచె వారియందు. 2

క. మేధాగ్నిబాహుపుత్త్రులు, సాధుజనస్తుతులు ముగురు జాతిస్మరులై
యీధర నేలఁగ నొల్లక, సాధించిరి దివ్యయోగసంపద లెల్లన్. 3

వ. తక్కినకుమారసప్తకంబునం దాగ్నీధ్రునకు జంబూద్వీపంబును, మేధాతిథికిఁ బ్లక్షద్వీపంబును, వపుష్మంతునకు శాల్మలద్వీపంబును, జ్యోతిష్మంతునకుఁ గుశద్వీపంబును, ద్యుతిమంతునకుఁ గ్రౌంచద్వీపంబును, హవ్యునకు శాకద్వీపంబును, సవనునకుఁ బుష్కరద్వీపంబును విభజించి యిచ్చి రాజ్యాభిషిక్తులం జేసిన. 4

శా. ఆభూపాలశిఖామణుల్ చటులబాహాగర్వదుర్వారశో
భాభూరిప్రతిభాప్రతాపముల సప్తద్వీపసామ్రాజ్యల

---

1 శ్రీ...హృదయ = సపత్ప్రిదమును చతురతకలదియు కీర్తికిని నీతికిని పుణ్యమునకును తగిన దయచేత పొందఁబడిన ఘనమైనవైష్ణవధర్మమును నడపునట్టిదియు నైన మనసుగలవాఁడా, సుమ... రూప=మన్మథునిఁబోలినచక్కఁదనముగలవాఁడా. 2 పాణిగ్రహణంబుచేసి= పెండ్లాడి, పదుండ్రన్ = పదిమందిని, కాంచెన్ = కనియెను. 3 సాధుజనస్తుతులు = సజ్జనులచేత కొనియాడఁబడినవారు, ముగురు = ముగ్గురు, జాతిస్మరులు = పూర్వజన్మస్మృతిగలవారు. 5 భూపాలశిఖామణులు = రాజశ్రేష్ఠులు, చటుల...ప్రతాపములన్ = మిక్కుటమైన భుజగర్వము అణఁపఁగూడని విఖ్యాతి

క్ష్మీభోగంబుల నుల్లసిల్లిరి సునాసీరాదులుం దారు నే
కీభూతంబుగ ధర్మమార్గమున నక్లేశ ప్రభావోన్నతిన్. 5

అందు జంబూద్వీపాధిపతి యైనయాగ్నీధ్రుండు, నాభియు కింపురుషుండును హరివర్షుండును నిలావృతుండును రమ్యుండును హిరణ్వంతుండును కురుండును భద్రాశ్వుండును కేతుమాలుండును ననుకుమారులఁ దొమ్మండ్రం గాంచె. 6

ఇమ్ముగ జంబూద్వీపము, తొమ్మిదిఖండములు చేసి తోడ్తో సుతులం
దొమ్మండ్రను రాజులఁగా, నమ్మనుజేంద్రుండు చేసె ననుపమలీలన్. 7

ఇట్లు రాజ్యంబు విభాగించి యిచ్చి యాగ్నీధ్రుండు సాలగ్రామతీర్థంబునకుఁ దపంబు సేయం జనియె. ఆనవఖండంబులు నారాజన్యులపేర వర్షసంజ్ఞలం బ్రసిద్ధంబు లయ్యె నందు. 8

శీతగిరిదక్షిణం బగు, భూతలపతినాభి యతనిపుత్త్రుఁడు వృషభుం
డాతని కొగిఁ బుత్త్రశతం, బాతతయశు లుద్భవించి రందఱియందున్. 9

భరతుం డగ్రజుఁడై సమస్తధరణీభాగంబుఁ బాలించి దు
ష్టరిపువ్రాతము నుక్కడంచి మఖముల్ సమ్యగ్విధిం జేసి ని
ర్జరలోకేశ్వరుతోడి వాఁ డగుచు శశ్వత్కీర్తి యార్జించుచుం
బరఁగెం దొంటిప్రియవ్రతాదులగతిన్ భవ్యప్రతాపోన్నతిన్. 10

వానిపేర నాభివర్షంబు భరతఖండం బనంబరఁగె నట్టిభరతునకు నిజరాజ్యవైభవం బొసంగి వృషభుండు పులహాశ్రమంబునకుఁ దపంబు చేయంజని. 11

వానప్రస్థవిధిన్ శతాబ్దములు దుర్వారస్థితిన్ నిల్చి క
ర్మానుష్ఠానము లన్ని యున్ విడిచి దివ్యజ్ఞానసంపన్నతా
మానప్రౌఢియు నగ్నరూపమును వీర్యోద్రేకముం గల్గి ని
ర్దైన్యుండై యవధూతమార్గమున ధాత్రిన్ సంచరించెన్ ధృతిన్. 12

భరతుండు పెక్కుకాలము, ధరణీతల మేలి చాలఁ దనిసి కుమారున్
గరుణార్కతేజు సుమతిని, జిరమతి రాజ్యాభిషిక్తుఁ జేసి కడంకన్. 13

సాలగ్రామమునకుఁ జని, శ్రీలలనాధీశుఁ గొలిచి చిన్మయసుఖముల్

---

సద్ధికౌశల్యము ప్రతాపము వీనిచేత, ఉల్లసిల్లిరి= వెలసిరి. సునాసీరాదులున్=ఇంద్రుఁడు మొదలగువారు, ఏకీభూతంబుగన్ = ఒక్కటిగా, అక్లేశ = పీడారహితమైన. 9 శీతగిరి=హిమవత్పర్వతము, = క్రమముగా, ఆతతయశులు=విశేషకీర్తిగలవారు. 10 దుష్టరిపువ్రాతమున్ = దుష్టులైనశత్రుసమూహమును, ఉక్కడంచి = చంపి, సమ్యగ్విధిన్=క్రమమైనవిధమున, నిర్జర...వాఁడు=ఇంద్రసమానుఁడు, శశ్వత్కీర్తి = అధికకీర్తిని, పరఁగెన్=ప్రఖ్యాతికెక్కెను, భవ్య = మేలైన. 12 శతాబ్దములు=నూఱేండ్లు, దుర్వారస్థితిన్ = అడఁగఁగూడనినియునికితో, దివ్య...ప్రౌఢియున్ = తత్త్వజ్ఞానముయొక్కకలిమిచేత కొఱఁతలేని నిపుణత్వముతో, నగ్నరూపము = దిగంబరాకారము, వీర్యోద్రేకము = వీర్యాతిశయము - ఊర్ధ్వరేతస్త్వము, నిర్దైన్యుఁడు = దైన్యములేనివాఁడు, ధృతిన్ = ధైర్యముతో. 14 చిన్మయసుఖములు = జ్ఞానమయమైనసౌఖ్యములను, శీలించి = స్వభావముగా

శీలించియు జన్మాంతరకాలంబున విప్రుఁ డయ్యెఁ గర్మవశమునన్. 14

క. ఆనరపతిచరితం బెంతైనఁ గలదు దానిఁ బిదప నంతయుఁ దెలియం
గా నీకు నేర్పరించెదఁ, గాని యిపుడు చెప్పుచున్నకథ విను తెలియన్. 15

వ. అట్టి భరతనందనుం డైనసుమతికి నింద్రద్యుమ్నుం డను పుట్టె. వానికిఁ బరమేష్ఠియు వానికిఁ బ్రతిహారుండును వానికిం బ్రతిహర్తయు వానికి నుత్పన్నుండును వానికి భవుండును వానికి గీతుండును వానికి బ్రస్తావుండును వానికిం బృథుండును వానికి నక్తుండును వానికి గయుండును వానికి నరుండును వానికి విరోహణుండును వానికి ధీమంతుండును బుట్టిరి అట్టి రాజన్యులవంశసంభవు లయినమానవులు స్వాయంభువమన్వంతరంబున డెబ్బదిమహాయుగంబుల నేకవంశపరంపరులై ప్రవర్తిల్లి రనిన మైత్రేయుం డిట్లనియె. 16

క. భువనైకవంద్య స్వాయంభువమన్వంతరనృపాలముఖ్యుల నెల్లన్
వివరించి చెప్పితివి నా, కవియెల్లం దెలిసె నింక నడిగెద మిమ్మున్. 17

మ. ధరణీమండలవిస్తృతంబు మఱి సప్తద్వీపరూపంబులన్
సరిదంభోనిధివర్షశైలవనవిస్తారంబులన్ దైత్యని
ర్జరగంధర్వపురక్రమంబుల సమస్తంబున్ వినంగోరెదన్
సరవిం జెప్పుఁడటన్న శిష్యునకు నాచార్యుండు దా నిట్లనున్. 18

క. నీయడిగినప్రశ్నలు మైత్రేయ శతాబ్దములనైనఁ దీఱదు చెప్పం
దోయజభవునకు నైనను, జాయలుగా వినుము కథల సంక్షేపంబుల్. 19

వ. అది యెట్లనిన జంబూప్లక్షశాల్మలకుశక్రౌంచశాకపుష్కరంబు లనెడు సప్తద్వీపంబులం బరివేష్టించి లవణేక్షుసురాసర్పిదధిదుగ్ధజలసముద్రంబు లేడు నొకటి కొకటి ద్విగుణవిస్తారంబులై యుండు నీసకలద్వీపమధ్యంబున జంబూద్వీపంబు విస్తరిల్లు. తదీయమధ్యంబునఁ గనకరత్నమయం బయినమేరుపర్వతం బుండు. 20

చ. అనుపమలీల నొప్పు కనకాద్రికి ముప్పదిరెండువేలయో
జనములు మీఁదివిస్తరము సన్నుతమై పదియాఱువేల యో
జనములు లోవిశాలము నిజంబుగ నంతియపాఁతు నున్నతం
బెనుబదినాల్గువేలు గణియింపఁగ యోజనము ల్మునీశ్వరా. 21

క. భూపద్మమునకు నడుమై, యాపర్వత మొప్పుఁ గర్ణికాకారమునం

---

గ్రహించి. 15 ఏర్పరించెదన్ = విశదపఱిచెదను. 16 పరంపరులై = పరంపరగలవారై, ప్రవర్తిల్లిరి = ఉండిరి. 18 విస్తృతంబు = విరివి, సరిత్ = నదులయొక్కయు, అంభోనిధి = సముద్రములయొక్కయు, నిర్జర = దేవతలయొక్కయు, సరవిన్ = క్రమముగా. 19 తీఱదు = ముగియదు, చాయలుగాన్ = జాడగా - కొంచెకొంచెముగా. 20 పరివేష్టించి = చుట్టుకొని, ద్విగుణవిస్తారంబులు = రెండంతలవిరివిగలవి. 21 పాఁతు = భూమిలోపలిక్రుంగుడు, ఉన్నతము = ఎత్తు. 22 భూపద్మమునకున్ = పద్మాకారమైనభూమికి, కర్ణికాకారమునన్ = దుద్దువంటి యాకృతితో,

జూపట్టు యక్షకిన్నర,తాపసగంధర్వదేవతాసేవ్యంబై. 22

ఆ. ఎనయ శీతగిరియు హేమకూటంబును, నిషధపర్వతంబు నింగి మోచి
తనరు మేరునగము దక్షిణభాగంబు,నందుఁ బూర్వపశ్చిమాయతముల. 23

క. నీలాచలమును సితకుత్కీలంబును శృంగ మనఁగ క్షితిధరము నిలిం
పాలయనగోత్తరంబునఁ, గ్రాలుం బూర్వాపరములఁ గడుదీర్ఘములై. 24

వ. ఒక్కొక్కపర్వతంబు రెండువేలయోజనంబుల విస్తారోన్నతంబులు గలిగియుండు దక్షిణోత్తరాయతంబులైనమర్యాదాపర్వతంబులు తూరుపున దేవకూటంబును బడమట జఠరపర్వతంబు నుండు వానినడుమఁ గనకాద్రిచతుర్భాగంబుల వర్షంబులు విలసిల్లు నెట్లనిన మేరుపర్వతంబునకు దక్షిణంబున భారతకింపురుషహరివర్షంబులు మూఁడును, ఉత్తరంబున రమ్యకహిరణ్మయకురువర్షంబులు మూఁడును, తూర్పున భద్రాశ్వవర్షంబును, పడమటఁ గేతుమాలావర్షంబును, వానినడుమ మేరుచతుర్భాగంబులఁ దొమ్మిదివేలయోజనంబుల విశాలంబై యిలావృతవర్షంబును మెఱయు మఱియును. 25

తే. మందరముతూర్పునను గంధమాదనంబు
దక్షిణంబున విపులభూధరము పశ్చి
మమునఁ బార్శ్వపర్వత ముత్తరమున మెఱయు
హేమధాత్రీధరంబున కివ్విధమున. 26

తే. ఆనగోన్నతశృంగంబులందు మెఱయు, బోధిజంబూకదంబన్యగ్రోధతరువు
లేచి వేయింటిమీఁద నూఱేసియోజ,నములుపొడవున ఘనకేతనములుగాఁగ. 27

క. జంబూవృక్షము పేరను, జంబూద్వీపం బనంగ జగములను బ్రసి
ద్ధంబు వహించె నద్వృక్షంబుఫలంబులు మహాగజప్రతిమంబుల్. 28

తే. ఆఫలంబులు హేమకూటాచలంబు, సానుభూములఁ దఱుచుగాఁ జదియఁబడి ర
సంబు ప్రవహించి జాంబూనదం బనంగ, మేరుశైలంబుచుట్టును మెఱసి యుండు.

ఉ. ఆరసపానులై గరిమ నచ్చటఁ ద్రిమ్మరుచున్న వారికి
న్నేరవు రోగము ల్చెమట చెందదు మేనులఁ బూతిగంధము
న్ఘోరజరాదిదోషములుఁ గూడవు ఖేచరవృత్తి గల్గి యొ
ప్పారుదు రింద్రియోల్బణ మొకప్పుడు పుట్టదు తాపసోత్తమా. 30

చూపట్టుఁ = కనఁబడును, సేవ్యంబై = సేవింపఁదగినదై. 23 నింగిమోచి = ఆకాశమునంటి. 24 సితకుత్కీలంబు = తెల్లకొండయు, నిలింపాలయనగము = మేరుపర్వతము, క్రాలుఁ = ప్రకాశించును. 25 మర్యాదాపర్వతంబులు = ఎల్లలుగానుండు కొండలు, చతుర్భాగంబులఁ = నాలుగుతట్టులగు. 27 బోధిజంబూకదంబన్యగ్రోధతరువులు = రావి నేరేడు కడిమి మఱ్ఱిమ్రానులు. 28. ప్రతిమములు = సమానములు. 29 సానుభూములఁ = చఱులనేలలయందు, చదియఁబడి = నలఁగునట్లుగాఁ బడి. 30 పూతిగంధము = గదురుకంపు, ఘోరజరాదిదోషములు = భయంకరమైనముసలితనము మొదలైనలోపములు, ఖేచరవృత్తి = ఆకాశమునందు తిరుగుడు వర్తనము,

ఆ. ఆరసంబు సోఁకి నచ్చటిమన్నెల్లఁ, గాంచనంబ యట్టికారణమున
జగతిఁ బసిఁడిపేరు జాంబూనదం బన, సుప్రసిద్ధమయ్యె విప్రముఖ్య. 31

వ. మఱియుఁ జైత్రరథగంధమాదనవైభ్రాజితనందనంబు లనునుపవనంబులు నరుణాధరమహాపద్మనీలోదకమానసంబు లనుసరోవరంబులును గనకశైలంబునకుఁ బూర్వంబు మొదలుగా నాలుగుదిక్కులను నిలింపులకు నిత్యోపభోగంబులై యుండు నమ్మేరుకర్ణికకుఁ గేసరంబులై పూర్వభాగంబున సితాంభముద్వత్కురరీమాల్యవద్వైకంకప్రముఖంబు లైనపర్వతంబులును దక్షిణంబునఁ ద్రికూటశిశిరపతంగరుచకనిషధాదు లైనశైలంబులును బశ్చిమంబున శిఖివాసోవైడూర్యకపిలగంధమాదనజారుధులు మొదలైననగంబులును నుత్తరంబున శంఖకూటవృషభహంసనాగకాలాంజనంబులు లోనుగాఁ గలకొండ లనేకంబులు నుండు. 32

చ. కనకనగంబుమీఁదఁ ద్రిజగన్నుతమై పదునాల్గువేలయో
జనములసంఖ్య నాయతవిశాలములై కనుపట్టుచుండు న
య్యనిమిషరాజధాని సముదంచితకాంచనరత్నగోపురా
ద్యనుపమరమ్యహర్మ్యవివిధావరణప్రకరప్రసిద్ధమై. 33

వ. మఱియు విష్ణుపాదవినిష్క్రాంతయు శశాంకమండలప్లావయు నైనయాకాశగంగ చతుర్భేదంబై సీతయు నలకనందయుఁ జక్షువును భద్రయు నన నమరావతి నాల్గుదిక్కులం బ్రవహించి. 34

తే. ఖ్యాతి భద్రాశ్వభారతకేతుమాల, కురుమహావర్షముల మహీసరసిజంబు
నందు తేకులమర్యాద లైనగిరుల, బాహ్యభూములయందుఁ జూపట్టుచుండు. 35

వ. ఇత్తెఱంగున నాల్గుదెసల సీతాదివాహినీచతుష్టయంబు ప్రత్యంతపర్వతంబుల నడుమఁ బ్రవహించి యతిమనోహరంబై యుండు మఱియు సిద్ధచారణసేవితంబులగుపురంబులు గాననంబు లనేకంబులు గల వవి లక్ష్మీవిష్ణుసూర్యాదిదేవతలకు నివాసంబులై యుండు గంధర్వయక్షరాక్షసాదులు నిరంతరవినోదంబులం దగిలి

---

ఇంద్రియోల్బణము = రేతస్సుయొక్క ఉబుకుట. 31 కాంచనంబ = బంగారే, పసిఁడి = బంగారు. 32 నిత్యోపభోగంబులు = ఎల్లప్పుడు పొందుచున్నభోగములు గలవి. 33 అనిమిషరాజధాని = దేవతలపట్టణము, సముదంచిత... ప్రసిద్ధమై = మిక్కిలి యొప్పిదమైన బంగారుచే రత్నములు పొదిగి కట్టఁబడిన గోపురములు మొదలైనవానిచేతను ఈడులేని మనోజ్ఞములైన మేడలు మొదలైనవానిచేతను నానావిధములైన ఆవరణములచేతను ప్రసిద్ధినొందినదై. 34 విష్ణుపాదవినిష్క్రాంత = విష్ణువుయొక్క అడుగులనుండి వెడలినది, శశాంకమండలప్లావ = చంద్రమండలమును తడుపునది, చతుర్భేదంబు = నాలుగుభేదములుగలది. 35 మహీసరసిజంబునందుఁ = భూమియనెడు కమలమునందు, తేకులమర్యాదలు = తేకులయొక్క క్రమముగలవి, బాహ్యభూములయందుఁ = బయటినేలలయందు. 36 వాహినీచతుష్టయంబు = నాలుగునదులు, నిరంతరవినోదంబులఁ = ఎడతెగని వేడుకలయందు, తగిలి = ఆసక్తులై, భౌమస్వర్గంబులు = భూసంబంధియైన స్వర్గములు - స్వర్గము

క్రీడించుచుండుదురు భౌమస్వర్గంబులైన కింపురుషాదివర్షంబులయందును. 36

ఆ. అధికపుణ్యమూర్తులకు విష్ణుభక్తుల, కందు నుండు టెల్ల నరిదిగాదు
పాపకర్ములకును బదివేలజన్మంబు, లందునైన నుండ నలవిగాదు. 37

వ. వాసుదేవుండు భద్రాశ్వవర్షంబున హయగ్రీవరూపంబున, భారతవర్షంబునఁ గూర్మరూపంబునఁ, గేతుమాలావర్షంబున వరాహరూపంబునఁ, గురువర్షంబున మత్స్యరూపంబునఁ, దక్కినవర్షంబుల నానారూపధరుండై యుండు నట్టికింపురుషాదివర్షంబు లెనిమిదింట నుండువారికి శోకంబును నాయాసంబును నుద్వేగంబును దీపనంబును లేక నిరాతంకమానసు లగుచుఁ బదియును బండ్రెండువేల వత్సరంబులు పరమాయువులై సుఖయింతురు అద్దేశంబుల భౌమోదకంబులే కాని వానలు లేవు భారతవర్షంబునఁ బ్రత్యేకంబ కులపర్వతంబులును మహానదులు ననేకంబులు గలవు. 38

సీ. మునినాథ హిమశైలమువనుండి దక్షిణలవణాంబునిధిదాఁక నవసహస్ర
యోజనవిస్తీర్ణయుక్తమై భారతవర్షంబు మెఱయు నావర్ష మెల్లఁ
గర్మభూమియ పుణ్యఘనులకెల్లను స్వర్గమోక్షంబు లెల్లఁ బ్రత్యక్షమతుల
దోషచిత్తులకు నధోలోకమార్గముల్ ప్రాపించు మునులు సుపర్వవరులు
తే. నిందె వర్తింపఁ గోరుదు రెల్లనాఁడు
జపతపోదానయజ్ఞాదిసకలకర్మ
ములు యథాశక్తిఁ గావించి వలసినట్టి
లోకముల నుండుదురు బుధశ్లోక వినుము. 39

తే. మలయమును మహేంద్రమును శుక్తిమంతవింధ్య
పారియాత్రంబులును ఋక్షపర్వతంబు
సహ్యగిరియును నాఁగఁ బ్రశస్తి నెగడె
భరతఖండంబునను గులపర్వతములు. 40

వ. అందు శతద్రూచంద్రభాగాదులు మహేంద్రంబునను, వేదస్మృత్యాదులు పారియాత్రమునను, నర్మదాసురసాదులు వింధ్యంబునను, తాపీపయోష్ణీనిర్వింధ్యాదులు ఋక్షంబునను, గోదావరీభీమరథీకృష్ణవేణ్యాదులు సహ్యంబునను, తామ్రపర్ణీకృతమాలాదులు మలయంబునను, త్రిసామాఋషికుల్యాదులు మహేంద్రం

వలె భోగాస్పదములైన ప్రదేశములు. 37 అరిది = దుర్లభము, అలవి = శక్యము. 38 ఉద్వేగము = మనోవ్యథ - వగపు, దీపనంబు = తీఱనియాఁకలి, నిరాతంకమానసులు = భయములేని మనసుగలవారు, భౌమోదకంబులు = భూమియందలియూటనీళ్లు. 39 కర్మభూమియ = వైదిక కర్మములను నడపుటయే ప్రధానకృత్యముగాఁగలభూమియే, పుణ్యఘనులకున్ = పుణ్యకర్మలచేత అధికులైనవారికి, అతులదోషచిత్తులకున్ = సరిపోల్పరాని పాపబుద్ధి గలవారికి, సుపర్వవరులు = దేవతాశ్రేష్ఠులు, ఎల్లనాడున్ = ఎల్లప్పుడును, యథాశక్తిన్ = శక్తికొలఁదిని, బుధశ్లోక = పెద్దలచేత

బునను, ఋషికుల్యాకుమారాదులు శుక్తిమంతంబునను నుద్భవించె. మఱియు
ననేకపుణ్యానదులు శతసహస్రంబులు గలవు. 41

క. ఇల నీభారతవర్షము, నలువున వేయేసియోజనంబులవిరివిన్
వెలయుచుఁ దొమ్మిదిదీవులు, గలయవి జలరాశిలోనఁ గడునధికములై. 42

క. ఇట్టిమహాద్వీపంబులు, నిట్టిమహానదులు గిరులు నిట్టిమహిమలుం
బుట్టవు తక్కినభూములు, గట్టిగ నీవర్షభూమిఁ గల్గినరీతిన్. 43

క. చొక్కపుభారతవర్షం, బొక్కటి యగుఁ గర్మభూమి యుర్వీస్థలిలోఁ
దక్కినవి భోగభూములు, నిక్కంబుగఁ దెలిసికొనుము నీవని మఱియున్. 44

క. ధరలో జంబూద్వీపము, నరసన్నుత లక్షయోజనంబులు దానిం
దిరిగి లవణాబ్ధి యెంతయు, విరివిం గనుపట్టు లోకవిశ్రుతమహిమన్. 45

క. ఆక్షారోదధి కవ్వలఁ, బ్లక్షద్వీపంబు వలయభంగిఁ దనర్చున్
లక్షింపఁ దద్విశాలము, లక్షద్వయయోజనంబులం గనుపట్టున్. 46

క. మోదంబున మేధాతిథి, యాదీవికి రాజు వానియాత్మజులై బా
హాదర్పోజ్జ్వలు లేడుగు, రాదిత్యసమానతేజులై పుట్టుటయున్. 47

ఆ. ఆకుమారకులకు నాద్వీప మేడుభాగములు చేసి రాజ్యగౌరవములఁ
బెట్టుటయును వారిపేర వర్షంబులై, జగములందుఁ గడుఁ బ్రశస్తి నొందె. 48

వ. తదీయనామధేయంబులు వినుము శాంతహయశిశిరసుఖోదయనందశివక్షేమక
ధ్రువవర్షంబు లయ్యె. అవ్వర్షంబులనడుమం బొలిమేరలై గోమేధచంద్రనారద
దుందుభిసోమకసుమనోవైభ్రాజంబు లనుసప్తవర్షాచలంబులు మెఱయు. ఆపర్వ
తంబు నుద్భవిల్లి యనుతప్తయు శిఖియు విపాపయుఁ ద్రిదివయుఁ గ్లమయు
నమృతయు సుకృతయు ననుమహానదులు సముద్రగామినులై ప్రవహించు
చుండు మఱియు క్షుద్రనదులు పర్వతంబులు ననేకశతసహస్రంబులు గలవు. 49

క. ఆవర్షంబులమనుజులు, దేవతలుం దారు గలసి తేజోధికులై
జీవింతురు వారికి రోగావస్థలు లేవు ధర్మ మధికం బగుటన్. 50

సీ. ఆదీవిఁ బ్రవహించినట్టియేఱులనీరు ద్రావినమానవతతులు నిరత
సంతోషహృదయులై సార్వకాలంబును దుఃఖమెఱుంగరు దుర్వివేక
మణుమాత్రమును లేక యైదువేలేఁడులు పరమాయు వైనట్టిబ్రదుకుఁ గలిగి
తేజరిల్లుదు రందుఁ ద్రేతాయుగమునకు సమకాలధర్మముల్ జరిగి వచ్చుఁ

---

పొగడఁబడినవాఁడా. 42 జలరాశిలోనన్ = సముద్రమునకంటె. 44 చొక్కపు = స్వచ్ఛమైన, ఉర్వీస్థలిలోన్ = భూప్రదేశమునందు. 46 క్షారోదధికిన్ = ఉప్పుసముద్రమునకు, వలయభంగిన్ = కడియమువలె. 49 పొలిమేరలు = ఎల్లలు, సముద్రగామినులు = సముద్రమును గూర్చిపోవునవి (లేక) సముద్రమును పొందునవి. 51 మానవతతులు=మనుష్యసమూహములు నిరత... హృదయులై=ఎల్లప్పుడు సంతుష్టి నొందినమనసుగలవారై, దుర్వివేకము = చెడ్డతెలివి-మూర్ఖతయనుట,

తే. గృతయుగాద్యవస్థలు లేవుసతతమును మ, నోహరములైనరాజధానులు వనములు
నంబుజాకరములు నెన్నియైనఁ గలవు, ఇందురూపంబుతో నుండు నందు శౌరి.

క. అందుల నార్యకకురరక, విందకభావినులు నాఁగ విప్రమహీభృ
ద్బృందంబులు విట్శూద్రులు, నందంబుగఁ బిలువఁబడుదు రాదేశమునన్. 52

క. జంబూవృక్షముతోడ స, మంబగునున్నతము గల్గి మహనీయప్ల
క్షం బొప్పుం బ్లక్షద్వీ, పం బన నాతరువుపేరఁ బరఁగు మునీంద్రా. 53

క. ప్లక్షద్వీపము నవ్వల, నక్షీణగభీరతామహత్వంబులతో
నిక్షురసవార్ధి మెఱయును, లక్షద్వయయోజనంబులవిశాలంబై. 54

సీ. ఆయిక్షురసవార్ధి యవ్వల శాల్మలద్వీపము మెఱయు నాదీవివిరివి
నాల్గులక్షలయోజనంబులు దానివపుష్మంతుఁ డేలునాభూమివిభుని
సుతులైరి శ్వేతహరితులు జీమూతరోహితులు సుప్రభుఁడు వైద్యుతియు మాన
సుఁడు నాఁగ నేడ్వు రాక్షోణీశ్వరులపేర వర్షంబులై వారివారిదేశ

తే. ములు మెఱయు వానినడుమ గుముదము నున్న
మును వలాహకమును ద్రోణమును మహిషముఁ
గంకమును గకుద్వన్తనగంబు నాఁగ
సప్తకులపర్వతములు ప్రశస్తి నొందు. 55

క. స్వయనాశలయ్యు యోనిజ, యు యమాయామియును దృష్ణయునుజంద్రయు శు
క్రయు నిర్వీర్యయును విమో, హియు నన నాగిరులఁ బుట్టె నీనదు లేడున్. 56

తే. బ్రాహ్మణాదులు కపిలచారణకపీత, కృష్ణనామంబులు వహించి కీర్తిఁ బరఁగు
చుండుదురు వాయురూపియైపుండరీక, నయనుఁడాదీవియందు నున్నతి వహించు.

క. విను మేకాదశశతయో, జనములయున్నతము గలిగి శాల్మలతరు వొ
ప్పును దానిపేర లోకము, లను వినుతికి నెక్కె శాల్మలద్వీపమనన్. 58

తే శాల్మలద్వీపమంతవిస్తరముతో సు, రాంబునిధి చుట్టుకొనియుండు నాపయోధి
యవ్వలను దాని కినుమడి యైనవిరివిఁ, దేజరిల్లుచు నాకుశద్వీప మమరు. 59

క. ఖ్యాతిగ తద్ద్వీపము మును, జ్యోతిష్మంతుండు తనదుసుతు లేడ్వరకుం
బ్రీతిమెయిఁ బంచిపెట్టిన, నాతనయులపేరఁ బరఁగు నావర్షంబుల్. 60

ఆ. వేణుమాల లంబనోద్భిదస్వైరథ, కపిలవిధృతిభానుకరము లనఁగ

---

అంబుజాకరములు=సరస్సులు, ఇందురూపంబుతోన్=చంద్రాకృతితో. 52 మహీభృద్బృందంబులున్=రాజసమూహములు, విట్శూద్రులున్=వైశ్యులును శూద్రులును, 54 ప్లక్షము=జువ్విమాను, అక్షీణ... మహత్వంబులతోన్=తగ్గనిలోఁతుతోడను గొప్పతనముతోను, ఇక్షురసవార్ధి=చెఱకు పాలసముద్రము. 56 స్వయనాశలు = భ్రమతను పోఁగొట్టునవి. 57 పుండరీకనయనుఁడు = విష్ణువు, 58 శాల్మలతరువు = బూరుగుమాను. 59 సురాంబునిధి=కల్లుసముద్రము, పయోధి=సముద్రము, ఇనుమడి=రెండంతలు, వర్షసప్తకంబు = ఏడువర్షములు, అనఘచరిత = పాపరహితమైన నడవడిగలవాఁడా.

వర్ష సప్తకంబు వర్ణింప నాదీవి, యందు వినుతికెక్కె ననఘచరిత. 61

క. ఆదేశంబులకును మ, ర్యాదాగిరు లగుచు విద్రుమాగద్యుతిమా
నాదిత్యపుష్పవంతకు, శాదహారానందమందరాద్రులు మెఱయున్. 62

క. శివయును విధూతపాపయుఁ, బవిత్రయును సుమతియునుం బాపహరయు హై
మవతియును విద్యుదంభయు, నవతీర్ణములయ్యె నేఱు లాశైలములన్. 63

తే. దైత్యదానవదేవగంధర్వయక్ష, సిద్ధసాధ్యాదులును దాము చెలిమిచేసి
మనుచు నుండుదు రాదీవిమనుజులెల్ల, వర్ణసంకరములు గానినిర్ణయముల. 64

తే. బ్రాహ్మణాదివర్ణంబులు పరఁగు దమిన, శుష్మిణస్నేహమందేహసురుచిరాభి
ధానముల బ్రహ్మరూపంబు దాల్చి శౌరి, యజ్ఞములఁ బూజలందుచు నతిశయిల్లు.

క. అంబరతలమంది కుశ, స్తంబం బాదీవి నున్నతం బైననిమి
త్తంబునఁ గాదె కుశద్వీ, పం బన లోకంబులందుఁ బ్రస్తుతికెక్కెన్. 66

తే. ఆకుశద్వీపమునకు నీడైనవిరివి, యమరి ఘృతవార్ధి పరివృతంబై తనర్చు
నాపయోనిధికినుమడి యగువిశాల, మై చెలఁగెఁ గ్రౌంచమన్ద్వీపమనఘచరిత.

సీ. ద్యుతిమంతునకుఁ గూర్మిసుతులై మనోనుగుండును సివరుండు నుష్ణుండు నంధ
కారుండు మునియును గౌశలుండును దుందుభియు నాఁగ నేడ్గురు భీమబలులు
జనియించి యాదీవి సప్తవర్షంబులు గావించి యేలి రాఖండములకుఁ
బొలిమేరలై క్రౌంచమును వామనము నంధకారంబు హాయము రక్తము దివంబుఁ

తే. బుండరీకంబు నన నుండుఁ గొండలందు
ఖ్యాతియును గుముద్వతియును గౌరియును మ
నోజవయు సంధ్యయును రాత్రియును బ్రపుండ
రీకయును నన నదు లేడు జోకఁ బరఁగు 68

ఉ. భూమిసురాదివర్ణములు పుష్కరపుష్కలధన్యతిష్యులన్
నామములన్ మునీశ్వర వినంబడు నచ్చట రుద్రరూపియై
శ్రీమహిళాకళత్రుఁడు వసించు మఖంబులఁ బూజలందుచున్
గామితసంపదల్ తపముఁ గైకొని సేయక గల్గ వేరికిన్. 69

క. మానుగఁ గ్రౌంచద్వీపను, మానవిశాలంబు గలిగి మహనీయగభీ
రానూనదధిసముద్రము, తానాద్వీపంబుచుట్టుఁ దనరుచు నుండున్. 70

క. లోకస్తుత యాజలనిధి, యాకడఁ దద్విగుణగుణిత మైనవిశాల

---

63 అవతీర్ణములు = దిగినవి - ప్రవహించినవి. 66 అంబరతలము=ఆకాశప్రదేశము, కుశస్తంబంబు= దర్భగంట. 67 ఈడు = సమానము, ఘృతవార్ధిపరివృతంబు = నేతిసముద్రముచేత చుట్టంబడినది, పయోనిధికిన్ = సముద్రమునకు, ఇనుమడి = ఇబ్బడి-రెండంతలు. 68 జోకన్ = ఒప్పిదముగా. 69 శ్రీమహిళాకళత్రుఁడు = లక్ష్మీపతియైన శ్రీహరి, కామితసంపదలు = కోరినకలుములు. 70 మానుగన్ = ఒప్పిదముగా - సరిగాననుట, మహ...సముద్రము=గొప్పదియై లోఁతుచేత తక్కువగాని పెరుగుసముద్రము, తనరుచున్ = అతిశయించును. 71 ఆకడన్ = ఆవల, తద్విగుణ...శ్రీకము

శ్రీకముగఁ జుట్టి యుండును, శాకద్వీపంబు భవ్యసంరక్షితమై. 71

మ. అతులప్రాభవవైభవానుభవరాజ్యశ్రీలచే ధన్యుఁడై
యతఁడా ద్వీపము నేడుభాగములుగా నర్థి న్విభాగించి యా
త్మతనూసంభవసప్తకంబునకు నిత్యప్రీతితో నిచ్చె నా
క్షితిపవ్రాతముపేర వర్షములుగాఁ జెల్వొందె నాదేశముల్. 72

వ. వానినామంబులు వినుము జలద కుమార సుకుమార మరీచక కుసుమోద సుమోద మహాద్రుమంబు లనంబరఁగు నద్దేశంబులకు మర్యాదాపర్వతంబులై యుదయజలధరరైవతాంభోంబికేయరమ్యకేసరీపర్వతంబులు మెఱయు. తదీయోద్భవంబులై కుమారియును సుకుమారియును నలినియును వేణుకియును ఇక్షువును ధేనుకయును గభస్తియు ననుమహానదులు ప్రవహించియుండు. 73

క. ఆయాయుదీవులం గల, యాయావర్షంబులందు నతులమహిమలం
బాయనియేఱులు శైలని, కాయంబులు పెక్కువేలు గలవు మునీంద్రా 74

సీ. అట్టిశాకద్వీపమందుఁ జాతుర్వర్ణసముదయంబులు పుణ్యజనపదములుఁ
బుణ్యదేశములు నగణ్యంబు లదియు భౌమస్వర్గ మచ్చటిమనుజులందుఁ
ధర్మంబెకాని పాతక మించుకయు లేదు మర్యాద లుడిగిన మనికి యొల్ల
రన్యోన్యవైరంబు లాత్మల భావింపఁ గడఁగరు హీనాధికములు లేవు
తే. మంగమాగధమానసమందగు లన, బ్రాహ్మణాదివర్ణంబు లుపన్యసింపఁ
బడుదివాకరమూర్తియై పద్మనాభుఁ, డచట యజ్ఞంబులను బూజ లందుచుండు.

క. శాకమహీజముపేరను, శాకద్వీపంబు నాఁగ సన్నుతికెక్కెన్
లోకస్తుత యాదీవికి, నాకడ దుగ్ధాబ్ధి మెఱయు నంతియ విరివిన్. 76

ఆ. ఆపయఃపయోధి యవ్వలదానికి, ద్విగుణగణిత మైనవిస్తరమున
నమరియుండుఁ బుష్కరాఖ్యమహాద్వీప, మచటిమహిమ చెప్ప నలవిగాదు. 77

సీ. ఆపుష్కరద్వీప మర్థితోఁ బాలించె సవనుఁ డారాజన్యచంద్రునకును
వీరయుక్తుఁడు మహావీరధాతకుఁ డన నిరువురు పుట్టి రయ్యిరువురకును
సమభాగములుగ రాజ్యముఁ బంచిపెట్టిన దానికి మానసోత్తరనగంబు
మర్యాద యగును నమ్మధ్యభాగంబునఁ బరివేషమునుబోలెఁ బరఁగియుండు

గన్ = దానికి రెండంతలుగా గుణింపఁబడినదై విరివి కలిమిగలదిగా-దానికి రెండంతలవిరివిగలదిగా. 72 అతుల...శ్రీలచేన్ = సరిపోల్పరాని ప్రభుత్వముయొక్క ఐశ్వర్యమును అనుభవింపఁగలరాజ్యసంపద చేత, ఆత్మ...సప్తకంబునకున్ = కొడుకు లేడుగురకును. 74 శైలనికాయంబులు = కొండలసమూహములు, 75 చాతుర్వర్ణసముదయంబులు = బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల నెడు నాలుగువర్ణముల యొక్కసమూహములు, జనపదములు = పట్టణములు లేక గ్రామంబులు, అగణ్యంబులు = లెక్కింపనలవి గానివి, భౌమస్వర్గము = భూమిసంబంధియైనస్వర్గము, మనికి = ఉనికి, ఒల్లరు = అపేక్షింపరు, కడఁగరు = యత్నింపరు, ఉపన్యసింపఁబడున్ = చెప్పఁబడును. దివాకరమూర్తి = సూర్యమూర్తి. 76 శాకమహీజము = శాకవృక్షము, ఆకడన్ = అవతల. 78 మర్యాద = ఎల్ల, పరివేషము = గాలిగుడి,

తే. విరివి యక్కొండ కేఁబదివేలయోజ, నంబు లంతియపొడవునై యంబరంబు
మోచి సురసిద్ధగంధర్వఖేచరులకు, నునికియై యుండులోకైకవినుత మగుచు.

క. ఆరాజన్యతనూజుల, పేరఁ వర్షంబులయ్యె భేద ముడిగి బృం
దారకులయట్ల మానవు, లారాజ్యంబున వసింతు రనవరతంబున్. 79

ఉ. ఆరమణీయశైలమున కవ్వల నేలుచునుండు నమ్మహా
వీరుఁడు వీరపర్షన్మతివీరుఁడు ధాతకి యేలు నెమ్మెయిన్
వారల రెండుదేశముల వారల కెప్పుడు రోగశోకదు
ర్వారవిమోహదుష్టగుణవైరజరాదులు చెంద వెయ్యెడన్. 80

తే. తాపసోత్తమ పుష్కరద్వీపమునను
మానసోత్తరశైలంబె కాని యొండు
క్షుద్రగిరులును నదులును జూడ నరిది
యందు వసియించుమనుజు లానందకరులు. 81

క. మదిలోఁ గోరినయప్పుడె, ముదమున నిష్టాన్నపానములు సమకూరన్
బదివేలవత్సరంబులు, బ్రదుకుదు రాదీవి నున్నప్రజలు మునీంద్రా. 82

తే. దండనీతిశుశ్రూషావిధానములను
నిపుణవర్ణాశ్రమాచారనిర్ణయముల
నుడిగి వార్తావిహీనులై యుండుదురు మ
నుష్యు లమరులయట్ల వినోదములను. 83

క. మానుగ నచ్చట బ్రహ్మ, స్థానం బగువటము మెఱయుఁ దద్దేశమునన్
నానామునిసంసేవితుఁ, డై నజనార్దనుఁడు బ్రహ్మయై తా నుండున్. 84

క. ఆదీవిఁ దిరిగియుండును, స్వాదూదకజలధి దానిసమవిస్తృతమై
భూదేవ యిట్లు సప్తప, యోధులయం దొక్కకొలఁది నొనరు జలంబుల్. 85

తే. అబ్ధు లేడును జంద్రోదయాస్తకలిత
వేళలందును గాఁగినపాలఁ బోలె
మీఁజె వేయింటిమీఁద నేనూఱుప్రేళ్ల
పొడవు పోటును నాటునై పొలుపుమిగులు. 86

క. అరుదైనశుద్ధజలసా, గర మవ్వలిభూమి కెల్లఁ గడపటిదెస నా

---

అంబరంబు మోచి = అకాశమునంటి 79 బృందారకులయట్ల = దేవతలవలెనే, అనవరతంబున్ = ఎల్లప్పుడును. 80 వైరజరాదులు = విరోధము పగ మొదలగునవి. 81 ఒండుక్షుద్రగిరులు = ఇతరములైన చిన్నికొండలు. 83 వార్తావిహీనులు = జీవనోపాయముచేత తక్కువైనవారు - జీవనోపాయమును అపేక్షింపనివారు. 85 స్వాదూదకజలధి = మంచినీళ్లసముద్రము, సమవిస్తృతము = సమానమైనవిరివిగలది, 86 చంద్రోదయాస్తకలితవేళలందున్ = చంద్రునిఉదయముతోడను అస్తమయముతోడను కూడినకాలములయందు - చంద్రుఁడు ఉదయించునప్పుడును అస్తమించునప్పుడును, పోటు = ఉబుకుట, ఆటు = అడుగు-అలలతాఁకుడు అని యర్థము. పొలుపు = భాగు. 87 శుద్ధజలసాగరము =

వరణంబుఁబోలె నెంతయుఁ, బరివృతమై చక్రవాళపర్వత మమరున్. 87

ఆ. అయుతయోజనంబులైనవిశాలంబు, దత్సమానవిస్తృతంబు గలిగి
యఖిలజంతుమాన్యమైనలోకాలోక, ధారుణీధరంబు దనరుచుండు 88

ఉ. కాంచనతుంగశృంగములు గల్గి ధరిత్రికిఁ గోటకైవడిన్
మించినచక్రవాళగిరిమీఁదను దారువుఁబెట్టె మూసిన
ట్లంచితమై బెడంగగు నజాండకటాహము దానివెల్పలన్
మించినయంధకార మతినిర్భరమై కనుపట్టు దట్టమై. 89

వ. అట్టిబ్రహ్మాండంబునందు సప్తసాగరసప్తద్వీపసమేతయు స్థావరజంగమాదినానాభూతసహితయు నైనభూమి ధాత్రియు విధాత్రియు ననునామంబులం బరఁగుచుండు నట్టిభూమండలంబునకు నుచ్ఛ్రాయంబు డెబ్బదివేలయోజనంబు లందుఁ బదేసివేలయోజనంబులక్రింద నతలవితలనితలగభస్తిమంతమహాతల సుతలపాతాళంబు లనుసప్తలోకంబులు నుండు నవి శుక్లకృష్ణారుణపీతశర్కరశైలకాంచనవర్ణంబు లైనభూములం గలిగి యనేకభుజంగమదైత్యదానవనివాసంబులై యుండు వినుము. 90

ఉ. నారదమౌనినాథుఁ డొకనాఁడు రసాతలలోకసప్తకం
బారసి చూచి నాకుఁ దెలియన్ వినిపించిన వింటి సర్వబృం
దారకసిద్ధసాధ్యనరదానవనాయకు లున్న లోకముల్
భూరిభుజంగలోకములఁ బోలవు లాలితభాగ్యరేఖలన్. 91

శా. పాతాళంబుల రాజధానులు బహుప్రాసాదయుక్తంబులై
చేతోమోద మొనర్చుభూషణములున్ జీనాంబరశ్రేణియున్
దైతేయోరగదానవావలికి హృద్యంబై తనర్చున్ మణి
వ్రాతంబు ల్గల వెన్నిమైన నతిశుభ్రస్ఫారవర్ణంబులన్. 92

క. తోయజబాంధవుఁ డెండలు, గాయు ననుష్ణంబు లైనకాంతులతోడం
బాయక చంద్రుఁడు వెన్నెల, గాయును శైత్యంబు లేనికాంతులతోడన్. 93

---

మంచినీళ్లసముద్రము. ఆవరణము = వెలుగు. 88 అఖిలజంతుమాన్యము = ఎల్లజంతువులచేతను గౌరవింపఁదగినది, లోకాలోకధారుణీధరంబు = చక్రవాళపర్వతము, తనరుచున్=వన్నె కెక్కుచు. 89 కాంచనతుంగశృంగములు = బంగారుమయములై ఉన్నతములైనశిఖరములు, దారువుపెట్టె=బరణివంటిపెట్టె, అంచితము = మనోజ్ఞము. బెడంగు = అందము, అజాండకటాహము = బ్రహ్మాండమ నెడుకొప్పెర, అతినిర్భరము = మిక్కిలి యతిశయించినది. 90 ఉచ్ఛ్రాయంబు = ఉన్నతము. 91 లాలితభాగ్యరేఖలన్=మనోజ్ఞమైనయదృష్టచిహ్నములచేత. 92 బహుప్రాసాదయుక్తంబులు= పెక్కులైన నగళ్లతోఁ గూడుకొన్నవి, చేతోమోదము=మనస్సంతోషము, చీనాంబరశ్రేణి=చీనదేశపు పట్టువస్త్రములసమూహము, హృద్యంబు = ఇంపైనది-మనోజ్ఞమైనది, మణివ్రాతములు = మణులసమూహములు, అతిశుభ్రస్ఫారవర్ణంబులన్ = మిక్కిలి స్వచ్ఛమై యతిశయించిన వన్నెలచేతను. 93 తోయజబాంధవుండు = సూర్యుఁడు, అనుష్ణంబులు = వేఁడిమిలేనివి, శైత్యము = చల్లఁదనము

ఆ. భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యాదు, లతిమనోహరంబు లైనయట్లు
కలవు గంధసారకర్పూరకస్తూరి, కాదులందుఁ గొఱంత లరయ లేవు. 94

క. వేడుకతో మేళంబులు, గూడి భుజంగేశకుందకోరకరదనల్
ప్రోడలు సంగీతంబులు, పాడుదురు మృదంగవేణుపరివాదినులన్. 95

క. ఆసర్పాలయములఁ గడు, భాసిలు జలజాతకుసుమబంధురసురభి
వ్యాసక్తమత్తభృంగవి, కాసవిలాసంబు లైన కాసారంబుల్. 96

క ఆరయ ననేకములు గల, వారూఢప్రసవఫలసమగ్రము లగుచున్
భూరిభుజంగమవరక, న్యారామములై తనర్చు నారామంబుల్. 97

క. ఈ తెఱఁగునఁ బెంపారెడు, పాతాళంబుల కధోవిభాగంబున వి
ఖ్యాతుఁ డనంతుఁ డనంతవి, భూతిన్ విలసిల్లు నపరపురుషోత్తముఁడై. 98

ఉ. నెట్టన దైత్యదానవమునిప్రవరామరసిద్ధసాధ్యుల
ప్పట్టున నిల్చి నిత్యము నుపాస్తులు సేయఁగ నుండు నవ్విభుం
డట్టియనంతదేవుని మహామహిమల్ గొనియాడ శక్యమే
యెట్టిమహానుభావులకు నేమని చెప్పఁగవచ్చు నాతనిన్. 99

సీ. చారుసహస్రమస్తకవిభూషణమణిచ్ఛాయలు దిక్కుల సందడింప
దివ్యహాలామదోద్వేలఘూర్ణితనేత్రతారకాచయము నృత్యములు సలుప
నానాకిరీటవిన్యస్తప్రసూనసౌరభము లొండొంటితో రాయడింప
శరదభ్రశుభ్రనిశ్చలదేహవిస్ఫురద్ధాళధళ్యములు బిత్తరము లాడ
తే. నిబిడకటితటఘటితవినీలికాంశుకముల దిక్కులఁ జిమ్మచీఁకట్లు గ్రమ్మ

---

94 గంధసార...కస్తూరికాదులందున్ = మంచిగందము కర్పూరము కస్తూరి మొదలైనవానియందు, 95 కుందకోరకరదనలు = మొల్లమొగ్గలవంటి దంతములుగలవారు. ప్రోడలు = నేర్పుగలవారు, మృదంగవేణుపరివాదినులన్ = మద్దెలపిల్లఁగ్రోవి యేడుతంతుల వీణలచేత. 96 జలజాత...విలాసంబులు = తామరపువ్వులవలని మిక్కుటమైనపరిమళమునందు ఆసక్తములై మత్తుగొనిన తుమ్మెదల యొక్క వికాసముచేత మనోజ్ఞములైనవి, కాసారంబులు=సరస్సులు. 97 ఆరూఢ...సమగ్రములు= ఎక్కిన (మీఁదనున్న) పూవులచేతను పండ్లచేతను పరిపూర్తినొందినవి, భూరి...రామములు=పెక్కండ్రు నాగరాజకన్యకలును వారిభర్తలునుగలవి, ఆరామములు=ఉపవనములు. 99 అప్పట్టునన్=ఆస్థానమునందు, ఉపాస్తులు=సేవలు. 100 చారు...ఛాయలు=మనోహరములైన తలలకు అలంకారములైయుండెడు మాణిక్యములకాంతులు, సందడింపన్=వ్యాపింపఁగా, దివ్య...చయము=దివ్యమైన మద్యపానమువలని మత్తుచేత సొంపుగలిగి తిరుగుడుపడుచున్న కంటి నల్లగ్రుడ్లగుమి, నృత్యములుసలుపన్=నాట్యమాడుచుండఁగా, నానా...సౌరభములు=అనేకములైన కిరీటములయందు ఉంచఁబడిన పువ్వుల పరిమళములు. రాయడింపన్ = ఒరసికొనఁగా, శరదభ్ర...ధాళధళ్యములు = శరత్కాలమేఘముల వలె తెల్లనైచలింపని దేహముయొక్క స్ఫురత్తైనతళతళనికాంతులు, బిత్తరములాడన్ = విలాసముగా చేష్టింపఁగా, నిబిడ...అంశుకములన్ = దట్టమైన మొలను ధరింపఁబడిన నీలవస్త్రముయొక్క

శేషుఁ డత్యంతభాషావిశేషుఁ డగుచు, భూరిభూమండలంబెల్లఁ బూనియుండు.

క. కైలాసనగముమీఁదను, గ్రాలెడునాకాశగంగ కాలువలవిధం
బై లాంగలముసలము లిరు, గేలులఁ గనుపట్టు నతనికిని దివ్యములై. 101

క. అతఁ డొక్కొకపరి కోపో, ద్ధతుఁ డైనవిశేషతద్వదననిశ్వాస
ప్రతతులచేతఁ జరాచర, తతులకుఁ బొటిల్లుఁ బ్రళయదహనక్రీడల్. 102

క. అపరముఁడు సంకర్షణ, రూపంబున నుండు నాదిరుద్రుండై తా
గోపించినపుడు ప్రళయము, దీపించు జగంబులెల్లఁ దెగు నందఱితోన్. 103

శా. హాలాపానమదోద్ధతిన్ ఫణివిభుం డత్యంతఘూర్ణాయమా
నాలంకారకటాక్షవీక్షణయుతుండై దేహ ముబ్బంగ భో
గాలిన్ విస్తృతిఁ బొందఁజేసిన సదైత్యామర్త్యమర్త్యంబుగా
నోలిన్ లోకములన్నియు న్నిరమునం దుట్టూఁత లూఁగున్ వెసన్. 104

వ. ఇవ్విధంబున నమ్మహానుభావుండు సకలసరిత్సాగరపర్వతద్వీపమహారణ్యసమేతంబును జరాచరభూతసంచారంబును బంచాశత్కోటియోజనవిస్తారంబును నైన భూమండలంబు శిరోమండనం బైనపూవుదండచందంబున నందంబుగా భరియించు. 105

క. ఈక్షితిమండలమంతయు, నక్షీణప్రౌఢిఁ దాల్చునట్టిమహిమ యా
చక్షుశ్శ్రవునకుఁ గల్గుట, సాక్షాద్విష్ణుప్రభావశక్తియసుమ్మీ. 106

ఉ. చంచలచారునేత్రలు భుజంగమకన్యలు సౌరభంబులన్
మించినచందనం బతనిమేన నలందుచు నుండఁ దన్ముఖా

---

కాంతులచేత, చిమ్మచీఁకట్లు = చిఱుచీఁకట్లు, క్రమ్మన్ = కమ్ముకొనఁగా, భాషావిశేషుఁడు = మాటలచేత మించినవాఁడు, భూరిభూమండలంబు = విస్తారమైన భూగోళమును, పూని = వహించి. 101 గ్రాలెడు = ఒప్పునట్టి, లాంగలముసలములు = నాగేలును రోఁకలియు, ఇరుగేలులన్ = రెండుచేతులందును, కనుపట్టున్ = కనఁబడును - ఉండుననుట. 102 ఒక్కొకపరి = ఒక్కొక్కసారి, ఉద్ధతుఁడు = నిక్కినవాఁడు, తద్వదన...చేతన్ = అతనియొక్క ముఖములవలని నిట్టూర్పు సమూహములచేత, పొటిల్లున్ = కలుగును, ప్రళయదహనక్రీడలు = ప్రళయకాలమునందలి అగ్నియొక్క లీలలు. 103 పరముఁడు = శ్రేష్ఠుఁడు, తెగున్ = నశించును. 104 హాలాపానమదోద్ధతిన్ = మద్యపానముచేతఁ గలిగిన మత్తువలని నిక్కుచేత, ఫణివిభుండు = సర్పరాజు - శేషుఁడు, అత్యంత...యుతుండై = మిక్కుటముగఁ ద్రిప్పఁబడుచున్న అందమైన కడకంటి చూపులతోఁగూడుకొన్నవాఁడై, ఉబ్బంగన్ = ఉప్పొంగఁగా, భోగాలిన్ = పడగలవరుసను, విస్తృతిఁబొందఁజేసినన్ = విరియఁజేసినను, సదైత్యామర్త్యమర్త్యంబుగాన్ = దైత్యులతోడను బ్రాహ్మణులతోడను మనుష్యులతోడను గూడుకొన్నది యగునట్టుగా, ఓలిన్ = వరుసగా, ఉట్టూఁతలూఁగున్ = ఉఊట్లూఁగును. 105 పంచాశత్కోటియోజనవిస్తారంబు = ఏఁబదికోట్ల ఆమడల విరివిగలది, శిరోమండనంబు = శిరోభూషణము. 106 అక్షీణప్రౌఢిన్ = తగ్గనిసామర్థ్యముచేత, చక్షుశ్శ్రవునకున్ = పామునకు - శేషునికి, 107 చంచల...నేత్రలు=చలించుచున్న మనోజ్ఞములైన కనులు గలవారు. అలందుచున్ =

భ్యంచిత వాయువుల్ పరిమళాస్పదఖేలన వృత్తిఁ బోలువా
సించు సమస్తదిక్కుల నశేషము లైనరసాతలంబులన్. 107

క. దుర్గుణవిరహితుఁ డగునా, గర్గుం డవ్విభునిగురువుగాఁ గొల్చి మహా
నర్గళము లైన జ్యోతి, ర్మార్గంబుల శకునశాస్త్రమహిమలు నేర్చెన్. 108

ఆ. అట్టిశేషవాస మైనపాతాళంబు, క్రింద పుణ్యఫలనికృష్టములయి
యమునివిషయభూములై ఘోరనరకంబు, లస్త్రవహ్నియుతములై తనర్చు. 109

వ. అట్టినరకలోకంబుల ననేకనరకభేదంబులు గల వెట్లనిన రౌరవంబును సూకరంబును రోదనంబును తాలంబును విశసనంబును మహాజ్వాలంబును తప్తకుంభంబును లవణంబును విలోహితంబును రుధిరాంభంబును నంధకారంబును వైతరణియు క్రిమిశంబును క్రిమిభోజనంబును అసిపత్రవనంబును కృష్ణంబును లాలాభక్షణంబును దారుణంబును పూయవహంబును వహ్నిజ్వాలంబును అధశ్శిరంబును సందంశంబును కృష్ణసూత్రంబును మహాతమంబును వీచీతమంబును అవీచియు శ్వభోజనంబులు మొదలైననరకంబు లనేకశతసహస్రంబులు కృతాంతకింకరభయంకరంబులును పాపకర్మోపలక్షణనివాసంబులు నై యుండు నందు. 110

ఆ. వినుము పక్షపాతమునఁ గూటసాక్షులఁ, గూడి బుధుల కియ్యకోలుగాని
తగవుచెప్పి సూనృతము దప్పి వర్తించు, వాఁడు గూలు రౌరవంబునందు. 111

ఆ. కుతికఁ బిసికి చంపి గురువుప్రాణముగొని, యావు నఱకి భూ్రణహత్య చేసి
నట్టినరులు రోధ మనునరకంబునఁ, బడుదు రవధిలేనిపాపములను. 112

తే. మద్యపానంబు చేసినమానవుండు, పసిఁడి దొంగిలువాఁడును బ్రహ్మహత్య
చేసినయతండు వీరితోఁ జెల్మికాఁడు, సూకరం బనునరకంబు సొత్తు రనఘ. 113

క. గురుతల్పగతులు ధరణీ, వరవైశ్యులఁ జంపువారు వసుధేశధనా
హారులును సోదరిఁ బొందిన, నరులును బో తప్తకుంభనరకనివాసుల్. 114

తరలము. హితము భక్తియుఁ గల్గుమిత్రుల కెగ్గు చేసినవారలున్
సతుల నమ్మినవారలుం జెఱసాలఁ గాచినవారు దు
ర్వ్రతపరాయణు లైనవారును వాజిపణ్యులుఁ జువ్వె సం
తతము భీకరతప్తలోహమునం జరింతురు దీనులై. 115

పూయుచు, తన్ము ఖా... వాయువులు = ఆచందనముగుండ వీచునట్టి మనోజ్ఞములైనవాయువులు, పరిమ... వృత్తిన్ = మంచివాసనకు స్థానభూతమైన విలాసముతోడి వ్యాపారముతో, వాసించున్ = వాసనగొట్టును, అశేషములు = సమస్తములు. 108 మహానర్గళములు = గొప్పవియును ధారాళములును. 110 కృతాంతకింకరభయంకరంబులు = యమకింకరులచేత భయమును కలుగఁజేయునవి, పాప... నివాసంబులు = పాపకర్ములకు అనుగుణములైన యునికిపట్లు, 111 కూటసాక్షులన్ = తప్పుసాక్షులను, ఇయ్యకోలు = సమ్మతి, తగవు = న్యాయము, సూనృతము = సత్యము. 112 కుతిక = గొంతు, భూ్రణహత్య = కడుపులోని శిశువును చంపుట, అవధి = మేర. 114 గురుతల్పగతులు = గురుభార్యను పొందినవారు. 115 ఎగ్గు = కీడు, కాచినవారు = కావలియున్నవారు, దుర్వ్రతపరాయణులు = చెడువ్రతములయందు ఆసక్తులు, వాజిపణ్యులు = గుఱ్ఱముల బేర

క. వేదుకతోడం గూఁతును, గోడలిఁ గామించువారు గురుజనములకుం
గీడొనరించినవారును, గూడి మహోజ్వాలయందుఁ గూలుదురు సుమీ. 116

ఆ. వేదవిక్రయులును వేదదూషకులు న, గమ్యగాము లైనకష్టమతులు
పోయి లవణనరకమునఁ గూలియుండుదు, రధికపాపకర్ములై మునీంద్ర. 117

తే. దేవతారత్నగురుజనద్విజసమాజ, దూషకులును మర్యాదలఁ ద్రోచి నడచు
వారుపరధన మాశించుచోరకులు వి, లోహనరకాంతరమునఁ గూలుదురు సూవె.

క. దేవాతిథిఋషిపితృపూ, జావిరహితు లైనదుష్టజనములు క్రిమిభ
క్ష్యావేశమతులుఁ గూలుదు, రావల గతి లేక క్రిమిశ మనునరకమునన్. 119

క. సంతతముఁ జక్రసాయక, కుంతాసులు సేయుకారుకులు గూలుదు ర
త్యంతభయదవిశసనర, కాంతరమున వెడలలేక యయుతాబ్దంబుల్. 120

సీ. అపవిత్రదానంబు లందినవాఁడు నయాజ్యయాజకుఁడు మృష్టాన్న మొరుల
కిడక తా నొంటిమైఁ గుడిచినవాఁడు నక్షత్రసూచకుఁడు దుర్జనరతుండు
లవణంబు పాలు బెల్లము నెయ్యి మాంసంబు తిలలు తైలము చల్ల తేనె పెరుగు
విక్రయించినయట్టివిప్రుండు మార్జాలకుక్కుటచ్ఛాగావికులవరాహ

ఆ సారమేయపక్షిజాలంబుఁ బెంచిన, వాఁడు కరుణలేనివాఁడు విప్ర
వరుఁ డధోముఖాఖ్యనరకంబులోపల, నుండు ఘోరమైనయునికితోడ. 121

సీ. కైవర్తకుఁడును రంగముఁ జెప్పువాఁడును విషము పెట్టినవాఁడు వెలఁదివలన
బ్రతికెడువాఁడును బర్వకారియుఁ బాపసూచకుండును గ్రామయాజకుండు
నిల్లు గాల్చినవాఁడు హితునిఁ జంపినవాఁడు శకునజ్ఞుఁడును గ్రతుసమయములను
సోమ మమ్మినమహీసురుఁడు దారుణరుధిరాంభంబులోపల నవధి లేక

తే. చెందుదురు తేనెపెరలు రేఁచినయతండు
తోంటిమర్యాద లుడిపినదోషయుతుఁడు
గ్రామమునఁ గీడొనర్చినపామరుండు
వైతరణిఁ గూలుదురు బహువత్సరములు. 122

క. ఆచార్యనిందకులు వం, శాచారం బుడిగినట్టియధమాధములున్
ఏచికుహకములు పన్నెడు, నీచులుఁ గూలుదురు కృష్ణనిరయములోనన్. 123

క. నిరతము వనిలోఁ బఱచిన, నరుఁ డాయసిపత్రవనమునం బడియుండున్

---

ముచేయువారు. 117 అగమ్యగాములు = పొందరానివాని పొందినవారు. 119 క్రిమిభక్ష్యావేశమతులు = పురుగులను భక్షించుటయందు మిక్కిలి పూనికగలబుద్ధిగలవారు. 120 కారుకులు = శిల్పులు, అయుతాబ్దంబులు = వేయేండ్లు. 121 అవి = గొఱ్ఱె, సారమేయ = కుక్క, జాలంబున్ = సమూహమును, 122 కైవర్తకుఁడు = చేఁపలఁబట్టి జీవించువాఁడు, రంగము = నాట్యము, పర్వకారి = ధనాదిలోభముచేత అపర్వమందు పర్వక్రియాప్రవర్తకుఁడు, సూచకుఁడు = కొండెము చెప్పువాఁడు, గ్రామయాజకుఁడు = ఊరిపురోహితుఁడు. 123 కుహకములు = కపటములు. 124 వనిన్ = వనమును, లోఁబఱచిన నరుఁడు = తక్కువపడఁజేసిన మనుష్యుఁడు - సూలవేయుట మొద

ధర నౌరభ్రికమృగయులు, స్థిరవహ్నిజ్వాలఁ గూలి చిక్కుదురు సుమీ. 124

క. వ్రతలోపం బొనరించిన, యతఁడు నిజాశ్రమము విడుచునతఁడును బాక
చ్యుతిఁ జేసి కుడుచునాతఁడు, సతతము గూలుదురు సూవె సందంశమునన్.

ఆ. పగలు నిద్రవోవుబ్రహ్మచారియు దివా, స్ఖలితమతియు మిత్రఘాతుకుండు
నాశ్రితఘ్నుఁ డైనయధమాధముండు శ్వ, భోజనమునఁ గూలి పోదు రనఘ.

వ. ఇవ్విధంబునం జెప్పంబడిననరకంబులకంటె నత్యంతదారుణంబు లైనదుర్గతు లనేక
శతసహస్రంబులు గలవు. అందు నత్యంతదుష్కృతకర్ము లైనమానవులు యాత
నాగతులై పడియుండుదు రవియన్నియు నొకటికొకటి కనుభవహేతుభూతంబులై
యుండు మఱియును. 127

క. పాతకము లెన్ని నరక, వ్రాతంబులు నన్ని గలవు వానివలన హీ
నాతిశయంబులు లేక సు, ఖాతీతములై భయంకరాకృతి నుండున్. 128

క. నరకముల నున్నవారలు, సురల నధోవదను లగుచుఁ జూతురు సురలున్
నరకస్థులఁ జూతు రధ, శ్శిరములతో నెల్లప్రొద్దుఁ జెచ్చెరఁ దమలోన్. 129

ఆ. పుణ్యపరులు స్వర్గమున కెట్టు లరుగుదు, రట్ల పాపకర్ము లైనవారు
ఘోరమైన నరకకూపనివాసులై, యవధి లేకయుందు రనఘచరిత. 130

క. హృదయమునకు సంతోషం, బొదవుట స్వర్గంబు దుఃఖ మొందుట నరకం
బది వినుము మేలు గీడును, సదమలయశస్వర్గనరకసంజ్ఞలు సుమ్మీ. 131

క. ఏపునఁ దమదుష్కృతములఁ, బాపఁగ నర్హంబు లైనప్రాయశ్చిత్త
వ్యాపారంబులు విడిచిన, పాపాత్ములు నరకలోకపతితులు సుమ్మీ. 132

వ. తొల్లి స్వాయంభువాదు లైనమనువులును మహామునులును మనుష్యులపాత
కంబులకుం దగినప్రాయశ్చిత్తంబులు సకలలోకోపకారకంబులుగాఁ గల్పించి
రట్టిప్రాయశ్చిత్తవిధులవలనఁ బాపంబు లుపశమించుఁ బాపరహితులు పుణ్యలో
కసుఖంబు లనుభవింతురు వినుము. 133

---

లగువానికై పూచి కాచియుండు వృక్షములను నఱికిన మనుష్యుఁడు, ఔరభ్రకమృగయులు=గొఱ్ఱె లను మేపి జీవించువాఁడును వేఁటాడి జీవించువాఁడును. 126 దివాస్ఖలితమతి = పగలు రేతస్సును జార్చునట్టి బుద్ధిగలవాఁడు, మిత్రఘాతుకుఁడు మిత్రుని జెఱచువాఁడు, ఆశ్రితఘ్నుఁడు = తన్ను ఆశ్రయించినవానిని చెఱచువాఁడు. 127 దారుణంబులు = భయంకరములు. దుర్గతులు = నరకములు, దుష్కృతకర్ములు = పాపకర్ములు, యాతనాగతులు = తీవ్రవేదనను పొందువారు, హేతుభూతంబులు = కారణములైనవి. 128 హీనాతిశయములు = తక్కువ యెక్కువలు, సుఖాతీతములు = సుఖమును అతిక్రమించినవి - సుఖములేనివి. 129 అధోవదనులు = తలక్రిందయిన మొగములు గలవారు. నరకస్థులన్ = నరకములయందుండువారిని, అధశ్శిరములతోన్ = క్రిందికివంపఁబడిన మొగములతో, ఎల్లప్రొద్దున్ = సర్వకాలమును. 130 నరకకూపనివాసులు = నరకములనెడు నూతులయందు వసించువారు, అవధి = మేర. 131 సదమలయశ = నిర్మలమైన కీర్తిగలవాఁడా, సంజ్ఞలు=పేళ్లుగలవి. 132 ఏపునన్ = గర్వముతో, దుష్కృతములన్=పాపములను, పతితులు=

క. స్వాయంభువాదిమతములఁ, బ్రాయశ్చిత్తంబు లేనిపాతకములకుం
బ్రాయశ్చిత్తం బగునా,రాయణనామైకసంస్మరణము మునీంద్రా. 134

సీ. అధ్యాత్మవిదులచే నడఁగనిదురితంబు దానముల్ చేసిన బోనికీడు
ఘనతపోనియతిఁ గ్రాఁగనికలుషంబులు జపముచేసినఁ నశించనియఘంబు
లుపవాసములచేత నుడివోనికలుషముల్ పరహితంబులఁ బోనిపాతకములు
వ్రతములచేత నొవ్వనిదుష్కృతంబులు క్రతువులఁ బొలియనికల్మషములు

తే. దేవపూజలఁ బొలివోనికావలములు, బ్రాహ్మణోపాస్తిఁ జెడిపోని పాపచయము
లచ్యుతానంత గోవింద హరి మురారి, యని తలంచిన యప్పుడే యడఁగిపోవు.

మ. నుతభక్తిన్ మనుజుండు తా జపతపోనుష్ఠానధర్మక్రియా
గతుఁడై విష్ణు భజింపఁగా నతనికిం గైవల్యభోగంబు న
చ్యుతమై యింద్రపదంబు గల్గుటఁ దదుద్యోగార్చనాకర్మముల్
శతసాహస్రము లైనవిఘ్నములతో సంధిల్లఁబోలుం జుమీ. 136

చ. హరి భజియించి నిత్యముఁ దదర్చనచేసి కృతార్థుఁ డైనయా
నరునకు నాకపృష్ఠగమనం బగుఁ జూవె యధఃపథంబునన్
మరలుట లింద్రభోగములు మానిన నంతకు నెక్కుడైనచో
మరిగి వసించుగాని మఱిమానుషభావముఁ బొందఁ డెన్నడున్. 137

ఉ. ఇమ్ముగ భక్తిబీజ మన నెన్నికకెక్కినవాసుదేవనా
మంబు దివానిశంబు గరిమం జపియించునరుండు విష్ణులో
కంబున నుండుఁగాని నరకంబునఁ గూలఁడు వాని కెన్నిజ
న్మంబులనైనఁ బాపములు నాటవు పుణ్యపరుండు గావునన్. 138

క. కోపప్రసాదగుణములు, పాపంబును బుణ్యఫలము బహుసుఖదుఃఖ

---

పడినవారు. 134 నారాయణనామైకస్మరణము = ఒక్కటి యైననారాయణనామమును స్మరించుట - నారాయణనామమునే పలుమాఱు తలఁచుచుండుట. 135 అధ్యాత్మవిధులచేన్ = తత్త్వానుసంధానక్రియలచేత, దురితము = పాపము, కీడు = చెఱుపు - పాపము, క్రాఁగని కలుషములు = నశింపని పాపములు, అఘము = పాపము, ఉడివోని = చెడని, పరహితంబులన్ = పరోపకారములచేత, నొవ్వని = బాధనొందని - చెడని, పొలియని కల్మషములు = నశింపని పాపములు, పొలివోనికావలములు = నశింపని పాపములు, బ్రాహ్మణోపాస్తి = బ్రాహ్మణపూజ. 136 నుత = కొనియాడఁబడిన, ధర్మక్రియాగతుఁడు = పుణ్యకర్మలను పొందువాఁడు - పుణ్యకర్మలను చేయువాఁడనుట, భజింపఁగాన్ = సేవింపఁగా, అచ్యుతము = జాఱనిది - తొలఁగనిది, తదుద్యోగార్చనాకర్మములు = వానియొక్క ప్రయత్నపూర్వకములైన పూజాకృత్యములు. 137 నాకపృష్ఠగమనంబు = స్వర్గమునకు మీఁది మార్గమున పోవుట, అగుఁజూవె = కలుగునుజుమీ, అధఃపథంబునన్ = క్రింది మార్గమున, అంతకున్ = ఆయింద్రలోకమునకంటె, మరిగి = పరిచయముగలిగి, 138 బీజము = విత్తు - పుట్టుకకు హేతువు, ఎన్నికకున్ = గణనకు-ప్రసిద్ధికి, దివానిశంబు = పగలును రేయును, గరిమన్ = గురుత్వముతో. 139 కోపప్రసాదగుణములు = కోపగుణమును, శాంతిగుణమును, దీపిం

వ్యాపారంబులు నరులకు, దీపింపఁగఁ జేయు జ్ఞానదృష్టి మునీంద్రా. 139

క. జ్ఞానము జ్ఞానమునకు నజ్ఞానమునకుఁ గారణంబు జ్ఞానాజ్ఞానా
ధీనము విజ్ఞానం బగుఁ, గాన నరుం డెప్పుడు జ్ఞాని గావలయుఁ జుమీ. 140

వ. అని యనేకవిధంబుల సుజ్ఞానప్రతిపాదనంబు చేయుచున్న గురునకు శిష్యుం
డిట్లనియె. 141

క. మునినాథ నాకు నీచే, వినఁగలిగె సమస్తకథలు విస్పష్టముగా
నొనర భువర్లోకాదులు, వినవలతుం జెప్పవే వివేకప్రౌఢిన్. 142

వ. అనిన నతనికిఁ బరాశరుం డిట్లనియె. 143

క. మైత్రేయ వినుము పంకజ, మిత్రసుధాకరులరుచులు మెఱసి వెలుంగన్
బాత్రమగుచోటు సాగర, గోత్రద్వీపములతోడి కుంభిని యయ్యెన్. 144

ఆ. అవని యెంతవిరివి యైయుండు నింగియు, నంతవిరివితోడ నతిశయిల్లు
దృష్టిగోచరములు దివియును భువియును, గాన నెందుఁ జూడఁ గడలు లేవు.

వ. అట్టిభూమండలంబునకు లక్షయోజనంబుల సూర్యమండలంబు దివాకరునకుఁ
జంద్రునకు నంతియదూరంబు సోమమండలంబుమీఁద నక్షత్రమండలం బన్ని
యోజనంబులు దానికి రెండులక్షలయోజనంబులు బుధమండలంబు బుధమండ
లంబున కంతియదూరంబు శుక్రమండలంబు శుక్రమండలంబునకుఁ దావత్ప్రి
మాణంబున నంగారకమండలంబు దానికి రెండులక్షలయోజనంబుల బృహస్పతి
మండలంబు దానికిఁ దదీయప్రమాణంబున శనైశ్చరమండలంబు దానికి శత
సహస్రయోజనంబుల సప్తర్షిమండలంబు దానికి నంతియదూరంబున. 146

శా. వైభూత్యాధికుఁడై చరాచరతతుల్వర్ణింప నుద్యత్తపో
లాభప్రాప్తి సహస్రదివ్యయుగముల్కల్పాంతరస్థాయిగా
భూభాగగ్రహతారకామునిపదంబుల్ క్రింద వర్తింప మే
ధీభూతుం డగుచున్ ధ్రువుం డమరు జ్యోతిశ్చక్రసంయుక్తుఁడై. 147

వ. అట్టిధ్రువమండలంబునకుఁ గోటియోజనంబులమహర్లోకంబును దదీయద్విగుణితం

---

పఁగన్ = వెలుఁగఁగా - ప్రకాశింప. 141 ప్రతిపాదనంబు = చెప్పుట - స్వరూపమును నిరూ
పించి చెప్పుట. 142 విస్పష్టముగాన్ = విశదముగా. 144 పంకజ...రుచులు = సూర్యచంద్రుల
కాంతులు, సాగర...కుంభిని=సముద్రములతోడను పర్వతములతోడను దీవులతోడను గూడినభూమి.
145 నింగియున్ =ఆకాశమున్, కడలు=తుదలు, 146 తావత్ప్రిమాణంబునన్ = అంతటిమేరను.
147 వైభూత్యాధికుఁడు = ఐశ్వర్యముచేత అధికుఁడు, ఉద్య...ప్రాప్తిన్ = అతిశయించిన తపః
ఫలము కలిమిచేత, కల్పాంతరస్థాయిగాన్ = మరియొక ప్రళయము వఱకైన నిలుకడకలవాఁడుగా,
క్రిందవర్తింపన్ = తనకు దిగువనుండఁగా, మేధీభూతుండు=మేధిగా చేయఁబడినవాఁడు - చలింపని
యునికి గలవాఁడనుట. (మేధి=కళ్లములో పసులను గట్టుటకుపాఁతిన మేకు.) జ్యోతిశ్చక్రసంయు
క్తుఁడు = జ్యోతీరూపములైన నక్షత్రములకు ఉనికిపట్టైనచక్రముతో కూడుకొన్నవాఁడు.

బైనపొడవున జనర్లోకంబును నుండు నందుఁ గల్పాంతవాసు లైనసనకాదియోగి బృందంబు వసియించు నాజనర్లోకంబునకుఁజతుర్గుణోత్తరంబైనయున్నతంబునం దపోలోకంబు వర్తించు దానికి నాఱుమణుంగు లైనపొడవున సత్యలోకంబు మెఱయు నందులవసియించుమహాత్ములు పునరావృత్తిభయంబులు లేక సానందులై యుండుదు రనిచెప్పి మఱియు నిట్లనియె. 148

సీ. పాదగమ్యం బగుమేదినీవలయంబు భూలోకమయ్యె నాభూమినుండి
వనజాప్తుదాఁక భువర్లోక మగుఁ బద్మమిత్రమండలినుండి మీఁద నయుత
సప్తద్వితీయయోజనముల ధ్రువుఁ డుండులోకంబుదాఁక స్వర్లోక మిట్టి
భూర్భువస్వర్లోకములు మూఁడు కృతకంపుజగము లాజనతపస్సత్యలోక

తే. ములును కృతకం బులవిగావు మునివరేణ్య
యానడుమను మహర్లోక మడఁగుఁ గొంత
కొంత చెడిపోవకుండుఁ గల్పాంతవేళ
నివ్విధంబున లోకంబు లేడు నమరు. 149

క. అలఘుచరాచరభూతం,బులఁ గలపదునాల్గులోకముల విశ్రుతమై
నలినభవాండం బీక్రియ, విలసిల్లుఁ గపిత్థఫలమువిధమున ఘనమై. 150

వ. అట్టిబ్రహ్మాండకర్పరంబునకు వెలుపల దశోత్తరగుణితం బైనవిస్తారంబున మహాజలంబు పరివేష్టించి యుండు నాజలంబులకుఁ బదిమడుంగు లెక్కువైనవిస్తీర్ణంబున మహానలంబు చుట్టుకొనియుండుఁ దదీయబాహ్యంబున మహావాయువునట్ల పొదివియుండు దానికిం బజ్క్తిభాగాధికం బైనవిశాలంబున నాకాశంబు చుట్టియుండు నీభూతపంచకంబుఁ బొదివి మహద్వస్తువు మెఱయు నామహత్తునకు బహిఃప్రదేశంబు ప్రధానపురుషపరివేష్టితంబై యుండు నన్నింటికి నాధారభూతయు ననంతరూపయు నైనవిష్ణుమాయాశక్తి సర్వాక్రాంతయై యుండు.

మ. మొదల న్బీజము గల్గియుండఁగఁగదా మోసెత్తి మూలంబుతో
విదితస్కంధము మించి కొమ్మల గడుఁ౯విస్తారమై పత్రసం

---

148 ఆఱుమణుంగులు=ఆఱంతలు, పునరావృత్తి భయంబులు=మరలపుట్టుటలు వెఱపును, సానందులు=సంతోషయుక్తులు. 149 పాదగమ్యంబు = అడుగును పొందఁదగినది, వనజాప్తుదాఁక౯=సూర్యునివఱకు, కృతకంపుజగములు = కృతకలోకములు, (కృతకము = చేయఁబడినది.) కృతకములవిగావు - అకృతకములనుట, ఆనడుమను మహర్లోకము = కృతకములును అకృతకములునైన ఆలోకములకు నడుమ మహర్లోకము ఉండును, అడఁగుఁగొంత = ఆమహర్లోకమునందు కొంతభాగము (అణఁగి పోవు) నశించును. 150 నలినభవాండంబు = బ్రహ్మాండము, కపిత్థఫలము విధమున౯ = వెలఁగ పండువలె. 151 కర్పరంబునకు౯ = కొప్పెరకు, దశోత్తరగుణితంబు = నూఱింటిమీఁద గుణింపఁబడినది, విస్తారంబున౯ = విరివిచేత, పరివేష్టించి = ఆవరించి, పదిమడుంగులు = పదంతలు, తదీయబాహ్యంబున౯ = దానికి వెలుపల, పొదివి = చుట్టుకొని, పజ్క్తిభాగాధికంబు = పదిపాళ్లకు ఎక్కువ, సర్వాక్రాంత = అన్నిటిచేతను ఆక్రమింపఁబడినది. 152 మోసు = మొలక, మూలంబు

పద నేపారుసుమంబులఁ ఫలములఁ భాసిల్లువృక్షంబునం
దుదయంబంది మహిం దరు ల్వనములై యొప్పారుచందంబునన్. 152
సీ. అరుదైన విష్ణుమాయాశక్తివలనను బ్రకృతిపూరుషుఁడు సంభవమునొందఁ
దత్పురుషునకుఁ బ్రధానభూతము పుట్టు నతనికి మహదాదు లవతరించు
నందు నాకాశంబు నాకాశతత్త్వంబువలన గాలియు గాలివలన వహ్ని
యును వహ్నివలన నయ్యుదకము నుదకంబువలన భూమియు భూమివలనఁబుట్టు
తే. దేవదైతేయపితృనరాదికము లైన
సృష్టియందుఁ జరాచరశ్రేణి యెల్లఁ
బుత్రపౌత్రాంతరముల నుద్భూత మొందు
నిట్లు కడలేక బ్రహ్మాండకోట్లు మెఱయ. 153
ఆ. వ్రీహిబీజ మంకురించుచు మూలంబు, గలిగి నాళపత్రకాండకోశ
పుష్పతండులములఁ బొదలి యంతంబునఁ, జెడుచు బీజవృద్ధి చేసినట్లు. 154
ఉ. పంబినవిష్ణుశక్తి నొకపద్మభవాండము పుట్టు నమ్మహాం
డంబు విశాలమై చనునెడఁ శతకోటిసహస్రధావిలా
సంబులఁ బొందఁజేయునది సర్వము నట్ల బహుప్రకారరూ
పంబుల నుల్లసిల్లు నిరపాయతఁ గాలవశంబు పెంపునన్. 155
క. అని బ్రహ్మాండమహత్త్వము, వినిపించి పరాశరుండు వెండియు నతనిం
గనుఁగొని జ్యోతిశ్చక్రము, నినునిం జెప్పంగఁగోరి యిట్లని పలికెన్. 156
ఆ నవసహస్రయోజనముల సూర్యునిరథం, బీష యొప్పుదాని నినుమడించి
యెనయ నూటయేఁబదేనులక్షలయోజ,నములు మొదలియక్ష మమలచరిత.
ఆ. అంచు లైదు నెమ్ము లాఱు నాభులు మూఁడు, గలిగి సూక్ష్మగమనకలిత మగుచు
సంయమీంద్ర వినుము సంవత్సరాకృతిఁ, గాలచక్రమందుఁ గ్రాలుచుండు. 158
తే. దాని రెండవయక్షంబు మానిచంద్ర
వినుము నలువదివేలయోజనము లగుచు

ఠోఁ = వేరుతో, స్కంధము = ప్రకాండము - బోఁదె, పత్రసంపదఁ = ఆకులకలిమిచేత, ఏపారు సుమంబులఁ = అతిశయించునట్టి పుష్పులచేతను, ఉదయంబంది = పుట్టి, తరులు = వృక్షములు. 153 అరుదు = ఆశ్చర్యము - వింత, సంభవము నొందుఁ = పుట్టును, ఉద్భూత మొందుఁ = పుట్టును, వ్రీహిబీజము = వరివిత్తనము, అంకురించుచుఁ = మొలచుచు, నాళ...తండులములఁ = కాఁడ ఆకు పొట్ట యెన్ను బియ్యము వీనిచేత, పొదలి = అభివృద్ధినొంది, అంతంబునఁ = కడపట. 155 పంబిన = సర్వవ్యాపకమైన, పద్మభవాండము, = బ్రహ్మాండము, (అండము = గుడ్డు,) సహస్రధా = వేయివిధములైన, నిరపాయతఁ = అపాయములేమిచేత. 157 ఈష = నొగ, ఇను మడించి = ఇబ్బడించి, ఎనయఁ = కలయ, అక్షము = ఇరుసు (దీనికి బండి చక్రమని అమరము నందు అర్థము వ్రాయఁబడియున్నది, సందర్భమునుబట్టి యిక్కడ యీయర్థమగుచున్నది.) 158 నెమ్ములు = కడకమ్ములు నాభులు = తూములు, సూక్ష్మగమనకలితము = సూక్ష్మమైన నడకతో ఒప్పి

బెరయు మూడవయిరుసు దా నిరుపదేను
వేలయోజనములతోడ వెలసియుండు. 159

తే. వర్షశీతోష్ణజాలముల్ వరుసతోడఁ, దత్తదఙ్త్రయంబు తన్నాభులందుఁ
దగిలి కాలక్రమంబులు దప్పకుండఁ, దిరుగుచక్రంబు వక్రమై దిశలయందు.

వ. మఱియు నేఁబదివేలయోజనంబు లైనబండి కాఁడికి వలపలయును యిరుసువలప లయును ధుర్యపునిదృఢబంధంబు లైయుండు యుగంబుద్వాపల గాయత్రియు బృహతియు నుష్ణిక్కును జగతియుఁ ద్రిష్టుప్పును అనుష్టుప్పును బఙ్క్తియు నను ఛందంబు లేడును రథతురంగంబు లైయుండు నట్టిరథచక్రంబు మానసోత్తర శైలంబుమీఁదం దిరుగుచుండు నమ్మహానగంబునందు. 161

సీ. ప్రథమదిక్కున నుండు పర్జన్యపాలితప్రకటవస్వోకసారాపురంబు
దక్షిణంబున నుండు దండధరాధీననిరుపాధిసంయమనీపురంబు
పశ్చిమంబున నుండుఁ బాశపాణిసురక్షితప్రసిద్ధము సుఖోదయపురంబు
ఉత్తరంబున నుండు నొగి సోమపాలిత శ్రీకరంబుగ విభావరిపురంబు

తే. ఇట్టిపురములు నాల్గు ననేకయోజ,నముల విస్తీర్ణములు గల్గి యమలమహిమఁ
దనరుఁ బుష్కరద్వీపమధ్యంబునందు, మానసోత్తరనగబాహ్యమండలములు. 162

క. ఈనగరంబులు నాల్గిట, భానుఁడు చరియించుచుండుఁ బ్రభ లేపారన్
గాన నుదయాస్తమానము, లై నరులకుఁ దోఁచు జగము లన్నిటియందున్. 163

శా. జ్యోతిశ్చక్రసమేతుఁడై మెఱసి సూర్యుం డిట్లు త్రింశన్ముహూ
ర్తాతీతం బగునట్టికాలమున నిర్యాణంబు గావించుఖ
ద్యోతుం డెక్కడఁ దోఁచు నక్కడ దినం బుగ్రాంశుదీప్తిచ్ఛటా
వీతస్థానములెల్ల రాత్రు లగు నుర్వీభాగ మాద్యంతమున్. 164

వ. ఇట్లు ముప్పదిముహూర్తంబుల సూర్యుం డింద్రయమవరుణసోమపట్టణంబులకుం గ్రమంబునఁ బ్రభాతమధ్యాహ్నసాయంకాలమధ్యరాత్రంబులఁ గావించు చుండు. 165

క. తోయజహితుఁ డెవ్వారికి, నేయెడఁ గాన్పించె నది మునీంద్రా పూర్వం

---

నది, క్రాలుచు = వర్తించుచు. 159 బెరయున్ = ఉండును. 161 యుగంబు = కాఁడి, అమ్మహానగంబునందున్ = ఆగొప్పకొండయందు. 162 పర్జన్యపాలిత=ఇంద్రునిచేత పాలింపఁబడు చున్న, వస్వోకసారాపురంబు = దేవతల పట్టణము, దండధరాధీన నిరుపాధి = యమునియధీనమైన యుపాధిలేనిదైన, పాశపాణి = వరుణునిచేత, సోమపాలిత శ్రీకరంబుగన్ = శివునిచేపాలింపఁ బడి సంపద కలుగఁజేయునదిగా, బాహ్యమండలములు = బయటిప్రదేశములుగలవి. 163 ప్రభలు = కాంతులు, ఏపారన్ = అతిశయింపఁగా. 164 త్రింశన్ముహూర్తాతీతంబు = ముప్పది ముహూర్తములచేతఁ గడచినది, నిర్యాణంబుగావించున్ = అస్తమించును, ఖద్యోతుండు = సూర్యుఁడు, ఉగ్రాంశు దీప్తిచ్ఛటా వీతస్థానములు = సూర్యుని కిరణసమూహములచేత పోఁగొట్టఁబడిన చోటులు-సూర్యప్రకాశములేనితావులు, 166 తోయజహితుఁడు = సూర్యుఁడు, పూర్వంబు = తూర్పు, అదృ

బై యమరు నదృశ్యంబై, పోయినదెస పశ్చిమంబు భూజనములకున్. 166

తే. కాన మేరువుమర్త్యలోకమున కెల్ల
నుత్తరంబట్టికనకాద్రియుపరియందు
బ్రహ్మసభయుండు దానికిఁ బద్మహితుఁడు
తాఁ బ్రవర్తించుచుండుఁ బ్రదక్షిణముగ. 167

చ. ఇనుఁ డనిశంబు బ్రహ్మసభకెల్లఁ బ్రదక్షిణ మాచరింపఁగా
ననుపమదేవలీలఁ బితృయానములం జరియింప నుత్తరా
యణమును దక్షిణాయనమునై కడ నున్నతనిమ్నవృత్తులం
దనరుచు నుండు నంబరపథంబునఁ గాలగతి న్మునీశ్వరా. 168

తే. మకరమాసంబు మొదలు యుగ్మంబు తుదిగ
నాఱునెల లుత్తరాయణమయ్యె రవికి
నందు రాత్రులు కుఱుచలై యహము లెక్క
డగుచు నడుచును గాలపర్యాయమునను. 169

తే. కర్కటం బాదిచాపంబు గడపలైన, యాఱుమాసంబులును దక్షిణాయనంబు
అందు నహములు గొంచెంబు లగుచునుండు, దినదినంబుల రేలు వర్ధిల్లుచుండు.

వ. మేషతులాసంక్రమణంబులు విషువ లట్టివిషువకాలంబుల దివారాత్రంబులు సమంబులై నడచు నయ్యహోరాత్రంబులు మేదినీభాగపర్యాయంబులు ముప్పదిముహూర్తంబులను ద్వాదశరాసులం బ్రవర్తిల్లు నొక్కొక్కరాశి యందు రెండునక్షత్రంబు లొక్కపాదంబు లెక్క నిరువదేడునక్షత్రంబులఁ గ్రమంబున ననుగమించు నుత్తరాయణంబున దివాకరుం డమందవిక్రముండై దివసంబులందు పదుమూడున్నరనక్షత్రంబు బదునెనిమిదిముహూర్తంబులఁ జరియించు రాత్రి శీఘ్రగమనుండై యన్నినక్షత్రంబులం దష్టాదశముహూర్తంబుల నిర్యాణంబు చేయుఁ జక్రసంచారవశంబున నహోరాత్రంబులు సమాధిక హీనంబులై వర్తించు 171

---

శ్యంబై పోయినదెస = కనఁబడకపోయిన దిక్కు - అస్తమించినదిక్కు. 167 మర్త్యలోకమునకున్ = మనుష్యలోకమునకు, కనకాద్రి యుపరియందున్ = మేరుపర్వతముయొక్క మీఁదిభాగమునందు. 168 అనిశము = ఎల్లప్పుడు, ఉన్నత నిమ్నవృత్తులన్ = మిట్టపల్లముల వ్యాపారములతో - మిట్టలును పల్లములునుగా, అంబరపథంబునన్ = ఆకాశమార్గమున. 169 యుగ్మము = మిథునము, అహములు = పగళ్లు, కాలపర్యాయమునన్ = కాలక్రమమున. 170 చాపంబు = ధనుస్సు, కడపల = తుద, రేలు = రాత్రులు 171 విషువలు = విషువత్పుణ్యకాలములు, దివాకరుఁడు = సూర్యుఁడు, అమంద విక్రముఁడు = మందముగాని విక్రమముగలవాఁడు - మిక్కిలి వేండ్రము గలిగి ప్రకాశించువాఁడు, నిర్యాణంబుచేయున్ = అస్తమించును, సమాధికహీనంబులు = కొన్నాళ్లు సమముగాను కొన్నాళ్లు ఎక్కువగాను కొన్నాళ్లు తక్కువగాను ఉండునవి. 172 కులాల

ఉ. పూని కులాలచక్రమునుబోలె రయంబునఁ గాలచక్రము
గ్రానిలవేగమై తిరుగు నానడుమం గడుమందయానుఁడై
భానుఁడు సంచరించుచు నభస్థలినెల్ల వెలుంగఁజేసి తే
జోనిధియై సుమేరుగిరిచుట్టుఁ బ్రదక్షిణ మాచరింపఁగన్. 172

ఆ. తీవ్రవృత్తితోడఁ దిరుగుకులాలచక్రంబునడిమిమంటిగతి ధ్రువుండు
మందగతిఁ జరించు మహనీయతరకాల, చక్రమధ్యమునను సంతతంబు. 173

వ. ఇవ్విధంబునఁ గాలాత్ముం డైనద్వాదశాత్మునిదర్శనాదర్శనంబు లైనదివారాత్రంబులువ్యష్టియు నుషయునగుఁ దదీయమధ్యంబులు సంధ్యాకాలంబులయ్యె నందు.

క. భానునితేజంబు బృహద్భానుఁడు గొను రాత్రులందుఁ బావకుతేజం
బానలినాప్తుఁడు గైకొను, మానుగ దివసంబులందు మర్యాదలతోన్. 175

ఆ. కానఁ బద్మహితుఁడు ఘస్రకాలంబున, దీప్తిమంతుఁ డగుచుఁ దేజరిల్లు
రాత్రులందు వీతిహోత్రుఁడు తేజంబు, గలిగి దూరమునకుఁ గానవచ్చు. 176

వ. ఉభయసంధ్యాకాలంబుల సూర్యాగ్నితేజంబులు జలంబులం బ్రవేశించి తదీయచ్ఛాయలు గగనతలంబునఁ బ్రతిబింబితంబులగుటంజేసి ప్రభాతసాయంకాలంబు లరుణారాగంబు లయ్యె నట్టిసంధ్యాకాలంబుల. 177

క. బాహుపరాక్రము లక్షయ, దేహులు మందేహనామధేయనిశాట
వ్యూహములు పెక్కుగోట్లు, త్సాహంబునఁ దొల్లి బ్రహ్మశాపమువలనన్. 178

వ. సూర్యమండలంబు భక్షింప సమకట్టి పొదువు నప్పుడు. 179

సీ. భూసురోత్తములు సంధ్యాసమయంబుల వైదికప్రణవపూర్వముగ వేద

---

చక్రము = కుమ్మరిసారె, ఉగ్రానిలవేగము = భయంకరమైన గాలియొక్క వేగముగలది, కడుమందయానుఁడు = మిక్కిలి తిన్నని నడకగలవాఁడు, సుమేరుగిరి = మేరుపర్వతము. 173 తీవ్రవృత్తితోడన్ = అధికవేగము గలవర్తనముతో, సంతతంబు = ఎల్లప్పుడు. 174 కాలాత్ముండు = కాలస్వరూపుఁడు, ద్వాదశాత్ముని దర్శనాదర్శనంబులు = సూర్యునియొక్క చూచుటయుఁ జూడమియుఁ గలవి - సూర్యుఁడు కనఁబడుటయు కనఁబడమియుఁ గలవి, దివారాత్రంబులు = పగలు రేయును, తదీయ=ఆదివారాత్రములదైన. 175 బృహద్భానుఁడు = అగ్ని, పావకు = అగ్నియొక్క, నలినాప్తుఁడు = సూర్యుఁడు. 176 ఘస్రకాలంబునన్ = పగటికాలమందు, దీప్తిమంతుఁడు = ప్రకాశము గలవాఁడు, వీతిహోత్రుఁడు = అగ్ని. 177 ఉభయసంధ్యాకాలంబులన్ = ప్రాతస్సంధ్యాకాలమునందును సాయంసంధ్యాకాలమునందును, తదీయచ్ఛాయలు = ఆతేజస్సులవైనచాయలు, గగనతలంబునన్ = ఆకాశప్రదేశమునందు, ప్రతిబింబితంబు = ప్రతిబింబించినది. ప్రభాతసాయంకాలంబులు = ప్రాతఃకాలసాయంకాలములు, అరుణరాగంబులు = ఎఱ్ఱనికాంతిగలవి. 178 అక్షయదేహులు = క్షయింపని దేహములు గలవారు, నిశాటవ్యూహములు = రాక్షసులమూఁకలు. 179 సమకట్టి = యత్నించి, పొదువునప్పుడు = ఆక్రమించు నప్పుడు. 180 భూసురోత్తములు = బ్రాహ్మణశ్రేష్ఠులు, వైదికప్రణవపూర్వముగన్ = వేదసంబంధియైన ప్రణవము ముందు కలుగునట్లుగా—

మాతయై విలసిల్లు మంత్రంబుచే భక్తి నర్ఘ్యంబు లిచ్చుచో నాజలములు
వజ్రంబులై దైత్యవరుల నందఱ వధియించి తేజంబు గావించురవికి
నీచందమున యామినీచరశ్రేణికిఁ బ్రతిదినంబును గల్గుఁ బ్రాణహాని

తే. యగ్నిహోత్రంబులను బ్రథమాహుతుల వి
కర్త నాప్యాయనంబయి కడునతనికి
ఘనమయూఖంబు లెంతయుఁ గాంతి మెఱసి
భువనమంతయు నభివృద్ధిఁ బొందఁజేయు. 180

క. కావున బ్రాహ్మణులకు సంధ్యావిధు లొనరింపవలయుఁ దత్కాలమునన్
భూవినుత యగ్నిహోత్రము, గావింపఁగవలయు రెండుకాలములందున్. 181

ఆ. కాల మెఱిఁగి సంధ్య గావింపనేరక, యగ్నిహోత్రవిధియు నాచరింప
నొల్లఁడేని యెంత యోగ్యుఁడై యున్న నా, బ్రాహ్మణుండు ద్రోహి భాస్కరునకు.

వ. ఇట్లు భగవంతుం డైనయంశుమంతుండు పరమవైఖానసు లయినవాలఖిల్యాది
బ్రాహ్మణోత్తములచేత సంరక్షితుండై కాలంబు గడపుచు జగంబులు పరిపాలించు
చుండు నమ్మహాత్మునియుదయంబు మొదలుగా మూఁడేసిముహూర్తంబులప
ర్యాయంబునం బ్రాతస్సంగవమధ్యాహ్నపరాహ్ణసాయాహ్నంబులను కాలపంచ
కంబు పదియేనుముహూర్తంబులై నడుచు రాత్రియు నంతియ కాలంబగు నుత్తర
దక్షిణాయనంబులం జేసి దివసరాత్రంబులు హానివృద్ధులై నడుచు మేషతులాసం
క్రమణంబులు రేలుఁ బగళ్లు సమంబులై యుండు నట్టివిషువకాలంబులు దేవ
పితృసంతర్పణజపతపోనుష్ఠానదానంబులకు యోగ్యంబులై ప్రవర్తిల్లు ననిచెప్పి
మఱియును. 183

తే. సప్తమునిమండలముమీఁద శతసహస్ర
యోజనంబులపొడవున నుండు ధ్రువుఁడు
అదిగదా విష్ణుపదమయ్యె నట్టివిష్ణు
పదమునందుఁ జరింతురు బ్రహ్మవిదులు. 184

సీ. సంతతంబును గాలచక్రమధ్యమున వేదియుఁ బోలె ధ్రువుఁడెందుఁ దేజరిల్లు

---

తొలుత ప్రణవము నుచ్చరించుచు ననుట, వేదమాత = గాయత్రి, అర్ఘ్యంబులు = మంత్రోదకములు, వజ్రంబులు = వజ్రాయుధములు, తేజంబుగావించు = తేజస్సుకలుగఁజేయును, యామినీచరశ్రేణికిన్ = రాక్షస సమూహమునకు, ప్రాణహాని = చావు, వికర్తనాప్యాయనంబయి = రాక్షసుల యొక్క రాయిడివలని బడలికతీఱి, మయూఖఁబులు = కిరణములు, భువనము = లోకము. 183 అంశుమంతుండు = సూర్యుఁడు, వైఖానసులు = విష్ణుభక్తులు, సంరక్షితుఁడు = లెస్సగా రక్షింపఁబడినవాఁడు, పర్యాయంబునన్ = క్రమముగా, కాలపంచకంబు = కాలములయొక్క అయిదు - అయిదుకాలములును, యోగ్యంబులు = తగినవి. 184 బ్రహ్మవిదులు = పరతత్త్వము నెఱిఁగినవారు. 185 వేది = వేదిక - హోమకుండము, (దీనికి మఱియొక అర్థము అరుఁగు,) చరింతురు = మెలఁగు

నారదసనకసనందసనత్సుజాతాదు లెచ్చోటఁ బాయక చరింతు
రాకల్పపర్యంత మైనకాలంబు సుపర్వు లేలోకంబుఁ బాసి చనరు
భూర్భువస్వర్లోకములకెల్ల నున్నతస్థానమై యేవంకఁ దనరియుండు

తే. హరిపదధ్యానపూజాప్రయత్నవిముఖు, లైనవారికి దురవగాహప్రదేశ
మెద్ది యెది నిరుపాధియై యెల్లప్రొద్దుఁ, బరఁగునది విష్ణుదేవుని పరమపదము.

క. నిరతాష్టాక్షరవిద్యా, పరతంత్రులు చిత్సుఖానుభవనిత్యాత్ముల్
హరిభక్తులు "తద్విష్ణోః, పరమం పద" మనుచు నెచట భక్తిఁ దలంతుర్. 186

వ. అట్టివిష్ణుపదంబున విష్ణుపాదాంగుష్ఠనిష్ఠ్యూతయును త్రిలోకాధారభూతయును
సకలపాపనివారణయును దేవాంగనావిహారాకారణయును నైనయాకాశగంగ
నిర్భంగతరంగడోలాలోలమరాళజాలయై ప్రవహించి సర్వజ్ఞుం డైనవ్యోమకేశు
జటామకుటమండితయై సంతతప్రాణాయామపరాయణు లైనసప్తమునిమండ
లంబు పరిపూరితంబుచేసి గ్రహతారకాలోకంబులాలోకించుచు నష్టాశీతిసహస్ర
యోజనవిస్తీర్ణం బైనశశాంకమండలం బాప్లావనంబుచేసి తదీయమయూఖస్రావ
సుధాధారాపూరధావళ్యధాళధళ్యంబులతోడఁ గనకాచలంబుమీఁదఁ బ్రవ
హించి యమరావతి నాల్గుదిక్కులందును సీతాలకనందాచక్షుర్భద్రాభిధానం
బుల వాహినీచతుష్టయంబై జంబూద్వీపంబుఁ బరమపావనంబుఁజేసి యలక

---

గుదురో, ఆకల్పపర్యంతము = ప్రసిద్ధమైన ప్రళయకాలము వఱకు, సుపర్వులు = దేవతలు, ఏవంక = ఏతట్టు-ఏచోటు అనుట, విముఖులు = మూఱుమొగము గలవారు - చేయనివారు, దురవగాహ ప్రదేశము = దుర్లభమైనచోటు, నిరుపాధి = ఉపాధిలేనిది - నిర్వికారమైనది, పరమపదము = ఉత్కృష్టస్థానము. 186 నిరత...తంత్రులు = ఎడతెగని అష్టాక్షర విద్యయందలి యాసక్తిగల వారు, చిత్సు...నిత్యాత్ములు = జ్ఞానామృతమును అనుభవించునట్టి చెడనిమానసములు గలవారు. 187 విష్ణు...నిష్ఠ్యూత = విష్ణుదేవుని కాలిబొటనవ్రేలిచే ఉమియఁబడినది - విష్ణుపాదమునందు = పుట్టినది, త్రిలోకా...భూత = మూఁడులోకములకు నాధారమైనది, దేవాంగనా...కారణ=దేవ తాస్త్రీలను విహరించుటకొఱకు పిలుచునది - దేవతాస్త్రీలకు క్రీడాస్థానము అనుట, నిర్భంగ... జాల=భంగము పొందని (అణఁపఁబడిన) అలలనెడి యుయ్యాలలయందు ఊఁగుచున్న హంసల గుంపులుగలది, సర్వజ్ఞుండు = అంతయుఁ దెలిసినవాఁడు, వ్యోమ...మండిత = ఆకాశమే శిఖ గాఁగల వాఁడైన శివునియొక్క జడముడి యను కిరీటమునకు అలంకారమైనది, సంతత...పరాయణులు = ఎల్లప్పుడు ప్రాణాయామమునందు ఆసక్తులైనవారు, పరిపూతము = పరిశుద్ధము, ఆలోకించుచున్ = చూచుచు - సమీపించియనుట, అష్టాశీతి...విస్తీర్ణంబు = ఎనుబదియెనిమిదివేల ఆమడల విరివిగలది, శశాంకమండలంబు = చంద్రమండలము, ఆప్లావనంబు = అంతట తడిసినదానిఁగా, తదీయ... తోడన్ = ఆచంద్రునివైన కిరణములనుండి కాఱుచున్న అమృతధారా ప్రవాహముయొక్క తెల్లఁ దనముచేత తళతళయనెడు కాంతులతో, కనకాచలంబు మీఁదన్=మేరుపర్వతముమీఁద, సీతా... ధానంబులన్=సీత అలకనంద చక్షువు భద్ర అను పేళ్లచే, వాహినీచతుష్టయంబు = నాలుగునదులు,

నంద సకలలోకానంద యగుచు దివ్యశతవత్సరంబులు త్రిపురమర్దను కపర్దంబున భరియింపంబడి తపోమహత్వసాధితమనోరథుం డైనభగీరథుని ప్రయత్నంబునం జేసి మహీమండలంబున కవతరించి కపిలవిపులకోపాటోపవహ్నిజ్వాలామాలికా దగ్ధగాత్రు లైనసగరపుత్రులఁ బరమపవిత్రులఁజేసి దక్షిణాసముద్రంబునం గలసె నట్టి భాగీరథీతీరంబున. 187

ఉత్సాహ. దేవదేవుఁ డైనవాసుదేవుఁ డెల్లనాడుఁ ద
త్పావనైకతీరములఁ దపంబు లర్థిఁ జేయుభూ
దేవకోటికెల్ల ముక్తితెరువు చూపుచుర్ రమా
దేవితోడఁ గూడియుండు దేవకోటి గొల్వఁగాన్. 188

ఉ. గంగకుఁ బోయి యం దుచితకర్మగతిర్ మనుజుండు పుణ్యరూ
పాంగము లైనకాలములయందుఁ దిలోదకపిండదానముల్
సంగతభక్తితోడ నొకసారి యొనర్చినఁ దత్కులంబు ని
ర్భంగపవిత్రతామహిమ పాటిలనుండు ననేకకాలముల్. 189

క. శాంతిగ ద్వీపాంతరదేశాంతరముల నుండియైన యాగంగ మదిర్
జింతించిన జన్మత్రయ, సంతాపము లెల్లఁ బాసి చను మనుజులకున్. 190

క. గంగానది గంగానది, గంగానది యనుచు రేపకడ మేల్కనుచుర్
గంగానదిఁ బ్రణుతించిన, మాంగల్యసుఖంబు లెల్ల మనుజుల కొదవున్. 191

వ ఇట్లు త్రైలోక్యపావని యైనగంగానదికి జన్మస్థానంబైన విష్ణుపదంబున. 192

---

పరమపావనంబుర్ = మిక్కిలి పవిత్రమునుగా, సకలలోకానంద = ఎల్లలోకములను సంతోషింపఁ జేయునది, దివ్య...వత్సరంబులు = నూఱుదేవతా సంవత్సరములు, త్రిపురమర్దను కపర్దంబునర్ = శివునియొక్క జడముడియందు, తపో...మనోరథుఁడు=తపస్సుయొక్క మహిమచేత సాధింపఁబడిన కోరికకలవాఁడు - అధికతపస్సుచేసి కోరికను నెఱవేర్చుకొన్నవాఁడు, అవతరించి = దిగి, కపిల...గాత్రులు = కపిలమహామునియొక్క మిక్కుటమైన కోపముయొక్క విజృంభణముచేత కలిగిన నిప్పుమంటల వరుసలచేత కాలినదేహములుగలవారు, పరమపవిత్రులర్ = మిక్కిలి పరిశుద్ధుల నుగా. 188 ఎల్లనాడు = ఎల్లప్పుడు, తత్పావనైకతీరములర్ = దానిదైన కేవలము పరిశుద్ధము లైన దరులయందు, అర్థిర్ = అనురక్తితో, భూదేవకోటికిర్ = బ్రాహ్మణ సమూహమునకు, ముక్తి తెరువు = మోక్షమార్గమును, రమాదేవితోడర్ = లక్ష్మీదేవితో, కొల్వఁగార్ = సేవింపఁగా. 189 ఉచితకర్మగతిర్ = తగిన కర్మలను నడపునట్టి విధముతో, పుణ్యరూపాంగములు = పుణ్యమును నిరూపించునట్టి స్వరూపముగలవి, తిలోదకపిండదానములు=నువ్వులునీళ్లు విడుచుటయు పిండములు పెట్టుటయును, సంగత = పొందిన, నిర్భంగ...మహిమ = కొఱఁతలేని పరిశుద్ధత్వముయొక్క మేలిమి, పాటిలర్ = కలుగఁగా. 190 శాంతిగర్ = ఓర్పుతో, చింతించినర్=ధ్యానించినను, జన్మత్రయ సంతాపములు = మూఁడు జన్మములయందలి దుఃఖములు, పాసిచనుర్ = తొలఁగిపోవును. 191 రేపకడర్ = ప్రాతఃకాలమున, ప్రణుతించినర్ = స్తోత్రముచేసినయెడ, మాంగల్యసుఖంబులు=శుభమును సౌఖ్యమును, ఒదవుర్ =కలుగును. 192 త్రైలోక్యపావని = మూఁడులోకములను పరిశుద్ధ

మ. అతులాకాశము సర్వముం దనమయంబై కాలచక్రంబుతో
సతతంబుం హరి నాత్మలో నిడి యథేచ్ఛం శింశుమారప్రజా
పతి త్రైలోక్యసమున్నతిం మకరరూపవ్యక్తిమై యుండు వి
స్తృతుఁడై మీఁద ధ్రువుండు దావెలుఁగుఁ దత్పుచ్ఛాగ్రదేశంబునన్. 193

తే. సతతమును శింశుమారాఖ్యచక్ర మెపుడు
చంద్రసూర్యగ్రహాదినక్షత్రసమితిఁ
ద్రిప్పుచును దాను నొక్కటఁ దిరుగుచుండు
నన్నిటికి మీఁద ధ్రువుఁడును నట్ల తిరుగు. 194

వ. సూర్యచంద్రగ్రహనక్షత్రతారకాగణంబులు వాయునాళంబులచేత ధ్రువుని యందు దృఢబంధంబులై యుండును. 195

క. మును శింశుమారుఁ డబ్జాక్షునకుఁ దపం బాచరించి జ్యోతిశ్చక్రం
బున నిల్చె ధ్రువుఁడు నవ్విధ,మునఁ గొల్చి తదీయపుచ్ఛమున విలసిల్లెన్. 196

వ. కావున సర్వాధ్యక్షుం డైనపుండరీకాక్షుండు శింశుమారచక్రంబునకు నాధారంబు శింశుమారుండు ధ్రువునకు నాధారంబు ధ్రువుండు సూర్యునకు నాధారంబు సూర్యుండు సదైవాసురమానుషంబైనలోకంబునకు నాధారంబై సమస్త భూతంబుల నన్నపానాదులఁ బరితృప్తులం జేయు నెట్లనిన. 197

చ. ఎనిమిదిమాసముల్ రవి మహీవలయంబునఁ గల్గుతోయముల్
దనకిరణంబులందుఁ గొని తక్కినమాసచతుష్టయంబునం
ఘనతరవృష్టిరూపములుగా జలముల్ గురియింప లోకమె
ల్లను బరితృప్తిఁ బొందును జలంబును నన్నముఁ గల్గి పెంపుతోన్. 198

సీ. కాలాత్ముఁ డైనభాస్కరదేవుఁ డాత్మీయచండాంశువులచేత జగతియందుఁ

---

ములనుగాఁ జేయునది. 193 తనమయంబు = తనయొక్క స్వరూపమునే అంతటఁ గనఁబఱుచునది, యథేచ్ఛం = ఇచ్చవచ్చినట్టు, త్రైలోక్యసమున్నతిం = మూఁడులోకములకు మీఁదిపొడువున, మకరరూపవ్యక్తిమై = మొసలిరూపముయొక్క తేలివిడితో - మొసలిరూపుతో, విస్తృతుఁడు = గొప్ప ఆకృతి గలవాఁడు, తత్పుచ్ఛాగ్రదేశంబునం = ఆశింశుమారప్రజాపతియొక్క తోఁక కొనయైనచోట. 194 శింశుమారాఖ్యచక్రము = శింశుమారము అను పేరుగల చక్రము, సమితిం = సమూహమును, ఒక్కటం = ఒక్కసారిగా. 195 వాయునాళంబులచేం = గాలిత్రోవులచేత, దృఢబంధంబు = గట్టికట్టుగలది. 196 అబ్జాక్షునకుం = విష్ణువునుగూర్చి, జ్యోతిశ్చక్రంబునం = నక్షత్రమండలమునందు. 197 సర్వాధ్యక్షుండు = అన్నిటికి నధిపతి, సదైవాసురమానుషము=దేవతలతోడను అసురులతోడను మనుష్యులతోడను గూడినది, భూతంబులం = ప్రాణులను. 198 రవి= సూర్యుఁడు, మహీవలయంబునం = భూమండలమునందు, తోయములు = నీళ్లను, వృష్టి=వాన, పరితృప్తిం = తనివిని, పెంపుతోం = అభివృద్ధితో. 199 కాలాత్ముఁడు = కాలస్వరూపుఁడు, చం

గలిగిన సకలోదకములుఁ బీలిచి దెచ్చి యమృతాంశుమండలమందు నునుచు
నాయబ్జవైరియు వాయునాళంబుల నాకాశభాగంబునందు దాఁచు
మారుతసలిలధూమజ్యోతి సంయోగమునఁజేసి జలధరంబులు జనించి
తే. వృష్టిసంస్కారకాలప్రవృత్తివలన, వాయుబంధంబులెల్లను వదలి నింగి
నున్న జలములు చెందుఁ బయోధరముల, దానఁజేసియు జగతిని వాన గురియు.
మ. పొరి నూర్ధ్వాభిముఖంబులైనరవిదీప్తుల్ దివ్యగంగాసము
త్కరతోయంబులు పీల్చి తెచ్చి ధరమీఁదన్ జల్లుగాఁ జల్లినన్
ధరణీముఖ్యసమర్క్షనక్షత్రములు నబ్దశ్రేణి లేకుండియున్
దొరఁగున్ వృష్టి తదీయపుణ్యజలబిందుస్నానముల్ దివ్యముల్. 200
ఉ. కృత్తికనుండి బేసి యగు ఋక్షములందుఁ బయోధరావలీ
వృత్తి యొకండు లేక మహి వృష్టిమయంబగు దిగ్గజంబు లు
ద్వృత్తిమెయిన్ వియత్తలనదిన్ విహరించుచు నీరుచల్లు వి
ప్రోత్తమ దివ్యతీర్థ మది యోగ్యము స్నానముసేయఁ గల్గినన్. 201
క. మేఘములు గురియు వాన ల,మోఘములై భూమిభాగమున నిండినస
స్యౌఘంబులు నోషధులు ని,రాఘాటములై జనించునట్లుగఁ జేయున్. 202
చ. అవి ఫలపాకసాధకములై యభివృద్ధి వహింపఁజేయుచున్
భువనములం బ్రజాజననపోషణకారణహేతుకంబులై

---

డాంశువులచేతన్=తీక్ష్ణములైన కిరణములచేత, పీలిచి = ఆకర్షించి, అమృతాంశుమండలమునందున్ = చంద్రబింబమునందు, ఉనుచున్ = ఉంచును, అబ్జవైరి = చంద్రుఁడు, మారుత...చేసి= వాయువు ఆవిరి వెలుఁగు వీనియొక్క కూడికచేత, జలధరంబులు = మేఘములు, వృష్టి...వలనన్ = వాన చక్కఁగాఁ గురియఁదగిన కాలముయొక్క రాకచేత, వాయుబంధంబులు = గాలివలని నిర్బంధములు, నింగిన్ = ఆకాశమునందు, చెందుఁబయోధరములన్ = మేఘములయందు పొందును, దానఁజేసియు = దానిచేతను, జగతిని = భూమియందు. 200 పొరిన్ = క్రమముగా, ఊర్ధ్వాభిముఖములు = మీఁదితట్టునకు తిరిగినవి, రవిదీప్తులు = సూర్యకాంతులు, జల్లుగాన్ = దట్టపుచినుకులు గలవానగా, ధరణీముఖ్య = భూమియందు శ్రేష్ఠుఁడైనమైత్రేయుఁడా, సమర్క్షనక్షత్రములన్ = రోహిణ్యాది సమనక్షత్రములయందు సూర్యుఁడుండునపుడు పగళ్లయందు, అబ్దశ్రేణి = మేఘపఙ్క్తి, తొరఁగున్ = స్రవించును - వర్షించును, తదీయజలబిందుస్నానములు = ఆ కురియునట్టి జలబిందువులచేతనైన స్నానములు, దివ్యములు = స్వర్గసంబంధులు గనుక దివ్యాఖ్యములు, ఇట్టి దివ్యస్నానము చేసినవానికి నరకములేదని చెప్పఁబడియున్నది. 201 బేసి = విషమము, ఋక్షములందున్ = నక్షత్రములయందు, పయోధరావలీవృత్తి = మేఘపఙ్క్తియొక్క వ్యాపారము, ఒకండున్ = ఒకటియును, వృష్టిమయము = వానచేనిండినది, ఉద్వృత్తిమెయిన్ = నిక్కుతో, వియత్తలనదిన్ = ఆకాశగంగయందు. 202 అమోఘములు = మొక్కపోనివి = తక్కువకానివి, సస్యౌఘంబులు = పైరుల సమూహములు, ఓషధులు = మూలికలు, నిరాఘాటములు = అడ్డిలేనివి. 203 ఫలపాకసాధకములు = ఫలసిద్ధినిచేయునవి, భువనములన్ = లోకములయందు, ప్రజా..., హేతుకంబులు =

యవిరళవృత్తి నొందునట్టులైన నిమిత్తము విప్రకోటిచే
సవనములెల్ల నెల్లెడల సాగు సుపర్వులు తృప్తిఁ బొందఁగన్. 203

ఉ. కావున నిజ్జగంబుల మఘంబులు వేదములున్ వసుంధరా
దేవముఖైకవర్ణములు దేవతలుం బశుపక్షియక్షవృ
క్షావలిమేరగాఁగ సచరాచరకోటులు వృష్టిచేతఁ గా
దే వహియింపఁ బెంపలరె వృష్టికి మూలము భానుఁ డెమ్మెయిన్. 204

ఆ. ఇనుని తేరు నూటయెనుబదిమండల, గతుల నడచు నుభయకాష్ఠలందు
నయనకాలవశత నారోహణావరో,హములవలన వత్సరముల నెపుడు. 205

క. నెలనెల నినునరదము తప,సులు యక్షులు నా దివౌకసులు భుజగులు దై
త్యులు నచ్చరలును గంధ,ర్వులు రక్షింపంగ భాస్కరుఁడు వెలుఁగొందున్. 206

క. హరిదివ్యశక్తి పెంపున, సరసీరుహబాంధవుండు సప్తగణములుం
బరివేష్టింపఁగఁ దేజో,త్కరుఁడై లోకముల యంధకారం బడఁచున్. 207

సీ. ఆదిత్యు లధిపతులై యుందు రావాలఖిల్యాదిమౌనులు కీర్తనములు
సేయుదు రప్సరస్త్రీలు నాట్యము లాడుదురు పరివారమై బెరసి పనులు
గావింతురు సురలు ఘనభుజంగాధిపు లరదంబునకు మోకులై వహింతు
రరుదొప్ప గంధర్వవరులు పాడుదురు యక్షులు సమస్తంబు గైకొని భరించి

తే. నడుపుచుండుదు రిబ్భంగి నలినహితుఁడు, శీతఘర్మాంబురోచులచేత విష్ణు
దివ్యశక్తిప్రభావసందీప్తుఁ డగుచు, నఖిలలోకంబులకుఁ దానయై చెలంగు. 208

వ. అనిన మైత్రేయుం డిట్లనియె. 209

ఉ. భానుని తేరు నీ విపుడు పల్కిన సప్తగణంబులన్ సమా
ధానములన్ భరింప నతితాపహిమాంబుచయంబు దీప్తుఁడై
పూని వెలుంగునంచు మునిపుంగవ నీ విపు డానతిచ్చిన
ట్లైనఁ బయోజబాంధవుమహత్త్వము లేదని చెప్పవచ్చునే. 210

---

ప్రజలయొక్క పుట్టుకకును బ్రతుకుటకును కారణములైన క్రియలకు నిమిత్తములు, అవిరళవృత్తిన్ = స్థిరమైన వర్తనమును, సవనములు = యజ్ఞములు, ఎల్లెడలన్ = సర్వప్రదేశముల యందును. 204 మఘంబులు = యజ్ఞములు, వసుంధరా...వర్ణములు = బ్రాహ్మణాది ముఖ్యవర్ణములు, మేరగాన్ = ఎల్లగా - తుదగా, మూలము = ఆదికారణము. = 205 ఉభయకాష్ఠలందున్ = దక్షిణోత్తరదిక్కులు రెంటియందును, ఆరోహణావరోహములవలనన్ = ఎక్కుట దిగుటవలన. 206 దివౌకసులు = దేవతలు. 207 సరసీరుహబాంధవుండు = సూర్యుఁడు, సప్తగణములున్ = తపసులు మొదలయిన యేడ్గురి సమూహములును, పరివేష్టింపఁగన్ = చుట్టుకొనఁగా, తేజోత్కరము = వెలుఁగు గుమి, అంధకారము = చీఁకటిని. 208 బెరసి = చుట్టుకొని, భుజంగాధిపులు = సర్పరాజులు, అరదంబునకున్ = రథమునకు, నలినహితుఁడు = సూర్యుఁడు, శీతఘర్మాంబురోచులచేతన్ = చల్లవేడినీళ్లరూపమైన కిరణములచేత, సందీప్తుఁడు = లెస్సగా ప్రకాశించువాఁడు. 210 అతితాపహిమాంబుచయంబున్ = మిక్కిలియుష్ణమును శీతలమునైన నీటిసమూహమును, దీప్తుఁడు = వెలుఁగునట్టి

వ. అనినఁ బరాశరుం డిట్లనియె 211

చ. అమరులలోన నామిహిరుఁ డారయ నేమిగ నెక్కుడయ్యె నా
కమలహితుం డనంగ నధికారితనం బొనరించునంతమా
త్రమె యగు నమ్మహాత్ముని ప్రతాపముఁ దేజము నెట్లుగల్గినన్
గమలభవాండమధ్యమునఁ గ్రమ్మినచీఁకటిఁ బాపనోపునే. 212

క. సప్తగణపరివృతుఁ డగు, సప్తాశ్వుఁడు నామధేయసాక్షి యగుచు సం
ప్రాప్తీకృతహరితేజో, దీప్తుండై వెలుఁగఁజేయు ధృతిలోకంబుల్. 213

తే. ఆదినారాయణాంశంబులై వెలుంగు, ఋగ్యజుస్సామవేదంబు లినునిమూర్తి
నుండి ప్రకటంబులై ప్రాతరాదులైన, మూఁడుకాలంబులును దేజమునఘటించు.

శా. భూదేవోత్తమ భూరిపావకశిఖాపుంజంబునన్ సంభవం
బై దీపం బొకయిక్కనుండి గృహమధ్యధ్వాంతమున్ బాపిన
ట్లాదామోదరుదీప్తిలో బహుసహస్రాంశంబు మార్తాండునం
దాదింబెట్టి మహాతమంబడఁచు బ్రహ్మాండాంతరాళంబునన్. 215

వ. కావునఁ జైత్రాదులైనద్వాదశమాసంబులఁ బ్రత్యేకంబ దేవర్షియక్షరాక్షసగంధర్వోరగాప్సరోగణంబులచేతఁ బరివృతుండై శీతోష్ణజలంబులు కిరణంబులుగా విష్ణుతేజోవిరాజితుండై దేవపితృమనుష్యలోకంబులకు నాప్యాయనంబు సేయుచుండును. అట్టిసూర్యకిరణములందు సుషుమ్న యనుకళ సుధాకరమండలంబునకు నభివృద్ధిభూతయై యుండు. 216

చ. అమృతమయంబులైనజలజాప్తమయూఖములం బ్రవృద్ధమై
యమరినచంద్రమండలసుధామృతమున్ సురకోటికృష్ణప
క్షమున భుజించి పెద్దయు వికాసము నొందునతండు శుక్లప

వాఁడు, పయోజ...మహత్వము = సూర్యునిమహిమము. 212 మిహిరుఁడు = సూర్యుఁడు, ప్రతాపము = పేంఢ్రము, తేజము = తేజస్సును, కమల...మధ్యమునన్ = బ్రహ్మాండమునడుమ, క్రమ్మిన= క్రమ్ముకొనిన. 213 సప్తాశ్వుఁడు = సూర్యుఁడు, సంప్రాప్తీ...దీప్తుఁడు = పొందఁబడినదిగాఁ జేయఁబడిన శ్రీహరియొక్క తేజస్సుచేత వెలుఁగునట్టివాఁడై. 214 ఇనుని = సూర్యునియొక్క, ప్రకటంబులై = ప్రసిద్ధములై, ప్రాతరాదులు = ప్రాతఃకాలము మొదలైనవి, ఘటించున్ = కూర్చును. 215 భూరి...పుంజంబునన్ = విస్తారమైన నిప్పుమంటల సమూహమునందు, సంభవంబై = పుట్టినదై, ఇక్కన్ = స్థానమునందు, ధ్వాంతమున్ = చీఁకటిని, దీప్తిలోన్ = ప్రకాశమునందు, మార్తాండునందున్ = సూర్యునియందు, మహాతమంబు = గొప్పచీకటిని, అంతరాళంబునన్ = మధ్యప్రదేశమునందు. 216 విష్ణుతేజోవిరాజితుండు = విష్ణుతేజస్సుచేత ప్రకాశించువాఁడు, ఆప్యాయనంబు = తనుపును, సుధాకరమండలంబునకున్ = చంద్రబింబమునకు, అభివృద్ధిభూత = అభివృద్ధినిచేయునది. 217 జలజాప్తమయూఖములన్ = సూర్యకిరణములచేత, ప్రవృద్ధమై = చక్కగా పెరిగినదై, చంద్ర...సుధామృతమున్ = చంద్రబింబమువలనఁ గలిగి స్వచ్ఛమైన యమృతమును, పెద్దయున్ = మిక్కిలి, వికాసము నొందున్ = వికసించును,

క్షమున దివాకరప్రభలు గైకొని పుష్టివహించు నెంతయున్. 217

ఆ. అమృతకిరణువలన నర్ధమాసము తృప్తి, దేవతలకు మాస తృప్తి సకల
పితృగణములకును సతతంబు తృప్తిమ, ర్త్యులకు నమృతమయమయూఖములను.

సీ. వనజారితేరియశ్వంబు లంభోగర్భసంభవంబులు కుందసన్నిభములు
మిథ్యాక్రమంబులై మెఱయుచు నౌత్తానపాది యాధారమై పటురయమున
సంచరించుచు నుండు సవ్యాపసవ్యభాగంబుల నారెండు కల్పకాల
పర్యంతమును దృఢబంధంబులై పంకజాప్తునియరదంబు హరులయట్ల.
తే. యుండు నాసీతకరుని మయూఖసమితి, హానివృద్ధులనుండు నుష్ణాంశునట్టు
లంబుసంభూత మైనయాయమృతకరుని, పుష్టికారణభూతమై పొలుచు నినుఁడు.

క. అందంద గృష్ణపక్షము, నందుఁ గళాశేషముగ సుధాంశము లగు న
య్యిందుకళలు పదియేనును, బృందారకకోటిచేతఁ బీతమగుఁ జుమీ. 220

ఆ. అమృతమయము లైనయర్కునికిరణంబు, లొనర శుక్లపక్షమునఁ బదేను
తిథులయందు వరుస ద్విజరాజుఁ దృప్తి గావించు దానఁ గళలు వృద్ధిఁ బొందు.

క. సితకరునిపదేనవకళ, పితృగణములచేత నెల్లఁ బీతంబగుటన్
క్షితిదేవముఖ్య యమవస, పితృతిథి యని చెప్పఁబడును బెద్దలచేతన్. 222

చ. అమవసనాఁడు చంద్రుఁడు లతావలియందు వసించి మ్రాఁకులం
దమృతము నించి సూర్యగతుఁడై చనుఁ గావున నెవ్వఁడేని ప
త్రము కొనగోరఁ గిల్లినను బ్రాహ్మణహత్య యొనర్చినట్టిపా
పమున నధోగతిం బడి విపద్దశ నొందు ననేకకాలమున్. 223

---

దివాకరప్రభలు = సూర్యకిరణములు, పుష్టివహించున్ = బలియును. 218 అమృతకిరణువలనన్ = చంద్రునివలన, అమృతమయ = అమృతస్వరూపములైన, మయూఖములను = కిరణములచేత, 219 వనజారి = చంద్రునియొక్క, అంభోగర్భసంభవంబులు = జలగర్భమునఁబుట్టినవి—జలమయము లనుట, కుందసన్నిభములు = మొల్ల పువ్వులనుబోలినవి, మిథ్యాక్రమంబులు = క్రమములేనివి - వెనఁ గొన్నవి, ఔత్తానపాది = ధ్రువుఁడు, పటురయమునన్ = మిక్కిలివేగమున, సవ్యాపసవ్యభాగంబులన్ = కుడియెడమతట్టులను, కల్పకాలపర్యంతమును = ప్రళయకాలమువఱకును, పంకజాప్తునియరదంబుహరులయట్లు = సూర్యునితేరిగుఱ్ఱములవలెనే, శీతకరుని, మయూఖసమితి = చంద్రకిరణసమూహము, ఉష్ణాంశునట్టులు = సూర్యునివలె, అంబుసంభూతము = నీటివలనఁబుట్టినది, అమృత... పొలుచున్ = చంద్రునిబలుపునకు హేతువైనదైయుండును. 220 అందంద = పునఃపునః - మరల మరల, కళాశేషముగన్ = ఒక్కకళయొక్కమిగులుగా, సుధాంశములు = అమృతభాగములు, ఇందుకళలు = చంద్రునికళలు, బృందారకకోటిచేతన్ = దేవతాసమూహముచేత, పీతము = పానము చేయఁబడినది. 221 ద్విజరాజున్ = చంద్రుని. 222 సితకరుని = చంద్రునియొక్క, అమవస = అమావాస్య. 223 లతావలియందున్ = తీఁగలపట్టులయందు, నించి = నిండించి, చనున్ =

సీ. పావకుం డాదిముప్పదిమూఁడుకోట్ల నిర్జరులును గృష్ణపక్షమున నాసు
ధాంశునికళలు పాయక పాన మొనరింప ద్వికళావశిష్టుఁడై దీప్తి యడఁగి
సూర్యమండలమునఁ జొచ్చు నాసూర్యేందుసంగమంబును సర్వసంజ్ఞమయ్యె
నాపర్వకాలంబునందుఁ బదేనవయమవసకళ భానునందుఁ గలియు
తే. నదినిమిత్త మమావాస్య యగుసుధాక
రుండు నాఁడెల్ల జలములోనుండి పిదప
లతలయందును భూరుహతతులయందు
నధివసించుఁ గళామాత్రుఁడై మునీంద్ర. 224
క. లతలును నోషధులును బశుతతులు మనుష్యులును మఱియుఁ దక్కినజంతు
ప్రతతియు బ్రతుకును ద్రిజగద్ధితనిర్మలమూర్తి యైనహిమకరువలనన్. 225
క. అనిలాగ్నిద్రవ్యంబుల, జనియించినరథమునను బిశంగాభములై
ఘనవాయువేగతురగము, లెనిమిది విలసిల్లనుండు నిందుజుఁ డెలమిన్. 226
క. సోపాసంగంబుగ నపరూపం బగుపడగతో హారులతో మిగులన్
దీపించుదివ్యరథమున, నేపారును దనుజమంత్రి యెంతయు గరిమన్. 227
తే. పద్మరాగవర్ణంబునఁ బరఁగు హారుల, తోడ నెనిమిదియంచుల దొరసి వహ్ని
సంభవంబైన కాంచనస్యందనంబు, నందు నంగారకుఁడు చెలువారుచుండు. 228
క. ఘనపాండురవర్ణములై, నెనిమిదిగుఱ్ఱముల నమరి హేమమయంబై
తనరినరథ మెక్కి గురుం, డొనరఁగ నేఁ డాది రాశినుండి చరించున్. 229
తే. శబళవర్ణంబులై నభస్సంభవంబు
లైనఘోటకములతోడఁ బూన్చు నరద

---

తగును - ఒప్పుననుట, పత్రము = ఆకు, విపద్దశన్ = ఆపదను. 224 పావకుండు = అగ్ని, నిర్జరులును = దేవతలును, సుధాంశునికళలు = చంద్రునికళలను, ద్వికళావశిష్టుఁడు = రెండుకళలచేత మిగిలినవాఁడు, దీప్తి = ప్రకాశము, సూర్యేందుసంగమంబును = సూర్యచంద్రులయొక్క చేరికయు, పర్వసంజ్ఞము = పర్వమను పేరుగలది, భూరుహతతులయందున్ = వృక్షసమూహములయందు, అధివసించున్ = నివసించును - ఉండును, కళామాత్రుఁడు = ఒకకళమాత్రముకలవాఁడు, 225 ప్రతతి = తతి - సమూహము, త్రిజగ...మూర్తి=మూఁడులోకములకు మేలుచేయునట్టి స్వచ్ఛమైన యాకృతి గలవాఁడు, హిమకరువలనన్ = చంద్రునివలన. 226 పిశంగాభములు=గోరోజనపువన్నెగలవి, ఇందుజుఁడు = చంద్రునికొడుకు - బుధుఁడు. 227 సోపాసంగంబుగనన్=అమ్ములపొదితోఁగూడినదిగా, అపరూపంబు = అపూర్వము, పడగతోన్ = టెక్కెముతోను, హారులతోన్ = గుఱ్ఱములతోను, ఏపారున్ = అతిశయించును, దనుజమంత్రి = శుక్రుఁడు. 228 పద్మరాగవర్ణంబునన్ = కెంపువన్నెతో, దొరసి = కలిసి, వహ్నిసంభవంబు = అగ్నివలనఁబుట్టినది, కాంచనస్యందనంబునందున్ = బంగారు రథమునందు, చెలువారు = ఒప్పు. 229 పాండురవర్ణములు=తెల్లని వన్నెగలవి, హేమమయంబు = బంగారుతోచేయఁబడినది, తనరిన = ఘనత కెక్కిన, ఏఁడాదిరాశినుండి=ఒక్కొక్క సంవత్సరము ఒక్కొకరాశియందుండి. 230 శబళవర్ణంబులు = చిత్రవర్ణముకలవి, నభస్సంభ

మెక్కి కడుమందవృత్తితో నినసుతుండు
మించి యత్యుగ్రుఁడై సంచరించుచుండు. 230

క. భృంగాభములై మెఱయుతు,రంగాష్టక మమరి ధూసరచ్ఛాయలచేఁ
బొంగారురథమునందుఁ జె,లంగును స్వర్భానుఁ డతివిలాసముతోడన్. 231

తే. పర్వములయందు రాహువు భానుచంద్ర, మండలగ్రసనములకు మలయుచుండు
*నొనరఁగా సూర్యశశధరు లున్న ఋక్ష,ములకుఁ దావచ్చినప్పుడ మొనసి పట్టు.

తే. అనిలవేగంబు లగుచు లాక్షాదిశోణ, వర్ణములతోడియెనిమిదివాహనముల
నమరి ధూమ్రపలాలవర్ణమునఁ దనరు, నరదముననుండి కేతుగ్రహంబు మెఱయు.

వ. ఇట్టి సూర్యాదినవగ్రహనక్షత్రతారాధిష్ణ్యాదులు ధ్రువునందు దృఢబంధంబు లైన వాయునాళంబు లాధారంబులుగా నుచితసంచారంబులుగాఁ బ్రవర్తిల్లుచుండు.

క. చక్రధరునాజ్ఞ జ్యోతి,శ్చక్రం బీరీతిఁ దైలచక్రముగతి ని
ర్వక్రముగఁ దిరుగుచుండు న,నుక్రమమున నాసమీరణునివశగతులన్. 235

శా. జ్యోతిశ్చక్రమునందుఁ దా నధికతేజోయుక్తమై లోకవి
ఖ్యాతిం జెందినశింశుమార మొనరంగా నర్థి నెవ్వారతి
ప్రీతిన్ రాత్రులు చూతు రాఘనులు గారే సార్వకాలంబు ని
ర్ధూతానేకకళంకులౌదురు మహాత్ముల్ వారి వర్ణింపఁగన్. 236

సీ. అనయంబు శింశుమారాకృతి నున్నజ్యోతిశ్చక్రమును దదధిష్ఠితార్క
చంద్రాదులును దివిజేంద్రాదిసురులును ధిష్ణ్యాదినక్షత్రదేవతలును

---

వంబులు = ఆకాశమునందుఁబుట్టినవి, ఘోటకములతోడన్ = గుఱ్ఱములతో, పూన్చునరదము = వహించునట్లు చేసినరథమును, మందవృత్తితోన్ = మెల్లనివర్తనముతో, ఇనసుతుఁడు = సూర్యుని కొడుకు - శనైశ్చరుఁడు, అత్యుగ్రుఁడై = మిక్కిలిభయంకరుఁడై. 231 భృంగాభములు = తుమ్మెద వన్నెగలవి - నల్లనివి, తురంగాష్టకము = గుఱ్ఱములయెనిమిది - ఎనిమిదిగుఱ్ఱములు, ధూసరచ్ఛాయలచేన్ = బూడిదవన్నెచే, పొంగారు = పొంగు - అతిశయించు, చెలంగును = ఒప్పును, స్వర్భానుఁడు = రాహువు. 232 భానుచంద్రమండలగ్రసనములకున్ = సూర్యచంద్రబింబములను మ్రింగుటకు - గ్రహణములకు అనుట, మలయుచుండున్ = ఉత్సహించుచుండును - తమకపడుచుండును, శశధరుఁడు = చంద్రుఁడు, ఋక్షములకున్ = నక్షత్రములకు, మొనసి = పూని. 233 అనిలవేగములు = గాలివడివంటివడిగలవి, లాక్షా...వర్ణములు = లత్తుకయెఱుపుచాయకలవి, ధూమ్రపలాలవర్ణమునన్ = పొగవన్నెయుపూరికట్టవన్నెయుఁగలసినవన్నెతో. 234 సగ్రహనక్షత్రతారాధిష్ణ్యాదులు=తొమ్మిదిగ్రహములయొక్కయు ఇరువదియేడునక్షత్రములయొక్కయు నక్షత్రస్థానములు మొదలగునవి, వాయునాళంబులు = గాలిత్రోవులు, ఉచితసంచారంబులుగాన్ = తగిన సంచారములు కలవిగా. 235 తైలచక్రముగతిన్ = గానుఁగవలె, నిర్వక్రముగన్ = వంకరలేక - సరిగా, సమీరణుని = వాయువుయొక్క. 236 శింశుమారము = శింశుమారచక్రమును, సార్వకాలంబు= ఎల్లప్పుడు, నిర్ధూతానేకకళంకులు = సమస్తదోషములును దూరముగా ఎగఁజిమ్మినవారు. 237 తదధిష్ఠితార్కచంద్రాదులు = దానియందు నిలిచినసూర్యుఁడు చంద్రుఁడు మొదలగువారు, విశ్వంభర =

*ఇందునందుండి సూర్యునియందు (?) నందునుండి సుధాకరునందు మెలఁగు. అని పాఠాంతరము.

విశ్వంభరయు మహాద్వీపంబులును బర్వతంబులు బహుసముద్రములు నదులు
వర్షంబులును బుణ్యవనదేశములు మానసాదిపుష్కరిణులు వేదములును
తే. భూర్భువాదిలోకంబులుఁ బుణ్యపాప, కర్మములు మేరగాఁ బద్మగర్భసృష్టిఁ
గలిగి నన్నియు నిందిరాకాంతుఁడైన, విష్ణుదేవునిరూపముల్ విప్రముఖ్య. 237
క. విష్ణుఁడె జ్యోతిశ్చక్రము, విష్ణుండే భువనగిరులు విష్ణుఁడె నదులన్
విష్ణుఁడె మహాపయోధులు, విష్ణుఁడె పూర్వాదిదిశలు విష్ణుఁడె జగముల్. 238
తే. సంయమీశ్వర యతులవిజ్ఞానమహిమ, వలన సకలంబు నైక్యభావము వహించి
నవి పృథగ్భేదరూపంబు లగుచు నామ,ధేయసంజ్ఞల వాగ్వృత్తిఁ దేజరిల్లు. 239
తే. పుడమిమన్ను ఘటత్వంబుఁ బొంది యదిక
పాలమై మఱి లోష్టరూపము వహించి
భాసపరమాణువృత్తులఁ బరఁగినట్టు
లొక్కటియుఁ బెక్కువిధముల నుల్లసిల్లు. 240
క. వనజభవుసృష్టివలనన్, జనియించిన యీ ప్రపంచసంచారము లె
ల్లను విష్ణుమూర్తులగు నైనను వస్తువిభేదవృత్తి నడుచు మునీంద్రా. 241
వ. అని యిట్లు సంక్షేపంబుగా సకలంబును బరమోపదేశంబు చేసిన యాచార్యునకు
శిష్యుం డిట్లనియె. 242

## జడభరతోపాఖ్యానము.

సీ. దురితదూరుఁడు భరతుండు సాలగ్రామతీర్థంబునకుఁ బోయి దివ్యయోగ
విద్యావిలాసుఁడై విష్ణుని పరమాత్ము భజియించి మునుముక్తిఁ బడయలేక
జన్మాంతరంబున సద్బ్రాహ్మణుండయ్యె నని మున్ను చెప్పితి రట్టులైన
విధమేమి యాతఁడు విప్రుఁడయ్యు గృహస్థధర్మంబు లైనబంధములఁ దగిలి
తే. యుండెనో కాక పరతత్త్వయోగవిద్య, నొంది కైవల్యసౌఖ్యంబు నొందెనో మ
హాత్మ యాచరితంబు నా కానతియ్యు,వలయు ననుటయు నిట్లనిపలికె నతఁడు. 243
మ. అకలంకప్రమదంబుతోడ భరతుం డారీతి సంసార మొ
ల్లక కైవల్యసుఖంబుఁ గైకొనఁగ సాలగ్రామతీర్థంబునం

సమస్తమును భరించునది - భూమి, వర్షంబులు = భరతవర్షము మొదలగునవి, పుష్కరిణులు = సరస్సులు, పద్మగర్భసృష్టిన్ = బ్రహ్మసృష్టియందు, ఇందిరాకాంతుఁడు = లక్ష్మీపతి - విష్ణువు. 238 మహాపయోధులు = గొప్పసముద్రములు. 239 ఐక్యభావము = ఒక్కటియగుట, పృథగ్భేదరూపంబులు = వేఱైనయితరరూపములు, 240 పుడమి = భూమి, ఘటత్వము = కుండతనము - కుండయగుట, భాస = తోఁచునట్టి, ఉల్లసిల్లున్ = ఒప్పును. 241 ప్రపంచసంచారములు = ప్రపంచమునందు సంచరించునవి, వస్తువిభేదవృత్తి = వస్తువులయందలిభేదవ్యాపారము. 243 దివ్య...విలాసుఁడు = ఉత్తమమైనయోగవిద్యయందు క్రీడించువాఁడు, భజియించి = సేవించి, ఆచరితంబు=ఆభరతునియొక్క చరిత్రమును. 244 అకలంకప్రమదంబుతోడన్ = కొఱంతలేని సంతోషముతో, కైవల్య సుఖంబున్ = పరమపదసౌఖ్యమును, ఇహసౌఖ్యోపాయంబులు = ఈలోకమునందు పొందఁ

దోఁకపుణ్యాశ్రమభూమి చేరి యిహసౌఖ్యోపాయముల్ చింతసే
యక నారాయణుదివ్యమూర్తియెడ సోహంభావముం జేయుచున్. 244
శా. ఈరీతిన్ మునివృత్తి గైకొని త్రిలోకేశుం జగత్పావనా
కారున్ సాగరకన్యకాకుచతటీకస్తూరికాపంకవ
త్సోరమ్యుం బరమాత్మునిం గొలుచుచున్ శుద్ధాత్ముఁడై సాత్త్విక
ప్రారంభీకృతపుణ్యకర్ముఁ డగుచున్ భాసిల్లె యోగీంద్రుఁడై. 245
ఉ. కేశవ పద్మనాభ హరి కృష్ణ జనార్దన వాసుదేవ య
క్షేశ సరోరుహాక్ష పరమేశ్వర యచ్యుత దేవ శ్రీహృషీ
కేశ యటంచుఁ జిత్తమున నెప్పుడుఁ బల్కుచు నుండుఁ గాని భూ
మీశుఁడు తప్పియైన నితరేతరవాక్యము లాడఁ డెన్నఁడున్. 246
క. హరిసంకీర్తన సేయుచు, హరిభక్తులగోష్ఠిఁ జెంది హరిపదపూజా
పరికరములు తగఁ గూర్చుచు, హరిసేవ దొలంగకుండె నతఁడు మునీంద్రా. 247
ఆ. కర్మహేతుకములు గానికర్మంబులు, నడపి పాశబంధనములు ద్రెంచి
సంగమంబు లుడిగి సకలజీవంబుల, యందు సమమనస్కుఁ డగుచు నుండె. 248
వ. అట్లుండి యమ్మహీపతి యొక్కనాఁడు మధ్యాహ్నసమయంబున నొక్కపర్వత సమీపంబునఁ బ్రవహించునట్టి పుణ్యనదీజలంబులఁ దీర్థంబాడి తత్తీరంబునఁ గాలోచితకర్మంబు లాచరించుచున్న సమయంబున. 249
ఆ. ఈననైన యొక్కయేణి నిరంతర, ప్రసవవేదనలఁ గరంబు నొచ్చి
యడవినుండి దప్పి నరుదెంచి నదిలోనఁ, దటియెఁ జొచ్చి నీరు ద్రావునపుడు. 250
క. కకుబంతఘూర్ణితోగ్ర, ప్రకటితలయకాలరుద్రపటునినదగతిన్

దగిన సౌఖ్యములకు అనుకూలమైన మార్గములను, చింతసేయక = విచారింపక - తలఁపక, సోహంభావమున్ = అదియేనేను అనుటను. 245 త్రిలోకేశున్ = మూఁడులోకములకు నీశ్వరుఁడైనవానిని, జగత్పావనాకారున్=లోకమును బవిత్రమునుగాఁ జేయునట్టి ఆకృతిగలవానిని,సాగర...రమ్యున్=లక్ష్మీదేవియొక్కవక్షస్థలమునందలి కస్తూరికలపముతోడిపొమ్ముచేతమనోజ్ఞుఁడైనవానిని, శుద్ధాత్ముఁడు = నిర్మలచిత్తముగలవాఁడు, సాత్త్విక...కర్ముఁడు=సత్వగుణప్రధానమైనప్రవర్తనముచేత ప్రారంభింపఁబడిన సుకృతకర్మలుకలవాఁడు, భాసిల్లెన్ = ప్రకాశించెను. 246 ఇతరేతరవాక్యములు=అన్యోన్యములైనమాటలు, (ఇచ్చట ఇతరసంబంధపుమాటలు అని అర్థమగుచున్నది.) 247 గోష్ఠిన్ = సభయందు, పరికరములు = ఉపకరణములు, (లేక) వస్తువులు, తొలంగక = విడువక. 248 కర్మహేతుకములు = వ్యాపారాంతరములకుకారణములు, పాశబంధనములు = (అపేక్షారూపకములైన) త్రాళ్లకట్టులు, త్రెంచి = తెగఁగొట్టి, సంగమంబులు = (ఇతరులతోడి) కూడికలు, జీవంబులయందున్ = ప్రాణులయందు, సమమనస్కుఁడు = సమబుద్ధిగలవాఁడు. 249 తీర్థంబాడి = స్నానముచేసి, కాలోచిత = వేళకుఁదగిన. 250 ఈననైన = ఈనునట్టికాలముసమీపించిన, ఏణి = ఆఁడుజింక, నిరంతర = ఎడతెగని, నొచ్చి = నొప్పినిపొంది - బాధపడి, దప్పిన్ = దాహముచేత, తటియెన్ = చేర - నీళ్లున్నచోటును చేరననుట. 251 కకుబంత...గతిన్ = దిక్కులకడలుతిరుగుడుపడునట్టిభయం

సకలప్రాణులు వెఱవఁగ, నొకసింహము ఘోరనాద మొనరించుటయున్. 251

తే. ఆపటుధ్వని విని యేణి యధికభీతి,తోడ నీరాన వెఱచి ప్రోత్తుంగలంఘ
నంబు గావించుటయును గర్భంబు పతన, మయ్యె నావాహినీసలిలాంతరమున.

చ. మృగియును నానదీజలసమీపమునం బడి చచ్చె మ్రానుతోఁ
దగిలి తదీయశాబకము దత్సలిలంబులఁ దేలి పోవఁగా
జగతివిభుండు చూచి విలసత్కరుణారసపూరితాత్మకుం
డగుచు రయంబునం జని ప్రియంబొదవం దరియందుఁ బెట్టినన్. 253

తే. కొంతసేపున కాయిఱ్ఱికొదమ లేచి, యల్లనల్లన మెలఁగుచు నాఁకటికిని
దల్లిచన్నులు గుడువంగఁ దత్తఱించు, చున్నఁగనుఁగొనియారాజయోగివరుఁడు.

తే. దాని ప్రాణంబు రక్షింపఁ దలఁపుచేసి
యతఁడు దనయాశ్రమమునకుఁ గుతుక మొదవఁ
దెచ్చి పోషించుచుండంగ దినదినంబు
వృద్ధిఁ బొందుచునుండెను విప్రముఖ్య. 255

క. నానాఁటికి మృగశాబం, బానరనాయకపరిగ్రహంబునఁ బొదలెన్
భానునిచే సితపక్షక,ళానిధి యభివృద్ధిఁ బొందులాగున ననఘా. 256

సీ. పూరిమేయఁగ దవ్వు వోయి బెబ్బులిపిండుదిగులునఁ గ్రమ్మఱఁ దిరిగివచ్చు
సారెసారెకుఁ దదాశ్రమసమీపంబున వేడ్కతో గంతులు వేయుచుండు
మలయుచు వచ్చి కోమలశృంగయుగ్మంబుచేత నెమ్మేనికండూతి దీర్చు
యోగాసనంబున బాగుమీఱఁగ నుండ మవ్వంపుఁదొడలపైఁ బవ్వళించుఁ

ఆ. బర్ణశాలచుట్టుఁ బరువులుపెట్టుచు, లేఁతయైన పూరిమేఁత మేయు
ననుదినంబు నిట్టు లామృగశాబంబు, ముద్దుచూపుచుండు మునివరునకు. 257

క. ఒక్కొకనాఁ డాఁకటితో, మిక్కిలి దూరంబు వోయి మృగశాబము ప్రా

---

కరమై ప్రసిద్ధమైన ప్రళయకాలపురుద్రమూర్తియొక్క గొప్పధ్వనివలెనే. 252 నీరానన్ = జలపానముచేయ, ప్రోత్తుంగలంఘనంబు=మిక్కిలియెత్తుగాదాఁటుటను, పతనమయ్యెన్ = దిగఁబడియెను, వాహినీసలిలాంతరమునన్ = ఏటినీళ్లలో. 253 మృగి = ఆఁడుమృగము, శాబకము = పిల్ల, తత్సలిలంబులన్ = ఆనదినీళ్లయందు, జగతివిభుండు = భూపతి - రాజు, విలస...పూరితాత్మకుఁడు = ఒప్పిదమైనదయారసముచేత నిండింపఁబడిన మనసుగలవాఁడు-మిక్కిలిదయగలవాఁడు, రయంబునన్ = శీఘ్రముగా. 254 కొదమ = పిల్ల, అల్లనల్లనన్ = మెల్లమెల్లఁగా, తత్తఱించుచున్నన్ = తమకపడుచుండఁగా. 255 తలంపుచేసి = తలఁచి, కుతుకము = కుతూహలము. 256 మృగశాబంబు = జింకపిల్ల, పరిగ్రహంబునన్ = పోషణచేతననుట, సితపక్షకళానిధి = శుక్లపక్షచంద్రుఁడు. 257 పూరి = గడ్డి, బెబ్బులిపిండుదిగులునన్ = పెద్దపులుల గుంపులవలని భయముచేత, మలయుచున్ = మసలుచు, కోమలశృంగయుగ్మంబుచేతన్ = లేఁతకొమ్ములజంటచేత, కండూతి = దురద, తీర్చున్ = పోఁగొట్టును, మవ్వంపు=మనోజ్ఞమైన, అనుదినంబు = ప్రతిదినమును. 258 ప్రాఁదెక్కినదాఁకన్ =

ద్దెక్కినదాఁక వనంబునఁ, జిక్కిన దుఃఖించు రాజు చిత్తములోనన్. 258

క. నెయ్యము నాకొనరించుచు, నియ్యాశ్రమభూమిఁ బాయ దేకాలము నేఁ
డయ్యో మృగశాబం బే, మయ్యెనొకో దుష్టమృగచయంబులచేతన్. 259

తే. సామవేదగానంబులు చదువుచున్న
బ్రహ్మచారులకరణిఁ జూపట్టు నిచట
బాలతృణకాండములు గానఁబడఁగ మేయ
కేలపోయెనొకో దూర మీమృగంబు. 260

వ. అని యనేకప్రకారంబులం జింతించుచు. 261

సీ. ఏణశాబకముచొప్పెంతయుఁ బరికించి నెమకంగఁ గొండొకనేల యరుగుఁ
గానలో మృగడింభకము వోవఁ బెంచిన యిట్టిదో యని పట్ట నేగుదెంచుఁ
దోరంబుగా మింట ధూళి రేఁగినఁ జూచి హరిణపోతము వచ్చెనని చెలంగుఁ
బొదలలో నేమేనిఁ గదలినఁ దనకురంగార్భకమో యని యాసఁ జెందు

ఆ. నెందునుండెనైన నింతకు రాకుండె, ననుచు మగిడివచ్చు నాశ్రమమున
కివ్విధమున నానరేంద్రయోగీశ్వరుఁ, డధికమోహయుక్తుఁ డగుచు నుండె. 262

మ. సుతులం గాంతల రాజ్యవైభవములం జుట్టాలనుం బాసి యు
న్నతకైవల్యపదంబుఁ గైకొనుటకే నారాయణుం గొల్చుచున్
ధృతి వర్తించు మహాత్ముఁ డాభరతధాత్రీభర్త యయ్యేణసం
గతదోషంబున మోహియయ్యె ఘనయోగధ్యాననిష్ప్రాప్తుఁడై. 263

వ. ఇవ్విధంబునఁ బూర్వపరిచితంబైన యోగసమాధి వదలి తదాసక్తచేతస్కుండై యుండి కొండొకకాలంబునకు దేహధారి గావున శరీరంబు విడుచుచుండి. 264

క. పెంచినమృగశాబము వీక్షించి తదాసక్తమైన చిత్తముతో నా
క్కించుకయు వివేకము మది, నెంచక బాష్పాంబుపూరనేత్రంబులతోన్. 265

క. ఆమృగపోతముఁ గన్గొని, యోముద్దులకుట్టి నిన్ను నొంటివిడిచి నా

---

మిక్కిలి ప్రొద్దుపోవునంతవఱకు. 259 నెయ్యము = స్నేహము - ప్రియము. 260 చూపట్టున్ = కనఁబడును, బాలతృణకాండములు = లేతగడ్డిపోఁచలు. 262 ఏణశాబకముచొప్పు = జింకపిల్ల జాడ, నెమకంగన్ = వెదక, కొండొక = కొంత, కానలోమృగడింభకము = అడవియందలిజింక పిల్ల, తోరంబుగాన్ = అధికముగా, మింటన్ = ఆకాశమునందు, హరిణపోతము = జింకపిల్ల, చెలంగున్ = సంతోషించును, కురంగార్భకము = జింకపిల్ల. 263 ధృతిన్ = ధైర్యముతో, ఏణసంగతదోషంబునన్ = జింకయొక్క సహవాసమువలని లోపముచేత, మోహి = మోహముగలవాఁడు, నిష్ప్రాప్తుఁడు = పొందనివాఁడు. 264 పూర్వపరిచితంబు = మునుపు అలవాటుపడినది, తదాసక్తచేతస్కుండు = ఆజింకపిల్లయందు ఆసక్తమైన మనసుగలవాఁడు. 265 బాష్పాంబుపూరనేత్రంబులతోన్ = శోకజలముల ప్రవాహముచేత నిండినకన్నులతో - కన్నులనిండ నీళ్లుపెట్టుకొనియనుట. 266 కుట్టి = బిడ్డ, పాటిలెన్ = కలిగెను. 267 అక్కునన్ = రొమ్మునందు, జాతి

కీమేను విడువఁ బాటిలె, నేమని దుఃఖింతు దైవ మెంతకుఁ దెచ్చెన్. 266

వ. అని బహుప్రకారంబుల నాయిఱ్ఱికొఱదమ నక్కునం గదియ నదిమి దుఃఖించుచు తదీయమోహపాశబద్ధుండై ప్రాణపరిత్యాగంబుచేసి దేహాంతరంబున జాతిస్మరత్వంబు గలిగి యేణసంగదోషంబువలన జంబూమార్గంబున నొక్కపుణ్యారణ్యంబున హరిణంబై జన్మించి పూర్వజన్మసంస్కారంబున నైనపుణ్యంబునం జేసి మాతృపరిత్యాగం బొనరించి. 267

క. సాలగ్రామమునకుఁ జని, తాలిమితోఁ బూర్వపరిచితం బగుయోగ
శ్రీలలితబుద్ధిఁ దప్పక, యాలీలఁ జరించుచుండె హరిణము తెలివిన్. 268

క. వెస వో నెండినయాకులు, గసువులు మేయుచును దేహగౌరవ మొకరీ
తి సమాప్తిఁ బొందఁజేయుచు, నసదృశగతి సంచరించు నామృగ మచటన్. 269

వ. ఇవ్విధంబున దేహయాత్రచేసి కొంత కాలంబునకు శరీరంబు విడిచి. 270

మ. సకలామ్నాయరహస్యవేది యగుచున్ శాస్త్రార్థతత్త్వజ్ఞుఁడై
ప్రకటజ్ఞానగరిష్ఠుఁడై యతులితబ్రహ్మజ్ఞుఁడై నిర్మల
స్వకులాచారపరాయణప్రముఖుఁడై జాతిస్మరత్వంబుతో
నొకవిప్రోత్తముఁడై జనించె ధరపై యోగీంద్రవంశంబునన్. 271

వ. ఇట్లు జన్మించి జడవేషంబునం బెరిగి యథాకాలంబునఁ గృతోపనయనుండై గురూపదేశమార్గంబు లైనవేదపాఠంబులు తనవివేకంబునకు నిస్సారభూతంబు లైనం దిరస్కరించి పూర్వజన్మంబున హరిణసంగతదోషంబున ననేకదుఃఖంబు లనుభవించినవాఁ డగుటం జేసి నిస్సంగహేతుకంబులును సకలజనావమానంబులును నైనకర్మంబు లాచరించుచు నుండి. 272

తే. యోగి ప్రచ్ఛన్నవృత్తిమై నుండకున్నఁ, బరమతత్త్వైకచింత కుపాధి పుట్టు
ననుచు మును పంకజాసనుఁ డానతిచ్చి, నట్టివేదార్థపద్ధతు లాత్మఁ దలఁచి. 273

మ. జడవేషంబును గ్రామ్యభాషలు నవిస్పష్టానులాపంబులుం
గడుమాలిన్యశరీరముం బటుపరాగాక్రాంతకేశంబులున్
బెడఁకుంజూపులు క్లిన్నదంతచయమున్ వెఱ్ఱాటలున్ బాటలున్

---

స్మరత్వంబు = పూర్వజన్మమునందు తానున్నవిధము తెలిసినతనము. 269 దేహగౌరవము = శరీరముయొక్క ఘనత. 271 ఆమ్నాయరహస్యవేది = వేదార్థరహస్యముల నెఱిఁగినవాఁడు, గరిష్ఠుఁడు = గొప్పవాఁడు. 272 యథాకాలంబునన్ = తగినకాలమున, నిస్సంగహేతుకంబులు = సంగములేమికి కారణములైనవి. 273 ప్రచ్ఛన్నవృత్తిమైన్ = మఱుఁగుపడిన వర్తనముతో, ఉపాధి = లోపము. 274 జడవేషంబు = మూఢునివేషమువంటి వేషము, గ్రామ్యభాషలు = అపభ్రంశపు మాటలు, అవిస్పష్టానులాపంబులు = చక్కఁగా తెలియఁబడక మాటికిమాటికి చెప్పినదానినే చెప్పుట, పటు...కేశంబులున్ = మిక్కిలి దుమ్ముకమ్మిన వెండ్రుకలును, బెడఁకుంజూపులు = బెదరు చూపులు, క్లిన్నదంతచయమున్ = తడిసినపండ్లసమూహమును - జొల్లుకాఱుటచేత తడిసినవనుట, దడఁబాటుందనమున్ = భ్రమించుస్వభావమును, స్ఫుటముగాన్ = చక్కఁగా (చూచువారికి) కనఁ

దడఁబాటుందనముం బరిస్ఫుటముగాఁ దా నుండెఁ బ్రచ్ఛన్నుఁడై. 274

ఆ. కడుపువెంట లాల గాఱంగ మాసిన, పాఁతగట్టి జనులు రోఁతపుట్టి
చేరకుండ నుపమ చేసె నాత్మజ్ఞాన, సిద్ధి వృద్ధిఁ బొందఁజేయుకొఱకు. 275

సీ. చదువు మానిపి బ్రహ్మచారులఁ దానును నిచ్చవచ్చినయాటఁ బెచ్చుపెరుగు
వేదవాదము సేయువిద్వజ్జనంబుల వీక్షించి నవ్వుచు వెక్కిరించు
నెల్లవారును దన్ను హేయంబు గావింప నపవిత్రకర్మంబు లాచరించు
వర్ణాశ్రమాచారవర్తనంబులు మాని యాహారవాంఛ యెందైనఁ దీర్చు
తే. జనులపరిభూతి నొందుచు సంతతంబు, నీచగుణముల నేకాకియై చరించు
జాల్మవేషంబుతోఁ బిశాచంబురీతి, వికృతభావంబుతో నుండు విప్రవరుఁడు. 276

వ. ఇట్లు బాలోన్మత్తపిశాచభావంబులు వైకొని కుల్మాషఖాద్యశాకవన్యఫలాదు లుపయోగించుచు దేహయాత్ర నడుపుచున్నంత తండ్రి పరలోకగతుం డగుట యును. 277

తే. భ్రాతృభ్రాతృవ్యబాంధవప్రతతులెల్ల
క్షేత్రకర్మంబు లొనరింపఁ జేనిపనికిఁ
దాను నొక్కొకవేళ ముందఱనె పోయి
యారబము సేయు మిథ్యాప్రయత్నమునను. 278

వ. మఱియు రూక్షపీనావయవగాత్రుండును జాడ్యకర్మఠుండును నై సకలజనోప కారం బైనయాహారవేతనాపరుండై సంస్కారసహితంబు లైనపనులు సమస్త జనంబులకుం జేయుచు సాధారణబ్రాహ్మణుండై వర్తించుచున్నంత నొక్కనాఁడు.

తే. వీరరాజనునృపతి వివేకశాలి
ప్రకటసంసారదుఃఖపరంపరలను
నలఁగి నిర్వాణసౌఖ్యంబునకుఁ దలంపు
చేసి సర్వంబు మది విసర్జించి యతఁడు. 280

బడుచుండఁగా. 275 లాల = జొల్లు, ఉపమ = ఉపాయము. 276 పెచ్చుపెరుగన్ = విజృంభించును, హేయంబు = రోఁత, అపవిత్రకర్మంబులు = అపరిశుద్ధములైన పనులు, ఎందైనన్ = ఎక్కడనైనను, పరిభూతిన్ = అవమానమును, జాల్మవేషముతోన్ = నీచవేషముతో. 277 ఉన్మత్త= పిచ్చివానియొక్కయు, కుల్మాషఖాద్యశాకవన్యఫలాదులు = గుగ్గిళ్లు కజ్జాయము కూరలు అడవియందలి పండ్లు మొదలగునవి, దేహయాత్ర = శరీరసంరక్షణమును. 278 క్షేత్రకర్మంబులు = సేద్యపుఁ బనులు, ఆరబము = పైరు. 279 రూక్ష...గాత్రుండు = పరుసనై బలిసినయవయవములతోడి దేహముగలవాఁడు, జాడ్యకర్మఠుండు = మోటుతనపు పనులు చేయువాఁడు, ఆహారవేతనాపరుఁడు= కడుపుకూటికి పనిచేయుటయందు ప్రియముగలవాఁడు, సంస్కారసహితంబులు = చక్కఁదనము చుటతోఁగూడినవి. 280 నిర్వాణసౌఖ్యంబునకున్ = మోక్షసుఖమునకు. 281. శిబికారోహణంబుచేసి=

వ బ్రహ్మవిద్యార్థియైన యిక్షుమతీతీరంబునఁ దపంబు చేయుచున్న కపిలమహాముని కడకుం జనువాఁడై శిబికారోహణంబుచేసి చనునప్పుడు. 281

క. ఆదివ్యయోగి నృపురథ, చోదకుచే నెంతయును బ్రచోదితుఁడై న
వోన్యదనవేతనుఁ డగుచును, మోదంబున రాజుశిబిక మూఁపునఁ దాల్చెన్. 282

వ. ఇట్లు వాహకులం గలసి తాను నందఱియట్ల యరుగుచుండి పురోభాగంబున నాత్మీయదృష్టి యుగప్రమాణదూరంబున నిలిపి మందమందగమనంబునఁ బోవుచుండి శిబిక జడిసి విషమంబుగా నరుగుచున్నం గనుంగొని రాజు వాహకులం బెక్కుమాటలు గోపించి విషమగమనంబు మాని నడువుం డనిన వార లిట్లనిరి.

తే. ఎవ్వఁడో కాని వీఁడు నరేంద్ర శిబిక
పూని మముఁ గూడి నడచి రా లేనికతన
జడియుచున్నది యనిన నాజనవిభుండు
మందహాసంబుతోడ బ్రాహ్మణునిఁ జూచి. 284

ఆ. త్రోవ నడిచి మిగుల దూరంబు వచ్చుట, పీఁక శిబిక మోవలేక మిగుల
నలసినాఁడవో ప్రయాసంబు నీకౌట, యెట్లు పీవరాంగ మింత గలిగి. 285

వ. అనిన బ్రాహ్మణుం డిట్లనియె. 286

క. బడలికయు లేదు త్రోవయు, నడచి యరుగుదేను శిబిక నాచేఁ బూన్పం
బడ దెట్లు నీవు చూచితొ, కడుబలిసినమేను నాకుఁ గలుగుట యెట్లో. 287

వ. అనిన రా జిట్లనియె. 288

క. ఇట్టివిధంబులు నిఖిలము, నెట్టనఁ బ్రత్యక్షముగను నీవలనను జూ
పట్టఁగ శిబికాభారం, బెట్టో లేదంచుఁ బలికి తిప్పుడు నాతోన్. 289

వ. అనిన బ్రాహ్మణుం డిట్లనియె. 290

క. విను నీవు శిబికనుండుట,యును నే నీభరముఁ దాల్చి యుండుటయును రెం
డును మిథ్య లెవ్వరెవ్వరి, నొనరఁగ భరియింతురో నరోత్తమ వినుమా. 291

సీ. పాదయుగ్మము వ్రేఁగు భరియింప వసుమతి జంఘలఁ బదపంకజములు పూనె
నూరువులను జంఘ లొనరంగఁ దాలిచె నూరువుల్ భరియించె నుదరభరము
వక్షస్థ్సలం బల్లవహియించె నుదరంబు వక్షంబు భుజగౌరవంబుఁ బూనె
శిబికభుజంబులచే భరింపఁగనుండె శిబికయుఁ దదుపలక్షితశరీర

తే. భారమెల్ల వహించె నిప్పాట నొక్క
రొకరిభారము భరియించుచున్న వారు

---

అందలము నెక్కి. 282 రథచోదకుచేన్ = రథముతోలువానిచేత - సారథిచేత, ప్రచోదితుఁడు= ప్రేరేపింపఁబడినవాఁడు, నవోన్యదనవేతనుఁడు = క్రొత్తకడుపుకూటివాఁడు. 283 ఆత్మీయదృష్టిన్ = తనచూపును, యుగప్రమాణ = కాఁడికట్టునంతటికొలఁదిగల, జడిసి = అదిరి, విషమంబుగాన్ = ఎగుడుదిగుడుగా. 284 మందహాసంబుతోడన్ = చిఱునవ్వుతో. 285 పీఁకన్ = అడఁకువతో, పీవరాంగము = బలిసినదేహము. 288 నెట్టనన్ =మిక్కిలి. 290 భరము = భారము, భరియింతురో= మోయుదురో. 291 యుగ్మము = జంట, వ్రేఁగు = భారము, జంఘలన్ = పిక్కలను, ఊరువులను=

నిన్ను నన్నును దక్కిన నిఖిలజంతు
వులఁ బృథివ్యాది యగుభూతములు వహించు. 292

ఆ. క్షితిగుణప్రవాహపతితమై యీభూత, పంచకంబు మెఱయుఁ బార్థివేంద్ర
సాత్త్వికాదు లైనసకలగుణంబులు, బహుళకర్మవశతఁ బరఁగుచుండు. 293

ఆ అట్టికర్మచయము లఖిలజంతువులందుఁ, గానఁబడు నవిద్యకలిమిఁ జేసి
యాత్మ మాయఁ బొరయ దక్షరంబతిశాంత, మగుచుగుణములందుఁదగులకుండు.

క. హానియు వృద్ధియు దేహా, ధీనంబులు గాని వసుమతీవర యాత్మా
ధీనములు గావు గావున, నే నేర్పునఁ బీవరుండ పీవంటి ననున్. 295

వ. ఈచెప్పినభూపాదజంఘాకట్యూరుజఘనోదరవక్షోభుజంబులచేత భరియింపంబడిన
యీశిబికాభారంబు నాకుఁ గల్గెనేని నీకుం గల్గుట తెల్లంబు. 296

క. తక్కక నీవును నేనుం, దక్కినభూతములు శిబిక ధరియింపఁగ నా
కొక్కనికి భార మగునని, యక్కజముగఁ జెప్పి తెట్టు లదితెలియదొకో. 297

క. విను మీశిబికాభారము, జననాయక భూమివృక్షశైలంబులలో
నొనరంగ నేపదార్థం,బునఁ బుట్టిన దది వివేకమున నెఱఁగితివా. 298

క. పురుషునికరచరణాదుల, భర మేమిటిచేతఁ దాల్పఁబడు నట్టులపో
నరవర శిబికాభారము, భరియించినవారు లేరు పరమార్థ మిలన్. 299

వ. అని పల్కి మౌనంబున నెప్పటియట్ల తదీయభారంబు వహించి చనుచున్న యవ్వి
ప్రుం జూచి శిబికావతరణంబుచేసి యతనిపాదంబుల వ్రాలి కరకమలంబులు
మొగిచి యిట్లనియె. 300

క. అనఘాత్మ శిబిక విడువుము, ననుఁ గృపతోఁ జూడు తప్పు నాయెడ లేశం
బును జెంద నీకు మెఱుఁగక, నను మోపించితి మదంబునను నీచేతన్. 301

ఆ. జాల్మవృత్తి నేల చరియించుచున్నాఁడ, వెందు కేగుదెంచి తెవ్వరీవు
నీకు నేల యిట్టినీచకర్మము సేయ, ననిన విప్రముఖ్యుఁ డతనిఁ జూచి. 302

తే. సోహమనువాక్యమేమియు నూహసేయ
వశము గా దుపభోగైకవాంఛలేక
యేలవత్తురు నృప దేశకాలవశతఁ
జేసి సుఖమును దుఃఖంబుఁ జేరుచుండు. 303

---

తొడలను, అల్ల=మెల్లఁగా - తాలిమితో ననుట, గౌరవంబు = గురుత్వము - భారము, ఇప్పాటన్ = ఈరీతిగా. 293 గుణప్రవాహపతితము = గుణపరిణామరూపమైన వెల్లువయందుపడినది, బహుళ కర్మవశతన్ = విశేషకర్మలను నడపుటయందలి యధీనత్వముతో. 294 అవిద్యకలిమిన్ = అజ్ఞానము కలుగుటచేత, జ్ఞానములేమిచేననుట, అక్షరము = చెడనిదైన పరబ్రహ్మము. 296 భూ...భుజంబులచేతన్ = భూమిపాదములు పిఱుఁదులు తొడలు మడికట్టు కడుపు ఱొమ్ము భుజములు వీనిచేత, తెల్లంబు = స్పష్టము. 297 తక్కక = తప్పక, అక్కజముగన్ = ఆశ్చర్యముగా. 300 శిబికా

క. వెలయఁగ ధర్మాధర్మం,బులు రెండును నధికసౌఖ్యమును దుఃఖంబున్
గలిగించు దేశకాలం,బులవలనను జంతువులకు భూవరముఖ్యా! 304

క. ధర ధర్మాధర్మంబులు, నరునకు నుపభోగకారణంబులు ధరణీ
వర ప్రాణికి నాగమన, స్ఫురణప్రయోజనము కొఱకె పో తలపోయన్. 305

వ. అనిన నమ్మహీవిభుండు. 306

తే. నీవు చెప్పినవన్నియు నిశ్చయార్థ
యుక్త లగు సోహ మనుమాట యొక్కటియును
జెప్ప శక్యంబు గాదని యిప్పు డాన
తిచ్చి తదియెట్లు చెప్పవే యిద్ధచరిత. 307

క. భూదేవ సోహ మనుపలు, కేదే నొకవస్తువందు నెమ్మెయిఁ జెప్పన్
రాదో యాత్మను జెప్పన్, రాదో యెఱిఁగింపు మనిన బ్రాహ్మణుఁ డనియెన్. 308

క. నరనాథ సోహ మనుపలు, కిరవొందఁగ నాత్మయందు నేఁ జెప్పఁదగున్
ధర దేహాదులయందును, బరమాత్మునిఁ జెప్పుటెల్ల భ్రాంతులు సుమ్మీ. 309

వ. జిహ్వాతాల్వధరోష్ఠపుటవ్యాపారంబులచేత నీశబ్దం బుచ్చరింపంబడుంగాని యహ మనుశబ్దంబు విషయభూతంబు గాదు గావునఁ దాల్వాదులు సోహ మనుశబ్దంబునకు స్వరూపంబులు గావు కరచరణమస్తకోదరాదులు గలశరీరం బాత్మ యని నిరూపించుట వివేకంబు గాదు. 310

క. నీకును నాకును దక్కిన, లోకులకును బరముఁడై త్రిలోకంబులయం
దేకాకారుం డగుసు, శ్లోకుఁడు గోచరుఁడు రాజ సోహ మనుటకున్. 311

చ. భువనములం దఖండపరిపూర్ణమహత్త్వముతోడ నేకమై
యవిరళవృత్తి నున్నపరమాత్మునిఁ గాదని బాహుమస్తకా
ద్యవయవయుక్తదేహములయందును సోహ మటంచు ధారుణీ
ధవ పలుకంగఁ గోరుట వృథా యగు నిత్యవివేకశాలికిన్. 312

ఆ. ధరణినాథ శిబిక దారువో వృక్షమో, యెఱిఁగికొనుము దారువేని ప్రజలు
నిన్ను దారువెక్కి యున్నాఁ డనరు వృక్షమైన వృక్ష మెక్కె ననరు సువ్వె.

క. దారుసమూహంబులచే, నీరీతి నొనర్పఁబడినయిది శిబిక యనన్
బేరు వహించెను నిను శిబి,కారూఢుం డనుచుఁ జెప్పనగు మనుజులచేన్. 314

క. ధరగలచరాచరంబుల, సరవిన్ భేదములు లోక సంజ్ఞార్థములై

---

వతరణంబుచేసి = అందలమునుండిదిగి. 305 ఉపభోగకారణంబులు = అనుభవించుటకు నిమిత్తములు, ఆగమనస్ఫురణ = వచ్చుటయొక్క తోఁచిక. 307 ఇద్ధచరిత = మేలైననడవడిగలవాఁడా. 308 ఎమ్మెయిన్ = ఏవిధముచేతను. 309 ఇరవొందఁగన్ = స్థిరముగా, ఆత్మయందునేన్ = ఆత్మయందయినయెడ. 310 జిహ్వా...వ్యాపారంబులచేతన్ = నాలుక దవుడ పెదవులు వీనియొక్కవ్యాపారములచేత. 312 అవిరళవృత్తిన్ = చేరికగలయునికిచేత, ముక్త=విడువఁబడిన. 313 దారువు=కొయ్య.

పరంగుం గాని యఖండపుఁ, బరమాత్మకు సంజ్ఞగాదు పార్థివచంద్రా! 315

తే. దేవతిర్యఙ్మనుష్యాదిదేహభిత్తు, లెవ్వియును నాత్మగాదు నరేంద్ర యీవి
కారదేహంబులెల్లను గర్మయోను,లనుచుఁ జెప్పుదు రప్పరమార్థవిదులు. 316

క. పలుమాఱు రాజభృత్యా,దులు వస్తువు లంటిమేని తొల్లిటితమసం
జ్ఞలు మాని యన్యనామం,బులఁ జెందెడుఁ గానఁ జెప్పఁబోలదు నియతిన్. 317

తే. అనఘ కాలంబువలన నామాంతరమునఁ
బొంద దెయ్యది యదియపో భూరివస్తు
వట్టివస్తువునకును బాల్యాదిసంజ్ఞ
లేమియును లేవు నీ వది యెఱిఁగికొనుము. 318

తే. ఎల్లప్రజలకు రాజగుఁ దల్లిదండ్రు,లకు సుతుం డగు సత్పుత్రులకును దండ్రి
తనదుభార్యకు మగఁ డగు ధరణినాథ, యిన్నిసంజ్ఞలు గలనిన్ను నెవ్వఁ డండ్రు.

తే. ఇట్టిసకలావయవములకెల్ల నన్యుఁ, డగుదువేనియు నహ మంట దగును నిట్లు
గాకయుండిన నెట్లు పల్కంగవచ్చు, నిది వివేకించి చూడు నరేంద్రచంద్ర. 320

వ. కావునఁ దత్త్వంబు పృథక్కరణనిష్పాద్యంబై యున్నయది సోహంభావన నెట్లు
సేయుదువని పరమార్థయుక్తంబుగా నుపన్యసించిన విని రాజు విచారవిభ్రాంత
చిత్తుండై యిట్లనియె. 321

తే. నీవు చెప్పినపరమార్థనిశ్చయముల,వలన నాచిత్త మేమియుఁ దెలివిలేక
యధికవిభ్రాంతి నొందినట్లగుచు నున్న,యది మహాత్మక నాసంశయంబు మాన్పు.

క. అనఘాత్మ మీరు నాకును, వినిపించిన యావివేకవిజ్ఞానము భూ
జనులందును బ్రత్యక్షం, బొనరించుచు నున్నయది సముజ్జ్వలవృత్తిన్. 323

వ. అదియట్లుండెఁ బరమార్థం బైనశ్రేయస్స్వరూపంబు నాకు నెఱుంగవలయు నేత
న్నిమిత్తంబుగాఁ బరమతత్త్వబోధకుండైనకపిలమహామునినడుగఁబోవుచున్నాఁడ
నమ్మహాత్మునకుం గలపరమార్థతత్త్వపరిజ్ఞానంబు మీయందును గలదు గావున
మిమ్ము నే నుపాసించెద నన్నుఁ బరిగ్రహించి నామనోరథంబు లీడేర్పం
డనినఁ బుడమిఱేనికి నప్పాఱుం డిట్లనియె. 324

క. ఎడపక పరమార్థము నన్నడిగెదవో శ్రేయ మిప్పు డడిగెదవో యే
ర్పడఁ జెప్పుమ శ్రేయంబులు, కడుఁ బరమార్థప్రదములు గావు నరేంద్రా. 325

క. శ్రేయము పరమార్థము గా, దా యని యడిగెదవయేని ధరణీవర యా
శ్రేయోలక్షణములు ప, ర్యాయంబునఁ బెక్కువిధములై చూపట్టున్. 326

చ. గొనకొని యిష్టదైవతము గొల్చి వరంబులు గొంట శ్రేయమా
నని తలపోసెదేని మనుజాధిప నిర్మలరాజ్యభోగనం

---

315 పరఁగ = క్రమముగా. 316 దేహభిత్తులు = దేహములనెడు గోడలు. 321 పృథక్కరణ
నిష్పాద్యంబు = వేఱుచేసి చెప్పఁదగినది, ఉపన్యసించినన్ = చెప్పంగా, అవిచారవిభ్రాంతచిత్తుఁడు =

దనధనధాన్యబాంధవజనంబులఁ గోరుట యెల్ల హేతువై
యనయము నుండుఁ గానఁ బరమార్థము గాదు తలంచి చూచినన్. 327
క. సవనము శ్రేయస్కరమని, వివరించిన ఫలములందు వేడుకగలమా
నవులకు స్వర్గము నిచ్చిన, యవనీశ్వర యదియుఁ బారమార్థిక మగునే. 328
మ. పరమధ్యానము సేయుమంచును మదిన్ భావించినన్ జీవుఁడున్
బరమాత్ముండును యోగవిద్యవలనన్ బ్రాపింతు రేకస్థితిన్
ధరణీనాథ తదీయదర్శనమహత్వప్రాప్తికిన్ హేతువై
పరఁగుం గావునఁ బారమార్థికము చెప్పన్ వచ్చునే యెమ్మెయిన్. 329
సీ. ధర్మార్థు లగుచుఁ గొందఱు ధనంబు వ్యయంబు సేయంగ ధర్మంబుఁ జెందు నందుఁ
గొందఱు తమతమకోర్కి కర్థము లిత్తు రందుఁ గామఫలంబు లనుభవింతు
రవి మొదలయిన యనేకధర్మంబులు పరమార్థములుగఁ జెప్పంగ రాదు
పుత్రునిఁ బరమార్థముగ నిరూపించినఁ దాఁ దనతండ్రికిఁ దనయుఁ డగుటఁ
తే. బట్టి పరమార్థములు పరంపరలఁ జెల్లుఁ, గాని యిదమిత్థమని పలుకంగఁబోల
దవనిరాజ్యంబు పరమార్థ మనిన నది గ,లిగినఁ గలుగును లేకున్న లేకపోవు. 330
తే. ఋగ్యజుస్సామములయందు నీడితంబు, లైనయాగంబులును బరమార్థములుగ
నెట్లు చెప్పంగవచ్చు నరేంద్ర కర్మ,ఫలనిరూపణవృత్తిఁ జూపట్టు నవియు. 331
క. ఏయే కారణములచే, నేయే కార్యములు పుట్టు నీప్సితములతో
నాయా హేతువు క్రియలం, దాయాఫలములు ఘటిల్లు నదియె ట్లనినన్. 332
ఆ. ధారుణీవశమును గారణరూప మై, నట్టిమంటివలనఁ బుట్టినట్టి
కార్యరూప మయినఘటములు గారణ,రూప మయినమంటిరూప కాన. 333
ఉ. కావున నాశభావములు గైకొనుచున్న సమిత్కుశాక్షతా
జ్యావలిచేత వేల్వఁబడు యాగపుఁగర్మములున్ వినాశమై
పోవు నెకాని సుస్థిరతఁ బొంది వెలుంగవు దీర్ఘకాలమున్
భూవర కార్యకారణములుం బరమార్థము లే తలంపఁగన్. 334
ఆ. విమలకర్మగోచరము లైనఫలములు, బుద్బుదములపోలెఁ బుట్టు నణఁగు
దేశకాలముల కధీనంబు లైనవి, తత్త్వ మనుచుఁ జెప్పఁ దగుట యెట్లు. 335
క. భూపాలతిలక కడుసం,క్షేపంబుగ నీకుఁ దెలియఁజెప్పెదఁ బరమా
ర్థోపాయరహస్యంబులు, దీపింపఁగ సూక్ష్మబుద్ధిఁ దెలియుము మదిలోన్. 336
శా. ఏకవ్యాపకమై సమస్తగతమై హేవాకమై శ్రీకరం

విచారణ లేమిచే భ్రమనొందిన మనసుగలవాఁడు. 329 ప్రాపింతురు = పొందుదురు. 330 ఇద మిత్థమని = ఇదియిట్లు అని, పలుకఁబోలదు = చెప్పఁదగదు. 331 ఈడితంబులు = కొనియాడఁ బడినవి - చెప్పఁబడినవియనుట. 332 ఈప్సితములతోన్ = కోరికలతో, ఘటిల్లున్ = కలుగును. 335 బుద్బుదములపోలెన్ = నీళ్లలోని బుగ్గలవలె. 336 భూపాలతిలక = రాజశ్రేష్ఠుఁడా. 337 ఏకవ్యాపకము = ఒక్కటైనది వ్యాపించునది, హేవాకము = దేదీప్యమాన ప్రాభరీతిగలది,

బై కల్యాణవిహారమై నిబిడమాయాతీతమై నిర్గుణం
బై కైవల్యవిహారమై జననాశాతీతమై యుత్తమ
శ్లోకంబై పరమార్థతత్త్వము నటించుఁ నిత్యశుద్ధస్థితిన్. 337

సీ. విను నామజాత్యాదులును యోగవిషయంబులును మహాధ్యానంబులునుస్వదేహ
పరదేహభేదసంపాదకంబులు లేక యేకస్వరూపమై యెపుడు నుండు
నద్వైతరూపమై యమరినపరమాత్మునికి విశేషజ్ఞాననిశ్చయంబు
రూపమై వెలుఁగొందు నాపురుషుఁడు భేదవృత్తిమై నొక్కొక్కవేళ నుండు
తే. నిల నభేదస్వరూపతఁ బొలుచు గాలి, వేణురంధ్రంబులను జెంది వివిధగతుల
షడ్జముఖ్యస్వరంబుల సంజ్ఞ లమరుఁ, దనకు భేదంబు లేదు యథాస్థితులను. 338

వ. కావున బ్రహ్మాదిభేదరూపంబులు పరమాత్మునికంటె నన్యంబులు గావు. ఏకపదార్థం
బునకు రూపభేదంబులు బాహ్యాభ్యంతరప్రవృత్తులవలనం గలుగు దేవాదిభేదంబు
లేక సకలంబు నేకస్వరూపంబై యుండుం గాని పరమాత్మునికి భేదంబు లేదని
చెప్పిన రాజు చింతాపరుండై తెలియక యూరకుండిన. 339

క. ఆవసుధామరుఁ డానృపు, భావం బద్వైతవృత్తిఁ బాటిలకున్నన్
భావించి తదీయరహస్యావహముగ నొక్కచిదితిహాసము చెప్పెన్. 340

ఋభుమహర్షి నిదాఘునకు తత్త్వోపదేశంబు సేయుట.

చ. వినుము నరేంద్ర తొల్లి యరవిందభవాత్మతనూజుఁడై ఋభుం
డనుమునిపుంగవుం డుదయమై కడుబాల్యమునందు బ్రహ్మత
త్త్వనిరతి నుల్లసిల్లుచు నిదాఘుఁ డనంగఁ బులస్త్యమానినం
దనుఁ దనశిష్యుఁగా నతిముదంబునఁ జేకొని ప్రీతచిత్తుఁడై. 341
తే. ఒక్కయద్వైతవాసన దక్క సకల, మైనసుజ్ఞానమును జెప్పి యతికృతార్థుఁ
జేసెఁ బౌలస్త్యుఁడును గురుశాసనమున,నరిగి గృహమేధిధర్మంబు లలవరించి. 342
తే. దేవికాఖ్యమహానదీతీరభూమి, నాపులస్త్యనివేదితం బైనవీర
నగరబాహ్యోపవనములోనను గృహస్థ,ధర్మములు మాన కాలును దాను నుండె.
వ. అంత దివ్యవర్షసహస్రంబునకు ఋభుండు శిష్యున కద్వైతవాసన యుపదేశించు
వాఁడై వచ్చె నప్పుడు. 344

శ్రీకరంబు = సంపత్కరమైనది, కల్యాణవిహారము=శుభకరమైన విహరించుటగలది, నిబిడమాయా తీతము=అంతట వ్యాపించియుండు మాయనుకడచినది, నిర్గుణంబు=రజస్సత్త్వతమస్సులనెడు మూఁడు గుణములును లేనిది, కైవల్యవిహారము = పరమపదమునందలి విహారముగలది, అతీతము = కడచినది, ఉత్తమశ్లోకంబు=మేలైనకీర్తిగలది, నటించుఁన్=వర్తించును, నిత్యశుద్ధస్థితిన్=శాశ్వతమై నిర్మలమైన యునికితో. 338 వేణువు=పిల్లనగ్రోవి. 339 బాహ్యాభ్యంతర = వెలుపలను లోపలను, చింతాపరుండు = విచారగ్రస్తుఁడు. 340 పాటిలక=పొందక, చిదితిహాసము = జ్ఞానబోధకమైన పూర్వకథను. 342 శాసనమునన్=ఆజ్ఞచేత, గృహమేధిధర్మములు = గృహస్థునినడవళ్లను. 347 కద

ఆ. గరిమ వైశ్వదేవికముఁజేసి బలిహరణార్థమై నిదాఘుఁ డాత్మగృహము
వెడలి వచ్చునపుడు వెలుపట నిలుచున్న, యతనిఁ దెలియలేక యతిథి యనుచు.
తే. ఆదరంబునఁ గొనివచ్చి యాసనార్ఘ్య,పాద్యములఁ బూజ గావించి బడలివచ్చి
నారు వంటకమైనది యారగింపుఁ, డనిన నవ్విప్రుఁ డిట్లను నతనితోడ. 346
క. నాకుఁ గదన్నంబులపై, నేకాలము మనసుపుట్టదిపుడు పదార్థా
నీకము లెట్టెట్టివి పరి,పాకము సేయించి తనినఁ బౌలస్త్యుండున్. 347
క. తనయింట నప్పు డాయిత, మొనరించిన కమ్మదావు లొలుకురసావ
ళ్లను మినుపవడలుఁ జాపట్లును గోదుమపిండివంటలుం గలవనినన్. 348
ఆ. ఇపుడు చెప్పినట్టి విన్నియుఁ గడుఁ గద,న్నంబు లింక షడ్రసంబులందు
మించియున్న మంచిమృష్టాన్నపానంబు, లాయితంబుగాక యారగింప. 349
చ. అనిన నిదాఘుఁ డప్పుడు కులాంగనశాలినిఁ జూచి వేగ నీ
యనకు భుజింపఁగాఁ దగినయన్నము పాకము సేయుమన్న న
వ్వనరుహనేత్ర చిత్రముగ వండి భుజింపఁగఁ బెట్టె నమ్మహా
త్మునకును బ్రాణనాథునకు మోదముతో సరసాన్నపానముల్. 350
వ ఇట్లు భుజించి స్వస్థచిత్తుండై కూర్చున్న ఋభునకు నిదాఘుం డిట్లనియె. 351
క. ఇయ్యాహారంబులచే, నయ్యా బడలికలు దీఱెనా సంతోషం
బయ్యున్నదె పరితుష్టం,బయ్యెనె ప్రొద్దెక్కె మిగుల నాఁకొంటివిగా. 352
క. ఎందుండి వచ్చితిరి మీ, రెందుల కేగెదరు నిలయ మెచ్చో టనినన్
మందస్మితుఁ డగుచు ద్రుహిణ, నందనుఁ డిట్లనుఁ బులస్త్యనందనుతోడన్. 353
క. కడు నాఁకలిగొని యన్నము, గుడిచినవారలకుఁ దృప్తి గూరును మున్నె
ప్పుడు నాఁకలి చెందకయుం,డెడునను నేమిటికి ని ట్లడిగితి మహాత్మా. 354
చ. అనవరతంబుఁ బార్థివములై కనుపట్టెడు ధాతుసంచయం
బును దనమేనను న్న జలముల్ జఠరాగ్నియ కాల్చు విప్రనం
దన కడలేనియాఁకలియు దాహము రెండును దేహధర్మముల్
మునుకొని యావికారములు మున్నును నేఁడును లేవు నాకిలన్. 355
వ. అని మఱియును. 356
ఆ. కాన నాకుఁ దృప్తి గల దెల్లకాలంబు, తనకు నొదవుతుష్టియును సుఖంబుఁ
జిత్తధర్మములు విశేషచిత్తము గల, యట్టివారి నడుగు మవ్విధములు. 357
వ. కావునఁ బరమాత్మునకు నివ్విధంబులు లేవు. 358

---

న్నంబులపైన్ = కుత్సితాన్నముమీఁద. 348 కమ్మతావులొలుకు = మధురమైనవాసనలను వ్యాపింపఁజేయుచున్న, చాపట్లు = దోసెలు. 349 మృష్ట = మధురమైన, ఆయితంబు = సిద్ధము. 352 పరితుష్టంబు = చక్కఁగా తృప్తిపొందినది, ఆఁకొంటివిగా = ఆఁకలిగొంటివికదా. 353 మందస్మితుఁడు = చిఱునవ్వుగలవాఁడు. 354 కూరును = కలుగును. 355 పార్థివములు = పృథివివలనఁ గలిగినవి,

ఆ. ఆత్మతత్త్వపురుషుఁ డాకసమునఁబోలె, నెందునైన నుండు నెల్లప్రొద్దు
కాన నేను రానుబో నొక్కచో నుండ, నివ్విధములు నీవె యెఱిఁగికొనుము. 359
తే. నీవుఁ దక్కినవారలు నిర్ణయముగఁ, దత్త్వ మనువచనమునకుఁ దగరు సూవె
యేను దక్కినవారలు మానినాథ, సోహ మనుటకుఁ దగ మాత్మనూహ నెఱుఁగ.
వ. అన్నంబునం గలమృష్టామృష్టభేదంబులు నీవలన నెఱుంగువాఁడనై యడిగితి మృష్టాన్నం బమృష్టంబును నమృష్టాన్నంబు మృష్టంబును నై శరీరంబున కనుద్వేగోద్వేజనంబులు గావించుం గావున నన్నం బెప్పుడును రుచిగాదు. 361
తే. మృత్తికాగేహములు మంటిమెత్తడముల
దృఢము లగుగతిఁ బార్థివదేహచయము
పార్థివము లైనగోధూమఫలయవాఖ్య
పోష్యమాణంబులై దార్ఢ్యమునఁ జెలంగు. 362
క. ఊరక మృష్టామృష్టవి,చారంబులు మాని ముక్తి సంధిలుమార్గం
బారసి చిత్తముఁ బరత,త్త్వారూఢముఁ జేసి విడువు మైహికవిధులన్. 363
చ. అనిన నిదాఘుఁ డాతనికి నంజలిచేసి మహాత్మ మీరుచె
ప్పినపరమార్థతత్త్వమున పెంపున సాహృదయంబులోనఁ గ
ల్గినయవివేక మంతయును గీటడఁగెన్ సుఖినైతి నీవిధం
బును నభిధానమున్ నిఖిలమున్ వినిపింపుము నాకు నావుడున్. 364
ఉ. ఏను ఋభుండ నీగురుఁడ నిద్ధవివేకము నీకుఁ దెల్పఁగాఁ
బూనినవేడ్క వచ్చితి నపూర్వరహస్యము నీకుఁ జెప్పితిం
గానఁ బ్రపంచమంతయు జగత్పరిపూరితుఁ డైనయచ్యుతా
ధీనముఁ జేసి సుస్థిరగతిన్ విలసిల్లుము పోయివచ్చెదన్. 365
క. అనిచెప్పి యథేచ్ఛాగతిఁ, జని వెండియు వేయుదివ్యసంవత్సరముల్
చనఁగ నొకనాఁడు క్రమ్మఱఁ, జనుదెంచి తదీయనగరసామీప్యమునన్. 366
ఉ. ఏనుఁగునెక్కి యానగర మేలెడుభూరమణుండు సర్వసే
నానికరంబుతోడ సదనంబునకుం జనుచుండ నొక్కఁడున్
గ్లాని వహింపఁ జేరడవిఁ గాయలు బండ్లు సమిత్కుశాదులుం
దానె వహించి వచ్చుచు నిదాఘుఁడు తత్పురబాహ్యవీథులన్. 367

(పృథివి=భూమి,) ధాతుసంచయము=ధాతుపదార్థముల సమూహము. 361 మృష్టామృష్టభేదంబులు=స్వాదువు స్వాదువుకానిది అను భేదభావములు, అనుద్వేగోద్వేజనంబులు=వేదనలేమిని వేదనను, రుచి=ఇష్టము. 362 మెత్తడములన్ = దట్టముగా పూయుటలచేత, పోష్యమాణంబులు = పోషింపఁబడుచున్నవి, దార్ఢ్యమునన్ = దృఢత్వముచేత, చెలంగున్ = అతిశయించును. 364 గీటడఁగెన్ = నశించెను, అభిధానమున్ = పేరును. 365 ఇద్ధవివేకము = ప్రకాశించుచున్న తెలివిని, జగత్పరిపూరితుఁడు = లోకమునం దెల్లయెడల నిండుకొన్నవాఁడు. 367 భూరమణుండు=రాజు, నికరంబుతోడన్=సమూహముతో, సదనంబునకున్ = ఇంటికి, ఒక్కఁడున్ = ఒక్కఁడే, గ్లాని = బడలిక;

వ. రాజసేనాసమ్మర్దంబునకు నోడి తెరువుదొలంగి కూర్చున్నవానిం బొడగాంచి నమస్కారంబు చేసి ఋభుం డిట్లనియె. 368

ఆ. ఒంటినేల యిచట నున్నాఁడ వనిన నీ, బలము క్రందువలనఁ బథమునందు
నరుగ రాకపోయి యనవుడు వీరిలో, నెవ్వఁ డవనినాథుఁ డెద్ది బలము. 369

క. నీ వెఱుఁగుదు వని యడిగితి, నీవిధ మెఱిఁగింపు మనిన నేనుఁగుమీఁదన్
బోవఁగ నున్నాఁ డతఁడె మ,హీవిభుఁ డని చెప్పుటయును ఋభుఁ డాతనితోన్.

క. అవనీపతి సింధురముల, వివరంబుగఁ జెప్పవైతి వీరు పృథగ్రూ
పవికారంబుల నున్నా,రు వారణం బెద్ది భూవరుం డెవ్వఁడొకో. 371

వ. అనిన నిదాఘుండు. 372

ఆ. మీఁద నున్నవాఁడు మేదినీపతి క్రింద, నున్నయది గజంబు పిన్నబిడ్డ
యైన నెఱుఁగ నేర్చు ననినఁ గిందును మీఁదుఁ,దెలియఁజెప్పు మనిన నలిగియతఁడు.

తే. ఋభుని మెడ వంచి వీఁపుపై నెక్కి నేను
నృపునిగతి మీఁద నున్నాఁడ నీవు గంధ
నాగమునుబోలెఁ గ్రింద నున్నాఁడ వనిన
నానిదాఘునితో ఋభుం డనియె మఱియు. 374

తే. ఈవు నే ననునర్థంబు లెఱుఁగవలయుఁ
జెప్పు మనుటయుఁ బరమార్థసిద్ధతత్త్వ
సోహ మనువాక్యములు రెండుఁ జూడ నేక
మైనయద్వైతవాసన యాతఁ డెఱిఁగి. 375

వ. సత్వరంబుగా దిగనుఱికి నమస్కారంబు చేసి మహాత్మా మద్గురుండ వైనఋభుండ వీవు కాకయున్నఁ దక్కినవారిచిత్తంబు లమ్మహాత్మునందంబున నద్వైతవాసనా సంస్కారంబుచేత నావృతంబులు గావని వివేకించితి ననిన ఋభుండతని కిట్లనియె.

ఆ. ఏను ఋభుఁడ నగుదు నీవు చేసినపూర్వ, సేవవలన మిగులఁ జిత్త మలరి
బ్రహ్మవిద్యఁ దేటపడ నుపదేశింప, వచ్చినాఁడ గౌరవంబు గదుర. 377

వ. నీ కద్వైతవిజ్ఞానంబు గొఱంతలేదు సుఖివై యుండు పోయివచ్చెద నని ఋభుండరిగె నిదాఘుండును గురూపదేశమార్గంబున సమస్తభూతంబులఁ దన యాత్మతోడ నభేదంబుగాఁ జూచుచు బ్రహ్మంబు నెఱింగి ముక్తుండయ్యె.

పేరడవిన్ = గొప్పయడవియందు. 368 సమ్మర్దంబునకున్ = సందడికి (లేక) త్రొక్కిడికి, తెరువు తొలంగి = దారివిడిచి. 369 క్రందు=సందడి, పథమునందున్ = త్రోవను, అవనినాథుఁడు = రాజు, బలము=సేన. 371 అవనీపతిసింధురములన్ = రాజును ఏనుఁగును, పృథగ్రూపవికారంబులన్ = వేఱువేఱురూపములవల్లనైన మాఱుపడుటులచేత, వారణము = ఏనుఁగు. 374 గంధనాగమునుబోలెన్ = మదపుటేనుఁగువలె. 376 సత్వరంబుగాన్ = త్వరతో కూడుకొనునట్టుగా, వివేకించితిని = తెలిసికొంటిని. 378 బంధురిపుతుల్యుండవు = చుట్టమును పగవానిని నొక్కటిగాఁ

నీవును నతనియట్ల బంధురిపుతుల్యుండవై యాత్మసర్వాంతర్యామి యని తెలిసి సమచిత్తుండవై యుండుము. 378

ఉ. భూవరముఖ్య యీసకలభూతములున్ హరికంటె నన్యముల్
గా వటుగాన లోకములఁ గల్గినయీసచరాచరంబులున్
నీవును నేను నాత్ముని వినిశ్చలశాశ్వతమూర్తిభేదముల్
కావున భేదమోహపరికల్పన లిన్నియు మాను జ్ఞానివై. 379

క. అని నిర్దేశించిన న, మ్మనుజేంద్రుఁడు బ్రహ్మయోగ మహితాత్ముండై
తనరుచు నద్వైతస్థితిఁ, జని యాతఁడు పొందె విష్ణుసాయుజ్యంబున్. 380

క. ఆజడభరతుఁడును ఘనుం, డై జాతిస్మరణచేత నాత్మజ్ఞాన
వ్యాజమహత్త్వం బొదవఁగ, నాజన్మమునందె ముక్తి కరిగె నరేంద్రా. 381

క. మానుగ నీజడభరతా, ఖ్యానముఁ జదివినను విన్న నాత్మలు మోహా
ధీనములు గాక సంసా, రానందములందె ముక్తు లగుదురు మనుజుల్. 382

వ. అని యిట్లు ద్వితీయాంశంబు సమాప్తంబుగాఁ జెప్పి మఱియును. 383

ఉ. శ్రీమహనీయగేహ సరసీరుహబాంధవతుల్యదేహసం
గ్రామధనంజయాంక రిపుగర్వవిదారణకారణక్రియా
భీమతరోగ్రఖడ్గ కవిబృందవచఃప్రియచిత్త సద్గుణ
స్తోమ సమస్తలోకపరితోషణదానకళావిశారదా. 384

క. నరరుక్మాంగదభీష్మాం, బరీషశౌనకవసిష్ఠబకదాల్భ్యపరా
శరనారద దైత్యజపుం, డరీకశుకమునివిభీషణవ్యాససనిభా. 385

మాలినీ. సమరపరశురామా చారుసౌభాగ్యధామా
సమదరిపువికీర్ణా శౌర్యవిద్యాసుపర్ణా

---

జూచువాఁడవు, సర్వాంతర్యామి = అన్నిటిలో వర్తించునది. 380 నిర్దేశించి = తెలియఁజెప్పి, 382 మానుగన్ = ఒప్పిదముగా, ఆఖ్యానము = కథను. 384 శ్రీమహనీయగేహ = సంపదచేత గొప్పదైనయిల్లుగలవాఁడా, సరసీరుహబాంధవతుల్యదేహ = సూర్యునివంటి తేజస్సుగల దేహముగల వాఁడా, సంగ్రామధనంజయాంక = సంగ్రామధనంజయుఁడు అను బిరుదుపేరుగలవాఁడా, రిపుగర్వ విదారణక్రియా = శత్రువులగర్వమును పోఁగొట్టుటకు హేతుభూతములైన పనులను చేయువాఁడా, భీమతరోగ్రఖడ్గ = మిక్కిలి భయంకరమైన కత్తికలవాఁడా, కవిబృందవచఃప్రియచిత్త = కవుల సమూహములయొక్క మాటలయందు ప్రీతిగలమనస్సుగలవాఁడా, సద్గుణస్తోమ = మంచిగుణముల సమూహములుగలవాఁడా, సమస్తలోక పరితోషణదాన కళావిశారదా = ఎల్లలోకులను చక్కఁగా సంతోషింపఁజేయునట్టి దానవిద్యయందు కుశలుఁడా. 386 సమరపరశురామా = యుద్ధమునందు పరశురామునిఁ బోలినవాఁడా, చారుసౌభాగ్యధామా = మనోజ్ఞమైన చక్కఁదనమునకు ఉనికిపట్టై యునవాఁడా, సమదరిపువికీర్ణా = మదముతోఁగూడుకొన్న శత్రువులను చెదరగొట్టువాఁడా, శౌర్య

విమలశుభవిధేయా వీరకేళాదిరాయా
ప్రముదితసుకవీంద్రా పంటవంశాబ్ధిచంద్రా. 386

గద్యము. ఇది శ్రీమదమరనామాత్యపుత్ర హారితసగోత్రపవిత్ర సుకవిజనవిధేయ వెన్నెలగంటి సూరయనామధేయ ప్రణీతం బైన యాదిమహాపురాణంబగు బ్రహ్మాండంబునందలి పరాశరసంహితయైన శ్రీవిష్ణుపురాణంబునందుఁ బ్రియవ్రతు వంశంబును సప్తసాగరసప్తద్వీపప్రకారంబులును పాతాళనరకలోకకీర్తనంబులును భూర్భువాదిలోకవర్ణనంబులును జ్యోతిశ్చక్రక్రమంబును జడభరతోపాఖ్యానంబును నన్నది తృతీయాశ్వాసము.





---

విద్యాసుపర్ణా = శూరత్వమనెడు విద్యయందు గరుత్మంతునిఁ బోలినవాఁడా, విమలశుభవిధేయా = నిర్మలమైన క్షేమమునకు విధేయుఁడవైనవాఁడా, ప్రముదితసుకవీంద్రా = మిక్కిలి సంతోషింపఁ జేయఁబడిన సత్కవిశ్రేష్ఠులు గలవాఁడా.

శ్రీరస్తు.

# శ్రీవిష్ణుపురాణము

## చతుర్థాశ్వాసము.

---



మత్స్యకల్పపురాణక
థామధురసుధానుభవబుధవ్రతనుత సం
గ్రామధనంజయజగదభి
రామవపుఃపుష్పచాప రాఘవభూపా. 1

వ. సకలపురాణవిద్యాధురంధరుం డైనపరాశరుండు మైత్రేయున కిట్లనియె. ఇట్లు నావలన భూవిస్తారంబును సముద్రవర్ణితంబులును సూర్యాదినవగ్రహస్థానంబులును జ్యోతిశ్చక్రప్రభావంబును దేవర్షికీర్తనంబును చాతుర్వర్ణ్యోత్పత్తియును దిర్యగ్యోనిజన్మంబులును ధ్రువప్రహ్లాదచరిత్రంబులును వింటి వింక నేమివినవలయు నని యడిగిన నతం డిట్లనియె. 2

క. మునివర మన్వంతరముల, మనుపుత్రుల సురల సప్తమౌనుల దేవేం
ద్రనికాయంబుల నేర్పడ, వినవలతుం జెప్పవే సవిస్తరఘణితిన్. 3

### మన్వంతరమనుపుత్రాదివివరణము.

వ. అని యడిగిన పరాశరుం డిట్లను నతీతానాగతంబు లైనచతుర్దశమన్వంతరంబులం జెప్పెద స్వాయంభువ స్వారోచిషోత్తమ తామసరైవతచాక్షుషమన్వంతరంబు లాఱును గడచనియె. వైవస్వతమన్వంతరంబు వర్తమానంబై నడుచుచున్న యది. కల్పాదికథలవలన స్వాయంభువమన్వంతరప్రకారంబు వింటి వింక స్వారోచిష మన్వంతరంబుఁ జెప్పెద వినుము. 4

క. స్వారోచిషాంతరమ్మునఁ, బారావతతుషితముఖసుపర్వగణము లే
పారువిపశ్చిత్తుం డను, స్వారాజు వెలుంగు లోకసన్నుతమహిమన్. 5

తే. ప్రాణవాతాగ్నివృషనిస్వరాహ్వయులును
స్తంబకుండును మఱియు నూర్జకుఁ డనంగ

---

1 జగదభిరామవపుఃపుష్పచాప=లోకమునందు మనోజ్ఞమైనశరీరముచేత మన్మథుఁడైనవాఁడా.

2 చాతుర్వర్ణ్యోత్పత్తి = బ్రాహ్మణవర్ణము మొదలుగాఁగల నాలుగువర్ణముల సముదాయముయొక్క-

సప్తమౌనులు వెలసిరి చైత్రచిత్ర
మదనకింపురుషాదు లమ్మనుపుసుతులు 6

వ. ఉత్తమమన్వంతరంబున సుశాంతుండు దేవేంద్రుండయ్యె. సుధామసత్యశివ ప్రత ర్దనవశవర్తు లనుద్వాదశగణంబులు దేవతలు తొల్లి నీకుం జెప్పిన వసిష్ఠతనయు లేడ్గురు సప్తమహర్షు లైరి మఱియును. 7

సీ. నాలవమనువు నానాలోకనుతకీర్తి యయ్యె ప్పెం దామసుం డనుమహాత్ముం
డతనికాలంబున నమరాధిపతి యయ్యె శిబి యనునాతండు విబుధవరులు
హరసత్యరూపాదు లన సప్తవింశతిగణములై మెఱసిరి కావ్యచైత్ర
పృథుకావ్యవర్ణాగ్ని పీవరజ్యోతిధాములు సప్తమౌనులై రలఘుమతులు

ఆ. ఖ్యాతిజానుజంఘకేతురూపనరాది, మనుజనాథవరులు మనుపుతనయు
లమ్మహానుభావు లత్యంతధర్మాత్ము, లైరి పెక్కుక్రతువు లాచరించి. 8

తే. రైవతాహ్వయమన్వంతరంబునందు, విభుం డనెడువాఁడు దేవతావిభుఁడు దేవ
గణము లమితాభవైకుంఠ కావ్యభూత, దయు లనంగఁ జతుర్దశద్వయము వెలసె.

తే. ఊర్ధ్వబాహుఁడు దేవబాహుఁడు హిరణ్య
రోముఁడును వేదవంతుండు ధామకుండు
శ్రీమతుండు పర్జన్యుఁడు నా మునీంద్ర
సప్తకము సప్తమునులైరి సంయమీంద్ర. 10

క. బలబంధూజ్జ్వలసంభా,వ్యులు మొదలుగ రాజులందు నొగి మనుపుకుమా
రులు దేవేంద్రుని పెన్ను, ద్దులగతి విలసిల్లి రధికదోర్బల మహిమన్. 11

ఉ. ఏచినయాప్రియవ్రతమహీతలనాథుఁడు తొల్లి పుష్పనా
రాచగురుం గుఱించి యనురాగముతోఁ దప మాచరించి స్వా
రోచిషుఁ డాదియౌ నలుపురుం దనవంశజులై వెలుంగఁ బు
ణ్యోచితవృత్తిఁ దాఁ బడసె నుజ్జ్వలరాజ్యరమావిభూతితోన్. 12

క. ఆతనివిమలతపోమహి,మాతిశయమువలన మనువులై వెలసిరి యీ
భూతలనాయకు లతులవి,భూతిఁ విలసిల్లి రవనిఁ బుణ్యోదయులై. 13

వ. మఱియు షష్ఠం బైనచాక్షుషమన్వంతరంబునకు మనోజవుం డను దేవేంద్రుం డును, నార్యప్రభూతభవ్యపృథుకరేఖాదు లైనయష్టకాగణంబులు దేవతలును, సుమేధుండును విజరుండును హవిష్మంతుండును నుత్తముండును మధుండును సహిష్ణుండును అతినామకుండును అనువారలు సప్తమహర్షులును, పూరుశత ద్యుమ్న ప్రముఖు లైనవారలు మనుకుమారులు నై విలసిల్లిరి. తదనంతరంబ. 14

తే. అనఘ సాంప్రతమైనమన్వంతరమున, కధిపుఁడై విలసిల్లె నయ్యనఘమూర్తి

---

పుట్టుక, తిర్యగ్యోనిజన్మంబులు = పశుపక్ష్యాదులపుట్టుకలు. 5 స్వారాజు=ఇంద్రుఁడు. 12 పుష్ప నారాచగురుఁ=మన్మథునితండ్రిని - విష్ణువును. 15 సాంప్రతము = వర్తమానము-ఇప్పుడు జరు

వనజబాంధవసుతుఁడు వైవస్వతాఖ్యుఁ, డందు దేవేంద్రుఁ డయ్యె పురందరుండు
సీ. ఆదిత్యవసురుద్రు లమరగణంబులు గౌతమజమదగ్ని కశ్యపాత్రి
మునులు భరద్వాజుఁడును వసిష్ఠుండు విశ్వామిత్రుఁడును నాఁగ సప్తమౌను
లిక్ష్వాకునాభాగధృష్టనరిష్యంతశర్యాతివృషదాదిజనపతులును
మహనీయమతులు తొమ్మండ్రు వైవస్వతమనుకుమారులు జగన్మాన్యయశులు
తే. వారలెల్లను వేర్వేఱ వంశకర్త, లై తురంగమమేధాదు లైనయాగ
ములు సమగ్రంబుగాఁ జేసి యలఘుబాహు, శక్తిఁ బాలించి రిమ్మహీచక్ర మెల్ల.
క. అగణితము నప్రమేయము, నగువిష్ణునిశక్తి యాచరాచరసహితం
బగుమన్వంతరములతో, జగములు రక్షించుచుండు సాత్వికయుక్తిన్. 17
క. తోయజనాభునియంశము, లాయామన్వంతరముల నవతారములై
ధీయుక్తి నెల్లజగములఁ, బాయక రక్షించుచుండుఁ బరమప్రీతిన్. 18
వ. అది యెట్లనిన స్వాయంభువమన్వంతరంబున నాకూతిదేవికి యజ్ఞుం డన మానస పుత్త్రుండై పుట్టె, స్వారోచిషమన్వంతరంబునం దుషితాదేవికిఁ దుషితాదిదేవ గణంబులతోడఁ దుషితుండై పుట్టె, ఉత్తమ మన్వంతరంబున సత్యాదేవికి సత్యాదిదేవగణంబులతోడ సత్యుండై జన్మించె, తామసమన్వంతరంబున హర్య యనుదానికి హరిప్రముఖదేవగణంబులతోడ హరిమూర్తియై పుట్టె, రైవతమ న్వంతరంబున సంభూతికి రైవతు లనుదేవగణంబులతోడ సంభూతుండై పుట్టె, చాక్షుషమన్వంతరంబున వికుంఠాదేవికి వైకుంఠాదిదేవగణంబులతోడ వైకుం ఠుండై జన్మించె, వైవస్వతమన్వంతరంబునఁ గశ్యపప్రజాపతికి నదితియందు నాది త్యాది దేవగణంబులతోడ వామనుండై పుట్టి త్రివిక్రమంబునం ద్రిలోకంబు లాక్రమించి నిహతకంటకం బైనత్రిలోకంబును పురందరునకు నొసంగె, ఇట్లు సప్తావతారాదివిహారంబులవలన సమస్తలోకంబులుం దాన యై విష్ణుండు ప్రతి పాలించును. 19
ఆ. ఇవ్విధమునన్నైన నీవిశ్వమున నమ్మహాత్ముశక్తి విష్ట మగుటఁ జేసి
విష్ణునామ మయ్యె విశధాతువు ప్రవేశ, నార్థయుక్తితోడ నమరుఁ గాన. 20
చ. అనిమిషసిద్ధసాధ్యులుఁ జరాచరభూతములున్ సుపర్వులున్
(?)మౌనులు ఖేచరుల్ మనుకుమారులు లోనగు నీజగంబు లె
ల్లను బహుసాత్వికస్ఫురణలన్ వెలుఁగొందుచు నుండు నన్నియున్
వినుతకృపావిధేయుఁ డగువిష్ణువిభూతులుగా నెఱుంగుమీ. 21
వ. అని చెప్పి వెండియు ననాగతమన్వంతరంబులు వినిపించువాఁడై యిట్లనియె. 22

---

గునది, వనజబాంధవసుతుఁడు = సూర్యునికొడుకు. 16 జగన్మాన్యయశులు = లోకమునందు గౌర వింపఁదగిన కీర్తిగలవారు. 17 అగణితము = లెక్కపెట్టరానిది, అప్రమేయము = మేరలేనిది. 18 తోయజనాభుని = విష్ణునియొక్క. 20 విష్టము = ప్రవిష్టము. 25 చండ = చేంద్రమైన,

ఆ. కమలహితుఁడు విశ్వకర్మతనూభవ, యైనసంజ్ఞ యనుమృగాక్షిఁ బెండ్లి
యాడి దానివలన నత్యంతసుఖలీలఁ, దేలుచుండి కొంత కాలమునకు. 23

క. మనువును యముఁడును యమునయు, ననువారల మగుడఁ బడసె నాసతివలనన్
వనరుహబాంధవుఁ డెంతయు, ననురాగరసాబ్ధి నోలలాడుచు నుండెన్. 24

వ. అంత నమ్మహాదేవియును సూర్యదేవునిచండకిరణంబులు డాయ నోపక వృద్ధపరిగ్రహ యైనయువతిచందంబున నిజచ్ఛాయకుం దనయట్ల శరీరంబు గల్పించి పతిశుశ్రూషసేయ సమకట్టి పెట్టి యరణ్యమధ్యంబునకుం జని వాజిరూపంబు ధరియించి యజ్ఞాతవాసంబునఁ దపంబు సేయుచుండె నంత. 25

ఉ. ఛాయయు సంజ్ఞయట్ల జలజప్రియసేవ యొనర్చుచుండ నా
తోయజబాంధవుండు తనతొయ్యలియట్ల మనోనురాగముల్
సేయఁగ నుండె సంజ్ఞ మును చేసినచేఁత యెఱుంగ కిమ్మెయిన్
మాయలు పన్ను భామినుల మంచితనంబులు నమ్మవచ్చునే. 26

వ. ఇట్లు కపటరూపసేవావిధేయ యైనఛాయయందు మనువును శనైశ్చరుండును దపతియు జన్మించి పెరుగుచున్న యప్పుడు. 27

తే. ఛాయ నిజపుత్రకులయట్ల సవతిసుతుల
గారవంబునఁ జూడక కడు నుపేక్ష
సేయుచుండంగ యముఁడు వీక్షించి కోప
మాత్మఁ బెనఁగొనఁ బినతల్లి కనియె నపుడు. 28

ఆ. తల్లివయ్యు నీవు తనయుల నందఱ, నొక్కభంగిఁ జూడ కుండుటెట్టు
లిట్టిబుద్ధి నీకు నేఁటికిఁ బాటిల్లె, ననిన నతనిమీఁద నాగ్రహించి. 29

క. మానక విన నర్హంబులు, గానియుదాసీనవచనఘనకంటకముల్
వీనులలో నాటించిన, నానలినదళాక్షిఁ దన్నె నాతఁడు కిన్కన్. 30

వ. ఇట్లవమానంబుఁ బొంది యమ్మానవతి యతనిచరణంబులు భంగంబు లగునట్లుగా శపియించె నప్పుడు సూర్యుం డదియేమికారణం బనియడిగిన యముం డిట్లనియె.

ఉ. అన్నలు దమ్ములైనమము నందఱ నొక్కవిధంబునం గృపన్
మన్నన సేయవేల యనిన్ నను నూరకతిట్టెఁ దిట్టినం
దన్నితిఁ దన్నినం దనపదంబులు గూల శపించె నిట్టికో
పోన్నతబుద్ధి తల్లులకు యుక్తమె పుత్రకులన్ శపింతురే. 32

ఆ. తల్లియైన నేల తన్నుదు సుతుఁడైన, నేల నను శపించు నీమృగాక్షి
యేను గాను సుతుఁడ నీయమ తల్లియుఁ, గాదు చిత్తగింపు కర్మసాక్షి. 33

---

డాయన్ = సమీపింప, వృద్ధపరిగ్రహ = ముసలివానిఁజేపట్టినది, వాజి=గుఱ్ఱము. 26 తొయ్యలి= ఆఁడుది - భార్య, 30 ఉదాసీనవచనఘనకంటకములు=ఉచ్చరింపరాని మాటలనెడి గొప్పముండ్లు,

మ. అనినం బంకజబాంధవుం డపుడు ఛాయాదేవి నీక్షించి యో
వనితా యెవ్వతె వీవు దండధరుఁ దీవ్రక్రోధవృత్తిన్ శపిం
ప నిమిత్తం బదియేమి నీవలనఁ గాపట్యంబు గాన్పించె నం
దనుపై నిర్దయకర్మముల్ చనునె కాంతా యింతగావింతురే. 34

క. నీవలన మిగులఁ గపటపు, భావంబులు పెక్కు గానఁబడుచున్నవి కాం
తా వెరవవలదు నాయెడ, నీవెవ్వర వింతయలుక నీకేమిటికిన్. 35

క. నిక్కము చెప్పుము చెప్పక, తక్కిన నిన్నిపుడు పట్టి దండింతు ననన్
స్రుక్కి దివాకరుఁ గనుఁగొని, యక్కమలదళాక్షి కడురయంబునఁ బల్కెన్. 36

తే. అబ్జబాంధవ నీభార్య యైనసంజ్ఞఁ
గాను నాపేరు ఛాయను గమలవదన
నిన్ను డాయంగ శంకించి నన్ను నునిచి
తా నరణ్యంబునకుఁ బోయెఁ దపము సేయ. 37

వ. అనినం గర్మసాక్షి యాతామరసాక్షి నొండేమియుం బలుకక ధర్మరాజుపాదం
బులు పూర్వప్రకారంబున నుండునట్లుగా ననుగ్రహించి వాజిరూపంబున
నున్నసంజ్ఞానివాసంబు ఛాయాదేవివలన నెఱింగి యచ్చోటికిం జని తాను
నశ్వరూపంబు ధరియించి యయ్యింతితోడం గ్రీడించెఁ దత్సమాగమంబువలన
నశ్వినీదేవతలును రేవంతుండునుం బుట్టిరి ఇట్లు భార్యాసమేతుండై నిజనివా
సంబునకు వచ్చి సుఖంబుండె నంత. 38

తే. త్వష్ట చనుదెంచి లోకబాంధవునిఁ గాంచి, దేవి సంజ్ఞవిధంబెల్లఁ దెలియఁజెప్పి
యతనితీవ్రమయూఖసహస్రకమున, నెనిమిదవపాలు కరసానఁ దునియఁబట్టె. 39

తే. చండకిరణంబు లీరీతి సానఁబట్టి, కొంతశాంతంబుగావించి కూతుఁ దెచ్చి
యల్లునికిఁ బ్రియమారంగ నప్పగించె, వివిధశిల్పకళాకర్మ విశ్వకర్మ. 40

వ. ఇట్లు సూర్యకిరణంబులవలన రాలినరజంబు శంకరునకుఁద్రిశూలంబును, విష్ణు
నకుఁ జక్రంబును, కుబేరునకు ఖడ్గంబును, కుమారునకు శక్తియును, మఱియు
నానాదేవతలకు ననేక దివ్యాయుధంబులుం జేసె నిట్లు వైష్ణవతేజంబు పెక్కు
విధంబులఁ బ్రవర్తిల్లుచుండె నంత. 41

---

కినుకన్ = కోపముతో, 36 స్రుక్కి=సంకోచించి, (లేక) వెఱచి. 38 ఒండు=ఇతరము, తత్సమాగమంబునన్ = ఆకూడికచేత. 39 తీవ్రమయూఖసహస్రకమునన్ = తీక్ష్ణములైన వేయికిరణములయందు, కరసానన్ = కత్తులకు పదును పెట్టెడు చక్రాకారమైన సానయందు. 40 చండకిరణంబులు=వేండ్రమైనకిరణములు, శాంతము=వేండ్రములేనిది. 41 రజము=పొడి, త్రిశూలము=మూఁడు మొనలు గలశూలము. 42 తోయజవనబంధునికిన్ = కమలముల పట్టులకు మిత్రుఁడైనసూర్యుని వలన, పూర్వతనయప్రాయమహితుక్ = మునుపటికొడుకులను బోలినమహిమగలవానిని. 44 సంధ్య

క. ఛాయాసంజ్ఞలు గాంచిరి, తోయజవనబంధునికి సుతుఁ సావర్ణిఁ
ధీయుతునిఁ బూర్వతనయ, ప్రాయమహితు సుజనలోక పావనమూర్తిన్. 42

వ. అట్టిసావర్ణి తపోమహత్త్వంబునను విష్ణుప్రసాదంబునను మన్వంతరపట్టంబునకుఁ
దపంబు సేయుచున్నవాఁడు రసాతలంబునకుం బలి యైనవిరోచనకుమారుం
డగుబలీంద్రుం డింద్రపదంబుఁ గోరి వాసుదేవు నారాధించుచున్నవాఁడు సుత
పాది వింశతిగణంబులు దేవత్వంబునకుఁ దపంబు సేయుచున్నవారు గాలవుం
డును దీప్తిమంతుండును బరశురాముండును గృపాచార్యుండు నశ్వత్థామయుఁ
గృష్ణద్వైపాయనుండును ఋశ్యశృంగుండును ననువారు సప్తమహర్షులు నిర్మోహ
వీరబాహు లైనరాజులు సావర్ణినందనులుగాఁ గలవార లి ట్లమ్మన్వంతరంబు
చనినపిదప. 43

సీ. మఱి దక్షసావర్ణిమన్వంతరమున మహావీర్యుఁ డనువాఁడు దేవవిభుఁడు
ధారామరీచిసుధర్మగర్భాదులు ద్వాదశగణదేవతలును సవనుఁ
డును భవ్యుఁడును ధర్ముఁడును ద్యుతిమంతుండు దీప్తియు మేధుండు దీప్తకుండు.
జ్యోతిష్మతియు నన నొనరినసంయము లేడ్వురు సప్తమునీంద్రు లైరి

తే. దివ్యకేతు మహాకేతు దీప్తికేతు
పంచహస్తనిరామయప్రముఖు లైన
మనుజనాథులు పెక్కండ్రు మనువుసుతులు
ఘనులుగా నున్న వారు జగంబునందు. 44

తే. బ్రహ్మసావర్ణిమన్వంతరంబునందు, శాంతి యనువాఁడు దేవతాచక్రవర్తి
సుఖసుఖాత్మసుధర్మాదిసురలు నూర్వు, రందు దేవపదంబుల నందఁగలరు. 45

తే. సత్యుఁ డనఁగ నాభాగుఁడు సంస్తుతి యన
సత్యకేతుప్రతిమహారిష్మంతు లనఁ ద
పోధనుండును ననువారు పుణ్యఘనులు
సప్తమునులు గాఁగలవారు సంయమీంద్ర. 46

వ. సుక్షేత్రభూనిషేణాదు లైన రాజులు పదుండ్రు బ్రహ్మసావర్ణిపుత్త్రులై మేదినీ
తలంబు రక్షింపం గలవారు మఱియును. 47

తే. పదునొకండవమనువు భూవిదితకీర్తి
విష్ణుసావర్ణి యనుపేర వెలయు నతని
యంతరంబునఁ బృషుఁ డందు రమరవిభుఁడు
విహగకారుగమాదులు విబుధగణము. 48

---

ములు = ఋషులు, 45 దేవతాచక్రవర్తి = దేవరాజు - ఇంద్రుఁడు. 47 పదుండ్రు = పది
మంది. 48 భూవిదితకీర్తి = భూమియందు ప్రసిద్ధమైన యశస్సుగలవాఁడు,

వ. శనైశ్చరుండును సంస్తుతియును వహ్నితేజుండును వపుష్మంతుండును ననుజ్జ్వలుండును జ్వాలనుండును ననుభవ్యమూర్తులు సప్తసంయములు సర్వత్రగసుధర్మదేవానీకాదులు విష్ణుసావర్ణినందనులు గాఁగలవారు మఱియును. 49

తే. రుద్రసావర్ణి యనువాఁడు రుద్రసుతుఁడు
ద్వాదశాంతరమనువు తద్రాజ్యమునను
దైవతప్రభుఁడై ఋతుధాముఁ డుండు
హరితరోహితదేవాదు లమరవరులు. 50

వ. తపస్వియును దపోమయుండును దపోమూర్తియుఁ దపోరతియును దపోధృతియును దపోధనుండును ద్యుతిమంతుండును ననువారు సప్తమహర్షులు దేవోపదేవదేవశ్రేష్ఠాదు లైన రాజులు మనుపుత్త్రులు గాఁగలవారలు. 51

సీ. మఱి పదుమూఁడవమనువు రౌచ్యుం డను నవనీశ్వరుఁడు వానియంతరమున
సుత్రాముఁ డనువాఁడు సురలోకనాథుండు ధర్మసుధర్మసుకర్మముఖులు
ముప్పదిమువ్వురై యొప్పారెదరు సురగణములు నిర్మోహకప్రదర్శ
నిష్ప్రకంపావ్యయనిత్యనిరుత్సుకహితమతు లనుమును లేడుగురును

తే. సప్తసంయము లాదిత్యసవనచిత్ర, చిత్రసేనవిచిత్రాదిధాత్రిపతులు
మనుతనూభవులై మహీమండలంబు, తమభుజాశక్తిఁ బాలించెదరు మునీంద్ర.

వ. పదునాలవమన్వంతరంబున శుచి యనువాఁడు దేవేంద్రుండు గాఁగలవాఁడు. చాక్షుషసావిత్రకనిష్ఠవాచావృద్ధాదులు దేవగణంబు లయ్యెదరు. అగ్నిబాహుండును శుచిచిత్తుండును శుక్రుండును మాగధుండును నగ్నిరథుండును యుక్తుండును నజితుండును ననువారు సప్తమహర్షు లయ్యెదరు. గురుగంభీరముఖ్యాదులు మనుతనూభవు లయ్యెదరు. 53

క. ఈమనువులు నీయింద్రులు, నీమౌనులు నీనృపతులు నీదేవతలున్
శ్రీమహిళావల్లభతేజోమండితులైరి పద్మజునిదివసమునన్. 54

చ. వినుము చతుర్యుగాంతమున వేదము లన్నియు విప్లవంబులై
చనినమహీతలంబునకు సప్తమునీంద్రులు నేగుదెంచి పెం
పున బహువేదశాస్త్రములు మున్నిటియట్ల ప్రతిష్ఠచేసి రూ
ఢిని నొనరించుచుండుదురు డెబ్బదియొక్కమహాయుగంబునన్ 55

క. స్మృతులు ప్రతిష్ఠింతురు ప్రతి,కృతయుగముల మనువు లవనిఁ గీర్తులు వెలయన్
క్షితి పాలింపుదు రమ్మను, సుతులు దివిజవరులు క్రతుభుజులుఁ బెంపెసఁగన్. 56

క. మనువులు మనుపుత్త్రులు న,య్యనిమిషులును సప్తఋషులు నమరాధిపులున్
విను మాయా మన్వంతర,మున కధికారులు జగంబుఁ బోషింపంగన్. 57

54 శ్రీమహిళావల్లభ తేజోమండితులు=శ్రీవిష్ణునియొక్క తేజస్సుచేత అలంకరింపఁబడినవారు, పద్మజునిదివసమునన్=బ్రహ్మదినమునందు. 55 విప్లవంబులు=ప్రళయమునుపొందినవి - చెడినది, ప్రతిష్ఠచేసి=నిలిపి. 56 క్రతుభుజులు=దేవతలు. 58 నిశ్శేషకల్పంబు=మిగులులేనిదిగా లయము నొంధి

వ. ఇట్లు చతుర్దశమన్వంతరంబులును మనుసంధికాలంబులునుంగూడ సహస్రదివ్య యుగంబులై పితామహదివసం బగునప్పుడు నిశ్శేషకల్పంబై యుండుఁ దావత్ప్రమాణకాలంబై నిశాసమయంబునుం జెల్లుఁ బరమేశ్వరుండు బ్రహ్మరూపధరుండై మహార్ణవంబున శేషపర్యంకంబున నిజమాయామోహంబున సకలలోకభూతంబులను సంగ్రహించి సవిశేషంబగుమహత్త్వంబున యోగనిద్ర నొంది ప్రభాతసమయంబున మేలుకొని రాజసగుణోద్రిక్తుండై సృష్టిగావించు నిట్లు నానాకల్పంబులు ననల్పప్రకారంబున నిర్మించు మఱియును. 58

క. మనువులు మనువులసుతులును, మునులు సుపర్వులు సురేంద్రముఖ్యులు నబ్జాక్షునిసాత్త్వికగుణసంవర్ధనులై పాలింతు రతిముదంబున జగముల్. 59

క. ఆదియుగకాలమునఁ గపిలాదులరూపములు దాల్చి యఖిలమునకు దామోదరుఁ డతులజ్ఞానం, బాదేశించుచు వెలింగె నతులప్రీతిన్. 60

తే. చక్రవర్తిరూపంబులఁ జక్రధరుఁడు, తొడరి త్రేతాయుగంబున దుష్టశిక్షణంబు గావించి శిష్టలోకంబునెల్ల, లీల ధర్మంబు మెఱయఁ బాలించుచుండు. 61

క. ఆదేవుఁడు ద్వాపరమున, వేదవ్యాసత్వమునఁ బ్రవీణతతోడన్ వేదంబు లుద్ధరించుచు,నాదరమునఁ బెక్కుశాఖలై విలసిల్లన్. 62

ఆ. కలియుగంబునందుఁ గమలాయతాక్షుండు, కలికిరూపమున జగంబునందు వేదశాస్త్రమార్గవితతులు చెడకుండ, నరయుచుండుఁ గరుణ బెరయుచుండ. 63

వ. ఇట్లు భూతభవిష్యద్వర్తమానకాలాత్మం డైనయమ్మహాత్మునియధీనంబై సమస్తంబు విస్తరిల్లు ననిచెప్పిన విని మైత్రేయుం డిట్లనియె. 64

## వ్యాసకృత వేదవిభాగాది క్రమము.

సీ. ధరణీధరుండు వేదవ్యాసరూపంబు దానె గైకొని ప్రతిద్వాపరమున
వేదంబులను మఱి వేదశాఖాసహస్రంబును మఱి ధర్మశాస్త్రములఁ బ్ర
తిష్ఠించునని చెప్పితివి యతీతము లైనయేయేయుగంబుల నెవ్వరెవ్వ
రనఘ వేదవ్యాసు లైరి వా రెట్టెట్టి విధముల వేదముల్ విస్తరించి

తే. చదివి రీవేదముల కెన్ని శాఖలుగ నొ, నర్చి రెబ్బంగి దీపించినారు చెప్పు
నాకు ననుటయు వాసిష్ఠనందనుండు, పలికె మైత్రేయసంయమిప్రవరునకును.

మ. చలితాఘం బగువేదభూజమునకున్ శాఖోపశాఖాచయం
బులు పెక్కుల్గల వన్నియుం బ్రకటితంబుల్గా వివక్షింప నా
జలజాతాసనుఁడైన నోపఁ డిపు డే సంక్షేపరూపంబుగా

---

నది, పర్యంకంబు=శయ్య, ప్రభాతసమయంబునన్ = వేగుజామున, అనల్పప్రకారంబునన్ = అల్పముకానివిధమున. 59 సంవర్ధనులు=చక్కగా వృద్ధిపొందినవారు, 60 ఆదేశించుచున్ = ఉపదేశించుచు. 61 తొడరి = పూని - లీలన్ = విలాసముగా. 63 బెరయు=ప్రసరించు. 65 ధరణీధరుండు=విష్ణువు. 66 చలితాఘంబు=చలించినపాపముగలది—పాపహారము, భూజము=వృక్షము,

వెలయం జెప్పెద సావధానమతితో విన్నంత విప్రోత్తమా. 66

ఉ. తేజములుఁ వివేకములు ధీరతలుఁ గడునల్పముల్ గదా
భూజనకోటికంచుఁ దలపోసి తదీయహితార్థకారియై
యాంజలజాక్షుఁ డేకవిధమై కడగానఁగరాని వేదముల్
నైజముగా నొనర్చె మును నాలుగుభేదములై వెలుంగఁగన్. 67

వ. ఆనాలుగువేదంబులకును ఋగ్యజుస్సామాథర్వణంబులను సంజ్ఞలుచేసి సాంప్రతం బయిన వైవస్వతమన్వంతరంబున నతీతంబు లైనయష్టావింశతిమహాయుగంబులం గలద్వాపరంబులయందుఁ గ్రమంబున బ్రహ్మయుఁ బ్రజాపతియు శుక్రుండును బృహస్పతియును సూర్యుండును మృత్యువును దేవేంద్రుండును వసిష్ఠుండును సారస్వతుండును ద్రిధాముండును ద్రివృషుండును భరద్వాజుండును నంతరిక్షుండును ధర్ముండును ద్రయ్యారుణియును ధనంజయుండుచు గృతంజయుండును సంజయుండును భరద్వాజుండును గౌతముండును ఉత్తముండును* వాజిశ్రవుండును సోమశుష్మాయణుం డనుతృణబిందుండును వాల్మీకియు మజ్జనకుం డైనశక్తియును నేనును జాతుకర్ణుండును మత్పుత్రుం డైనకృష్ణద్వైపాయనుండును వేదవ్యాసరూపంబులు ధరియించి వేదవేదాంగధర్మశాస్త్రపురాణాగమంబులు మొదలుగాఁ బదునెనిమిదివిద్యలు జగంబులం బ్రసిద్ధంబు చేసితిమి. ద్రోణపుత్రుం డైనయశ్వత్థామ ముందరిద్వాపరయుగంబున వేదవ్యాసుండు గాఁ గలవాఁ డివ్విధంబున నానామన్వంతరంబులయందునుం గలనానాద్వాపరంబుల నొక్కొక్కమహాత్ముండు వైష్ణవాంశంబున వేదవ్యాసుండై వేదంబు లుద్ధరించు నని చెప్పి మఱియు నిట్లనియె. 68

క. వేదంబు తొల్లి నాలుగు,పాదంబులతో సహస్రభావమ్ముగ సం
పాదించి రంబుజాతభ,వాదులు వ్యాసస్వరూపులై క్రతువులకున్. 69

క. నాపుత్త్రుఁ డైనకృష్ణ,ద్వైపాయనమౌని వైష్ణవం బగుమహిమన్
దీపించెఁ గాకయుండిన, నీపాటికవిత్వరచన నెవ్వఁడు నేర్చున్. 70

వ. తొల్లి వల్మీకసంభవుం డైనవాల్మీకి బ్రహ్మచేత నియుక్తుండై రామాయణం బేడుకాండంబులు నేనూఱుసర్గలు నిరువదినాలుగువేలశ్లోకంబులుగాఁ దేర్చి కావ్యంబు చేసె నతనియట్ల కృష్ణద్వైపాయనుండును మహాభారతంబు హరివంశయుక్తంబుగా నూఱుపర్వంబులు సపాదలక్షగ్రంథంబునుగాఁ జేసి జగంబులఁ బ్రసిద్ధంబు గావించె ఆవ్యాసవాల్మీకు లిరువురు నాదికవీంద్రు లైరి వారియందు. 71

---

వివక్షింపన్ = విశదపఱుప, వెలయన్ = ప్రసిద్ధముగా. 67 హితార్థకారి = మేలైనప్రయోజనమును చేయువాఁడు, నైజముగాన్ = స్వభావముగా. 68 సంజ్ఞలు = గుఱుతులు - పేరులు, సాంప్రతంబు = ఇప్పుడు జరగునది, అతీతంబులు = కడచినవి. 69 అంబుజాతభవాదులు = బ్రహ్మ మొదలగువారు. 71 వల్మీకసంభవుండు = పుట్టయందుఁ బుట్టినవాఁడు, నియుక్తుండు = నియో

*ఇతనికి హర్యాత్ముఁడు అని నామాంతరము.

శా. వేదక్ష్మారుహమూలకంద మసకృద్విజ్ఞానభానుప్రభా
చ్ఛాదీభూతమహోగ్రపాతకతమశ్ఛాదంబు నానారస
ప్రాదుర్భూతమహాకవిత్వరచనాపారీణుఁ డైనట్టియా
వేదవ్యాసమునీశ్వరుండు వెలసెన్ విష్ణుప్రభావంబునన్. 72

వ. అట్టి వేదవ్యాసుం డైనకృష్ణద్వైపాయనుండు బ్రహ్మచేత నియుక్తుండై వేదంబులు నాలుగుపాదంబులుగాఁ జతుర్భేదంబుఁ జేసి యందు ఋగ్వేదంబు పైలుండును యజుర్వేదంబు వైశంపాయనుండును సామవేదంబు జైమినియు నథర్వవేదంబు సుమంతుండును పురాణేతిహాసంబులు రోమహర్షణపుత్త్రుం డగుసూతుండునుం జదువునట్లుగా నియమించె. వారలందఱు దమతమశిష్యప్రశిష్యసంతతులచేతం జదివించిన వారివారిపేర శాఖాసహస్రంబు లయ్యె నెట్లనిన. 73

క. పైలుఁడు ఋగ్వేదము గుణ,శీలురు బోధాయనాదిశిష్యవరులచే
నాలోడింపఁగఁ జేసె వి,శాలగతిన్ బహుసహస్రశాఖలు గల్గన్. 74

క. ధీయుతమతి యగువైశం,పాయనుఁ డాత్మీయవేదపాఠంబునకున్
భూయిష్ఠమహిమ నధికుం, డై యిరువదియేడుశాఖ లమరఁగఁ జేసెన్. 75

తే. చేసి యాశాఖలన్నియు శిష్యవరుల, చేతఁ జదివించె వారు విశేషమహిమ
దనర శిష్యప్రశిష్యసంతతులవలనఁ, బెక్కుశాఖలు గావించి రక్కజముగ. 76

వ. అట్టివైశంపాయనశిష్యులలోన. 77

ఉ. పుణ్యుఁడు బ్రహ్మరాతమునిపుత్త్రుఁ డుదంచితవేదపాదపా
రణ్యవిహారసింహుఁడు విరాజితభూరితపోమయుండు బ్ర
హ్మణ్యుఁడు యాజ్ఞవల్క్యుఁ యనుమౌనిగురున్ భజియించి వానికా
రుణ్యకటాక్షవీక్షణపరుం డగుచున్ విలసిల్లెఁ బెంపుతోన్. 78

ఉ. అమ్ముని యొక్కనాఁడు పరమార్థరహస్యము లైనవేదవా
దమ్ములు చేయుచున్ మునికదంబము లెల్ల వినంగ సప్తరా
త్రమ్ములలోన మద్గురుఁడు బ్రాహ్మణహత్య యొనర్చునట్టిపా
పమ్ము హరింప నోపుపరిపాటిమహత్త్వము గల్గు నాయెడన్. 79

వ. అని యిట్లు యాజ్ఞవల్క్యుఁ పల్కినవచనంబులు శిష్యులవలన విని వైశంపాయనుం డతనిమీఁదం గోపించియుఁ దనయం దతండు పరమభక్తుండు గావున నొండేమియు ననక యెప్పటియట్ల వేదంబులు చెప్పుచుండి తనయాజ్ఞలో నడవక ప్రల్ల

గింపఁబడినవాఁడు. 74 ఆలోడింపఁగన్ = విచారింప, విశాలగతిన్ - విశేషముగా ననుట. 76 అక్కజముగన్ = ఆశ్చర్యముగా. 78 వేదపాదపారణ్యవిహారసింహుఁడు = వేదములనెడువృక్షములుగల అడవియందు విహరించుటయందు సింహమైనవాఁడు - వేదములన్నియు చక్కగా చదివినవాఁడు అనుట, విరాజితభూరి తపోమయుండు = మిక్కిలి ప్రకాశించునట్టి అధికతపస్స్వరూపముగాఁగలవాఁడు, బ్రహ్మణ్యుఁడు = వేదవిహితమైన యాచారమునడుపువాఁడు, పెంపుతోన్ = గౌర

దంబున దురాచారంబు చేసినమేనల్లునిం గోపంబు నిలుపనోపక తన్నిన. 80

ఆ. బ్రహ్మహత్యతోడఁ బ్రతియైనయాపాప, మతనిఁ జెందె నప్పు డమ్మహాత్ముఁ
డిచ్చలోనఁ గలఁగి యింకఁ బ్రాయశ్చిత్త, కర్మ మెవ్విధమునఁ గలుగునొక్కొ.

తే. అని విచారించి శిష్యుల నపుడు పిల్చి, మీరలందఱు ననుసంక్రమించినట్టి
పాప ముడుగంగ వ్రతము సద్భక్తితోడ, నాచరింపుఁడు నావుడు యాజ్ఞవల్కి.

క. గురువులఁ గనుఁగొని యే నీ, దురితముఁ బాపంగ నోపుదును వీరలు నా
సరిగారు నామహత్త్వం, బరయుము నాయంతవారలా యీవిప్రుల్. 83

క. అనియిట్లు గురుసన్నిధిఁ, దనగర్వము మెఱసి విప్రతతులను నిందిం
చిన నావైశంపాయన,ముని మండుచు యాజ్ఞవల్క్యమునిఁ కిట్లనియెన్. 84

తే. ఓరి నాముందఱనె మొగమోటలేక, నీవు గర్వించి బ్రాహ్మణనింద చేసి
తిది మహాపాతకముగాన నింక నిన్ను, నొల్ల నినుఁ జూచినను గోప ముడుప లేను.

వ. కావున నీవు నావలన నేర్చినవేదంబు మరలం గ్రక్కి పొమ్మనిన. 86

చ. అనఘుఁడు యాజ్ఞవల్కి గురునంఘ్రులకుం బ్రణమిల్లి నామదిన్
ననిచినభక్తితోఁ బలికినాఁడను గర్వము లేదు దుష్టుగా
ననుటయు నంతకంత కతఁ డాడినమాటయె యాఁడుగాని శి
ష్యునిఁ బరమానురాగమునఁ జూడఁడు కోపభరంబు పెంపునన్. 87

వ. యాజ్ఞవల్కియు ననేకప్రకారంబులం బ్రార్థించి యతనివలన మెత్తఁబాటుగానక
మున్ను తననేర్చినవేదంబులు రుధిరరూపంబుగా ఛర్ది చేసి యెుండుకడకుంబోయి
గురువు బ్రహ్మహత్యవాయునుపాయంబులైనవ్రతంబులు సేయుచుండె నంత.

క. అత్తపసి యిట్లు గ్రక్కిన, నెత్తురుమాంసములు నైననిఖిలశ్రుతులున్
దిత్తిరిపతులు మ్రింగినఁ, దిత్తిరు లనుశాఖలయ్యె ధృతి నెల్లెడలన్. 89

ఆ. అంత యాజ్ఞవల్కి యాచార్యదోషంబుఁ, బాపి గురువుమీఁదిభక్తిఁ జేసి
దోషరహితబుద్ధితోడఁ బ్రాణాయామ, మహితుఁడై తపస్సమాధినలస. 90

వ. సకలవేదమయుండైనసూర్యదేవుని నారాధించుచుండె నంత. 91

తే. వాజిరూపంబుతో వచ్చి వనజహితుఁడు, యాజ్ఞవల్కికిఁ బ్రత్యక్షుఁడై వరంబు
వేఁడు మనుటయు భక్తిని వినుతిచేసి, బహువిధంబుల వినుతించి పల్కెసతఁడు.

తే. అనఘ నాగురుఁ డెఱుఁగనియతిరహస్య, మగుయజుర్వేద మిపుడు నే నభ్యసింప

వముతో. 79 కదంబములు = సమూహములు, పరిపాటి = అనుసరించునది - అంతమాత్రము అనుట. 80 ప్రల్లదంబునన్ = ముష్కరత్వముతో, దురాచారంబు = చెడ్డనడత. 81 కలఁగి = కలఁతనొంది. 82 సంక్రమించినట్టి = పొందిన, ఉడుగంగన్ = అణఁగ - పోవ. 83 దురితము = పాపము. 84 మండుచున్ = కోపవికారమును జూపుచు 85 మొగమోట = దాక్షిణ్యము. 87 ననిచిన = అతిశయించిన, కోపభరము = కోపముయొక్క అతిశయము. 88 మెత్తఁబాటు = మృదుత్వము - దయకలిగినతనము, రుధిరరూపంబుగాన్ = నెత్తురుగా, ఛర్ది చేసి = క్రక్కి. 92

వలయు నీచేత ననిన నావనజహితుఁడు, గరుణ దైవాఱఁ గతిపయకాలమునకు.

వ. పరమరహస్యం బైనశుక్లయజుర్వేదంబు చదివించె నవ్వేదంబు పదియేనుదెఱం
గులై వాజిశాఖ లనం బ్రసిద్ధంబు లయ్యె నాశాఖలు కణ్వాదిమహామునుల
చేత నభ్యస్తంబు లయ్యె మఱియును. 94

క. జైమినిముని తా నేర్చిన, సామమునకు బహుసహస్రశాఖలు గలుగం
గా ము న్నొనర్చి శిష్యుల, చే మూడుజగంబులందుఁ జెలఁగఁగఁ జేసెన్. 95

క. ఆది సుమంతుఁ డథర్వణ, వేదము బహుసంహితలుగ విరచించి మనో
మోదమున శిష్యవరులస,మాదరమున నభ్యసించు నట్లుగఁ జేసెన్. 96

వ. మఱియు వేదవ్యాసశిష్యుం డైనసూతుండు సకలపురాణంబులు నాఖ్యానోపా
ఖ్యానంబులు నేర్పడునట్లుగాఁ దనశిష్యు లైనసుమతియు నగ్నివర్చుండును
మిత్రుండును శంఖపాలుండును కృతవ్రణుండును సావర్ణియు నను నార్వుర
చేతం జదివించిన 97

క. వా రఖిలద్వీపంబులఁ, బౌరాణికులై యనేకభంగుల గీర్వా
ణోరగనరకిన్నరదే,వారులలోకములఁ జదివి రధికప్రీతిన్. 98

అష్టాదశపురాణముల యనుక్రమణికయు, చతుర్దశవిద్యల తెలివిడియు.

మ. భువి బ్రహ్మాండము వామనంబు గరుడంబున్ స్కాందమున్ గూర్మ భా
గవతాగ్నేయకమాత్స్యలైంగములు మార్కండేయమున్ బాద్మవై
ష్ణవశైవంబులు నారదీయము భవిష్యద్బ్రహ్మకైవర్తది
వ్యవరాహంబులు నాఁ బురాణములు ముయ్యాఱయ్యె విప్రోత్తమా. 99

వ. అవి సర్గప్రతిసర్గవంశమన్వంతరవంశానుచరితంబు లనుపంచలక్షణంబులం జెప్పఁ
బడియుండును. 100

ఆ. ఏను నీకు నిప్పు డెఱిఁగించుచున్నవై,ష్ణవపురాణ మఖిలజగములందు
వేదసమ్మతంబు వివరించి చెప్పఁగాఁ, బడుటఁ జేసి చాలఁ బ్రభవహించె. 101

వ. మఱియును వేదంబులు నాల్గును వేదాంగంబు లాఱును మీమాంసయును
న్యాయశాస్త్రంబును ధర్మశాస్త్రంబును సకలపురాణజాలంబును జతుర్దశవిద్య
లయ్యె నివియును నాయుర్వేదంబును ధనుర్వేదంబును నీతిశాస్త్రంబును నర్థ
శాస్త్రంబునుంగూడఁ బదునెనిమిదివిద్యలని చెప్పంబడి బ్రహ్మర్షిదేవర్షి రాజర్షుల
చేత నుపన్యసింపంబడు ననిన మైత్రేయుం డిట్లనియె. 102

క. నా కిపుడు మీరు చెప్పిన, యీకథ లన్నియును వింటి నింకను సుగుణ

---

వాజి=గుఱ్ఱము, వనజహితుఁడు = సూర్యుఁడు. 93 దైవాఱన్=అతిశయింపఁగా, కతిపయకాలము
నకున్ = కొంతకాలమునకు. 94 అభ్యస్తములు=అభ్యసింపఁబడినవి. 95 చెలఁగఁగన్=ప్రసిద్ధ
మగునట్లు. 98 గీర్వాణ=దేవతలయొక్క, దేవారుల = దానవులయొక్క. 99 భువిన్=భూలోక
మునందు, మయ్యాఱు = పదునెనిమిది. 101 ప్రభవహించెన్ = ప్రకాశమును పొందెను. 102
ఆయుర్వేదము = వైద్యశాస్త్రము, ఉపన్యసింపంబడును = చెప్పఁబడును. 103 సుగుణస్వీకార=

స్వీకార యొకరహస్యము, నైకొని చెప్పంగవలయుఁ గరుణాదృష్టిన్. 103

## యమయాతనానివృత్త్యుపాయమును దెలుపుట.

సీ. పాతాళలోకసప్తకము సప్తద్వీపములు సప్తసాగరములును సప్త
లోకంబులును మొదలుగఁ గలబ్రహ్మాండభాండమధ్యంబున నిండియున్న
స్థూలరూపంబులు సూక్ష్మరూపంబులు స్థూలంబులకు నతిస్థూలములును
సూక్ష్మంబునకు నతిసూక్ష్మమై చెలువొందు ప్రాణికోటులచేతఁ బట్టు చాల
తే. కున్న యది కర్మబంధనియుక్తిఁ బరఁగు, జంతువులు దండధరుచేతఃజచ్చి తీవ్ర
వేదనలఁ గుందుచుందురు వీర లధిక, దుఃఖములఁ బొందకుండెడుత్రోవఁ గలదె.
క. అనవుడుఁ బరాశరుం డి, ట్లనుఁ దొల్లి మహానుభావుఁ డగుకాళింగుం
డనుమౌని నాకు నెంతయు, వినయంబున సేవచేసి వేడుకతోడన్. 105
ఆ. అధికభక్తి నున్న యతనికి జాతిస్మ,రత్వ మొసఁగి ధర్మరతునిఁజేసి
యున్న యతఁడు నాకు నొక్కనాఁ డేకాంత,వేళ నధికభక్తి వినతిచేసి. 106
క. ఇప్పుడు నను నీ వడిగిన, చొప్పున నేతద్రహస్యసూక్ష్మంబులు వా
తప్పక ప్రశ్న మొనర్చినఁ, జెప్పితి విను తత్కథావిశేషము లనఘా. 107
వ. తొల్లి నకులుం డనుమహాముని యమకింకరభయంకరం బైననరకలోకంబున నత్యంతదుఃఖభూతులై యున్నప్రాణులం జూచి వగచుచుఁ బితామహునిపాలికిం జని నీవు నన్నడిగినయట్ల యడిగిన నతనితోడ యమకింకరసంవాదం బను నొక్కకథ గలదు వినుమని యిట్లనియె. 108
ఆ. యమునిచే నియుక్తులై కింకరులు పాశ, దండహస్తు లగుచు దండితోడ
నొప్పుఁ దప్పు నరసి యుర్విలోఁ బ్రాణులఁ, బట్టితెచ్చుటకును బైనమైన. 109
తే. యముఁడు కింకరవరుని డాయంగఁ బిల్చి
వానికర్ణములందు నెవ్వరు నెఱుంగ
కుండ నేకాంతమునఁ గొన్ని యుగ్గడించి
పనిచె నావచనంబు లేర్పడఁగ వినుము. 110

## యముండు తనకింకరులకు వైష్ణవమాహాత్మ్యమును దెలుపుట.

ఉ. నీవు మహీతలంబునకు నేగి ముకుందునిమీఁది భక్తిచేఁ
జేవ వహించి యున్నగుణశీలురఁ దెచ్చెదు సుమ్ము వైష్ణవుల్
పావను లమ్మహాత్ములకుఁ బాపము లెన్నఁడుఁ జెంద వెమ్మెయిన్

---

మంచిగుణమును వహించినవాఁడా. 104 చెలువొందు=ఒప్పు, పట్టు=స్థానము. 106 జాతిస్మరత్వము=పూర్వజన్మమునందిట్టివాఁడనై యుంటిని అనుజ్ఞానము కలిగియుండుట, ధర్మరతునిన్=ధర్మమునందాసక్తునిఁగా, వినతి=నమస్కారము. 107 ఏతద్రహస్యసూక్ష్మములు=ఈరహస్యమైన సూక్ష్మవిషయములను, వాతప్పక = మాటపొరపాటులేక. 109 పాశదండహస్తులు = త్రాళ్లు కఱ్ఱలు చేతఁబట్టినవారు, దండితోడన్=గంభీరత్వముతో. 110 కింకరవరునిన్=కింకరులలోముఖ్యుని, ఉగ్గడించి =

గావున వారు లోకములకంటెను మాన్యులు ధన్యు లెంతయున్. 111
చ. నలినదళాక్షు రాజసగుణంబునఁ బుట్టినతమ్మిచూలికిన్
దలవరివాఁడనై తగినదండనముల్ గడుఁజేయునాకు ను
జ్జ్వలమహిమాఢ్యులై వెలయువైష్ణవులెల్ల నజేయు లట్టివా
రలదెస వోకుమీ బ్రతుకు బ్రాణములున్ వలతేని కింకరా. 112

వైష్ణవలక్షణము.

చ. అనుటయు గింకరుండు జలజాప్తతనూజునిఁ జూచి దేవ యా
వనరుహనాభభక్తజనవర్గము వేషము వారిశీలవ
ర్తనములు వారిచర్యలును వారిగుణంబులు నానతీఁగదే
యనుటయు నమ్మహాభటున కంతకుఁ డిట్లనిపల్కెఁ బెంపుతోన్. 113
ఆ. శత్రుమిత్రులందు సమబుద్ధియై నిజాచారవర్తనములవలన మెలఁగి
యల్పమైన నధికమైనఁ బరద్రవ్య, వాంఛ లేనివాఁడె వైష్ణవుండు. 114
తే. పసిఁడియైనను దృణమైనఁ బరులసొమ్ము, ఏకతంబునఁ దన కబ్బెనేనిఁ గొనక
యధికశుద్ధాత్ముఁడై యుండు నాశలేక, వాఁడె లోకోత్తరుండైనవైష్ణవుండు 115
క. తనకుఁ గలికలుష మొదవిన, మనసున దుఃఖంబు లేక మధుసూదనుపైఁ
గొనకొన్న భక్తి వదలని, మనుజుఁడెపో విష్ణుభక్తిమహితుఁడు జగతిన్. 116
తే. స్ఫటికశైలశిలామలోద్భాసివాసు,దేవుఁ డెక్కడ మత్సరాధీనమలిను
లైనమానవు లెక్కడ యమృతకిరణు, తుహినరశ్మిమధ్యంబున దహనునట్లు. 117
వ. అని విచారింపుము. 118
తే. అమలహృదయవిమత్సరులై ప్రశాంతు
లై సమస్తభూతంబులయందు మిత్రు

---

చెప్పి, పనిచెన్=పంపెను. 111 చేవ=సత్త, లోకములకంటెన్ = ఎల్లలోకములకంటెను, మాన్యులు = గౌరవింపఁదగినవారు, ధన్యులు=కృతార్థులు, 112 తమ్మిచూలికిన్ = బ్రహ్మకు, తలవరివాఁడను = బంటను, ఉజ్జ్వలమహిమాఢ్యులు = మిక్కిలి ప్రకాశించునట్టి మహిమగలవారు, వలతేని= అపేక్షించువాఁడవైతివేని. 113 జలజాప్తతనూజునిన్ = సూర్యునికొడుకును—యముని, శీలవర్తనములు = మంచియాచారములు, చర్యలు=చేష్టలు, అంతకుఁడు = యముఁడు. 115 పసిఁడి = బంగారు, ఏకతంబునన్ = ఏకాంతమునందు-సొమ్ముగలవారు ఎదుటలేనియెడ, అబ్బెనేని = దొరకిన పక్షమున, కొనక=తీసికొనక, అధికశుద్ధాత్ముఁడు = మిక్కిలి పరిశుద్ధమైన మనసుగలవాఁడు, లోకోత్తరుండు=ఎల్లలోకులకును అవలివాఁడు-అందరియందును ముఖ్యుఁడు. 116 కలుషము = పాపము, కొనకొన్న=తుదముట్టిన - అతిశయించిన, మహితుఁడు = పూజ్యుఁడు. 117 స్ఫటికశైలశిలామలోద్భాసి = పటికపుకొండయందలి రాళ్లవలె స్వచ్ఛముగా ప్రకాశించువాఁడు, మత్సరాధీనమలినులు = విడుపనివిరోధమునకు అధీనులగుటచే ప్రకాశహీనులైనవారు, అమృతకిరణుతుహినరశ్మిమధ్యంబునన్= చంద్రుని చల్లనికిరణములనడుమ, దహనునట్లు = అగ్నిహోత్రునివలెనే. 119 అమలహృదయ

లై యతిప్రియవాక్యులై నట్టివారి
హృదయములయందు వర్తించు నీశ్వరుండు. 119

క. హరికరుణవలనఁ బొదలిన, పురుషుం డత్యంతసౌమ్యమున విలసిల్లున్
సరస మగుభూమిఁ బుట్టిన, ధరణీరుహ మెలమిఁ బొంది తనరినభంగిన్. 120

చ. యమనియమాదియోగనియతాత్ముల నిర్గతమానమత్సరో
ద్యములఁ బరాంగనాజనపరార్థ పరాఙ్ముఖులన్ సమస్తధ
ర్మమయుల సర్వలోకజనమాన్యుల నచ్యుతపాదపద్మస
క్తమతులఁ జేరఁబోవకుము ధన్యులు వారలు గానఁ గింకరా. 121

తే. శంఖచక్రగదాభయచారుహస్తుఁ
డైనయావాసుదేవుని నాత్మఁ దలఁచు
వారి కెన్నఁడు మనవంటివారు వెఱతు
రంధకారంబు నిలుచునే యర్కు నెదుర. 122

ఆ. ప్రాణిహింస చేసి పరులయర్థము గొని, యనృతనిష్ఠురోక్తు లాడి యశుభ
కర్మనిరతుఁ డైనదుర్మతి కతిదూరుఁ, డగుచునుండు విష్ణుఁ డనుదినంబు. 123

ఆ. ఒరులకలిమి చూచి యోర్వక సుజనుల, నిందచేసి యధికనీచకర్ము
లైనయధములకు ననంతుఁడు కడుదూర, వర్తి యగుచు నుండు వసుధయందు.

ఆ. అధికదుష్టచిత్తుఁడై యర్థతృష్ణతో, మిత్రబంధుసుతకళత్రమాతృ
సహజపితృధనములు చౌర్యంబు గావించు, నతనియందు విష్ణుఁ డలిగియుండు.

వ. కావున విష్ణుపరిగ్రహంబు లేనిదురితమతులు మనవలనియతిక్రూరదండంబునకు నర్హులు పరమవైష్ణవులకు సకలశోభనకల్యాం బగుకైవల్యంబు గాని మనలోకంబు దుర్గమంబు. అని యిట్లు వైవస్వతుండు భీష్ముం డనుకింకరునకుం జెప్పిన విధంబు పద్మయోనివలన నకులుం డెఱింగెఁ దదీయవృత్తాంతం బేను గాళింగున కుపన్యసించిన నతండు గృతార్థుండై పోయెం గావున నీవు నీయర్థంబులు యథా

విమత్సరులు = నిర్మలమైన మనస్సుచేత మత్సరములేనివారు. 120 పొదలిన=వృద్ధిపొందిన, సౌమ్యమునన్ = తిన్నఁదనముచేత, ఎలమిన్ = వికాసమును, తనరినభంగిన్ = వృద్ధిఁబొందినట్లు. 121 నిర్గతమాన మత్సరోద్యములన్=పోయిన గర్వముయొక్కయు చలముయొక్కయు పూనికగలవారిని, పరాంగనాజనపరార్థపరాఙ్ముఖులన్=అన్యస్త్రీలయందును అన్యులధనమునందును మాఱుమొగముగల వారిని, సమస్తధర్మమయులన్=ఎల్లధర్మములును స్వరూపముగాఁగలవారిని, సర్వలోకజనమాన్యులన్= ఎల్లలోకములలోని ప్రజలచేతను గౌరవింపఁదగినవారిని, అచ్యుతపాదపద్మసక్తమతులన్ = విష్ణుపాద కమలములయం దాసక్తిగలమనసుగలవారిని. 123 అర్థము = ధనము, అనృతనిష్ఠురోక్తులు=అసత్యములును కఠినములునైనమాటలను, అనుదినంబు=ప్రతిదినము-ఎల్లప్పుడును. 124 దూరవర్తి=దూరముగా నుండువాఁడు. 125 అర్థతృష్ణతోన్=ధనమునందలి యాశచేత, చౌర్యంబు=దొంగతనము. 126 పరిగ్రహంబు=కైకోలు-అంగీకారము, దురితమతులు=పాపబుద్ధులు, సకలశోభనకల్యంబు=ఎల్ల మేలులను

ర్థంబులుగా విచారింపుము వాసుదేవారాధనతాత్పర్యహృదయులై యుండు వారికి నరకలోకంబులు నుద్దండదండధరదండనంబులును లేవు విను మన మైత్రేయుం డిట్లనియె. 126

తే. అనఘ సంసారవిజిగీషు లగుమహాత్ము, లాదిదేవు ననంతుని నవ్యయాత్ము
నిందిరానాథు భజియించి యెట్టిఫలము, లందుదురు నాకుఁ దెలియంగ నానతిమ్ము.

క. అనవుడుఁ బరాశరుం డి, ట్లను సగరుఁడు దొల్లి యేతదర్థము నౌర్వుం
డనుదివ్యయోగి నడిగిన, వినిపించె నతండు లోకవిస్పష్టముగన్. 128

వ అది యెట్లనిన నిక్ష్వాకుకులసంభవుం డైనసగరచక్రవర్తి భార్గవుం డైనయౌర్వు కడకుం జని నమస్కరించి యిట్లనియె. 129

తే. భూసురోత్తమ విను మహాపురుషులకును
మాధవారాధనోపాయమహిమ యెట్టు
లమ్ముకుందుని భజియించు నమ్మహాత్ము
లేమిఫలములఁ బొందుదు రెఱుఁగవలయు. 130

వ. అనిన నౌర్వుం డిట్లనియె. 131

తే. వసుమతీశ మనోరథవర్గమైన, భౌమమైనను నాకసంప్రాప్తియైన
మోక్షమైనను గాంతు రబ్జాక్షుఁ గొలిచి, కోరినట్ల ఘనంబైనఁ గొంచెమైన. 132

క. తమతమవర్ణాశ్రమధర్మములయెడన్ నిరతులైనమనుజులచేతన్
గమలాక్షుఁ డగుముకుందుఁడు, ప్రమోదమతియై యభీష్టఫలముల నొసఁగున్.

తే. యజ్ఞకర్మాదివిధులచే యాజ్యుఁ డగును
జపవిధేయులచేతను జప్యుఁ డగును
దూషకులచేత నత్యంతదూష్యుఁ డగుఁ బ
యోజనాభుండు భూతమయుండు గాన. 134

సీ. పరధనంబుల కాసపడక పరస్త్రీలఁ దలఁపక జీవహింసలకుఁ జొరక
యొకరిఁ గోపించి తిట్టక సాధుజనులకుఁ గీడు సేయక తనతోడ నెమ్మి
గలవారియెడ దురాగ్రహము వాటింపక గురుజనంబులయెడఁ బరమభక్తి
వదలక సకలదేవబ్రాహ్మణోపాస్తి విడువక రిపునైనఁ గొడుకునైన

తే. నాత్మయట్లు పాలించి వర్ణాశ్రమక్రమమున నియతాత్ములై శాస్త్రమార్గములను
ధీరులై యున్నవారిచే దేవదేవుఁ, డగుముకుందుండు పూజితుం డగుచునుండు.

---

తెలుపునది, దుర్గమంబు = పొందరానిది, వైవస్వతుండు = యముఁడు, పద్మయోనివలనన్ = బ్రహ్మ వలన, ఉద్దండ = ఉద్ధతమైన. 127 విజిగీషులు = జయింపనిచ్ఛయించువారు. 132 భౌమము = భూసంబంధియైనది, నాకసంప్రాప్తి=స్వర్గప్రాప్తి. 133 ప్రమోదమతి = సంతోషించిన మనసుగల వాఁడు. 134 యాజ్యుఁడు=యజింపఁదగినవాఁడు-యజ్ఞమునందు పూజింపఁదగినవాఁడు. జప్యుఁడు= జపింపఁదగినవాఁడు, భూతమయుండు=సర్వజీవస్వరూపుఁడు. 135 నెమ్మి=స్నేహము, ఆత్మయట్లు=

క. ధాత్రీశ వినుము విప్ర, క్షత్రియవిట్శూద్రజాతిజనులు నిజాచా
రత్రాణపరత నడిపిన, స్తోత్రారాధనల శౌరి తుష్టుఁ డగుఁ జుమీ. 136

వ. అనిన నమ్మహీపతి యతని నవలోకించి మహాత్మా వర్ణాశ్రమధర్మంబు లెఱుంగ
వలయు నానతి మ్మనిన నౌర్వుం డిట్లనియె. 137

## వర్ణాశ్రమ ధర్మాద్యభివర్ణనము.

సీ. ఉచితజ్ఞుఁడై దాన మొసఁగుచు దేవార్చనాశీలుఁడై కరుణంబు గలిగి
యగ్నిపరిగ్రహుం డగుచు నిరంతర స్వాధ్యాయతత్పరుండై కుటుంబ
వృత్త్యర్థయజనంబు వేదవిక్రయమును మాని శుక్లముఁ గొని దాన మొరుల
వలనఁ గైకొనక సర్వప్రాణులకు హితకారియై మైత్రియు గౌరవంబు
తే. మనుజులకునెల్లఁ జేయుచు మణియు శిలయుఁ
దనకు సరియ కాఁ జూచుచు ధర్మపత్ని
నొనర బుతుకాలములయందె యనుభవించి
నియతుఁడై యుండుటది విప్రునికి మతంబు. 138

సీ. క్రతువులు సేయుట శ్రుతు లభ్యసించుట దానంబు లొసఁగుట ధర్మి యగుట
శస్త్రజీవికయు భూచక్రరక్షణమును మఱవకుండుట వేద నెఱిఁగి తగిన
భంగిఁ బోఁ్రచుట పరబాధలు లేకుండఁ బ్రజలరక్షించుట బ్రాహ్మణులకు
భక్తిఁ గావించుట పాపకర్ముల వధించుట శిష్టజనులఁ బ్రోచుట త్రివర్గ
తే. పరత నేమఱకుండుట పార్థివునకుఁ
బరమధర్మంబు లగు నిట్లు బ్రతికెనేని

---

తనవలె, పూజితుండు = పూజింపఁబడినవాఁడు. 136 నిజాచారత్రాణపరతన్ = తమనడవడిని కాపాడుకొనుటయందు ఆసక్తిగలవారగుటచేత, తుష్టుఁడు = సంతోషించినవాఁడు, 138 వృత్త్యర్థయజనంబున్ = జీవనార్థమైనయజ్ఞము చేయుటను - యజ్ఞము చేయు నెపము పెట్టి ధనమార్జించుట, వేదవిక్రయమును = జీతమునిర్ణయించుకొని వేదముచెప్పుటను, సంస్కృతమునందు శ్లో. "వృత్త్యర్థం యాజయేచ్చాన్యానన్యానధ్యాపయేత్తథా, కుర్యాత్ప్రతిగ్రహాదానం శుక్లార్థాన్న్యాయతో ద్విజః." అని యాజనాధ్యాపన ప్రతిగ్రహములు బ్రాహ్మణులకు ముఖ్యవృత్తులుగాఁ జెప్పఁబడియుండుటవలన ఇచ్చుట (వృత్త్యర్థయజనంబు వేదవిక్రయమును మాని) అనుచో యజ్ఞముచేయు నెపంబున ధనమార్జించుటయు, జీతమునిర్ణయించుకొని వేదముఁజెప్పుటయును అని అర్థము వ్రాయఁబడెను. కాఁబట్టి జీవనార్థమై యాజనాధ్యాపనములు చేసి శాస్త్రసమ్మతముగా వచ్చిన దక్షిణాదులఁ బ్రతిగ్రహింపవచ్చు నని భావము. శుక్లమున్ = స్వవృత్తిచే ధనమార్జించునట్టి విప్రాదులవలని పరిశుద్ధద్రవ్యమును, ఈశుక్లశబ్దార్థమును శ్లో, "క్రమాగతం ప్రీతిదాయం ప్రాప్తం చ సహభార్యయా, అవిశేషేణ సర్వేషాం ధనం శుక్లముదాహృతమ్." అని విష్ణువును, శ్లో. "శ్రుతశౌర్యతపః కన్యాయాజ్యశిష్యాన్వయాగతం, ధనం సప్తవిధం శుక్లం." అని నారదుఁడును వివరించి యున్నారు. హితకారి = మేలు చేయువాఁడు, మతంబు - ధర్మము. 139 ధర్మి = ధర్మము చేయువాఁడు, త్రివర్గపరతన్ = ధర్మార్థకామముల యం

లోకములు మెచ్చ నభిమతలోకములకుఁ
బోవు నాభూమిపాలుఁడు భూవరేణ్య. 139

సీ. బ్రాహ్మణక్షత్త్రియోపాస్తి దప్పక శ్రుతు లభ్యసించుచు దాన మర్హ్మావృత్తి
నొసఁగుచుఁ బరధనం బొల్లక నిత్యనైమిత్తికక్రియలను మేరచెడక
నిర్మలానుష్ఠానకర్ముఁడై క్రయవిక్రయములందు నెంతయు విమలుఁ డగుచు
ధర్మమార్గమున నర్థముఁ గూడఁ బెట్టుచు వ్యవహారపరిశుద్ధవర్తి యగుచుఁ
తే. పైరు వాణిజ్యమును బశుపాలనంబు, వదలకుండంగవలయును వైశ్యవరుని
కనుచు లోకపితామహుం డాదియందుఁ, బలికె వేదార్థసరణిగాఁ బార్థివేంద్ర.

సీ. వసుధామరక్షత్త్రవైశ్యజాతులకు శుశ్రూషలు గావించుచును గులోచి
తాచారనియతాత్ముఁడై పంచయజ్ఞంబు లాచరించుచుఁ బాత్ర మరసి దాన
మొనరించుచును సర్వజనులయందును బ్రీతికారవాత్సల్యతాకలితుఁ డగుచుఁ
బరనిందయును నాత్మపౌరుషస్తుతియును జేయక తనచేయుసేవవలన
తే. నఖిలజనములు ప్రియమందునట్టిమహిమ
గలిగి ఋతుకాలములయందుఁ గాంత గవిసి
నిష్ఠనుండుట సచ్ఛూద్రునికి మతంబు
చేసెఁ బద్మాసనుఁడు పూర్వసృష్టియందు. 141

ఉ. మైత్రియు సత్యముఁ దయయు మంచితనంబును మాయలేమియుం
బాత్ర మెఱింగి యిచ్చుటయుఁ బ్రాణులయందు సమత్వముఁ గుణా
మిత్రతయుం బ్రశాంతమును మేళనమై విలసిల్లు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రులకు సంతతముఁ ధరణీతలేశ్వరా. 142

తే. ఎంతదురవస్థవచ్చిన నెంతగీడు, గల్గియుండిన నెన్నివిఘ్నంబులైనఁ
దనకులాచారమార్గముల్ దప్పనడుచు, టనుచితం బనిచెప్పెఁ బద్మాసనుండు. 143

వ. అనియిట్లు వర్ణాశ్రమధర్మంబు లుపన్యసించి యాశ్రమంబులు చెప్పువాఁడై
భృగువంశసంభవుండు కాకుత్స్థవంశసంభవున కిట్లనియె 144

తే. బాలకుం డుపనీతుఁడై బ్రహ్మచర్య, మాచరింపంగఁ బూని వేదాధ్యయనము
గోరి తనభక్తియుక్తి నెక్కొనినయట్టి, గురువు నత్యంతశాంతు సద్గుణవిశాలు.
తే. వేదశాస్త్రపురాణార్థవేది విగతరాగు గుణవంతు నానావిధాగమజ్ఞు

---

దాసక్తికలిగినతనముచేత, పార్థివునకుఁ = రాజునకు, 140 ఉపాస్తి=ఉపాసన - అర్చన, నిత్యము = ప్రతిదినము తప్పక చేయవలసినది, నైమిత్తికము = ఏదేనినిమిత్తముచేత పితృదేవతాదుల నుద్దేశించి చేయవలసినది, మేర=మర్యాద - క్రమము, సరణి=మార్గము. 142 మాయ = వంచన, మేళనము= కలగలుపు. 146 వేదశాస్త్రపురాణార్థవేదిఁ = వేదములయొక్కయు శాస్త్రములయొక్కయు పురాణములయొక్కయు యర్థములను తెలిసినవానిని, విగతరాగుఁ = పోయిన విషయానురాగముగలవానిని, గుణవంతుఁ = ఎల్లసద్గుణములుగలవానిని, ఆగమజ్ఞు=ఆగమములను తెలిసినవానిని,

నుభయకులశుద్ధు విజితేంద్రియుని మహాత్ము, నరసి యతనికి శిష్యుండై యధికభక్తి.

ఉ. సమ్మద మొప్పఁగా వినయసమ్మదముల్ దళుకొత్త గోత్రనా
మమ్ములు చెప్పి సాగిలి నమస్కృతిఁ జేసి తదాజ్ఞతోడ ని
త్యమ్మును సేవచేసి తనయందుఁ బ్రసన్నత గల్గియున్నచో
నమ్మహనీయుచేత శ్రుతు లభ్యసనం బొనరంచు టొప్పగున్. 147

చ. గురువుల కెన్నఁడేనిఁ బ్రతికూలము లాడక సాధువృత్తితో
బెరయుచుఁ దోడిశిష్యులకుఁ బ్రీతియొనర్చుచు నమ్మహాత్ముపై
నెరవును నేవయుఁ విడిచి యెక్కువతక్కువ లైనసేవలం
బొరయక వేదముల్ చదువఁ బూనిన మేలగు బ్రహ్మచారికిన్. 148

క. స్నానము సంధ్యయు జపమును, మానక హోమంబు రేపు మాపు నడిపి క
ర్మానుష్ఠానపరాయణుఁ, డై నిత్యముఁ జదువు టుచిత మగు వేదంబుల్. 149

క. తనగురుమతమున భిక్షా,శనము భుజించుచును సాధుజనమార్గముచే
నొనరిన వ్రతములు సేయుచు, ననఘా వేదములు చదువ నగు వడువునకున్. 150

తే. పత్రభాజనములును సంపన్న కంద
మూలములు సమిధలు జలంబులు ఫలంబు
లును మొదలుగాఁగ వదలక యనుదినంబు
నిచ్చి గురుకృప వేదంబు లెఱుఁగవలయు. 151

క. ఆచార్యునిసమ్ముఖమున, నీచగతి మెలంగి వినయనిపుణతఁ దత్కా-
లోచితసేవాపరుఁడై, యేచినవేదములు శిష్యుఁ డెఱుఁగఁగవలయున్. 152

వ. ఇవ్విధంబున బ్రహ్మచర్యాశ్రమంబున వేదాధ్యయనంబుచేసి గురుదక్షిణ యథాశక్తిపూర్వకంబుగా నొసంగి యాచార్యుచేత ననుజ్ఞాతుండై విధివంతంబుగా దారపరిగ్రహంబుచేసి ధర్మమార్గంబున నర్థం బుపార్జించి శక్త్యనుసారంబుగ గృహస్థధర్మంబులు నడుపుచు సత్పుత్రులం బడసి పితృఋణంబును యజ్ఞంబులం జేసి దేవతలఋణంబు నధ్యయనంబుచేసి మునీంద్రులఋణంబును బలిహరణాదులచేత భూతములఋణంబునుం దీర్చి వాత్సల్యంబున సకలలోకంబులను సంతోషింపం జేయుచు. 153

సీ. సన్న్యాసులును బ్రహ్మచారులు వేదవిద్యార్థులుఁ దీర్థయాత్రాభిముఖులుఁ
బరదేసులై భూమిఁ దిరిగెడువారును గతిలేక యాఁకఁటఁ గ్రాఁగువారు

---

ఉభయకులశుద్ధున్ = తల్లిదండ్రులైన యుభయులయొక్క వంశములవలన పరిశుద్ధుఁడైనవానిని, విజితేంద్రియునిన్ = గెలువఁబడిన యింద్రియములుగలవానిని. 147 అభ్యసనము=అభ్యాసము. 148 బెరయుంచున్ = చేరుచు, ఎరవు=భేదము, ఏవ=జుగుప్స-రోఁత, పొరయక=పొందక. 150 వడువు=వడుగు-బ్రహ్మచారి. 152 నీచగతిన్=తక్కువైన నవిధమున, ఏచిన=అతిశయించిన. 153 అనుజ్ఞాతుఁడు=అనుజ్ఞనుపొందినవాఁడు, దారపరిగ్రహంబుచేసి=పెండ్లిచేసికొని, ఉపార్జించి=సంపాదించి. 154 ఆఁకటఁగ్రాఁగువారు = ఆఁకటిచే తపించువారు, తెరువరులు=బాటసారులు, సదనములకున్=ఇండ్లకు,

దూరంబు నడచి ప్రొద్దునఁ బోక వచ్చినతెరువరులును మఱి దిక్కులేని
వేదబ్రాహ్మణులు వినోదంబులకుఁ దమ్ముఁ బొడగనవచ్చినభూమిసురులు
తే. మొదలుగ నతిథులయి తమసదనములకు
నేగుదెంచిన భక్తితో నెదురువోయి
తోడుకొనివచ్చి తనయింట దొరకినట్టు
లన్నపానంబులకు నుపాయంబు సేయఁ
గలుగుగృహమేధి పుణ్యలోకముల కరుగు. 154

ఆ. ఇంటఁ గలపదార్థ మేమియు దాఁపక, లేకయున్న ఋణము దేక యతిథి
కధికభక్తితోడ నన్నపానాదులఁ, దృప్తిసేయవలయు దినదినంబు 155

తే. అతిథి యాఁకలిగొని యింటి కరుగుదెంచి, కడునుదాసీనమునఁ బొంది వెడలెనేని
తనకుఁ గలపాప మాగృహస్థునకు నిచ్చి, వానిపుణ్యంబు గొనిపోవు వసుమతీశ.

ఆ. కాన నతిథియందు గర్వంబు మదమును, బరుసఁదనము బెరుకుఁ బ్రల్లదంబుఁ
బొడమకుండఁజేసి భోజనశయనాసనములఁ బ్రీతుఁ జేయు టమరు గృహికి.

వ. మఱియు ననేకప్రకారంబులైనగృహస్థధర్మంబుల నిర్మలులై కంటులేక వర్తించు
మహాత్ములు పుణ్యలోకసుఖంబుల ననుభవింతురు. ఇప్పు డతిథిసత్కారంబులు
సేయుగృహపతులు గలగ్రామంబులు సకలశోభనధామంబులు నానారిష్టవిరా
మంబులు నగు నట్టిగృహమేధిధర్మంబు విడుచుటకంటెను బాతకంబు లేదు
సుమీ యని పలికి మఱియును. 158

చ. పరమగృహస్థధర్మపరిపాలనఖేలనవృత్తి ధన్యుఁడై
పురుషుఁడు వార్ధకంబు తనుఁబొందినఁ బుత్రకులం దదాశ్రమా
కరులుగఁజేసి తానుఁ దనకాంతయుఁ గానకు నేగి సత్తప
శ్చరణవిధంబు లేమఱక సంతతముం దప మాచరించుచున్. 159

సీ. దినము దప్పకయుండఁద్రిషవణస్నానంబు జరిపి గడ్డము పెంచి జడలుగట్టి
భూశాయియై ఫలంబులు శాకములుఁ గందమూలంబులును భుజింపుచుమహాజి
నము కుశంబులు వల్కలములును దేవపూజనము భూదేవతర్పణముచేసి
మంత్రతంత్రముల హోమంబు యథాప్రకారంబునంజేసి భిక్షంబు బలియు
తే. నొనరఁబెట్టి వనస్నేహమున శరీర
మెల్ల నభ్యంగ మొనరించి హిమనిదాఘ

గృహమేధి = గృహస్థుఁడు. 156 ఉదాసీనమునన్ = ఆదరింపమిని. 157 పరుసఁదనము = గడుసుఁదనము, బెరుకు = భేదము, ప్రల్లదంబు = దుష్టత్వము, గృహికిన్ = గృహస్థునకు. 158 కంటు = విరోధము, శోభనధామంబులు = శుభస్థానములు, అరిష్టవిరామములు = కీడులను పోఁగొట్టునవి. 159 ఖేలనవృత్తిన్ = క్రీడా వ్యాపారములచేత, తపశ్చరణ = తపస్సుచేయుటయొక్క. 160 త్రిషవణస్నానంబు = త్రికాలసంధ్యోపాసనార్థస్నానము, వనస్నేహమునన్ = అడవియందు దొర

ములకు నోర్చి వానప్రస్థుఁ డలఘువృత్తిఁ
దప మొనర్చినఁ గల్గు నుత్తమపదంబు. 160

వ. ఇవ్విధంబున వానప్రస్థాశ్రమంబు నడిపి చతుర్థాశ్రమంబుఁ బ్రవేశించి. 161

క. పుత్రకళత్రద్రవ్య, క్షేత్రారామముల నాస చెడి యెచ్చోటన్
మైత్రి యొనర్పక బ్రహ్మ, క్షత్రియవైశ్య క్రియలు విసర్జించి ధృతిన్. 162

తే. వీతమత్సరుఁడై సర్వభూతచయము
నాత్మగతిఁ జూచుచు జరాయుజాండజాది
జీవములయందు మోదస్వభావుఁ డగుచు
నమలధృతి నుండవలయు సన్న్యాసి యనఘ 163

క. సౌహార్దవచనరచనా, బాహుళ్యతవలన నెల్లప్రాణుల నధిక
స్నేహమున బుజ్జగించుచు, నైహికములు విడుచు టుచితమగు భిక్షునకున్. 164

ఉ. ఏకదినంబు గ్రామమున నేనుదినంబులు పట్టణంబునం
దేకమనంబుతోడ వసియించి త్రివర్గగృహంబులందు న
స్తోకత భిక్ష మెత్తి పరితోషమునన్ భుజియించి దేహయా
త్రాకుశలంబు గైకొనుట ధర్మము భిక్షునకున్ నరేశ్వరా. 165

క. వ్యామోహంబును లోభము, కామక్రోధములు మదవికారము దర్పో
ద్దామమును లేక యాత్మా,రాముండై భిక్షుఁ డున్న రంజిల్లుఁ జుమీ. 166

క. భిక్షాకదంబకంబున, నక్షయశారీరవహ్ని యందును దినమున్
లక్షించి వేల్వఁగల్గిన, సాక్షాదీశ్వరుఁడు గాఁడె సన్న్యాసి నృపా. 167

వ. ఇట్లు సంకల్పితబుద్ధియుక్తుండును నైహికానేకభోగవిరక్తుండును నత్యంతశౌచ చిత్తుండును పరమతత్త్వవిద్యాయత్తుండును నై మోక్షాశ్రయం బాశ్రయించు నమ్మహాత్ముం డింధనరహితంబైన వహ్నియునుంబోలె తన్నుఁ దానె ప్రశాంతుండై బ్రహ్మలోకసుఖంబునం బొందునని చెప్పిన సగరుం డిట్లనియె. 168

తే. ఉత్తమము లగునిత్యనైమిత్తికప్ర,కారములు మూఁడు పురుషుఁ డేగతి నొనర్ప
వలయు నిత్తెఱం గెల్లను దెలియఁజెప్పు;వే కృపాచిత్తమున మునిలోకనాథ. 169

క. అనవుడు భృగునందనుఁ డ,మ్మనుజేంద్రునిఁ జూచి నీవు మమ్మడిగినయీ

---

కెడు (గార) నూనెచేత, హిమనిదాఘములకున్ = శీతోష్ణములకు. 163 వీతమత్సరుఁడు=పోయిన మత్సరముగలవాఁడు, జరాయుజాండజాది = మావివలనఁబుట్టిన (మనుష్యాదులును) గ్రుడ్డువలనఁ బుట్టిన (పక్ష్యాదులును) మొదలైన, మోదస్వభావుఁడు = సంతోషస్వభావముగలవాఁడు, అమల ధృతిన్ = కళంకములేనిధైర్యముతో. 164. సౌహార్ద = స్నేహభావముగల, ఐహికములు = ఈ లోకమునందలి సుఖములను, భిక్షునకున్ = సన్న్యాసికి. 165 త్రివర్గగృహంబులందున్ = గృహస్థులయిండ్లయందు, అస్తోకతన్ = గౌరవముతో, దేహయాత్రాకుశలంబున్ = దేహమును పోషించు కొనునట్టి మేలును. 166 వ్యామోహంబు = విశేషమోహము, దర్పోద్దామము=గర్వాతిశయముఁ రంజిల్లున్ = ప్రకాశించును. 168 ఇంధనరహితంబు = చిదుగులు లేనిది, 170 వినుతార్థ

వినుతార్థరహస్యంబులు, వినిపించెద మేర్పడంగ విను మతిభక్తిన్. 170

ఆ. ధర్మపత్నియందుఁ దనకు జన్మించిన, సత్సుతునకుఁ దండ్రి జాతకర్మ
ములు యథాప్రకారముగఁజేసి నాందీముఖాఖ్యమైనశ్రాద్ధ మాచరించి. 171

తే. యుగ్మసంఖ్యాకు లగుభూసురోత్తముల సు
ఖాసనమ్ములయందుఁ బూర్వాభిముఖులఁ
గా నమర్చి యభీష్టప్రకారములను
భోజనమ్ములు సేయించి పూజచేసి. 172

ఆ. యవలు పెరుగు తవుడు నాదిగాఁ గలపదార్థములచేత హోమ మమర రెండు
కాలముల నొనర్పఁ గావలయును బ్రహ్మతీర్థమునను దేవతీర్థమునను. 173

తే. పదునొకండవనాఁడు భూపాలచంద్ర, పురుడు వెడలంగ సంతతాభ్యుదయమైన
మంగళస్నాన మొనరించి మందిరమున, శుద్ధిపుణ్యాహవాచన జోకసేసి. 174

ఆ. తనకుఁ బెద్దలైన తాతలదండ్రుల, పేరు లొండె గురులపేరు లొండెఁ
దగినయిష్టదేవతలపేరు లొండెను, దండ్రి నామ మిడఁగఁ దగు సుతునకు. 175

సీ. అర్థహీనంబులు నపశబ్దములునప్రశస్తంబులును జుగుప్సాసమేత
ములు నమంగళవర్ణములు నతిదీర్ఘాక్షరంబులు ఘోషాక్షరములు సర్వ
గురువులు సర్వలఘువులునతిక్రూరములుగాక యెల్లవారలకుఁ బ్రియము
నతిముదంబును జేయునట్టిసమాక్షరయుక్తంబుగా నామ మొసఁగవలయు

తే. ధారుణీసురులాదివిధానశబ్ద
వాచకాంతంబులను శర్మవర్మగుప్త
దాసులను ప్రత్యయంబులఁ దగ నొనర్ప
వలయునని వేదములయందుఁ బలికె నజుఁడు. 176

వ. మఱియు యథాకాలయోగ్యంబులైనసమస్తకర్మంబులు నాయావర్ణధర్మప్ర

రహస్యంబులు = పొగడఁబడిన విషయములయొక్క రహస్యములును. 172 యుగ్మసంఖ్యాకులు = జంటలెక్కగలవారు. 173 బ్రహ్మతీర్థమునన్ = పెద్దవ్రేలి మొదటనుండియు, దేవతీర్థమునన్ = వ్రేళ్లకొనలయందుండియు. 174 సంతతాభ్యుదయము = ఎప్పుడును మేలుగలది, జోక=బాగుగా. 176 అప్రశస్తములు = అయుక్తములు - లజ్జాకరములు, జుగుప్స=రోఁత, అమంగళవర్ణములుగలవి, ఘోషాక్షరములు = కఠినవర్ణములుగలవి, సర్వగురువులు = అన్నిగుర్వక్షరములుగానే యుండునవి, ధారుణీసురులాది = బ్రాహ్మణులాదిగా - బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రక్రమముగా, విధాన=విధ్యుక్తముగా, శబ్దవాచకాంతంబులన్ = నామవాచకశబ్దాంతములయందు, శర్మవర్మగుప్తదాసులు=శర్మ వర్మ గుప్తుఁడు దాసుఁడు, అనుప్రత్యయంబులన్ = అనునట్టి ప్రత్యయములను, తగన్=యుక్తమగునట్లు, ఒనర్పవలయున్ = చేయవలెను - అనఁగా బ్రాహ్మణనామమునకు శర్మయనియు, క్షత్రియనామమునకు వర్మయనియు, వైశ్యనామమునకు గుప్తుఁడు అనియు, శూద్రనామమునకు దాసుఁడు అనియు కర్త

కారంబుగా నొనర్చునది విశేషజాతులకు బ్రహ్మోపదేశంబైనయుపనయనక్రియా
కలాపంబులు వేదోక్తమార్గంబున నిర్వర్తించి వేదాధ్యయనతత్పరుం డగుచు. 177

మ. చతురామ్నాయరహస్యవేది యగుచుఁ శాస్త్రజ్ఞుఁడై నిర్మల
ప్రతిభోద్రిక్తమనస్కుఁడై యతికృపాపారీణుఁడై సంతత
వ్రతసంపన్నగరిష్ఠుఁడై గుణగణావష్టంభుఁడై సత్కళాం
చితుఁడై నట్టిగురుఁ భజింపవలయుఁ శిష్యుండు సద్భక్తితోన్. 178

క. గురుశుశ్రూష యొనర్చుచు, సరసత్వముతోడ శ్రుతులు చదువుచు నిగమా
ర్థరహస్యంబులు దెలియుచుఁ, జరితార్థుం డగును బ్రహ్మచారి నరేంద్రా. 179

వ. యథోక్తప్రకారంబున గురుదక్షిణ యొసంగి యమ్మహాత్మునిచేత ననుజ్ఞాతుండై
సంకల్పపూర్వకంబుగా గృహస్థవానప్రస్థయత్యాశ్రమంబులయందు నిష్టంబైన
యాశ్రమంబు నడుపవలయు విశేషించియు గృహస్థాశ్రమంబు సమస్తాశ్రమం
బులకు నాశ్రయంబు గాన నమ్మహనీయపథంబునకు నభిముఖుండై. 180

## సదసత్కన్యకాస్వరూపనిరూపణము.

తే. అనఘ తనవయసునఁ దృతీయాంశమైన
ప్రాయమునఁ గలకన్నియఁ బరమసాధ్వి
నుభయకులములఁ దనయట్ల యొప్పుదానిఁ
బెండ్లియాడంగవలయు సంప్రీతితోడ. 181

సీ. నైసర్గికాంగహీనను శోఫి నతికేశఁ గేశహీననతివఁ గృష్ణవర్ణ
రోమాంగిఁ గులటను రోగిని దుష్టాత్మ దుష్టవాత్సల్యనికృష్టవృత్తి
నధికపింగళవినయాచారహీనమాతాపితృప్రతికూలఁ బాపహృదయ

పటప్రత్యయరూపముగా చేర్పవలెనని తాత్పర్యము. 177 నిర్వర్తించి=నడపి. 178 చతురా
మ్నాయరహస్యవేది = నాలుగువేదములయందలి రహస్యార్థముల నెఱిఁగినవాఁడు, నిర్మలప్రతిభోద్రిక్త
మనస్కుఁడు = కళంకములేని సమయోచితస్ఫురణగలబుద్ధిచేత అతిశయించిన మనసుగలవాఁడు, అతి
కృపాపారీణుఁడు = మిక్కుటమైన దయచేత పూర్ణుఁడు, సంతతవ్రతసంపన్నగరిష్ఠుఁడు = ఎడతెగని
నియమములకలిమిగలవారియందు గొప్పవాఁడు - ఎల్లప్పుడు సద్వ్రతములు తప్పకనడపువాఁడు, గుణ
గణావష్టంభుఁడు = మంచిగుణములయొక్క సమూహములకు అవలంబమైనవాఁడు - ఎల్లమంచిగుణ
ములు గలవాఁడు, భజింపవలయుఁ = సేవింపవలెను. 180 యథోక్తప్రకారంబునఁ=శాస్త్రము
నందు చెప్పఁబడిన చొప్పున, ఆశ్రయము=ప్రాపు, అమ్మహనీయపథంబునకుఁ = ఆగొప్పమార్గము
నకు. 181 వయసునఁ = ప్రాయమునందు, తృతీయాంశము = మూఁడింట నొకపాలు, ఉభయకుల
ములఁ = తల్లి వంశముచేతను తండ్రి వంశముచేతను. 182 నైసర్గిక = స్వభావసిద్ధమైన, శోఫిఁ=
వాఁపులదానిని, కృష్ణవర్ణఁ = నల్లనిదానిని, రోమాంగిఁ = అతిరోమముగల దేహముగలదానిని,
కులటఁ=ఱంకులాఁడిని, రోగిఁ = రోగముగలదానిని, దుష్టాత్మఁ = చెడ్డమనసుగలదానిని, దుష్ట
వాత్సల్యఁ = కపటప్రీతిగలదానిని, నికృష్టవృత్తిఁ = నీచవ్యాపారము గలదానిని, అధికపింగళఁ=
మిక్కిలి పల్లవన్నెగలదానిని, వినయాచారహీనఁ = అడఁకువచేతను సదాచారముచేతను తక్కు

శ్మశ్రుముఖిని బురుషస్వరరూక్షాక్షి ఖర్వరూపకహీనకంఠనాద
తే. వికృతబద్ధాక్షి నున్నతవిపులగుల్ఫఁ
గాకనాదను రోమజంఘను విపాండు
కరజనరుణాక్షిగండకూబరకరాళ
వదన నుద్వాహమైన నొప్పదు నరేంద్ర. 182
ఆ. హస్తపాదహీన నతిదీర్ఘ వామన, క్లిన్నరక్త నతివికీర్ణకేశఁ
గపటహృదయఁ బంగుగమనఁ బాణిగ్రహణంబు గాఁగఁ దగదు నరవరేణ్య. 183
ఆ. తల్లివంక నైదుతరముల విడిచి, తండ్రివంక నేడుతరము లరసి
వారివారిగోత్రవంశసంకరము గా, నియక యతివఁ బెండ్లి యయినమేలు. 184
వ. బ్రాహ్మంబును దైవంబును నార్షంబును బ్రాజాపత్యంబును నాసురంబును గాంధర్వంబును రాక్షసంబును బైశాచంబును నను నెనిమిదివివాహంబులయందును నాయావర్ణధర్మంబు లైన వివాహంబులను దారపరిగ్రహంబుచేసి తద్ధర్మపత్నీసమేతంబుగాఁ బరమగృహస్థధర్మంబున నున్నమహాత్ముండు సకలలోకంబులకు నుత్తమశ్లోకుం డగు ననిన సగరుం డిట్లనియె. 185
క. మునివర గృహస్థధర్మంబునఁ బాయికయున్న పరమపుణ్యులయాచా
రనియతులెల్లను దప్పక, వినవలతుఁ జెప్పు మతివివేకప్రౌఢిన్. 186
వ. అనియడిగిన యాభృగువంశశిఖామణి యన్నరేంద్రచంద్రు నవలోకించి సదాచారవంతు లైనగృహస్థు లుభయలోకంబులయందును నత్యంతసౌఖ్యంబు లనుభవింతురు. తొల్లి స్వాయంభువాదు లైనమనువులును సప్తమహామునులును బ్రజాపతులును సకలలోకోపకారకంబులుగా సదాచారమార్గంబులు గల్పించిరి గావున నిజవర్ణధర్మంబు లైన యాచారంబు లవశ్యంబును నాచరింపవలయు వినుము. 187

గృహస్థసదాచారరూపములైన నిత్యకృత్యముల వివరించుట.

మ. అనురాగం బొదవన్ గృహాధిపతి బ్రాహ్మంబౌ ముహూర్తంబునం

---

వైనదానిని, మాతాపితృప్రతికూలన్ = తల్లిదండ్రులకు విరుద్ధమైన నడతగలదానిని, శ్మశ్రుముఖిన్ = మీసముగలమొగముగలదానిని, పురుషస్వరన్ = మగగొంతుగలదానిని, రూక్షాక్షిన్ = క్రూరపుచూపుగలదానిని, ఖర్వరూపకన్ = మిక్కిలి పొట్టియైనదానిని, వికృతబద్ధాక్షిన్ = మిడిగ్రుడ్లదానిని, ఉన్నతవిపులగుల్ఫన్ = పొడువును వెడలుపునైన చీలమండలుగలదానిని, కాకనాదన్ = కాకికూఁతవంటి కంఠస్వరముగలదానిని, రోమజంఘన్ = వెండ్రుకలుగల పిక్కలుగలదానిని, విపాండుకరజన్ = తెలుపు మాసిన గోళ్లుగలదానిని, అరుణాక్షిన్ = ఎఱ్ఱనికన్నులుగలదానిని, గండకూబరన్ = నిడుకణతలుగలదానిని, కరాళవదనన్ = భయంకరమైన ముఖముగలదానిని, ఉద్వాహము = పెండ్లి. 183 క్లిన్న = తడిసిన - నీళ్లవలెపలుచనైన, అతివికీర్ణకేశన్ = మిక్కిలి విరళములైన తలవెండ్రుకలుకలదానిని, పంగుగమనన్ = కుంటిదానిని, పాణిగ్రహణంబు = పెండ్లి. 185 దారపరిగ్రహంబు = పెండ్లామునుచేపట్టుట, ధర్మపత్ని = అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము, ఉత్తమశ్లోకుఁడు = మంచికీర్తిగలవాఁడు. 188 ఒదవన్ = కలుగఁగా, బ్రాహ్మంబు =

దొనర మేల్కని సావధానమతితో నుద్యద్వికాసంబునన్
దనయాచార్యుని నిష్టదైవచరణధ్యానంబుఁ గావించి ధ
ర్మనిరోధంబులు గానియర్థమును గామంబున్ విచారించుచున్. 188

తే. ప్రకటధర్మార్థకామంబులకుఁ బరస్ప
రానుకూలంబు గలయుపాయములు దలఁచి
యతిసుఖోదర్కమును జగదభినుతంబు
నైనధర్మంబు వదలనిమానసమున. 189

వ. శయ్యాగృహంబువెడలి గ్రామంబునకు నిరృతిభాగంబున నమ్మువేటునేలకంటెను దూరంబుగాఁ జని ముసుంగువెట్టుకొని మౌనంబున గోసూర్యబ్రాహ్మణవాయు గురువహ్ని దేవతల కభిముఖుండుగాక దివసంబుల నుత్తరాభిముఖుండును రాత్రుల దక్షిణాభిముఖుండును నై మూత్రపురీషోత్సర్జనంబులు సేయ వలయు. 190

ఆ వీథి నూరినడుమ విత్తినపైరులో, మ్రాఁకునీడ నాలమందలోన
నేటినడుమ వల్లకాటిలో దుక్కిలో, నీళ్లనడుమ గాదు నీరుముట్ట. 191

తే. రచ్చఁ దెరువును గృహవాటి మచ్చుమీఁద
నీటిచేరువఁ గొఱగాదు నీరుముట్ట
వసుధమీఁదను దళముగా గసవుబఱపి
వేగ మూత్రపురీషముల్ విడువవలయు. 192

ఆ. పుట్టమన్ను గోడవెట్టినమన్నును, జలములోనిమన్ను నెలుకమన్ను
దుక్కిమన్ను పురుగుచెక్కినమన్నును, శౌచమునకుఁ గాదు సంగ్రహింప. 193

తే. ధరణిఁ బరిశుద్ధమైనచోఁ దానె త్రవ్వి
మన్ను గొనివచ్చి బుద్బుదమలినఫేన
పూతిగంధాదు లెవ్వియుఁ బొరయకున్న
జలములను శౌచ మొనరింపవలయు ననఘ. 194

---

బ్రాహ్మమను పేరుగలది (సూర్యోదయమునకుముందు మూఁడవముహూర్తము)- వేకువజాము అనుట, ఉద్యద్వికాసంబునన్ = ప్రకాశించునట్టి తేటదనముతో, ధర్మనిరోధంబులు = ధర్మమును అడ్డగించునవి - ధర్మవిరుద్ధములు. 189 సుఖోదర్కము = సుఖకరమైన భవిష్యత్కాలఫలముగలది, జగదభినుతము = లోకమునందు మిక్కిలి కొనియాడఁబడునది. 190 అమ్ముపేటునేలకంటె = వింటిపట్టు దూరముగల భూమికంటెన్, అభిముఖుండు = ఎదురుమొగమైనవాఁడు, దివసంబులన్ = పగళ్లయందు, మూత్రపురీషోత్సర్జనంబులు = మూత్రమును మలమును విడుచుటలు. 191 ఆలమంద లోనన్ = పసులమందయందు, వల్లకాటిలోనన్ = శ్మశానమునందు, కాదు=తగదు. నీరుముట్ట = మూత్రమును మలమునువిడుచుట. 194 బుద్బుదమలినఫేన పూతిగంధాదులు = నీళ్లమీఁది బుగ్గలు నురుగు ముఱికి చెడ్డకంపు మొదలగునవి, పొరయుక = పొందక, శౌచము=శుద్ధి, 196 మాషమజ్జన

తే. తనదులింగంబునందు గుదస్థలమున
వామహస్తమునను గటిద్వయమునందు
వరుస నేకత్రిదశసప్తవారములను
మృత్తికాశౌచ మొనరింప మేలు గలుగు. 195

వ. కేశవాదినామంబులతోడ గోకర్ణహస్తంబున మాషమజ్జనపరిమితశుద్ధోదకంబుల ముమ్మాఱు లోనికిం గొని యిరుమాఱు పరిమార్జనంబుచేసి దక్షిణపూర్వకంబులుగా నేత్రనాసాపుటశ్రోత్రద్వయ శిరోబాహుద్వయనాభిహృదయంబులన్యసించి యాచమనంబు చేసి. 196

క. తలనిమ్మపండ్లు మొదలుగఁ, బులుసులు పట్టించి పుష్పములు నంజనముం
జెలువొప్పఁ బూని కడునిర్మలహృదయముతోడ నుదకమధ్యంబునకున్. 197

చ అరిగి సమస్తనిర్ఝరమయంబును నవ్యసుధాకరాభమున్
బరమపవిత్రమున్ సకలపాపహరంబును నైననీరుఁ ద
త్పరమతి విష్ణురూపముగ భావనచేసి కృతావగాహత
త్పరుఁ డగుపుణ్యపూరుషుఁడు ధన్యుఁ డగున్ భువనత్రయంబునన్. 198

తే. నదుల నదములఁ జెఱువుల హ్రదములందు
దేవఖాతజలంబుల దీర్ఘికలను
గూపములఁ బల్వలంబులఁ గోరి దినము
తాన మాడంగవలెఁ గాని మానరాదు. 199

వ. ఇట్లు సంకల్పపూర్వకంబుగా స్నానంబుచేసి వెడలివచ్చి ధౌతవస్త్రపరిధానుండై దేవర్షిపితృతర్పణంబులు సేసి సంధ్యాదికక్రియలు నిర్వర్తించి సూర్యోపాస్తి యొనర్చి నిజగృహంబునకు వచ్చి యథాప్రకారంబుగ షోడశోపచారంబులతోడ దేవతార్చన గావించి జపోపాసనవైశ్వదేవంబులుచేసి యుక్తప్రకారస్థానంబుల నాయాదేవతలకుఁ బ్రీతిగా హుతశేషాన్నంబు బలులువెట్టి గృహంబు వెలుపలను భూతప్రేతపిశాచకూశ్మాండపిపీలికాదిజంతువులకుఁ దత్తన్మంత్రంబుల

పరిమిత శుద్ధోదకంబులన్ = మినుపగింజ మునుఁగునంతకొలఁదిగల మంచినీళ్లను, పరిమార్జనంబుచేసి= చక్కగా తుడిచికొని, న్యసించి = ఉంచి - ముట్టియనుట. 198 నిర్ఝరమయంబు = నదీస్వరూపమైనది, నవ్యసుధాకరాభము = లేఁతచంద్రునిఁ బోలినది, భావనచేసి = తలఁచి, కృతావగాహతత్పరుఁడు = చేయఁబడిన మునుకయందు ఆసక్తుఁడు - ఆసక్తితో స్నానముచేసినవాఁడు. 199 నదములన్ = పడమరగా పాఱునట్టి యేళ్లయందును, హ్రదములందున్ = మడుఁగులయందును, దేవఖాతజలంబులన్ = దేవతలచేత్రవ్వఁబడిన (మనుష్యులుత్రవ్వఁగా ఏర్పడని) కొండదొనలోనగువానియందలి నీళ్లయందు, దీర్ఘికలన్ = నడబావులయందును, పల్వలంబులన్ = పడెలయందును, తానము = స్నానము. 200 ధౌతవస్త్రపరిధానుండు = మడుఁగువస్త్రము కట్టుకొన్నవాఁడు, ఉపాస్తి=ఉపాసన, హుతశేషాన్నంబు = హోమముచేయఁగా మిగిలినయన్నము, భూతప్రేతపిశాచ

బలులువెట్టి గృహస్థుండు సకలభూతసమాశ్రితుండు గావున గోదోహన
మాత్రకాలంబు బహిఃప్రదేశంబున నభ్యాగతాగమనంబుఁ గోరుచు నిలుచుండి
పుణ్యావశంబున నతిథి వచ్చిన. 200

క. తనపాలిభాగ్యదేవత, యని లోనికిఁ గొంచుఁబోయి యర్ఘ్యం బగునా
సన మిడి యర్ఘ్యముఁ బాద్యము, నొనరించి మనంబులోన నొదవినభక్తిన్. 201

క. నామకులగోత్రవిద్యా, భూములు ము న్నడుగ కతనిఁ బూజించి యభీ
ష్టామృతరసాన్నపానము, లామహితుఁ డె విష్ణుమూర్తి యని యిడవలయున్. 202

మ. నరనాథోత్తమ బ్రహ్మచారి గృహి వానప్రస్థ సన్న్యాసులం
దొరుఁ డెవ్వాఁ డట వింతబ్రాహ్మణుఁడు దా నొప్పన్ క్షుధావేదనా
పరుఁడై వచ్చిన నన్నదాన మొనరింపన్ లేక దుర్మార్గత
త్పరుఁడై యొంటిఁ జరించెనేని నరకప్రాప్తుం డగున్ దీనతన్. 203

క. కావున నతిథులఁ బూజలు, గావించి యథోచితప్రకారంబున ధా
త్రీవర భిక్షంబులు నిడ,గావలయు గృహస్థధర్మకలితుల కెల్లన్. 204

క. ఆపంకజాసనుండుఁ బ్రజాపతులును బావకుండు శక్రుండును ల
క్ష్మీపతియును నాదిత్యమహాపురుషులు వత్తు రింటి కభ్యాగతులై. 205

తే. అవనినాయక యన్నార్థులైనవృద్ధ
బాలకుల గర్భిణుల దుఃఖభాజనులయుఁ
గోర్కి దీర్పక తా నొంటిఁ గుడిచెనేని
వాఁడు కడుఘోర మగురౌరవమునఁ గూలు. 206

ఆ. అన్నకాంక్షులైనయఖిలజనంబులఁ, దనిపిగాని కుడవఁ దనకుఁ జనదు
మునుపు దా భుజించి వెనుక నతిథి కిడు,వాఁడు గూలు రౌరవంబునందు. 207

తే. స్నానమును దర్పణంబును సంధ్యయును జ
పంబు దైవతపూజ హోమంబు వైశ్వ
దేవమును మఱి యతిథిపూజావిధంబు
మాని భుజియించు టెల్లను మలము దినుట. 208

తే. అన్నదానంబు చేసినయమ్మహాత్ము
నకును బలము నారోగ్యంబు ప్రకటశుభము

---

కూశ్మాండపిపీలికాది = భూతము ప్రేతము పిశాచము కూశ్మాండము (అనుభేదములుగల) భూతములు చీమలు మొదలైన, సకలభూతసమాశ్రితుండు = ఎల్లభూతములచేత ఆశ్రయింపఁబడువాఁడు, గోదోహనమాత్రము = ఆవునుపిదుకునంతటికాలము, బహిఃప్రదేశంబునన్ = ఇంటివెలుపట, ఆగమనంబు = రాకను, 202 మహితుఁడ్ = పూజ్యుని. 203 గృహి = గృహస్థుఁడు. 205 పావకుండు=అగ్ని, శక్రుఁడు = ఇంద్రుఁడు. 206 దుఃఖభాజనులు = దుఃఖమునకు చోటైనవారు = దుఃఖమును పొందినవారు. 207 తనిపి = తృప్తిపొందించి. 209 అరిష్టాత్మకములు = చెఱుపును

నై యరిష్టాత్మకము లైనయరులవలని
భయము నభిచారకృత్యముల్ పరిసిపోవు. 209

వ. కావున గృహమేధి యథాప్రకారంబున స్నానతర్పణసంధ్యాజపదేవపూజాగ్నిహోత్రవైశ్వదేవబలిహరణంబులు నిర్వర్తించి యన్నార్థు లైనయభ్యాగతులం బూజించి ప్రశస్తమణిముద్రికాధరుండును ధవళవస్త్రయుగ్మపరివృతుండును గంధపుష్పాలంకృతుండును శుద్ధోదకార్ద్రపాదహస్తుండును నాచమనక్రియాపరిశుద్ధవదనుండును నై యపరదిశాముఖుండు గాక పూర్వాభిముఖుండై సుఖాసనంబునం గూర్చుండి ప్రశస్తశుద్ధపాత్రంబులందు సర్వగుణసంపన్నమైనధర్మపత్ని వడ్డింప నిజశిష్యపుత్రబంధుమిత్రసహితుండై భుజియించుచు. 210

తే. మునుపు మధురాన్నములు చవిగొనియె నేని
నడుమ లవణామ్లతిక్తముల్ నంజెనేని
పిదప కటుకార్ద్రభోజనం బొదవెనేని
బలము నారోగ్యమును జాల గలిగియుండు. 211

వ. ఇవ్విధంబునఁ బంచప్రాణాహుతిపూర్వకంబుగా భుజియించి యుచ్ఛిష్టవారణార్థంబుగాఁ బాణిపాదప్రక్షాళనంబులుచేసి స్వస్థప్రశాంతచిత్తుండై కూర్చుండి యభీష్టదేవతాస్మరణంబు చేసి భోజనంబు సుఖజీర్ణంబుగా నగస్త్యబడబానలస్తోత్రంబు లనుష్ఠించి యనాయాసం బైనయానంబున నుచితప్రయోజనంబులు నడపి వేదశాస్త్రప్రసంగంబులం బ్రొద్దుపుచ్చి యపరసంధ్యావిధులు నిర్వర్తింపవలయు. 212

తే. రేపు చుక్కలఁ జూచుచు మాపు తిమిర
వైరిఁ జూచుచు సంధ్య వార్వంగవలయు
నట్టివేళలు దప్పించి యాచరించు
నిత్యసంధ్యావిధానముల్ నిష్ఫలములు. 213

వ. కావున యథాకాలంబున సంధ్యావందనంబు దీర్చి తాంబూలచర్వణం బొనరించి శయ్యాతలంబునం బవ్వళింపవలయు. 214

ఆ. కుక్కవడిన మిగులఁ గొంగోడువోయినఁ, గుఱుచయైన విఱిగి కొంచెమైన
మలినమైన నేత పలచనైనను నల్లు, లున్న నుల్కమంచ మొప్ప దండ్రు. 215

---

గలుగఁజేయు స్వభావముగలవి, అభిచారకృత్యములు = మారణకర్మములు, పరిసిపోవుఁ = తేలిపోవును - తప్పిపోవుననుట. 210 గృహమేధి = గృహస్థుఁడు, ప్రశస్తమణిముద్రికాధరుండు = దోషములు లేనిరత్నములు చెక్కిన ఉంగరమును ధరించినవాఁడు. 211 చవిగొను = రుచిచూచు - భుజించు, నంజు=నంజుకొను, కటుకార్ద్ర=కారముగలదియు ద్రవమైనదియునైన. 212 ఉచ్ఛిష్టవారణార్థంబుగాఁ=ఎంగిలి పోఁగొట్టుకొనుటకుఁగాను, స్వస్థ = చలనములేని, ప్రశాంత = మిక్కిలి యోర్పుగల, అనుష్ఠించి=చేసి, 213 రేపు=ప్రాతఃకాలము, మాపు = సాయంకాలము, తిమిరవైరిఁ = సూర్యుని. 215 కుక్కవడినఁ = అల్లికసళ్లి పల్లముపడినను, కొంగోడువోయినఁ = తడిసి

తే. పట్టెమంచంబు దలగడ పఱుపు దెరయు, మేలుకట్టును బొడవైనమేడమీఁదఁ
జల్లగాలియు ధూపవాసనలు నున్న, యట్టిశయ్యకుఁ జని నిద్ర నందవలయు.
తే. తూర్పుదక్షిణములలోన దొరికినట్టి, దిక్కు తలగడగాఁగ నిద్రించెనేని
మేలు తక్కినదిక్కులు మేదినీశ, యధికరోగంబు గావించు ననిరి బుధులు 217
తే. అనఘ పురుషనక్షత్రంబు లైనజ్యేష్ఠ, మొదలుగాఁ గలనక్షత్రముల నయుగ్మ
కములనైనను ఋతుదివసములనైనఁ, దనకులాంగనఁ గవయుట ధర్మ మగును.
సీ. పరకాంత ముట్టైన పడఁతి నన్యాసక్త యైన తొయ్యలి దుఃఖయైన చెలువ
సంతసం బెఱుఁగనిసతి ననాచారంపుటిభయాన బాలింత యిగురుబోఁడి
నిష్ఠమాలినలేమ నిర్మోహి యగుకొమ్మ కలహంబు వెట్టెడికమలవదన
రతుల నేరుపులేనిరామ జారయుఁ జోర కుమతి యా నెలనాఁగ కూటిపేద
తే. యైన మృగనేత్ర పరితుష్ట యైనయువతి, తన్ను మెచ్చనితన్వంగి దమ్ములంబు
నీనిపద్మాస్య కడురోగి యైనయువతి, రతి యొనర్పంగఁ గొఱగాదు రసికులకును.
సీ. రతితంత్రములయందుఁ బ్రౌఢయై తనమీఁద నత్యంతభయభక్తు లతిశయిల్ల
సౌకుమార్యముచేత నేకొదవయులేక సుందరాకారత సొంపు గలిగి
సరసశృంగారవేషముల నెంతయు మించి యుచితప్రియాలాపరచన లెఱిఁగి
వినయవిధేయవివేకశీలతలచే ననుకూలమును నెఱతనము నేర్చి
తే. నిర్మలాంగియు నిపుణయు నిర్మలాభి,జాత్యయును బుణ్యవతియును సతియునైన
తనకులాంగన రతికేళిఁ దనిపెనేని, యతని కైహికలోకసౌఖ్యములు గలుగు.
తే. అనఘ విను పౌర్ణమాసుల నమవసలఁ జ
తుర్దసులయం (?) దష్టమీ ప్రదోషములను
సంక్రమణములయందును సతులరతుల
ననుభవింపంగ రాదని రార్యులెల్ల. 221
తే. చైత్యచత్వరగోష్ఠశ్మశానతీర్థ, వారిశృంగాటకారామవాహినీసు
రాలయగ్రామమధ్యంబులందుఁ బగలు, సతులఁ గవిసిన దోషంబు సంభవించు.
మ. పరకాంత న్మదిలోననైనఁ దలఁపం బాపంబు దుఃఖంబునుం
బరివాదంబును నొంది ఘోరనరకప్రాప్తవ్యథల్ పెక్కువ

---

ఒకకోడు మీఁదును ఒకకోడు క్రిందునుగా నీల్గుకొన్నను, ఒప్పదు=తగదు. 218 అయుగ్మకములు = బేసిలెక్కగలవి. 219 నిర్మోహి=మోహము లేనిది, కుమతి=అల్పబుద్ధిగలది, తన్వంగి=స్త్రీ, కొఱగాదు = తగదు. 220 ప్రౌఢ=గడిదేఱినది, ఉచితప్రియాలాపరచనలు=తగిన ప్రియవాక్యములయొక్క పొందుపఱచుటలు, నెఱతనము=చాతుర్యము, నిర్మలాభిజాత్య=శుద్ధమైన ఉత్తమవంశమునందలి పుట్టుకగలది, సతి = పతివ్రత, కులాంగనక్=ఇల్లాలి. 222 చైత్యచత్వరగోష్ఠ శ్మశానతీర్థవారి శృంగాటకారామ వాహినీ సురాలయగ్రామమధ్యంబులందుక్ = రచ్చచెట్టు ముంగిలి పసులమంద శ్మశానము పుణ్యనదీ పుణ్యస్థలములు నీరు నాలుగుత్రోవలుగూడినరాజమార్గము ఉపవనము ఏఱు దేవాలయము ఊరినడుమ

త్పరముల్ చెందుదు రట్టియన్యవనితా సంభోగదోషంబు దా
నరనాథోత్తమ యింత యంత యనియెన్నన్ వచ్చునే నేరికిన్. 223

క. కావునఁ బరకాంతారతి, గావింపక ధర్మమార్గగతి దప్పక యి
చ్ఛావృత్తి నాత్మభామిని, తో వేడుక సలుపవలయు దురితవిదూరా. 224

వ. అనిచెప్పి మఱియు నిట్లనియె. 225

సీ. దేవతాగోబ్రాహ్మణావలిఁ బొడగన్న మ్రొక్కి సంధ్యాద్వయంబును దిశాధి
పతులఁ బ్రార్థించి తప్పక యగ్నిహోత్రంబు లొనరించి తెల్లగా నుదికినట్టి
మణుఁగుఁజీరలు గట్టి మణిభూషణముఁ బెట్టి కస్తూరితోఁ గమ్మగంద మలఁది
సురుచిరంబైనట్టి చొక్కంపుఁబూదండ లొఱపుగా శిరమున నొప్పఁ దాల్చి
తే. మస్తకంబును నొడలును మాయనీక
యేకశయ్యనె పవళించి యిచ్చవచ్చి
నపుడు భోగించి బహుభాష లాడఁబోక
శాంతుఁడై యుండవలయును సజ్జనుండు. 226

క. పరకాంతపొందుఁ గోరక, పరధనములమీఁద నాస పాటింపక యె
వ్వరితోడఁ గల్లలాడక, సరసుండై యుండవలయు సజ్జనుఁ డధిపా. 227

క. వినియెడువారికి హితమై,నను సత్యముఁ దప్పఁజనదు నానయు భయమున్
మనమునఁ దలఁపక పరులను, బనివడి దూషించెనేని పాపము వచ్చున్. 228

తే. పరులతోడుత వైరంబు బంధురోష్ట్ర
వాహనారోహణంబును వానకాల
మేటిదరినీడ నిద్రింప నేగుటయును
గడుఁబ్రమాదంబు లగు నంద్రు కార్యవిదులు. 229

మ. పతితుం దస్కరు వెఱ్ఱివానిఁ బగతున్ బాపాత్మునిన్ బంధకీ
పతి నీచున్ వ్యభిచారు సత్యరహితున్ భార్యాతృప్తు వారాంగనా
రతు నత్యంతఋణస్థు దుర్జను ననారంభున్ సురాపానమో
హితు బాలుం బరమాప్తుఁ జేయుటలు గా దెవ్వారికిన్ భూవరా. 230

---

ఈప్రదేశములయందును. 223 పరివాదంబును = అపవాదమును, వేరికిన్ = ఎవరికేనియు 226 సంధ్యాద్వయంబును = ప్రాతస్సాయంసంధ్యలు రెంటియందు, మణుఁగు = మడుఁగు - పరిశుద్ధము, కమ్మగంధము = పరిమళచందనము, అలఁది=పూసికొని, చొక్కము = శ్రేష్ఠము, ఒఱపుగాన్= ఒప్పిదముగా, మస్తకము = తల. 227 కల్లలు=అసత్యములు. 228 నాన=సిగ్గు, పనివడి=పూనికతో. 230 పతితున్ = ఆచారాదులచేత నిందింపఁబడినవానిని, పగతున్ = శత్రువును, బంధకీపతిన్= అంకులాడిమగనిని, వ్యభిచారున్ = జారుని, వారాంగనారతున్ = లంజలమరిగినవానిని, అనారంభున్=సత్క్రియారంభములేనివానిని, సురాపానమోహితున్=కల్లుత్రాగుటచే మైకముపొందినవానిని.

ఆ. ఒంటిఁ ద్రోవఁ జనుటయును నిండి పాఱెడి
యేటిలోన నుఱికి యీఁదుటయును
దహనమైనయిల్లు దఱియఁ జొచ్చుటయుఁ బ్ర
మాదమండ్రు బుధులు మనుజనాథ. 231

క. పలుమాఱు బిట్టునవ్వుట, పలుగొఱుకుట యనుచితములు భాషించుట వి
చ్చలవిడిఁ దుమ్ముట యూరక, తలఁపుడుకుట దుష్టచేష్టితము లెవ్వరికిన్. 232

క. ఊరక పుడకలు విఱుచుట, వైరంబున నోరులతోడ వాదడుచుట దు
ర్వారగతిఁ బరువువాఱుట, గోరన్ గోరొలుచుటెల్లఁ గొఱగాదు సుమీ. 233

క. ఊరక మీసము గొఱుకుట, వారక పాదమున నేలవ్రాయుట చెక్కుల్
సారెకు చేతులఁ బిసుకుట, పౌరుషములకెల్ల హాని పాటిల్లు నృపా. 234

క. రాత్రి యమేధ్యముతో నక్షత్రగ్రహవిమలతారకాపఙ్క్తులపై
నేత్రములు నిల్పి చూచుట, ధాత్రీశ్వర దోషమండ్రు తత్త్వజ్ఞులిలన్. 235

క. భాను నుదయాస్తమయములఁ, బీనుఁగుఁబోడియను రతులఁ బెనఁగెడువారిన్
మానినుల నగ్నరూపుల, భూనాయక చూడఁజనదు పుణ్యాత్ములకున్. 236

ఆ. అసతియింటిలోన నారామములను శృంగాటకముల వల్లకాటిలోన
యుద్ధభూమిలోన నుగ్రాటవులయందు, నొక్కరుండ రాత్రు లుండఁజనదు. 237

ఆ. శూన్యగృహములందు శూన్యదేశంబుల, నొంటి నెట్టివార లుండఁజనదు
గురుజనముల భూమిసురుల దేవతలను, నెదురుకొనినఁ దొలఁగి యేగవలయు.

క. బలిభస్మంబును గంటకములు విష్ఠయు ఛిన్నకేశములు నెమ్ములు నెం
గిలియును స్నానార్ద్రమహీతలముం ద్రొక్కంగఁ జనదు ధర్మజ్ఞులకున్. 239

క. పలుమఱు గొమ్ములు గోఱులు, గలిగినజంతువులఁ జేరఁగాఁ జన దెదురెం
డలు మంచు నెదురుగాలియుఁ, దలసోఁకినఁ దెవులు వచ్చు ధరణీనాథా. 240

తే. లోన దోవతిగట్టక మానవేంద్ర
నిద్రవోవను నడవను నీతిగాదు

---

231 ఉఱికి = దుమికి, దహనము = కాలినది, తఱియన్ = చేర, ప్రమాదము = మోసము. 232 బిట్టు=గట్టిగా, తలఁపుడుకుట = మనస్సు తపించుట - మనస్తాపము, దుష్టచేష్టితములు = చెడునడవళ్లు. 233 వాదడుచుట = వాదాడుట, పరువువాఱుట = పరుగెత్తుట. 234 వారక = మానక, పౌరుషములకున్ = పురుషార్థములకు, పాటిల్లున్ = కలుగును. 235 అమేధ్యముతోన్ = మలముతో - పాఁచితోననుట. 236 నగ్నరూపులన్=దిసమొలవారిని. 237 అసతి = ధూర్తస్త్రీ, ఆరామములన్ = ఉపవనములందును, శృంగాటకములన్ = చదుకములయందును, వల్లకాటిలోనన్ = శ్మశానమునందును, ఉగ్రాటవులయందున్=భయంకరమైన అడవులయందు, ఒక్కరుండ= ఒకఁడే, చనదు=తగదు. 239 విష్ఠ=మలము, ఛిన్నకేశములు = గొఱిగిన వెండ్రుకలు, ఎమ్ములు = ఎముకలు, స్నానార్ద్రమహీతలమున్ = స్నానము చేయుటచేత తడిసిన నేలను. 240 తెవులు=వ్యాధి.

తల విరియఁబోసికొని యొంటి వెలికివచ్చి
రాత్రి నిలుచుండఁ గాదండ్రు రాజముఖ్య. 241

క. జగడము పెండ్లియుఁ దనతోఁ, దగుచోటులఁ జేయవలయుఁ దా నందఱతోఁ
బగగొని వర్తించినఁ గీ, డగుఁ గాని శుభంబు నొంద దనిరి మహాత్ముల్. 242

క. బలవంతుతోడఁ బగయును, బలహీనునితోడఁ జేయుబంధుత్వముఁ దాఁ
గిలి ధనమిచ్చియు నూరక, కలహమునకుఁ గాలుద్రవ్వఁ గారాదు సుమీ. 243

ఆ. కాలు కాలఁ దోమి కడుగుట వెండ్రుకల్, విడిచి త్రిప్పుకొనుట నడుచుచుండి
కూడు గుడిచి నీళ్లు గ్రోలుట నిలుచుండి, యాచమించు టొప్పదనిరి బుధులు.

ఆ. వానయైన నెండవచ్చిన గొడు గవశ్యంబు వలయు రాత్రి యడవిలోనఁ
దిరుగునపుడు గుదియ ధరియింపవలయును, గాలఁ జెప్పు లిడక కదలరాదు. 245

క. కెలఁకులమీఁదను దూరము, బలుమఱుఁ జూడంగఁ జనదు పయనంబునఁ గో
డెలకాఁడి యంతద వ్వేడ, గలుగఁగ ముందఱను దృష్టి గదురగవలయున్. 246

వ. ఇట్లు నీతిపరుండై నిజకులాచారం బైనధర్మంబు వదలక ధర్మార్థకామంబులయందు సమదర్శియై పాపకర్మంబులు పరిహరించి సమస్తభూతంబులయందు స్నేహార్ద్రచిత్తుండై యరిషడ్వర్గంబునందు బద్ధుండు గాక సదాచారసంపన్నుండై సాత్వికంబు వదలక పరపీడయుఁ బరనిందయుఁ జేయక తనజీవనంబు సకలప్రాణిసంఘంబులకు నవికారభూతంబుగాఁ ద్రికరణశుద్ధిగా వర్తించుపుణ్యపురుషుండు పుణ్యలోకప్రాప్తుం డగునని చెప్పిన నమ్మహీవల్లభుం డిట్లనియె. 247

క. భృగువంశోత్తమ నీచే, నగణితముగ వినఁగఁ గలిగె నఖిలము విశదం
బుగ నింక నాకు నపరం, బగుపైతృకకర్మకాండ మది వినవలయున్. 248

## పైతృకకర్మక్రమమును వివరించుట.

వ. అనిన భార్గవనందనుండు రాజనందనున కిట్లనియె. 249

తే. పెద్దనిదురకు మాఁగన్ను వెట్టుచున్న
మానవునిఁ దెచ్చి దక్షిణమస్తకంబు
గా మహీశయ్య నునిచి యుత్క్రాంతిదాన
మవనిదేవోత్తమున కొక్కయావు నిచ్చి 250

తే. అచ్యుతానంతగోవింద యనుచుఁ బద్మ,నాభనామత్ర యోచ్చారణంబుచేసి

245 గుదియ దుడ్డుగఱ్ఱ. 247 సమదర్శి = ఎచ్చుతక్కువలు లేక చూచువాఁడు, పరిహరించి = విడిచి. 248 అగణితముగన్ = లెక్కలేక, పైతృకకర్మకాండము = పితృసంబంధమైన కర్మముల సమూహము. 250 పెద్దనిదురకున్ = చావునకు, మాఁగన్నువెట్టుచున్నమానవునిన్ = కన్నులుతేలవేయుచున్నమనుష్యుని, మస్తకము = తల, మహీశయ్యన్ = నేలమీఁదను, ఉత్క్రాంతిదానము = ప్రాణముపోవుటనుగుఱించినదానము, అవనిదేవోత్తమునకున్ = బ్రాహ్మణశ్రేష్ఠునికి. 251 నామత్రయోచ్చారణంబుచేసి=మూఁడునామములను ఉచ్చరించి, విధియుతంబుగన్=శాస్త్రవిధితో, తత్కాల

ప్రాణవాయువు దొలఁగినయంతమీఁద, విధియుతంబుగఁ దత్కాలవిధులు దీర్చి.
తే. అగ్నిసంస్కారకర్మంబు లాదిగా స,మస్తవిధులును వేదోక్తమార్గములను
బెరయఁజేసి తిలోదకపిండదాన,ములు యథావిధిఁ గావింపవలయు నెఱిఁగి. 252
క. ద్విజులకుఁ బదిదినములు భూ,భుజులకుఁ బండ్రెండుదివసములు విట్ఛూద్ర
వ్రజములకుఁ బక్షమాసము,లు జనాధిప సూతకంబులు సుమీ వరుసన్. 253
వ. ఇట్లు సూతకాంతదివసంబున నేకోద్దిష్టంబును మఱునాఁడు సపిండీకరణంబును జేసి సంవత్సరపర్యంతంబు నేకోద్దిష్టంబు చేయునది ప్రతిసాంవత్సరికమృతాహంబున నన్నశ్రాద్ధంబు చేయవలయు. 254

## నిమంత్రణబ్రాహ్మణనిరూపణము.

సీ. ఆచార్యుఁ ద్రిమధుఁ ద్రిణాచికేతుని ద్రిసుపర్ణు నానావేదపారగుని ష
డంగవేదిని విష్ణుసంగతహృదయుని యోగీశ్వరుని శ్రోత్రియుని మఖేజ్యు
వివిధసామజ్ఞు ఋత్విజు మేనయల్లుని నల్లుని దౌహిత్రు సతనితండ్రిఁ
బంచమహాయజ్ఞపరు మేనమామను వియ్యము నురుతపోవిభవు శిష్యు
తే. మాతృపితృభక్తుఁ గారుణ్యమయు గుణాఢ్యు
నిర్మలాచారసంపన్ను నియమహృదయుఁ
బైతృకశ్రాద్ధమునకును బ్రాహ్మణార్థ
మర్థిఁ గావింపవలయును బార్థివేంద్ర. 255
సీ. మిత్రవంచకుని స్వామిద్రోహి నతినీలదంతు జారునిఁ బరదారగమను
వేదపరిత్యాగి వేదవిక్రయు సోమవిక్రయు హరికథావిముఖు బధిరు

విధులు = ఆకాలమునకుఁదగినపనులు, తీర్చి=నెరవేర్చి. 252 అగ్నిసంస్కారకర్మంబులు = దహనక్రియలు, బెరయన్ = పొందునట్లు, యథావిధిన్ = విధిప్రకారము. 253 విట్ఛూద్రవ్రజములకున్=వైశ్యశూద్రసమూహములకు, పక్షమాసములు = వైశ్యులకు పదియేనుదినములును, శూద్రులకు నెలదినములును. 254 సూతకాంతదివసంబునన్ = అంటుతీఱునట్టిదినమునందు, ఏకోద్దిష్టంబు=ఒకని నుద్దేశించిచేయుశ్రాద్ధము, ప్రతిసాంవత్సరికమృతాహంబునన్ = ప్రతి సంవత్సరమునందలి మృతతిథియందు. 255 ఆచార్యున్=గురువును, త్రిమధున్ = మధుత్రయాధ్యేతయై తదర్థానుష్ఠాతయగు వానిని, త్రిణాచికేతున్ = త్రిణాచికేతములను అనువాకములను అధ్యయనముచేసి తదర్థములను అనుష్ఠించువానిని, త్రిసుపర్ణున్=త్రిసుపర్ణములు అనుమూఁడు అనువాకములను అధ్యయనముచేసి తదర్థములను అనుష్ఠించువానిని, నానావేదపారగున్=ఎల్ల వేదములను తుదముట్ట చదివినవానిని, షడంగవేదిన్ = ఆఱు అంగములతోను వేదము చదివినవానిని, విష్ణుసంగతహృదయున్=విష్ణువును మనస్సునందుంచుకొన్నవానిని, శ్రోత్రియునిన్.= శ్రుత్యాచారము తప్పక నడుపువానిని, మఖేజ్యున్=యజ్ఞములచేతపూజ్యుఁడైనవానిని, వివిధసామజ్ఞున్=నానావిధములైన సామముల నెఱిఁగినవానిని, ఋత్విజున్= యజ్ఞము నడుపువానిని, వియ్యమున్ = వియ్యంకుని, అర్థిన్ = ప్రియపూర్వకముగా. 256 పరిత్యాగి = బొత్తిగా విడిచినవానిని, సోమవిక్రయున్ = సోమలతను అమ్మునట్టివానిని, హరికథావిము

వృషలీతనుభవుని వృషలీవిభుని గృహదాహకుఁ గానీను ధర్మరహితు
గ్రామయాజకుఁ గొండెగాని మాతాపితృభక్తిహీనునిఁ బదభ్రష్టుఁ గునఖిఁ

ఆ. గుష్ఠరోగిఁ గుండుఁ గోళకు నతివృద్ధు
బేడి దేవలకునిఁ బిన్నపడుచు
వానిఁ బైతృకమున బ్రాహ్మణార్థము చెప్ప
వలవదండ్రు బుధులు వసుమతీశ. 256

ఆ. యోగ్యులైన బ్రాహ్మణోత్తములను దొలు, నాఁటిరాత్రి భోజనంబు పిదపఁ
బైతృకార్థముగను బ్రాహ్మణార్థము చెప్ప,వలయు వినయగౌరవములతోడ. 257

క. స్త్రీసంభోగము గమనా,యాసముఁ గోపంబు నుడిగి యతినియమముతో
భూసురులుఁ దాను శాంత, వ్యాసత యజమానుఁ డుండవలయు నరేంద్రా. 258

క. పైతృకకర్తలు భోక్తలు, నాతులతో రతులు సలిపినను వారలెపో
పాతకులు వారిపితరులు, రేతములోఁ గూలుదురు ధరిత్రీనాథా. 259

క. కావునఁ గర్తయు భోక్తయు, భావపరిజ్ఞానశుద్ధిఁ బాటించి ధరి
త్రీవరసుస్నానాదులు, గావించినపిదపఁ గుతపకాలమునందున్. 260

క. తనయింటికి విప్రులఁ గొని, చని శాస్త్రార్థంబుగాఁగ సంకల్పముతో
నొనరఁ క్షణాదికృత్యము, లొనరిచి పాదములు గడిగి యుచితప్రీతిన్. 261

వ. ఆసనంబులం బ్రవేశంబు చేయించి. 262

తే. విశ్వదేవార్థ మిరువురు విప్రవరులఁ, బ్రాఙ్ముఖంబుగ నొనరించి పైతృకార్థ
మవనిదివిజుల ముగ్వుర నలవరించి, యుత్తరాభిముఖులుగఁ గూర్చుండఁబెట్టి. 263

వ. పితృపితామహప్రపితామహుల నిజగోత్రనామోచ్చారణపూర్వకంబుగా వసు
రుద్రాదిత్యరూపంబుల నమ్మహీసురులం బూజించి వర్గత్రయస్వరూపంబుగా నా
వాహనగంధపుష్పాదు లైనసర్వోపచారంబులును విధిప్రకారంబుగ నాచరించి

---

ఖుఁ = విష్ణుకథలకు మాఱుమొగమైనవానిని, బధిరుఁ = చెవిటివానిని, వృషలీ=పెండ్లిగాక రజస్వల యైనస్త్రీ లోనగునది, గృహదాహకుఁ = ఇల్లుగాల్చినవానిని, కానీనుఁ = పెండ్లికానిదాని కొడుకును, గ్రామయాజకుఁ = ఊరిపురోహితుని, పదభ్రష్టుఁ = ఉత్తమపదమునుండి తొలఁగినవానిని, కునఖిఁ=వికృతనఖుని, కుండుఁ = మగఁడుండఁగా అంకుమగనికిఁ గన్నదానికొడుకును, గోళకుఁ = మగఁడు చచ్చినపిమ్మట అంకుమగనికిఁ గన్నదానికొడుకును, పేడిఁ=నపుంసకుని (లేక) తగినవయసు వచ్చియు మీసము మొలవనివానిని, దేవలకునిఁ = పూజారివానిని, పిన్నపడుచువానిఁ = బాలుని, పైతృకంబులకుఁ=పితృకర్మలకు. 259 కర్త = చేయువాఁడు, భోక్త = భుజించువాఁడు. 260 కుతపకాలము = మట్టమధ్యాహ్నము. 261 క్షణము = నిమంత్రణార్థము నియమించి యిచ్చెడు అక్షతలు మొదలగునది. 263 ప్రాఙ్ముఖంబుగఁ = తూర్పుమొగముగా, అలవరించి = జతపఱిచి, అగ్నౌకరణంబులు = అగ్నికార్యములు, రక్షోఘ్నమంత్రంబులు = రాక్షసనాశకములైనమంత్రములను, అనుష్ఠించుచుఁ = చెప్పుచు, పాయసాపూపసూపవ్యంజనంబులు = పరమాన్నము అప్పములు

విశ్వేదేవతలకు స్వర్ణపాత్రంబులను పితృదేవతలకు రజతపాత్రంబులను బెట్టి యగ్నౌకరణంబులు దీర్చి హుతశేషాన్నంబు పితృపాత్రంబులం బెట్టి రక్షోఘ్న మంత్రంబు లనుష్ఠించుచుఁ దనవలన సంపాదింపంబడినయన్నంబును బాయసాపూపసూపవ్యంజనంబులును వడ్డించుసమయంబున. 264

తే. అతిథి తనయింటి కన్నార్థి యగుచు వచ్చె, నేని విప్రులయనుమతి నెదురువోయి
తోడుకొనివచ్చి సద్భక్తితోడ వారి, పఙ్క్తియందును విష్ణురూపముగఁ దలఁచి.

తే. భోజనము సేయఁబెట్టిన భూవరేణ్య
పైతృకం బొప్పు సర్వసంపన్నమగుచు
నతిథి యపుడు తిరస్కృతుం డయ్యెనేని
బైతృకక్రియ వృథ యని పల్కె శ్రుతులు. 266

తే. దేవతామూర్తి యగునట్టిదివ్యయోగి, వివిధభంగుల నజ్ఞాతవృత్తితోడ
నవనిఁ జరియించునట్టియభ్యాగతులను, బూజసేయక యుండినఁ బుణ్యహాని. 267

తే. రాజవల్లభ వేదశాస్త్రములయందు, వినవె "యభ్యాగతస్స్వయం విష్ణు" వనఁగ
నతిథిసంతర్పణము వెలియైనఁ బుణ్య, మేమియున్నది యజ్ఞంబు లేల సేయ. 268

వ. ఇవ్విధంబున నభ్యాగతసమేతంబుగాఁ బైతృకంబు సేయునప్పుడు బ్రాహ్మణోత్తములు మౌనంబుతో యథేష్టంబుగా భుజియించినయనంతరంబ తదుచ్ఛిష్టసన్నిధియందు మంత్రపూర్వకంబుగా పితృపితామహప్రపితామహులకుఁ బిండదానంబు చేసి పితృతీర్థంబునం దిలోదకంబు లిచ్చి పాణిప్రక్షాళనానంతరంబున బ్రాహ్మణాశీర్వాదంబులు వడసి యథాక్రమంబున సత్కారంబులుచేసి వారి ననిచి పుచ్చి వారియనుమతంబున వైశ్వదేవంబును బలిహరణంబును దీర్చి సకలబంధుసమేతంబుగా భోజనంబుచేసి కృతార్థుండై యుండవలయు. 269

తే. పైతృకశ్రాద్ధ మొనరింపఁ బరమభక్తి
యుక్తిలేక దురాత్ముఁడై యుండెనేని
మాలఁడై పుట్టుఁ గోటిజన్మములయందు
ననుచుఁ బలుకుదు రార్యులు మనుజనాథ. 270

క. సారంగము నునుఁబోతును, సైరిభమును గొఱియ దుప్పి శశము నకులమున్
వారిచరంబును మేఁకయు, నారయఁ బలపైతృకమున కర్హ మగుఁ జుమీ. 271

---

పప్పుకూరలును. 267 వివిధభంగులన్ = నానావిధముల, అజ్ఞాతవృత్తితోడన్ = తెలియనివర్తనముతో. 268 అభ్యాగతస్స్వయంవిష్ణుః = అన్నార్థియై యెదురుకొని వచ్చినవాఁడు తాను విష్ణువు, సంతర్పణము = సంతుష్టి. 269 యథేష్టంబుగాన్ = ఇష్టముచొప్పున, పితృతీర్థంబునన్ = బొటనవ్రేలికొననుండి, పాణిప్రక్షాళనానంతరంబునన్ = చేతులు కడుగుకొన్న పిమ్మట, 271 సారంగము = జింక, సైరిభము = కారుదున్నపోతు, శశము=కుందేలు, నకులము = ముంగిస,

### శ్రాద్ధయోగ్యాయోగ్యద్రవ్యప్రశంస.

ఆ. యవలు వడ్లు చామ లావాలు మినుములు
తిలలు పెసలు గోధుమలు ప్రియంగు
వులు వనంబులందుఁ గలయోషధులు మేలు
శ్రాద్ధకర్మములకు సంతరింప. 272

క ఉలవలు కందులు కోద్రవములు కంబులు రాజమాషములు నునుములు చో
ళ్లులు తమిఁదలు నూఁదరలును, గలవని యిడఁజనదు పైతృకమునకు నధిపా. 273

ఆ. మునగకాయ యుల్లి ముల్లంగి గుమ్మడికాయ నేతిబీఱకాయ పుచ్చ
కాయ నక్కదోసకాయ వట్రువసొరకాయ గాదు శ్రాద్ధకర్మములకు. 274

ఆ. గోఁగుకూర యీలకూర చెంచలికూర, తుంటికూర పొన్నగంటికూర
నల్లతోఁటకూర పుల్లబచ్చలికూర, శ్రాద్ధములకుఁ గాదు సంతరింప. 275

ఆ గొఱియ మేఁక కడితి గోడిగ యెనుఁబెంటి, గార్ధభములపాలు గావు పూతి
గంధఫేనిలములఁ గల్గినజలములు, గావు శ్రాద్ధములకు భూవరేణ్య. 276

ఆ. పాపకర్ము వేదబాహ్యుని నతిరోగిఁ, గుక్క నక్కఁ బిల్లిఁ గ్రోఁతి గోడి
గ్రామసూకరంబు గార్ధభంబును నగ్నుఁ, గాదు చూడఁ బైతృకంబునాఁడు. 277

వ. ఇవ్విధంబున శ్రాద్ధంబు యథాకాలయోగ్యంబుగా నాచరించిన మహాత్ములు కృత
కృత్యు లగుదురని చెప్పిన సగరచక్రవర్తి కృతార్థుండై యౌర్వోపదిష్టమార్గం
బున సదాచారసంపన్నుండై సుఖంబుండెనని చెప్పిన మైత్రేయుం డిట్లనియె. 278

తే. అనఘ పైతృకదివసంబునందు నగ్నుఁ, జూచినను కడుదోషంబు సోఁకు ననుచు
నాకుఁ జెప్పితి నగ్నుఁ డనంగ నెట్టి, వాఁడు తెలియంగ నానతీవలయు ననిన. 279

### నగ్నలక్షణము.

ఉ. ధీమతిఁ జిన్ననాఁ డఖిలదేవతలన్ భజియించి ఋగ్యజు
స్సామము లభ్యసించి బహుశాస్త్రపరాయణుఁడై మహీసురుం
డేమియు బుద్ధిలేక శ్రుతు లెంతయు నింద యొనర్చువానిఁ బో
పామరుఁడైన నగ్నుఁడని పల్కిరి వేదవిదుల్ మునీశ్వరా. 280

---

వారిచరము=చేఁప, పలపైతృకమునకున్=మాంసము పెట్టిచేయుపితృకర్మకు. 272 ప్రియంగువులు=కొఱ్ఱులు. 273 కోద్రవములు=ఆళ్లు, కంబులు=సజ్జలు, రాజమాషములు=అలసందెలు, చోళ్లు=నల్లరాగులు, 275 సంతరింపన్=సేకరింప. 276 గోడిగ = ఆఁడుగుఱ్ఱము, ఎనుఁబెంటి=బఱ్ఱె, పూతిగంధఫేనిలములన్=చెడ్డకంపుగల కుంకుడుచెట్లవేళ్లు ఊటలయందు. 277 నగ్నున్=నియమపూర్వకముగ వేదశాస్త్రములను పఠించియు వేదముల నిందించునట్టి బ్రాహ్మణుని. 278 ఔర్వోపదిష్టమార్గంబునన్=ఔర్వునిచేత ఉపదేశింపఁబడిన చొప్పున. 280 ధీమతిన్=వివేకయుక్తమైన బుద్ధితో, భజియించి=సేవించి, పామరుఁడు=జ్ఞానహీనుఁడు, వేదవిదులు=వేదముల నెఱిఁగినవారు, 281 పాషం

ఆ. వేద మభ్యసించి వేదమార్గంబులు, విడిచిపెట్టి దుర్వివేకబుద్ధి
బహుమతముల నడుచు పాషండుఁడే నగ్నుఁ, డతనిఁ జూచి యర్థ మాడవలదు.
వ. నగ్నసంభాషణంబు లనేకపాతకహేతుభూతంబు లేతద్విషయం బైనయొక్క యితిహాసంబు గలదు. తొల్లి శంతననందనుం డైనభీష్మునకు మత్పితామహుండైన వసిష్ఠుండు వినిపించునప్పు డేను తెలివిపడ వింటి నాత్తెఱంగు వినుము. 282
ఉ. పూర్వమునన్ హిరణ్యకశిపున్ గమలాక్షుఁడు నారసింహుఁడై
గర్వ మడంచి దేవతలఁ గాచిననాఁటివిరోధ మాత్మలో
నోర్వఁగలేక వానితనయుం డగుప్రహ్లాదుఁడు దైత్యసేనతో
నుర్వియు నింగియుం బగుల నొక్కట నార్చుచు వచ్చి యుగ్రుఁడై. 283
మత్తకోకిల. నాకలోకముమీఁద ఘోరరణం బొనర్చిన భీతులై
పాకశాసనుఁ డాదియైనసుపర్వులందఱు దేవతా
నీకసేవితుఁ డైననీరదనీలవర్ణుని నుత్తమ
శ్లోకునిం బరముం బయోరుహలోచనున్ భజియించుచున్. 284
మ. చని దుగ్ధాంబుధియుత్తరంబున వళక్షద్వీపమధ్యంబునన్
ఘనచింతామణిశైలకందరమునన్ గల్పద్రుమోద్యానశో
భనదేశంబులయందు నుజ్జ్వలతపఃపారీణులై యుండి రా
వనజాతాక్షుసహస్రనామపఠనవ్యాపారపారీణులై. 285
తే. కోరి యిబ్భంగి నత్యంతఘోరతపము, సేయుచుండంగఁ ద్రైలోక్యనాయకుండు
భక్తలోకైకరక్షణోపాయుఁ డగుచు, నతులకారుణ్యరసహృదయంబుతోను. 286
పంచచామరము. సముజ్జ్వలంబు లైనశంఖచక్రముల్ కరంబులం
దమర్చి పక్షివాహనంబునన్ బసిండిచీరతో
సమస్తదివ్యమౌనికోటి సన్నుతించి మ్రొక్కఁగా
రమావిభుండు వచ్చె నిర్జరవ్రజంబుపాలికిన్. 287

---

డుఁడే=వేదనిందకుఁడే. 282 ఇతిహాసంబు = పూర్వకథ. 283 నింగి=ఆకాశము, ఒక్కటన్ = ఏకముగా, ఉగ్రుఁడు=భయంకరుఁడు. 284 నాకలోకము=స్వర్గలోకము, ఘోరరణంబు=భయంకరయుద్ధము, పాకశాసనుఁడు=ఇంద్రుఁడు, సుపర్వులు=దేవతలు, దేవతానీకసేవితుఁడు=దేవతలసమూహములచేత సేవింపఁబడువాఁడు, నీరదనీలవర్ణునిన్=మేఘమువంటి నల్లనిచాయగలవానిని, పరమున్= అత్యుత్తముని, పయోరుహలోచనున్=కమలములవంటి కన్నులుగలవాఁడైన శ్రీహరిని. 285 దుగ్ధాంబుధి=పాలసముద్రము, వళక్షద్వీపము= తెల్లదీవి-శ్వేతద్వీపము, కందరమునన్=గుహయందు, కల్పద్రుమోద్యానశోభనదేశంబులయందున్ = కల్పవృక్షములుగల ఉద్యానవనమునందలి పుణ్యప్రదేశముల యందు, ఉజ్జ్వలతపఃపారీణులు=ప్రకాశమానమైన తపస్సుచేత గట్టెక్కినవారు. 286 త్రైలోక్యనాయకుండు=మూఁడులోకములయందలి ప్రాణులకు ప్రభువైనవాఁడు, భక్తలోకైక రక్షణోపాయుఁడు= భక్తుల సముదాయమును ముఖ్యముగ రక్షించుటయందలి ఉపాయముగలవాఁడు. 287 సముజ్జ్వలంబులు=మిక్కిలి వెలుఁగునవి, పసిండిచీరతోన్=బంగారు పచ్చడముతో, నిర్జరవ్రజంబుపాలికిన్ =

వ. ఇట్లు ప్రత్యక్షంబైన. 288

శా. దేవేంద్రప్రముఖాఖిలామరవరుల్ దేదీప్యమానప్రభా
శ్రీవిభ్రాజితమూర్తియై వెలుఁగులక్ష్మీదివ్యవక్షస్స్థలున్
భావంబుల్ వికసింపఁ జూచి గరిమన్ భక్తిప్రణామంబు లి
చ్ఛావృత్తుల్ దళుకొత్తఁజేసి నుతిసేయం జొచ్చిరత్యున్నతిన్. 289

లయగ్రాహి. ఆదిపురుషోత్తమ యనాదినిధనాసురని
షూదన సుఖామృతరసోదనరమాసం
పాదనమహోగ్రభవశాదశుచివాసరక
రోదయవినమ్రజనఖేదహరణాప్ర
హ్లాదహృదయస్థితమహాదురితసంహరణ
వేదమయ దుర్జనవివాదహజగత్ప్రా
ణాదరిపువాహన పయోదనిభగాత్రసన
కాదిమునివంద్య కమలోదర నమస్తే. 290

చ. అనుచును బెక్కుచందముల నంబుజనాభునిఁ బ్రస్తుతించి యో
వనరుహనేత్ర భక్తజనవత్సల యోజగదీశ యేము వ
చ్చినపను లాదరించి విని చిత్తమునం గలయట్లు చేయవే
యనుచు వినమ్రవృత్తి నపు డయ్యమరావలి భక్తి నిట్లనున్. 291

ఉ. ధీరత లోకముల్ పొగడ దేవర నాఁడు నృసింహమూర్తివై
భూరిబలున్ హిరణ్యకశిపుం బరిమార్చి నిలింపరాజ్యల
క్ష్మీరమణీయవైభవ విశేషము లింద్రుని కిచ్చినట్టియా
వైరము కారణంబుగ నవార్యబలోన్నతి చెంగలింపఁగన్. 292

ఉ. వానిసుతుండు హ్లాదుఁ డనువాఁడు భయంకరవీరదైత్యసే

---

దేవతల సమూహమువద్దకు. 289 దేదీప్యమానప్రభాశ్రీవిభ్రాజితమూర్తి = మిక్కిలి వెలుఁగుచున్న కాంతి సంపదచేత ఒప్పునట్టి ఆకృతిగలవాఁడు, ఇచ్ఛావృత్తులు=మనోవ్యాపారములు, తళుకొత్తన్ = ప్రకాశముకాఁగా. 290 అనాదినిధన = జన్మనాశములు లేనివాఁడా, అసురనిషూదన=అసురులను చంపువాఁడా, సుఖామృతరసోదన=సుఖభావమైన అమృతరసమే అన్నముగాఁగలవాఁడా-ఎల్లప్పుడు సుఖము ననుభవించువాఁడా అనుట, మహోగ్రభవశాదశుచివాసరకరదోయ = అతిభయంకరమైన పాపమనెడు బురదకు పరిశుద్ధత్వమనెడు సూర్యోదయమైనవాఁడా, వినమ్రజనఖేదహరణా=మ్రొక్కినవారి దుఃఖమును పోఁగొట్టువాఁడా, వేదమయ=వేదస్వరూపుఁడా, దుర్జనవివాదహ=దుష్టులవాదును, పోఁగొట్టువాఁడా, జగత్ప్రాణాదరిపువాహన = వాయుభక్షకములైన సర్పములకు పగవాఁడగు గరుత్మంతుఁడు వాహనముగాఁగలవాఁడా, పయోదనిభగాత్ర = మేఘమువంటి దేహముగలవాఁడా, నమస్తే=నీకొఱకు నమస్కారము. 292 అవార్య=నివారింపరాని, చెంగలింపఁగన్=అతిశయింపఁగా, 293 నికురుంబుఁడు = సమూహముగలవాఁడు, కదలి = వెడలి-బయలుదేఱి, కొల్లలాడి = కొల్లపెట్టి.

నానికురుంబుఁడై కదలి నాకము సర్వముఁ గొల్లలాడి దు
ర్మానమద ప్రతాపమహిమల్ విలసిల్లఁగ యజ్ఞభాగముల్
తానె హరింపఁ జొచ్చె సురలన్ నిరసించుచు దుండగంబునన్. 293

శా. దేవా దేవరయందు మున్ను దయమై దేవాంతకశ్రేణియున్
దేవవ్రాతము దత్తదుక్తవిధులన్ దీపించునట్లయ్యు ల
క్ష్మీవక్షస్స్థల యజ్ఞభాగము లశేషీభూతముల్ గాఁగ మా
కీ వర్థిం గృపసేసినాఁడ వవి మా కీరాని శాటావలుల్. 294

క. వేదములును శాస్త్రములును, వేదాంగములున్ బఠించి వివిధక్రతువుల్
మోదమునఁ జేయుచున్నా, రాదనుజులు బెరుకులేనియాచారములన్. 295

ఉ. కావున వేదమార్గములు గైకొని యజ్ఞము లాచరించుదై
త్యావలితోడ మార్కొని జయంబు గొనంగ నశక్తులైన యీ
దేవతలన్ గృపాకలితదృష్టిఁ గనుంగొని తద్వినాశకే
లీవిధ మాచరింపుము నిలింపశుభార్జిత పాపవర్జితా. 296

క. అని విన్నపంబు చేసిన, దనుజకులాంతకుఁడు దేవతావర్గములన్
ఘనతరకరుణారసలో, చనములు వికసిల్లఁ బల్కె సదయుండగుచున్. 297

క. దైతేయులు మీ చెప్పిన, భాతిని నిజవర్ణధర్మపరిచితమతులై
శ్రౌతస్మార్తక్రియలం, దాతురులై యున్నవార లమరులకంటెన్. 298

తే. వేదవేదాంగమార్గముల్ విడువ కెవ్వఁ,డేని నిజవర్ణధర్మభూయిష్ఠుఁ డగుచు
నుండు నావీర్యవంతుని నోర్వ నెట్టి,వారుఁ జాలరు కడునిక్కవంబు వినుఁడు.

క. ఆదనుజదైత్యవీరుల, వేదబహిష్కృతులఁజేసి వీర్యము బలమున్
భేదించి విజయమును సం, పాదించెద మీకు నెల్లభంగుల ననుచున్. 300

## మాయామోహుండు తనమాయోక్తులచే నసురుల వేదబాహ్యులుగాఁ జేయుట.

క. తనమూర్తియందు నొకపురు, షుని మాయామోహుఁ డనఁగ సురుచిరతేజో

---

దుర్మానమదప్రతాపమహిమలు = చెడ్డగర్వము క్రొవ్వు పరాక్రమము వీనియొక్క అధిక్యములు, నిరసించుచున్ = తిరస్కరించుచు, దుండగంబునన్ = చెడ్డతనముతో. 294 దేవాంతకశ్రేణి=రాక్షసులబారు, వ్రాతము=సమూహము, తత్తదుక్తవిధులన్ = వారివారికి చెప్పఁబడినక్రమములతో, అశేషీభూతముల్ గాఁగన్ = మిగులులేనివిగా - సర్వమును 295 బెరుకు = సంకోచము. 296 తద్వినాశకేలీవిధము = వారిని నాశముచేయుట యనెడు ఆటరీతిని-వారిని చంపుటను, నిలింపసుఖార్జిత = దేవతలకొఱకు సంపాదింపఁబడిన సుఖముకలవాఁడా, పాపవర్జిత= పాపములచేత విడువఁబడినవాఁడా. 298 భాతి = విధము, నిజవర్ణ ధర్మపరిచితమతులు = తమ కులాచారమునందు వాడుకచేయఁబడిన బుద్ధిగలవారు, శ్రౌత = వేదమునందు చెప్పఁబడిన, స్మార్త = స్మృతులయందు చెప్పఁబడిన, ఆతురులు=అసక్తులు. 299 నిజవర్ణధర్మభూయిష్ఠుఁడు = తన కులాచారము తఱుచుగాఁగలవాఁడు, నిక్కవంబు = సత్యము. 300 వేదబహిష్కృతులన్ = వేదమువలన వెలిఁబడినవారిని, సంపా

ధనుఁ బుట్టించి మురాంతకుఁ, డనిమిషవర్గములతోడ ననియెఁ బ్రీతిన్. 301

తే. ఈమహామహుఁ డసురులనెల్ల వేద,శాస్త్రబాహ్యులఁ జేసి పాషండకర్మ [లు.
ములకు నూల్కొల్పి పటుతేజమును బలంబుఁ, జెఱుచునప్పుడె మీచేతఁ జెడుదురరు

వ. అని నిర్దేశించి యద్దేవుం డంతర్ధానంబునం బొందె దేవగణంబులును మాయామోహసమేతులై క్రమ్మఱ నిజనివాసంబులకుం జని రంత నమ్మాయామోహుండును. 303

తే. బర్హిపత్త్రధరుండు విస్పష్టముండ
మస్తకుండును మఱి దిగంబరుఁడు జైన
శాస్త్రశీలుండు నై సర్వజనులఁ దనదు
మాయఁ జొక్కించుచును గరిమంబుతోడ. 304

తే. నర్మదాతీరమునఁ దపోనవ్యవృత్తి, నెనయుదానవవిభులసన్నిధికిఁ బోయి
వరుస దీవించి వారిచే వలయుపూజ,లంది యుచితసల్లాపంబు లాచరించి. 305

క. అతిమధురము నతిశాంతము, నతివినయము నతిహితంబు నగునర్థములన్
బ్రతిభ గలవాక్చమత్కృతి, దితిజుల నీక్షించి పలికె దివిజులు పొగడన్. 306

క. మీ రిహలోకసుఖంబులు, గోరియొ పరలోకసుఖము గోరియొ కడుదు
ర్వారగతి దపము సేసెద, రారసి నా కెఱుఁగఁ జెప్పుఁడని పలుకుటయున్. 307

తే. అనఘ మా కైహికములపై నాస లేదు, పరమపావన కైవల్యపదము నందఁ
జేయుచున్నార మీతపస్సిద్ధి మాకు,నగువిధం బెట్లు తెలియంగ నానతిమ్ము. 308

వ. అనిన నతం డిట్లనియె. 309

తే. మీకు నావచనంబులమీఁదఁ బరమ, మైనవిశ్వాస మొదవినయట్లయేని
*యైహికాముష్మికములప్రయత్నమెల్ల, వివరముగ మీకుఁ జెప్పెద వినుఁడు తెలియ

తే. బ్రతికి యుండినయన్నాళ్లుఁ బరమసౌఖ్య, మైనయైహికమగుఁ జచ్చినపుడె ముక్తి
నాఁగఁ బరలోక మనఁగ నెక్కడిది దీని, నరసి మీవంటిపురుషు లెట్లరిగినారు.

క. ఎంతతప మాచరించిన, నెంతవివేకమునఁ జదువు లెఱిఁగిన దైవం
బెంతగలదన్న నిన్నియు, భ్రాంతిజ్ఞానములు గాక పరమార్థములే. 312

ఉ. కావున వేదశాస్త్రములు గల్లలు యజ్ఞము లాచరించినన్
గోవధపాతకంబు సమకూరుట తథ్యము ముక్తిసౌఖ్యపుం

---

దించెదను=కలిగించెదను. 302 బాహ్యులన్=వెలియైనవారిని, పాషండకర్మములకున్ = వేదవిరుద్ధక్రియలకు, నూల్కొల్పి=ప్రేరేపించి. 304 బర్హిపత్త్రధరుఁడు=నెమలిఈకలధరించినవాఁడు, ముండమస్తకుండు=బోడితలవాఁడు, చొక్కించుచు=పరవశత్వము నొందించుచు, గరిమంబుతోడన్=గొప్పతనముతో. 305 తపోనవ్యవృత్తిన్=తపస్సుయొక్క అపూర్వమైన వర్తనమును, ఎనయు = పొందునట్టి. 308 ఐహికములు=ఈలోకమునందలి సుఖములు. 310 విశ్వాసము=నమ్మిక. 313 కల్లలు=

---

*పరమపావననిర్వాణపదవిహార, విభవము కుపమఁ జెప్పెద వినుఁడు తెలియ. అని పాఠాంతరము.

ద్రోవ లెఱుంగఁగోరిన వినుం డధమాధమవైదికక్రియల్
పోవిడువుండు మామతముఁ బొందుఁడు పొందుఁడు ముక్తికామినిన్. 313

వ. అని యనేకవిధంబుల వేదనిందాసమర్థంబు లైననాస్తికశాస్త్రంబులు ప్రసంగించిన నాదైతేయులు మాయామోహవాక్యంబులకుం జొక్కి పూర్వపరిచితంబులైన వేదంబులు విడిచి దురాచారులై జైనచార్వాకబౌద్ధమతంబులు గైకొని పాషండవర్తులై యందఱు వేదతంత్రంబు లైనయజ్ఞంబుల నిందసేయుచు వైదికకర్మబాహ్యు లైరి మఱియును. 314

క. అరుణాంబరధరుఁడై యప్పురుషుఁడు వెండియును దనుజపుంగవుల నిరం
తరవేదమార్గరతులఁ, నిరతము దుర్మార్గవృత్తి నెగడంజేసెన్. 315

వ. అంత నొక్కనాఁడు దనుజపరివృతుం డైనయప్పురుషుండు యజ్ఞంబు సేయుచున్న సోమయాజులపాలికిం బోయి యిట్లనియె 316

ఆ. జీవహింస గోరి చేసిన పాతకం, బనుచు శ్రుతులు చెప్పునట్టిమీరు
జీవహింస లిపుడు సేయుచున్నారు, కరుణలేక దుష్టకర్ము లగుచు. 317

క. పేర్మి నహింసా పరమో, ధర్మ యనెడితొంటిపలుకుఁ దలఁచుచు నేత
త్కర్మములు విడిచి తద్దయు, నిర్మల మగుమామతమున నిలువుఁడు గరిమన్. 318

తే. ఆహుతులు వేల్వఁగా సవనాగ్ని చేత
దేవతాజ్యేష్ఠశక్రాదిదివిజులకును
దృప్తి యగు ననుచెనఁటివైదికుల నమ్మి
యేల చెడిపోయెదరు మోక్ష మెఱుఁగలేక. 319

తే. దేవపితృకార్యములకు నై ద్విజుల కన్న
మిడినవారికిఁ బరితుష్టి యెట్లు కలుగు
నొరిది ఘటముల నన్నంబుఁ జూచి తృప్తి
నొందుదుర యేని మఱి యిదియును నిజంబు. 320

ఉ. కల్లలు వేదముల్ స్మృతులు గల్లలు కల్లలు యజ్ఞకర్మముల్
కల్లలు పైతృకక్రియలు కల్లలు ఘోరతపఃప్రభావముల్
కల్లలు దేవకార్యములు గావున బైజలు మాని మామతం
బెల్లవిధంబులఁ నడుపుఁ డిమ్ముల ముక్తికిఁ బోవఁ గోరినన్. 321

వ. అని యనేకప్రకారంబుల బోధించి శ్రౌతస్మార్తబహిష్కృతులం జేసి శుద్ధపాషండకర్మంబులకు నూలుకొల్పిన దైత్యదానవలోకంబు లమ్మహాపాతకంబునం జేసి తేజో

---

అసత్యములు, తథ్యము = సత్యము. 314 సమర్థములు = చాలినవి, నాస్తికశాస్త్రంబులు=దేవుఁడు లేఁడనుటను స్థిరపఱచునట్టి శాస్త్రములు, పూర్వపరిచితంబులు = మునుపు అభ్యసింపఁబడినవి. 315 నెగడఁ=అతిశయింప 318 పేర్మిఁ = గౌరవముతో. 319 దేవతాజ్యేష్ఠశక్రాది=బ్రహ్మ యింద్రుఁడు మొదలైన, చెనఁటి=కుత్సితము. 321 బైజలు=అజ్ఞానములు. 322 బహిష్కృతులఁ=

బలశూన్యులై తారుదార వినాశంబునొంది రప్పుడు దేవతలు పరమధర్మపరా
యణులును వేదమార్గవర్తులునై రాక్షసుల నశ్రమంబున సాధించి పూర్వప్రకా
రంబున యజ్ఞభాగంబు లుపయోగించుచు సుఖంబుండి రనిచెప్పి మఱియును.322

క. వేదములు విడిచి క్రతువులు, గాదని పోనాడి పైతృకంబులమేలుళ్
లేదని నాస్తికవిధి సం, పాదించినవాఁడు నగ్నపాషండుఁ డగున్. 323

మ. నలిమీఱం గలబ్రహ్మచారి గృహి వానప్రస్థ యత్యాశ్రమం
బులలో నేమియు నొల్ల కాగమచయంబు న్నిందగావించుచుళ్
బలుదుర్మార్గములెల్ల నిక్కములుగా పాటించుచుళ్ విష్ణుభ
క్తుల నిందించినవాఁడు నగ్నుఁ డని యెందుం జెప్పు వేదార్థముల్. 324

శతధన్వుం డనురాజు పాషండసంభాషణదోషంబున శునకాదిజన్మంబులఁ బొందుట,

తే. అనఘ పాషండుఁ జూచిన నబ్జమిత్రుఁ
జూడవలయును వానితోఁ గూడి మాట
లాడినను దుష్టజన్మంబులందుఁ బుట్టుఁ
జెలిమిచేసిన పాపంబు చెప్పరాదు. 325

వ. పాషండభాషణంబున నైనపాతకంబు తేటపడునట్టి కథఁ జెప్పెద వినుము. 326

క. శతధనుఁ డనియెడుధరణీ, పతి తొల్లి భుజప్రతాప బంధురయశుఁడై
క్షితిఁ బాలించుచు ధర్మ, స్థితిఁ గ్రతువులు భక్తితోడఁ జేయుచునుండున్. 327

తే. అమ్మహీపతికులకాంత యధికసాధ్వి, సర్వలక్షణసంపన్న సత్యశౌచ
వినయవిజ్ఞానరూపవివేకనిరత, శైభ్య యనునది పతిభక్తి సలుపుచుండె. 328

వ. అమ్మహీపతి కార్తికమాసంబున నొక్కనాఁడు యజ్ఞంబుచేసి ధర్మపత్నీసహితుండై
భాగీరథియందు నవభృథస్నానంబుచేసి తత్తీరంబున బ్రాహ్మణోత్తములకు దక్షిణ
లిచ్చుచున్న సమయంబున. 329

క. తనకు విలువిద్య మునుచె, ప్పిన యాచార్యునిసఖుండు పీడావర్తుం
డనుపాషండుం డొకరుఁడు, చనుదెంచిన వానితోడ సంభాషించెన్. 330

తే. వానిఁ బొడగని యారాజవనిత దొలఁగి
పోయి హరిచింత సేయుచుఁ దోయజాప్తుఁ
జూచి దోషవిముక్తయై క్షోణివిభుని
రాక గోరుచు నున్నంత రాజవరుఁడు. 331

క. పాషండుని నతిగౌరవ, భాషణములఁ దన్పి వానిఁ బన్పి ముదముతో
యోషిత్సమేతుఁడై పరి, తోషంబున వచ్చి గరిమతో మహి యేలెన్. 332

---

వెలియైనవారిని, నూలుకొల్పినన్=పురికొల్పఁగా, తారుదార=తమంతటదామే, ఉపయోగించుచున్=అనుభవించుచు. 324 నలి=బాగు. 325 అబ్జమిత్రున్=సూర్యుని, చెప్పరాదు=చెప్పశక్యముకాదు. 327 బంధురము=అధికము. 328 కులకాంత = భార్య. 329 అవభృథస్నానంబు = యజ్ఞమున దీక్షాంతమందు చేయునట్టి స్నానము. 332 యోషిత్సమేతుఁడు=భార్యతోఁగూడుకొన్నవాఁడు, పరి

వ. అంతఁ గొంతకాలంబునకు నారాజు పంచత్వంబునొందె నయ్యిందువదనయు నతనితోడన యగ్నిప్రవేశంబుచేసి జన్మాంతరంబున జాతిస్మరత్వంబు గలిగి సర్వ విజ్ఞానసంపన్నయై కాశిరాజునకుం గన్యయై జన్మించి పెరుగుచుండె నారాజును పాషండసంభాషణదోషంబున విదిశాపురంబునం గుక్కయై పుట్టిన. 333

తే. రాజబింబాస్య జాతిస్మరత్వమహిమ
వలనఁ దనజన్మమంతయుఁ దెలిసి ప్రాణ
నాథుఁ డెచ్చోట నేమియైనాఁడొ యనుచు
నాత్మఁ దలపోసి కుక్కపుట్టగుట దెలిసి. 334

ఆ. తండ్రి పెండ్లిసేయఁ దలఁచిన నొల్లక, పిన్నతల్లిఁ జూచు ప్రేమతోడ
నిందువదన విదిశ కేతెంచి శునకమై, యున్నప్రాణవిభుని నొనరఁ గాంచి. 335

ఆ. అధికదుఃఖనిరత యగుచు నేకాంతమై, నపుడు ప్రాణనాథు నల్లఁజేరి
పరమభక్తితోడఁ బ్రణమిల్లియింతి యి,ట్లనియెఁ గరపయోరుహములు మొగిచి.

ఆ. నిన్నువంటిపుణ్యనిరతుఁడు పాషండ, భాషణమున నైనపాతకమున
నిట్టియధమజాతిఁ బుట్టఁగఁ బాలయ్యె, తప్పఁ ద్రోయరాదు దైవఘటన. 337

తే. నీవు జాతిస్మరత్వంబు నిశ్చయింప, లేక యజ్ఞానవృత్తి నీలీల నధమ
జాతి నున్నాఁడ వీపాటి చాలు నింక, నీశరీరంబు విడువంగదే మహాత్మా. 338

వ. అని పరమోపదేశంబుచేసిన యప్పుణ్యవతితోడిసంభాషణంబునంజేసి యాశున కంబు జాతిస్మరత్వంబున నిరాహారియై కతిపయదినంబులకు శరీరంబు విడిచి కోలాహలం బనుపర్వతంబున నక్కయై పుట్టిన యేడుగాలంబునకును. 339

ఆ. దివ్యదృష్టి నింతి దెలిసి యచ్చోటికి, నొక్కనాఁడు వచ్చి నక్కఁ జూచి
యల్లకుక్కతోడ నాడినవాక్యంబు, లెల్లనాడి మగుడ నేగుటయును. 340

క. ఆసగ్గారియుఁ బుణ్య, స్త్రీసంభాషణము దనకుఁ జెందినకతనం
జేసి వివేకజ్ఞానవి,కాసంబున నుల్లసిల్ల కాననభూమిన్. 341

క. ప్రాయోపవేశమునఁ దన,కాయంబు పరిత్యజించి గ్రక్కునఁ దోఁడే
లై యుదయించిన నచటికిఁ, బోయి యతివ తొంటియట్ల బోధించుటయున్. 342

వ. ఆవృకంబు పంచత్వంబు నొంది వెండియు వానరంబై పుట్టి యప్పుణ్యవతివచ నంబువలన నప్పుట్టువు విడిచి కొక్కెరయై పుట్టి యారాజవదనహితోపదేశంబు నంజేసి యాజన్మంబు విడిచి మయూరంబై పుట్టి వేఁటకారులచేతఁ బట్టువడి

---

తోషంబునన్=అధికసంతోషముతో. 333 పంచత్వంబు = చావు, కన్య=కూఁతురు. 340 దివ్య దృష్టిన్=జ్ఞానదృష్టిచేత. 341 సగ్గారి = సృగాలము-నక్క, కతనంజేసి = కారణముచేత. 342 ప్రాయోపవేశము=చచ్చుతలఁపుతో ఆహారముమాని శయనించుట, కాయంబు=దేహము. 343 వృకంబు=

కాశిరాజునివాసంబునకు వచ్చి కన్యాంతఃపురంబునం బ్రవర్తించుచున్న నక్కన్య యొఱింగి యత్యంతగౌరవంబునం బెంచుచున్నంత. 343

ఆ. జనకచక్రవర్తి జాహ్నవీతటమున, నశ్వమేధయజ్ఞ మాచరించి
ధర్మయుక్తి నవభృథస్నాన మాగంగ, యందుఁ జేయుచున్న యవసరమున. 344

క. ఆపుణ్యకాలమున ధరణీపాలకపుత్రి తాను నెమలియునుం దే
వాపగలోపలఁ గ్రుంకెను, బాపంబులు వాయ బహుశుభంబులు గలుగన్. 345

క. ఆలోన నెమలి కతిపయ, కాలమునకుఁ గాలవశతఁ గలిగి జనకభూ
పాలునికిఁ బుత్త్రుఁడై గుణ, శీలవివేకముల నుల్లసిల్లుచుఁ బుట్టెన్. 346

వ. పుట్టి సంప్రాప్తయౌవనుండై పెరుగుచున్నంత కాశిరాజు తనకన్నియకు స్వయంవరోత్సవంబు సేయ సమకట్టి సకలరాజలోకంబుల రప్పించి కూఁతునకుం జూపిన యప్పరమపతివ్రత పూర్వజన్మంబునం దనప్రాణవల్లభుం డైన జనకునికుమారుని వరియించి యనేకకాలంబు దాంపత్యసుఖంబు లనుభవించె. వైదేహుండును జాతిస్మరత్వంబు గలిగి మహాధర్మశీలుండై తండ్రిపిమ్మట సముద్రముద్రితవసుంధరాచక్రంబు నిర్వక్రంబుగం బాలించి కృతార్థుండై యంతంబునం గాంతాసమేతుండై విష్ణుసాయుజ్యంబునం బొందె అని పాషండసంభాషణదోషంబును నశ్వమేధంబున నవబృథస్నానవిశేషంబును బతివ్రతాగణ్యపుణ్యాతిరేకంబునుం జెప్పి మఱియును. 347

మ. అనవేమక్షితిపాన్వయోత్తమ సముద్యద్వైభవోపేంద్ర కాం
చనభూమీధరధైర్యశాశ్వతయశస్సంపన్న దైతేయశా
సనపూజాపరతంత్ర నామితరిపుక్ష్మాపాలకోటీర శాం
తనవప్రాభవ సత్కవీంద్రకవితాతాత్పర్య శౌర్యోన్నతా. 348

క. గుజ్జరిదట్టవిభాళజ, గజ్జనసంస్తుత్య నిత్యకపటారివధూ
హృజ్జనితాప్రతితాపమ, రుజ్జప్రతిమానబలనిరూఢవివేకా. 349

---

తోఁడేలు. 345 దేవాపగ = దేవనది-గంగ. 346 కాలవశత=చావు. 347 సముద్రముద్రితవసుంధరాచక్రంబు = సముద్రముచే చుట్టఁబడిన భూమండలమును, నిర్వక్రంబుగన్ = విలోపమును లేక, అతిరేకము=అతిశయము. 348 దైతేయశాసనపూజాపరతంత్ర=విష్ణుదేవుని అర్చించుటయందు ఆసక్తమైన ప్రవర్తనముగలవాఁడా, నామితరిపుక్ష్మాపాలకోటీర=వంపఁబడిన శత్రురాజులయొక్క కిరీటములుగలవాఁడా, శాంతనవప్రాభవ=భీష్మునిశక్తివంటిశక్తిగలవాఁడా, సత్కవీంద్రకవితాతాత్పర్య=సత్కవిశ్రేష్ఠులయొక్క కవిత్వమునందలి తత్పరత్వముగలవాఁడా, శౌర్యోన్నతా = శూరత్వముచేత గొప్పవాఁడా. 349 గుజ్జరిదట్టవిభాళ - ఇది బిరుదు పేరు. జగజ్జనసంస్తుత్య = లోకులచేత స్తుతింపఁదగినవాఁడా, నిత్యకపటారివధూహృజ్జనితాప్రతితాప=శాశ్వతమైన కపట శత్రువుల భార్యలహృదయములందు పుట్టింపఁబడిన సరిలేని సంతాపముగలవాఁడా. మరుజ్జప్రతిమానబల = వాయుపుత్త్రుఁడైన భీముని బలముతో సమానమైన బలముగలవాఁడా, నిరూఢవివేక = మిక్కిలి స్థిరపడిన తెలివి

రంజనీవృత్తము.—

కామధేనుశిబికల్పభూమిరుహకంజబాంధవతనూజచిం
తామణిప్రతిమదానశోభిత నితంబినీజనమనోజ సం
గ్రామపార్థ బలగర్వితారిపురకాలకంధర మహాకవి
స్తోమసన్నుతవచోవికాస రణశూర బంధురపరాక్రమా. 350

గద్యము. ఇది శ్రీమదమరనార్యపుత్ర హారితసగోత్రపవిత్ర సుకవిజనవిధేయ వెన్నెలకంటిసూరయనామధేయప్రణీతం బైనయాదిమహాపురాణం బగుబ్రహ్మాండంబునందలిపరాశరసంహిత యైనశ్రీవిష్ణుపురాణంబునందుఁ జతుర్దశమన్వంతరప్రకారంబును వేదవేదశాఖావర్ణంబులును యాజ్ఞవల్క్యచరిత్రంబును సకలపురాణవిద్యాకీర్తనంబును యమకింకరసంవాదంబును బ్రాహ్మణాదివర్ణధర్మంబులును బ్రహ్మచర్యాది చతురాశ్రమక్రమంబులును ఆచారవర్తనంబులును పాషండోపాఖ్యానంబును శతధన్వచరిత్రంబు నన్నది చతుర్థాశ్వాసము.

---

గలవాఁడా. 350 కంజబాంధవతనూజ=సూర్యునికొడుకైన కర్ణుని, ప్రతిమ=పోలిన, దానశోభిత=ఈవిచేత ప్రకాశించువాఁడా, నితంబినీజనమనోజ = స్త్రీలకు మన్మథుఁడా, సంగ్రామపార్థ = యుద్ధమునందు అర్జునుఁడా, బలగర్వితారిపురకాలకంధర = బలముచేత గర్వించిన శత్రువుల పట్టణములకు శివుఁడా, మహాకవిస్తోమసన్నుతవచోవికాస = గొప్పకవుల సమూహముల చేత కొనియాడఁబడినమాటల యొక్క వికాసముగలవాఁడా, రణశూర = యుద్ధమునందు శూరుఁడా, బంధురపరాక్రమా= మిక్కుటమైన పరాక్రమము కలవాఁడా.



శ్రీ రస్తు.

# శ్రీ విష్ణుపురాణము

## పంచమాశ్వాసము.

---



లక్ష్మీవల్లభకరు
ణాలంకృత భూమిమండలాఖండల శౌ
ర్యాలక్షితరిపుహృదయక
రాళీకృతసుప్రతాప రాఘవభూపా. 1

వ. సకలపురాణవిద్యాధురంధరుం డైనపరాశరుండు మైత్రేయున కిట్లనియె నిట్లు నావలన సమస్తంబును సవిస్తరంబుగా వింటి వింక వినవలయునవి యెట్టివి యని యడిగిన నతం డిట్లనియె. 2

తే. కీర్తిపెంపున దేవతామూర్తులైన, సూర్యసోమవంశంబుల క్షోణిపతుల
చరితములు వేలువేలు విస్తారఫణితి, వినఁగఁ గోరెడుఁ జిత్తంబు విప్రముఖ్య. 3

### సూర్యచంద్రవంశపురాజులచరిత్రములు.

వ. అని రాజవంశకథాశ్రవణకుతూహలపరుండై యడిగినమైత్రేయునకుఁ బరాశరుం డిట్లనియె. 4

ఉ. భానుసుధాకరాన్వయవిభాసితులై జగదేకవీరులై
యీనిఖిలంబునన్ వినుతి కెక్కినరాజులఁ జెప్ప నొప్పు వం
శానుచరిత్రముల్ వినిన యట్టివివేకికిఁ గల్గుఁ బుణ్యముల్
వానికి నెన్నఁడేనియును వంశవినాశము లేదు ధాత్రిలోన్. 5

వ. కావున ననేకవీరకుమారభూపాలాలంకృతం బైన మానవవంశంబులు ప్రతిదినంబు విన ననేకపాపపంకప్రక్షాళనం బగునని యిట్లని చెప్పందొడంగె. 6

---

1 శ్రీలక్ష్మీవల్లభ కరుణాలంకృత = శ్రీవిష్ణుదేవునియొక్క కృపచేత అలంకరింపఁబడినవాఁడా-శ్రీహరికరుణను పొందినవాఁడా, భూమిమండలాఖండల = భూమండలమునకు దేవేంద్రుఁడా - మహారాజా, శౌర్యాలక్షితరిపుహృదయకరాళీకృతసుప్రతాప = శూరత్వముచేత చక్కఁగా గుఱుతిడఁబడి శత్రువుల హృదయములందు భయంకరముగా (తోఁపింప) చేయఁబడిన మేలైన ప్రతాపము గలవాఁడా. 5 భానుసుధాకరాన్వయ విభాసితులు = సూర్య చంద్రవంశములయందు ప్రకాశించువారు. 6 పాపపంకప్రక్షాళనంబు = పాపముల నెడు బురదను చక్కఁగా కడుగుట.

మ. జగదారాధ్యుఁడు విష్ణుమూర్తిధరుఁడుఁ సర్వాగమాధీశుఁడుఁ
భగవంతుండును యోగివంద్యుఁడుఁ బరబ్రహ్మస్వరూపంబునై
తగ జన్మించె హిరణ్యగర్భుఁడు జగద్రక్షాగరిష్ఠాత్మకుం
డగునారాయణునాభిపద్మమున సృష్ట్యర్థంబుగా నర్థితోన్. 7

ఆ. అబ్జభవునిదక్షిణాంగుష్ఠమున దక్షుఁ, డవతరించె నతని కదితి పుట్టె
నాసతీలలామయందుఁ గశ్యపునకుఁ, దివసకరుఁడు పుట్టి తేజరిల్లె. 8

ఆ. కమలహితుఁడు విశ్వకర్మతనూభవ, యైనసంజ్ఞయందు నాత్మసుతుని
జనన మొందఁజేసె సాంప్రతం బేడవ, మనువు నఖిలలోకమాన్యయశుని. 9

వ. ఆవైవస్వతమనువున కిక్ష్వాకు నృగ ధృష్ట శర్యాతి నరిష్యంత నభగ దిష్టకరూశ పృషధ్రు లను కుమారులు తొమ్మండ్రు పుట్టి నానాద్వీపమండితం బైనమహీమండలంబునకు రాజులైరి మఱియును. 10

క. ఆవైవస్వతుఁ డమ్మైత్రావరుణులఁ గూర్చి కడుముదంబున భాగ్య
శ్రీవెలసిన సంతతికై, కావించె నతండు పుత్రకామేష్టి తగన్. 11

తే. అందు నపహుతమై హౌతృకాపచార, దోషవశమునఁజేసి పుత్రుండు జనన
మొంద నేరక కన్యక యుదయమయ్యె, నవ్యసౌందర్యవతి యిళానామమునను 12

వ. పదంపడి యక్కన్య మిత్రావరుణప్రసాదంబునంజేసి సుద్యుమ్నుం డను కుమారుండై పెరుగుచుండి యౌవనమదంబున నెవ్వరిం గైకొనక యన్యపురుషులకు దురవగాహం బైనగౌరీవనంబున విహరించుచుండ నలిగి యీశ్వరుండు తొల్లింటి యట్ల స్త్రీరూపం బగునట్లుగా శాపం బిచ్చిన నయ్యింతి సోమసూనుం డైనబుధుని యాశ్రమంబునఁ బరిభ్రమించుచుండె నంత. 13

సీ. మగువకెమ్మోవికమ్మనితేనె లానంగఁ గలుగుట రసనంబు గలఫలంబు
నలినాస్యయాలింగనశ్రీఁ దేలంగఁ గలుగుట దేహంబు గలఫలంబు
భామినీమణిమంజుభాష లాకర్ణింపఁ గలుగుట కర్ణముల్ గలఫలంబు
వనజాక్షిరూపలావణ్యసంపదఁ జూడఁ గలుగుట కన్నులు గలఫలంబు
తే. ముదితతనుసౌరభంబులు మూరుకొనెడి, ఘనతగల్గుట నాసిక గలఫలంబు
నాకు ననుచును రోహిణీనందనుండు, సొంపుతోడ నిలాకన్యఁ జూచి చొక్కె. 14

7 ఆరాధ్యుఁడు=ఆరాధింపఁదగినవాఁడు, హిరణ్యగర్భుఁడు=బ్రహ్మ, జగద్రక్షాగరిష్ఠాత్మకుండు=లోకమును రక్షించుటయందు మిక్కిలి గురుత్వమునొందిన మనసుగలవాఁడు, సృష్ట్యర్థంబుగాన్=సృష్టికొఱకు. 8 దివసకరుఁడు=సూర్యుఁడు. 9 కమలహితుఁడు=సూర్యుఁడు, సాంప్రతంబు=ప్రకృతము-ఇప్పటిది 10 మండితము = అలంకరింపఁబడినది. 12 అందు = ఆయిష్టియందు, అపహుతమై = (కూఁతురు పుట్టవలెనని మనుపత్ని కోరుటచేత) వ్యత్యస్తముగా హోమము చేయఁబడినదై, హౌతృక=హోతృసంబంధమైన, ఈయర్థమందు, శ్లో. "తత్ర శ్రద్ధామనోః పత్నీ హోతారం సమయాచత, దుహిత్రర్థము పాగమ్య ప్రణిపత్య పయోవ్రతా, తేన హోత్రపచారేణ కన్యేళానామ సాభవత్" అని శ్రీశుక

ఉ. ఆనలినాయతాక్షి తనయాయౌవనసంపద లెల్ల రోహిణీ
సూనున కీకయుండినఁ బ్రసూనశిలీముఖుచేత నోర్వఁగా
లేనని యక్కుమారుశుభలీలలు నాతనిరూపవైభవా
నూనవిలాసభాసురతయుం బ్రియమారఁగఁ జూచె నర్థితోన్. 15

వ. ఇట్లన్యోన్యసమాగమంబున నయ్యిద్దఱుం బెద్దకాలంబు దాంపత్యసుఖంబుల ననుభ
వించుచుండ నమ్మిథునంబునకుఁ బురూరవుండు జన్మించె నంత. 16

ఆ. అప్పు డమితతేజు లైనమహాముని,వరులు భక్తితోడ వైష్ణవాఖ్య
మైనక్రతువు చేసి యయ్యింతి సుద్యుమ్నుఁ, గా నొనర్చి రధికగౌరవమున. 17

క. మును సుద్యుమ్నుఁడు సతియై, జనియించుటఁజేసి రాజ్యసంప్రాప్తము లే
కునికి యెఱింగి వసిష్ఠుఁడు, మనువు నొడంబఱిచి యాకుమారవరునకున్. 18

వ. సకలభోగాధిష్ఠానం బైన ప్రతిష్ఠానపురంబునందుఁ బట్టంబు గట్టించిన నతండు
రాజ్యసుఖంబు లనుభవించుచు నుత్కళ గయ వినుతు లనుమువ్వురుకుమారులం
బడసి మహాధర్మశీలుండై యనేకయజ్ఞంబులు చేసి నిజపదంబునఁ బురూరవుఁ
బట్టంబు గట్టి తపంబునకుం జనియె. 19

తే. మనుతనూభవు లైనతొమ్మండ్రునృపుల, యందు పృషదుండు దా గురుహత్య చేసి
యిది నిమిత్తము శూద్రుఁ డయ్యెను దదన్వ,యంబువారును శూద్రులైరతని
యట్ల. 20

క. క్షితిపతి యైనకరూశుఁడు, సుతులం గారూశు లనఁగ సూనృతరతులన్
ధృతిబలపరాక్రమశ్రీ,యుతులం బెక్కండ్రఁ గాంచె నున్నతమతులన్. 21

క. మనుపుత్రుఁ డైనదిష్టుఁడు, గనియెను నాభాగుఁ డనఁగ గాదిలిసుతునిన్
విను మతనికి వైశ్యత్వం, బనుగుణమయ్యెను ధరిత్రి యంతయు నేలన్. 22

వ. ఇట్టినాభాగునకు బలంధనుండును బలంధనునకు వత్సప్రీతియును వత్సప్రీతికినుదార
కీర్తియును ఉదారకీర్తికిఁ బ్రాంశుప్రజాపతియును వానికి ఖనిత్రుండును వానికి
క్షుపుండును క్షుపునకు నతిబలపరాక్రమనిధి యైన వింశుండును వానికి ఖనేత్రుం
డును అతనికి నతివిభూతియును అతివిభూతికి నధికబలపరాక్రముం డైనకరంధ
ముండును వానికి నవేక్షియును అవేక్షికి మరుత్తుం డనుచక్రవర్తియుంబుట్టిరి. 23

మ. మనువంశోత్తముఁ డమ్మరుత్తుఁడు జగన్మాన్యుండు భూలోకమె

---

మహర్షి చేత శ్రీభాగవతంబునఁ జెప్పఁబడియున్నది. 13 సోమసూనుండు=చంద్రునికొడుకు. 15 ప్రసూనశిలీముఖుచేతన్ = మన్మథుని చేత. 19 అధిష్ఠానము = ఉనికిపట్టు. 20 తదన్వయంబు వారు = వానివంశస్థులు. 21 సూనృతరతులన్ = నిజముచెప్పుటయందు ఆసక్తులైనవారిని. ధృతి బలపరాక్రమశ్రీయుతులన్ = ధైర్యముతోను బలముతోను పరాక్రమముతోను సంపదతోను కూడుకొన్నవారిని. 22 గాదిలి=ప్రియమైన. 24 జగన్మాన్యుండు = లోకమునందు పూజ్యుఁడు,

ల్లను దుర్వారబలప్రతాపవిభవోల్లాసంబు శోభిల్లఁగా
నను రాగంబున నేలె నవ్విభుఁడు దా నాదేవతాసార్వభౌ
మునికంటెన్ బలవంతుఁడై రిపుకులంబున్ గూల్చె నుగ్రాజులన్. 24

సీ. క్రతుశాలమొదలుగాఁ గలసాధనము లెల్లఁ గాంచనమయములుగా నొనర్చెఁ
బ్రత్యక్షమున సోమపానంబు గావింప దేవతావల్లభుఁ దెచ్చి తనిపె
గౌరవంబున మరుద్గణముల రావించి పరివారముగఁ జేసి పనులు గొనియె
సకలనిర్జరులను సభఁ గూర్చి యందఱ నర్ఘ్యవిధంబుల నాదరించె
తే దక్షిణలుగా మహీదేవతలకు పసిఁడి, త్రవ్వి తండంబులుగఁ జేసి తనియ నిచ్చి
యశ్వమేధంబు గావించె నమ్మరుత్తుఁ, డఖిలలోకంబులును దన్ను నభినుతింప. 25

వ. అట్టిమరుత్తునకు నరిష్యంతుండును నరిష్యంతునకు దముండును వానికి రాజవర్ధనుండును అతనికి సుధృతియును సుధృతికి నరుండును నరునకుఁ గేరళుండును బుట్టి రట్టికేరళునిపేరం గేరళదేశం బయ్యె నాకేరళునకు బంధుమంతుండును వానికి వేగవంతుండును వానికి బుధుండును బుధునకుఁ దృణబిందుండును బుట్టిరి. 26

తే. అట్టితృణబిందునకుఁ గన్యయై జనించె
నిలబిలానామమున నొక్కయిందువదన
యామృగాక్షి యలంబస యనఁగ నొక్క
యప్సరసఁ గాంచెఁ గూఁతుఁగా నర్థితోను. 27

ఉ. ప్రీతి వహించి దానిఁ దృణబిందుఁడు పెండిలియాడి లోకవి
ఖ్యాతచరిత్రుఁడై మెఱసినట్టివిశాలునిఁ గాంచెఁ బుత్రుఁగా
నాతనిపేర నీధరణియందు వెలింగె విశాలనాఁ బురం
బాతతరాజ్యవైభవసమంచితలక్ష్మికి జన్మభూమియై. 28

సీ. ఆవిశాలునిపుత్రుఁడై హేమచంద్రుండు జనియించె నతనికిఁ జంద్రుఁ డనఁగఁ
దనయుఁడుపొడమెనాతనికిధూమ్రాశ్వుండుజనియించెనతఁడుసృంజయునిగాంచె
నాసృంజయునిపుత్రుఁడై సహదేవుండు పుట్టె గుణాశ్వుఁ డాభూమిపతికి
సుతుఁడయ్యె నతనికి సోమదత్తుఁడు పుట్టె నారాజచంద్రుండు నవని యేలె
తే. నర్థితోడ దశాశ్వమేధాధ్వరములు, చేసి కాంచనరత్నవిలాసినీతు
రంగమోత్తుంగగోధేనురాజినెల్ల, దక్షిణల భూమిసురులకుఁ దనియ నిచ్చి. 29

క. ఆజననాయకునకు సుతుఁ, డై జనమేజయుఁడు పుట్టె నతులితబలతే
జోజయశాలి యతనికిని, రాజన్యుఁడు సుమతి పుట్టె రాజితయశుఁడై. 30

---

దుర్వార = అణఁపరాని, రిపుకులంబున్ = శత్రుసమూహమును, ఉగ్రాజులన్ = భయంకరమైన యుద్ధములయందు. 25 తనిపెన్ = తృప్తినొందించెను, మరుద్గణములన్ = దేవతాసమూహము

తే. ఆయురైశ్వర్యసంపన్ను లతులధార్మి,కులు మహాత్ములు వీర్యవంతులు ననంగ
మహి వెలింగిరి తృణబిందుమహిమవలన, సకలవై శాలికావనీశ్వరచయంబు. 31
వ. ఇది దిష్టవంశప్రకారం బనిచెప్పి మఱియును. 32
క. మనుసుతుఁ డగుసంయాతికి, జనియించెను గన్య యనఁగఁ జంద్రానన య
వ్వనితారత్నముఁ జ్యవనుం, డనుమునిభార్గవుఁడు పెండ్లియాడెన్ బ్రీతిన్. 33
వ. మఱియు నాసంయాతికిఁ బరమధార్మికుం డైన యానర్తుండు పుట్టె వానికి రేవ
తుండు పుట్టె నతండు కుశస్థలి యనుపురంబున రాజ్యంబుచేసి నూర్వురుకుమా
రులం బడసె నందు భ్రాతృశతజ్యేష్ఠుం డైనకకుద్మి యనువానికి రేవతి యను
కన్యారత్నంబు పుట్టె. 34

రేవతీబలరాములవివాహప్రకారము.

చ. అభినవచారుయౌవనవిహారసమంచితవై భవంబులం
ద్రిభువనలక్ష్మికిన్ వెనుక తీయనికన్నియఁ జూచి తండ్రి యీ
యిభగమనన్ వరింపఁ బతి నెవ్వనిఁ గట్టడ సేసెనొక్కొ ప
ద్మభవుఁడు నాకు నిట్టియనుమానము మాను నతండు చెప్పినన్. 35
వ. అని విచారించి రేవతీసమేతుండై యారాజు బ్రహ్మలోకంబునకుం బోయి నప్పు
డప్పితామహుండు హాహాహూహూ లనుగంధర్వులచేత దివ్యగాంధర్వంబు విను
చుండుటంజేసి తనకు నవసరంబులేక ముహూర్తమాత్రంబు తానును దదీయ
సంగీతవిద్యావిలాసంబులకుం జొక్కి మసలె నక్కాలంబున ననేకమహాయుగంబులు
చనియె గీతావసానంబున సుముఖుం డైనచతుర్ముఖునకుం బ్రణమిల్లి కరంబులు
మొగిచి యిట్లనియె. 36
క. దేవా యిది నాకన్నియ, రేవతి యీకమలముఖి వరింపఁదగినధా
త్రీవరకుమారు నెవ్వనిఁ, గావించితి వానతిచ్చి కరుణించఁగదే. 37
క. అనినఁ బితామహుఁ డిట్లను, జననాయక నీకులాభిజాత్యములకుఁ దా
ననుకూలుఁ డైననృపనం,దనునకు నెవ్వనికి నొసఁగఁ దలఁచితి కూఁతున్. 38
చ. అనినఁ గకుద్మి పద్మజునియంఘ్రులకుం బ్రణమిల్లి తొల్లి రా
జ్యనిరతి నుండుకాలమున సన్నుతికెక్కినరాజకోటిలోఁ

---

లను, త్రవ్వితండములుగన్ = అపరిమితములుగా, 31 వైశాలికావనీశ్వరచయంబు = విశాలుని వంశస్థులైన రాజులయొక్క సమూహము. 34 భ్రాతృశతజ్యేష్ఠుండు = నూఱుగురు సహోదరులందును పెద్దవాఁడు. 35 అభినవ=క్రొత్తయైన-అపూర్వమైన, ఇభగమనన్=ఏనుఁగువలె గంభీరమైన నడకగలదానిని, కట్టడచేసెనొక్కొ = నిర్ణయించెనో. 36 గాంధర్వంబు = గానము-పాట, అవసరంబు=సమయము, మసలెన్ = ఆలస్యముచేసెను, గీతావసానంబునన్=పాటముగిసినతోడనే. 37 కన్నియ = కూఁతురు. 38 నీకులాభిజాత్యములకున్ = నీయొక్క-జాతికిని ఉత్తమవంశమునందలి పుట్టుకకును. 39 అంఘ్రులకున్ = పాదములకు, పేర్కొని = పేరుగ్రుచ్చిచెప్పి.

గొనకొని వేలువేలు నొకకొండలఁ జేర్చిన వీరిలోన నె
వ్వనికి మదీయపుత్రి ని వివాహముసేయుదు నానతీఁగదే. 39

వ. అనినం దరహసితవదనుండై పితామహుం డిట్లనియె. 40

ఆ. వసుమతీశ నీవు వచ్చి యిచ్చోట గాం
ధర్వవిద్యయందుఁ దగిలి వినుచు
నునికిఁజేసి యొకముహూర్తంబు చెల్లిన
కాలమునను బహుయుగములు చనియె. 41

క. మహిలో నిరువదియెనిమిది, మహాయుగము లరిగె నిపుడు మనుకాలంబై
సహజము లైనయుగంబుల, మహిమలు నీ కెఱుఁగరాదు మాలోకమునన్. 42

ఉ. నీ విపు డర్థిఁ జెప్పినమహీశులు నాఁడె ధరిత్రి యేలి కా
లావధి నొంది పోయిరి తదన్వయసంభవులందుఁ బుత్రపౌ
త్రావలు లెందఱేనియు లయంబునఁ బొంది రనేకభంగులం
గావునఁ జేరువం గలియుగం బగుచున్నది రాజనందనా. 43

తే. ధాత్రిలోపల నీపుత్రమిత్రసహజ
బలకళత్ర సచివ భృత్య బంధుకోశ
ములు మొదలుగాఁగఁ గాలంబువలన బహుప
రంపరలు చెల్లె నిప్పుడు రాజముఖ్య. 44

క. నీవింక ధరణికిం జని, యీవనితం దగినవరున కిమ్మనిన ధరి
త్రీవల్లభుఁ డాశ్చర్యర,సావేశుం డగుచు మ్రొక్కి యబ్జజుఁ బల్కెన్. 45

క. జగదేకనాథ యిప్పుడు, జగతీతల మేలురాజచంద్రులలోనన్
మగువకు ననుకూలుం డగు, మగని విచారించి చెప్పి మన్నించఁగదే. 46

చ. అనవుడు సర్వలోకగురుఁ డైనపితామహుఁ డాదరంబునన్
వినమితమస్తకుండును వివేకపరిస్ఫుటమానసుండునై
యొనరఁగ గొంతసేపు దలపోసి మహాత్ము నెఱింగి సంతసం
బునఁ గరపద్మముల్ మొగిచి ముత్పులకల్ జనియింప నిట్లనున్. 47

క. జగతీశ నీతనూజకుఁ, దగినవరుం డున్నవాఁడు ధరణీస్థలిలో
జగదేకరక్షణక్రముఁ, డగువిష్ణుం డమ్మహాత్ముఁ డై జనియించెన్. 48

43 కాలావధిన్=కాలముయొక్క మేరను-జీవితకాలపు పరిమితిని, లయంబునఁబొందిరి=చచ్చిరి. 44 పుత్రమిత్రసహజబలకళత్ర సచివభృత్యబంధుకోశములు = కొడుకులు చెలికాండ్రు తోఁడఁబుట్టువులు దండుభార్యలు మంత్రులు సేవకులు చుట్టములు ధనముంచుకొట్టుల్లు. 45 అబ్జజున్ = బ్రహ్మతో. 47 వినమితమస్తకుండు = మిక్కిలివంపఁబడిన తలగలవాఁడు, వివేకపరిస్ఫుటమానసుండు = యుక్తాయుక్త విచారముచేత ప్రకాశించునట్టి మనసుగలవాఁడు. తలపోసి = ఆలోచించి, కరపద్మముల్ మొగిచి=ఆమహాత్మునిఁగూర్చి కరకమలములను ముకుళించి, ముత్పులకలు = సంతోషాతిశయమువలని రోమాంచములు. 48 జగదేకరక్షణక్రముఁడు=లోకమునకుముఖ్యమైన రక్షించునట్టిమర్యాదగలవాఁడు.

వ. ఆతనిమహత్త్వంబు వినుము. 49

చ. మురహరుఁడైనకేశవుతమోగుణమెల్ల ననంతమూర్తియై
ధరణిభరంబు సర్వమును దాల్చు జగత్ప్రళయంబు సేయు న
ప్పురుషుఁడు చిత్రరూపమునఁ బొంది వెలుంగు నతండు నేఁడు ద్వా
పరమున భూమిభార ముడుపన్ జనియించినవాఁడు రాముఁడై. 50

సీ. మనుజేశ యతఁ డాదిమధ్యాంతశూన్యుండు నిరపాయచిత్తుండు నిర్వికల్పుఁ
డాదిదేవుఁ డనంతుఁ డవ్యయాత్ముఁడు కళాకాష్ఠానిమేషాదికాలరూపి
సర్వంకషుఁడు రజస్సత్త్వతామసగుణోద్రిక్తుండు నుద్భవస్థితివినాశ
కారణభూతుఁ డాకాశతత్త్వోపసత్సంపన్నుఁ డపహృతజన్మమరణుఁ

తే. డతులకల్యాణమూర్తి వేదాంతవేద్యుఁ
డతులయోగీంద్రహృదయవిహారశీలుఁ
డప్రమేయుం డవాఙ్మయుఁ డాహితాగ్ని
యదుకులంబున జన్మించి యవని మించె. 51

క. బలభద్రమూర్తి యగునా, బలభద్రుఁడు నీలవస్త్రపరిధానుఁడు లాం
గలముసలపాణి యాదవ,కులరత్నము నీతనూజకుం దగు ననఘా. 52

ఆ. విష్ణుదేవుఁ డతఁడు విష్ణుమాయాశక్తి, యీలతాంగి వీర లిరువురకును
దగు నరేంద్రచంద్ర దాంపత్యవైభవం, బట్లు సేయు సంశయంబు మాని. 53

వ. మున్ను నీచేతం బరిపాలింపంబడినయమరావతికంటె రమ్యంబయినకుశస్థలీపురం బిప్పుడు యుగాంతరంబుల ద్వారావతి యనంగ యాదవరాజధానియై యున్న యది యందు యదువృష్ణిభోజాంధకలోకంబు గొలువ వినోదించుచున్న కామపాలునకు నీకన్నియ వివాహంబు సేయుమా యని యామంత్రణమ్ము సేసినం బ్రణమిల్లి వీడ్కొని రేవతీసమేతుండై భూమండలంబునకు వచ్చి. 54

క. హ్రస్వుల నిస్తేజుల దుఃఖస్వాంతుల విష్ణుభక్తిగర్హితమతులన్
స్వస్వానురూపసన్మా,ర్గస్వల్పులఁ గాంచె నవనికాంతుఁడు నరులన్. 55

వ ఇట్లు కనుంగొనుచుఁ జని ద్వారకాపురంబు సొచ్చి. 56

క. అతులోదీర్ణస్ఫటిక, క్షితిభృత్సమగాత్రుఁ డైనసీరధరు సము

---

51 ఆదిమధ్యాంతశూన్యుండు = జన్మస్థితి నాశములు లేనివాఁడు, నిరపాయచిత్తుండు = కీడులేని మనసుగలవాఁడు, నిర్వికల్పుఁడు = పొరపాటులేనివాఁడు, అవ్యయాత్ముఁడు = నాశరహితస్వరూపుఁడు, సర్వంకషుఁడు = ఎల్లయెడల నిండియుండువాఁడు, ఉద్రిక్తుండు = మిక్కిలి అతిశయించినవాఁడు, అప్రమేయుఁడు = ఇట్టివాఁడని తెలియరానివాఁడు, అవాఙ్మయుఁడు = వాకునకు అందనివాఁడు, ఆహితాగ్ని = యజ్ఞముచేసినవాఁడు. 52 బలభద్రమూర్తి = బలముచేత పదిలుఁడైనవాఁడు - అతిబలవంతుఁడు, పరిధానుఁడు = కట్టుబట్టగాఁ గలవాఁడు. 54 ఆమంత్రణమ్ముసేసినన్ = సెలవియ్యఁగా. 55 హ్రస్వులన్ = పొట్టివాండ్రను, నిస్తేజులన్ = తేజస్సులేనివారిని, గర్హిత=నిందింపఁబడిన, స్వస్వానురూప=తమతమకుఁదగిన. 57 అతులోదీర్ణస్ఫటికక్షితి

న్నతతేజోనిధిఁ గన్గొని, యతనికిఁ బ్రార్థించి యిచ్చె నాత్మతనూజన్. 57

ఉ. ఇచ్చి కృతార్థుఁ డైనమనుజేంద్రుఁడు తక్కినవారు చూడఁగా
నచ్చపలాయతాక్షిపొడవైనశరీరము లాంగలంబునం
ద్రుచ్చి హలాయుధుండు కడుఁగొంచెముచేసి వివాహమై కడున్
మచ్చికతో వహించె గరిమంబున నైహికభోగసంపదల్. 58

వ. ఇట్లు బలభద్రునకు రేవతిం బాణిగ్రహణంబు సేయించి కకుద్మి హిమవంతంబునకుం దపంబు సేయం జనియె. 59

ఉ. రైవతుఁ డాదికాలమున రాజ్యముసేయక బ్రహ్మపాలికిం
బోవుట చూచి రాక్షసులు పుణ్యజనాఖ్యులు పూర్వవైరముల్
భావములందుఁ గ్రందుకొన బల్విడి నాతనిదేశమెల్ల ని
చ్ఛావిధిఁ జూఱగైకొని కుశస్థలియంతయుఁ బాడుచేసినన్. 60

వ. కకుద్మిసహోదరులు నూర్వురుఁ బుణ్యజనభయార్తులై నానాదేశంబులనుండి రారాజవంశంబుల ననేకులు పుట్టిరి. 61

క. భూభుజుఁ డగునభగునకును, నాభాగుఁడు పుట్టె నతఁడు నానాధర్మ
స్వాభావికుఁడై యేలెను, భూభాగంబెల్లఁ గీర్తి భువనము నిండన్. 62

శా. ఆనాభాగున కంబరీషుఁ డుదయంబయ్యెన్ విరూపాఖ్యుఁ డా
భూనాథోత్తముపుత్రుఁడై బహుమఖంబుల్ చేసె నారాజు తే
జోనీరేరుహమిత్రుఁ గాంచెఁ బృషదశ్వున్ వాఁడు ధర్మక్రియా
నూనుం గాంచె రథీరథుం డనఁగ నత్యుగ్రప్రతాపోన్నతున్. 63

తే. ఆరథీరథువంశజు లైననృపతు, లాంగిరసనామములతోడ నవని యేలి
వంశవర్ధనులై తపోవైభవమున, నుల్లసిల్లుచు నేడును నున్నవారు. 64

క. వైవస్వతుండు తుమ్మిన, నావిభుముకుఁగ్రోళ్లఁ బుట్టె నతులైశ్వర్య
శ్రీవిభుఁడు సాధుజనసే,వావిధుఁ డిక్ష్వాకుఁ డర్కవంశవిభుండై. 65

వ. ఆయిక్ష్వాకునకు నూర్వురుకుమారులు జన్మించి రందు కుక్షియు వికుక్షియు దుందుండు ననుమువ్వురను నిజరాజ్యపదంబున నియోగించి 66

ఆ. తండ్రికంటె నధికధార్మికుఁడై మహీ,చక్రమెల్ల నతిపరాక్రమమున
నేలె మనుతనూజుఁ డిక్ష్వాకుఁ డయ్యయో,ధ్యాపురంబు రాజధానిగాను. 67

వ. అమ్మహీపతి యొక్కనాఁ డష్టకాశ్రాద్ధంబు సేయువాఁడై మృగమాంసంబు దెమ్మని వికుక్షిం బనిచిన నతం డనన్యశరణ్యం బైనయరణ్యంబునకుం జని. 68

---

భృత్సమగాత్రుఁడు = సరిలేని వెలుఁగునట్టి స్ఫటికపుకొండతో సమానమైన దేహముగలవాఁడు, సీరధరున్ = నాఁగేలుధరించినవానిని-బలరాముని. 58 మచ్చికతోన్=ప్రేమతో. 60 ఇచ్ఛావిధిన్= ఇచ్చవచ్చినట్లు, చూఱగైకొని=కొల్లపెట్టుకొని. 62 భువనము=లోకము. 63 ధర్మక్రియానూనున్= పుణ్యకర్మములచేత తక్కువకానివానిని - ఎల్లపుణ్యకర్మములు నడపువానిని. 65 ముకుఁగ్రోళ్లన్=

క. బలువేఁటవెంట నడవిం, గలమృగములనెల్లఁ జంపి కడునాఁకటిచే
నిలువంగలేక యొకశశ, పలలము కఱకుట్లుచేసి భక్షించి యొగిన్. 69

క. ఆచిక్కినమాంసంబు యథోచితముగఁ దెచ్చి తండ్రి కొసఁగిన మనువం
శాచార్యుఁ డగువసిష్ఠుఁడు, చూచి వివేకించి యది యశుద్ధం బగుటన్. 70

వ. ఇక్ష్వాకు నవలోకించి యిట్లనియె. 71

మ. జననాథోత్తమ నేఁడు నీసుతుఁడు దా శ్రాద్ధార్థమై సంతరిం
చినమాంసంబులు మీఁదుబుచ్చి శశమున్ ఛేదించి భక్షించి త
క్కినయుచ్ఛిష్టము దెచ్చెనాఁ డకట యెంగిల్లేగతిం బైతృకం
బునకుం బెట్టఁగ యోగ్యమౌనె యనినన్ భూపాలకుం డుగ్రుఁడై. 72

తే. ఆకుమారుని గోపించి యప్పు డడవి
కరిగి మృగమాంసములు దెచ్చి యర్హమైన
యష్టకాశ్రాద్ధకర్మంబు లాచరించె
నవ్వసిష్ఠాదిమౌనీంద్రు లలరుచుండ. 73

వ. ఇవ్విధంబున నిక్ష్వాకుండు పుణ్యశ్లోకుండై యుండె వికుక్షియు శశభక్షకుం డగుటం జేసి శశాదుం డనంబరఁగె నట్టిశశాదుండు తండ్రిపిమ్మట నఖిలభూమండలంబు ధర్మమార్గంబునం బరిపాలించి. 74

ఉ. నెట్టన నశ్వమేధములు నెమ్మి ననేకముచేసి వైరులం
గిట్టి వధించి లోకములఁ గీర్తి దళంబుగ నించె మించఁగా
నట్టిశశాదుఁ డాత్మసుతుఁ డైనపురంజయు భూమి యేలఁగాఁ
బట్టము గట్టి కానకుఁ దపం బొనరింపఁగఁబోయెఁ బెంపుతోన్. 75

క. రంజితభువనత్రయుఁడు పురంజయుఁ డిక్ష్వాకుఁబోలి రమణీయయశో
మంజులుఁడై భూజనులకు, సంజీవనిఁబోలె నేలె జగతి మునీంద్రా. 76

క. ఆకాలంబున రాక్షస, నాకౌకసులకు మహారణంబైన సురా
నీకంబుల సురకోటికిఁ, గాక వెఱచిపఱచి రధికకంపితమతులై. 77

వ. ఇవ్విధంబునం బురందరప్రముఖనిఖిలదేవతలు వైకుంఠంబునకుం జని. 78

---

ముక్కురంధ్రములందు. 69 శశపలలము = కుందేటిమాంసము, కఱకుట్లు = కట్టెచే గ్రుచ్చి కాల్పఁబడిన మాంసఖండములు. 70 వివేకించి=తెలిసికొని. 72 సంతరించిన=సంపాదించిన, ఉగ్రుఁడు=కోపముగలవాఁడు. 73 అలరు = సంతోషించు. 75 నెమ్మి=నెమ్మదిగా, దళంబుగన్ = దట్టముగా, పెంపుతోన్ = గౌరవముతో. 76 రంజితభువనత్రయుఁడు = అనురాగము నొందింపఁబడిన మూఁడు లోకములుగలవాఁడు, మంజులుఁడు = మనోజ్ఞుఁడు, జగతిన్ = భూమిని. 77 నాకౌకసులకున్ = దేవతలకు, మహారణము = గొప్పయుద్ధము, సురానీకంబులు = దేవతా సమూహములు, కాక = సరిపోలఁజాలక, కంపితమతులై = చలించినమనసులుగలవారై.

సీ. సనకసనందాదిసంయమీశ్వరులకు సంతతానందంబు సలుపువాని
లీలావినోదకేలీవిలాసంబుగా భువనంబులన్నియుఁ బ్రోచువానిఁ
గలశపాథోరాశికన్యకారత్నంబు నొద్దికతోఁ గూడియున్నవాని
శతకోటిభాస్కరసందీప్తతేజుఁడై దుర్నిరీక్ష్యస్థితిఁ దోఁచువాని
తే. శంఖచక్రగదాశార్ఙ్గసాధనములు, నలుగడలఁ జేరి భజియింప నలరువానిఁ
బుండరీకాక్షు నతులభూభువనరక్షు, విష్ణుదేవునిఁ బొడగాంచి విబుధవరులు. 79

వ. దండవన్నమస్కారంబులుచేసి భయార్తులై దానవులచేతం దమపడినబన్నంబులు విన్నపంబులు చేసినఁ బన్నగశయనుం డాపన్నులైనయన్నిలింపుల కిట్లనియె. 80

క. మీకేమిభయము దానవ, లోకంబులఁ జంపి పోరిలో జయలక్ష్మిన్
జేకొని మిము రక్షింపఁగ, భూకాంతుం డొకఁడు గలఁడు భూరిబలుండై. 81

క. రాజర్షి యగుశశాదుత,నూజుండు పురంజయుఁడు మనుజలోకమునన్
రాజిల్లు మదీయాంశము, తేజంబున నమ్మహీశతిలకం బయ్యెన్. 82

ఉత్సాహము. ఆపురంజయుండు మీకు నహితులైనదైత్యులన్
రూపుమాప నోపుఁ దదనురూపమైనవృత్తి మీ
రోపి సేయుఁ డింక శంక లుజ్జగించి యవ్విభున్
బ్రాపు వేడుకొండు పొండు పైనమై ధరిత్రికిన్. 83

మ. అని యిట్లానతి యిచ్చి పంపుటయు దేవానీకముల్ ధాత్రికిన్
జని సాకేతపురంబులో నతులరాజ్యశ్రీలఁ బెంపొందుచు
న్ననరేంద్రోత్తమునిం బురంజయుని నానాలోకసంసేవితున్
మనువంశోత్తముఁ గాంచి యాదరమునన్ మన్నించి వా రర్థితోన్. 84

ఉ. ఓజననాథ మాదగుప్రయోజనముల్ విను దైత్యకోటిచే
నాజులలోఁ బరాజితులమై హరిఁ జేరితి మవ్విభుండు నీ
తేజముఁ జెప్పినం గలఁకదేఱి నినున్ భజియించినార మ
వ్యాజసుఖంబు లీయమరవర్యుల కిచ్చి వధింపు శత్రులన్. 85

వ. అని యనేకవిధంబులం బ్రార్థించినఁ బార్థివనందనుండు బృందారకబృందంబున కిట్లనియె. 86

79 కలశపాథోరాశి = పాలసముద్రము, సందీప్తతేజుఁడు=లెస్సగా వెలుఁగునట్టి తేజస్సుగలవాఁడు, దుర్నిరీక్ష్యస్థితిన్ = చూడనలవిగానియునికితో. 80 బన్నంబులు = భంగములను, ఆపన్నులు = ఆపదనొందినవారు, నిలింపులకున్ = దేవతలతో. 83 రూపుమాపనోపున్ = చంప జాలును, తదనురూపము = దానికితగినది. ఉజ్జగించి = విడిచి, ప్రాపు = ప్రాపుగా - రక్షకుఁడుగా. 84 పెంపొందు = వర్ధిల్లు, నానాలోకసంసేవితున్ = అనేక జనులచేత లెస్సగా కొలువఁబడుచున్నవానిని, మన్నించి=గౌరవించి. 85 ఆజులలోన్=యుద్ధములయందు, పరాజితులము=ఓడఁగొట్టఁబడినవారము, కలఁకదేఱి=కలవరమునుండి తేఱినవారమై, భజియించినారము=సేవించినాము. 86 పార్థివనందనుండు=

చ. క్రతువులు నూఱుచేసి త్రిజగంబుల నేలి సమస్తదేవతా
ప్రతతులఁ బ్రోచువజ్రి వృషభం బగు నేనియుఁ దత్కకుత్స్థలం
బతులితశక్తి నెక్కి చని యాజి నెదుర్కొని దైత్యవర్గముల్
హతముగఁజేసి మీకు విజయం బొనరించెద నిక్క మింతయున్. 87

తే. అనిన నింద్రాదిదేవత లట్లకాక
యని యొడంబడి రప్పు డయ్యమరభర్త
వృషభరూపంబుతోడ భూవిభునియెదుర
నిలిచె శివుఁ జేరి యున్న నందియును బోలె. 88

క. ఆవృషభకకుత్స్థుండై, భూవరుఁ డతిభక్తితోడఁ బురుషోత్తమునిన్
భావించి కొలిచి తత్తేజోవిభవముఁ దాల్చి సకలసురలున్ గొలువన్. 89

క. దురమునకు నరిగి దానవవరులం బరిమార్చి వాసవప్రభృతులకున్
బరమానందముఁ బెంపును, నిరమిత్రము జేసెఁ గార్యనిధియై కడిమిన్. 90

వ. ఇవ్విధంబునం బురంజయుండు వృషభకకుత్స్థుం డగుటం జేసి కకుత్స్థనామంబునం
బరఁగె. 91

తే. ఆకకుత్స్థునినందనుం డయ్యె వేనుఁ
డెంచఁగా వేనునకు నుద్భవించెఁ బృథుఁడు
పృథుకు విశ్వగుఁ డతనికిఁ బృథుయశుండు
పుట్టె వానికిఁ జంద్రుండు పుత్త్రుఁ డయ్యె. !2

క. చంద్రునకు యావనాశ్వన, రేంద్రుఁడు జన్మించె నతని కిద్ధచరితుఁడౌ
నింద్రయశుఁడు శావస్తుఁడు, సాంద్రయశుం డుద్భవించె సౌజన్యనిధీ. 93

క. ఆవసుధేశ్వరు పేరను, శావస్తి యనంగఁ బురి ప్రశస్తి వహించెన్
భూవలయంబున నది యమునావతియును బోలె మిగుల రమ్యం బగుచున్. 94

తే. అట్టిశావస్తునకు బృహదశ్వుఁ డనఁగ
సుతుఁడు జన్మించెఁ గువలయాశ్వుండు వాని
పుత్త్రుఁ డయ్యెను విష్ణునిభూరిమహిమ
దాల్చి భూలోకమంతయుఁ దానె యేలె. 95

ఉ. తొల్లి యుదంకుశాపమున దుందుఁడు ఘోరనిశాటుఁడై జగం
బెల్లను బాధ సేయఁగ మునీంద్రులు భీతిలిపోయి యమ్మహీ
వల్లభుతోడఁ జెప్పిన నవార్యబలోన్నతి యుల్లసిల్లఁగా
నల్ల ననేకవింశతిసహస్రకుమారులఁ గూడి సేనతోన్. 96

---

రాజకుమారుఁడు. 87 ప్రతతులన్ = సమూహములను, వజ్రి = ఇంద్రుఁడు, కకుత్స్థలంబు = మూఁపుప్రదేశము, 89 కకుత్స్థుండు = మూఁపునఁగూర్చున్నవాఁడు, భావించి = ధ్యానించి. 90 దురమునకున్ = యుద్ధమునకు, పెంపు = గౌరవము, నిరమిత్రము=శత్రువులలేమి. 92 పృథుకున్ = పృథుచక్రవర్తికి, 96 అల్లనన్ = మెల్లగా - క్రమముగా.

ఉ. ఏమఱిపాటువోయి దనుజేంద్రునితో నతిఘోరమైనసం
గ్రామ మొనర్పఁ జొచ్చుటయు రాక్షసవీరుని వేఁడియూర్పు లు
ద్దామవిషాగ్నికీలలవిధంబున నొక్కటఁ జుట్టుముట్టి నా
నాముఖవీరసేనల వినాశముచేసె భయంకరంబుగన్. 97

వ. అందు దృఢాశ్వచంద్రాశ్వకపిలాశ్వు లనుముగ్గురుకుమారులు దక్కఁ దక్కినకుమారులందఱు భస్మీభూతులై రప్పుడు కువలయాశ్వుండు విష్ణుభక్తిప్రభావంబునం జేసి యారక్కసు నుక్కడంచె నదికారణంబుగాఁ గువలయాశ్వుండు దుందుమారుండయ్యె. 98

క. ఐశ్వర్యశాలి యైనదృఢాశ్వుఁడు హర్యశ్వుఁ గాంచె నతనికి సురలో
కేశ్వరనిభుఁడు నికుంభుఁడు, శశ్వజ్జయశాలిపుట్టె సన్మునితిలకా. 99

వ. ఆనికుంభునకు సహితాశ్వుండును వానికిఁ గృతాశ్వుండును వానికిఁ బ్రసేనజిత్తుండును వానికి యువనాశ్వుండును బుట్టి రయ్యువనాశ్వుండు మహాధర్మశీలుండై రాజ్యంబుచేసి సంతానంబులేనిసంతాపంబున నిర్వేదించి యొక్కనాఁ డాత్మగతంబున. 100

ఉ. ఏలితి లోకముల్ నిరవహిత్థవిభూతివెలుంగ శత్రులం
దోలితి భూమిభృద్విపినదుర్గములన్ జరియింపఁ గీర్తులన్
వాలితి మూఁడులోకముల వారలు మెచ్చఁగ నిట్టులయ్యు నా
కేలని తోఁచుచున్నయవి యిన్నియు సంతతి లేకయుండుటన్. 101

ఉ. ఎడ్డమి యైనయప్పటికి నెవ్వరుఁ జేరరు లోకు లేమియున్
సడ్డలుసేయ నొల్ల రవసానపువేళల దండధారుచే
జడ్డలె కాని మేలుకొన సాగదయో తలపోసిచూచినన్
బిడ్డలులేనివాని కడవిన్ మృగజన్మము రోఁతపుట్టదే. 102

మ. అని సర్వంబుఁ బరిత్యజించి నిజభృత్యామాత్యవర్గంబులన్
దనరాజ్యం బరయంగ నిల్పి ప్రియకాంతాయుక్తుఁడై కాననం
జని యత్యుగ్రతపంబు సేయునెడ నాసర్వంసహామండలా
వనకేళీరతుఁ డైనభూవిభునిసద్వంశంబు రక్షింపఁగన్. 103

---

97 ఏమఱిపాటు=అకస్మాత్తుగా, ఒక్కటన్ = ఏకాకారముగా. 98 ఉక్కడంచెన్ = చంపెను. 99 శశ్వజ్జయశాలి=ఎల్లప్పుడు గెలుపుచేత ఒప్పునట్టివాఁడు. 100 నిర్వేదించి = దుఃఖించి, ఆత్మగతంబునన్ = మనసులో. 101 నిరవహిత్థవిభూతి = కొఱఁతలేనియైశ్వర్యము, భూమిభృద్విపినదుర్గములన్ = కొండలయందలియడవులనెడు (పరులకు) ప్రవేశింపరానికోటలయందు, వాలితిన్ = అతిశయించితిని - మించితిని. 102 ఎడ్డమి = హీనదశ, సడ్డలుసేయ నొల్లరు = లక్ష్యముచేయఁజాలరు, అవసానము = అంతము, జడ్డలె = నిర్బంధములే, మృగజన్మము - మృగజన్మమునకైనను అనుట. 103 కాననమున్ = అడవికి, సర్వంసహామండలావనకేళీరతుఁడు = భూమండలమును ఏలుట

క. అనుకంపలు చిత్తములన్, బెనలుగొనన్ మౌనివరులు పృథివీతలనా
థునికడకు వచ్చి సంభా,వనలు వడసి యధికగౌరవము దీపింపన్. 104

ఉ. పార్థివచంద్ర యీగతిఁ దపం బొనరింపఁగ నేల వేల్పులన్
బ్రార్థనచేసి దుర్దశలు పాటిల నేల నిరర్థకంబు లీ
యర్థములెల్ల వీనియెడ నాసలఁజెందకు మేము నీకుఁ బు
త్రార్థము వైష్ణవం బగుమహాక్రతు విప్పు డొనర్తు మర్థితోన్. 105

ఆ. అందుఁ గులపవిత్రుఁ డగుపుత్రుఁ డుదయించు, లలిత మైనపుణ్యఫలము నీకుఁ
గలుగుననుచుఁ బుత్రకామేష్టి వేల్చిరి, దివ్యమంత్రశక్తి తేజరిల్ల. 106

సీ. ఈరీతిఁ బుత్రకామేష్టి వేల్చి సమాప్త మగుదివసంబున నర్ధరాత్రి
వరమంత్రపూతాంబుపరిపూర్ణకాంచనకలశంబు వేదిపైఁ నిలిపి జాగ
రము సేయ మఱచి సంయములు నిద్రాసక్తులై యున్న యాసమయంబునందు
యువనాశ్వుఁ డనవరతోపవాసపిపాస నొంది యచ్చోటికి నొయ్యవచ్చి
తే. వేదిపై నున్న మంత్రపూతోదకములు, గ్రోలి తాను నిద్రించెఁ గొంతసేపు
నకు మునీంద్రులు మేల్కని యరసి రిక్త, మైనకలశంబు చూచి యిట్లనిరి కినిసి.

క. సంతానార్థం బీనృపు, కాంతకుఁ బానంబు సేయఁగా నునిచినకుం
భాంతరమంత్రోదకములు, చింతింపక గ్రోలినట్టి చెడు గెవ్వఁడొకో. 108

క. చెప్పుడు చెప్పకయుండిన, నిప్పుడె శపియింతు మనిన నిలఱేఁడు భయం
బుప్పతిల లేచి వణఁకుచు, నప్పరమమునీశ్వరులకు నర్థిం బలికెన్. 109

క. ఉపవాసాయాసంబున, నపరిమితపిపాసనొంది యంగము లెల్లం
దపియింప నోర్వఁజాలక, యిపు డుదకము గ్రోలినాఁడ నే నని పలికెన్. 110

క తాపసవరులందఱు నా, భూపతి వీక్షించి యకట బుద్ధివిహీన
వ్యాపారదోషమున నీ, వేపుగ గర్భంబు దాల్తు వింతియుఁ బోలెన్. 111

క. జననాయక నీగర్భం,బునఁ గడు బలవంతుఁ డైనపుత్రుఁడు జన్మిం
చు ననుచుఁ బలికి రప్పుడు, మునివరులయనుగ్రహం బమోఘం బగుటన్. 112

వ. ఇవ్విధంబున నతండు గర్భంబు దాల్చి యున్నంతఁ గొంతకాలంబునకు నతని దక్షిణ
కుక్షి భేదించి మహాబలపరాక్రమసంపన్నుం డైనపుత్రుండు జన్మించిన. 113

తే. విరులవానగురిసె సురదుందుభులు మ్రోసె, దివ్యవాణి పొగడె దివిజఖచర

---

యనెడుక్రీడలయందు ఆసక్తుఁడు - వినోదముగా భూమి నేలువాఁడు. 104 అనుకంపలు = దయలు, 105 ఈగతిన్ = ఈవిధమున, నిరర్థకంబులు = వ్యర్థములు, ఈయర్థములు = ఈప్రయోజనములు-ఈపనులనుట. 106 లలితము = మనోజ్ఞము. 107 పూతము = పరిశుద్ధము, కాంచనకలశము = బంగారుకుండ, వేదిపై = వేదికమీఁద - అరుఁగుమీఁద, పిపాసన్ = దప్పిని, ఒయ్యన్ = మెల్లగా, క్రోలి = త్రాగి, రిక్త = వట్టిది, కినిసి = కోపించి. 109 ఇలఱేఁడు = భూపతి - రాజు, ఉప్పతిలన్ = పుట్టఁగా. 111 బుద్ధివిహీనవ్యాపారదోషమునన్ = బుద్ధితక్కువపనివలనితప్పుచేత, ఏపుగన్ =

గరుడసిద్ధసాధ్యగంధర్వపన్నగవరులు గొల్వవచ్చె వాసవుండు. 114

వ. వచ్చి యమ్మహామునుల నవలోకించి యీయర్భకుండు మదీయరాజ్యంబును నన్నును భరియింప సమర్థుండగుటం జేసి మాంధాత యను నామంబు చేసితి నని పలికె. 115

తే. పరసుధామృతధారలు దొరఁగుచున్న, తనప్రదేశిని నమ్మహీవరకుమారు
నోరి లోపల నిడి కడుపారఁ దుష్టిఁ, జేసె బండ్రెండుసమములు వాసవుండు. 116

వ. ఇవ్విధంబునఁ బండ్రెండేళ్లకుమారుండై మాంధాత సప్తద్వీపసమేతంబైన వసుంధరాచక్రంబవక్రపరాక్రమంబున ననుభవించి చక్రవర్తియైన 117

తే. సూర్యుఁ డుదయించి క్రుంకెడుచోట్ల నడిమి
ధాత్రియెల్లను యువనాశ్వపుత్త్రుఁడైన
యట్టి మాంధాతృక్షేత్రంబె యని జగంబు
లభినుతించుచు నుండుదు రనుదినంబు. 118

వ. అట్టి మాంధాత శశిబిందుపుత్త్రి యైనబంధుమతిం బాణిగ్రహణంబుచేసి దాని యందుఁ బురుకుత్సాంబరీషముచికుందు లనుకుమారుల ముగ్వురం బడసి మఱియును. 119

తే. మెఱుఁగుఁదళుకు లనఁగ మెలఁగెడుబంగారు, బొమ్మ లనఁగ గమ్మపువ్వుఁదీఁగె
లనఁగ మోహనాంగు లైనకన్నియల నేఁబండ్రఁ గాంచె రాజు ప్రమదమునను.

వ. ఇవ్విధంబున లబ్ధసంతానుండై మాంధాత రాజ్యంబు సేయుసమయంబున. 121

క. జననుతచరితుఁడు సౌభరి, యనఁగా నొకదివ్యమౌని యంతర్జలముల్
తన కునికిపట్టుగాఁ దప, మొనరించె శతాబ్దకాల మున్నతభక్తిన్. 122

ఉ. అందు నతిప్రమాణసముదంచితదేహముతోడ నందనీ
నందనబంధుమిత్త్రులు మనఃప్రమదంబున నిత్యకృత్యముల్
క్రిందనుమీఁదఁ బార్శ్వములఁ గ్రీడ యొనర్పఁగ సంచరించుచో
మందుఁ డనంగఁ బేరుగల మత్స్యవిభుం డొకఁ డుండె నర్థితోన్. 123

క. బహువిధముల నాజలచర, విహారసౌఖ్యములుచూచి వేడుకతో న
మ్మహితాత్ముఁడు గృహపతియై, యిహసౌఖ్యము లనుభవింప నిచ్చఁ దలంచెన్.

వ. ఇవ్విధంబునం దపస్సమాధివలన నిలిపినలక్ష్యంబు వదలి సంసారసుఖంబులకు నభిముఖుండై యంతర్జలంబులు వెలువడి కన్యార్థియై మాంధాతపాలికివచ్చిన. 125

ఉ. ఆదర మొప్పఁగా నృపకులాగ్రణి యమ్ముని కాసనార్ఘ్యపా
ద్యాదిబహూపచారవిధు లర్థి నొనర్చి నమస్కరించి పు

---

అతిశయముగ - అపూర్వముగా. 116 తొరఁగు = స్రవించు, ప్రదేశిని = చూపుడువ్రేలు, పండ్రెండుసమములు = పండ్రెండేండ్లు. 120 తళుకులు = తళతళయనుకాంతులు, కమ్మ=పరిమళము గల. 121 లబ్ధ = పొందబడిన, 122 అంతర్జలములు = లోపలినీళ్లు - నీళ్లలోపలి ప్రదేశము

ణోదయ మీరు నాకడకు నొక్కరు రాఁబని యేమికల్గెనో
నా దెస మీకుఁ గల్గినఘృణారసవారిధి యిట్టు లుబ్బెనో. 126

క. నావుడు మునినాథుఁడు వసు,ధావల్లభు నుచితవాగ్విధానంబుల సం
భావించి నీవు దాతవు, గావున నిన్నొకటియడుగఁగాఁ దగుమాకున్. 127

సౌభరి యనుమునీంద్రుండు మాంధాతకూఁతులఁ బెండ్లియాడి భోగంబు లనుభవించుట.

ఆ. ఎవ్వ రేపదార్థ మేవేళఁగోరిన, వారి కుచితమైనవానినెల్ల
నిచ్చి యనుపకునికి యిక్ష్వాకువంశజు, లైనభూపతులకుఁ గానివావి. 128

చ. అదియునుగాక విన్ము జగమంతయు నుజ్జ్వలబాహుశౌర్యసం
పద వెలయంగ నేలి సురభర్తకు నైననభీప్సితంబు లీ
నొదవినదాత వీవగుట నొక్కఫలం బిహలోకసౌఖ్యమై
పొదలినదాని ని న్నడుగఁబూని ముదంబున నేగుదెంచితిన్. 129

క. క్షేత్ర మెఱిఁగి విత్తిడుటయుఁ, బాత్ర మెఱిఁగి దానమిచ్చి పనుచుటయు వివే
కత్రాణపరాయణులకు, ధాత్రీశ్వర యిందు నందుఁ దగ మేలొసఁగున్. 130

క. అనవుడు నవ్విభుఁ డిట్లను, మునినాయక యేపదార్థములు గోరినవా
నిన యిత్తు నుచితమైనవి, యనుమానము మాని యడుగు మని పలుకుటయున్.

ఉ. ఇన్నిగుణంబులందు నుతికెక్కినవాఁడవు సత్యవాక్యసం
పన్నుఁడ విట్టినీకు నరపాలక నాకొసఁగంగరానివే
మున్నవి యైననేమియును నొల్ల నరేంద్రకులావతంస నీ
కన్నియలందు నాకు నొకకన్నియ నిమ్ము గృహస్థు నయ్యెదన్. 132

వ. అనిన నమ్మహీవల్లభుండు. 133

క. బడలికయుఁ జాల నరసిన, జడలును గడ్డంబు మిగుల జర్జరితమునై
బెడఁగెడలినపొడవును గడు, జడతయునుం గలిగినట్టి సౌభరిఁ జూచెన్. 134

వ. ఇట్లు చూచి తనమనంబున. 135

ఆ. ఏమిసేయువాఁడ నీపని యెబ్బంగిఁ, దీర్తు ననుచు వసుమతీవిభుండు
చింతనొంది కొంతసేపున కనియె స, దుత్తరంబుగాఁగ నుపమ దలఁచి. 136

క. వచ్చిన యిమ్మునిఁ నూరక, పుచ్చినఁ గోపించుఁగాని పోవిడువఁడు దా
నిచ్చెద ననినను గన్యలు, మెచ్చరు వార్ధకముచేత మెదిగినవానిన్. 137

వ. అని యమ్మునిఁ నవలోకించి. 138

---

అనుట. 126 ఘృణారసవారిధి = దయారససముద్రము. 127 సంభావించి = గౌరవించి. 128 కానివావి = వరుసకానిది - వాడుకలేనిది. 129 అభీప్సితములు = కోరికలు, ఒదవిన = కలిగిన, పొదలినదానిఁ = గొప్పవహించినదానిని. 132 నరేంద్రకులావతంస = రాజశిరోమణి. 134 జర్జరితము = శిథిలమైనది - మిక్కిలి కృశించినది, బెడఁగెడలిన=బాగుతప్పిన, పొడవు=ఆకారము. 136 తీర్తును = నెఱవేర్తును, ఉపమ = ఉపాయము.

ఉ. మున్నిటి మాకులంబు నృపముఖ్యులు కన్యలఁ బెండ్లి సేయుచోఁ
గన్యల కిచ్చువచ్చుపతిఁ గైకొనిరేనియు నిత్తు రట్లు గా
కున్నఁ గులాభిజాత్యముల నున్నతికెక్కినవారికైన నీ
రెన్నఁడు నిట్టి మాసమయ మిప్పుడు నేనును జెల్ల నిచ్చితిన్. 139

చ. అదియునుగాక జర్జరిత మైనశరీరముతోడఁ దద్దయున్
ముదిసినవాఁడ వీవు కడుమోహనరూపవిలాసరేఖలం
బొదలినవారు కన్నియలు భూరిగుణాకర నిన్నుఁ జూచినన్
హృదయములందు మెచ్చరని యిప్పుడు నామదిఁ దోఁచె నెంతయున్. 140

వ. అనిన నమ్ముని నగుచు మాంధాత కిట్లనియె. 141

ఉ. నాకిది మంచిమాట నరనాయక కన్నియ లున్నచోటికిన్
దోకొని పొమ్ము వారు పరితోషముతో నను నాదరించుచున్
జేకొనిరేనిఁ బెండ్లి తగఁజేయుము గాక తిరస్కరించినన్
బోకలఁబోక నే మగిడిపోయెద వచ్చినత్రోవ వెంబడిన్. 142

ఆ. అనిన నతనిమాట లంగీకరించి య, మ్మనుజవల్లభుండు మాఱుమాట
లాడ వెఱచి కన్యకాంతఃపురంబుల, నుండువర్షధరుని నొకనిఁ బిలిచి. 143

ఉ. ఇమ్మునినాథుఁ గన్నియలకెల్లను జూపి ప్రియంబయేనిఁ గై
కొమ్మని చెప్పు మేతరుణికోరిన దానిన పెండ్లి సేసెదన్
సమ్మద మొప్పనంచు నృపచంద్రుఁడు సౌభరిఁ గూర్చి హెగ్గడిం
బొమ్మని యాజ్ఞయిచ్చె మునిపుంగవుఁడుం బ్రియ మందె నాత్మలోన్. 144

వ. ఇవ్విధంబున సౌభరి కన్యకాంతఃపురంబుఁ బ్రవేశించి యఖిలసిద్ధసాధ్యగంధర్వ మనుష్యులకంటె నతిశయంబైనరూపంబు ధరియించె నప్పుడు వర్షధరుండు రాజ కన్యకాజనంబుల రావించిన. 145

ఉ. కాఱుమెఱుంగులో మెలపుఁ గైకొననేర్చిన పైఁడిబొమ్మలో
మారునిదీములో కలికిమాటలచంద్రికలో చెలంగు శృం
గారరసాధిదేవతలొ కమ్మని క్రొవ్విరితీఁగెలో యనన్
వారిజపత్రలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై. 146

వ ఇట్లరుగుదెంచిన మాంధాతృదుహితలకు వర్షధరుం డిట్లనియె. 147

క. మీతండ్రికడకు ముదుసలి, యీతాపసి వచ్చి కన్య నిమ్మనిన ధరి

---

139 సమయము=ప్రతిజ్ఞ. 140 జర్జరితము=సడలి ముడుతలుపడినది, మోహనరూపవిలాసరేఖలంబొద లినవారు = మోహింపఁజేయునట్టి సౌందర్యముయొక్కయు శృంగారచేష్టలయొక్కయు మేలిమిచేత అతిశయించినవారు. 142 పరితోషముతోన్=సంతోషముతో, పోకలఁబోక=దుష్టచేష్టలేవియుచేయక. 143 వర్షధరునిన్=క్రొజ్జావానిని-హెగ్గడిని. 146 మెలఁపు=మెలఁగుట-సంచారము, దీములు=మృగ ములను పక్షులను వశపఱచుకొనుటకై మఱపిన పెంపుడుమృగములును పక్షులును, చంద్రిక=చంద్రకళ,

త్రీతలపతి మాటాడక, యీతనిఁ బుత్తెంచె మీర లిందఱుఁ జూడన్. 148

క మీలోన నెవ్వ రీతని, లీలం గామింతు రటువలెన్ భూవిభుఁ డ
బ్బాలామణి నిమ్మౌనికి, నాలింగాఁ బెండ్లిసేయు నని పలుకుటయున్. 149

క. భావజమోహనశరముల, కైవడి గుమిగూడియున్న కాంతలు ధరణీ
దేవోత్తము సౌందర్య, శ్రీవిభవముఁ జూచి మెచ్చి చిత్తము లలరన్. 150

ఉ. ఈతఁడు నాకుఁ బ్రాణవిభుఁ డీతనికిం బ్రియురాల నన్ను ము
న్నీతఁడు సూచె నీతనికి నిల్లడమానిసి నేను నాకుఁగా
నీతఁడువచ్చెఁ దండ్రి నను నీతని కిచ్చె నటంచు నొక్కమై
నాతరుణీమణుల్ జగడమాడిరి మారవికారచిత్తలై. 151

క. ఇత్తెఱఁగున నయ్యింతులు, చిత్తజబాణములచేత సిగ్గంతయుఁబో
నొత్తి మునిఁ బెండ్లియాడఁగఁ, దత్తఱపడు టెఱిఁగి వర్షధరుఁ డాలోనన్. 152

ఆ. అధిపుసమ్ముఖమున కరుదెంచి వారల, విధముఁ దేటపడఁగ విన్నవించె
ముని తపోమహత్త్వమునకు నమ్మాంధాత, విస్మయమునఁ బొంది వేడ్కతోడ.

క. తనకన్యల నేఁబండ్రను, మునిసౌభరి కొక్కలగ్నమునను వివాహం
బొనరించి తగుతెఱంగునఁ, గనకాంబరభూషణములు గారవ మొప్పన్. 154

వ. ఇచ్చి మణికనకశిబికారూఢులం జేసి పంపినసౌభరియును బంచాశన్నవోఢాసమే
తుండై నిజాశ్రమంబునకువచ్చి యనేకశిల్పకల్పనాచార్యుం డైనవిశ్వకర్మ నాక
ర్షించి యతనితో నిట్లనియె. 155

ఉ. ఏను గృహస్థధర్మము వహించితి నాదగుభార్యలందఱున్
మానవనాథకన్యకలు మానితభోగము లందియున్నవా
రీనలినాయతాక్షులకు నిందఱకున్ విహరింప దివ్యర
త్నానుపమేయకాంచనగృహంబులు పెక్కొనరింపు నేర్పుతోన్. 156

వ. అనిన నతం డాక్షణంబ బహువిధద్వారోపద్వారకవాటవప్రప్రాకారపరిఖావిశా
లంబులయినకనకరత్నధగద్ధగాయమానప్రాసాదంబులును నానావిచిత్రభిత్తికా
సభాస్తంభ సంభృతదేహళీప్రాంగణసుందరంబు లైనమందిరంబులును ప్రోత్ఫుల్ల
నీలోత్పలపంకజకూజితకలహంసకారండవాదివిహంగమాతిశయంబులయిన జలాశ

---

క్రొవ్విరి = క్రొత్తగా పూచినపువ్వు. 148 పుత్తెంచెను = పంపెను. 150 భావజమోహనశరముల కైవడిన్ = మన్మథునియొక్క మోహనములను బాణములవలెనే. 151 ఇల్లడమానిసిన్ = నిక్షేపమువంటిదానను, ఒక్కమైన్ = ఒకవిధముగానే. 152 పొనొత్తి = పోగొట్టి - విడిచి. 155 పంచాశన్నవోఢాసమేతుండు=ఏఁబదియాఱుగురు కన్యకలతోడను గూడుకొన్నవాఁడు. 156 అనుపమేయ=సరిపోలఁదగని. 157 బహు...విశాలంబులు=నానావిధములైన వాకిళ్లు దిడ్డివాకిళ్లు తలుపులు కొఱళ్లు కోటలు అగడ్తలువీనిచేతవిరివియైనవి, ప్రాసాదంబులు=నగరులు, భిత్తికా=గోడ, సంభృతము=చక్కగా ధరించినది, దేహళీ=కడప, ప్రాంగణ=ముంగిలి, ప్రోత్ఫుల్ల...అతిశయంబులు = చక్కగా

యంబులును బహువిధప్రసూనగంధ బంధురానేకకీరకోకిలాదికలరవాభిరామంబు
లైనయారామంబులును లలితమృదులహంసతూలికానల్పంబు లైనతల్పంబులును
వినోదకేళివిహారలోలంబు లైనడోలాజాలంబులును మొదలుగా ననేకంబు లనేక
ప్రకారంబులుగా నిర్మించిన. 157

క. మునినాథుఁ డైనసౌభరి, తనభార్యలనెల్ల సముచితముగను వేర్వే
ఱను గనకమందిరంబుల, నునిచి తపశ్శక్తివలన నూడిగములకున్. 158

క. యువతులుగ నప్సరస్త్రీ, నివహంబుల నొసఁగి రామణీయాంబరది
వ్యవిభూషణమాల్యాదులు, వివిధపరిమళానులేపవితతులు నొసఁగెన్. 159

ఆ. అతిమనోహరంబు లగుభక్ష్యభోజ్యాది, సముచితాన్నపానచయము లెల్లఁ
గలుగఁజేసి యతఁడు కాంతాజనంబుల, యందు సురతసుఖము లనుభవించె. 160

వ. ఇట్లు పరమగృహస్థధర్మంబున సంసారసుఖంబు లనుభవించుచున్న కొండొక
కాలంబునకు. 161

క. బహుళీకృతరాజ్యరమా, మహనీయుండై వెలుంగు మాంధాతమదిన్
దుహితృస్నేహము పెనఁగొన, మహిళామణి యైనబంధుమతియుం దానున్. 162

చ. అడవులఁ గందమూలముల నాఁకలిదీర్చి తపంబు సేయుచున్
బడలినవృద్ధతాపసుని బాలికలన్ సుకుమారమూర్తులన్
గడుసుఖు లైనవారలను గట్టిఁడినై వెసఁగట్టి త్రోచితిన్
నడుఁకుచు వార లెవ్విధమునన్ దురపిల్లుచు నున్నవారొకో. 163

క. అని కూఁతుల సుఖదుఃఖము, లొనర విచారింపఁగోరి యుర్వీపతి స
జ్జనపరివృతుఁడై సౌభరి, మునియాశ్రమమునకు నరిగి ముందటఁ గాంచెన్. 164

సీ. బహువిధాలంకారభర్మదీప్తిచ్ఛటాప్రాకారమణిహర్మ్యభవనములును
నానావిధప్రసూనానూనసౌరభరమణీయమంది రారామములును
కలహంసచక్రవాకక్రౌంచకలనాదజలజకైరవజలాశయచయంబు
ధనధాన్యయుతనిరాతంకశంకాచతుర్వర్ణసంకీర్ణనివాసములును

---

వికసించిన నల్లగలువలచేతను తామరపువ్వులచేతను కూయుచున్నరాజహంసలుకన్నెలేళ్లు మొదలగు పక్షులచేతను అతిశయించినవి, జలాశయంబులు = నీటిటెంకులు, ప్రసూన...కలరవాభిరామంబులు= పువ్వులవాసనలచేతమిక్కిలియతిశయించిన పెక్కుచిలుకలు కోవెలలు మొదలగువానియవ్యక్తమధుర ధ్వనులచేత ఒప్పినవి, తల్పంబులు=పానుపులు, లోలంబులు = ఊఁగునవి, డోలాజాలంబులు=ఉయ్యాలలసమూహములు. 159 అనులేపవితతులు = పూసికొనుద్రవ్యములసమూహములు. 162 బహుళీకృతరాజ్యరమామహనీయుండు=అధికముఁగా జేయఁబడిన దొరతనపుకలిమిచేత గొప్పవాఁడు, దుహితృస్నేహము = కొమార్తెలయందలిప్రేమ, మహిళామణి = స్త్రీరత్నము. 163 కట్టిఁడిని = నీతి దప్పినవాఁడను, దురపిల్లుచున్ = దుఃఖించుచు. 165 భర్మ=బంగారు, దీప్తి = కాంతి, ఛటా=సమూహము, హర్మ్య = మేడలుగల, ప్రసూన = పువ్వులయొక్క, సౌరభ=పరిమళముచేత, నిరాతంక

తే. తతఘనానద్ధసుషిరాభిధానవాద్య, కీలితామరకామినీగీతరవము
గలిగి త్రిభువనలక్ష్మికి నిలయమగుచుఁ, బరఁగు సౌభరి సౌభాగ్యపురవరంబు.
వ. ఇట్లు కనుంగొని. 166
క. మున్నెన్నఁడు లే దిచ్చట, నున్నది సురపురియుఁబోలె నొకపట్టణ మ
త్యున్నతవిభూతి వెలయుచు, నిన్నగరంబునకు నాథుఁ డెవ్వఁడొ యనుచున్.
వ. చేరవచ్చి యప్పౌరజనంబులవలన సౌభరి తపఃప్రభావంబున నైనపురం బగుట
యెఱింగి పరమహర్షాశ్రుపూరితలోచనుండై యమ్మహామునిం బొడగని నమస్క
రించి తగుతెఱంగున సంభావితుండై. 168
క. జననాయకుండు కన్యా,జనులం జూడంగఁ గోరి చనుదెంచిన య
ప్పని విన్నవించి యమ్ముని, యనుమతి నంతఃపురము నకటఁ జని యెదురన్. 169
మ. కనియెన్ భూపతిరమ్యహర్మ్యనిలయం గర్పూరవీటీవరా
సన పర్యఙ్కమణిడోలికాచలితనానాభూషణాలంకృతన్
ఘనదివ్యాంబరసంవృతస్తనయుగన్ గాశ్మీరకస్తూరికా
ఘనసారాంచితగంధబంధురశుభాంగశ్రీనిధిం గన్యకన్. 170
వ. ఇట్లు కనుంగొనిన. 171
క. జనకునిరాకకు వినయం,బును భక్తియుఁ బెనగొనంగఁ బూఁబోణి యెదు
ర్కొని దండనమస్కారము, లొనరిచి కరములు మొగిడ్చి యుచితప్రీతిన్. 172
క. తనకేళీసౌధమునకుఁ, గొని చని యాసీనుఁజేసి కుశల మడిగినన్
జనపతి సర్వము సేమం, బని తెలియఁగఁజెప్పి కూఁతు నాశ్వాసించెన్. 173
వ. ఇట్లు పరమానందహృదయుండై యతండు వెండియు నిట్లనియె. 174
మ. పడఁతీ నీచెలియండ్రు నీవు సుఖులై భాసిల్లుచున్నారె మీ
యెడ నత్యంతవిధేయుఁడయ్యె విభుఁ డేవేళం బ్రమోదించునే
వొడుగం బుయ్యను గట్టఁగాఁ దగినవస్తువ్రాతముల్ గల్గునే
కుడువంగా సరసాన్నముల్ గలవె నాకుం జెప్పుమా యేర్పడన్. 175
వ. అనినం దండ్రికిఁ గూఁతు రిట్లనియె. 176
క. నన్నిప్పుడు మీరడిగిన, పన్నియు నొకకడమపడక యఖిలంబును సం
పన్నంబు మిమ్ముఁజూడక, యున్నవిషాదంబె కాని యుర్వీనాథా. 177
చ. మదనసమానరూపమహిమం జెలువొంది మనోవిభుండు నా
సదనమునందయుండు ననిశంబును మన్మథరాగభోగ మే

శంకా = భయమును సంశయమును లేని, సంకీర్ణ = కలకలుపుగల. 170 వీటీ = విడెము, డోలికా = ఉయ్యెల, కాశ్మీర...శ్రీనిధిన్ = కుంకుమపువ్వు కస్తూరి పచ్చకర్పూరము వీనియొక్క ఒప్పిదమైన వాసనలచేత అతిశయించిన మనోజ్ఞమైన అవయవసంపత్తికి స్థానమైనదానిని. 177 కడమపడక = తక్కువపడక, సంపన్నంబు = సమృద్ధము, విషాదంబె = విచారమే. 179 ఇలఱేఁడు = రాజు.

కోదవయు లేదు నన్నుఁ దనకుం బ్రియురాలిగ నేలినాఁడు సం
పదలకు నేమిటం గొఱఁత పార్థివనాయక నాకు నావుడున్. 178

క. ఇల తేఁడు దనమనంబునఁ, గలఁగి జడుఁడు మాని యొక్క కాంతకె మిగులన్
వలచి మఱియున్న భార్యలఁ,దలఁపఁడో కా కనుచు మిగులఁ దత్తఱపడుచున్.

వ. తగు తెఱంగున నయ్యిందువదన వీడ్కొని రెండవప్రాసాదంబున కరిగి తొంటి
వాలుఁగంటికంటె మహావిభవంబున నున్నపుత్త్రికారత్నంబువలన నమస్కారా
ద్యుపచారంబులఁ బ్రీతుండై కుశలం బడిగిన. 180

క. అప్పుడఁతి యప్ప చెప్పిన, యప్పలుకులకంటెఁ దండ్రి కానందముగాఁ
జెప్పిన సంతోషము మది, ముప్పిరిగొన మఱియు నడిగె మూఁడవకూఁతున్. 181

వ. ఇవ్విధంబున నందఱ నట్లయడిగిన వార లేఁబండ్రును నొక్కవాక్యంబుగా మగని
వలన సకలసుఖంబు లనుభవించుచున్నవార మనిచెప్పిన మాంధాత విస్మిత
చిత్తుండై సౌభరి తపోమహత్త్వంబునకు మెచ్చి యతనికడకుం జని నమస్కరించి
యిట్లనియె. 182

క. నిన్ను వరించి సుఖస్థితి, నున్నారు కుమారికలు మహోల్లాసముతోఁ
గన్నియలను బెక్కండ్రను, గన్నఫలము నేఁడు చూడఁగంటి మహాత్మా. 183

క. అని పెక్కుచందముల మునిఁ, గొనియాడి నరేశ్వరుండు కూఁతుల కెల్లన్
ధనకనకవస్తువాహన, వనితారత్నముల గౌరవంబున నిచ్చెన్. 184

ఆ. ఇచ్చి నిజపురమున కేగె సౌభరియు మాం,ధాతృదుహిత లైనధర్మపత్ను
లందు నైహికంబు లైనభోగములు పెం,పార సురతసుఖము లనుభవించె. 185

వ. ఇవ్విధంబున నయ్యేఁబండ్రు భార్యలందు నూటయేఁబండ్రు కుమారులం గాంచి.186

సీ. శైశవక్రీడాప్రసంగముల్ కొన్నేండ్లు కొన్నేండ్లు ముద్దుపల్కుల బెడంగు
లల్లనల్లన నడయాడంగఁ గొన్నేండ్లు గొన్నేండ్లు విద్యావినోదగోష్ఠి
వడుగుప్రాయపువైభవంబులు గొన్నేండ్లు గొన్నేండ్లు వరయౌవనోన్నతులును
వైవాహికక్రియావ్యసనంబు గొన్నేండ్లు గొన్నేండ్లు కోడండ్రకోట్రములును
తే. మనుమలును మనుమరాండ్రును మనఁగ వారి
సొబగు కొన్నేండ్లు కొన్నేండ్లు సుతుల సుతుల
తరతరంబును దామరతంపరైన
చూచి సంసారసుఖములఁ జొక్కె నతఁడు. 187

వ. ఇట్లు సంసారసాధనంబు లైనమనోరథంబులం దగిలి యనేకవత్సరంబులు వినో
దించి యొక్కనాఁడు పరతత్త్వచింతాసమాధానమానసుండై. 188

---

180 తొంటివాలుఁగంటికంటెన్ = మునుపటి చిన్నదానికంటె. 181 అప్ప = అక్క. 182 విస్మితచిత్తుండు = ఆశ్చర్యమునొందిన మనసుగలవాఁడు. 187 శైశవక్రీడాప్రసంగములు = శిశుత్వమునందలి యాటలయొక్క మేలైనకూడికలు, కోట్రములు = కోడంట్రికములు, తామరతంపర=అపరి

ఆ. ఐహికంబు లైనమోహలతానేక, బంధనంబు లెల్లఁ బరమయోగ
విమలతత్త్వమనులవిత్రమునను గోసి, వైచి నిష్కళాత్మవర్తి యగుచు. 189
క. దుస్సహమిహసౌఖ్యంబౌ, దుస్సంగతి పుత్రమిత్రదుహితృతతి యిసీ!
నిస్సారము సంసారము, లెస్స యనుచు మనుజు లేల లెక్కింతురొకో. 190
క. పదివేలవిధంబులనే, వదలక విషయోపభోగవాంఛలవలనం
బొదలియు నాచిత్తము తని,యదు మిక్కిలి నాడు నాటి కధికం బగుచున్. 191
సీ. అంతర్జలంబులయందుఁ దపోవృత్తిఁ జరియించు నాకు మత్స్యప్రసంగ
వశమునఁ జేసి వివాహంబునకు నేకకన్యార్థినై పోవఁగా ననేక
భార్యాజనంబులఁ బరిణయం బొనరింపఁ బాటిల్లె మఱి కుటుంబములఁ బ్రోవ
బాహుళ్యమైనసంపదలు సంపాదింపవలసెఁ దదాసక్తివలనఁ జేసి
తే. పుత్రపౌత్రదౌహిత్రకళత్రమిత్ర, బంధుధనధాన్యవైభవప్రాభవములు
చూచి పెక్కేండ్లు సంసారసుఖములందు, గాసిపడితి వృథాపోయెఁ గాలమెల్ల.
క. యోగముగల్గినచోటను, భోగంబులు లేవు భోగములు గల్గినచో
యోగంబు లేదు గావున, యోగము భోగంబుఁ బడయ నొరులకు వశమే. 193
మ. అని సర్వంబుఁ బరిత్యజించి నిజభార్యాయుక్తుఁడై కానకున్
జని పెక్కేండ్లు తపంబుచేసి పిదపన్ సన్యాసియై వార్ధకం
బున సాంగత్యవశంబు లైనవిషయంబుల్ మాని యంత్యంబునన్
గనియెన్ సౌభరి విష్ణుభక్తివలనన్ గల్యాణకైవల్యమున్. 194
క. ఈసౌభరికథ దలఁచిన, వ్రాసినఁ బేర్కొనిన వినిన వర్ణించిన న
భ్యాసముచేసిన వారికి, శ్రీసంపద లొనరి మోక్షసిద్ధియుఁ గలుగున్. 195
వ. అని చెప్పి పరాశరుండు మాంధాతృపుత్రసంతతి వినుమని యిట్లనియె. 196
తే తాపసోత్తమ మాంధాతతనయుఁ డైన
యంబరీషున కుదయించె ననఘచరితుఁ
డైనయువనాశ్వుఁ డతనికి హారితుఁ డనఁగఁ
బుత్రుఁ డుదయించె నమ్మహీభుజునియందు. 197
తే. అంగిరసు లనుగంధర్వులాఱుకోట్లు, పుట్టి పాతాళమునఁ జొచ్చి భుజగపతుల
కెల్ల నుపహతిచేసి యనేకదివ్య, రత్నములతోడఁ గామినీరత్నములను. 198
క. బలిమిం గైకొనిన రసా,తలలోకము వెడలి భుజగతతులెల్ల భయా
కులితాత్ములగుచుఁ జని యా, జలనిధిపై యోగనిద్ర సలిపెడువానిన్. 199
శా. కాలాత్మున్ భువనైకసేవితు జగత్కల్యాణమూర్తిన్ దయా
శీలున్ బన్నగతల్పు సన్నిహితరాజీవాసనున్ సర్వలో

---

మితము. 189 లవిత్రము=కొడవలి. 190 దుస్సహము = సహింపరానిది, సంగతి = సంసర్గము, ఇసీ=ఛీ. 192 కుటుంబములన్ = పోష్యవర్గములను, ప్రాభవము = ప్రభుత్వము. 194 కల్యాణకైవల్యమున్ = శుభకరమైనపరమపదమును. 198 ఉపహతి = బాధ. 200 సన్నిహితరాజీవా

కాలంకారుని శంఖచక్రధరునుద్యద్భానుకోటిప్రభా
జాలోదంచితదివ్యతేజు నసకృత్సౌభాగ్యలక్ష్మీయుతున్. 200

క. పరివేష్టించి సముచ్చస్స్వరముల గాంధర్వగానసముపేతముగాఁ
బోరిఁ బోరి బొగడినలక్ష్మీశ్వరుఁడు నిదుర మేలుకొని ప్రసన్నుండయ్యెన్. 201

వ ఇట్లు యోగనిద్రాప్రబుద్ధుం డైనయద్దేవదేవునకు దండప్రణామంబులు సేసి గంధర్వులచేతఁ దమకు నైనబన్నంబులు విన్నవించిన మన్నించి వెన్నుండు పన్నగేంద్రుల కిట్లనియె. 202

క. ధరఁ జక్రవర్తి యగు నా, పురుకుత్సుఁడు నామహత్త్వమున నున్నాఁడా
ధరణీశుఁడు గంధర్వులఁ, బరిమార్పఁగ నోపు నతనిఁ బ్రార్థింపుఁ డొగిన్. 203

క. అని యానతిచ్చివీడ్కొలి,పినఁ బన్నగముఖ్యులెల్లఁ బీతాంబరుచె
ప్పినయట్ల నాగలోకం,బునకు మగిడివచ్చి యొక్కప్రోవై తమలోన్. 204

తే. కార్యచింత రొయిజెంగి యిక్ష్వాకువంశ
సంభవుం డైనపురుకుత్సచక్రవర్తి
పాలి కెవ్వరిఁ బనుపంగఁ బాడియొక్కొ
యని విచారించుచున్న యయ్యవసరమున. 205

క. మునియొకఁడు వచ్చి భుజగులఁ, గనుఁగొని మీతలఁచినట్టికార్యము సంఘు
ట్టన సేయఁదగినవారల, వినిపించెద మీరు వోయి వేఁడుకొనుఁ డొగిన్. 206

వ. పురుకుత్సుండు నర్మదానదియందు బద్ధానురాగుండై యున్నవాఁ డన్నదియు నంతకంటె నతనియందుఁ బ్రియంబు గలిగియున్నయది మీర లాసోమపుత్రిం బ్రార్థించి పంపిన నారాజన్యుండువచ్చి మీపగసాధింప నోపునని నిర్దేశించిపోయె నప్పుడు. 207

శా. ఆరేవానది దైవ యోగమునఁ దా నచ్చోటికిన్ దేవతా
నారీరూపముతోడ వచ్చిననహీంద్రశ్రేణి యేతెంచి య
త్యారూఢప్రియభాషలం దనిపి యయ్యాసన్నగంధర్వులన్
బోరం జంపి భుజంగనాథులకుఁ బెంపుల్ సొంపుఁ గావింపఁగన్. 208

---

సనుల్ = సమీపించినబ్రహ్మగలవానిని, ఉద్యద్భానుకోటిప్రభాజాలోదంచితదివ్యతేజున్ = మిక్కిలి వెలుఁగునట్టి కోటిసూర్యులవలె వెలుఁగుచున్న కాంతిసమూహములో యన ఒప్పుచున్న దివ్యమయిన తేజస్సుకలవానిని, అసకృత్సౌభాగ్యలక్ష్మీయుతున్=ఎడతెగక సౌభాగ్యలక్ష్మితో కూడుకొని యుండు వానిని. 201 సముచ్చస్వరములన్=గట్టిగా వినవచ్చుకంఠస్వరములతో, పోరిఁబోరిన్ = క్రమ క్రమముగా, యోగనిద్రాప్రబుద్ధుండు=యోగనిద్రనుండి మేలుకొన్నవాఁడు, బన్నంబులు=భంగము లను. 204 పీతాంబరుచెప్పినయట్ల=పీతాంబరమును ధరించిన శ్రీహరి చెప్పినచొప్పున, ప్రోవై=గుంపు గూడి.-205 పాడి=ధర్మము-యుక్తమనుట. 206 సంఘట్టన=సంఘటన-ఇది యపూర్వప్రయోగము. 207 పగ=శత్రువును, నిర్దేశించి=చెప్పి. 208 అత్యారూఢప్రియభాషలన్=అతిగౌరవములును ప్రియములు

క. పురుకుత్సుఁ డోపుననుచును, హరి యానతియిచ్చె మాకు నటుగాన సుధా
కరపుత్త్రి నీవు చని యా, నరనాథునిఁ దెచ్చి కావు నాగకులంబున్. 209

వ. నీవు మాకు నియ్యుపకారంబు సేయు మిట్లయిన నీకుఁ బ్రత్యుపకారంబు సేయు
వార మని ప్రార్థించిన నొడంబడి నర్మదానది భూలోకంబునకువచ్చి మాంధాత
పుత్త్రుం బొడగాంచి భుజంగభయాపనయార్థంబుగా నిష్టోపభోగంబులం దనుపు
నట్లుగా నియ్యకొని రసాతలంబునకుఁ దోడి తెచ్చిన. 210

క. భుజగేశ్వరులు ధరిత్రీ, భుజునిం బూజించి కదనమున గంధర్వ
ప్రజలను మర్దింపు మధో,క్షజుపలుకులు నిట్టివనుచు సమకట్టుటయున్. 211

మ. హరితేజోవిమలప్రతాపములచే నాప్యాయితుండై మహీ
శ్వరచూడామణి సంగరాంగణమునన్ షట్కోటిగంధర్వులన్
వరవజ్రప్రతిమానదారుణశరవ్రాతంబులం ద్రుంచి ని
ర్భరసంతోషముచేసెఁ బన్నగులకుం బాతాళలోకంబునన్. 212

వ. ఇవ్విధంబున రసాతలలోకంబునకు నిరాతంకంబుచేసి పన్నగేంద్రులవలన నిజకు
లాభివృద్ధి యగునట్లుగా వరంబు వడసి నిజపురంబునకు వచ్చి సుఖంబుండె నంత.

క. తమకెల్లను గడునుపకా,రము చేసిననర్మదకు వరం బొసఁగ భుజం
గమవరులందఱు నానదిఁ, బ్రమదంబునఁ బూజచేసి పలికిరి దయతోన్. 214

తే. అంబ నీదివ్యనామధేయముఁ జతుర్థి, నమరఁజేసి నమఃపదాంతముగ నుభయ
సంధ్యలందును దప్పక స్మరణసేయు, నతనికెన్నఁడు విషమెక్కదహులవలన. 215

వ. మఱియు నీదివ్యనామోచ్చారణంబుచేసినవారలకు భోజనసమయంబున విషంబు
భుజియించిన నమృతంబగునని వరం బొసంగిన నొడంబడి నర్మదానది పురుకుత్సు
కడకుంబోయి యతనియందు బద్ధానురాగయై యతని వరియించిన. 216

క. పురుకుత్సునకును రేవకుఁ, దరణిప్రతిమానుఁ డగుచు త్రసదస్యుఁడనన్
నరసుతుఁడుపుట్టె నతనికి, హరివిక్రముఁ డుదయమయ్యె ననరణ్యుఁడనన్. 217

క. ఆయనరణ్యుఁడు జన్నము, సేయంగా రావణుం డశేషబలాఢ్యుం
డై యేగుదెంచి దుర్జయుఁ, డై యజ్ఞముఁ జెఱిచి యతనియసువులు గొనియెన్.

వ. అయ్యనరణ్యునకు హర్యశ్వుండును హర్యశ్వునకు వసుమనుండును వానికిం
ద్రియారణుండును నతనికి సత్యవ్రతుండునుం బుట్టిరి. ఆసత్యవ్రతుండు త్రిశంకు
నామంబున వసిష్ఠుశాపంబునఁ జండాలుండై యుండె నక్కాలంబున. 219

---

సైనమాటలతో, ఆసన్న=(బాధింప)సమీపించిన. 209 సుధాకరపుత్త్రి=ఓచంద్రునికూఁతురా. 210 భుజంగభయాపనయార్థంబు = పాములభయమును పోఁగొట్టుట కొఱకు. 211 ధరిత్రీభుజునిన్ = రాజును, కదనమునన్ = యుద్ధమునందు. 212 ఆప్యాయితుఁడు = ఊరడింపఁబడినవాఁడు, చూడామణి = శిఖామణి - శ్రేష్ఠుఁడు, ప్రతిమాన = సమానమైన, నిర్భర = మిక్కిలి యధికమైన. 213 నిరాతంకంబు = నిర్భయము. 215 చతుర్థిన్ = చతుర్థీవిభక్తితో. 218 అసువులు =

సీ. ధరణిఁ బండ్రెండువత్సరము లనావృష్టియై మహాదుర్భిక్షమైన నాత్రి
శంకుండు వచ్చి విశ్వామిత్రుపుత్రమిత్రకళత్రములకు నిత్యంబు నడవి
మృగమాంసములు దెచ్చి మెఱసి చండాలప్రతిగ్రహమునకు ననుగ్రహింపఁ
డోయనికొంకి తా నొరు లెఱుంగకయుండ జాహ్నవిదరిఁ దదాశ్రమసమీప
తే. వటమహీరుహశాఖనావటముగాఁగఁ, గట్టఁ గౌశికుఁ డందుచేఁ గఱవుదీర్చి
వసుమతీనాథుఁ బరమపావనునిఁ జేసి, బొందితోడన సురపురంబునకు ననిచె. 220

వ. అట్టి త్రిశంకునకు హరిశ్చంద్రుండు పుట్టె. 221

సీ. సకలసంపదలు విశ్వామిత్రునకు నిచ్చి సత్యవ్రతంబు శాశ్వతముచేసె
బాహుగర్వమున సప్తద్వీపములఁ దనయాజ్ఞ చెల్లంగ రాజ్యంబు సేసె
నవ్యాహతైశ్వర్యుఁడై పెక్కువేలేండ్లు హరిమూర్తిఁ దాల్చి విఖ్యాతిఁ గాంచె
నర్థితో రాజసూయాశ్వమేధాదిమహాధ్వరంబులు పెక్కు లాచరించె
తే. నంతమున దేవలోకంబునందు నింద్రు, సరస సింహాసనంబున బెరసియుండె
నిఖిలమున ధర్మమార్గంబు నించిమించె, సాంద్రయశుఁడు హరిశ్చంద్రచక్రవర్తి.

వ. అట్టి హరిశ్చంద్రునకు లోహితాశ్వుండును వానికి హరితుండును వానికిఁ జం
చుండును నతనికి విజయవసుదేవు లన నిరువురును బుట్టి రందు విజయునకు
రురుండును రురునకు వృకుండును వృకునకు బాహుండునుం బుట్టిరి. 223

క. బాహుఁశ్యమహిమతో న, బ్బాహుఁ డయోధ్యాపురంబుఁ బాలింపంగా
హైహయులు మొదలుగా నృపు,లాహవమున నతనిరాజ్యమంతయు గొనినన్.

క. ఆనృపతి నిండుగర్భిణి, యైనమహిషితోడ నౌర్వునాశ్రమమునకున్
దీనతఁ జనియుండఁగ న,మ్మానినికి సపత్ని యైన మగువ కడంకన్. 225

క. అర్భకుఁడు దనకుఁ గలుగని, నిర్భాగ్యత్వంబు దెలియనేరక కినుకన్
గర్భస్తంభంబుగ నా, గర్భిణికిన్ విషముఁ బెట్టెఁ గ్రౌర్యముతోడన్. 226

వ. ఇట్లు గర్భస్తంభంబై యేడుసంవత్సరంబు లుండునంత బాహుండు వయో
వృద్ధుండు గావున పరలోకగతుండయ్యె. 227

## సగరునిచరిత్రము.

క. మృతుఁ డైనప్రాణవల్లభుఁ, జితిపై నిడి యగ్రమహిషిచిత్తములోనన్
ధృతిదళుకొత్తఁగఁ దానును, బతితో ననలంబుఁ జొరఁగఁ బయనం బయ్యెన్.

---

ప్రాణములు. 220 కొంకి = సంకోచించి, ఆవటముగాఁగన్ = అనుకూలముగా. 222 అవ్యాహతైశ్వర్యుఁడు=కొంచెమేనియు కొఱఁతలేని యైశ్వర్యము కలవాఁడు, సరసన్=వెంబడి, బెరసి=పొంది. 226 గర్భస్తంభంబుగన్=గర్భము నిలఁబడిపోవునట్లు. 228 తళుకొత్తఁగన్=ప్రకాశింపఁగా-కలు

వ. అంత నతీతానాగతవర్తమానకాలత్రయవిజ్ఞానవిద్యాఖర్వుం డైనయౌర్వుండు నిజాశ్రమంబు వెలువడివచ్చి యయ్యంబుజాక్షి నగ్నిప్రవేశంబు సేయకుండ నివారించి యిట్లనియె. 229

క. సుదతీ యేటికి సాదసొచ్చెదు నీయుదరంబులో నిశిశువు విరోధి
ప్రదముఁడు వీర్యపరాక్రముఁ, డుదితార్కసమానుఁ డుర్వియొక్కఁడ యేలున్.

తే. సకలయజ్ఞంబులును జేసి చక్రవర్తి, యై యనేకకుమారుల నర్థిఁ గాంచి
వంశకరుఁ డగుఁ గావున వలదు నీకు, నింత సాహసమన్న నయ్యిందువదన.

క. మరణంబు మాని పతికిం, బరలోకక్రియలు సేసి పరమానందో
త్కరమతితో నమ్మౌనీ, శ్వరు నాశ్రమభూమియందు వర్తించుతఱిన్. 232

క. కతిపయదినములలోన, య్యతివ గరముతోడఁగూడ నాత్మజుఁ గనినన్
ధృతి నౌర్వుఁడు సగరుండని, యతనికి నామంబు చేసె నర్హస్థితితోన్. 233

వ. జాతకర్మాదిక్రియలు నిర్వర్తించి పెంచి చౌలోపనయనాదికృత్యంబు లుదాత్తంబులుగా నడపి వేదశాస్త్రపురాణంబులం బ్రవీణుం జేసి యనేకశాస్త్రశిక్షాదక్షవిద్యలు దెలిపి రథాశ్వగజారోహణాదు లైన రాజవర్తనంబుల నేకొంతయు లేకుండ శిక్షించె. ఇట్లు కృతకృత్యుండై సగరుండు జననికడకుం జనుదెంచి యొక్కనాఁ డిట్లనియె. 234

క. జననీ యడవులనుండఁగ, మన కేటికి నెందుఁబోయె మజ్జనకుఁడు నా
విని తల్లి పుత్రుతోడను, మునుకొని కన్నీరు దొరుఁగ మొగి నిట్లనియెన్. 235

క. తనయా యేమని చెప్పుదు, వనిలోపల హైహయాదు లగు రాజులు మీ
జనకుని గెలిచి సమస్తముఁ, గొని పాఱఁగఁ దోలి రిట్టి ఘోరాటవికిన్. 236

వ. అనిపలికి సవతి తనకు గర్భస్తంభం బగునట్లుగా విషంబుఁ బెట్టుటయును వార్ధకంబున రాజు పరలోకగతుం డగుటయు నౌర్వప్రసాదంబునఁ దమకు సకలరాజ్యంబును దొల్లింటియట్లు యనుభవింపఁ గలుగుటయునుం జెప్పినఁ గోపించి. 237

చ మదమునఁ దండ్రి రాజ్యము సమస్తముఁ గొన్న విరోధివర్గమున్
గదనములోనఁ జంపి త్రిజగంబునఁ గీర్తి వెలుంగునట్లు చే
సెద ననుచుం బ్రతిజ్ఞ దగఁ జేకొని హైహయవంశ రాజులం
బొదివి నిశాతఘోరశరపుంజముల న్వధియింప బల్విడిన్. 238

వ అంత శకయవనకాంభోజపారదపల్లవాది దేశంబుల రాజులు ప్రాణభయార్తులై తత్కులగురుం డైనవసిష్ఠు శరణు చొచ్చిన నమ్మునీంద్రుండు వారల నిజకులాచారధర్మంబులు విడిపించి జీవన్మృతులం జేసి సగరున కిట్లనియె. 239

---

గఁ గాననుట. 229 అఖర్వుఁడు = గొప్పవాఁడు. 230 ప్రదముఁడు=లెస్సగా అణఁగఁగొట్టువాఁడు 234 ఉదాత్తంబులుగాన్ = ఘనములుగా. 288 పొదివి=ఆక్రమించి, నిశాతఘోరశరపుంజములన్= చురుకుగల భయంకరములైన బాణసమూహములచేత, బల్విడిన్ = అతిశౌర్యముతో. 239 జీవన్మృతులన్ = బ్రతికియు చచ్చినవారినిఁగా.

క. నీవింక వీరిఁ జంపకు, భూవల్లభ నీప్రతిజ్ఞ భూయిష్ఠముగా
జీవన్మృతులంజేసితి, నీవసుధేశ్వరులనెల్ల నిది యెట్లనినన్. 240

క. ధారుణిఁ దమతమవంశా,చారంబులు విడుచుటెల్లఁ జచ్చుటకాదే
వైరుల జీవన్మృతు లగు, వారల నెవ్వారుఁ జంపవలదు నరేంద్రా. 241

వ. అదియునుంగాక ప్రాణభయార్తులై శరణుచొచ్చినవారిని రక్షించుటకంటెఁ బరమ ధర్మంబులేదు. విశేషించి మద్వచనంబు లంఘనీయంబుగాదు గావున వీరియందుఁ బ్రతిజ్ఞాభంగంబున నైనదోషంబులేదు వీరియందుఁ గోపోపశమంబు సేయుమనిన గురువచనంబు లభినందించి యారాజులం గాచి విడిచె నాటనుండియు యవనులు ముండితోత్తమాంగులును శకులర్ధముండితులును పారదులు ప్రలంబకేశులును పల్లవులు శ్మశ్రుధరులును కాంభోజు లస్వాధ్యాయపరులును నై నిజకులాచారపరిత్యాగంబుచేసి బ్రాహ్మణులచేత విడువంబడి మ్లేచ్ఛులై రివ్విధంబున సగరుండు విజయసంపన్నుండై స్వాధిష్ఠానంబునకు వచ్చి రాజ్యాభిషిక్తుండై సప్తద్వీపసమేతంబుగా మహీమండలంబుఁ బరిపాలించుచుండి. 242

తే. వినతకును గశ్యపునకును దనయయైన, సుమతియు విదర్భరాజన్యసుతసుకేశి
యిరువురును భార్యలై రమణీయసురత, సుఖవినోదంబు లొనరింప క్షోణి యేలె.

క. అంతట నాసగరమహీ,కాంతుఁడు పుత్రార్థియై వికాసప్రీతిం
గాంతలు దానును నౌర్వ ని,రంతరమును సేవచేసి యారాధింపన్. 244

క. ఒకసతికి వంశవర్ధను, నొకతనయుని నిత్తు నొకపయోరుహాసమనే
త్రకు నఱువదివేవురుపు,త్రకుల నొసఁగువాఁడ ననుచుఁ దాపసి పలికెన్. 245

క. పలికిన విదర్భనందన, కులదీపకు నొక్కసుతునిఁ గోరుకొనియె ని
మ్ముల నఱువదివేవురు తన,యులఁ గాశ్యపికోరె మునియు నొసఁగెం బ్రీతిన్.

వ. ఇవ్విధంబున నౌర్వప్రసాదంబునంజేసి కతిపయకాలంబునకు సుకేశికి నసమంజసుఁ డనుకుమారుం డొక్కరుండును సుమతికి నఱువదివేవురుకుమారులు జన్మించి పెరుగుచుండ నసమంజసుండు బాల్యంబుననుండియుఁ బాపకర్మపరుండై తమ్ములుం దానును సాధుజనంబుల బాధించుచుండఁ దండ్రికి నసహ్యంబయ్యును భావికాలంబున బుద్ధిమంతుండగునోయనునాసంజేసి సంప్రాప్తయౌవనుం డగునంతకుం బెనిచిన నతఁ డంతకంతకు దుర్గుణంబులు విడువక వర్తించుచున్న నయ్యసమంజసునకు నంశుమంతుం డనుకుమారుండు జన్మింపఁ బౌత్రపరిగ్రహంబుఁ జేసి పాపాత్ముం డైనకుమారుని వెడలనడిచిన. 247

---

240 భూయిష్ఠము=అంతట వ్యాపించినది. 242 లంఘనీయంబు = దాఁటఁదగినది, అభినందించి=కొనియాడి - ఆదరించి యనుట, అర్ధముండితులు = సగము గొఱుగఁబడినవారు, ప్రలంబకేశులు = మిక్కిలి వ్రేలుచున్న తలవెండ్రుకలుకలవారు, శ్మశ్రుధరులు=గడ్డము మీసమును ధరించినవారు, స్వాధిష్ఠానంబునకున్ = తనయునికిపట్టునకు. 247 కతిపయకాలంబునకున్ = కొంతకాలమునకు, అస

క. అసమంజసచరితుం డగు, నసమంజసు నట్లతమ్ము లందఱు నతిపా
పసమన్వితమానసులై, వసుమతిఁ గలగుండుపెట్టి వర్తించి రొగిన్. 248

క. యాగములు చెఱిచి తపములు, సాగంగా నీక సాధుజనమార్గపరి
త్యాగక్రియ లొనరించిన, సాగరులం జూచి సుర లసహ్యాత్మకులై. 249

తే. సకలవిద్యామయుండును సంహృతాఖి, లాఘుఁడును భగవంతుఁడు నంబుజేక్ష
ణాంశసంభూతుఁడును నైనయట్టి కపిల, సంయమీశ్వరు కడకేగి శరణుసొచ్చి.

ఆ. ధర్మహీనులై యధర్మోపలక్షణ, దారుణక్రియావిహారులైన
సగరసుతులదుష్టచరితంబు లేర్పడ, విన్నవించి మఱియు విబుధవరులు. 251

ఆ. దుష్టశిక్షణమును శిష్టరక్షణమును, నర్థిఁ జేయఁబూని యవనియందు
నవతరించినట్టి హరిమూర్తి వగుట నీ, కెఱుఁగఁజెప్పవలసె నింతవట్టు. 252

వ. ఇద్ధురాత్ములచేత జగంబు లేమిగాఁగలవొకో యనినఁ గపిలమహాముని దేవతల
కిట్లనియె. 253

తే. పాపకర్ములై యొరుల కుపద్రవములు, సేయువారల దైవంబు చెఱుచుఁగాన
వారి నెవ్వరుఁ జెఱుపంగవలదు దమకు, హానివృద్ధులు పాపపుణ్యములఁగలుగు.

వ. కావున నల్పకాలంబున సగరసుతులు దమ్ముందార వినాశంబై పోవంగలవారు
మీరు వొండని యమ్మునీంద్రుండు తపంబుసేయుచుండె నంత. 255

ఆ. సగరుఁ డశ్వమేధసవనంబు గావింప, దీక్షఁబూని యశ్వరక్షణార్థ
మాత్మసుతులఁ బనుప నఱువదివేవురు, నాతురంగమంబు నరయు నప్డు. 256

చ. అనిమిషదూత యొక్కఁడు రయంబున నానరనాథసూనులకా
గను మొఱఁగించి యజ్ఞతురగంబును భూమిబిలంబులోనికిం
గొని చని నాగలోకమున ఘోరతపం బొనరించుచున్న స
జ్జనసుతమూర్తి యాకపిలసంయమియాశ్రమభూమిఁ గట్టినన్. 257

చ. తురగముఁ గాన కానృపసుతుల్ పటుబాహుబలప్రతాపులై
యురుతరశక్తితో నవని నొక్కొక్కఁ డొక్కొకయోజనాయతం
బురవడిఁ ద్రవ్వి కానక మహోగ్రతఁ బన్నగ లోకమంతయుం
దిరుగుచు నచ్చటం గనిరి దివ్యమునిం గపిలుఁ మహాత్మునిన్. 258

హ్యంబు = సహింపరానిది, భావికాలంబునన్ = రాఁగలకాలమున. 248 అసమంజసచరితుఁడు = చెడ్డనడవడికలవాఁడు, కలగుండుపెట్టి = కలఁతపెట్టి. 249 అసహ్యాత్మకులు = ఓర్వలేనిమనసుగలవారు. 250 సంహృతాఖిలాఘుఁడు = సంహరింపఁబడిన యెల్లపాపములుగలవాఁడు - ఎల్లపాపములను తొలగించినవాఁడు, భగవంతుఁడు = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు. 251 అధర్మోపలక్షణదారుణక్రియావిహారులు=అధర్మమును సూచించునట్టి భయంకరమైన పనులయందు వినోదముగా తిరుగువారు. 252 ఇంతవట్టు=ఇదంతయు. 255 తమ్ముందార = తమంతటఁదామే. 257 కమొఱఁ

వ. ఇట్లనతిదూరంబున శరత్కాలదివాకరుండునుంబోలె ననవరతతేజోవిభాసితుండై యశేషదిశాసముద్యోతమానుం డగునమ్మునీంద్రు నాశ్రమంబునం గట్టియున్న యధ్వరాశ్వంబుఁ బొడగని సముద్యతాయుధహస్తులై యతనిం బరివేష్టించి. 259

క. మనతండ్రి యధ్వరాశ్వముఁ, గొనివచ్చిన దొంగవీఁడె గుఱ్ఱముతోడం
జనఁ జోటులేక నిక్కపు, మునిగతి నున్నాఁడు వీని మోఁదఁగవలయున్. 260

ఉత్సాహము. అనుచు బెట్టిదంబులాడునవనినాథసూనులం
గినిసి మౌనిముఖ్యుఁ డగ్నికీలగ్రమ్ముచుండు లో
చనకటాక్షవీక్షణములఁ జలనవృత్తిఁ జూచినన్
దనువులందు నగ్ని పొదువ దగ్ధమైరి వారొగిన్. 261

తే. ఇవ్విధంబునఁ గపిలమునీంద్రు కోప
పావకముచేతఁ బుత్త్రులు భస్మమైన
వార్త సగరుండు విని శోకవార్ధి మునిఁగి
యధ్వరాశ్వంబుఁ గొనితేర నంశుమంతు. 262

వ. పనిచిన నయ్యసమంజసపుత్త్రుండు నరిగి. 263

ఆ. సగరసుతులు మున్ను చనినమార్గమునంద, యరిగి కపిలమౌని నర్థిఁ గాంచి
పరమభక్తితోడఁ బ్రణమిల్లి కరములు, మొగిచి పెక్కుచందముల నుతింప. 264

క. కపిలుఁడు ప్రసన్నమతియై, నృపనందనుఁ జూచి పుత్త్ర నీ కీహయముం
గృపతో నిచ్చితిఁ గొనిపో,యి పితామహు నశ్వమేధ మీడేర్పు మొగిన్. 265

వ. అనిన నంశుమంతుండు కృపాయత్తచిత్తుం డైనయమ్మునీంద్రునకుఁ గృతాంజలియై దేవా బ్రహ్మదండోపహతు లైనమత్పితృవర్గంబులకు స్వర్గప్రాప్తికరం బైనవరంబుఁ బ్రసాదింపవలయు ననిన నతం డిట్లనియె. 266

శా. నీపౌత్త్రుండు భగీరథుం డతితపోనిష్ఠాపరుండై త్రిలో
కీపూతం బగువేల్పుటేటి నిలఁ జెలంగించుం దదీయాంబువుల్
పైపైఁ బర్వఁగ నస్థిభస్మనికరప్లావం బగున్ నీపితృ
క్ష్మాపాలావళి కంతటం గలుగుశశ్వత్స్వర్గసౌఖ్యోన్నతుల్. 267

ఉ. పూని ముకుందుపాదమునఁ బుట్టి జగత్పరిపూత యైనగం

---

గించి=విమఱించి - ఇది యపూర్వప్రయోగము. 259 అశేషదిశాసముద్యోతమానుఁడు=ఎల్లదిక్కులను ప్రకాశింపఁజేయుచున్నవాఁడు, సముద్యతాయుధహస్తులు=ఎత్తఁబడిన ఆయుధములు చేతులందుఁగలవారు. 261 బెట్టిదంబులు = పరుషవాక్యములు. 267 త్రిలోకీపూతంబు = మూఁడు లోకములను పావనములనుగాఁ జేయునది, వేల్పుటేఱు = దేవగంగ, చెలంగించున్ = ప్రవహింపఁజేయును, ప్లావంబు = తడియుంట, శశ్వత్స్వర్గసౌఖ్యోన్నతులు = మేలైన స్వర్గసుఖముయొక్క ఘనతలు. 268 జగత్పరిపూత = లోకమును పరిశుద్ధమునుగాఁ జేయునది, అరిది = దుర్లభము

గానదిలోపలఁ మునుఁగఁ గల్గిన శాశ్వతనాకసౌఖ్యముల్
మానక గల్గుటే యరిది మర్త్యులయంగములందు నొక్కటే
దేనియు నజ్జలంబు లొకయించుక సోఁకినఁ గల్గు స్వర్గమున్. 268

క. అని యిట్లు పలికి యానృపతనయునిఁ బొమ్మనిన నతఁడు తాపసికి ముదం
బున మ్రొక్కి యధ్వరాశ్వముఁ గొనివచ్చి పితామహునకుఁ గొమ్మని యిచ్చెన్.

ఆ. సగరచక్రవర్తి శాస్త్రమార్గంబున, నశ్వమేధయజ్ఞ మాచరించె
జలధి నాటనుండి సాగరుం డనుపేర, వినుతికెక్కె సగరతనయుఁ డయ్యె. 270

వ. సగరుపరోక్షంబున నంశుమంతుండు రాజ్యాభిషిక్తుఁ డయ్యె నతనికి దిలీపుండు పుట్టె నతనికి భగీరథుండు జన్మించి. 271

క. ఘన మైనతపము పెంపున, ననిమిషనది నిలకుఁ దెచ్చి యఖిలము నెఱుఁగం
దనపేరను భాగీరథి, యనునామముఁ గలుగఁజేసె నతఁ డానదికిన్. 272

వ. అట్టి భగీరథునకు సుహోత్రుండును సుహోత్రునకు నాభాగుండును నాభాగునకు నంబరీషుండును నంబరీషునకు సింధుద్వీపుండును సింధుద్వీపునకు నయుతాయువును నయుతాయువునకు ఋతుపర్ణుండునుం బుట్టె రట్టిఋతుపర్ణుం డక్షవిద్యాప్రవీణుండై జూదంబున రాజ్యంబుఁ గోలుపోయిన నలచక్రవర్తికి సాహాయ్యంబు చేసి తపోమహత్త్వంబున రాజఋషియయ్యె నట్టిఋతుపర్ణునకు సర్వకాముండును సర్వకామునకు సుదాసుండును సుదాసునకు మిత్రసఖుండునుం బుట్టె రట్టిమిత్రసఖుండు రాజ్యంబు సేయుచుండి యొక్కనాఁడు. 273

క. కానకు వేటాడఁగ నా, భూనాథుఁడు వోయి రెండుపులుల మహోగ్ర
ధ్వాన మొనరించుచుండెడు, వానిం బొడగాంచి చేరవచ్చి మనములోన్. 274

క. ఈకోలుపులుఁ లకతమున, నీకాననమున మృగంబు లెవ్వియు లేవం
చాకరశరమున నందొక, భీకర మగుమృగముఁ బడఁగఁ బెలుచన నేయన్. 275

క. దనుజాకృతి నాబెబ్బులి, తనువు విడిచె నున్న యదియు ధరణీపతి దా
విన దీనికిఁ బ్రతికారం, బొనరించెద నీవు మఱవకుండు మటంచున్. 276

క. పగచాటుచు దనుజుండై, యెగసి చనియె నపుడు విస్మయాభూతాత్ముం
డగుచుఁ దనరాజధానికి, మగుడం జనుదెంచి నృపకుమారుం డుండెన్. 277

సౌదాసుండు వసిష్ఠుశాపంబున నరమాంసభక్షకుం డగుట.

వ. అంత నాసౌదాసుండు నిజకులాచార్యుం డైనవసిష్ఠుండు పురోహితుండుగా

---

271 పరోక్షంబునన్=అనంతరము. 272 పెంపునన్=అతిశయముచేత. 275 కోలుపులులు=పెద్దపులులు, పెలుచనన్=దురుసుతనముతో. 276 బెబ్బులి = పెద్దపులి, ఉన్నయదియు = మఱియొకపెద్దపులియును. 277 పగచాటుచున్ = విరోధమును ప్రసిద్ధపఱచుచు, విస్మయాభూతాత్ముండు=

యజ్ఞంబుసేసె నయ్యజ్ఞసమాప్తదివసంబున నమ్మునీంద్రుం డనుష్ఠానార్థంబుగాఁ
జనినసమయంబు వేచి. 278

క. మును పగచాటుచుఁ బోయిన, దనుజుండు వసిష్ఠురూపుఁ దాల్చి ధరిత్రీ
శునికడకుఁ జని రహస్యం,బున నరమాంసంబుతోడి భోజన మడిగెన్. 279

చ. జనపతి యట్లకాక యని సమ్మతిచేసెను సూపకారుఁడై
దనుజుఁడువచ్చి యవ్విభుమతంబున మానవమాంస మిమ్ముగాఁ
గొని చని వండి బంగరపుఁగోరను గోరికమీఱఁబెట్టి య
మ్మునిపతి కిమ్మటంచు నృపుముందఱఁబెట్టి యదృశ్యమై చనెన్. 280

ఆ. అంత నవ్వసిష్ఠుఁ డరుదెంచి భోజన, మర్థిఁజేయునప్పు డవ్విభుండు
మునికిఁ గడురహస్యమున నరమాంసంబుఁ, దెచ్చిపెట్టె మీఁదు దెలియలేక. 281

క మౌనీశ్వరుండు దానిన్, మానవమాంసంబుగా సమంజసదివ్య
జ్ఞానమునఁ దెలిసి యానృప,సూనునెడం దప్పులేమిఁ జూడక కినుకన్. 282

ఉ. శ్రీకరమైనపుణ్యములఁ జెందఁగ ఘోరతపంబుసేయఁగా
మాకు నభోజ్యమైననరమాంసము బెట్టుట యాసురంబు నీ
వీకపటంబుఁ జేసితివి యింతటనుండియు రాక్షసత్వముం
జేకొని యిట్టిభోజనముసేయు మటంచు శపించె నుగ్రుఁడై. 283

వ. ఇట్లు శపించినవసిష్ఠునకు నరేంద్రుం డిట్లనియె. 284

తే. నీవ కావె మునీశ్వర నేటిరేపు, మనుజమాంసంబుతోడి భోజనము నన్ను
నడిగినాఁడవు నీ విప్పు డదితలంప, కేల శపియించితివి కృప యింతలేక. 285

వ. అనిన నమ్మునీంద్రుండు క్రమ్మఱం దనయోగసమాధిం జూచి రాజువలన నపరా
ధంబు లేకుండు టెఱింగి పండ్రెండువత్సరంబులకు శాపమోక్షణం బగుననియను
గ్రహించిన శాపానుగ్రహంబులు గైకొని నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె.

ఆ. నిరపరాధి నన్ను నిష్కారణము శపి,యించినాఁడ వింక నీవు సూర్య
కులము భూపతులకు గురువవుగాఁగ న,ర్హుఁడవుగాక నవయుచుందుగాక. 287

క. అని ప్రతిశాపజలంబులు, గొనఁగా నపు డెఱిఁగి యతనికులసతి మదయం
తి నరేశ్వర యోహోహో, చనునే గురువునకు నలిగి శాపం బీయన్. 288

వ. అని నివారించిన నతండు మనసు విఱిగి యాశాపజలంబులు భూనభంబులంజల్లిన
లోకంబులకు నుపద్రవం బగునని తనపాదంబులయంద చల్లుకొనిన నాత్మీయకో
పానలాశ్రితంబు లైనయాజలంబులచేతం దనపాదంబులు దగ్ధచ్ఛాయ యైన

---

ఆశ్చర్యము నొందినమనసుగలవాఁడు. 278 వేచి=కనిపెట్టి. 280 ఇమ్ముగాన్=బాగుగా, బంగరపుఁగోరన్ = బంగారుగిన్నెయందు. 283 ఆసురంబు = అసురకృతకము. 285 నేటిరేపు = ఈదినము ప్రాతఃకాలమున. 287 నిరపరాధిన్ = తప్పులేనివానిని, నవయుచుందు = అలయుచుందువు. 289 ఆత్మీయకోపానలాశ్రితంబులు = తనకోపమనెడు నిప్పును ఆశ్రయించినవి - కోపా.

కల్మాషత్వంబున నుపగతంబయ్యె నట్టికారణంబున నారాజు కల్మాషపాదుండయ్యె నంత. 289

ఉ. అమ్ముని శాపదోషమున నాసురవృత్తి నతండు రాత్రికా
లమ్ములయందుఁ బేరడవులన్ నరులన్ వధియించి మాంసముల్
సమ్మతిమై భుజించి దివసంబుల మానుషభంగి నుండు ని
ట్లమ్మనుజేంద్రచంద్రుని భయంకరవేషముఁ జెప్పఁ జిత్రమా. 290

సీ. ఇవ్విధంబున నన్నరేంద్రుండు రాక్షసాకారంబుతోడ నరణ్యాననముల
నొంటిమైఁ దిరుగుచు నున్నకాలంబునం దొకనాఁడు బ్రాహ్మణుం డొక్కరుండు
ఋతుమతి యైనట్టి సతితోడ సుఖకేళి గావించుచున్న యక్కాల మెఱిఁగి
పటువేగమున వానిఁబట్టి వధింపంగఁ బఱతెంచుకల్మాషపాదుఁ జూచి
తే. భయముతోడ వెఱచి పఱచుచునుండ నా, రక్కసుండు విప్రు నుక్కణంగఁ
బట్టుకొనిన నతనిభార్య శోకించుచు, నతనికడకువచ్చి యర్థిఁ బలికె. 291

క. లోకస్తుతమిత్రసఖా, ఖ్యాకుఁడవు మహాత్ముఁడవు దయామూర్తివి యి
క్ష్వాకుకులాధారుండవు, నీకేటికి విప్రుఁ జంపి నెత్తురు ద్రావన్. 292

వ. నీవు ధర్మసుఖాభిజ్ఞుండవు గావున నీ వెఱుంగనిధర్మంబు లేమిగలవు నేను ప్రాణవల్లభునివలన సురతసుఖంబులఁ దృప్తింబొందక యున్నదానఁ గావున నాకుం బతిదానంబు సేయుము బ్రాహ్మణహత్య మహాపాతకం బిట్టి నీచకర్మంబులు ధర్మంబులు గావని పెక్కువిధంబులం బ్రార్థించుచుండ నప్పాపాత్ముండు. 293

క. పులి పసరముఁ జంపినగతి, బలువిడి బ్రాహ్మణునిఁ జంపి భక్షించిన యా
తులువం గనుఁగొని బ్రాహ్మణి, కులసతి నిలుపంగరాని కోపవశమునన్. 294

తే. నిర్దయాత్మక నాపతి నిరపరాధిఁ, జంపితివిగాన నీవును సతులతోడి
సంగతికిఁ బోయినప్పుడ చత్తు వనుచు, శాపమిచ్చి యగ్నిప్రవేశంబు చేసె. 295

వ. ఇవ్విధంబున నారాజుచేసిన యన్యాయంబునకు సకలభూతంబులును హాహాకారంబుల నాక్రోశించె నప్పుడు. 296

క. మునివరుశాపంబున న, జ్జననాథుఁడు పదియురెండుసంవత్సరముల్
దనుజుండై దుష్కర్మము, లొనరించె జగంబు లెల్లనోహో యనఁగన్. 297

క. ఘను లై నవసిష్ఠమహా,ముని ముఖ్యులువచ్చి నృపతిమొక్కలమునఁ జే
సినపాతకములు శాంతిగ, ఘనయజ్ఞముఁజేసి సుకృతిఁ గావించి రొగిన్. 298

వ. ఇట్లు నిష్కల్మషుండైన కల్మాషపాదుండు. 299

---

గ్నిచే వేఁడిమి నొందినవి, దగ్ధచ్ఛాయమై = కాలినవర్ణముగలవికాఁగా, కల్మాషత్వంబున్ = చిత్రవర్ణత్వమును, ఉపగతంబు = పొందఁబడినది. 290 దివసంబులన్ = పగటివేళలయందు. 291 పటువేగమునన్ = మిక్కిలి వడిగా, ఉక్కణంగన్ = చిక్క. 292 మిత్రసఖాఖ్యాకుఁడవు= మిత్రసఖుఁడను పేరుగలవాఁడవు. 298 మొక్కలమునన్ = ముష్కరత్వముచేత.

ఉ. ఇమ్ముల భూమియంతయును నేలుచు నాత్మవధూటితోడి సౌ
ఖ్యమ్ములు గోరియున్న మదయంతియుఁ దొల్లిటి విప్రకాంతశా
ప మ్మెఱింగించి నీకు నిది ప్రాణభయం బగునన్న నాత్మలో
నుమ్మలికించుచున్ సతుల నొల్లకయుండెను షండుకైవడిన్. 300

వ. ఇట్లు స్త్రీసంగమపరాఙ్ముఖుండై పెద్దకాలంబు రాజ్యంబుచేసి సంతానార్థంబుగా వసిష్ఠుఁ బ్రార్థించి తనభార్య యైనమదయంతిని సమర్పించిన నమ్మునీంద్రుం డయ్యింతికి గర్భాధానంబుచేసి బలపరాక్రమసంపన్నుం డైనకుమారుండు జన్మించు ననిచెప్పి చనియె నంత. 301

ఆ. అధిపుకాంత గర్భమై యేడుసంవత్సరంబు లుండి పుత్త్రరత్న ముద్భ
వింపకున్నఁ జాలవేసటి భరియింప, లేక యొక్కనాఁడు భీకరముగ. 302

తే. అశ్మమునఁ దనగర్భమయ్యంబుజాక్షి, పొడిచికొనుటయు జన్మించెఁ బుత్త్రకుండు
వాని కశ్మకుఁ డనునభిధాన మర్థిఁ, జేసి నవయౌవనంబునఁ జెలఁగుటయును. 303

క. ఆకల్మాషపదుం డ, స్తోకముదముతోడఁ దనదుసుతు నశ్మకునిన్
సాకేతరాజ్యవిభవము, చేకొన నియమించి తపము సేయంబోయెన్. 304

క. ఆయశ్మకుండు రాజై, యాయతముగ భూమి యేలె నాతనికి సుతుం
డై యుదయించెను మూలకుఁ, డాయవనిపుఁ డుర్వి యేలె నాకాలమునన్. 305

ఉ. రాజుల నందఱం బరశురాముఁడు ద్రుంచెడునాఁడు వాఁడు ఘో
రాజి నెదుర్కొనన్ వెఱచి ప్రాణభయంబున నగ్నవేషకాం
తాజనకోటిలో నొదిఁగినన్ వనితాసముఁ డంచుఁ గాచి యా
రాజులవైరి వోయె సమరంబున నన్నృపాలహింసకున్. 306

వ ఇట్లు నారీజనరక్షితుం డగుటంజేసి యామూలకుండు నారీకవచుండనం బరఁగె నట్టినారీజనకవచునకు నిలబిలుండును వానికి ఖట్వాంగదిలీపుండునుం బుట్టిరి. అద్దిలీపుండు రాజ్యంబుచేయుసమయంబున. 307

మ. చల మొప్పారఁగ దేవదానవులకున్ సంగ్రామరంగంబు వా
టిల్లినన్ దేవగణంబు లయ్యసురకోటిన్ మార్కొనన్ లేక భీ
తిలి ఖట్వాంగదిలీపభూమిపతి నర్థిం దెచ్చి విద్వేషులం
గలనం జంపి జయంబు చేకొని భుజాగర్వంబు లేపారఁగన్. 308

ఆ. ఉన్న యవసరమున మన్నించి వేల్పులు, వరము వేఁడుమనిన వసుమతీశుఁ
డట్లయేని నాకు నాయుఃప్రమాణమెం, తనిన రెండుగడియ లనిరి సురలు. 309

ఉ. నవ్వి మహీశుఁ డాసురగణంబులఁ గన్గొని యట్లయేని నే
నవ్వర మొల్ల నన్నుపుఁ డంచుఁ బసిండివిమాన మెక్కి తా

300 ఉమ్మలికించుచున్ = విచారపడుచు. 303 అశ్మమునన్ = రాతితో. 308 కలనన్ = యుద్ధరంగమునందు, ఏపారఁగన్ = అతిశయింపఁగా.

నువ్వున నచ్చరల్ గొలువ నుర్వికి వచ్చి ముహూర్తమాత్రలో
మవ్వపు లైహిక క్రియలు మాని పరాపరతత్త్వవేదియై. 310

తే. వరుస బ్రహ్మాదులకునైన వశముగాని
సచ్చిదానందయోగవాసనలఁ బొదలి
యొకముహూర్తములో నృపాలకుఁడు మిగుల
విష్ణుసాయుజ్యమునఁ బొందె విస్మయముగ. 311

క. ఆరాజు యోగవిద్యా, సారస్యముఁ జూచి మెచ్చి సప్తర్షులు కై
వారములు సేయుచుండుదు, రారయ నొక్కొక్కవేళ నలరుచుఁ దమలోన్.

క. ఏపున నొక్కముహూర్తము, లోపలఁ గైకొనియె విష్ణులోకసుఖంబుల్
తాపసు లీఖట్వాంగడిలీపుని సరిగారు యోగలీలాప్రౌఢిన్. 313

క. అని యిట్లు నేటికాలముఁ, గొనియాడుదు రాదిలీపకువలయపతికిం
దనయుండు రఘునృపాలుఁడు, జనియించె నతిప్రతాపసంపద మెఱయన్. 314

ఉ. ఆరఘుభూమిభర్తసుతుఁడై జనియించె నజుండు వానికిం
దోరపుకీర్తిచే దశరథుం డుదయించె నతండు వైరి దు
ర్వారపరాక్రమక్రమనివారణకారణమండలాగ్రుఁడై
ధారుణియెల్ల నేలె విదితంబుగ షష్టిసహస్రవర్షముల్. 315

## శ్రీరామచరిత్రము

క. ఆదశరథేశునకు దా,మోదరుఁడు త్రిలోకరక్షణోద్యమలీలం
గాదె తనమూర్తి నాలుగు, భేదంబులుగా జనించెఁ బెంపేపారన్. 316

క. ఇల విష్ణుమూర్తివలనన్, నలువొందిన రామలక్ష్మణభరతశత్రు
ఘ్నులు బాహాబలదర్పోజ్జ్వలులై విలసిల్లుచున్నవారలలోనన్. 317

ఉ. భూచరఖేచరాభినుతపుణ్యుఁడు రాముఁడు శైశవంబునం
దేచినతాటకన్ రణమహిం బడనేసి సుబాహు నొక్కనా
రాచమునన్ వధించి ప్రమదంబున నంబుధిలోఁబడంగ మా
రీచుని నొంచి కౌశికు వరించినయజ్ఞముఁ గాచెఁ బెంపుతోన్. 318

---

310 ఉవ్వునన్ = తటాలున, మవ్వపు = మనోజ్ఞమైన. 312 సారస్యము = సరసత్వము, కైవారములు = స్తోత్రములు. 313 ఏపునన్ = ఉత్సాహముతో. 315 వైరి...మండలాగ్రుఁడు = శత్రువులయొక్క అడ్డగింపరాని పరాక్రమమర్యాదమ పోఁగొట్టుటకు హేతువైనఖడ్గముగలవాఁడు-అణఁపరానిశత్రువుల పరాక్రమమును అణఁచినవాఁడనుట. 316 పెంపు = గౌరవము. 318 భూచరఖేచరాభినుతపుణ్యుఁడు = భూమియందు సంచరించునట్టి మనుష్యులచేత ఆకాశమున సంచరించునట్టి దేవతలచేతను కొనియాడఁబడిన ధర్మముగలవాఁడు, శైశవంబునందున్ = శిశుత్వమునందు-పసితనమునందే, ఏచిన=చెలరేగిన, నొంచి=నొప్పించి.

తే. గౌతమునిశాపదోషంబుకతన నడవి
యందుఁ బాషాణమైయున్న యయ్యహల్యఁ
దనపదాంగుష్ఠసంభూతధారుణీప
రాగదర్శనమునఁ బాపరహితఁ జేసె. 319

చ. జనకుఁడు మెచ్చఁగా హరునిచాపము రూపఱఁజేసి పెంపుతోఁ
దనభుజవీర్యశుల్కముకతంబున సీత నయోనిజాతనే
ర్పున వరియించి హైహయపురోగమరాజకులాంబుదప్రభం
జను జమదగ్నిసూనుభుజసత్త్వమపాస్తముచేసె ధీరతన్. 320

ఉ. ఆతతరాజ్యవైభవవిహారసమంచితమైనయాధరి
త్రీతల మేలనొల్లక ధృతిం దలిదండ్రులయాజ్ఞయూఁది యా
సీతయు లక్ష్మణుండును భజింపఁగఁ గాననభూమియందు సం
ప్రీతిమెయిన్ వసించె మునిబృందము లెల్లను సంతసిల్లఁగన్. 321

చ. అనిమొనలో విరాధుఁ దెగటార్చి భయంకరవృత్తితోడ శూ
ర్పణఖను భంగపెట్టి పటుబాణములన్ ఖరదూషణాదిదై
త్యనికరముం జతుర్దశసహస్రరథంబుల మేటివీరులన్
దునిమి కబంధుఁ జంపి రిపుదుర్జయు వాలి నడంచె నర్థితోన్. 322

క. తపనజుఁ డగుసుగ్రీవునిఁ, గపిరాజ్యంబునకు రాజుఁగాఁ జేసి దశా
స్యుపురంబునఁ జెఱఁజిక్కిన, విపులాసుతఁ జూడఁ బ్లవగవిభు హనుమంతున్. 323

వ. పనిచి సీతావృత్తాంతంబు దెలిసి. 324

చ. అలఘుమతిన్ మహావనచరావళి డెబ్బదిరెండువెల్లువల్
గొలువఁగ నేఁగి వారినిధిఁ గొండలచేతను గట్టి లంకపై
బలువిడి సేనతో విడిసి బాహుపరాక్రము లైనదైత్యులం
గలహములోఁ గులక్షయముగా నొనరించె మహానుభావుఁ డై. 325

ఉ. రావణకుంభకర్ణులశిరంబులు వజ్రసమానదారుణా
స్త్రావళిపాలుసేసి యనలార్చులఁ బావనయైనజానకీ
దేవి నశేషదేవగణదివ్యముని స్తవనీయశీలస

---

319 సంభూత=పుట్టిన. 320 రూపఱఁజేసి = స్వరూపనాశముచేసి - విఱిచి, శుల్కము = ఓలి, హైహయ... ప్రభంజనున్=హైహయవంశస్థులు మొదలుగాఁగల రాజసమూహములనెడు మేఘములను పడఁగొట్టుట యందుగొప్పగాలివంటివాఁడైన, అపాస్తముచేసెను. = అణఁచెను. 321 ఊఁది= అవలంబించి, భజింపఁగన్ = సేవింపఁగా. 322 తెగటార్చి=చంపి, రిపుదుర్జయున్=శత్రువులకు జయింపరానివానిని, అడంచెన్=చంపెను. 323 తపనజుఁడు = సూర్యునికొడుకు, విపులాసుతన్ = భూపుత్రిని—సీతను, ప్లవగవిభున్ = వానరశ్రేష్ఠుని. 325 వెల్లువలు=వాహినులు, (వాహిని=81 రథములు, 81 ఏనుగులు, 243 గుఱ్ఱములు, 405 గురుపదాతులునుగలసేన) బలువిడిన్ = అతిశౌర్యముతో. 326 అనలార్చులన్ = నిప్పుమంటలచేత, సద్భావము=శ్రేష్ఠత్వము. ఎలర్పన్ = చిగుర్పఁ

ద్భావ మెలర్పఁ గైకొని యపారకృపామహిమాభిరాముఁ డై. 326

తే. పఙ్క్తికంధరుతమ్మునిఁ బరమభాగ,వతు విభీషణుఁ దనకీర్తి వసుధఁ గలుగు
నంతకాలంబు లంకకు నధిపుఁజేసి, యయ్యయోధ్యాపురంబున కరుగుదెంచి.

మ. జగదానందచరిత్రుఁ డై మెఱసి రాజ్యం బర్థిఁ బాలించుచో
నొగి గంధర్వుల మూఁడుకోట్లభరతుం డుగ్రాజిలోఁ జంప దు
ష్టగణాఘ్యున్ మధుపుత్రకున్ లవణునిన్ శత్రుఘ్నుఁ డేపారి యా
శుగజాలంబులఁ జంపి యాతనిపురిన్ శోభిల్లఁ దానేలఁగన్. 328

వ. ఇత్తెఱంగున బలపరాక్రమధుర్యులై రామలక్ష్మణభరతశత్రుఘ్నులు దుష్టనిగ్రహ
శిష్టప్రతిపాలనంబు సేయుచుఁ బదునొకండువేలసంవత్సరంబులు రాజ్యంబు
చేసి సుఖంబు లనుభవించుచు నంత్యంబునఁ గోసలరాజ్యంబునంగల నానావర్ణ
జనంబులతోడ దివంబునకుం జనిరి. 329

సీ. రామచంద్రుఁడు సమగ్రశ్రీవిలాసులఁ గుశలవాఖ్యులఁ గాంచె విశదయశుల
లక్ష్మణుం డతులబలప్రతాపులఁ గాంచె నంగదచంద్రసేనాఖ్యసుతుల
భరతుండు రాజన్యవరుల నిద్దఱఁ గాంచెఁ బుత్రుల దక్షకపుష్కరులను
శత్రుఘ్నుఁడొగిఁగాంచెఁజతురాత్ములను బాహుశూరసేనులనంగసుతయుగంబు

తే. వీర లెనమండ్రు జలరాశివేష్టితాఖి
లావనీచక్రమున హరిదష్టకమున
నాజ్ఞ వెలయంగ మెఱసి రాజ్యములు సేసి
రందుఁ గులకర్తయై మించె నాకుశుండు. 330

వ. అట్టికుశునకు నతిథియను వానికి నిషధుండును నిషధునకు నలుండును వానికి నభ
సుండును నభసునకుఁ బుండరీకుండును బుండరీకునకు క్షేమధన్వుండును వానికి
దేవానీకుండును వానికి నహీనుండును వానికిఁ బారియాత్రుండును నతనికి
దళుండును దళునకుఁ జలుండును చలునకు యుక్తుండును యుక్తునకు వజ్ర
నాభుండును వానికి శంఖణుండును వానికి నుషితాశ్వుండును వానికి విశ్వసఖుం
డును వానికి హిరణ్యనాభుండునుం గ్రమంబునఁ బుట్టి రాహిరణ్యనాభుండు.

తే. అర్థి జైమినిమునిశిష్యుఁ డై నయాజ్ఞ
వల్క్యయోగీశ్వరునిచేత వాఁడు యోగ

---

గా-అతిశయింపఁగా. 328 ఒగిన్-పూనికతో, ఉగ్రాజిలోన్ = భయంకరమైన యుద్ధమునందు, ఏపారి=చెలరేఁగి, ఆశుగజాలంబులన్ = బాణసమూహములచేత. 330 సమగ్రశ్రీవిలాసులన్ = సంపూర్ణమైనకలిమిగలవారిని, అతులబలప్రతాపులన్ = సరిపోల్పరానిశక్తియు తేజస్సునుగలవారిని, రాజన్యవరులన్ = క్షత్రియశ్రేష్ఠులను, చతురాత్ములన్ = చతురమైన మనసుగలవారిని, జలరాశివేష్టితాఖిలావనీచక్రమునన్ = సముద్రముచేత చుట్టఁబడిన సమస్తభూమండలమునందును, కష్టహరిద

విద్యనేర్చి మహాత్ముఁడై వెలసె నవని
నతఁడు సుతుఁగాంచెఁ బుణ్యు నున్నతగుణాఢ్యు. 332

వ. తదీయవంశపరంపరలై ధ్రువుండును ధ్రువునకు సుధన్వుండును సుధన్వునకు నగ్నివర్ణుండును వానికి శీఘ్రుండును శీఘ్రునకు మరుండు ననురాజులు క్రమంబునం బుట్టి రందు నమ్మరుండు. 333

క. విను మాగామియుగంబున, నినవంశము నిలుపఁగా నహీనప్రయోగం
బున నేఁడు నున్నవాఁడ, త్యనఘుండు కలాపమను మహాగ్రామమునన్. 334

వ. అట్టి మరువంశపరంపరలు విను మమ్మరునకుఁ బ్రత్యాకుండును వానికి సుగంధియు సుగంధికి నమర్షణుండును వానికి సహస్వంతుండును వానికి విశ్వభవుండును విశ్వభవునకు బృహద్బలుండునుం బుట్టి రాబృహద్బలుం డర్జునపుత్త్రుండైన యభిమన్యునిచేత భారతయుద్ధంబునం బరలోకగతుండయ్యె నని యిక్ష్వాకుపుత్త్రుం డైనశశాదునివంశంబునఁ బ్రసిద్ధులైన రాజులచరిత్త్రంబులు సెప్పి పరాశరుండు వెండియు నిట్లనియె. 335

{ నిమిచక్రవర్తి వసిష్ఠశాపంబున విదేహుండై లోకులనేత్రముల నుండునట్లు దేవతలవలన వరంబు వడయుట. }

మ. లలి నిక్ష్వాకుతనూజుఁ డైననిమి లీలన్ వేయిసంవత్సరం
బులు సత్త్రం బొనరింపఁబూని కరుణామూర్తిన్ వసిష్ఠున్ దపో
బలసంపన్నుని హోతఁగాఁగ నతనిన్ బ్రార్థించినన్ ధారుణీ
తలనాథోత్తముతోడ నమ్ముని సముద్యత్ప్రీతితో నిట్లనున్. 336

క. భూనాయక పురుహూతుం, డేనూఱేఁడులు మఖంబు హితమతిఁ జేయం
బూని మును నన్ను హోతం, గా నియమించెను నపారగౌరవ మొప్పన్. 337

తే. అతనియజ్ఞంబు గావించి యది సమాప్త
మైన మఱి నీమహాక్రతు వాచరింతు
ననిన నేమియుఁ బలుకక యానరేంద్రుఁ
డుండె నది సమ్మతంబని యొనరఁ దలఁచి. 338

క. మునివరుఁడు వజ్రియాగం, బొనరింపఁగఁ జని సమాప్తినొందించి ముదం
బున నిమియజ్ఞముసేయం, జనుదెంచి నతిప్రయత్నసంభ్రమ మెసఁగన్. 339

వ. ఇట నిమిచక్రవర్తియు యజ్ఞోపకరణంబులైనపదార్థంబు లనేకంబులు సంపాదించినవాఁడగుటం జేసి వసిష్ఠాగమనంబు మనంబునఁ దూష్ణీంకృతంబుచేసి గౌతముఁ బురోహితుంగా వరియించి యజ్ఞంబు సేయుచున్నసమయంబున వసిష్ఠుండు గర్మ

మునన్ = దిక్కులెనిమిదింటియందును. 334 ఆగామి=రాఁగల. 336 సత్త్రము = యాగము, హోతగాఁగన్ = ఋగ్వేదవేత్తయైన మహర్త్విజునిగా. 339 వజ్రి=ఇంద్రుఁడు. 340 తూష్ణీం

కర్తయైనగౌతముం జూచి కోపాటోపావేశితాధరుండును కలుషితతామ్రఘూర్ణాయమానలోచనుండును నై యజ్ఞవాటంబు సొచ్చివచ్చి నిద్రించుచున్న యారాజుం జూచి నన్ను నుదాసీనంబుచేసిన దోషంబున వీఁడు విదేహుఁ డగుఁ గాక యని శపియించి ధిక్కరించి వీక్షించిన. 340

క. జననాథుఁడు మేల్కొని యా, మునినాథునిఁ జూచి కోపమున నిట్లను నే
మును నీయెడఁ జేసినతప్పు నిరూపింపక శపింపఁబోలునె నీకున్. 341

తే. నిరపరాధుల శిష్యుల నిగ్రహించి, శాపమిచ్చినగురుఁ డెంతశాంతుఁ డైన
వానియెడ భక్తియుక్తులు వదలి శిష్యుఁ, డేమిసేసిన దోష మొకింత లేదు. 342

క. కావున నిట్టి దురాత్ముఁడ, వీవును దేహంబు విడిచి హీనప్రవృత్తిం
బోవుదు వనుచును గోపపుఁ, జేవను బ్రతిశాప మవ్వసిష్ఠున కిచ్చెన్. 343

వ. ఇట్లు శపియించి యారాజు శరీరంబు విడిచె వసిష్ఠుండును విగతదేహుండై యాత్మీయతేజంబు యోగవిద్యాబలంబునం జేసి మిత్రావరుణులయందు నివేదించి పదంపడి యూర్వశీదర్శనంబువలన మిత్రావరుణులవీర్యంబులు స్ఖలితంబులైననిమిత్తంబున వసిష్ఠుండు దేహధారియయ్యె నంత. 344

తే. నిమిశరీరంబు తైలగంధములచేతఁ, బాక మొందించి గౌతమప్రముఖమునులు
వేయిసంవత్సరంబులు విధివదుక్త, మార్గములు దప్పకుండ సమ్మఘము సేయ. 345

చ. సవనముఁ దీరఁజేయుదివసంబున నింద్రపురోగమాదితే
యవరులు యజ్ఞభాగములకై చనుదెంచిన వారికెంతయుం
బ్రవిమలతృప్తిసేయఁగ సుపర్వవరుల్ నిమికిన్ శరీరమీ
సవరణ యైనమాటలు ప్రసంగముచేసిరి మానికోటితోన్. 346

తే. అప్పుడశరీరియయ్యును నచట సంచ,రించుచున్నట్టి విభుఁడు నిలింపవరుల
తోడ నిట్లను నీదేహదుఃఖ మింక, నొల్లఁ దొల్లింటి దుఃఖంబు లెల్లఁ జాలు. 347

క. దేహంబు దుఃఖహేతువు, దేహము రోగాస్పదంబు దేహంబు మహా
మోహాంధకారభూతము, దేహం బేమిటికిఁ గోరి దీనత నొందన్. 348

---

కృతంబు = నిరాశ, కోపాటోపావేశితాధరుండు = కోపముయొక్క త్వరనుపొందిన పెదవులుగలవాఁడు - కోపాతిశయముచేత అదరుచున్న పెదవులుగలవాఁడు, కలుషితతామ్రఘూర్ణాయమానలోచనుండు = కోపమునొందుటచేత ఎఱ్ఱనైతిరుగుడుపడుచున్న కన్నులుగలవాఁడు, యజ్ఞవాటంబు= యజ్ఞశాలయందు, ఉదాసీనంబు=అలక్ష్యము, విదేహుండు=దేహములేనివాఁడు. 343 చేవను=బలముచేత-అతిశయముచేతననుట. 344 నివేదించి-ప్రవేశింపఁజేసి, స్ఖలితంబులైన=జాఱిన. 345 పాకమొందించి=పరిపక్వముచేసి, విధివదుక్తమార్గములు=శాస్త్రప్రకారము చెప్పఁబడినరీతులను, 346 సవనము = యజ్ఞము, ఇంద్రపురోగమాదితేయవరులు=ఇంద్రుఁడు మొదలగుదేవతాశ్రేష్ఠులు, సుపర్వవరులు=దేవతాశ్రేష్ఠులు, ఈన్=ఇచ్చుటకు, సవరణ=బాగు - అనుకూలము, ప్రసంగముచేసిరి - చెప్పిరి.

ఉ. కైకొని యెల్లవారు ననుఁ గన్నులఁ గప్పుచు గారవింపఁగా
లోకుల నేత్రపద్మములలోన శరీరియుఁబోలెనుండి య
స్తోకసమస్తవస్తువులు చూచుచునుండెడునట్లుగా వరం
బేకమనస్కులై కరుణ నీవుత నాకు సుపర్వులందఱున్. 349

ఆ. అనిన నట్లకాక యని యవ్వరం బిచ్చి, యపుడ దివికి దివిజు లరిగి రిట్లు
నిమియు నఖిలజనుల నేత్రాబ్జములయందుఁ, దదనురూపముగను దనరుచుండె. 350

క. ఇమ్ముగ నున్మేషనిమే,షమ్ములు మనుజులకునెల్ల సమకూడెను
నేత్రమ్ములలోపల నేరూ,పమ్ములుఁ బొడసూపఁదొడఁగెఁ బరమమునీంద్రా. 351

వ. ఇవ్విధంబున నిమిచక్రవర్తి విగతదేహుం డగుటం జేసి విదేహుం డనంబరఁగె రాజులేనిరాష్ట్రంబునఁ బ్రజాపీడ పాటిల్లునని గౌతమాదిమహామునీంద్రులు నిమి పూర్వదేహంబునందు దక్షిణభుజంబు మథించినఁ గుమారుండు జననంబునొందె నదినిమిత్తంబున వానికి జనకుండను నామధేయంబుచేసి పట్టంబు గట్టిరి. ఆజనకుని రాజ్యప్రదేశంబు విదేహప్రదేశం బయ్యె నివ్విధంబున. 352

క. మిథిలుం డాజనకునకును, బ్రథమసుతుండయ్యె నానృపాలునిపేరన్
మిథిలాపురి ధరలోపల, నధికశ్రీనుల్లసిల్లె ననఘచరిత్రా. 353

## జనకవంశానుక్రమము.

వ. ఆమ్మిథిలాన్వయసంభవులైనరాజులవంశపరంపరలు వినుము. అట్టి మిథిలునకు నింద్రావసుండును వానికి నందివర్ధనుండును వానికి సుకేతుండును వానికి దేవరాతుండును దేవరాతునకు బృహదుక్థుండును నతనికిఁ దుహావీర్యుండును తుహావీర్యునకు సుధృతియు వానికి ధృష్టకేతుండును వానికి హార్యశ్వుండును నతనికి మరుండును మరునకుఁ బ్రతిధరుండును వానికిఁ గృతిరథుండును వానికి దేవమీఢుండును వానికి బుధుండును వానికి మహాధృతియు నతనికిఁ గృతరాతుండును వానికి మహారోముండును నతనికి సువర్ణరోముండును వానికి హ్రస్వరోముండు నతనికి సిరధ్వజుండునుం బుట్టి రట్టిసిరధ్వజుం డనేకకాలంబు సంతానహీనుండై రాజ్యంబుసేయుచు. 354

తే. పుత్రకామేష్టి సేయంగఁ బూని యతఁడు
యజనభూమి దున్నింపంగ నవనియందుఁ
బుట్టె సీతామహాదేవి భువనమాత
యైనయాదిమహాలక్ష్మియంశమునను. 355

---

349 ఏకమనస్కులు=ఒకమనసుగలవారు - ఒకవిధమైన అభిప్రాయముగలవారు, ఈవుతన్ = ఇత్తురుగాక. 350 తదనురూపముగన్ = దానికితగినట్టు. 351 ఉన్మేషమ్ములు = ఱెప్పలెత్తుటయువాల్చుటయు, సమకూడెను = కలిగెను. పొడచూపన్ = కనఁబడ. 352 మథించినన్ = తరువఁగా,

క. అట్టి సీరధ్వజుసుతుఁడై, పుట్టెఁ గుశధ్వజుఁడు వాఁడు భూరిబలుండై
నెట్టన కాశీనగరము, పట్టమునకు నర్హుఁడయ్యె భవ్యప్రౌఢిన్. 356

వ. అట్టి కుశధ్వజునకు భానుమంతుండును వానికి శతద్యుమ్నుండును వానికి శుచియును వానికి నూర్జనాముండును వానికి సనధ్వజుండును వానికిఁ గృతియును కృతికి రంజకుండును వానికిఁ బురుజిత్తుండును వానికి నరిష్టనేమియు నతనికి శ్రుతాయువు వానికి సుపార్శ్వుండును వానికి సంజయుండును నతనికి క్షేమారియు క్షేమారికి సత్యరథుండు వానికి నుపగూహుండును నతనికి నుపగుప్తుండును నతనికి స్వాగుండును నతనికి స్వాపనుండును వానికి సువర్చసుండును వానికి నసుభాషుండును నతనికి శ్రుతుండును నతనికి జయుండును జయునకు విజయుండును విజయునకు ఋతుండును ఋతునకు నయుండును వానికి వ్యాతహవ్యుండును వానికి ధృతియును నతనికి బహుళాశ్వుండును నతనికి సంతుష్టుండునుం బుట్టి రిది జనకవంశ ప్రకారంబు. 357

తే. జనకవంశంబునృపులెల్ల జనకనామ, ధేయసంజ్ఞల నవనిలోఁ దేజరిల్లి
యాత్మవిద్యాపరాయణు లగుచు ముక్తి, కామినీపరిరంభసౌఖ్యములు గనిరి. 358

క. అని యిట్లు సూర్యవంశం,బున ఘనులగు రాజవరులపుణ్యకథలు నే
ర్పున వినిపించినవాసి,ష్ఠునినందనుతోడ నతఁడు సమ్మతిఁ బలికెన్. 359

క. భానుకులంబున వెలసిన, భూనాథులనెల్ల వింటి భూయిష్ఠముగా
మౌనీంద్ర సోమవంశమ,హీనాథుల వినఁగ నాకభీష్టం బనినన్. 360

శా. సారాచారవివేక శాత్రవమహీశవ్రాతసంహార దో
స్సారప్రాభవబాహులేయ విలసత్సంగీతసాహిత్యవి
ద్యారత్నాకర యానపాలవరగోత్రాధీశ విశ్వంభరా
భారప్రౌఢతరోఢ యచ్యుతపదాబ్జధ్యానపుణ్యోదయా. 361

క. అభ్రేభామరతరుశర, దభ్రసురాహారహీరహరవాగ్వనితా
శుభ్రాంశుకుందచంద్రా, దభ్రామలధాళధళ్యధావళ్యయశా. 362

---

360 భూయిష్ఠముగాన్=సమగ్రముగా. 361 సారాచారవివేక=సత్తైననడవడి నెఱిఁగినవాఁడా, శాత్రవ...సంహార = శత్రురాజులసమూహమునుచంపినవాఁడా, దోస్సారప్రాభవబాహులేయ=భుజబలముయొక్క మహిమచేత కుమారస్వామివంటివాఁడా, విలస...రత్నాకర=ప్రకాశించునట్టి సంగీతము సాహిత్యము అనువిద్యలనురత్నములకు గనియైనవాఁడా, యానపాలవరగోత్రాధీశ-శ్రేష్ఠమైనయానపాలగోత్రమునకు రాజైనవాఁడా, విశ్వంభరాభారప్రౌఢతరోఢ=భూభారమును మిక్కిలి నేర్పుతో వహించినవాఁడా, అచ్యుతపదాబ్జధ్యానపుణ్యోదయా = విష్ణుదేవునియొక్క పాదకమలములను ధ్యానించుటవలనఁబుట్టిన పుణ్యముగలవాఁడా. 362 అభ్రేభ=ఐరావతమును, అమరతరు=కల్పవృక్షమును, శరదభ్ర=శరత్కాలమేఘమును, సురాహార = అమృతమును, హీర=వజ్రమణిని, హర=శివుని, వాగ్వనితా = సరస్వతిని, శుభ్రాంశు = చంద్రుని, కుంద=మొల్లపువ్వులను, చంద్ర=కర్పూరమును, (పోలిన) అదభ్ర=అల్పము

పంచచామరము. కరూశకాశలాటభోటగౌళచోళహూణబ
ర్బరాంగవంగశూరసేనపాండ్యసింధుమండలే
శ్వరోపగీయమానభూరిసత్కథాభివైభవా
ధరాధరాధరోపమానధైర్యశౌర్యశోభితా. 363

గద్యము. ఇది శ్రీనుదమరనామాత్యపుత్త్రహారితసగోత్రపవిత్రసుకవిజనవిధేయ వెన్నెలగంటి సూరయనామధేయ ప్రణీతం బైనయాదిమహాపురాణం బగు బ్రహ్మాండంబునందలి పరాశరసంహితయైన శ్రీవిష్ణుపురాణంబునందు సూర్యవంశంబున మనుకీర్తనంబును శశాదుకథయును దుందుమారుచరితంబును మాంధాతృజన్మంబును సౌభరిపరమగృహస్థధర్మంబున నుండుటయు పురుకుత్సుండు జన్మించుటయు సగరుచరితంబును కల్మాషపాదునివర్తనంబును దాశరథివంశపరంపరాప్రభావంబును నిమిచక్రవర్తి యజ్ఞప్రశంసయు జనకవంశానుక్రమంబును నన్నది పంచమాశ్వాసము.

---

గాని, ధాళధళ్య = తళతళలుగల, ధావళ్య = తెల్లనైన, యశా=కీర్తిగలవాఁడా. 363 మండలేశ్వర=రాజులచేత, ఉపగీయమాన = కొనియాడఁబడుచున్న, భూరి=అధికమైన, సత్కథాభివైభవా= మంచికథల కలిమిగలవాఁడా, ధరా...శోభితా = భూమివలె చలింపనిధీరత్వముచేతను పర్వతమువలె ఉన్నతిగల శూరత్వముచేతను ప్రకాశించువాఁడా.

శ్రీరస్తు.

# శ్రీవిష్ణుపురాణము

## షష్ఠాశ్వాసము.

---




జనకజనకనిభవి
భ్రాజితగాంభీర్యసామరస్యవివేక
వ్యాజజగనబ్బగండవి
రాజితకరుణాకలాప రాఘవభూపా. 1

వ. సకలపురాణవిద్యాధురంధరుం డైనపరాశరుండు మైత్రేయున కిట్లనియె. 2

### చంద్రవంశపురాజులచరిత్రము.

ఆ. అఖిలమునకు స్రష్టయైననారాయణు, నాభిసరసిజమున నలినభవుఁడు
జననమొందె నతని కొనర మానసపుత్త్రుఁ, డై జనించి మించె నత్రిమౌని 3

క. అత్రిమునీంద్రుని దక్షిణ, నేత్రంబున నుదయమయ్యె నిర్మలతేజో
గాత్రుఁడు సుధాకరుఁడు శత, పత్రభవాంశంబుఁ దాల్చి బంధురయశుఁడై. 4

క. బాల్యమున నతఁడు మతిచాం, చల్యం బొకయింతలేక సమధికనిష్ఠా
కల్యాత్ముం డగుచును బా, హుళ్యం బగుతపము పద్మయోనికిఁ జేసెన్. 5

క. వృక్షలతౌషధితతులకు, నక్షత్రంబులకు ద్విజగణంబుల కమృత
ప్రేక్షణకిరణములకు న, ధ్యక్షుఁడుగా వరముఁ గొనియె నబ్జజువలనన్. 6

వ. మఱియు రాజసూయాదిమహాయజ్ఞంబులు నేసి సర్వోత్కృష్టం బైనగృహిత్వంబుఁ గైకొని యమ్మహనీయవైభవంబున నశ్విన్యాదు లైనదాక్షాయణుల నిరువదియేడు గురి వరియించి వారివలన నభిమతభోగము లనుభవించుచు మన్మథాకారం బైన సౌకుమార్యంబునం బెరుగుచుండి. 7

---

1 శ్రీజనక జనకనిభవిభ్రాజితగాంభీర్య సామరస్యవివేక = లక్ష్మీదేవికితండ్రియైన సముద్రుని బోలి ప్రకాశించునట్టి గంభీరభావంబును జనకచక్రవర్తినిబోలి ప్రకాశించునట్టి సామరస్యముతోడి వివేకంబునుగలవాఁడా, జగనబ్బగండ = ఇది బిరుదుమాట, విరాజితకరుణాకలాప = ప్రకాశించునట్టి దయయే ఆభరణముగాఁ గలవాఁడా. 3 స్రష్ట=సృష్టికర్త. 4 శతపత్రభవాంశంబునన్ = బ్రహ్మయొక్క అంశమును, బంధుర = అధికమైన. 5 సమధికనిష్ఠాకల్యాత్ముఁడు = మిక్కుటమైన నిష్ఠతో శుభస్వరూప (నిర్మల) మైనమనసుగలవాఁడు, పద్మయోనికిన్ = బ్రహ్మనుగూర్చి. 6 అమృత ప్రేక్షణకిరణములకున్ = అమృతమును చిలుకుచున్న కిరణములకును. 7 గృహిత్వము = గృహస్థుని

—— తారాశశాంకకథ. ——

క. ముదమున నాశీతాంశుఁడు, త్రిదశగురుం డగుబృహస్పతికి శిష్యుండై
విదితంబుగ శాస్త్రంబులు, చదువుచు వర్తించు నతనిసదనమునందున్. 8
క. వెరవున నీగతి గురునకు, గురుపత్నికి నధికభక్తి కొనసాగంగాఁ
బరిచర్యసేసి చదువుచు, బెరయుచు వర్తించు నతఁడు ప్రియశిష్యుండై. 9
వ. అంత నొక్కనాఁడు. 10
ఆ. దేవవిభునిక్రతువు గావింప దేవలోకమున కేగుచుండి యమరగురుఁడు
చదువు చుండుమనుచుఁ జంద్రునిమందిరాంతరమునందునునిచి యరుగుటయును.
చ. వనజవిరోధియున్ వినయవర్తనుఁడై గురుపత్నికిన్ ముదం
బునఁ బరిచర్యసేయుచు నపూర్వపుశాస్త్రము లభ్యసించుచున్
దనచెలువంబు రూపము నుదారతయున్ లలితాంగి యైన య
వ్వనితకుఁ జెప్పరానివలవంతలు సేయుచునుండెఁ బెంపుతోన్. 12
వ. అప్పుడు. 13
సీ. బంగారుచెఱఁగులపట్టుపుట్టముఁగట్టి కమ్మకస్తురితిలకంబుఁ దీర్చి
ముత్యంపుసరులును మొగపుతీఁగెయుఁబెట్టి యవయవంబుల సొమ్ము లలవరించి
కలికి కన్నులయందుఁ గజ్జలం బమరించి యరజారుకొప్పున విరులు దుఱిమి
తఱుచుగాఁ గర్పూరతాంబూలములుసేసి పాలిండ్లఁ గుంకుమపంకమలఁది
తే. పొసఁగ వజ్రంపుఁ బాపటబొట్టుపెట్టి, రవళిమెట్టెలమ్రోఁతలు రాయడింపఁ
బంచసాయకుమోహనబాణ మనఁగ, నిందుబింబాస్య మెలఁగు నమ్మందిరమున.
వ. ఇట్టి విలాసంబుల నుల్లసిల్లుచున్నంత. 15
క. తారన్ సురగురుదారన్, దారాధిపవదనఁ దరళతారానయనన్
దా రాజసంబుపెంపునఁ, దారాపతి సూచె మోహతత్పరుఁ డగుచున్. 16
క. చూచి మదనాతురుండై, యాచంద్రుఁడు దేవగురునియంగనసొభా
గ్యోచితశృంగారకళా, శ్రీచాతుర్యములఁ జిక్కి చిత్తం బలరన్. 17
సీ. తిలకించు నయ్యింతిచెలువంబుఁ బలుమాఱుఁ గిలికించితాదులగెల్లుచూచుఁ
గోరి యవ్వనిత నిగ్గులుదేఱుపాలిండ్ల నింపారఁగాఁ గౌఁగిలింపఁ గోరు

తనము, దాక్షాయణులన్ = దక్షునికూఁతులను. 9 బెరయుచున్ = అతిశయించుచు. 12 వనజ విరోధియున్ = చంద్రుఁడును, చెలువంబు = సౌందర్యమును, వలవంతలు = మోహములు, పెంపుతోన్ = గౌరవముతో. 14 పుట్టము=వస్త్రము, కమ్మ=మధురమైన, కలికి=విలాసయుక్తములైన కజ్జలంబు=కాటుకను, తుఱిమి = కోపలచొప్పించి-ముడిచి, పాలిండ్లన్ = స్తనములయందు, రవళి= ధ్వనించుచున్న, రాయడింపన్ = ఒరయఁగా - హెచ్చఁగాననుట, ఇందుబింబాస్య = చంద్రబింబమునుబోలిన మొగముగలది. 16 తరళతారానయనన్ = తిరుగుచున్న నల్లగుడ్లతోఁగూడిన కన్నుగలదానిని. 17 మదనాతురుండు = మన్మథునిచేపీడింపఁబడినవాఁడు. 18 తిలకించున్ = చూచును, కిలికించితాదులన్ = కిలికించితము మొదలుగాఁగల శృంగారచేష్టలను [కిలికించితము=

గరిమతో నాలేమ సరససల్లాపంబు లాలించి యేకాంతమాడఁ గోరుఁ
దమకంబుతోడ నత్తపసీశిరోమణియధరసుధారసంబానఁ దివురు
ఆ. నింతి యవయవముల నెసఁగు సౌందర్యంబుఁ, గన్నులారఁ జూచుకాంక్షతోడ
మదనబాణభిన్నహృదయయై యాతని, తలఁపుఁ దెలిసి తగులు దలఁపుచేసి. 18

సీ. ఎలనాఁగ దావచ్చి యప్పటప్పటికి సమేలంపుమాటల మేలమాడుఁ
బలుమాఱుఁ దన మ్రోల కలికిసేఁతలకోడి వలకారితనమున వన్నెఁ బెట్టు
నన్యాపదేశంబులాడి నెచ్చెలులచేఁ బ్రియమార నేమేనిఁ బెట్టిపంపు
నేకాంతమైనచో నెవ్వరు వినకుండ నూరకవచ్చి నర్మోక్తులాడు
తే. గబ్బిగుబ్బచన్నుఁగవమీఁదిపయ్యెద, జాఱద్రోచు తీఁగె సాగనవ్వ
విరులుఁ జందనంబు వీడెంబు నూరక, యడుగ నంపు జారయై మృగాక్షి. 19

వ. ఇవ్విధంబున నన్యోన్యసరససల్లాపంబులవలనం బరస్పరస్నేహకుతూహలంబు లంత
కంతకుం బెరిగివచ్చుచున్న నొక్కనా డేకాంతంబున. 20

ఉ. మేలము లాడుచుం దనసమీపమునన్ విహరించుచున్న య
బ్బాలికగుబ్బచన్నుఁగవపై యరజాఱినయుత్తరీయపుం
జేలమువట్టి రాఁదిగిచి చెక్కులు నొక్కుచు బుజ్జగించి హే
రాళము లైనమోహపువిరాళితనంబుల నాతఁ డిట్లనున్. 21

క. తరళాక్షి నీతిశాస్త్రము, లిరవుగ గురువలనఁ బెక్కులెఱిఁగితి నింకన్
గురుపత్ని వైననీచే, వరుసన్ మరుశాస్త్ర మెఱుఁగవలయున్ నాకున్. 22

చ. అనవుడు లేఁతనవ్వు వదనాంబురుహంబునఁ జెంగలింప న
వ్వనరుహనేత్రకన్నుఁగవ వాలిక తెప్పలగప్పి పెద్దయుం
బెనఁగొన మన్మథుండు పిరువీఁకులు సేయఁగఁ దత్తరించుచుం
దనువునఁ గ్రొత్తముత్పులకదంతురపఙ్క్తులు నివ్వటిల్లఁగన్. 23

క. చిత్తజుచేఁ దలిరాకుల, విత్తైతనధైర్యమెల్ల వెడల నడిచి యా

---

సంతోషరోషాశ్రుభయాదుల కలయిక], గెల్లుచూచున్=నిక్కిచూచును, నిగ్గులుదేఱు = నిగనిగలాడు, ఏకాంతము = రహస్యము, అనన్=త్రాగ, తివురున్ = యత్నించును, భిన్న=భేదింపఁబడిన, తగులు= పొందునట్టి. 19 సమేలంపు = కలగలుపుగల, మేలమాడున్ = సరసములాడును, కలికిసేఁతలకున్=విలాసచేష్టలకు, వలకారితనమునన్ = మోహముగల స్వభావముతో, వన్నెబెట్టున్ = అలంకరించుకొనును. అన్యాపదేశంబులు = వేఱొకదానిజూపి తనయభిప్రాయమును దెలుపునట్టిమాటలు, నర్మోక్తులు = శృంగారహాస్యాస్పదములైన ప్రియవాక్యములు, తీఁగసాగన్=దీర్ఘధ్వనికలుగునట్టుగా. 21 మేలములు = పరిహాసపుమాటలు, చేలము = వస్త్రము, విరాళితనంబులన్ = ఆసక్తతలతో. 22 ఇరవుగన్=విశదముగా. 23 చెంగలింపన్ = వ్యాపింపఁగా, వాలిక=వాలుగల, పిఱువీఁకులు = పీఁకుపీఁకిళ్లు. ముత్పులకదంతురపఙ్క్తులు=సంతోషమువలనఁ గలిగినగగుర్పాటుయొక్క యెక్కుడైన చాళ్లు. నివ్వటిల్లఁగన్ = అతిశయింపఁగా. 24 తలిరాకులవిత్తై = చిగురుటాకుల పరంపరగలదై -

మత్తేభగమన మిగులం, దత్తరపడి సమ్మదమునఁ దమకించుటయున్. 24

క. పరకాంత బ్రాహ్మణస్త్రీ, గురునాథునిభార్య దీనిఁ గూడిన మిగులన్
దురితంబువచ్చునని మదిఁ, బరికింపక విధుఁడు తారఁ బైకొని కలసెన్. 25

వ. ఇవ్విధంబున నయ్యిరువురు నన్యోన్యసరససంభోగంబులవలనం జొక్కి వర్తించుచుండి రంత. 26

ఉ. చిక్కులుపడ్డ వెండ్రుకలు చిక్కినలంగినకమ్మపూవులుం
జక్కెరమోవులుం గుసుమసాయకుముద్రలు చిట్లుగందపుం
బక్కులతోడి దేహములుపాయనిమోహములున్ సమంబులై
చొక్కపుజారదంపతులు చూడఁ బ్రకాశతనొంది రెంతయున్. 27

వ. అంత నొక్కనాఁడు రోహిణీకాంతుండు గురుకాంత కిట్లనియె. 28

క. మగువా మనచేతలు నీ,మగనికి వినఁబడినఁ గడుబ్రమాదము వచ్చున్
జగముల మిగులఁ బ్రకాశం, బగుచున్నది యిచట నుండ నగునే మనకున్. 29

వ. అనిన నతని నవలోకించి. 30

క. ఎక్కడిమగఁ డెక్కడిబ్రతు, కెక్కడిసంసారచింత లేటికి నాకుం
దక్కక నీబిగికౌఁగిట, నొక్కటియై రతుల సలుపకుండినఁ జంద్రా. 31

క. నీవెంటఁ దోడునీడై, నేవచ్చెదఁ దోడుకపొమ్ము నీకును నాకున్
దైవంబు లంకెనేసెను, జైవాతృక పంచశరుఁడు సాక్షిగ మనకున్. 32

వ. అని యిట్లు మరులేచిపలికిన నాకమలవైరియుఁ గమలలోచనం దోడ్కొని నిజనివాసంబునకుంబోయి నిరుపాధికంబులును నిరాతంకంబులునైన యభిమతభోగంబు లనుభవించుచుండె నంత. 33

చ. అమరగురుండు దేవపతియాగము సాంగముగా నొనర్చి సం
భ్రమమున నెల్లవారు బహుమానము సేయఁగ వేడ్కతో నిజా
శ్రమమున కేగుదెంచి వ్యభిచారితనంబునఁ జంద్రువెంటమా
రుమనువుతార వోవుటయు రోసి నిరంతరదుఃఖితాత్ముఁడై. 34

చ. సురగురుఁ డాలిఁ గోలుపడి సోముఁడు సేసినధౌర్త్యమంతయున్
సురపతితోడఁ జెప్పిన వృషుం డతిభీషణకోపవేష్టితా

---

చిగుళ్లను కత్తులచేతి బాధచే చలించినదై యనుట, తమకించుటయున్ = వేగిరపడఁగా. 25 పరికింపక = విచారింపక, విధుఁడు = చంద్రుఁడు, పైకొని=పైఁబడి. 27 కమ్మ=పరిమళముగల, చక్కెరమోవులు = చక్కెరవలె మాధుర్యముగలయధరములును, ముద్రలు = చిహ్నములు, పక్కులతోడి= పెళ్లలతోఁగూడిన. 29 చేతలు=చేష్టలు, ప్రకాశంబు=ప్రసిద్ధము. 32 తోడుకపొమ్ము=తోడుకొనిపొమ్ము, జైవాతృక = చంద్రుఁడా. 33 మరులేచి=మోహమతిశయించి, నిరుపాధికంబులు = చింతలేనివి, నిరాతంకంబులు = భయములేనివి, సాంగముగాన్ = తుదముట్ట. 35 కోలుపడి=పోఁగొట్టుకొని, ధౌర్త్యము=ధూర్తత్వము, వృషుండు = ఇంద్రుఁడు, భీషణకోపవేష్టితాధరుఁడు=దారుణ

ధరుఁ డగుచున్ మహాత్ములగు తాపసులన్ బిలిపించి యాసుధా
కరుఁ డొనరించినట్టి కొఱగామి సమస్తముఁ జెప్పి యిట్లనున్. 35

క. మీరు సుధాకరుపాలికి, గారవమునఁ బోయి బుద్ధిగాఁ జెప్పి పర
ద్వారం బొనరించిన యా, వీఱిఁడి గోపించి తార విడిపింపుఁ డొగిన్. 36

తే. అని నియోగించిపంచిన యమ్మునీంద్రు, లమృతకిరణునిపాలికి నరుగుదెంచి
యతనిచేతసంభావన లర్థిఁ గాంచి, ప్రియముపుట్టంగ నెంతయుఁ బెద్దచేసి. 37

మ. నవశృంగారవిలాసముల్ కువలయానందప్రభావంబులున్
దివిజాభీష్టఫలప్రదానగుణముల్ దీపించు నీసత్పథ
వ్యవహారస్థితియుం దొఱంగి గురుభార్యన్ మోహివై తెచ్చి నాఁ
డవు పాపంబులు నీచరిత్రములు చూడన్ రోహిణీవల్లభా. 38

ఉ. భూసురకాంత నెత్తుకొనిపోవుట దోషము యామినీశ నీ
చేసినదుర్వివేకములు సెప్పఁగ నొప్పము లిట్టిసేఁతకున్
వాసవుఁ డాదిగా దివిజవర్గము మిక్కిలి కోపగించినా
రీసతి నీకు నేల జగ మింతయు నీ కపకీర్తి సేయఁగన్. 39

చ. అనుటయు రోహిణీరమణుఁ డమ్మునినాథులఁ జూచి దేవమం
త్రి నెలఁత నిట్లు నేను గొనితెచ్చినమాత్రన తప్పుచేసి య
య్యనిమిషభర్త మిమ్ము నిట కంపెనఁటే విడిపింప నింక నే
మనిమిముదూఱువాఁడ నహహా తనచేఁతలు మీకు వింతలే. 40

ఉ. కాయజుచేత గాసిఁబడి గౌతముభార్యకుఁ బోయి కొక్కొరో
కో యనికోడికూఁత లొగిఁ గూసి మునీంద్రునిచేత శప్తుఁడై
పోయినవజ్రిమేటిదొరవోలె బృహస్పతిపత్నికై ననున్
రోయఁగనాడ నేల తనరోఁతలు లోకమువారు నవ్వఁగన్. 41

తే. అనుచు నింద్రునిమర్మంబు లైనయుల్ల, సములు పెక్కాడి యాబృహస్పతివధూటి

మైన కోపముచేత చుట్టఁబడిన (అదరుచున్న) పెదవులుగలవాఁడు, కొఱగామి = చెఱుపు—దుష్కార్యము. 36 పరద్వారంబు = అన్యమార్గమును - అక్రమమును, వీఱిఁడిన్=దుష్టుని, ఒగిన్=క్రమముగా. 37 సంభావనలు = మర్యాదలను. 38 కువలయానందప్రభావంబులు = భూమండలమునకు సంతోషము పుట్టించునట్టి మహిమలు, కలువలకు వికాసముగలుగఁజేయునట్టి మహిమలు అని యర్థాంతరము. దివిజాభీష్టఫలప్రదానగుణములు = దేవతలు కోరినఫలములను ఇచ్చునట్టి గుణములు - దేవతలకోరికదీర అమృతమును వర్షించునట్టి గుణములను, సత్పథవ్యవహారస్థితి = మంచి మార్గమును అనుసరించినవాఁడు అనువాడుకయొక్క రీతిని - నక్షత్రవీథియందు మెలఁగుటను అని యర్థాంతరము. 39 యామినీశ = చంద్రుఁడా, దుర్వివేకములు = వివేకముమాలినపనులు, ఒప్పములు=చెడ్డవి. 40 తప్పుచేసి=తప్పగా నేర్పఱచి, అంపెనఁటే=పంపెనా, తనచేఁతలు=ఆయింద్రుని చేష్టలు. 41 కాయజుచేతన్=మన్మథునిచేత, శప్తుఁడై=శపింపబడినవాఁడై. 42 ఉల్లసములు=

విడువఁ బొండన్నఁ గడుసిగ్గుపడి మునీంద్రు, లమరవల్లభుపాలికి నరుగుదెంచి. 42

చ. హిమకరుచందమంతయును నేర్పడఁ జెప్పిన నప్పురందరుం
డమరగణంబు గొల్వఁగ బృహస్పతిఁ దోడ్కొని సంభ్రమంబునన్
గమలజుపాలికేగి గురుకాంతవిధంబును జంద్రు దుశ్చరి
త్రముఁ దెలియంగఁ జెప్పినఁ బితామహుఁ డెంతయుఁ గోపదీప్తుఁడై. 43

తే. పెద్దల మునులఁ గొందఱఁ బిలిచి మీరు, వోయి యాశీతకరునకు బుద్ధిగలుగ
నేను జెప్పితినని చెప్పి యానిలింప, గురునియిల్లాలి విడిపించికొంచు రండు. 44

క. అని పనిచిన వారు రయం,బున నాహిమకరునికడఁకుఁబోయి పయోజా
సనువాక్యంబుల పద్ధతి, వినిపించి సురేజ్యుదార విడువు మనుటయున్. 45

ఉ. ఇంచుక నవ్వి శీతకరుఁ డిట్లనుఁ బద్మభవుండు చెప్పి పు
త్తెంచినమాటలన్నియును దెల్లముగాఁ బరికించి వింటి నీ
చంచలనేత్ర నే విడువఁజాలను గాదనెనేని తన్నుఁ బు
ట్టించినదైవమైన ననుఁ డీకొని యీపని మాన్పనోపునే. 46

తే. అనిన వార లుదాసీనులై పయోజ, భవునిపాలికి నరుదెంచి పద్మవైరి
బలిమిఁ జెప్పిన నేమియుఁ బలుకకాతఁ, డూరకుండెను మఱియొక యుపమలేక.

ఉ. అంగిరసాదులైనమును లగ్గురుతోఁ బురుహూతుఁగూడి య
య్యంగజవైరిపాలికి రయంబునఁబోయి నమస్కరించి య
వ్వెంగలి యైనచంద్రు నవివేకము గీష్పతిపత్ని యైనతా
రాంగనవర్తనంబుఁ దెలియన్ వినిపించిన నుగ్రుఁ డుగ్రుఁడై. 48

మ. దివిజానీకసమేతుఁడై చటులవృత్తిం జంద్రలోకంబుపై
నవలీలం జనుదెంచె నప్పు డతఁ డుద్యత్కోపసంప్రీణిత
ప్రవణోదగ్రభయంకరాకృతిదలిర్పన్ వీరసేనాయుతుం
డవుచున్ బిట్టెదిరించి తాఁకెను ద్రిలోకాధీశుతో నీశుతోన్. 49

వ. ఇవ్విధంబునఁ జంద్రశేఖరచంద్రులకు మహాఘోరయుద్ధం బయ్యెనప్పుడు. 50

చ. సురగురుతోడివైరమున శుక్రుఁడు కుంభనికుంభముఖ్యశం
బరబలికాలనాభవృషపర్వపురోగములైనరాక్షసే

---

మర్మభేదములైన పరిహాసపుమాటలు. 44 నిలింపగురుని = బృహస్పతియొక్క. 45 సురేజ్యుదారన్ = బృహస్పతిభార్యను. 46 పుత్తెంచిన=పంపిన, తెల్లముగాన్ = విశదముగా. 47 ఉదాసీనులు = అనాదరము చేయఁబడినవారు, ఉపమ=ఉపాయము, 48 అంగజవైరి = శివునియొక్క, వెంగలి=మూర్ఖుఁడు, గీష్పతి=బృహస్పతి, ఉగ్రుఁడు=శివుఁడు-భయంకరుఁడు. 49 దివిజానీక=దేవతాసేనతో, చటులవృత్తిన్ = పరుషవ్యాపారముతో, ఉద్యత్కోప...రాకృతి = అతిశయించిన కోపముచేత చక్కఁగా తృప్తినొందింపఁబడి యాదరింపఁబడుచున్న మిక్కిలి భయంకరమైన యాకారము - అధికకోపముచే నైనభయంకరమైన యాకృతి, తలిర్పన్ = వికాసమును వహింపఁగా

శ్వరచతురంగసైన్యములఁ జంద్రునకుం బటుసంగరక్రియా
పరిణతి దోడుసూపుటకుఁ బంపె సహాయముగాఁగనుద్ధతిన్. 51

మ. జయకాంతాపరిరంభకౌతుకములన్ శర్వామృతాంశుల్ జగ
ద్భయదాకారవిహారసంగరకళాపాండిత్యముల్ సూపుచు
న్నయెడన్ బంకజసంభవుం డమరగంధర్వాప్సరోయుక్తుఁ డై
రయ మేపారఁగవచ్చి యాఘనుల సంగ్రామంబు వారించుచున్. 52

క. హిమకరుని దోడుకొని చని, క్రమ మొప్పఁగ బుద్ధిచెప్పి కామాతురభా
వము మాన్పి తారఁగొని చని, యమరాచార్యునకు నిచ్చె నభవుఁడు మెచ్చన్.

వ. అప్పుడు వాచస్పతి యాసన్నప్రసవగర్భవతి యైన తనభార్యంజూచి మదీయక్షే
త్రంబున నన్యవీర్యం బుదయించు నిక్కుమారుని విసర్జించి రమ్మనినఁ బతివచ
నం బలంఘనీయం బగుటం జేసి యప్పరమపతివ్రత యీషికాస్తంబమధ్యంబున
నక్కుమారునిం గనిన. 54

తే దివ్యతేజోవిలాససందీప్తుఁ డగుచు, మోహనాకారమున నున్న ముద్దుకొడుకుఁ
జూడ ననిమిషగురునకు సోమునకును, బుత్రమోహంబు లగ్గలంబుగఁ దనర్చె. 55

తే. వీఁడు నాసుతుండు వీఁడు నాముద్దుల
కొడుకుఁ గుఱ్ఱ యనుచుగురుఁడు విధుఁడుఁ
బూని యొకరికొకరు పుత్రమోహంబున
జగడమాడుచున్న సమయమునను. 56

క. దేవతలు మునులు తారా,దేవిన్ వీక్షించి వీఁడు దేవగురుసుతుం
డో వనజారిసుతుండో, నీవింతయుఁ దెలియఁజెప్పు నిక్కం బనినన్. 57

క. నలువురు నాలుగుదిక్కులఁ, దలలెత్తుక చూడ మగఁడు దలవంపఁగ నీ
చులుకఁదన మింక నేమని, పలుకుదు నని చెప్పి సిగ్గుపడియుండుటయున్. 58

వ. అప్పు డప్పితామహుం డప్పువ్వుఁబోణిం బుజ్జగించి యిట్లనియె. 59

క. సిగ్గేల నీకు నీపని, యెగ్గని పాటించి యాడ రెవ్వరు నీకున్
లగ్గగు నీమగఁడును మది, సెగ్గింపం డెవ్వ రిట్లు చేయరు తన్వీ. 60

ఉ. సోమునిఁ జూచియున్ గురునిజూచియుఁ బక్షపుమాట మాను తే
జోమహనీయమూర్తి యగుచుం జెలువొందెడు నీకుమారుఁ డీ

---

51 పటుసంగరక్రియాపరిణతిన్ = సమర్థమైన యుద్ధవ్యాపారముయొక్క పరిపూర్తిచేత. 52 పరిరంభ = ఆలింగనమువలని, శర్వామృతాంశులు = శివుఁడును చంద్రుఁడును, సంగరకళా=యుద్ధమనెడి విద్యయందలి, ఏపారన్ = అతిశయింప, 54 ఆసన్న = సమీపించిన, అలంఘనీయము = దాఁటఁదగనిది, ఈషికాస్తంబమధ్యంబునన్ = కసవుగంటనడుమ. 55 అగ్గలంబుగన్ = అధికముగా. 60 ఎగ్గు = కీడు - దోషము, లగ్గు = మేలు - శుభము, సెగ్గింపడు = రోఁతపడఁడు.

సోముని పుత్త్రుఁడో గురునిసూనుఁడో నాకెఱిఁగింపుమన్న నీ
సోమసుతుండు గాని గురుసూనుఁడు గాఁడని పల్కె నేర్పడన్. 61

వ. ఇవ్విధంబునం బలికినయప్పలుకులు విని బృహస్పతి కుమారునియందు మోహంబు విడిచి పత్నీసమేతుండై యరిగె మహాదేవపితామహప్రముఖులైనదేవర్షిగణంబులు నిజనివాసంబులకుం బోయిరి. చంద్రుండును నక్కుమారు నాలింగనాదివిశేషంబుల గారవించి బుధుం డనునామధేయంబుచేసి నిజభార్య యైనరోహిణీదేవి కిచ్చిన. 62

తే. రోహిణీదేవి యక్కుమారునకుఁ గన్న, తల్లికంటెను మిగులఁ దాత్పర్యవృత్తి
నడపి పెంచుచు నుపలాలనంబుచేసెఁ, జంద్రుఁ డెంతయు నాత్మలో సంతసిల్ల. 63

ఆ. బుధుఁడు తపముచేసి యధికతేజోనిధి, యగుచు గ్రహపథంబునందు నిలిచె
నతఁడు మనుతనూజయగు నిళయందుఁ బు,రూరవుండు నాఁ గుమారుఁ గనియె.

పురూరవుండు ఊర్వశీసక్తుండై విహరించుట.

సీ. భూభరణక్రియాస్ఫురణఁ గుంభీనసక్రోడేభములనైనఁ గొంచెపఱచు
దానవైఖరిఁ గామధేనుకల్పద్రుమచింతామణులనైన సిగ్గుపఱచు
సౌందర్యమున సురేశ్వరతనూభవసోమపంచబాణులనైన భంగపఱచు
విమలధైర్యంబున హిమమహీధరమేరుమందరాద్రులనైనఁ గ్రిందుపఱచు
తే. దీవులేడింటఁ దనయాజ్ఞ దేజరిల్ల, నిజచరిత్రంబు భావిభూభుజులకెల్ల
మేలుబంతిగా వసుంధర యేలుచుండె, భూరివిక్రముఁ డైనపురూరవుండు. 65

వ. అట్టి పురూరవుండు నిజరాజధాని యైనప్రతిష్ఠానపురంబున రాజ్యంబు సేయుచుండి యొక్కనాఁడు. 66

సీ. మందారచందనమాకందశాకోటజంబీరనీపకదంబతరులు
మల్లికామాధవీమాలతీచంపకకుందాదిసంఫుల్లకుసుమలతలు
కలనాదకలహంసికాచక్రవాకవిస్తారకాసారకాసారములును
గీరపారావతశారికామృడభంగపరపుష్టపరితుష్టపరిచితంబు
తే. మందమలయానిలోద్ధూతమానసుమప, రాగధూసరితాకాశభాగతలము
గలిగి వనదేవతాసముత్కరమనోభి, రామమై యొప్పుచున్న యారామములను. 67

వ. ఇట్టివినోదంబులం దలిగి వినోదించుచున్న సమయంబున. 68

సీ. తనకొప్పులోనికమ్మనిపూవు తావులసొబగు దిక్కులనెల్ల సోఁడుముట్టఁ
దననిడువాలు నేత్రముల యల్లార్పుచూపులు పాంథజనులగుండెలు పగుల్పఁ

---

65 కుంభీనసక్రోడేభములన్=ఆదిశేషుని ఆదివరాహమును అష్టదిగ్గజములను, సురేశ్వరతనూభవసోమపంచబాణులన్ = జయంతుని చంద్రుని మన్మథుని. 67 శాకోట = వెల్లతేఁకుచెట్టు, నీప=కడపచెట్టు. 69 సొబగు=బాగు, సోఁడు=బ్రహ్మరంధ్రము, చిమ్మచీఁకట్లు = అధికమైన చీఁకట్లు, బెర

దనమేని మెఱుఁగుల ధాళధళ్యంబుల మించు చూడ్కులు మిఱుమిట్లు గొనఁగఁ
దనచన్నుఁగవయొప్పిదము మన్మథుని రాజ్యలక్ష్మీవిలాస మలంకరింపఁ

తే. దనవిలాసయానంబును దర్పకాంధ
కార మొక్కటఁ జిమ్మచీఁకట్లు గ్రమ్మఁ
జెలులుఁ దానును మోహనశ్రీలు బెరయ
నింద్రుపురినుండి యూర్వశి యేగుదెంచె. 69

వ. ఇవ్విధంబునవచ్చి వినయావనత యగుచు బాలరసాలంబుమ్రోలం గ్రాలుచున్న కమ్మపూఁదీఁగెచందంబున సమీపంబున నున్నయన్నాతిం జూచి పురూరవుం డిట్లనియె. 70

ఉ. ఎవ్వరిదాన వీవు జలజేక్షణ నీదగువాలుచూపులున్
నవ్వవొలంకుమోము గమనంబు విలాసము కల్కిపల్కులున్
జవ్వన మొప్పిదంబు వలిచన్నులచెన్నును నీక యొప్పు నీ
మవ్వముఁ జూడ వారసతిమార్గము దోఁచుచునున్న దెంతయున్. 71

చ. అనుటయు నింతి యానృపకులాగ్రణిరూపవిలాసరేఖలున్
వినయవిధేయవాక్యములు వెన్నెలతేటమొగంబుఁ బ్రాభవం
బును బెనఁగొన్న తేజమును బుణ్యమయం బగుచున్న దేహముం
గనుఁగొని పంచబాణవిశిఖంబులతాఁకున కోర్వ కిట్లనున్. 72

క. ఉర్వీశతిలక నాపే, రూర్వశి నొకపనికిఁగా దివౌకసమహిమల్
సర్వమును విడిచి వచ్చితి, నుర్వర నొకకొంతకాల ముండెదు కొలఁకున్. 73

క. నినుఁజూడఁ గోరివచ్చితి, ననుటయు నారాజచంద్రుఁ డయ్యిందునిభా
ననఁ దగిలి పాయనేరక, మనసిజబాణములయందు మగ్నుండయ్యెన్. 74

క. అలఘుప్రగల్భవచనం,బుల నూర్వశిఁ జూచి యబల పుష్పాయుధుచే
నలజడిఁబెట్టక నాతోఁ, గలిసి వినోదింపవలయుఁ గామసుఖములన్. 75

వ. అనిన నక్కాంత మహీకాంతు నవలోకించి నాయందు నీకుఁ బ్రియంబుగల దేనియు నాసమయంబు వినుము నాకు నురణకద్వయపోషణం బవశ్యం బైన వ్రతంబు. ఈయురణకంబులు రెండును నీచేత నపనేయంబులు గాకుండవలయు నగ్నరూపంబుననున్న నిన్నవలోకించినప్పుడె పాసిపోవంగలదాన నాకు ఘృతంబ యాహారంబుగా నుండునది యని సమయంబుచేసిన నొడంబడి యమ్మానవపతి యమ్మానినితోడ సురతసుఖంబు లనుభవించుచు. 76

యన్=పొందఁగా. 70 బాలరసాలంబు మ్రోలన్=లేఁతలియ్యమామిడిచెట్టునొద్ద, క్రాలు=వర్తించు. 71 తొలంకు = చిందు, కల్కి=మనోజ్ఞమైన, వలి=వలుదలైన, మవ్వము = ఒప్పిదము - విధము. 73 దివౌకస = దేవతాసంబంధియైన. 75 ప్రగల్భ=ప్రౌఢమైన, అలజడి = సంకటము. 76 ఉరణకద్వయ = గొఱ్ఱెపిల్లలజంటయొక్క, అపనేయంబులు=పోఁగొట్టఁదగినవి, నగ్నరూపంబునన్ =

మ. లలితానేకవినోదముల్ సలిపెఁ గైలాసోపకంఠంబునం
దలకం జైత్రరథంబునం గమలషండాఖ్యప్రదేశంబులన్
విలసద్దివ్యమనస్సరోవరములన్ విశ్రాంతరమ్యస్థలం
బుల నాభూపతి యేకషష్టిసమ లాపూర్ణేందుబింబాస్యతోన్. 77

తే. వనజనేత్రయుఁ బ్రతిదినవర్ధమాన, మగుతదుపభోగసుఖములఁ దగిలి పాయ
లేక నృపుఁగూడి విహరించె లెక్కలేక, బహువినోదంబులందు నిస్పృహ జనింప.

క. ఊర్వశి సురపురినుండక, యుర్విఁ బురూరవునిఁ గూడియున్న కతన గం
ధర్వవరసిద్ధసాధ్యసు,పర్వులవిభవములు గొంత పాడై యుండెన్. 79

వ. అంత విశ్వావసుం డనుగంధర్వుం డూర్వశీపురూరవులసమయం బెఱింగి వారి
కన్యోన్యవియోగంబుసేయువాఁడై నిశాసమయంబున నేకాంతసమేతులై యున్న
వారికడకు వచ్చి యొక్కయురణకంబు నపహరించుకొనిపోయిన. 80

ఉ. ఆయజపోతకంబు దివియందు నిరంతరవిహ్వలధ్వనిం
గూయఁగ వేల్పుకొమ్మ నృపకుంజరుఁగన్గొని వీఁడె యెవ్వడో
మాయలు పన్నిమత్ప్రియకుమారకు నెత్తుకపోయె నీవు వే
పో యిట తెత్తుగా కనిన భూవరుఁ డేమియుఁ బల్కఁ డింతితోన్. 81

తే. ఏకవస్త్రంబు ధరియించి యిందువదనఁ, గలసి యేకాంతసుఖకేళి నలరువిభుఁడు
నగ్నవేషంబుతోఁ జనినను మృగాక్షిఁ, గాంచి తనుఁబాయునో యని కదలకుండె.

క. వెండియు గంధర్వవరుల్, రెండవ యురణకము నపహరించి దివికి ను
ద్దండత నరిగిన ధరణీ, మండలపతిఁ జూచి దివిజమానిని కినుకన్. 83

క. నాపుత్రకు లభియాతుల, చేపడి యఱవఁగ నుపేక్షసేసితి నీ కీ
కాపురుషత్వం బేటికిఁ, బ్రాపించె ననాథవృత్తిపాటిలె నాకున్. 84

వ. అని బహుప్రకారంబుల నార్తకారిణియై యురణకనిమిత్తంబుగా బెట్టిదంబులు
పలుకుచున్న నన్నరేంద్రుండు కోపించి యంధకారంబు గావున నయ్యింతి నాది
గంబరత్వంబుఁ జూడ దని ఖడ్గంబుఁగొని దురాత్మా పోకు పోకుమని యదలిం
చుచు వెనుదగలి గగనంబునం జనుసమయంబున గంధర్వు లతిప్రకాశంబుగా
నుజ్జ్వలం బైనవిద్యుద్భ్రమంబుఁ గల్పించిన. 85

తే. నగ్నవేషంబుతోఁ జను నరవరేణ్యుఁ, గన్నులారంగఁ జూచి యాకమలవదన
మున్ను చేసినసమయంబు మొగిఁ దలంచి, రోసి యాతనిఁ జాలించి పాసి చనియె.

---

దిగంబరత్వముతో. 77 ఉపకంఠంబునందు = సమీపమునందు, ఏకషష్టిసమలు = అఱువదియొక్క యేండ్లు. 78 నిస్పృహ = అపేక్షలేమి. 80 సమయంబు = ఏర్పాటు, వియోగంబు = ఎడఁబాటు. 81 అజపోతకంబు = గొఱ్ఱెపిల్ల, విహ్వలధ్వనిన్ = పరాధీనతచేతనైన ఆర్తధ్వనితో, వేల్పుకొమ్మ = దేవతాస్త్రీయైన యూర్వశి. 84 అభియాతుల = పగవారియొక్క, కాపురుషత్వంబు = కుత్సితపురుషునితనము, 85 విద్యుద్భ్రమంబున్ = మెఱుపుయొక్క చలనమును

వ. అంత. 87
క. గంధర్వు లరణకముల వ,సుంధరపైఁ బాఱవైచి సురపురమునకున్
బంధురగతి నేగిరి నృప,సింధురుఁ డాశాబకములఁ జేకొని వేడ్కన్. 88
తే. మగిడి శయ్యకు నరుదెంచి మగువ నచట, వెదకి కానక యత్యంతవిరహతాప
వేదనలదీనచిత్తుఁడై వెఱ్ఱివాఁడుఁ, బోలెఁ దనుఁదానెఱుంగక భూవిభుండు. 89
వ. దిగంబరవేషంబునఁ బరిభ్రమించుచుండె. 90
సీ. పుష్పాదిఁగెలఁజూచి పొలఁతుక నూఁగారుతనువల్లియనిడాయఁదలఁపునేయు
బాలపల్లవము లేర్పడఁజూచి మృగనేత్రయధరామృతం బని యానఁబోవుఁ
గుసుమగుచ్ఛముల పెక్కువ చూచి లలితాంగి కుచకుట్మలములని గోళ్లనదుము
గండుతుమ్మెదపిండుఁ గనుఁగొని తన్వంగి నెఱిమిఱుకొప్పని నిమురఁ జూచుఁ.
తే. గోకిలాలాపములు విని కొమ్మ దన్నుఁ, బిలిచెనో యని యాలించుఁ బ్రేమతోడ
మన్మథాతురుఁ డగుచు నున్మత్తవృత్తి, నతఁడు వనవాటికలయందు నభిచరించు
వ. ఇవ్విధంబున నారాజమన్మథుం డున్మత్తవేషంబునఁ బరిభ్రమించుచు నొక్కనాఁడు
కురుక్షేత్రంబున నంభోజసరోవరతీరంబున సఖీజనం బైనయప్సరోంగనాచతు
చ. ష్టయసమేతయై విహరించుచున్న యూర్వశిం బొడగాంచి 92
వదనము చెంగలింప నిడువాలికకన్నులవాడు దేరస
మ్మదమును నుబ్బునుం బెరయ ముత్పులకల్ తనువల్లి నిండఁగన్
గదిమినపంచసాయకవికారము లించుక కట్టిపెట్టియ
మ్మదవతిఁ జేరి యానృపకుమారుఁడు కౌఁగిటఁజేర్చి యిట్లనున్. 93
ఆ. పువ్వుఁబోణి వినుము పువ్వునుదావియుఁ, బోలెఁ గుసుమబాణకేళిఁ దేలు
చుండి నెపములేక యూరకనన్నేల, విడిచిపుచ్చి తింత వెఱ్ఱిఁజేసి. 94
క. ఉన్మత్తవేషమున నే, నున్మాదముఁబొంది తిరుగుచున్నాఁడను నీ
సన్మాన మింతగలిగిన, మన్మథతాపంబు లెల్ల మాను లతాంగీ. 95
క. అనిపలుకుచున్న బుధనం,దనునిపయిం గరుణపుట్టి ధవళాయతలో
చన సఖులు దన్నుఁ దూఱఁగ, వినయవిధేయముగ గారవించుచుఁ బలికెన్. 96
క. ఈజగమంతయు నేలెడు, రాజవు నీకేల దైన్యరస మీవిరహ

88 నృపసింధురుఁడు = రాజశ్రేష్ఠుఁడు, శాబకములన్=పిల్లలను. 90 పరిభ్రమించుచున్ = తిరుగుచు. 91 పెక్కువ=ఆధిక్యమును, కుట్మలములు=మొగ్గలు, గండు=బలిసిన, పిండు=సమూహము, తన్వంగి = కృశాంగముగల యూర్వశియొక్క, నెఱి = వక్రత, అభిచరించున్ = అంతటతిరుగును. 92 ఉన్మత్తవేషంబునన్ = పిచ్చివాని వేషముతో, అంభోజసరోవరతీరంబునన్ = తామరకొలని దరిని. 93 చెంగలింపన్ = వికసింపఁగా, వాలిక=దీర్ఘములైన, సమ్మదమును = సంతోషమును, ఉబ్బును = పొంగును, ముత్పులకలు = సంతోషముచేనైన రోమాంచములు, కదిమిన = ఆక్రమించిన. 94 తావి=పరిమళము, ఊరక = నిమిత్తములేక. 95 ఉన్మాదముఁబొంది = పిచ్చిపట్టి, సన్మా

వ్యాజమున నిను నలంపుచు, నీజాడలఁ బెట్టి దైవ మేమనవచ్చున్. 97

క. అని పలికి గారవించుచు, ననురాగము చెంగలింప నారాత్రి నరేం
ద్రునకు మనోభవసౌఖ్యము, లొనరించి బహుప్రకారయుక్తుం జేసెన్. 98

వ. ఇవ్విధంబున సురతసుఖంబు లనుభవించిన మఱునాఁడు ప్రభాతసమయంబున నారాజవదన యారాజుతో నిట్లనియె. 99

మ. ధనదప్రాభవ నీప్రసాదమున నంతర్వత్ని నైయున్నదా
నను సత్పుత్త్రకుఁ ధోంధుకాలమునఁ జన్మించునాఁడీవువ
చ్చిన నీకెల్లశుభంబులుం గలుగు విచ్చేయంగదే యంచుఁ బ
ల్కిన రాజేంద్రుఁడు పట్టణంబునకు నేగెన్ సమ్మదం బొప్పఁగన్. 100

క. ఊర్వశి దనచెలులకు న,య్యుర్వీశుఁడు దానుఁ గలిసియుండుటయును గం
ధర్వులు పోయినపోకలు, సర్వంబును దెలియఁజెప్పెఁ జతురప్రౌఢిన్. 101

ఉ. ఆచెలు లవ్విధంబు దెలియన్ విని నివ్వెఱఁగంది యూర్వశిం
జూచి లతాంగి యీనృపతిసూనుఁడు రెండవమన్మథుండు నీ
కీచతురాత్ముతోఁగలయు టెంచుకచాలదె యేము నైతమున్
వాఁచినవారియట్లు గరువంబునఁ గన్గొనుచుంటి మివ్విభున్. 102

ఆ. ఇతనితోడఁగూడి యింకను గొంతకాలమ్ము కుసుమబాణలలితసుఖము
లనుభవింపు మనిన నగుఁగాక యని సమ్మతించి యిష్టలీలఁ దేలుచుండె. 103

వ. అంతఁ బురూరవుండు సంవత్సరకాలంబునకు వచ్చిన నూర్వశి యాయువను కుమారుం గాంచి యతనికి సమర్పించి యారాజుతోడం గలసి తొంటియట్ల యిష్టవినోదంబులు సలుపుచుండె వెండియుఁ బుత్త్రపంచకంబునకు జననకారణంబైనగర్భంబుఁ దాల్చె నాసమయంబున. 104

క. విరసంబునఁ దము నిరువుర, విరిదట్టుగఁ జేసినట్టి విశ్వావసుఁ డా
ధరణీవల్లభుపాలికి, గరిమం జనుదెంచె సకలగంధర్వులతోన్. 105

వ. ఇట్లువచ్చి గంధర్వులానరేంద్రు నవలోకించి నీవు మాకపటకృత్యంబులవలన ననేకదుర్దశలం బొందితివి కావున నీకుం గరుణించి వరంబు లిచ్చెదము వేఁడుమనిన నతం డట్లకాక యని వినమ్రమస్తకుండై సకలారాతిభయంకరప్రతాపంబును జితేంద్రియసామర్థ్యంబును నానామిత్త్రబాంధవదీనావనప్రభావంబును నమితబల

నము=మన్నన. 97 వ్యాజమునన్ = నెపముచేత, అలంపుచున్ = శ్రమపెట్టుచు. 98 చెంగలింపన్ = అతిశయింపఁగా. 100 ధనదప్రాభవ = కుబేరుని ప్రభుత్వసంపదవంటి ప్రభుత్వసంపదగలవాఁడా, అంతర్వత్నిని = గర్భిణిని. 102 నివ్వెఱఁగంది = మిక్కిలి యాశ్చర్యమును పొంది, గరువంబునన్ = గౌరవముతో. 105 విరిదట్టుగన్ = ఎడఁబాయునట్టుగా, గరిమన్ = గౌరవముతో. 106 వినమ్రమస్తకుండు = మిక్కిలి వంపఁబడిన మొగముగలవాఁడు, సాలోక్యంబు =

కోశాదినానామహిమలు నూర్వశీసాలోక్యంబుం గలుగునట్లుగా వేఁడిన నను
గ్రహించి యొక్కయగ్నిస్థాలి యిచ్చి యిట్లనిరి. 106

మ. మనుజాధీశ్వర యిమ్మహానలము నామ్నాయానుసారక్రమం
బునఁ ద్రిత్వం బొనరించి యాగము జగత్పూతంబుగాఁ జేయుమా
ఘనపుణ్యంబున నీకు నిట్టి మహిమల్ గల్గుం జుమీ యూర్వశీ
వనితాసంగమవైభవస్థితులతో వాంఛాసముద్వృత్తమై. 107

వ. అనిచెప్పి గంధర్వులువోయిన బుధనందనుండు నగ్నిస్థాలిఁ గైకొనివచ్చి బహు
విచారభ్రాంతివలనం జిత్తంబు గలంగి తనలో నిట్లనియె. 108

మ. నను గంధర్వవరుల్ వరం బడుగుమన్నం దుర్వివేకంబుతో
ననలస్థాలియకొంటిఁగాని ప్రమదం బారంగ నీయూర్వశీ
వనజాతేక్షణ నాకు నిండనుచు నే వాంఛింపలేనైతి నె
ట్టన నాయత్నము కొండఁ ద్రవ్వెలుకఁ బట్టంబోయిన ట్లయ్యెఁగా. 109

ఉ. ఎక్కడియజ్ఞకర్మ మిఁక నెక్కడియూర్వశి యేడ జీవనం
బెక్కడి కెక్కడంచు మదినెంతయు రోసి వనాంతరంబులో
నొక్కెడనమ్మహానలము నుంచి పురంబున కేగి యాత్మలోఁ
బొక్కుచు నర్ధరాత్రమున బుద్ధిఁ దలంచుచు నాతఁ డిట్లనున్. 110

మ. కృప గంధర్వులు నాకు నిచ్చిన మహాగ్నిస్థాలి య ట్లేటి కా
విపినాంతంబున వైచివచ్చితి మనోవిభ్రాంతి దుర్యత్నముల్
విపరీతంబునఁ దోఁచెఁ బోయినపనుల్ వేచెప్పగానేల నే
నిప్పు డచ్చోటికిఁ బోయి తెచ్చి సవనం బీడేర్తు సాంగంబుగన్. 111

సీ. అని యిట్లు దలపోసి యా ప్రొద్దె కదలి యయ్యడవిలోనికి వచ్చియగ్ని నచటఁ
గానక యొకశమీగర్భస్థమై యున్న యశ్వత్థభూరుహం బచటఁ గాంచి
యయ్యగ్ని యీతరువయ్యెఁగా కేమని తలపోసి తాపసోత్తములతోడ
వేదమాతృకయైన విమలమంత్రం బనుష్ఠించుచుఁ దత్తరుచ్ఛేదనంబు

తే. రమణఁ జేసి తన్మంత్రాక్షరములసంఖ్య, నమరు నంగుళములనిడుపైన యరణి
నెమ్మి నొనరించి యం దనలమ్ము వడసి, యజ్ఞ మొనరించె లోకంబు లభినుతింప.

వ. ఇట్లు కృతకృత్యుండై యప్పుణ్యకర్మంబువలన నూర్వశీసాలోక్యంబు మొదలుగా
సమస్తంబునుం బడసి గంధర్వాది నానాలోకంబుల విహరించుచు రాజసూయా
శ్వమేధాదియజ్ఞంబులు యథాయోగ్యంబులుగా ననుష్ఠించుచు రాజ్యంబు
సేయుచుండె. 113

తే. ఆదిమనుకాలమం దేకమైన క్రతుమహాగ్ని వైవస్వతాగ్ని మన్వంతరమున

---

సమానలోకత్వము. 107 ఆమ్నాయ = వేదములను, త్రిత్వము = మూడుగానగుట, జగత్పూతంబుగాన్ = లోకపావనముగా. 113 యథాయోగ్యంబులుగాన్ = తగినట్టు, అనుష్ఠించుచున్ =

గరిమతోడ నాహవనీయ గార్హపత్య, దక్షిణాగ్నులు నాఁ ద్రివిధంబు లయ్యె.

## పురూరవవంశానుక్రమము.

వ. అట్లు పురూరవుం డూర్వశియందు నాయువును ధీమంతుండును నమావసుండును విశ్వావసుండును శతాయువుఁ జిరాయువు నను కుమారుల నార్వురం గాంచె నందు నమావసుం డనువానికి భీమసేనుండుపుట్టె వానికిఁ గాంచనుండును వానికి సుహోత్రుండును వానికి జహ్నుం డనురాజర్షి యుం బుట్టిరి. 115

సీ. అమ్మహీతలభర్త యజ్ఞంబుఁ గావించువేళ గంగానది వెల్లివిరిసి
యాగవాటము మీఁద నరుదేరఁగాఁ జూచి యత్యంతకోపరక్తాక్షుఁ డగుచు
నాయజ్ఞపురుషు నాత్మారోపణము చేసి యోగసమాధిమై నుండి యమ్మ
హాధుని యుదకంబు లన్నియు నిశ్శేషముగఁ గ్రోలి నిలిచిన మునులు సురలు

తే. వివిధభంగుల నుతియించి వేఁడుకొన్నఁ
గరుణ మదిఁ బుట్టి పూర్వప్రకారమున నొ
నర్చి కూఁతుగ నమ్మహానది నను గ్ర
హించి గ్రమ్మఱఁ గ్రతువు గావించె నతఁడు. 116

వ. అది కారణంబుగా గంగానది జాహ్నవియనం బరఁగె నట్టిజహ్నునకు సుమంతుండు పుట్టె వానికి జనకుండు పుట్టె వానికిబలాశ్వుండు పుట్టె నతనికిఁ గుశుండు పుట్టెఁ గుశునకుఁ గుశాంబ కుశనాభాధూర్తరజోవసువుల నలువురు పుట్టిరి వారిలోనం గుశనాభుండు. 117

మ. శతమన్యుప్రతిమానుఁ డైన సుతు నిచ్ఛం గోరి భక్తిం దపం
బతిఘోరంబుగఁ జేయుచుండ సురలోకాధీశుఁ డుద్యత్కృపా
యతచిత్తంబునఁ దాన వచ్చి తనయుండై జన్మమొందెఁ సము
న్నతతేజోఘనుఁడైన గాధియను భూనాథోత్తమశ్రేష్ఠుఁడై. 118

చ. సురపతితుల్యుఁ డానృపతిసూనుఁడు ధర్మము దప్పకుండ నీ
ధరణితలంబు సర్వమును దానపరాక్రమలీల నేలుచుం
బెరిగియుఁ బెక్కుకాల మిల బిడ్డలు లేక యనేకలేఖులన్
వరములు వేఁడి సత్యవతినా నొక కన్యకఁ గాంచెఁ బెంపుతోన్. 119

క. ఆతరుణిఁ బెండ్లియాడెడు, ప్రీతిన్ రుచికుండనంగ భృగువంశవిభుం
డేతెంచి గాధి నడిగిన, నాతఁడు నగి తపసి వృద్ధుఁడని మదిఁగొంకెన్. 120

ఉ. ఆరుచికుండు వెండియుఁ గుశాంబతనూజునిఁ బెద్దచేసి యీ
నీరజనేత్ర కేను ధరణీవర యుంకువయేమియైన నీ

---

నడపుచు. 116 వెల్లివిరిసి = ప్రవహించి, ఆత్మారోపణముచేసి = తనయందావహింపఁజేసికొని, ధుని=నది, నిశ్శేషముగన్ = మిగులు లేకుండ. 118 ఇచ్ఛన్ = మనసునందు, ఉద్యత్కృపాయతచిత్తంబునన్ = పుట్టుచున్నదయచేత విశాలమయిన మనసుతో. 119. లేఖులన్ = దేవతలను, పెంపుతోన్ = గౌరవముతో. 120 కొంకెన్ = సంకోచించెను. 121 ఉంకువ=ఓలి -

కోరికదీరునట్లు సమకూర్చెదఁ బెండిలిసేయుమన్న నా
క్ష్మారమణుండు శాపభయమానసుఁడై మునిఁజూచి యిట్లనున్. 121

ఉ. ఇమ్మదిరాక్షి నీకుఁ బ్రియమేని మునీశ్వర యేకనీలక
ర్ణమ్ములు చంద్రచంద్రికల నవ్వెడుమేనులు తీవ్రవాయు వే
గమ్ములు గల్గునట్టి తురగంబుల వేయిటిఁగొంచువచ్చి మా
కిమ్మటులైన నీతరుణి నిచ్చి ప్రియంబుగఁ బెండ్లిసేసెదన్. 122

ఆ. అనిన నట్లకాకయని వరుణాలయం,బునకుఁ బోయి నిజతపోమహత్త్వ
మునఁ దురంగతీర్థ మనుమహాక్షేత్రంబు, నందుఁగోరినట్ల హరులఁ బడసి. 123

జమదగ్నివిశ్వామిత్రులజన్మప్రకారము.

ఆ. తెచ్చి కౌశికునకు నిచ్చి యమ్మునిపతి, సత్యవతి వరించి సమ్మదమున
నిజగృహస్థధర్మమున నైహికము లెల్లఁ, దప్పకుండ నడపి తపముచేసె. 124

క. అమ్మునినాథుఁ డపత్యా, ర్థమ్ము విమలమంత్రసంయుతమ్ముగ ఋతుకా
లమ్మునఁ దనభార్యకుఁజరు, విమ్ముగఁ బాకంబుసేసి యీనున్నయెడన్. 125

ఆ. పతికి మ్రొక్కి సత్యవతి పల్కె మాతల్లి, పుత్రహీన తోడఁబుట్టు నాకుఁ
గలుగునట్టుగాఁగఁ గరుణించి యీయుమ, కిందు కొంతచరువు నిందులోన. 126

వ. అనిన నట్లకాకయని ఋతుస్నాతయైయున్న తన్మాత రావించి యిరువురకు యథా
యోగ్యంబుగా బ్రాహ్మణక్షత్రియపాత్రంబులయిన సౌమ్యక్షాత్రమంత్రంబులఁ
జరుద్వయంబుఁ జేసి యయ్యిరువురకు నిచ్చి యుపయోగింపుండని చెప్పి సమి
త్కుశఫలార్థంబుగా వనంబునకుం జనియె నంతఁ దల్లి కూఁతున కిట్లనియె. 127

ఉ. లోకములోన సర్వజనులుందమపుత్రులు మంచివారుగాఁ
గైకొనఁ గోరుచుండుదురు గావున నీపతి సత్పుత్రార్థియై
నీకనిపెట్టినట్టి చరు వెంతయు మంచిది లాఁతిగావునన్
నాకబళంబు గీడని మనంబున నిప్పుడు నిశ్చయించితిన్. 128

తే. ఆఁడుబిడ్డ సహోదరుఁ డఖిలగుణస,మగ్రుఁడుగఁ గోరుఁ గావున మదిఁదలంచి
మనము చరువులు రెండును మాఱుపడఁగ, నారగింతము మంచిదియట్టులైన. 129

కన్యాశుల్కము. 122 నవ్వెడు = పరిహసించునట్టి. 123 వరుణాలయంబునకున్ = సముద్రమునకు, హరులన్ = గుఱ్ఱములను. 124 ఐహికము = ఇహలోకకర్మము. 125 అపత్యార్థమ్ము=సంతానమునిమిత్తము, చరువు = అగ్నియందు వేల్చుటకుఁ దగినపక్వాన్నము, పాకంబుచేసి = వండి, ఈనున్నయెడన్ = ఇయ్యయత్నించి యున్నసమయమునందు. 127 పాత్రములు = తగినవి, సౌమ్యక్షాత్రమంత్రంబులన్ = శాంతతను క్షత్రియులకుముఖ్యమైన శౌర్యమును కలిగించునట్టి మంత్రములచేత, చరుద్వయంబు = రెండుచరువులు. 128 లాఁతి = అన్యురాలను, కబళంబు = చరువనుట. 129 అఖిలగుణసమగ్రుఁడు = ఎల్లమంచిగుణములచేతను పూర్ణుఁడు.

తే. బ్రాహ్మణుని బలవీర్యసంపద నిరర్థకంబు భూలోకమంతయు ఘనపరాక్ర
మప్రతాపంబులేపార మహిమతోడ, నేలునాపుత్రుఁ డది నీకు మేలుగాదె. 130

వ. అని బేలుపెట్టి కూతురుం దానును జరుద్వయంబు వీడుపడ నుపయోగించి నిజ
గృహంబులకుం జని రంత. 131

చ. వనముననుండి వచ్చి భృగువంశశిఖామణి భార్యఁ జూచి నీ
జననియు నీవు నాపలుకుచందముఁ దప్పిచరుద్వయంబు నే
డొనరఁగ మార్పడంగ నుపయోగము చేసితి రింతయేల పో
వనరుహనేత్ర రౌద్రగతివర్తిలుచున్నది నీదుగర్భమే. 132

మ. భయదక్షత్రియకర్మరుండును మహాభాగుండు శస్త్రాస్త్రపా
ణియుఁ గానున్నసుతుండు పుట్టెడుసుమీ నీయందు వేదాంతవే
దియు నత్యంతతపోధనుండు నవనీదేవాన్వయాచారవ
ర్తియుఁగానున్నతనూభవుండు గలుగుం దెల్లంబు మీతల్లికిన్. 133

చ. అనవుడు వేఁడినిప్పువలె నవ్వచనంబు మృగాక్షి నెమ్మనం
బునకు నసహ్యమైన మునిముఖ్యుపదంబులమీఁదవ్రాలి యో
యనఘ భవత్ప్రసాదజనితాత్మజుఁడే యిటువంటి క్రూరక
ర్మనిరతుఁ డప్రబుద్ధనపరాధిని నన్ను ననుగ్రహింపవే. 134

క. మీపలికినట్టివన్నియు, నాపుత్రునియందువలదు నరవరధర్మ
వ్యాపారము మనుమనియం, దాపాదింపుదురు కానియనిపలుకుటయున్. 135

వ. అట్లకాకయని యనుగ్రహంబుసేసిన కొండొకకాలంబునకు నాసత్యవతి జమ
దగ్నినింగాంచెఁ దదీయజనని విశ్వామిత్రుం గాంచె నంత నారుచికుండు తపో
వనంబునకుం జనియె సత్యవతికౌశికి యనుపుణ్యనదియై ప్రవహించె జమదగ్నియు
నిక్ష్వాకువంశసంభవుండైన రేణువను రాజుపుత్రియైన రేణుకను వివాహంబై
దానియందు. 136

మ. సకలక్షత్రకులప్రభంజనకళాసంపన్నబాహాబల
ప్రకటీభూతసమస్తలోకుఁడు మహీభారావతీర్ణప్రభా

130 ఏపారన్ = అతిశయింప. 131 బేలుపెట్టి = వంచించి, వీడుపడన్ = మాఱుపడ. 133 భయదక్షత్రియకర్మఠుండు = భయంకరమైన క్షత్రియకర్మలను నడపువాఁడు, మహాభాగుఁడు = గొప్పతనమును వహించినవాఁడు, వేదాంతవేది = ఉపనిషదర్థముల నెఱింగినవాఁడు, అవనీదేవాన్వయాచారవర్తి = బ్రాహ్మణవంశస్థుల నడవళ్లుగలిగి వర్తించువాఁడు. తెల్లంబు = స్పష్టము. 134 అసహ్యము = సహింపరానిది, వ్రాలి=పడి, భవత్ప్రసాదజనితాత్మజుఁడే = నీయనుగ్రహమువలనఁ బుట్టిన కొడుకా, అప్రబుద్ధన్ = అజ్ఞానురాలను. 135 ఆపాదింపుదురు = కలుగఁజేయుదురు. 136 కొండొక = కొంత. 137 సకల...లోకుఁడు = ఎల్లరాజవంశములను భంగపెట్టుటయను విద్యతోఁగూడిన భుజబలముచేత ప్రసిద్ధినొందిన సకలలోకములుగలవాఁడు, మహీ...శౌర్యుండు=భూభార

వక శౌకర్మ శవైష్ణవాంశజననవ్యాపార శౌర్యుండు శం
భుకుమార ప్రతిమానుఁడై పరశురాముం డుద్భవించెఁ ధరన్. 137

వ. మఱియు విశ్వామిత్రునకు భార్గవుం డైనశునశ్శేఫుండు దేవతలవలన దత్తపుత్త్రుం డయ్యె నాశునశ్శేఫునకు దేవరాతుండు పుట్టె మఱియు విశ్వామిత్రునకు మధుచ్ఛందకృతదేవాష్టకహారీతులను వారు జన్మించి పరమర్షికన్యకల వివాహంబై రని యమావసువంశంబు చెప్పి పరాశరుండు వెండియు నిట్లనియె. 138

నహుషక్షత్త్రవృద్ధరజిప్రముఖులజననము.

తే. విను పురూరవునకు నగ్రతనయుఁడైన, నాయువను రాజు రాహువు నాత్మపుత్త్రిఁ బరిణయం బొనరించె నాభామయందుఁ, గనియె నేవురుకొడుకుల గరిమతోడ.

వ. వారినామధేయంబులు వినుము నహుషక్షత్త్రవృద్ధరంభరజ్యనేనస్సులనం బ్రసిద్ధులైరి. 140

తే. వారిలోన నేనుం డనువానికిని సుహోత్త్రుఁ డుదయించె నతనికిఁ బుత్త్రులైరి కృత్స్నమదకాశ్యకాశులు కీర్తిధనులు, రాజసూయాదియజ్ఞముల్ రమణఁ జేసి.

ఆ. అందుఁ గృత్స్నమదునియందుఁ జాతుర్వర్ణ్య, సంప్రవర్తకుండు శౌనకుండు పుట్టెఁ గాశ్యునందు భూరితపోనిధి, తనయుఁడయ్యె దీర్ఘతపుఁ డనంగ. 142

వ. ఆదీర్ఘతపునకు ధన్వంతరి జనియించె నట్టిధన్వంతరికిఁ గేతుమంతుండు పుట్టె వానికి వారణాసీపతియైన దివోదాసుండు పుట్టె వానికిఁ బ్రవర్ధనుండు పుట్టె నతండు.

ఆ. కువలయంబునాఁగ గుఱ్ఱంబు నెక్కి యీ, కువలయమున దినముఁ గ్రుమ్మరంగ నతఁడు కువలయాశ్వుఁ డనునామధేయంబు, గలిగి గౌరవమున నలరుచుండు.

ఆ. వత్స వత్స యనుచు వాత్సల్యమునఁదండ్రి, తన్నుఁ బిలుచుచున్న తన్నిమిత్త మున నతండు వత్సుఁ డనుమహీవిభుఁడయ్యె, వత్సదేశమయ్యె వానిపేర. 145

శా. శాత్రవమండలేశ్వరుల సంగరరంగములన్ జయించుఁగా
శత్రుజయుండు నాఁబరఁగె సత్యము దప్పక రాజ్యవైభవం
బాత్రిదశేంద్రుఁబోలి యరయంగ ఋతుధ్వజుఁడయ్యె నిమ్మెయిన్
క్షత్త్రియవంశజాతులకుఁ గల్గు సమంచితనామకర్మముల్. 146

వ. అట్టి కువలయాశ్వుండు పరమపతివ్రతయైన మదాలసయందు నలర్కుం డను రాజుం గాంచె నయ్యలర్కుండు. 147

తే. అవనియెల్లను నఱువదియాఱువేలు, వత్సరంబులు నూత్న యౌవనము దనకు గెంటిపోకుండఁ బాలించెఁ గీర్తివెలయ, భూపకోటియలర్కునిఁ బోల రెందు.

---

మును అణఁచునట్టి మహిమయ నెడు కళననుసరించిన పనులనునడపునట్టి విష్ణ్వంశమైనపుట్టుకయు వ్యాపారమును శూరత్వమునుగలవాఁడు, శంభుకుమారప్రతిమానుఁడు = శివుని కుమారస్వామిని పోలిన వాఁడు 142 చాతుర్వర్ణ్యసంప్రవర్తకుండు = బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులనెడు నాలుగు వర్ణములవారి నడవళ్లను ప్రవర్తింపఁజేయువాఁడు. 146 శాత్రవమండలేశ్వరులన్ = శత్రురాజులను, త్రిదశేంద్రున్ = ఇంద్రుని. 148 గెంటి=తొలఁగి, భూపకోటి = రాజసమూహము,

—రజియనువానికింద్రపదము వచ్చుట.—

వ. అయ్యైలర్కునిపుత్రపౌత్రాంతరంబు లనేకతరంబులుగలిగె వారియందుఁ జాతు
ర్వర్ణ్యంబులు ప్రవర్తిల్లె నిది కాశేయవంశప్రకారం బని వెండియు. 149
క. అనఘాత్మ విను పురూరవు, మనుమండగురజిప్రతాపమహితుల సుతులం
గనియెను బంచశతకముల, ననిమిషపతి నైనగెల్చు నతిబలయుతులన్. 150
శా. ఆకాలంబున దేవదానవులు ఘోరాకారసంగ్రామకే
ళీకౌతూహలచిత్తులై యరిగి నాళీకాసనుం గాంచి దే
వా కయ్యం బొనరింపుచో జయమునన్ వర్తిల్లువా రెవ్వరో
మాకుం జెప్పుమటన్నఁ బద్మజుఁడు సమ్యగ్బుద్ధితో నిట్లనున్. 151
క. నిజము పురూరవుమనుమఁడు, రజి యెవ్వరివంక నిలిచి రణరంగములో
భుజబలముఁ జూపువారలె, విజయముఁ జేకొందు రనుచు వినిపించుటయున్.
క. అనిమిషులకంటె ముందఱ, దనుజులు సనుదెంచి రాజతనయునిఁ బ్రార్థిం
చిన నతఁడు వారినందఱఁ, గనుఁగొని యిట్లనియె వినయగౌరవ మొప్పన్. 153
క. అనిలోన మీకుఁ దోడై, యనిమిషులను గెలిచి విజయమనురాగముతో
నొనరింతునేని మీకిం, ద్రునిఁగా నను జేయనోపుదురె మీ రనినన్. 154
క. మాకెల్లఁ గర్త పుణ్యశ్లోకుఁడు ప్రహ్లాదుఁ డతనిశుభముకొఱకె పో
యీకయ్య మిట్లుగాదని, నీ కింద్రత్వంబు నొసఁగ నేర్తుమె యనుచున్. 155
ఆ. ఇయ్యకొనక దనుజు లేగిరి పదపడి, యమరవరులువచ్చి యసురవీరు
లట్ల వేఁడుకొన్న నారాజుదైత్యులఁ, బలికినట్ల సురలఁ బలుకుటయును. 156
వ. నిలింపులు దమలో విచారించి కార్యదాహంబునం జేసి దేవేంద్రత్వం బతని కిచ్చు
టకు నొడంబడిరి రజియును దేవసైన్యసహాయుండై రణంబున దైత్యదానవుల
మర్దించి విజయంబుఁ గైకొనియున్న యతనిపాలికిఁ బురందరుండువచ్చి సాష్టాంగ
దండప్రణామం బాచరించి చేతులు మొగిచి యిట్లనియె. 157
చ. కడుభయ మైనవేళఁ గృపఁ గాచిన యాతఁడుఁ గన్నతండ్రియన్
జడియక యొక్కరూపగుట సత్యము దుష్టవిరోధికోటిచేఁ
బొడమిన భీతిమాన్పి దయఁ బ్రోచితి గావునఁ దండ్రి వీవు నే
కొడుకను నీమహామహిమకుం దగువాఁడనె కాక లేఁతి నే. 158
ఆ. ఇంతకంటె నీకు నింద్రత్వమేటికి, నేమి ఘనము మానవేంద్రచంద్ర
నన్నుఁ గరుణఁజూచి నాలోకముననిల్పి, యలరఁజేయుమన్న నవ్విభుండు. 159
మ. పగవాఁడైనను వచ్చి క్రిందుపడి తాఁ బ్రార్థించినన్ వానికిం

151 సంగ్రామకేళీ = యుద్ధక్రీడయందు, నాళీకాసనున్ = బ్రహ్మను, సమ్యగ్బుద్ధితోన్ = మంచి బుద్ధితో. 152 వంక=తట్టు. 156 దైత్యులఁబలికినట్ల = రాక్షసులతో చెప్పినట్లె. 157 నిలింపులు=దేవతలు, కార్యదాహంబునం జేసి=(పొసఁగిన) కార్యమువలని సంతాపముచేత. 158 జడియక= తొలఁగక - తప్పకయనుట, 160 క్రిందుపడి = అణఁగి, సంభావన=మన్నన, దైన్యవ్యక్తులు =

దగుసంభావన లిచ్చిపుచ్చుటయె పోధర్మంబు లోకేశ్వరుం
డగు దేవేంద్రుఁడు వచ్చి నాయెదుర దైన్యవ్యక్తులాడంగ నీ
చగుణంబుల్ పచరింపఁగాదని కృపాసందీప్తచేతస్కుఁడై. 160

క. అనిమిషపతి కింద్రత్వం, బనురాగముతోడ నిచ్చి యమరావతికిం
జనుమని నిజపురమునకును, జననాథుఁడు వచ్చియున్న సమయమునందున్. 161

క. నారదకుటిలవిచార, ప్రేరితులై వానిసుతులు పితృధనమగు నా
స్వారాజ్యపదముఁ గైకొనఁ, బౌరుషమున నింద్రువీటిపై నరుగుటయున్. 162

ఆ. పాకశాసనుండు నాకంబువిడిచి యెం, దేని మానిపోయె మానవేంద్రు
తనయు లమరపురముఁ దామ కైకొని యజ్ఞ,భాగములు నిలింపపతుల కీక. 163

తే. తామ గైకొని పెక్కేండ్లు ధర్మవృత్తి
నున్న సమయంబునం దింద్రుఁ డొక్కనాఁడు
దేవతాగురుపాలి కేతెంచి మంత
నమున నిట్లనిపలికె దైన్యంబుగదుర. 164

క. మునినాథ పురోడాశం,బునకుం గడువాఁచి నోరు పుతపుత మనఁగా
నిను వేఁడెద యజ్ఞములకుఁ, జని యించుక దాఁచితెచ్చి చవి చూపఁగదే. 165

క. అనిన బృహస్పతి మిక్కిలి, దనమనమున వగచి దేవతాపతికి శుభం
బును రిపులకు నశుభంబును, నొనఁగూడఁగ నాభిచారహోమముచేసెన్. 166

ఉ. అందుల కీడుదాఁకి మనుజాధిపుపుత్రులు దుర్వివేకముల్
చెంది మహాక్రతుక్రియలు చెల్లుట కోర్వక వేదమార్గముల్
నింద యొనర్చుచున్ ద్విజుల నెక్కొని చంపుచుఁ బాపకర్ములై
యందఱుఁ దమ్ముఁదామె హతులై చెడిపోయిరి నాడునాటికిన్. 167

వ. ఇట్లుపాయంబున రిపులవలన జయంబుగొని యింద్రుండు నిజపురోహితువలన నాప్యాయితయజ్ఞభాగుండయి దివంబున సుఖంబుండె నీచరిత్రంబు వినినవారికి స్థానభ్రష్టత్వంబు లేదనిచెప్పి మఱియు నిట్లనియె. 168

తే. క్షత్రవృద్ధునిసంతతి జగతియందు, బహుపరంపరలై కడుఁ బ్రబలమయ్యె

---

దీనత్వముతోడిమాటలు, పచరింపన్ = ప్రకటింప, కాదు=తగదు, కృపాసందీప్తచేతస్కుఁడు=దయను ప్రకాశపఱుచునట్టి చిత్తవృత్తిగలవాఁడు, 162 కుటిలవిచార = కపటమైన యాలోచనచేత, పితృధనము = తండ్రిసొత్తు, స్వారాజ్యపదమున్ స్వర్గ రాజ్యస్థానమును - స్వర్గలోకపు దొరతనమును, వీటిపైన్ = పట్టణముమీఁదికి. 163 ఎందేనిన్ = ఎక్కడనో, మానిపోయెన్ = అణఁగి పోయెను. 164 మంతనమునన్ = ఏకాంతమునందు. 165 పురోడాశంబునకున్ = హవ్యమునకు. 166 వగచి=విచారపడి, అభిచారహోమమున్ = పరహింసాకరమైన హోమమును. 167 చెల్లుటకున్ = జరగుటకు, నెక్కొని=పూని, తమ్ముదామె = తమకుఁదామె. 168 రిపులవలనన్=శత్రువులవలన, ఆప్యాయితయజ్ఞభాగుండు=యజ్ఞభాగములచేత తనుపునొందింపఁబడినవాఁడు.

రంభుఁ డను రాజు దనకుఁ బుత్రకులు లేక, తపము సేయుచునుండె నుదగ్రవృత్తి.

## యయాతిచరిత్రము.

వ. మఱియు నహుషునకు యతి యయాతిసంయాత్యాయాతి నియతి కృతు లను కుమారు లార్వురు పుట్టి రందు యతి రాజ్యసుఖంబు లొల్లక యతీశ్వరుండై పోయె యయాతి రాజ్యాభిషిక్తుండై భార్గవపుత్త్రి యైనదేవయానయు వృషపర్వపుత్త్రి యైన శర్మిష్ఠయును ధర్మపత్నులుగా నభిమతసుఖంబు లనుభవించుచుండ. 170

క. యదుదుర్వసు లనుపుత్త్రకు, లుదయించిరి దేవయాన కున్నతమతులై
ముద మొదవఁగ శర్మిష్ఠకు, నొదవిరి ద్రుహ్యానుపూరు లుత్తములగుచున్. 171

క. జననాథుఁడు శర్మిష్ఠకు, ననురాగము చేసి దేవయానకు నహితం
బొనరించుచుండ శుక్రుఁడు, జనవరునకు శాపమిచ్చె జరుఁడై యుండన్. 172

వ. ఇట్లు జరాభారపీడితుండై యయాతి శుక్రునియనుగ్రహంబుఁ బడసి తనకుమారులనందఱం బిలిచి యిట్లనియె. 173

ఆ. వినుఁడు తనయులార విషయోపభోగంబు, లందు నేను తనివిఁ బొందకున్న
వాఁడ నింక వేయివత్సరంబులకు నిం,ద్రియము లెల్లఁ దృప్తిఁదేలు నాకు. 174

క. కావున మీలో నొకరుఁడు, నావార్ధక మర్థిఁ బూని నవయావనముఁ
నావలనంగొనుఁ డీపనిఁ, గావించినవాని రాజుఁగా నొనరింతున్. 175

తే. అనినఁ బూరుఁడు దక్కఁ దక్కినతనూజు
లందఱును దండ్రిపలుకుల కపహసించి
జవ్వనం బిచ్చి ముదిమి గోఁజాలమనుచుఁ
దలఁగిపోయిన నహుషపుత్త్రకుఁడు గినిసి. 176

వ. భవదీయప్రసూతు లైనవారు రాజ్యార్హులుగారని శాపం బిచ్చి తనవచనంబు లాదరించిన పూరునకు ముదిమి యిచ్చి యతని జవ్వనంబుఁ గైకొని యథాకాలోపపన్నంబు లైనకామోపభోగంబులు ధర్మమార్గంబు దప్పకుండ సమ్యక్ప్రకారంబున విశ్వాచి యనునప్సరతోఁడంగూడ ననుభవించి సహస్రవత్సరంబులు పరిపూర్ణం బైననొక్కనాఁడు యయాతి దనమనంబున. 177

తే. అనుభవించితి నిన్నినాళ్లు ఖలవిషయ
భోగములు కోర్కులేమియుఁ బొలిసిపోవు

---

యజ్ఞభాగములచేఁ దనిసినవాఁడనుట. 172 జరుఁడు=ముసలివాఁడు. 173 జరాభార = ముదిమియొక్క యతిశయముచేత. 176 కోఁజాలము = తీసికోలేము, కినిసి=కోపించి. 177 యథాకాలోపపన్నంబులు = తగినకాలములయందు, పొందఁబడినవి, సమ్యక్ప్రకారంబునన్ = క్రమమైన రీతితో. 178 పొలిసిపోవు = నశింపవు, విపులతరము = మిక్కిలి యధికము.

విపులతర మైనవహ్ని హవిస్సువలన
హానిఁబొందక వర్ధిల్లు నట్ల తలఁప 178

క. జీర్ణించు వెంట్రుకలు గడు, జీర్ణించును లోచనములు చెవులును ముక్కుల్
జీర్ణించుగాని యాశలు, జీర్ణింపవు ముదిమి నరునిఁ జెందినవేళన్. 179

క. అవివేకులు దృష్ణలచేఁ, దగిలి ప్రవర్తింతు రధికతరదుఃఖములన్
సువివేకులు దృష్ణలచేఁ, దవులక వర్తింతు రధికతరసౌఖ్యములన్. 180

ఉ ఏను సహస్రవర్షములు నీగతి నీవిషయోపభోగసౌ
ఖ్యానుభవస్థితిం బ్రమదమారఁగ నుండితి నెట్టులుండినన్
మానదు తృష్ణ యింక ననుమానము మాని సుఖైకభోగముల్
మానినఁగాని కోరికలు మానవు కాకని నిశ్చితాత్ముఁడై. 181

క. పూరునకు యౌవనముఁ గడు, గారవమున నిచ్చి వార్ధకముఁ బూని ధరి
త్రీరమణుఁ డతని నవనీ, భారధురంధరునిఁగాఁగఁ బట్టము గట్టెన్. 182

వ. కట్టి యయాతి వనంబునకుఁ దపంబుసేయం జనియెఁ బూరుండు పూర్వాదిదిశా చతుష్టయంబునకు యదుప్రముఖుల నలుగుర రాజులంజేసి సకలంబునకుఁ దాన కర్తయై రాజ్యంబు సేయుచుండె నిట్లు పరమధర్మపరుం డైనయయాతిపుత్రకు లందు జ్యేష్ఠుం డైనయదునివంశంబుఁ జెప్పెద. 183

యదువంశమహిమానువర్ణనము.

క. వెలయఁ జరాచరభూతం,బులకును ధర్మార్థకామమోక్షము లొసఁగం
గల నారాయణుఁడట యదు, కులసంభవుఁడయ్యె మంచికుల మదిగాదే. 184

క. పరమపవిత్రుం డగునా, హరి కృష్ణుఁ డనంగ మానవాకృతితో నీ
వరవంశంబునఁ బుట్టును, నరు లీకథ వినినఁ గలుగు నానార్థంబుల్. 185

వ. అని యనేకవిధంబులఁ గృపావర్ధిష్ణుం డైనశ్రీకృష్ణుని ప్రశంసచేసి పరాశరుండు మైత్రేయున కిట్లనియె. 186

ఆ. విను సహస్రజిత్తుఁ డనఁగఁ గ్రోష్టుఁ డనన
లుండు నహుషుఁ డనఁగ లోకనుతులు
నలుగు రుదయమైరి నందనుల్ యదునకుఁ
బూరుషార్థచయము పుట్టినట్లు 187

వ. అందు సహస్రజిత్తునకు శతజిత్తుండును వానికి హేహయతాలజంఘువేణుహయులను బుత్రత్రయంబు పుట్టె నందు హేహయునకు ధర్ముండును ధర్మునకుఁ గుంతలుండునుం బుట్టి రట్టి కుంతలునిపేరఁ గుంతలదేశంబయ్యె నట్టికుంతలునకు

180 తృష్ణలచేన్=ఆశలచే, తగిలి=ఆసక్తులై. 181 ప్రమదమారఁగన్=సంతోషమతిశయింపఁగా, అనుమానము=ఊహ-అదిగావలె ఇదిగావలెనని యూహించుటయనుట. 184 నారాయణుఁడట యదుకుల సంభవుఁడయ్యె=నారాయణుండు యదుకులసంభవుఁడయ్యె నఁటయనియన్వయము. 186 వర్ధిష్ణుండు=

సభాజిత్తుండును వానికి మహిష్మంతుండునుం బుట్టిరి. వానిపేర మాహిష్మతీపురం బయ్యె నట్టిమహిష్మంతునికి భద్రశ్రేణియు వానికి దుర్దముండును వానికి ధనకుండును వానికిఁ గృతవీర్యుఁడును కృతాగ్నియు కృతధర్ముండును గృతౌజుండు నన నలువురు పుట్టిరి. వారిలోనఁ గృతవీర్యునకు నర్జునుండన సహస్రబాహుండు పుట్టె. 188

క. అత్రికి ననసూయకు స,త్పుత్రకుఁడై విష్ణునంశమునఁబుట్టిన ద
త్తాత్రేయమౌని కృపకుం, బాత్రుండై యతనిఁ గొలిచి పరమప్రీతిన్. 189

ఉ. ఆహవభూమియందు నభియాతులచే నపరాజితత్వముఁ
బాహుసహస్రకంబు నిరపాయపరాక్రమముఁ ధరిత్రి ను
త్సాహ మెలర్ప నేలుటయు సర్వజనప్రియవర్తనంబు నా
శ్రీహరిచేతఁ జావు దనుఁ జెందఁగఁ గోరె వరంబు లర్థితోన్. 190

క. సప్తాశ్వసదృశతేజో, దీప్తుండై రిపుల గెలిచి దీనావనుఁడై
ప్రాప్తశ్రీనిధి యేలెను, సప్తద్వీపములతోడి జగతీతలమున్. 191

క. భవ్యగతి కార్తవీర్యుం, డవ్యాహతవిభవయుక్తుఁ డగుచు ననష్ట
ద్రవ్యులఁగా జనులను లో, కవ్యవహారంబు నడపెఁ గౌతుక మమరన్. 192

ఉ. ఊర్జితధర్మవృత్తిఁ గ్రతువుల్ పదివే లొనరించి మించి యా
నిర్జరకోటిఁ దన్పి కమనీయగతిఁ నిజబాహువిక్రమో
పార్జిత మైనయర్థము వ్యయం బొనరించి యెలర్చెఁ గార్తవీ
ర్యార్జునచక్రవర్తి సముదంచితనిర్మలపుణ్యమూర్తియై. 193

ఆ. అట్టికార్తవీర్యుఁ డంగనాజనసహ,స్రముతోడఁగూడి నెమ్మి నేగు
దెంచి నర్మదానదీజలంబులలోన, నొనరఁ గేళిసలుపుచున్నయంత. 194

క. ఆవేళ యక్షకిన్నర, దేవాసురులను జయించి దిగ్విజయముతో
రావణుఁ డఖిలామరవి,ద్రావణుఁ డరుదెంచి విడిసెఁ దనసైన్యముతోన్. 195

వ. ఇట్లు విడిసి. 196

క. రేవానదిలోపల సం,ధ్యావిధు లొనరించుచున్న నది యెఱిఁగి ధరి

---

వర్ధిల్లుస్వభావముగలవాఁడు. 190 అభియాతులచేఁ = శత్రువులచేత, అపరాజితత్వముఁ = ఓటమిలేని తనమును, ఎలర్పఁ = చిగుర్ప - పెరుగ. 191 సప్తాశ్వసదృశతేజోదీప్తుండు=సూర్యుని తేజస్సునుబోలిన తేజస్సుచేత ప్రకాశించువాఁడు, దీనావనుఁడు = దరిద్రులను రక్షించువాఁడు, జగతీతలముఁ = భూప్రదేశమును. 192 భవ్యగతిఁ = (లోకమునకు) మేలుగలుగునట్టి రీతితో, అవ్యాహతవిభవయుక్తుఁడు = కొట్టుపడనియైశ్వర్యముతో కూడుకొన్నవాఁడు, అనష్టద్రవ్యులఁగాఁ = చెడనిధనముగలవారినిఁగా - ధనసమృద్ధిగలవారు అగునట్లుగా. 193 ఊర్జిత = నానాటపెరిగిస్థిరపడిన, తన్పి=తృప్తినొందించి, ఎలర్చెఁ = వికాసమును వహించెను. 194 నెమ్మిఁ=నెమ్మదితో. 195 అఖిలామరవిద్రావణుఁడు = ఎల్లదేవతలను తఱుమఁగొట్టినవాఁడు.

త్రివిభుఁడు వేయిచేతుల, నావాహిని నీరు ద్రొట్టునట్లుగఁ జేసెన్. 197

క. పదపడి చేతులు దిగిచిన, నదిజలములతోడఁగూడ నానావిధసం
పదలెల్ల వఱదఁబోయినఁ, ద్రిదశాంతకుఁ డలిగి కోపదీప్తహృదయుఁడై. 198

క. చతురంగబలముతో నుద్ధతుఁడై కృతవీర్యపుత్త్రుఁ దాఁకిననతఁ డా
శతమఖవిరోధి మార్కొని, యతిభీషణవృత్తిఁబోరి యతులితశక్తిన్. 199

తే. పశువుఁ బట్టినకైవడిఁ బట్టితెచ్చి
బందిగములోన శృంఖలాబద్ధుఁజేసి
పెక్కువత్సరములు చెఱఁబెట్టి విడిచె
నాపులస్త్యాదిమునీంద్రు లడిగికొనఁగ. 200

క. ఈ తెఱఁగున బహుబలసం, స్ఫీతుండై యెదురులేని పెంపునఁ బంచా
శీతిసహస్రాబ్దంబులు, భూతలమంతయును నేలె భూరిప్రౌఢిన్. 201

తే. అతఁడు కాలావసానంబునందు నరిగి
యాదినారాయణాంశజుం డైనపరశు
రాముశాతకుఠారధారావిభిన్న
బాహుమస్తకుఁడై కాంచెఁ బరమపదము. 202

వ. అట్టి కార్తవీర్యార్జునునకు నూర్వురు కుమారులు జన్మించి రందు శూరసేన వృష
సేన మధు జయధ్వజు లన నేవురు ముఖ్యులైరి. వారియందు జయధ్వజునకు తాళ
జంఘుండు పుట్టె. ఆతాళజంఘునకుఁ దాళజంఘాఖ్యులు నూర్వురుతనయులు
జనించి రం దగ్రజుండు వీతిహోత్రుండును దదనుజన్ముండు భరతుండు ననం
బరగిరి. అందు భరతునకు వృషుండును, వృషునకు మధుండును వానికి వృష్ణి
ప్రముఖులు నూర్వురుకొడుకులునుం బుట్టిరి. ఆవృష్ణిపేర వృష్ణివంశంబు ప్రవృ
త్తంబయ్యె. మఱియు యదుపుత్త్రుం డైనక్రోష్టునకును. 203

ఆ. వంశకారుఁ డైన ధ్వజినీశుఁ డనుకళావంతుఁ డుదయమయ్యె వానియందు
స్వాతిపుట్టె వానివరపుత్త్రుఁ డై ఋశంకుండు జననమయ్యె గుణయుతుండు.

క. పంకజహితనిభుఁ డైనఋశంకునకును జిత్త్రరథుఁడు జన్మించె నిరా
తంకయశుఁ డతఁడు లోకవశంకరు శశిబిందుఁ గాంచె సత్పుత్త్రునిఁగాన్. 205

వ. అతఁడు చతుర్దశలోకచక్రవర్తి యై. 206

197 తొట్టు=ఉబుకు. 198 వఱద=ప్రవాహము, త్రిదశాంతకుఁడు=దేవతలపాలిటియముఁడైన రావణుఁడు. 199 ఉద్ధతుఁడు=నిక్కుగలవాఁడు, శతమఖవిరోధిన్=ఇంద్రునికి పగవాఁడైన రావణుని, భీషణవృత్తిన్=భయంకరమైన వ్యాపారముతో. 200 బందిగములోనన్=చెఱసాలయందు, శృంఖల=సంకెల. 201 సంస్ఫీతుండు = విజృంభించినవాఁడు. 202 శాతకుఠారధారావిభిన్నబాహుమస్తకుఁడు=కఱుకైనగండ్రగొడ్డటివాదరచేత నఱకఁబడిన భుజములును తలయుఁగలవాఁడు, కాంచెన్ = పొందెను. 205 పంకజహితనిభుఁడు = సూర్యునిఁబోలినవాఁడు, నిరాతంకయశుఁడు = కళంకములేని

చ. ఒలసిన వేడ్క నానృపతి యొక్కముహూర్తమునందు లక్షభా
ర్యల వరియించి యందఱకు నన్నివిధంబుల నిష్టసౌఖ్యముల్
సలుపుచునుండు నొక్కొకవిలాసిని వేవురు వేవురాత్మసూ
నులఁ గనఁగా జగన్నుతఘనుల్ పదికోట్ల తనూజులై రొగిన్. 207

ఉ. నీతివివేకధుర్యగుణనిర్మలులై పదికోట్లపుత్రులున్
భూతలమంతయున్ నిజవిభూతి యెలర్పఁగ నేలుచుండఁగా
నాతతచక్రవర్తి మహిమాతిశయంబున నేడుదీవులుం
బ్రీతివహింపనేలె శశిబిందుఁడు సాధుజనైకవిందుఁడై. 208

ఉ. ఆపదికోట్లపుత్రులకు నగ్రజుఁడై నపృథుశ్రవుండు ధా
త్రీపతియయ్యె నానృపవరేణ్యునకుం దముఁ డుద్భవించె నా
భూపకులావతంసునకుఁ బుత్రకుఁడై యుశనుండు పుట్టె వాఁ
డేపున దక్షిణల్ ద్విజుల కిచ్చి యొనర్చె దశాశ్వమేధముల్. 209

మణిగణనికరవృత్తము. ఉశనునిగతిమతియుతుఁ డనఁదగు న
య్యుశనునకును దనయుఁడు గలిగె జగ
ద్విశదయశుఁడు జనవినుతుఁడు కరుణా
తిశయుఁడు నితవుఁడు దినకరనిభుఁడై. 210

వ. వానికి మధుండు పుత్రుండయ్యె వానికిఁ బరాజితుండును రుక్మండును పృథు
రుక్మండును జ్యామఘుండును పలితహారితుండును నన నేవురు పుత్రులైరి
వారియందు. 211

తనపుత్రుం డగువిదర్భునకు వయోధికస్త్రీని పెండ్లిసేసిన జ్యామఘునివంశానుక్రమము.

క. జ్యామఘుఁడు శైబ్య యనుకాం,తామణి వరియించి తాను దానికి వశుఁడై
యామగువ దనకు నేలిన, స్వామివిధంబునను రాజసంబున నుండెన్. 212

క. భామినులకు వశులై యీ, భూమండలిలోనఁ దిరుగుపురుషులలోనన్
జ్యామఘుఁడె యెక్కు వనుచును, వేమఱుఁ జెప్పుదురు జనులు విచ్చలవిడితోన్.

క. ఆలు దనరాజ్యమంతయుఁ, బాలించఁగ దానిఁ గొల్చి బంటై యుండెన్
లీలఁ దనవంటిరాజులు, మేలంబున నపహసింప మెలఁగుచు వేడ్కన్. 214

వ. ఇట్లు భార్యావశుండై జ్యామఘుండు సంతానార్థంబుగాఁ దపంబుసేయం
జనుటయు. 215

కీర్తిగలవాఁడు, లోకవశంకరుఁడు=లోకమునంతవశపఱుచుకొన్న వాఁడు. 207 ఒలసిన=పొందిన. 208 ఆతత=అధికతరమైన, సాధుజనైకవిందుఁడు=సాధువులైన జనులచేతనే తెలియఁబడువాఁడు. 209 భూపకులావతంసునకున్ = రాజవంశశ్రేష్ఠునకు. 212 స్వామి=ఒడయఁడు. 214 మేలంబునన్ =

ఉ. వైరిపతుల్ మహోగ్రరథవారణఘోటకపఙ్క్తియుక్తులై
భూరిబలంబుతో నతనిభూమి సమస్తము చూఱలాడఁగాఁ
జారులచే నెఱింగి నృపచంద్రుఁడు భార్యయనుజ్ఞఁ బూని దు
ర్వారపరాక్రమక్రమవిరాజితుఁడై రథమెక్కి సేనతోన్. 216

మ. చని సంగ్రామమునందు దారుణరిపుక్ష్మాపాలలోకంబులన్
ఘనవజ్రప్రతిమానశాతవిశిఖాఘాతంబులం బ్రాణముల్
గొనినన్ మాఱ్కొని నిల్వలేక కడుసంక్షోభించి నానాదిశాం
తనితాంతక్షితిభృద్గుహావళులలోనం దూఱె రత్యుద్గతిన్. 217

వ. ఇవ్విధంబున నరాతిచక్రంబు పరాక్రమింపనోపక నిజపుత్రమిత్రకళత్రబంధుబల కోశాదినానాసంపదలతోడఁ దమతమనివాసంబులు విడిచి పలాయితులైన రాజన్యచూడామణి విజయసంపన్నుండై శత్రువులసమీపంబున మగిడివచ్చువాఁ డెదుర. 218

మ కనియెన్ దైన్యరసప్రపూరితముఖిన్ గండస్థలన్యస్తహ
స్తను బాష్పాంబునిమజ్జమానకుచ నంచత్ప్రాయనాత్తోపకం
ఠను సంత్రాసవిలోలలోచననిరూఢన్ స్రస్తధమ్మిల్లబం
ధనునత్యంతభయాపనేయజనశూన్యన్ రాజకన్యామణిన్. 219

చ. కనుఁగొని జేరవచ్చి భయకంపితగద్గదకంఠనాద యై
జనకునిఁ దల్లిఁ బేరుకొని సంతతముం బరిదేవనంబు మా
నని నృపకన్య నూఱడిల నమ్మికమాటలు పల్కి దానిచే
నొనరఁగఁ బేరుఁ బెంపుఁ గులమున్ విని మన్మథరాగచిత్తుఁ డై. 220

ఉ. ఈయెలనాఁగఁ దోడుకొని యిప్పుడ యేను పురంబులోనికిం
బోయి మదీయమోహమును బుత్రులు లేమియు శైబ్యతో నభి

---

సరసత్వముతో. 216 వైరిపతులు = శత్రురాజులు, చూఱలాడఁగాన్ = కొల్లపెట్టఁగా. 217 దారుణ = క్రూరులైన, శాతవిశిఖాఘాతంబులన్ = తీక్ష్ణములైన బాణముల ప్రేటులచేత, సంక్షోభించి = కలఁతపడి, నానాదిశాంతనితాంతక్షితిభృద్గుహావళులలోనన్ = పలుదిక్కుల కడలయందలి విశాలములైన కొండగవుల పఙ్క్తులయందు, అత్యుద్గతిన్ = అతివేగముగలగమనముతో. 218 అరాతిచక్రంబు = పగవారిగుంపు, కోశాది = బొక్కసము మొదలగు, పలాయితులైనన్ = పాఱిపోఁగా. 219 ప్రపూరిత = మిక్కిలి నిండింపఁబడిన, గండస్థలన్యస్తహస్తను = చెక్కిళ్లయందుంచఁబడిన చేతులుగలదానిని, బాష్పాంబునిమజ్జమాన = కన్నీళ్లచేత తడియుచున్న అంచత్ప్రాయన్ = మనోజ్ఞమైన యౌవనముగలదానిని, ఆత్తోపకంఠన్ = పొందఁబడిన సమీపముగలదానిని, (లేక) అంచత్ప్రాయసీతోపకంఠన్ = మనోజ్ఞయౌవనముచేత పొందింపఁబడిన సమీపముగలదానిని, సంత్రాసవిలోలలోచననిరూఢన్ = భయముచేత చలించుచున్న చూపులను వహించినదానిని, స్రస్తధమ్మిల్లబంధన్ = వీడినకొప్పుగలదానిని, అత్యంతభయాపనేయజనశూన్యన్ = మిక్కుటమైనభయమును పోఁగొట్టునట్టి జనులులేనిదానిని. 220 పేరుకొని = పేరుగ్రుచ్చి-తలఁచు

ప్రాయ మెలర్పఁజెప్పి యనురాగముతోడ వివాహమయ్యెదక
నాయెడఁ దప్పఁబట్టదు మనంబున నాసతి గొడ్డు గావునన్. 221

వ. అని నిశ్చయించి యక్కన్యారత్నంబుఁ దోడుకొని యతిప్రయత్నంబున రథం బెక్కించుకొని విజయలక్ష్మీసమేతుండై వచ్చునప్పు డతనికిదోడుగాఁ బౌరజన భృత్యామాత్యవర్గంబుతో శైబ్య వచ్చి జీవితేశ్వరు సవ్యభాగంబున నున్నయ క్కన్యఁజూచి కలుషతామ్రలోచనయై యదరిపడి యిట్లనియె. 222

ఉ. ఈహరిణాక్షి యెవ్వరిది యేటికిఁ దెచ్చితి నీకు దీనిపై
మోహము గల్గెనో ముదిసి ముప్పున నన్నుఁ దిరస్కరించి యు
ద్వాహముగాఁ దలంచితొ కదా యనినం గడు భీతమానసుం
డై హృదయంబు జల్లుమన నంగనతోడ నృపాలుఁ డిట్లనున్. 223

తే. కోడలిదిమనయింట నీకోమలాంగి, యుండఁదగు నని తెచ్చితినో మృగాక్షి
నీకుఁ బ్రియమేని నీయొద్ద నిలుపుకొనుము, కాకయుండిన వేఱొకకడకు ననుపు.

చ. అనవుడు నేనువంధ్యను నరాధిప వేఱొకభార్య లేదు నీ
కును సుతుఁ డెవ్వఁ డీతరుణికోడలుగాఁగతమేమి యన్న న
వ్వనిత యొడంబడం దగినవాక్యముఁ గానక కొంతసేపు మె
ల్లన వినయంబుఁజేసి తెరలంబడి యాసతితోడ నిట్లనున్. 225

తే. నీవు గొడ్రాలవై యుండెదే కుమారుఁ
డుదయమందకపోవునో యువిద సుతుఁడు
గలిగినప్పుడు కోడలు గలదె నీకు
ననుచు నేరమిమొఱఁగు లిట్లాడుటయును. 226

తోటకవృత్తము. దరహాసముతో వనితామణి యా,ధరణీవరుఁ బ్రమదంబున మం
దిరసౌధములోనికిఁ దెచ్చి మనో,హరసౌఖ్యములందుచు నాతనికిన్. 227

క. గర్భంబుఁ దాల్చి యాసతి, యర్భకునిం గాంచెఁ బటుతరాహితరాజ్య
స్వర్భానుఁ డైనయతని వి,దర్భుం డను పేరు పెట్టి ధర్మస్థితితోన్. 228

క. తాముసు గొనివచ్చిన క,న్యామణిఁ బరిణయము చేసి యాతనయుని ధా
త్రీమండలాధిపతిగా, జ్యామఘుఁ డొనరించి తపము సలుపఁగఁ జనియెన్. 229

వ. అట్టి విదర్భుపేర నారాజ్యంబు విదర్భదేశంబయ్యె నట్టివిదర్భునకుఁ గ్రథకైశిక రోమపాదు లనంగ నిరువురుకుమారులు జన్మించి రందు. 230

సీ. రోమపాదునకు విభుఁడు పుట్టె వానికి ధృతి పుత్రుఁడయ్యె నాధృతికిఁ గౌశి
కుఁడు గల్గె నాకౌశికునకుఁ జేది జనించె నాచేదివంశజు లైనవారు

---

కొనియనుట, పరిదేవనంబు = విలాపంబును. 222 కలుషతామ్రలోచన = కోపముచేత ఎఱ్ఱవాఱిన కన్నులుగలది. 225 వంధ్యను=గొడ్డురాలను, తెరలంబడి=తేఱుకొని. 226 నేరమిమొఱఁగులు = నేర్పుచాలని వంచనమాటలు 227 దరహాసముతో = చిఱునవ్వుతో. 228 స్వర్భానుఁడు =

చైద్యులై ధరణిఁ బ్రశస్తి కెక్కిరి వారిచేత నాదేశంబు చేదిదేశ
మననొప్పెఁ గ్రథకైశికున కిందుమతి యనుకూఁతు కుఱ్ఱయు మఱికుంతి యనఁగు
తే. మారుఁడును గల్గి రాయిందుమతిఁ గకుత్స్థ
వంశజుం డైనయజుఁడు వివాహమయ్యెఁ
గుంతి యత్యంతభోగనిరంతుఁ డగుచు
ధరణిఁ బాలించెఁ గడలేనిధర్మములను. 231

వ. ఆకుంతికి వృష్ణియు నతనికి ధృతియును ధృతికి దాశార్హుండును నతనికి వ్యోముండును వానికి ననుండును ననునకుఁ బూరుహోత్రుండును వానికి నంశుండును నతనికి సత్వతుండును నతనికి సాత్వతుండునుం బుట్టిరి. 232

క. జ్యామఘువంశానుక్రమ, భూమీశులకథలు భక్తిపూర్వకముగ ని
చ్ఛామతులవిన్నవారికి, నేమియుఁ బాపములుసెంద వేకాలమునన్. 233

వ. మఱియు సాత్వతునకు భజమాన దివ్యాంధ దేవావృధ మహాభోజ వృష్ణు లనంగ నార్వురు వుట్టి రందు భజమానునకు నిమియును వృక్ణుండును వృష్ణియు శతజిత్తును సహస్రజిత్తును యుతజిత్తును ననంగ నార్వురు కుమారులు వుట్టిరి మఱియును. 234

క. దేవావృధునకు బభ్రుఁడు, దేవవిభుం డుద్భవించె దీప్తయశుండై
యావసుధేశునిచరితము, లీవార్ధిపరీతభూమియంతయు నెగడెన్. 235

వ. మఱియు మహాధర్ముం డైనమహాభోజునకు భోజమార్తులు వుట్టిరి. వృష్ణికి సుమిత్రుండు వుట్టె వానికి నమిత్రుండును శిబియునుం బుట్టి రందు నమిత్రునకు నిఘ్నుండు వుట్టె వానికిం బ్రసేన సత్రాజిత్తులనంగ నిరువురు వుట్టి రందు సత్రాజిత్తుండు. 236

సత్రాజిత్తునకు సూర్యునివలన శ్యమంతకమణి లభించుట.

మ. వనజాతప్రభవాండపూరితమహాధ్వాంతప్రణాశప్రభా
ఘనసాహస్రగునబ్ధమానసకళాకాష్ఠానిమేషాదికా
లనియుక్తుం బరముం బరాపరకళాలక్షీకృతుం జిత్రభా
నుని నారాధనసేసె రాజితతపోనుష్ఠానకర్మంబులన్. 237

తే. అతనిసద్భక్తియుక్తికి నాత్మ మెచ్చి, నీరజాప్తుండు ముందర నిలుచుటయును
దుర్నిరీక్ష్యప్రభలచేతఁ దోఁచుచున్న, దేవదేవునిఁ గానక దృష్టి చెదరి. 238

శా. ఓనారాయణమూర్తి నీమహిమ నేఁడుగ్రాగ్నిపిండోపమం

---

రాహువు. 231 నిరంతుఁడు=అంతములేనివాఁడు. 235 వార్ధిపరీత=సముద్రముచే ఆవరింపఁబడిన. 237 వనజాత ప్రభవాండపూరిత మహాధ్వాంత ప్రణాశప్రభాఘనసాహస్రగుక్=బ్రహ్మాండమునందు నిండిన దట్టమైన చీఁకటిని చెఱుచునట్టి వెలుఁగుచేత ఘనమైనవేయి కిరణములుగలవానిని, పరమున్ = సర్వోత్కృష్టుఁడైనవానిని, పరాపరకళాలక్షీకృతున్ = పరాపరవిద్యలచేత సాక్షాత్కరింపఁబడిన వానిని, చిత్రభానునిన్ = సూర్యుని. 238 నీరజాప్తుండు = సూర్యుఁడు, దుర్నిరీక్ష్యప్రభలచేతన్ = చూడశక్యముగాని కాంతులచేత. 239 ఉగ్రాగ్నిపిండోపమంబు = తీక్ష్ణమైననిప్పుముద్దవంటిది.

బై నాదృష్టికిఁ దోఁచుచున్న యది దివ్యంబైనయాకారముం
గానంజేసి కృతార్థుఁ జేయు మని భూకాంతుండు ప్రార్థించినన్
భానుం డెంతయు నాదరం బొదవ సంభావించి సంప్రీతితోన్. 239

క. తన గ్రైవేయకములలో, ఘనతేజముగల శమంతకంబనురత్నం
బొనరఁగ దెచ్చి రహస్యం,బున నాతనికంఠలగ్నమును జేయుటయున్. 240

క. మిత్రుని నీషత్పింగళ, నేత్రుని నత్యంతవామనీకృతసమ్య
గ్గాత్రునిఁ గవిజననుతి స,త్పాత్రునిఁ బొడగాంచె లోకబాంధవు సూర్యున్. 241

ఆ. చూచి పెక్కుగతులఁ జొక్కుచు ముందర,నున్న నతనితోడ నొక్కవరము
నిత్తు వేఁడుమనిన నీశమంతకరత్న, మిమ్మటన్న నిచ్చి యినుఁడు సనియె. 242

వ. సత్రాజిత్తుండును లోకబాంధవదత్తం బైనశమంతకరత్నంబు నాయకరత్నంబుగాఁ గంఠమాలికయందు నిడి మగిడి ద్వారకాపురంబునకు వచ్చుచున్నంతఁ దదీయరత్నప్రభాజాలంబులవలన రెండవసూర్యుండునుంబోలె నశేషదిశాసముద్భాసమానుం డైనవానింజూచి పౌరజనంబు లత్యాశ్చర్యధుర్యాయత్తచిత్తులై చని.

మ. భవసంహారుని నాదిదేవుని మహీభారావతారక్రియా
ప్రవణవ్యాజమనుష్యరూపుని నదభ్రప్రాభవోద్దామవై
భవతేజోవిభవప్రతాపుఁ గరుణాపారీణునిన్ యాదవ
ప్రవరుం గృష్ణునిఁ గృష్ణవర్ణతనునిం బద్మాయతాక్షున్ హరిన్. 244

క. కని దండనమస్కారము, లొనరించి కరములు మొగిచి యోదేవ దివం
బున నున్నసూర్యదేవుడు, చనుదెంచుచు నున్నవాఁడు సాంద్రప్రభలన్. 245

వ. అనినం ద్రికాలవేది యగుదామోదరుండు దరహాసితవదనుం డగుచు వారలతో నిట్లనియె. 246

క. రాజీవాప్తుఁడుగాఁడు ప,యోజహితుం బ్రీతుఁ జేసి యొకరత్నము స
త్రాజిత్తుఁడు గొనిరాఁ ద,త్తేజంబు వెలింగె నిట్టి దీప్తిచ్ఛటలన్. 247

---

240 గ్రైవేయకము=కంఠభూషణము, కంఠలగ్నమున్=మెడనుపొందినది యగునట్లుగా. 241 ఈషత్పింగళనేత్రునిన్ = కొంచెము పసుపువన్నెగల కన్నులుగలవానిని, అత్యంతవామనీకృతసమ్యగ్గాత్రునిన్ = మిక్కిలి పొట్టిగాచేయఁబడిన మంచిదేహము గలవానిని. 243 అశేషదిశాసముద్భాసమానుండు = ఎల్లదిక్కులయందు చక్కగా ప్రకాశింపుచున్నవాఁడు. 244 భవసంహారునిన్ = పుట్టుకలను మాన్చువానిని, మహీభారావతారక్రియాప్రవణ వ్యాజమనుష్యరూపునిన్ = భూభారమును దించుటయనెడుపనియందలి యాసక్తతయనెడు నెపముచేత నైనమనుష్యరూపముగలవానిని, అదభ్రప్రాభవోద్దామవైభవతేజోవిభవప్రతాపున్ = అల్పముకానిమహిమయు, అధికమైన యైశ్వర్యమును, తేజోవైభవమును, పరాక్రమమునుగలవానిని. 245 దివంబునన్ = ఆకాశమునందు.
246 త్రికాలవేది = భూతభవిష్యద్వర్తమానములనెడు మూఁడుకాలముల నెఱిఁగినవాఁడు.

వ. అని యాశ్వాసించిపుచ్చె నంత సత్రాజిత్తుండును నిజనివాసంబునకు వచ్చి సుఖం బుండె నాశమంతకరత్నంబు. 248

క. ఎనిమిదిబారువు లర్థము, దినదినమును గురియుచుండ దీనార్థిజనా
వనుఁడై సత్రాజిత్తుఁడు, ఘనసంపదవలన మహిమ గైకొనియుండెన్. 249

మ. ఉపసర్గాధికహీనవృష్టి పటువాయువ్యాజనానాసరీ
సృపదుర్భిక్షజలాగ్ని దుష్టవిమతక్షోభాదిదోషంబులం
దపనీతం బగుచుం మహామహిమతో నారాష్ట్రమత్యంతధ
ర్మపరంబై వెలిఁగెం శమంతకమహారత్నప్రభావంబునన్. 250

వ. అంత నొక్కనాఁడు ముకాంతకుం డత్యంతగుణవంతం బైనశమంతకంబు మహీకాంతుం డైనయుగ్రసేనుని నిశాంతంబుననుండనర్హం బతని కిప్పింతమని యేకాంతంబున నభ్యంతరజనంబులతోడం జింతనేసి బలవంతంబుచేసిన బంధుద్రోహం బగునని కొంకి యెప్పటియట్ల యుండెఁ దద్వృత్తాంతంబంతయు సత్రాజిత్తుం డెఱింగి యంతరంగంబున గలంగి. 251

క. ఇమ్మణిరత్నము గృష్ణుం, డిమ్మనినఁ బ్రియంబుతోడ నీవలయును నీఁ
బొమ్మని త్రోచినఁ గడువిర,సమ్మగు బలవంతుతోడి చల మేమిటికిన్. 252

తే. అని తలంచి సహోదరుఁ డగుప్రసేను, నపుడ రప్పించి యిచ్చిన నతఁడు దానిఁ
గంఠమాలికలో గ్రుచ్చి కట్టికొనియె, నెంతయాప్తులచేతికి నీఁదలంకి. 253

చ. నరవరసూనుఁ డొక్కఁ డొకనాఁడు తురంగము నెక్కి వేటమై
నరిగి వనంబులోనఁ దిరుగాడఁగ సింహము వచ్చి యావిభుం
దురగముతోడఁబట్టికొని దుష్టగతిం వధియించి మించి త
ద్వరమణిరత్నముం గొని జవంబునఁ బోవుచు నున్న యత్తఱిన్. 254

తే చటులగతిఋక్షపతి యైనజాంబవంతుఁ
డామృగేంద్రముఁ బరిమార్చి యాశమంత
కంబుఁ గొనిపోయి తనదుబిలంబుఁ జొచ్చి
తనయుఁ డగుసుకుమారున కొసఁగ నిచ్చె. 255

సీ. అంత యాదవవీరు లాప్రసేనుని చావు విని యెంతయును దుఃఖవివశులగుచు
దామోదరుఁడు శమంతక ముగ్రసేనున కిప్పింత మనుచుండు నెల్లనాఁడు

---

248 ఆశ్వాసించి=సమాధానపఱిచి. 249 దీనార్థిజనావనుఁడు=దరిద్రులను యాచకులనురక్షించువాఁడు. 250 ఉపసర్గ...దోషంబులన్ = మారీఉపద్రవము మొదలగు ఉత్పాతములు మితిమీఱిన వానలు వానలేమి పెనుగాలి వీచుట బహువిధములైన సర్పములవలనిభయము కఱవునీళ్లు నిప్పుదుర్జనులుశత్రువులు వీరివలనికలఁతపాటు మొదలుగాఁగలలోపములు, అపనీతంబు = తొలఁగింపఁబడినది. 251 నిశాంతంబునన్ = ఇంట, బలవంతంబు = నిర్బంధము, కొంకి = సంకోచించి. 252 త్రోచినన్ = విడదాడినను. 253 తలంకి = వెఱచి. 254 ఒక్కఁడు = ఒక్కఁడే, వేటమైన్ = వేటాఁడుటకొఱకై. 255 ఋక్షపతి = ఎలుఁగులరాజు. 256 సామవాదములన్ = మంచిమాటలతో, ఘోర

దానికి సామవాదముల సత్రాజిత్తుఁ డీనేరఁడని కదా యిప్పు డతని
తమ్మునిఁ జంపి రత్నముఁ దెచ్చుకొన్నవాఁ డింత సాహసకృత్య మెవ్వఁ డోపుఁ
తే. బరులవలనఁ గీడు వొరసినఁ జెడకుండఁ, నాదరమునఁ బ్రోచు నవ్విభుండు
తానె కరుణ మాని దండించువాఁడగు, నేని సుజనవర్గ మేమిసేయు. 256
వ. అని యిట్లు పలుకుచున్నలోకాపవాదంబునకు వెఱచి నారాయణుండు. 257

శ్యమంతకమణిమూలంబున శ్రీకృష్ణునకు జాంబవతీసత్యభామలు భార్యలగుట.

సీ. సేనలుఁ దాను బ్రసేనుండు మును గానకరిగినచొప్పున నరిగి యొక్క
యెడ మృగేంద్రునిచేతఁ గెడసిన యానిఘ్నుసుతు నెల్లవారికిఁ జూపి సింహ
పదమార్గమున నేగి భల్లూకనిహతపంచాస్యకళేబర మచటఁ గాంచి
ఋక్షవల్లభుజాడ నేగి ముందఱ నొక్కగిరిగహ్వరముఁ గని కేశవుండు
తే. నిఖిలబలమును నచ్చోట నిలిపి బిలము
దఱియఁజొచ్చి కొండొకనేల యరిగి యచట
గాంచె నానామణిప్రభాకలితమహిమ
తోరమైయున్న జాంబవంతునిపురంబు. 258
క. అక్కడ నొక్కకుమారుని, నక్కున నిడి యొక్కదాది యనురాగముతో
మిక్కిలి నుపలాలింపఁగ, నక్కమలాక్షుండు వినియె నవ్వాక్యంబుల్. 259
(శ్లో. సింహః ప్రసేనమవధీత్సింహో జాంబవతా హతః,
సుకుమారక మా రోదీస్తవ హ్యేష శమంతకః.)
ఆ. హరి ప్రసేనుఁ జంపె నమ్మృగేంద్రంబును, జాంబవంతుచేతఁ జచ్చె నిపుడు
గలిగె నీశమంతకము నీకు సుకుమార, యేడు పుడుప వన్న యింకనైన. 260
వ. అనియిట్లు పలుకుచున్నదాది పలుకు లాకర్ణించి ముందట. 261
తే. జలజనాభుఁడు పొడఁగాంచె జాంబవత్కుమారుకంఠప్రదేశమం దంచితప్ర
భావిభాసితమై నూత్న భానురుచికి, మాఱుమలయుచు నున్న శమంతకంబు.
క. చేరంగవచ్చి శౌరికుమారునికంఠమున నున్న మణిరత్నము దు
ర్వారగతిఁ బుచ్చుకొన్న మహారభసముతోడ దాది యాక్రోశించెన్. 263
ఆ. అంత జాంబవంతుఁ డత్యంతదారుణ, కోపదీప్తుఁ డగుచు నాపురాణ
పురుషవరునితోడఁ బోరాడె నేకవింశతిదినంబు లతులసాహసమున. 264
చ. వనరుహనాభురాక గరువంబునఁ గోరుచు సేనలెల్ల నే

సినన్ = కలిగినను. 258 కెడసిన = చచ్చిన, భల్లూకనిహతపంచాస్యకళేబరము = ఎలుఁగుగొడ్డు చేతచంపఁబడిన సింహముయొక్కదేహమును, గహ్వరముల్ = గుహను, తోరము = అధికము. 259 అక్కునన్ = ఱొమ్మునందు, ఉపలాలింపఁగన్ = బుజ్జగింపఁగా. 262 అంచితప్రభావిభాసితము = ఒప్పిదమైన కాంతిచేతప్రకాశించునది, నూత్నభానురుచికిన్ = బాలసూర్యునివెలుఁగునకు మాఱుమలయుచున్ = ప్రతిఘటించుచు. 263 దుర్వారగతిన్ = అడ్డములేనివిధమున, మహారభసముతోడన్ = మిక్కిలితత్తఱపాటుతో, ఆక్రోశించెన్ = ప్రలాపించెను. 265 గరువంబునన్ =

డెనిమిదినాళ్లు సూచి యతఁ డీల్గెనొ కాకని ద్వారకాపురం
బున కరుదెంచి భక్తిపరిపూర్తిఁ దిలోదకపిండదానముల్
గొనకొని చేసె బంధుజనకోటి యథావిధిపూర్వకంబుగన్. 265

ఆ. అందువలనఁ గృష్ణుఁ డాప్యాయితశరీరుఁ, డగుచు నతులశక్తి నని యొనర్చె
నపుడు జాంబవంతుఁ డాహారనిద్రలు, లేమిఁ జేసి బలిమి లేక పోరె. 266

ఉ. బల్లిదు లైనఋక్షయదుభర్త లుదగ్రపరాక్రమంబులన్
మల్లుపెనంగునంత మురమర్దనుముష్టిహతాఖిలాంగుఁడై
తల్లడపాటుచిత్తమునఁ దార్కొని బీరముఁ గట్టిపెట్టి యా
భల్లవిభుండు గృష్ణునకు భక్తిమెయిం బ్రణమిల్లి యిట్లనున్. 267

మ మును లంకాపురిలోన రావణుబలంబుల్ రామునైన్యంబుతో
నని గావించు నెడన్ నిశాచరుల నుద్ఘాటించి రామావనీ
శుని మెప్పించితి నట్టి నాకొకమనుష్యుం డెంత నా పేరు వి
న్నను దేవాసురవీరసైన్యములకైనన్ గర్వముల్ బెండగున్. 2(6)8

ఉ. నిన్ను మనుష్యమాత్రుఁడని నిక్కముఁ జెప్పఁగరాదు సత్వసం
పన్నత జూపి నన్ను బహుమానము సేయఁగవచ్చినట్టి యా
పన్నగశాయి యట్ల కనుపట్టెద వింక ననుగ్రహింపవే
యన్న మురాంతకుండు దరహాసము మోమున నివ్వటిల్లఁగన్. 269

చ. తను నెఱిఁగించి చిత్తమునఁ దార్కొని యున్నకృపాంబురాశిలో
ననయము నోలలార్చి చటులాహవఖేదము లెల్లఁ బుచ్చి వై
చినఁ బరమానురాగమునఁ జెంది ముకుందుని మేడలోనికిం
గొని చని పూజసేసి తనకూఁతును జాంబవతిం బ్రియంబునన్ 270

ఉ. కానుక యిచ్చి పెండ్లి యొడికంబుగఁ జేసి శమంతకంబుతో
మానితవస్తుజాలము సమగ్రముగా నుపదాన మిచ్చినన్
దానవసూదనుండు ప్రమదంబున జాంబవతీసమేతుఁడై
తా నరుదెంచె లోకవిదితంబుగ ద్వారకకున్ బ్రియంబుతోన్. 271

---

గౌరవముతో, ఈల్గెనొ కాకని = చచ్చెనే మోయని, కొనకొని = సొంతముగా. 266 ఆప్యాయితశరీరుఁడు = బడలికతీఱినదేహముకలవాఁడు, అనియొనర్చెన్ = యుద్ధముచేసెను. 267 మల్లుపెనంగునంతన్ = మల్లయుద్ధముచేయునపుడు, ముష్టిహతాంగుఁడు = పిడికిటిపోటులచేత కొట్టువడిన యెల్లయవయవములుగలవాఁడు, తల్లడపాటు = విచారము, బీరమున్ = శూరత్వమును, కట్టిపెట్టి = మాని, భల్లవిభుండు = భల్లూకరాజు, ప్రణమిల్లి = నమస్కరించి. 268 ఉద్ఘాటించి = చంపి, బెండగున్ = నిస్సారములగును. 269 నివ్వటిల్లఁగన్ = అంకురింపఁగా. 270 అనయము = మిక్కిలి, ఓలలార్చి = తేల్చి, చటులాహవఖేదములు = ఘోరయుద్ధమువలనిబడలికలు, పుచ్చివైచినన్ = పోఁగొట్టఁగా. 271 ఒడికంబుగన్ = ఒప్పిదముగా, ఉపదానము = అరణము, దానవసూదనుండు=రాక్షసులనుచంపువాఁడైన శ్రీకృష్ణుఁడు, లోకవిదితంబుగన్ = ఎల్లజనులకుఁ దెలియునట్లు,

ఉ. వచ్చినకృష్ణునిన్ సుజనవత్సలుఁ గన్గొని ద్వారకాజనుల్
ముచ్చటలెల్ల దాపుకొని మ్రొక్కుచు సొక్కుచు సంతసంబునన్
మచ్చికలుం బ్రమోదములు మన్ననలుం గని రవ్విభుండుఁ దా
నచ్చపలాక్షి జాంబవతి నంతిపురంబున నుంచి పెంపుతోన్. 272

శా. సత్రాజిత్తున కాశమంతకము వాత్సల్యంబుతో నిచ్చి లో
కత్రాసం బగునిందఁ బాపుకొని నిష్కాపట్యుఁడై దేవకీ
పుత్రుం డుండె జగంబులెల్లను జగత్పూతాత్మునిన్ శుద్ధచా
రిత్రుం గృష్ణుని మెచ్చి రాదరవిహారీభూతచేతస్కులై. 273

మ. తనచిత్తంబు భయంబుఁ బాయుటకు సత్రాజిత్తుఁ డాత్మీయనం
దనఁ జంద్రాస్యను సత్యభామ యనుకన్యారత్నముగ్ గోపికా
జనవక్షోరుహశాతకుంభకలశాంతర్న్యస్తకస్తూరికా
ఘనసారాంచితపీనవక్షునకు వేడ్కన్ బెండ్లి గావించినన్. 274

క. కృతవర్మయు నక్రూరుఁడు, శతధన్వునికడకుఁ బోయి సమధికకోపా
న్వితులై సత్రాజిత్తుని, యతిధార్త్యం బుగ్గడించి యని రాతనితోన్. 275

ఆ. మునుపు సత్యభామ మనలోన నొకరున, కిత్తు ననుచు నిశ్చయించి పలికి
యాలతాంగి నిప్పుడబ్జాక్షునకుఁ బెండ్లి, సేసె మమ్ము నిన్ను సిగ్గుపఱచి. 276

తే ఇంతసేసిన దుష్టాత్ము నెట్టులైన
సంహరించి శమంతకచారురత్న
మపహరించినఁ బగయెల్ల నణఁగిపోవు
ననిన శతధన్వుఁ డగుఁగాక యనుచు నుండె. 277

{ సత్రాజిత్తునిజంపి శ్యమంతకము నపహరించిన శతధన్వుని శ్రీకృష్ణుండు సంహరించి అక్రూరునియొద్దనున్న ఆశ్యమంతకమణిని గ్రహించుట. }

వ అంత నొక్కనాఁడు దేవకీనందనుండు పాండునందనులు వారణావతంబున దుర్యోధనుకపటకృత్యంబుల నైనలక్కయిండ్ల నగ్నిభయంబుఁ బొరయకుండ రక్షించువాఁడై యరిగిన సమయంబువేచి. 278

క. రాత్రి సుఖనిద్రఁ జెందిన, సత్రాజిత్తును వధించి శతధన్వుఁడు త
త్పుత్రకళత్రము లఱవఁగ, ఘోత్రంబున నాశమంతకముఁ గొని చనియెన్. 279

క. కృతవర్మాక్రూరుల యను, మతమునఁ దమతండ్రిఁ జంపి మణిరత్నం బా
శతధన్వుఁ డపహరించిన, మతమంతయు సత్యభామ మదినెఱిఁగి వెసన్. 280

273 లోకత్రాసంబు = లోకమునకు భయంకరము. 274 గోపికా...వక్షునకున్ = గొల్లపడుచుల యొక్క స్తనములనెడు బంగారుకలశములయందు పూయఁబడినకస్తురిగంధముచేత మనోజ్ఞమై విశాలమైనఱొమ్ముగలవానిని. 275 ధార్త్యంబు = ధూర్తత్వము - ఆకతాయతనము. 276 సిగ్గుపఱచి = అవమానపఱచి. 278 వేచి = కనిపెట్టి. 279 ఘోత్రంబునన్ = చలముతో. 280 మతము =

ఆ. అరదమెక్కి యతిరయంబునఁ దగువారుఁ, దాను వారణావతమున కరిగి
పాండుసుతులఁగూడి ప్రమదంబుతోనున్న, యబ్జనాభుకడకు నరుగుదెంచి. 281

చ. ఉడుగని బాష్పపూరముల నుగ్మలి యవ్విభుపాదపద్మముల్
దడుపుచు నర్ధరాత్రి శతధన్వుఁడు తండ్రి నకారణంబ రూ
పడఁచుటయున్ శమంతకమహామణిరత్న మతిప్రయత్న మే
ర్పడఁ గొని చన్న ధౌర్త్యము నపారపుదుఃఖముతోడఁ జెప్పినన్. 282

క. వెఱఁగంది శౌరి యిట్లనుఁ, దెఱవా మీతండ్రి నిట్లు దెగి చంపిన యా
మొఱకు శతధన్వి నిప్పుడ, నఱకెద మోమోటలేక నాచక్రమునన్. 283

క. అని సత్యభామ నూరా, ర్చి నళినదళలోచనుండు చెచ్చెరఁ గుంతీ
తనయుల వీడ్కొని నిజపుర, మునకుం జనుదెంచెఁ బయనముల వేగమునన్. 284

తే. వచ్చి యేకాంతమునఁ దమవారలైన, యుగ్రసేనాదిబలభద్రయోధవరుల
తోడ శతధన్వచేసిన తులువతనము, నెఱుకపడఁజెప్పి వెండియు నిట్టులనియె. 285

మ. రవిదత్తం బగు నా శమంతకమహారత్నార్థమై దారుణా
టవిలో నాఁడు ప్రసేను ప్రాణములు గెంటంజేసె సింహంబు బాం
ధవుఁడయ్యున్ శతధన్వుఁ డిప్పు డిదె సత్రాజిత్తునిం జంపె ని
ట్లు వృథాదుర్మరణంబునం బడిరి తోడ్తో నన్నయుం దమ్ముఁడున్. 286

క. అనిపలికి శౌరి సీరిం, గనుఁగొని యిట్లను శమంతకము ముల్లోకం
బునకు నుపకారభూతము, మనకర్హముగాక యితరమనుజుల కగునే. 287

తే ఇంత సేసినదుష్టాత్ము నిపుడెపట్టి, గెడపకుండిన మన కపకీర్తివచ్చు
ననిన శతధన్వుఁ బరిమార్చి యమ్మణీంద్ర, మర్థితోఁ బుచ్చుకొన సీరి యాససేసి.

తే. శౌరికంటెను గోపరసప్రపూర్ణ
హృదయుఁడై యుండె నావిధంబెల్ల నెఱిఁగి
వెఱచి శతధన్వుఁ డెంతయు విహ్వలించి
యన్యు లెఱుఁగకయుండ నేకాంతమునను. 289

క. కృతవర్మకడకుఁ జని య, చ్యుతుఁడు తనుం జంప నున్న యుద్యోగముఁ జె
ప్పి తనకుఁ దోడై రమ్మని, యతనిం బ్రార్థించి పిలిచె నాహవమునకున్. 290

క. అవ్వచనములకు మదిలో, నవ్వుచుఁ గృతవర్మ పలికె ననుఁ బిలిచెదు నీ
వవ్వనజాక్షుని మార్కొన, నివ్వెడఁగుందనము నీకు నేటికిఁ గలిగెన్. 291

ఉ. ఏనును నీవు నేల జగ మింతయు నొక్కటఁ గూడివచ్చినన్

---

అభిప్రాయము - వృత్తాంతమనుట. 283 తెగి = సాహసించి, మొఱకు = మూర్ఖుఁడైన. 286 గెంటంజేసెన్ = పోఁగొట్టెను. 287 సీరిన్ = బలరాముని. 288 కెడపకుండినన్ = చంపకున్న. 289 విహ్వలించి = చిత్తస్వాస్థ్యముతప్పి. 290 ఉద్యోగము = ప్రయత్నము, ఆహవమునకున్ = యుద్ధమునకు. 291 వెడఁగుందనము = పిచ్చితనము. 292 దుర్విచారము = చెడ్డ

దానవవైరి ముందరఁ బ్రతాపముఁ జూపగరాదు కావునన్
మానుము దుర్విచారము మనంబున నెమ్మెయి మానకుండినన్
మానముఁ గోలుపోదు వనుమానము మాను మనం గలంగుచున్. 292

మ. అతఁ డక్రూరునిపాలికేగి తనకార్యంబంతయుం జెప్పి య
చ్యుతునిన్ మార్కొని పోరఁ దోడుపడుమంచున్ బిట్టు ప్రార్థించినన్
శతధన్వా యెటువంటిదుర్మతివి నీసామర్థ్య మాశౌరిపై
మతి నూహింప వినాశ హేతువగు నీమాటల్ వినంగూడు నే. 293

వ. అదియునుంగాక యమ్మహాత్ముండు నిశాచరాధిపశుద్ధాంతకాంతావైధవ్యకారణావక్రవిక్రమోపక్రమచక్రపాణియును, పాపప్రహారప్రకంపిత జగత్త్రయప్రాణియును, పురందరాదిదిక్పాలకఫాలపట్టికాసంఘటితపదారవిందుండును, సనకసనందనాదిభక్తజనవిందుండును నైన గోవిందుం డెవ్వరికి నజేయుండు గావున బుద్ధిమంతుండవై యెటకేనియుం దొలంగిపొమ్మనిన నొడంబడి యతం డిట్లనియె.

ఉ. ఏ నెటకేనియుం దొలఁగి యేగెద నీమహనీయరత్నమున్
మానుగ నీవు దాఁపుము రమాపతి బారికిఁ దప్పివచ్చినన్
గానుక నాకు నిచ్చె దటుగా కొకనైనను నిన్నె చేరెడుం
గాని కడున్ రహస్యముగఁ గైకొనుమా నిను నమ్మి యిచ్చెదన్. 295

చ. అని తనచేతిరత్నముఁ బ్రయత్నముమీఱఁగ నిచ్చె నిచ్చినన్
మనమున సంతసిల్లియు సమంజసబుద్ధిఁ దలంచి యింక నీ
పని యొరుతోడఁ జెప్పనని బాస యొనర్చినఁ గాక యొల్ల నే
ననుటయు నట్లకాక యని యాతనికిన్ శపథంబు పల్కెనన్. 296

ఆ. సంతసిల్లి యాశమంతకం బతిరహ
స్యంబుగాఁగ దాఁచె నంతలోనఁ
దన్నుఁబట్టికొనఁగఁ దగువారిఁ గృష్ణుండు
పనుచు టెఱిఁగి యతఁడు భయము గదుర. 297

క. అతితీవ్రవాయువేగియు, శతయోజనవాహినియును సమధికసత్వో
ద్ధతియును నగుగోడిగఁ దా, శతధన్వుం డెక్కి చనియె సత్వరవృత్తిన్. 298

వ. అంత బలదేవుండు దోడురా వాసుదేవుండు సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహ

---

యాలోచన. 293 బిట్టు = మిక్కిలి. 294 నిశాచరా...చక్రపాణి = రాక్షస రాజులయొక్క యంతఃపురస్త్రీలవిధవాత్వమునకు కారణమైన బుజువైనపరాక్రమమును జూపుటకు చక్రమును చేతఁ బట్టినవాఁడు, పాపప్రహారప్రకంపిత జగత్త్రయప్రాణి = పాపమును (తొలఁగ) కొట్టుటచేత వణఁకఁ జేయఁబడిన మూఁడులోకములలోనిప్రాణులునుగలవాఁడు, ఫాలపట్టికాసంఘటిత = పట్టెలవంటి నొసళ్ల యందుఁ జేర్పఁబడిన, విందుఁడు = తెలిసికొనువారుగాఁగలవాఁడు. 295 దాఁపుము = దాఁచిపెట్టుము. 296 బాస = ప్రమాణము. 298 గోడిగన్ = ఆడుగుఱ్ఱమును.

కంబులను తురంగంబులం బూన్చినరథంబు సూతుం డైనదారుకుండు తెచ్చు
టయు రథారోహణంబుచేసి యతిత్వరితవేగంబున వెనుకొని చనిన. 299

చ. గురుతరవాయువేగమున గోడిగయుర్ శతయోజనంబు లు
ద్ధురగతిఁ బాఱిపాఱి దగతో మిథిలానగరోపకంఠ భా
సురసహకారనీపవటచూతమధూకకదంబమాధవీ
మరువకశోభితోపవనమధ్యమునంబడి చచ్చెఁ జచ్చినన్. 300

తే. పాదచారియై రయమునఁ బాఱిపోవఁ
జొచ్చుటయు దవ్వుదవ్వులఁ జూచి శౌరి
సీరికిట్లను నీవిందు నీరథంబు
నందుఁ జూచుచునుండు మే నరిగి యిపుడు. 301

మ. తులువం జంపి శమంతకంబుఁ గొనివత్తుర్ మీరు మెచ్చంగ నే
నలఘుప్రౌఢి నటంచుఁ దేరు డిగి రంహస్ఫూర్తి సింహంబు పే
రలుకర్ నీచమృగంబుపై నరిగినట్లై క్రోశ మేతెంచి ద
వ్వుల నోహో నిలు పోకు మంచు శతధన్వుం బల్కి యత్యుగ్రతన్. 302

ఉ. వారిజలోచనుండు బలవద్రిపుమండలఖండనక్రియా
దారుణశాతచక్రమునఁ దచ్ఛిరముగ్రతఁ ద్రుంచి యాతనిం
జేరఁగఁబోయి మస్తకముచీర పటంబులు కంఠహారకే
యూరము లాదిగా వెదకియుం బొడగానఁడు రత్నరాజమున్. 303

వ. ఇట్లుకానక మగిడివచ్చి యావృత్తాంతంబంతయు బలభద్రునకుం జెప్పుటయు
నతండు దన్ను మొఱఁగి యారత్నం బీజాలండో యని విశ్వసింపక కోపించి
యిట్లనియె. 304

క. తమ్ముఁడవని నిన్నేగతి, నమ్మంగావచ్చు నెట్లు నాకొసఁగక ర
త్నమ్మటమటించుకొంటివి, పొమ్మిఁక నీతోడిపొత్తు పొరపొచ్చె మగున్. 305

చ. అనుటయుఁ బద్మనాభుఁడు హలాయుధుఁ గన్గొని యేను నీకు వం
చనమొనరించి దివ్యమణి యైనశమంతము దాఁచలేదు నీ
మనమున శంకగల్గిన ప్రమాణముచేసెద నీవు గోరినర్
వనరుహమిత్రు చేతఁ గొనివచ్చెద నవ్విభుకంఠమాలికల్. 306

300 ఉద్ధురగతిర్ = మిక్కిలివడిగలనడకతో, దగతోర్ = దప్పితో, ఉపకంఠ = సమీపమునందలి. 302 రంహస్స్ఫూర్తిర్ = వేగముయొక్కస్ఫురణతో, క్రోశము = ఒకకోసెఁడుదూరము. 303 బలవద్రిపుమండల = బలవంతులైన శత్రుసమూహములయొక్క, దారుణశాతచక్రమునర్ = భయంకరమై కఱకైన చక్రముచేత, మస్తకముచీర = తలగుడ్డ, పటంబులు = పైబట్టలు, పొడగానఁడు = చూచినవాఁడు కానేకాకపోయెను—కనఁబడకపోయెననుట. 304 మొఱఁగి = వంచించి, ఈఁజాలండో=ఇయ్యఁడోయేమో. 305 అటమటించుకొంటివి = అపహరించుకొంటివి, పొత్తు=స్నేహము, పొరపొచ్చెము = మిక్కిలితక్కువైనది. 306 శంక = సందేహము.

మ. అని యిట్లన్ని విధంబులం బలికినన్ హాలామదోద్వేగలో
చనఘూర్ణీకృతుఁడై హలంబురుభుజాస్తంభంబుపై నిల్పి కో
పనిరూఢోక్తులఁ గృష్ణునిం బలికి నీబంధుత్వముఁన్ ద్వారకా
జనసాంగత్యము నొల్లనే నిఁక యథేచ్ఛావృత్తిమైఁ బోయెదన్. 307

వ. అనిపలికి మహారోషంబున బలభద్రుండు కృష్ణుండు దన్ను నెంత పెనంగి ప్రార్థించినను విడుపించుకొని మావంతునిచేత విడివడిన భద్రదంతావళంబు చందంబున మిథిలాపురంబునకుం జని జనకచక్రవర్తిచేతఁ బూజితుండై యారాజయోగివలన నధ్యాత్మవిషయంబులయిన యితిహాసంబులు వినుచు ధృతరాష్ట్రనందనుం డైన దుర్యోధనునకు గదావిద్యసెప్పువాఁడై సంవత్సరత్రయం బుండె నంత. 308

ఆ. ద్వారవతికి మగిడివచ్చి దామోదరుం, డిట్టినింద దనకు నేలవచ్చె
ననుచు రేయిఁబగలు నాత్మఁ జింతించుచు, నుచితవర్తనమున నుండె నంత. 309

ఆ. జలజనయనువలన సంశయంబేమియు, నొందకుండు టెఱిఁగి యుగ్రసేన
బభ్రుముఖ్యు లరిగి బలభద్రుఁ దోడ్కొని, తెచ్చి రతని కలఁక దేర్చి పురికి. 310

క. ఆరీతిని రత్నం బ, క్రూరుఁడు గొనిపోయి దాఁచి గోప్యముసేసెన్
వారక నిత్యము నెనిమిది, బారువు లర్థంబు గురియఁ బరమప్రీతిన్. 311

వ. కుబేరుండునుంబోలే మహాధనవంతుండై యుండి తనయర్థంబు నిరర్థకం బగు వ్యయంబు సేయక పరమేశ్వరార్పణంబుగా యజ్ఞంబులు సేయుచుండి యజ్ఞదీక్షాపరు లైనక్షత్రియవైశ్యులవధియించిన వారు బ్రహ్మహంతలగుదు రని పెద్దలచేత నెఱుంగుటం జేసి సవనదీక్షాకవచంబువలన సురక్షితుండై యఱువదిరెండు సంవత్సరంబు లుండె నమ్మణిప్రభావంబునఁజేసి యాదేశంబు మారికోపసర్గాది దోషంబులు లేక విలసిల్లె నంత. 312

ఆ. భోజముఖ్యులయిన రాజు లక్రూరుని, బంధువరులు రాచపాడి దప్పి
సత్వతప్రపౌత్రుశత్రుఘ్నుఁ డనువానిఁ, ద్రుంచి రాగడమున దొమ్మిచేసి. 313

తే. తన్నిమిత్త మక్రూరుఁడుదనకు నెంత, యొప్పములువచ్చునోయనియుండ వెఱచి
భోజసహితుఁడై కాశికాపురికిఁబోయెఁ,బోయిన మొదలుయాదవభూమియందు. 314

సీ. జగతిపైఁ గాలవర్షంబులు లేవయ్యె సస్యంబులెల్ల నాశంబుఁ బొందె
నత్యంతదుర్భిక్షమై దేశములు నొచ్చె ధారణ లెంతయుఁ దఱిగివచ్చె

307 హాలామదోద్వేగలోచనఘూర్ణీకృతుండై=మద్యపానమువలనిమత్తుచేతనైనకన్నులయొక్క త్రిప్పుట గలవాఁడై. 308 మావంతునిచేతన్=మావటివానిచేత, భద్రదంతావళంబు=భద్రజాతియేనుఁగు. 309 రేయిఁబగలు=రాత్రియుఁబగలును. 311 వారక=తప్పక. 312 సవనదీక్షాకవచంబువలన=యజ్ఞదీక్షయనెడుకవచమువల్ల, మారికోపసర్గాదిదోషంబు=మారీఉపద్రవము మొదలైనకీడులు. 313 రాచపాడి=రాజనీతి, ఆగడముగన్=దుష్టప్రవర్తనముచేత. 314 ఒప్పములు=అపదలు. 315 దుర్భిక్షము=కఱవు, ధారణ=

వ్యాధులు దఱుచయి బాధించెఁ బ్రజలను జావు లగ్గలమయ్యె జనులయందుఁ
బ్రళయానిలంబు లుత్పాతంబుగా వీచె ఘోరాగ్ని భయములు గోడుకొనియె

తే. దుష్టభుజగంబు లందందఁ దోలికఱచెఁ
క్రూరమృగచయ మెల్లఁ ద్రెక్కొలుగొనియె
జారచోరభయంబులు సంక్రమించె
ద్వారకానగరంబునఁ దఱుచుగాఁగ. 315

క. ఇట్టి మహోత్పాతంబులు, పుట్టినఁ గృష్ణుండు వృష్ణిభోజాంధకులన్
జుట్టములఁ బిలిచి వారల, కట్టియుపద్రవముఁ జెప్పె నతిదుఃఖితుఁడై. 316

తే. చెప్పి దీనికిఁ బ్రతికార మిప్పుడేమి, చేయుదము బుద్ధిమంతులు సెప్పుఁడనిన
నందకుం డనుయదువృద్ధుఁ డబ్జనాభుఁ, జూచి యిట్లనిపలికె నస్తోకమతిని. 317

క. విను మాధవ యక్రూరుని, జనకుండు శ్వఫల్కుఁ డమరసన్నిభుఁ డతఁడుం
డిన దేశంబులలో నెం, దును జెందవు మారికాదిదుర్దోషంబుల్. 318

వ. తొల్లి కాశీరాజు తనదేశంబున ననావృష్టిదుర్భిక్షమారికాదిదోషంబులు పుట్టిన శ్వఫల్కుం బ్రార్థించి వారణాశీపురంబునకుఁ దోడ్కొనిపోయి సకలకల్మషంబులు వాపుకొని యాసన్నప్రసవయై యున్నతనభార్యగర్భంబులో నున్నయిక్కన్నియ నిమ్మహాత్మునకు వివాహంబుచేసి కృతార్థుండ నగుదునని యున్న నదిపండ్రెండేండ్లు జనించక తల్లియుదరంబునంద పెరుగుచు నొక్కనాడు తల్లి సంకటపాటునకు దుఃఖించి తండ్రి కి ట్లనియె. 319

తే. ఇంక మూఁడేండ్లకునుగాని యే జనింప
నన్నిదినములు దిన మొక్క యావులెక్క
ధరణి దేవోత్తములకును దాన మొసఁగు
మట్లయైనను నా కుదయంబు గలుగు. 320

ఆ. అనిన నట్లకాక యని నిత్యకృత్యంబు
నతఁడు గురున కొక్కయావులెక్క
దాన మొసఁగుచుండెఁ దత్పుణ్యవశమునఁ
గూఁతు రుదయమయ్యెఁ గోమరు మిగిలి. 321

వ. అదినిమిత్తంబుగా నక్కన్నియకు గాందినీనామధేయంబుచేసి శ్వఫల్కున కిచ్చె నాదంపతులకుఁ బరమభాగవతోత్తముండైన యక్రూరుండు జన్మించెఁ దల్లిదండ్రులుసేసిన పుణ్యంబువలన నతఁ డున్నదేశంబులు సుభిక్షంబులై యుండు ననవరతయజ్ఞదీక్షాగతుం డైనపుణ్యపురుషుండు సమస్తదురితంబులఁ బాపనోపు నతండు చేసినయల్పాపరాధంబు నేరంబుగా విచారింపక లోకోపకారంబుగా విచారించునది యనిన నందకువచనంబు లాదరించి. 322

---

క్రయనిర్ణయము, కోడుకొనియెన్ =దుఃఖపెట్టెను. త్రెక్కొలు గొనియెన్ = హింసింప నారంభించెను, సంక్రమించెన్ = ఆక్రమించెను. 317 ప్రతికారము = ప్రతిక్రియ. 319 కల్మషంబులు = కీడులను,

క. భాణాంతకుఁ డక్రూరుని, ప్రాణార్థంబులకుఁ దప్పనని శపథం బ
క్షీణగతి నిచ్చి పిలువఁగ, క్షోణీసురవరులఁ దగినచుట్టలఁ బనిచెన్. 323

తే. గాందినేయుఁడు శౌరివాక్యములు నమ్మి
ద్వారకకు వచ్చి పూర్వప్రకారమునను
యాగములు సేయుచుండెఁ గృష్ణార్పణముగఁ
దచ్ఛమంతకరత్నార్థధాముఁడగుచు. 324

మ. కురిసెన్ వానలు సస్యవృద్ధి గలిగెన్ గొల్చెక్కుడై యస్మై నె
వ్వరు రోగంబులచేతఁ జావరు మృగవ్యాళాదిదుర్దోషముల్
విరిసెన్ సాధుమతంబు లెల్ల నడిచెన్ విఖ్యాతసౌఖ్యంబుతో
ధరశోభిల్లె శమంతకాఖ్యమణిరత్నస్థైర్యసంపత్తిచేన్. 325

వ. ఇట్లు సకలదురితనివారణం బగుటకు వెఱఁగుపడి పుండరీకాక్షుండు తనమనంబున నిట్లని వితర్కించె. 326

సీ. కడునల్పపుణ్యులు గాందినియును శ్వఫల్కుండును వారలకొడుకుఁగుఱ్ఱఁ
డక్రూరుఁ డితనిపుణ్యము చెప్పఁబడఁజాల దితనికి మహిమ దా నెట్లు గలిగె
నదియునుగాక నిత్యమును దప్పకయుండఁ గ్రతువులు సేయుచు సతతభూరి
దక్షిణల్ ద్విజులకుఁ ద్రవ్వితండములుగా నిచ్చుచున్నాఁడు నే నెఱుఁగకుండ
తే. నింత యర్థంబు వీనికి నెట్లు గలిగె, నింత తేజోవిశేషంబు నిట్టిపాటి
మహిమయును గల్గుటెల్ల శమంతకప్రభావమిది నిశ్చయంబని తలఁచియంత. 327

క. ఒకనాఁడు సకలయాదవ, నికరంబులతోడ గాందినీసుతుఁ బిలిపిం
చి కడుం బ్రియపూర్వకముగఁ, బ్రకటవినోదములు నడపెఁ బరిహాసముగన్. 328

వ. ఇవ్విధంబున నక్రూరునిచిత్తం బక్రూరంబుగాఁ బ్రతులుసేసి యిట్లనియె. 329

సీ. అనఘ నీచేఁ గమలాప్తదత్తం బైనయాశమంతక మవశ్యంబు నుండు
నేనెఱుంగుదు నదియెఱిఁగియు నీవనవరతయజ్ఞక్రియాపరుఁడ వగుటఁ
చూచి నీతో నది సూచింపకుండితి నది నాకుఁ దెలియదో యని రహస్య
వృత్తిమై దాఁచితి వీవు గావున దాఁగినట్లయ్యె నీవిధం బరసిచూడ
తే. వీర లిందఱు నామీఁద విశ్వసింప, కున్న వా రపకీర్తి నా కొదవకుండఁ
జూపుమా సకలబంధులుఁ జూడవలయు, నిందు నీ కపరాధ మొక్కింత లేదు.

వ. అనిన గాందినీనందనుండు దేవకీనందనుపలుకుల కులికిపడి మొగంబు వెల్లనై ధైర్యం బొక్కింత చేసికొని తనమతంబున. 331

క. మానికము దాఁచి లేదని, పోనాడి మొఱంగి తొలఁగిపోయిన నెందుం
బోనియ్యఁ డడిగినప్పుడె, యేను సమర్పింతు ననుచు హితమతితోడన్. 332

---

ఆసన్నప్రసవ = కనప్రొద్దులైనది. 323 చుట్టలన్ = చుట్టములను. 325 కొల్చు = ధాన్యము, విరిసెన్ = తొలఁగెను. 327 త్రవ్వితండములు = అపరిమితములు. 332 పోనాడి = పరిహరించి.

క. మును శతధన్వుఁడు దనకి,చ్చినచందముఁ దెలియఁజెప్పి చెచ్చెరఁ దనక
ట్టినపట్టుదట్టి పొరలో, నునిచినరత్నంబు దిగిచి యొసఁగెన్ హరికిన్. 333

పంచచామరము. సముజ్జ్వలారుణప్రభావిశాలభాసురోదయా
ర్కమండలోపమానమై జగజ్జనైకదుర్నిరీ
క్ష్యమై సభాజనప్రశస్తసాధువాదయోగ్యమై
శమంతకాఖ్యరత్న మొప్పె శౌరిసమ్ముఖంబునన్. 334

వ. ఇట్లు జాజ్వల్యమానంబై వెలుంగుచున్నరత్నంబు సకలజనంబులు పట్టిపట్టి చూచి సాధువాదంబులఁ బెద్దయుంబ్రొద్దు గొనియాడి రప్పు డక్రూరుండు కమలనాభున కిట్లనియె 335

క. లోకేశ యిమ్మణీంద్రము, నీకృప నామీఁదఁ జాలనిలిచినకతనం
జేకొని దాఁపఁగ నెఱసిరి, నాకుఁ గలిగె నిట్లు కానినాఁ డోపుదునే. 336

ఉ. ఇమ్మహనీయరత్నమున కెంతయు నాసలఁ జిక్కి చచ్చినా
రమ్మెయి నాప్రసేనుఁడుఁ దదగ్రజుఁడున్ శతధన్వుఁడున్ వినా
శమ్మును బొందె నట్లగుట సంతతమున్ దలపోసి యేను బ్రా
ణమ్ములు నమ్మకుండుదు జనస్తుత నేఁడు సుఖంబుఁ జెందితిన్. 337

క. లోకోపకారముగ నిది, నాకడ దాఁచితిని దీని నారాయణ యీ
పోకలు దెలిసియు నడుగక, నీ కీననియుండితిన్ వినిశ్చితబుద్ధిన్. 338

చ. అడుగక కాని దాఁచినపదార్థము లిచ్చుట నీతిగాదు నీ
వడిగితిగాన నిప్పుడు సమర్పణసేసితి నింక నాయెడన్
గొడవలు లేవు నీమనసుకోరిక యేగతినుండునట్లుగా
నడుపుము భక్తవత్సలత నన్నుఁ గృతార్థునిఁ జేయు కేశవా. 339

తే. అనిన గాందినినందను నమ్మురారి, గారవించుచు నుచితవాక్యములు పలుకు
చుండె జాజ్వల్యమానమైయొప్పుచున్న, మానికముమీఁది పేరాస మానలేక.

శ్రీకృష్ణుం డక్రూరునకు శ్యమంతకమణి నొసంగుట.

ఆ. తనకు మీఁదుగట్టి తగనియ్యఁ బాఁడినాఁ, డనుచు సీరపాణి యాససేసెఁ
దండ్రిసొమ్ముగానఁ దనకిత్తురో యని, సత్యభామ మిగులఁ జనువు నెఱపె. 341

క. వారిరువురు దమలోపలఁ, బేరాసల నుండు టెఱిఁగి పీతాంబరుఁ డ
క్రూరుని దెసఁ గలిగినకరుణారసము దొలంకులోచనంబులతోడన్. 342

334 సముజ్జ్వలా...మానము=మిక్కిలి వెలుగునట్టియెఱ్ఱనికాంతులయొక్క యతిశయముచేత ప్రకాశమానమైనయుదయకాలమునందలి సూర్యబింబముతో పోల్పఁదగినది, దుర్నిరీక్ష్యము=చూడనలవిగానిది, సభా...యోగ్యము = సభయందలి జనులవలన ప్రశంసింపఁబడునట్టి మేలుమేలు అను వాక్కులకుఁ దగినది. 335 జాజ్వల్యమానంబు=దేదీప్యమానము. 336 నెఱసిరి=పూర్ణమైనసంపద. 339 గొడవలు=

క. సతతంబు బ్రహ్మచర్య, వ్రతస్థులకుఁగాని యున్నవారలకును సం
గతిగా దీమణిఁ దాల్పఁగ, నతిశయదుఃఖంబుఁ బ్రాణహానిం జేయున్. 343

సీ. షోడశసాహస్రసుందరీజనమోహితుఁడఁగాన నే నోప నెడభరింప
నామీఁదికూర్మి యెన్నఁడుఁ బాయ దటుగాన సత్యభామకుఁ బూన్ప శక్తిలేదు
ప్రతిదినంబును మద్యపానంబు గావించు బలభద్రునకు భరింపంగరాదు
సతులతోఁగూడ సంసారముల్ సేసెడువా రెవ్వరును దాల్పలేరు భూమిఁ
తే. గాన నాకును జూడ నిష్కల్మషుండు
బ్రహ్మచర్యవ్రతస్థుఁడై పరఁగు భాగ
వతుఁడు సంతతయజ్ఞదీక్షితుఁడు నైన
యట్టి యక్రూరునకు నిది యర్హమగును. 344

మ. అని యారత్నము కాందినేయునకు నెయ్యంబారఁగా నిచ్చి పా
ప్మని వీడ్కొల్పిన సంతసంబు మదిఁ బొంగారంగ నాఁ డాదిగా
జనులెల్లం గొనియాడ లోకవిదితాచారుండు గ్రైవేయకం
బునకున్ నాయకరత్నమై మెఱయఁగాఁ బూనెన్ మునీంద్రోత్తమా. 345

తే. శౌరి తనకైనమిథ్యాభిశస్తిదోష, మంతయును బాపుకొని సముదగ్రవైభ
వమునఁ బెంపారె ద్వారకావతిపురమున, భక్తరక్షావిచక్షణప్రౌఢి మెఱసి 346

తే. మునివరోత్తమ యీకథ వినిన సాధు,జనులు మిథ్యాభిశస్తిదోషములు లేక
పుత్రపౌత్రాభివృద్ధిచేఁ బొదలియుండు,దురు యశం బెల్లదిక్కులఁ బరిమళింప.

## అనమిత్రప్రభృతులవంశానుక్రమము.

వ. అనిచెప్పి పరాశరుండు వెండియు సోమవంశంబు గొంత సెప్పువాఁడై
యిట్లనియె. 348

క. అనమిత్రునకును శినియున్, శినికిన్ సత్యకుఁడు నాతనికి సాత్యకియున్
జనియించిరి యుయుధానుం, డను వేఱొకపేరుగలిగె నాసాత్యకికిన్. 349

క. అనమిత్రుని యన్వయమున, జనియించె శ్వఫల్కుఁ డతని చరితం బెల్లన్
మునువింటి వామహీపతి, తనయుం డక్రూరుఁ డయ్యెఁ దాపసముఖ్యా. 350

ఆ. అంధకునితనూజులై రుచికంబళ, కుకురబర్హు లనఁగఁ బ్రకటయశులు
పుట్టి రామహీశపుంగవవంశజు, లంధకాఖ్యులైరి యనఘచరిత. 351

క. అనునకు నానకదుందుభి, జనియించెఁ బునర్వసుండు తత్సుతుఁడై యా
తని కుదయించెను నాహుకుఁ, డననాతనిపుత్రుఁ డయ్యె నానరపతికిన్. 352

వ. దేవకోగ్రసేను లనుపుత్రద్వయంబును వృకదేవయు నుపదేవయు దేవరక్షితయు
శ్రీదేవియు శాంతిదేవియు సహదేవియు దేవకియు ననంగ నేడుగురు కన్యక

---

అపరాధములు. 342 తొలంకు = పొంగు. 343 సంగతి = యుక్తము. 345 నెయ్యంబారఁగాన్ = స్నేహమతిశయింపఁగా, గ్రైవేయకంబునకున్ = కంఠహారమునకు. 346 మిథ్యాభిశస్తి = అసత్యా

లును బుట్టి రయ్యిందువదనల నందఱ వసుదేవుండు వివాహంబయ్యె నుగ్రసేను
నకును గంసప్రముఖులైనకుమారులు పదుండ్రు పుట్టిరి. 353

క. భజమానునకు విదూరథుఁడు జనించె నతనికి శూరుఁడు గలిగె నాభూ
భుజునకుఁ బ్రతిక్షత్రుం డను, సుజనహితుఁడు పుట్టె విజయశోభితుఁ డగుచున్.

క. వానికి భోజుఁడు భోజక్ష్మానాథునకును హృదీకజననాథుఁడు నా
భూనాథునకును గృతవర్మానందప్రముఖు లుదయమయిరి గరిమతోన్. 355

క. శూరుఁడు మారిష యనువని,తారత్నమునందుఁ బుత్ర దశకముఁ బడసెన్
వారలలో వసుదేవుఁడు, ధీరుండై జగమునందుఁ దేజముఁ గాంచెన్. 356

ఉ. ఆవసుదేవుజన్మసమయంబున వేల్పులుగూడి ధాత్రిలోఁ
మావిభుఁ డీమహాత్మునికుమారకుఁడై యుదయించి శ్రీలుమా
కీవుతమంచు మించి మొరయించిరి యానకదుందుభిప్రవా
ద్యావళిఁ దన్నిమిత్త మతఁ డానకదుందుభి యయ్యె ధాత్రిలోన్. 357

వ. మఱియు నవ్వసుదేవునికి భగినులై పృథయును శ్రుతదేవయు శ్రుతకీర్తియు
శ్రుతశ్రవయు రాజాధిదేవియు ననువారేవురుకన్యకలు పుట్టి రందు. 358

క. కుంతి యనుధరణినాథుఁడు, సంతానములేక శూరు సమ్మతమున నా
యింతులలోపలఁ బృథ యను,కాంతం గొనిపోయెఁ బుత్రికామోహమునన్.

ఉ. ఆనళినాక్షి పౌరవకులాగ్రణి పాండునిఁ బెండ్లియాడి ధ
ర్మానిలవాసవాంశభవు లైనయుధిష్ఠిరభీమపార్థులన్
సూనుల ముగ్వురం బడసె సూర్యువరంబునఁ బెండ్లిలేనినాఁ
డానతవైరిఁ గర్ణుఁ డనునంగపతిన్ గనియెం బ్రియంబుతోన్. 360

క. ఆవనిత సవతి మాద్రీ,దేవి వడసెను నకులసహదేవు లనంగా
దేవత లగునశ్వినుల మ,హావరముల పెంపువలన నాపాండునకున్. 361

వ. మఱియు శ్రుతదేవను వృద్ధధర్ముం డనుకరూశపతి వివాహంబై దానియందు
నేవురుకుమారులం బడసె రాజాధిదేవి నవంతీశ్వరుండు వివాహంబై విందాను
విందుల నిరువురం బడసె శ్రుతశ్రవ యనుదానిఁ జేదివిభుండయిన దమఘో
షుండు వివాహంబయి శిశుపాలుం డనుకుమారునిం బడసె. 362

సీ. పూర్వకాలంబునఁ బురుషోత్తమునితోడివైరంబువలన నుదారవిక్ర
మాసురపతిదితి యందు హిరణ్యకశిపుఁ డనఁబుట్టి నృసింహువలన
వధనొంది వెండియు నధికప్రతాపంబు దనర దశాననత్వము వహించి
యఖిలభోగంబుల ననుభవించి త్రిలోకసేవితుఁ డగు రాముచేతఁ జచ్చి

---

పవాదరూపమైన. 357 ఆనకదుందుభిప్రవాద్యావళిన్ = తప్పెటభేరి మొదలుగాఁగల వాద్యసమూహమును. 358 భగినులు = తోడఁబుట్టిన ఆఁడువారు. 360 పౌరవకులాగ్రణి = పూరువంశశ్రేష్ఠుఁడు. ధర్మానిలవాసవాంశభవులు = యముఁడు వాయువు దేవేంద్రుఁడు వీరియంశములయందు జనించినవారు, ఆనతవైరిన్ = వంపఁబడినశత్రువులుగలవానిని - ఎల్లశత్రువులను లోఁబఱచుకొన్న

తే. పిదప శిశుపాలుఁడై పుట్టి పిన్ననాఁట
గోలెఁ బూర్వవిరోధంబు కొనలుసాగ
భూమిభారావతరుణుఁడై పుట్టినట్టి
మురహరునిచేత మృతిఁ బొంది ముక్తిఁ గాంచె. 363

వ. అనిన మైత్రేయుం డిట్లనియె. 364

ఉ. అందముగా నతండు దివిజాదులుగానని వైభవంబులం
బొందుచు నాహిరణ్యకశిపుత్వమునన్ దశకంధరాకృతిం
జెంది ముముక్షుభోగములు చేకొనకాశిశుపాలుఁడై ముదం
బందుచు విష్ణునందు లయమౌటకుఁ గారణ మేమి గల్గెనో. 365

వ. అనినం బరాశరుం డిట్లనియె. 366

సీ. ఆదైత్యనాథుఁ డధార్థమై హరి నారసింహరూపంబును జెందినపుడు
పరమాత్ముఁ డగురమాపతి యని మది వివేకింపక రాజసోద్వృత్తుఁ డగుచు
మృతిఁబొందె బూర్వసంచితపుణ్యఫలమున దశకంధరుండై ప్రతాపమునను
సకలలోకంబులు సాధింప సర్వకంటక మైనరాజసప్రకృతివలన
తే. జానకీసక్తచిత్తుఁడై శాశ్వతాప
వర్గఫలదాయి యగురామవసుమతీశు
నధమమానవనాథుఁగా నాత్మఁ దలఁచెఁ
గాని హరి యని తలపోయఁ గానఁడయ్యె. 367

తే. పూర్వపుణ్యఫలంబునఁ బొలిచినట్టి, యంచితైశ్వర్యసంపద లనుభవింప
నాదిజన్మంబులును జాల కతఁడు చేది, రాజకులమున శిశుపాలుఁడై జనించె. 368

తే. అఖిలభూమండలశ్లాఘ్యమైన సకల, భాగ్యమహిమ లవ్యాహతప్రౌఢి ననుభ
వించి రాజసోద్రిక్తుఁడై మించి పూర్వ, జన్మవైరానుబంధంబు సంధిలంగ. 369

ఆ. పిన్ననాఁటఁగోలె వెన్ను నిఁజంపుదు, ననుతలంపుఁ దన్ను నతఁడు వెదకి
యేమఱించి వచ్చి యెప్పుడు చంపునో, యనుతలంపుఁగలిగి యాతఁ డుండె. 370

ఉ. పిమ్మటవారిముందర నుపేంద్రునిఁ గైకొన కచ్యుతాదినా
మమ్ము లుపన్యసించి పలుమాఱును నవ్వుచు నిందసేయుచి
త్తమ్మునఁ దద్విరోధగతి దప్పక యోజనసేయుచుండి ని
త్యమ్మును నాత్మరక్షవిదితంబుగఁ జేయుఁ దదీయభీతుఁడై. 371

వానిని. 363 పిన్ననాఁటఁగోలెన్ = బాల్యమునుండియు, కొనలుసాగన్ = వర్ధిల్లఁగా. 365 ముముక్షు = మోక్షాపేక్షగల. 367 రాజసోద్వృత్తుఁడు = రజోగుణసంబంధమైన నిక్కుగలవాఁడు, సర్వకంటకము = ఎల్లవారికిబాధకము, రాజసప్రకృతి - రజోగుణయుక్తమైన స్వభావము, సక్తచిత్తుఁడు = ఆసక్తితోడి మనసుగలవాఁడు, శాశ్వత...దాయి = శాశ్వతమైనమోక్షఫలము నిచ్చునట్టివాఁడు. 369 అవ్యాహతప్రౌఢిన్ = కొట్టుపడనిసామర్థ్యముతో, వైరానుబంధంబు =

వ. ఇట్లు మనోవాక్కాయకర్మంబులందును. 372

సీ. ఇంద్రనీలచ్ఛాయ నేపారుమేనును బంగారుచాయలపచ్చడంబు
వెలిదమ్మిపువ్వులఁ దెగడునేత్రమ్ములు చక్కనిపీనవక్షస్థలంబు
కౌస్తుభమణితోడి గ్రైవేయకంబును మృగనాభితిలకంబు మెఱయు మోము
శార్ఙ్గగదాశంఖచక్రహస్తంబులు లాలితశ్రీవత్సలాంఛనంబు

తే. కటకకంకణమణిముద్రికాకిరీట, హారకేయూరమణికుండలాభిరామ
మైనకృష్ణునిదివ్యరూపాతిశయము, మఱపుపుట్టక తలఁచు నమ్మనుజవిభుఁడు. 373

వ. ఇవ్విధంబున నవ్వాసుదేవుని వైరానుభావంబునఁ బర్యటనభోజనస్నానాసన శయనాదికాలంబులను జాగ్రత్స్వప్నసుషుప్త్యాద్యవస్థలయందును తదాసక్తచిత్తుండై యుండె. 374

సీ. ఉదయించి వచ్చుఖద్యోతబింబము శౌరిచక్రమో యనిభీతి సంచలించు
శక్రచాపముతోడి జలధరం బుఁజేసిన హరిశార్ఙ్గగుణనాద మని కలంగుఁ
బరిపూర్ణచంద్రబింబము వాసుదేవుని పాంచజన్యం బని భ్రమత నొందుఁ
బోలుచు నీరదవిధంబులు విష్ణుకౌమోదకీనందకములని దీనుఁ డగును

తే. నపరసంధ్యారుణం బైనయాకసంపుఁ, గనకవస్త్రంబు విష్ణుదిగాఁ దలంచు
సంతతంబును వేఱొకచింత లేక, బాల్యమునఁగోలె నాశిశుపాలనృపతి. 375

వ. ఇవ్విధంబునం బరమార్థతత్త్వభావుం డయినయవ్వాసుదేవునియందు లయంబఱునచిత్తంబుతోనుండి యంతరంగంబున సంగరోద్వృత్తుండై భగవద్ధస్తనిర్ముక్తచక్రధారావిదారితమస్తకుండై సకలకలుషంబులం బాసి సాయుజ్యంబునుం బొందెను. 376

క. రిపులకు నీగతి మోక్షము, కృపసేయసమర్థుఁ డైనకేశవునకు న
చ్ఛపుభక్తితో భజించిన,ప్రపన్నులకు నొసఁగు టరిది పనికాదు సుమీ. 377

---

విరోధముయొక్క సంబంధము, సంధిలంగన్ = అనుసరింపగా. 373 కటకకంకణమణిముద్రికా = అందెలు కడియములు రత్నములు చెక్కినయుంగరములు, అభిరామము = ఒప్పిదమైనది. 374 పర్యటన = తిరుగుట, తదాసక్త = ఆకృష్ణునియందంటిన. 375 ఖద్యోతబింబము = సూర్యబింబము, శక్రచాపము = ఇంద్రధనుస్సు, జలధరము = మేఘము, గుణనాదము = అల్లెత్రాటిమ్రోఁత, పోలుచు =కంటికితోఁచునట్టి, నీరదవిధంబులు = మేఘములయొక్కరీతులు, అపరసంధ్యారుణంబు = సాయంసంధ్యయందు ఎఱ్ఱగాఁదోచునట్టి, ఆకసంపుఁగనకవస్త్రంబున్ = ఆకాశమనెడు బంగారుపచ్చడమును, విష్ణుదిగాన్ = విష్ణునిదిగా, సంతతంబును = ఎల్లప్పుడు. 376 లయంబు = అభేదమైకలసినది, సంగరోద్వృత్తుండు = యుద్ధోత్సాహముగలవాఁడు, భగవద్ధస్తనిర్ముక్తచక్రధారావిదారితమస్తకుండు = భగవంతుఁడైన శ్రీకృష్ణునిచేతినుండి విడువఁబడినచక్రధారలచేత భేదింపఁబడిన తలగలవాఁడు, కలుషంబులన్ = పాపములను, సాయుజ్యమున్ = మోక్షమును. 377 అచ్ఛపుభక్తితోన్ = స్వచ్ఛమైన భక్తితో, ప్రపన్నులకున్ = శరణాగతులకు, అరిదిపని = దుర్లభ

వ. అని పలికి వెండియు తరువాతికథావిధానం బెఱింగించువాఁడై యిట్లనియె. 378

తే. రమణరోహిణీదేవకీ ప్రముఖసతుల, బ్రీతితో వసుదేవుండు పెండ్లియాడ
నందురోహిణీదేవికి నాదిరుద్ర, మూర్తి సంకర్షణుండు రాముఁడు జనించె. 379

వ. ఆబలభద్రవంశపరంపర లనేకంబు లయ్యె. 380

తే. దేవకీదేవి కావసుదేవునకుఁ గుమారషట్కంబు జనియించి వారలెల్లఁ
గంసుచేఁ జచ్చి రేడవగర్భమునను, యోగనిద్రను సిద్ధి నచ్యుతుఁడు పనుప. 381

వ. వచ్చి దేవకీదేవిగర్భంబున నున్నయర్భకుం గొనిపోయి రోహిణీజఠరంబున నునిచె నిట్లు సంకర్షణభావంబు నొందుటం జేసి బలభద్రుండు సంకర్షణుండయ్యె. అంత నెనిమిదవగర్భంబున సకలజగన్మహాతరుమూలభూతుండును, అతీతానాగతవర్తమానకాలసమేతుండును, సమస్తసురాసురమునిజనజ్ఞానగోచరుండును, మహీభారావతరణమనుష్యకర్మసమాచరణుండును, నిరంతరకృపావర్ధిష్ణుండును, నైన కృష్ణుండు పుట్టె. 382

ఆ. యోగనిద్ర హరినియోగంబునను నందు, కాంత యగుయశోదగర్భమునను
జననమొందెఁ గాళి యనుమహాశక్తియై, పుడమిజనులచేతఁ బూజగొనుచు. 383

వ. కృష్ణుండు పదాఱువేలు నూనూటయెనమండ్రు భార్యల వివాహంబై వారియందు లక్షయు నెనుబదివేవురుకుమారులం బడసె, వారిపుత్రపౌత్రవర్గంబు లసంఖ్యంబు లయ్యె. ఇట్లు యాదవవంశవిస్తారంబు వేలువేలు నుపన్యసింప నూఱుసంవత్సరంబులు చెల్లు. 384

క. పదివేలును పదివేలును, మొదలఁగ గుణియించి నియుతమున నది నిహితం
బొదవింపఁగ నగు సంఖ్యలు, యదువీరప్రముఖులైనయవనీనాథుల్. 385

ఉ. సంగరభూమియందు మును చచ్చినదానవదైత్యదేవతా
పుంగవు లందఱుం ధరణిఁబుట్టిరి యాదవవంశ్యులై ధరి
త్రిం గడుసాధుబాధ లొనరించుచు నుండిరి తత్కాలంబులో
నం గులదీపకుండు యదునాథుఁడు కృష్ణుఁడు మించెఁ బుణ్యుఁడై. 386

వ. మఱియు యయాతి రెండవపుత్త్రుం డైనదుర్వసువంశంబు తండ్రిశాపంబునఁ బౌరవకులంబునం గలసె. ద్రుహ్యువంశంబురాజులు మ్లేచ్ఛకిరాతధర్మంబులం

---

మైనపని. 379 రమణన్ = ఒప్పిదముగా, సంకర్షణుండు = ఎల్లలోకములను లయకాలమునందు చక్కఁగ నాకర్షించువాఁడు. 382 సంకర్షణభావము = లెస్సగా ఆకర్షించునట్టి భావమును, సకలజగన్మహాతరుమూలభూతుఁడు = ఎల్లలోకములనెడు గొప్పవృక్షమునకు వేరైనవాఁడు - లోకములకెల్ల ముఖ్యకారణమైనవాఁడనుట, అతీతానాగతవర్తమాన కాలసమేతుండు = కడచినదియు రాఁగలదియుం జరుగునదియునైనకాలములతోఁ గూడుకొన్నవాఁడు-కాలత్రయమునందు నుండువాఁడనుట, మనుష్యకర్మసమాచరణుండు = మనుష్యులు చేయుపనులను నడపువాఁడు. 383 నియోగంబునన్ = ఆజ్ఞచేత. 386 సంగరభూమి = యుద్ధభూమి.

బొందిరి, అనువంశసంభవు లయ్యంగవంగ కళింగాదిరాజపరంపరలై విస్తరిల్లిరి. 387

క. ధీరుఁడు యయాతి ధరణీ, భారధురంధరునిఁగాఁగఁ బట్టము గట్టెన్
సౌరభ్యఘనయశోగ కర్పూరున్ గారుణ్యహృదయపూరున్ బూరున్. 388

పౌరవవంశానుక్రమము.

వ. అట్టిపూరునకు జనమేజయుండును జనమేజయునకుఁ బ్రచిన్వంతుండు నాతనికి బ్రవీరుండును బ్రవీరునకు సుమనసుండును నతనికి సుద్యుమ్నుండును వానికి బహుగుండును నతనికి సంయాతియు వానికి నహంయాతియు వానికి రౌద్రాశ్వుండును రౌద్రాశ్వునకు ఋతేపుప్రభృతులు పదుండ్రును బుట్టిరి. అందు ఋతేపునకు రంతినారుండును వానికి సుమతియు నప్రతిరథుండును ధ్రువుండును అంతినారుండు ననలువురు పుట్టిరి. అప్రతిరథునకుఁ గణ్వుండును కణ్వునకు మేధాతిథియునుం బుట్టిరి. వానివంశపరంపరలు కాణ్వాయనులను బ్రాహ్మణులైరి మఱియు నప్రతిరథునకు నైలీనుండు పుట్టె. వానికి దుష్యంతుండును నతనికి భరతుండును నతనికి బృహత్క్షత్రుండును నతనికి సేనజిత్తుండును నతనికి బ్రహ్మదత్తుండును నతనికి జయత్సేనుండును నాతనికిఁ గురుండును నతనికి దిలీపుండును దిలీపునకుఁ బ్రతీపుండును బ్రతీపునకు దేవాపిశంతనుబాహ్లికులును శంతనునకుఁ జిత్రాంగదవిచిత్రవీర్యులునుంబుట్టి రందుఁ జిత్రాంగదుండు బాల్యంబునఁ జిత్రాంగదుం డనుగంధర్వునితోడ యుద్ధంబుచేసి హతుండయ్యె విచిత్రవీర్యుండు. 389

ఆ. కాశిరాజకన్యకల నంబికాంబాలి,కలవివాహమై వికాసలీలఁ
దదుపభోగరతులఁ దగిలి క్షయవ్యాధిఁ, బొంది యతఁడు దివిజపురికి నరిగె. 390

వ. అంత సత్యవతీనియుక్తుండై కృష్ణద్వైపాయనుండు దేవరన్యాయంబున నంబికయందు ధృతరాష్ట్రుని నంబాలికయందుఁ బాండురాజును విచిత్రవీర్యునిభోగస్త్రీయందు విదురుం బుట్టించె నందు ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనదుశ్శాసనప్రముఖులు నూర్వురు పుట్టిరి. పాండురాజునకుఁ గుంతీమాద్రులయందు ధర్మానిలశక్రాశ్వినులవరంబున యుధిష్ఠిరభీమార్జున నకులసహదేవులనంగా నేవురు పుట్టిరి. వారలందఱకుఁ బాంచాలి ధర్మపత్ని యయ్యె. దానియందు ధర్మరాజునకుఁ బ్రతివింధ్యుండును భీమసేనునకు శ్రుతసోముండును నర్జునునకు శ్రుతకీర్తియు నకులునకు శతానీకుండును సహదేవునకు శ్రుతధర్ముండునను నుపపాండవులు పుట్టిరి. మఱియు ధర్మరాజునకు నౌధేయియందు దేవకుండును భీమసేనునకు హిడింబయందు ఘటోత్కచుండును నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును సహదేవునకు విజయయందు సుహోత్రుండును నర్జు

391 దేవరన్యాయంబునన్ = (దేవరేణ సుతోత్పత్తిః) అనెడు న్యాయముచేత - మఱఁదివరుసచేత, సాంప్రతంబునన్ = ఆకాలమందు.

నునకు నులూచియందు నిలావంతుండును చిత్రాంగదయందు బభ్రువాహనుం డును సుభద్రయందు నతిబలపరాక్రముం డైనయభిమన్యుండును అభిమన్యునకు విరాటపుత్త్రి యైనయుత్తరయందు పరీక్షితుండును బుట్టిరి. ఆపరీక్షితుండు వర్తమానకాలంబున రాజ్యంబుచేయుచున్నవాఁడు. అట్టి పరీక్షితునకు మహాధర్మశీలుం డైనజనమేజయుండు పుట్టి వేదవ్యాసశిష్యుం డైనవైశంపాయనువలన శ్రీమహాభారతంబు విని యనేకయజ్ఞంబులు సేసి సాంప్రతంబున రాజ్యంబుసేయ నున్నవాఁడు మఱియును. 391

ఆ. భూతవర్తమానభూపాలకులనెల్ల, వింటి తేటపడ భవిష్యదవని
పతులలోన ఘనులఁ బ్రకటించి చెప్పెద, వినుము సావధానవిమలబుద్ధి. 392

క. జనమేజయుండు త్రిజగ,జ్జనవినుతుం డైనయాశతానీకుని బు
త్త్రునిఁ గాంచు నమ్మహీపతి, జనకునిచందమున ధర్మసంతతి నమరున్. 393

ఆ. యాజ్ఞవల్క్యువలన నధ్యయనముఁ గృపా,చార్యువలన నస్త్రశస్త్రములును
శౌనకమునివలన సచ్చిదానందవి,ద్యలు నెఱంగు లోకములు నుతింప. 394

కలియుగదోషాదివివరణము.

వ. అట్టి సూర్యసోమవంశంబుల రాజపరంపరలు కలియుగంబునఁ గొంతకాలంబునకు హీనబలులై యల్పవైభవంబుల రాజ్యంబులు సేయుచుండి తమతమయ ధర్మవర్తనంబుల వినాశంబై పోవంగలవారు. వారిప్రధానులు స్వామిద్రోహంబులుసేసి రాజ్యంబులు గైకొని యేలంగలవారు. మూర్ధాభిషిక్తు లైనరాజన్యుల వెడలనడిచి గంగాప్రయాగమధ్యదేశంబులు పద్మవర్యులనుమాగధు లేలంగలవారు. నర్మదాతీరదేశంబుల వ్రాత్యు లైనబ్రాహ్మణులు చేకొనంగలవారు. చంద్రభాగాతీరంబు లైనకాశ్మీరదేశంబు లాభీరు లేలంగలవారు. వీరలెల్ల తుల్యకాలవ్యవహారవయోధర్మపరాయణులై యుండెదరు. 395

క. అల్పప్రసాదములుఁ గడు, నల్పవివేకములు నాయు వల్పము మఱి య
ల్పాల్పపరిజ్ఞానంబులు, నల్పము లగువైభవములు నగు రాజులకున్. 396

ఉ. కోపము దుర్వివేకమును క్రూరతయుం జపలత్వముం మన
స్తాపము దుష్టవృత్తియును ధౌర్త్యము చౌర్యము హీనభావముం
బాపముగల్గు మర్త్యులకుఁ బాడియుఁ బౌరుషముం బ్రతాపముం
దాపసముఖ్య లేదు వసుధం గలికాలము పోవునంతకున్. 397

క. మెలఁకువలధమాధమములు, పలుకు లసత్యములు లేవు పౌరుషములు నే
ర్పులు రిత్తబ్రతుకులు తఱచు, గలవవి చెప్పంగరాదు కలియుగవేళన్. 398

---

396 వివేకము=యుక్తాయుక్తపరిజ్ఞానము, పరిజ్ఞానము = ఎల్లవిషయములందును సామాన్యమైన తెలివి. 397 ధౌర్త్యము = ధూర్తత్వము, చౌర్యము = దొంగతనము, హీనభావము = హీనత్వము, పాడి = న్యాయము. 398 మెలఁకువలు = జాగరూకతలు, రిత్త=పట్టిది - శూన్యము, బ్రతుకులు = బ్రతుకుఁ

క. ఆవులఁ బడఁ బొడుచుటయును, స్త్రీవధ లొనరించుటయును శిశువుల హత్యల్
గావించుటయును నైజము, లై వెలయును జగమునందు నఖిలజనులకున్. 399

సీ. పరధనపరదారహరులు నల్పాల్పసారులు మృతప్రాయమూర్తులు నసత్య
వచనులు పాషండవర్తనులును భూమిఁ దఱచు గాఁగలరు వేదములు యజ్ఞ
తతులును లేవు సంతతము నుత్తమవంశజాతులు మ్లేచ్ఛకిరాతధీవ
రాదులనేవించి యధమాధమము లైనపను లాచరింపుదు రనదవృత్తి

తే. బలిమిగలవాఁడె రాజు సంపదలు గలుగు
నతఁడె మాన్యుఁడు సభల మాట్లాడనేర్చు
నతఁడె పూజ్యుండు కొల్చినయతఁడె హితుఁడు
జనులకెల్లను గలియుగసమయమునను. 400

వ. మఱియు ధనంబ కులాభిజాత్యహేతువు బలంబ ధర్మహేతువు మనోహరంబ దాంపత్యహేతువు శౌర్యంబ వ్యవహారహేతువు స్త్రీత్వంబ యుపభోగహేతువు లింగధారణంబ యాశ్రయహేతువు అన్యాయంబ వృత్తిహేతువు దౌర్బల్యంబ యధమహేతువు దానంబ ధర్మహేతువు స్వీకారంబ వివాహహేతువు సద్వేషధారణంబ పాత్రహేతువు నై యనేకభీషణదోషవిశేషంబులు సమస్తవర్ణంబులయందును గలిగియుండు. మనుష్యులకు నూటయిరువదివత్సరంబు లాయుపుపరిమాణం బగు మధుశాకమూలపత్రపుష్పాదు లాహారంబు గాఁగల యవి తరువల్కలాజినపర్ణంబులు వస్త్రంబులగు నొక్కొకరికి బహుప్రజావృద్ధి యగు దానంజేసి శీతవాత పీడితులుగాఁ గలవారు. శ్రౌతస్మార్తంబులు విప్లవంబులుగాఁ గలయవి యిట్టివర్తనంబులు గలకలికాలంబునందు. 401

ఉ. భూమిని ధర్మముల్ నిలుపఁ బూని ముకుందుఁడు సర్వలోక
రక్షామణి భక్తవత్సలుఁడు సాత్వికబుద్ధి యెలర్ప శంబళ
గ్రామమునన్ బ్రధానుఁ డను బ్రాహ్మణు నింట జనించుఁ గల్కియై
యామహనీయమూర్తి తెగటార్చును మ్లేచ్ఛకిరాతజాతులన్. 402

మ. నిజధర్మంబున వేదముల్ ధరణిపై నిండన్ బ్రతిష్ఠించి సా
ధుజనవ్రాతము నాదరించి యొకచో దోషంబు లేకుండఁ జే
సి జగంబుల్ పరమానురాగమునఁ దాఁ జెందించువాఁడై యధో
క్షజుఁ డుండున్ బటుసాత్వికస్ఫురణతోఁ గల్కిస్వరూపంబునన్. 403

---

దెరువులు, తఱుచు = బహువిధము. 399 పడఁబొడుచుట = పడఁగొట్టుట - చంపుట, హత్యలు = చంపుటలు, నైజములై=స్వభావసిద్ధములై. 400 అల్పాల్పసారులు = మిక్కిలి యల్పమైనబలముగలవారు, మృతప్రాయమూర్తులు=కొంచెము తక్కువగా చచ్చిన యాకృతిగలవారు, పాషండవర్తనలు = వేదవిరుద్ధములైన నడవళ్లుగలవారు, ధీవరాదులన్=చేపలఁబట్టి జీవించునట్టి బెస్తలు మొదలగువారిని, అనదవృత్తిన్=అనాథవర్తనతో. 401 భీషణ = దారుణములైన, విప్లవంబులు=చెడినవి. 403 ప్రతి

తే. కలియుగము దీఱి కృతయుగకాలమైన, ధర్మమార్గంబు నాల్గుపాదముల నడచు
ననిమిషులు భూమి కరుదెంచి మనుజకోటిఁ, గలసి వర్తింతు రత్యంతగౌరవమున.

క. కలియుగదోషములకుఁ గడు, నులికి తపము లాచరించుచున్న నరేంద్రుల్
నలినాప్తసోమవంశజు, లెలమిన్ దొల్లింటియట్ల యేలుదు రవనిన్. 405

వ. అని యిట్లు సూర్యసోమవంశానుచరితంబులపరిపాటి నెఱింగించి పరాశరుండు
వెండియు నిట్లనియె 406

మ. విను మైత్రేయ జనార్దనాంశభవులై విశ్వంభరామండలం
బున ధర్మస్థితి నుల్లసిల్లి మహిమన్ బొల్పారుభూపాలుర
న్వినినన్ జేర్కొనినన్ శుభంబు లొదవున్ నిత్యంబు యజ్ఞంబు చే
సినపుణ్యంబులు గల్గు మానవులకున్ శ్రీమీఱ నేకాలమున్. 407

సీ. ఇక్ష్వాకుమాంధాతృఋతుపర్ణయువనాశ్వసగరశంతనుహరిశ్చంద్రనహుష
రామలక్ష్మణభగీరథశశిబిందుభార్గవనిమిసంయాతికార్తవీర్య
నలరంతిదుష్యంతనాభాగముచికుందపురుకుత్సవైదేహపూరుభరత
రఘుదిలీపసుహోత్రరంతిపురూరవజ్యామఘుతృణబిందుసోమదత్త

ఆ. భీష్మధర్మపుత్రభీమబీభత్సపాం
చాలకేకయవైరాటసత్యసేన
ముఖ్యనృపులచరితములు విన్నఁ జేర్కొన్న
మహితశుభము లొదవు మానవులకు. 408

వ. ఇట్లు సూర్యసోమవంశాధిపతులం జెప్పి మఱియును. 409

ఉ. చాటుతరప్రబంధకవిసన్నుత సంగరపార్థ ధీరతా
హాటకశైల నిత్యవినయప్రతిభావిభవాఢ్య భూమిభృ
త్కూటగుహావహిత్థనృపకుంజర సంగడి రక్షపాలక
ర్ణాట నరేంద్రదత్తసముదంచితశాశ్వతరాజ్యవైభవా. 410

క. రాజీవనయనపదయుగ, రాజీవభ్రమరశత్రురాజన్యరమా
రాజీవకుముదబాంధవ, రాజీవహితప్రతాపరాజీవముఖా. 411

---

ష్ఠించి = స్థాపించి. 404 తీఱి = కడచి. 405 నలినాప్తసోమవంశజులు = సూర్యచంద్రవంశములయందు జనించినవారు. 406 వంశానుచరితంబులు = వంశములను అనుసరించిన చరిత్రములను, పరిపాటిన్ = క్రమముగా. 407 విశ్వంభరామండలంబునన్ = భూమండలమునందు. 410 ధీరతాహాటకశైల = ధైర్యముచేత మేరుపర్వతమైనవాఁడా, నిత్యవినయప్రతిభావిభవాఢ్య = స్థిరమైన వినయముతోడి ప్రతిభకలిమిగలవాఁడా, (ప్రతిభ = సమయోచితస్ఫురణగలబుద్ధి.) భూమిభృత్కూటగుహావహిత్థనృపకుంజర = కొండకొమ్ములయందును గుహలయందును దాఁగినరాజశ్రేష్ఠులు గలవాఁడా. 411 శత్రురాజన్యరమారాజీవకుముదబాంధవ = పగవారైన రాజులయొక్క సంపదలనెడి పద్మములకు చంద్రుఁడైనవాఁడా, రాజీవహితప్రతాప = సూర్యునిప్రతాపమువంటి ప్రతాపముగలవాఁడా.

శాంతియనువృత్తము. బాహువిక్రమప్రతాపబాహులేయసంగరో
త్సాహ సాహసాభినేయసాహసాంక సర్వస
న్నాహవాహినీసమేత నవ్యకీర్తిచంద్రికా
రోహిణీహృదీశ దానరోహణావనీధరా. 412

గద్య. ఇది శ్రీమదమరనామాత్యపుత్రహారితగోత్రపవిత్రసుకవిజనవిధేయ వెన్నెలగంటి సూరయనామధేయప్రణీతంబైన ఆదిమహాపురాణంబగు బ్రహ్మాండంబునందలి పరాశరసంహిత యైనశ్రీవిష్ణుపురాణంబునందుఁ జంద్రుండు బృహస్పతిపత్ని నపహరించుటయు పురూరవుకథయును రుచికుండు సత్యవతి వరించుటయు విశ్వామిత్రజమదగ్నులజన్మంబును రజిపుత్రు లింద్రునిరాజ్యం బపహరించుటయు యదువంశకీర్తనంబును జ్యామఘుచరితంబును శమంతకరత్నోపాఖ్యానంబును వసుదేవాది యాదవుల జన్మంబును పౌరవవంశకీర్తనంబును పాండవవంశానుక్రమంబును కలియుగధర్మంబునన్నది షష్ఠాశ్వాసము.

---

412 బాహులేయసంగరోత్సాహ = కుమారస్వామిదయిన-యుద్ధోత్సాహమువంటి యుద్ధోత్సాహము గలవాఁడా, సాహసాభినేయసాహసాంక = సాహసముచేత అభినయింపఁదగినవిక్రమార్కుఁడుగలవాఁడా - సాహసాంకుఁ డనుబిరుదువహించి విక్రమార్కునికంటె సాహసముగలవాఁడా యనుట, నవ్యకీర్తిచంద్రికారోహిణీహృదీశ = అపూర్వమైనకీర్తియనెడు వెన్నెలచేత చంద్రుఁడైనవాఁడా, దానరోహణావనీధరా=దానమునందు రత్నపర్వతమైనవాఁడా.

# శ్రీవిష్ణుపురాణము

## సప్తమాశ్వాసము.

---



రావూరిపురాధిప
వారాశిగభీర వంశవర్ధన బసవ
క్ష్మారమణపుత్ర సంప
త్ప్రారంభకళాదిలీప రాఘవభూపా. 1

వ. సకలపురాణవిద్యాధురంధరుం డైన పరాశరుండా మైత్రేయున కిట్లనియె నట్లు రాజవంశంబులపరిపాటి నేర్పరించి చెప్పితి నింక నెయ్యది విన నిష్టంబనిన నతండిట్లనియె.

క. యాదవవంశంబున దా,మోదరుఁ డగుకృష్ణుఁ డతిసముజ్జ్వలమహిమన్
బ్రాదుర్భవించి బాల్యం, బాదిగ నేమేమి సేసె నది వినవలయున్. 3

వ. అని శ్రీకృష్ణకథాశ్రవణకుతూహలుండయి యడిగిన మైత్రేయునకుఁ బరాశరుం డిట్లనియె. 4

క. దేవసమానుండగువసు, దేవుఁడు దేవకునికూఁతు దేవకి నవనీ
దేవినిభఁ బెండ్లియాడి మ,హావిభవము దొంగలింప నాలుం దానున్. 5

### శ్రీకృష్ణావతారకథా ప్రస్తావము.

ఆ. అరద మెక్కి సూతుఁడై కంసుఁ డేతేరఁ, దగినవారుఁ దానుఁ దనపురమున
కరుగుదేర నడుమ నందఱు వెఱఁగంద, గగనవాణి పలికెఁ గంసుతోడ. 6

క. ఇమ్మగువయెనిమిదవగ,ర్భమ్మున నుదయించునట్టిబాలుఁడు నీప్రా
ణమ్ములు రాజ్యము గొనియెడు, సుమ్మీ యని పలికె మనసు చుఱ్ఱు మనంగన్. 7

ఉ. అవ్వచనంబు చిత్తమున నారటపాటొదవింప నెంతయున్
నివ్వెఱఁగంది యొం డుపమ నేరక యూరకయుండి యింతలో

---

1 వారాశిగభీర = సముద్రమునుబోలిన గాంభీర్యగుణముగలవాఁడా, సంపత్ప్రారంభకళాదిలీప = సంపదను వృద్ధిచేయునట్టి ప్రయత్నముచేత దిలీపుఁడా. 2 పరిపాటిన్ = క్రమముగా. 3 ప్రాదుర్భవించి = పుట్టి. 5 అవనీదేవినిభన్ = భూదేవివంటిదానిని, దొంగలింపన్ = అతిశయింప. 6 పురమునకున్ = ఇంటికి, వెఱఁగందన్ = ఆశ్చర్యమునొందఁగా. 8 ఆరటపాటు = సంకటము, నివ్వెఱఁగంది = నిశ్చేష్టతనుపొంది, ఒండుపమ = ఒకయుపాయమును, ఉవ్వునన్ =

నువ్వునఁ జేవ గైకొని సహోదరిపాడి దొఱంగి చెల్లెలిన్
మవ్వపుముద్దరాలి నభిమానవతిన్ వధియించు టెంపుతోన్. 8
ఉ. అందఱుఁ జూచి యింతదుడుకా యని దూఱఁగఁ గ్రొమ్మెఱుంగు లం
దంద చెలంగుభీకరకరాసి వెసన్ జళిపించి దేవకిన్
ముందలపట్టి వంచి తెగ మొత్తఁ గడంగినఁ గంసుఁ గేలితో
డం దగులంగఁ బట్టుకొని డాసి కడున్ వసుదేవుఁ డిట్లనున్. 9
క. ఓహో యీసేఁత మహాద్రోహము నీవంటి మేటిదొర చుట్టఱికం
బూహింపక చెలియలిపై, స్నేహము చెడి యిట్లు నఱకఁ జేయెత్తునొకో. 10
ఉ. ఈయవివేకపుంబనుల కెట్లు దొడంగితి వొప్ప దింతయ
న్యాయము గాలిపోయెడుదురాగతముల్ విని పాపబుద్ధి న
య్యో యిటువంటిముద్దులసహోదరి ముందలపట్టి యీడ్చి గో
గో యని కూయఁగాఁ గుతికకోసిన లోకమువారు తిట్టరే. 11
ఆ. నిన్న పెండ్లిచేసి నేడిదె చెలియలి, నత్తవారియింటి కనుపుచుండి
తప్పులేనితప్పు తలగోసి చంపిన, నెంతరట్టు పుట్టు నెఱిఁగికొనుము. 12
ఆ. ఇప్పు డాకసమునఁ జెప్పినయశరీరి, పలుకువలన నీకు భయము మిగులఁ
గలిగెనేని దీనికన్నబిడ్డల నెల్లఁ, బుట్టినపుడె నీకుఁ బట్టియిత్తు. 13
తే. పురిటిలోనవారిఁ జంపుదువుగాని, దీనిప్రాణంబులకు నేడు తెగకు పంచ
భూతములసాక్షిగా నేను బొంక నిట్టు, లైన నపకీర్తి కొంత నీకణఁగిపోవు. 14
క. అనిపలికిన నాతఁడు తన, మనసు విరిగి మగుడఁ దెచ్చి మఱఁదిఁ జెలియలిన్
దనవీటఁ దుష్టిఁ గావలి, నునిచి పరామరిక సేయుచుండె మునీంద్రా. 15

భూదేవి ప్రజాభారపీడితయై తనమనఃక్లేశమును బ్రహ్మకుఁ దెలుపుట.

క. అంత నొకనాఁడు ధరణీ, కాంత ప్రజాభారపీడఁ గ్రాఁగి బడలి య
త్యంతవిషాదపరీత, స్వాంత యగుచు వదనపంకజము కడువాడన్. 16
క. ఆదిత్యయక్షగంధ, ర్వాదులు చనుదేరఁ గూడి యటఁ జని కాంచెన్
బ్రాదుర్భూతవివేక, చ్ఛేదీకృతహృదయకలుషజిహ్మన్ బ్రహ్మన్ 17

---

తటాలున, చేవ = బలమును - ధైర్యముననుట, సహోదరిపాడి = తోఁడఁబుట్టువనున్యాయమును, తొఱంగి=విడిచి, మవ్వపు = మనోజ్ఞురాలైన. 9 అందందచెలంగు = మిక్కిలి వ్యాపించునట్టి, భీకరకరాసి=భయంకరమైన చేకత్తిని, జళిపించి = ఆడించి, డాసికడున్ - కడున్ డాసియని యన్వయము. 10 ఈసేఁత = ఈపని. 11 తొడంగితివి = ఆరంభించితివి, దురాగతములు = రాఁగలచెఱుపును దెలుపునట్టి యాకాశవాణిమాటలను. 12 తప్పులేనితప్పు - లేనితప్పును కలుగఁజేసికొని యనుట, రట్టు = అల్లరి. 14 తెగకు = సాహసింపకుము. 15 తనవీటన్ = తనపట్టణమునందు, తుష్టిన్ = సంతుష్టితో. 16 క్రాఁగి = సంతాపమునొంది, అత్యంతవిషాదపరీతస్వాంత = మేరలేనిదుఃఖముచేత ఆక్రమింపఁబడిన మనసుగలది. 17 ప్రాదుర్భూత...జిహ్మన్ = పుట్టినవివేకముచేత ఛేదింపఁబడిన

వ. ఇట్లు కనుంగొని వినయావనతవదనయై తనకునైన ప్రజాభారపరిపీడవలనఁ గలిగినబడలిక యెఱింగించి నాకునయిన యిమ్మహాభారం బపనయింపకుండిన నిర్వహింపనోపనని కంసశిశుపాల జరాసంధ దుర్యోధన బాణాసురనరక ధేనుకారిష్ట ప్రలంబశంబర కేశిప్రముఖు లనువారి వారిబంధుమిత్రపుత్రభ్రాతృసుహృత్పృథానవర్గంబులను వేఱువేఱం బేర్కొని వీరివలనిభారంబు మానుటకు నుపాయంబు సేయుమనిన. 18

ఉ. నీరజసంభవుండు ధరణీసతిఁ గన్గొని నీకు నైనయా
భూరిభరంబు మాన్ప నను బోఁటి కశక్యము భక్తలోకర
క్షారతుఁడుఙ్ జగంబులకుఁ గారణభూతుఁడునై వెలుంగు ల
క్ష్మీరమణుండు నేర్పు నెఱేఁగింపుద మివ్విధ మమ్మహాత్ముతోన్. 19

వ. అని యాప్రొద్దె కదలి. 20

మ. దివిజశ్రేష్ఠుఁడు తాపసోత్తములతో దిక్పాలకశ్రేణితో
నవనిం దోడ్కొనివచ్చి కాంచె జగదేకానందచిద్రూపముఙ్
వివిధామ్నాయకళాకలాపము సుపర్వీగీతసల్లాపముఙ్
ధవళద్వీపముఁ బుణ్యరూపము నవిద్యావేద్యసంతాపమున్. 21

వ. అమ్మహాద్వీపమధ్యం బనేకశతసహస్రసూర్యకిరణంబులను సోల్లుంఠనంబుగావించు నకుంఠతేజంబుగల వైకుంఠపురోపకంఠంబునఁ గంఠోపరికంఠీరవుండును సకలదేవతాకంఠీరవుండును నై యిచ్ఛావిహారంబులు సలుపుచున్న పన్నగాశనవాహనుం బొడగాంచి సాష్టాంగదండప్రణామంబులుచేసి యిట్లని స్తుతియించె 22

సీ. చంద్రశేఖరవంద్య చంద్రార్కలోచన చంద్రశైలాధార చంద్రవస్త్ర

---

మనసులోనిపాప కౌటిల్యములుగలవాఁడు - దుఃఖోపశమనసమర్థుఁడనుట. 18 పరిపీడ = అంతట వ్యాపించినపీడ, అపనయింపకుండినఙ్ = పోఁగొట్టకుండిన, నిర్వహింపఙ్ = చెడక మనుటకు. 19 భూరిభరంబుఙ్ = మిక్కుటమైన బరువును, నను బోఁటికిఙ్ = నావంటివానికి, అశక్యము = శక్యము కాదు, భక్తలోకరక్షారతుఁడు = భక్తులసమూహమును రక్షించుటయందాసక్తుఁడు. 20 ఆప్రొద్దె = అప్పుడే. 21 జగదేకానందచిద్రూపముఙ్ = లోకమునందు ముఖ్యమైన జ్ఞానానందస్వరూపము గలదానిని, వివిధామ్నాయ కళాకలాపముఙ్ = నానావిధములైన వేదవిద్యలయొక్క సముదాయము గలదానిని, సుపర్వీగీతసల్లాపముఙ్ = దేవతాస్త్రీలయొక్క పాటలనెడు ముచ్చటలుగలదానిని, ధవళద్వీపముఙ్ = శ్వేతదీపమును, పుణ్యరూపముఙ్ = పుణ్యమే ఆకృతిగాఁగలదానిని, అవిద్యావేద్యసంతాపముఙ్ = అజ్ఞానముచేత తెలియఁదగిన సంతాపముగలదానిని - అజ్ఞానమును పోఁగొట్టుదానినుట. 22 సోల్లుంఠనంబు = మర్మభేదకమైన పరిహాసము, అకుంఠ = మొక్కపోని - తక్కువకాని ఉపకంఠంబునఙ్ = సమీపమునందు, కంఠోపరికంఠీరవుండు = మెడకుమీఁదసింహాకృతియైనవాఁడు - నరసింహుఁడు, పన్నగాశనవాహనుఙ్ = గరుడవాహనుని. 23 చంద్రశైలాధార = మేరుపర్వతమునకు ఆధారమైనవాఁడా - కూర్మవరాహరూపములతో మేరువుతోడ సర్వభూమిని శ్రీవిష్ణుదేవుఁడు

కమలసన్నిభనేత్ర కమలామనోహర కమలనివాస యోకమలనాభ
ధరణీధరాధార ధరణీభరనివార ధరణీధ్రమంథాన ధరణినాథ
దశదిశాపరిపూర్ణ దశకంఠవిదళన దశరూపధారణ దశపగమన
తే. పంచభూతరూపపంచేంద్రియాకార, పంచబాణజనక పంచపంచ
తత్త్వబోధవితతసత్త్వాదిగుణకర్మ, మిమ్ముఁ గరుణతోడ మనుపు మనుచు. 23
క. వినుతించి నలువ దనపైఁ, ననుపమకారుణ్యనవసుధామృతధారల్
వనజాక్షుఁడు దొరగించుట, మనమునఁ దలపోసి పలికె మఱియున్ హరికిన్. 24
శా. దేవా యీవసుధావధూటి సమదాంధీభూతభూతంబులన్
మోవంజాలక జాలిఁబొందుచు బలంబున్ జేవయున్ బోయి దుః
ఖావస్థం దురపిల్లుచున్నయది దైన్యం బొంది యేతద్వ్యథల్
పోవంజేయఁగ నీవ నేర్తువు కృపాపూతాత్మ విశ్వాత్మకా. 25
క అని విన్నపంబుచేసిన, వనజభవుని నాదరించి వసుధాసతిఁ గ
న్గొని నీ కిప్పుడు చెందిన, ఘన భారము మాన్పి జగము గాచెదఁ గరుణన్. 26
చ. అని తనమేనియందు ధవళాసితరోమయుగంబుఁ బుచ్చి య
య్యనిమిషకోటిఁ గన్గొని మదంశములై యివి రెండు భూమిపై
జననమునొంది దుష్టజనసంహరణంబును సాధురక్షణం
బును నొనరించు భూభరము పోయెడు నెంతయు నిశ్చయంబుగన్. 27
మ. పురుహూతప్రముఖాఖిలామరచయంబుల్ తత్తదంశంబులన్
ధరణిన్ సూర్యసుధాకరాన్వయములన్ ధాత్రీశులై పుట్టిన
న్నురుభక్తిన్ భజియించుచున్ రణమునందుగ్రాహితానీకమున్
బొరిమార్పంగలవారు నామహిమచేఁ బొల్పారుశౌర్యంబులన్. 28
క. జగతి వసుదేవుప్రియసతి, యగుదేవకియందు నెనిమిదవగర్భమునన్
జగతీభరనాశార్థం,బుగఁ బుట్టెదఁ గృష్ణనామమున మర్త్యుఁడనై. 29
వ పుట్టి కంసాదిరాక్షసులం జంపి జగంబులకు సుఖంబుసేయువాఁడ ననిపలికి
యద్దేవుం డంతర్ధానంబునం బొందె నప్పుడు. 30

---

ధరించుట ప్రసిద్ధము, చంద్రవస్త్ర = బంగారుపచ్చడము గలవాఁడా, కమలనివాస = జలమునందు నివసించువాఁడా - వటపత్రశాయియనుట, ధరణీధరాధార=రాజులకెల్లనాధారభూతుఁడైనవాఁడా, ధరణీభరనివార = భూభారమును నివారించువాఁడా, ధరణీధ్రమంథాన = కొండ కవ్వముగాఁ గల వాఁడా, దశపగమన = గరుడవాహనుఁడా, పంచపంచతత్త్వబోధవితత = ఇరువదియైదు తత్త్వముల బోధను విస్తరించువాఁడా, మనుపుము = రక్షింపుము. 24 నలువ = చతుర్ముఖుఁడు - బ్రహ్మ. 25 సమదాంధీభూతభూతంబులన్ = మదముతోఁగూడుకొనిన వగుటచేత కన్నులుగాననివిగాచేయఁబడిన ప్రాణులను, జాలిన్ = దుఃఖమును, చేవ=సత్త, దురపిల్లుచున్నయది=విలపించుచున్నది, ఏతద్వ్యథలు= ఈభూదేవియొక్క సంకటములను, కృపాపూతాత్మ = దయచేత పరిశుద్ధమయిన మనసుగలవాఁడా, విశ్వాత్మకా = ప్రపంచస్వరూపుఁడా. 28 పురుహూతప్రముఖ = ఇంద్రుఁడు మొదలుగాఁగల.

మత్తకోకిల. వాసుదేవునియాజ్ఞ పెంపున వారిజాసనుపంపునన్
వాసవాదిసుపర్వు లందఱు వచ్చి మేరువు చేరువన్
డాసి యొక్కెడఁ గార్యచింత యొనర్చుచుండిరి సంతతో
ల్లాసభాసురరయై ధరిత్రి చెలంగుచుండె మనంబునన్. 31

వ. అంత. 32

క. ఆవైకుంఠములోపలి, దేవరహస్యంబులెల్లఁ దెలిసి రయమునన్
దేవముని యైననారదుఁ, డావార్తలు చెప్పిపోయె నాకంసునకున్. 33

తే. నాటనుండియుఁ గంసుండు నాటుకొన్న, దిగులు పెంపున వసుదేవ దేవకులను
మిగులఁ బదిలంబు గావించి మెదలనీక, యొక్క కారాగృహంబున నునిచియుండె.

తే. గరిమ నాహిరణ్యకశిపునితనయు లా,ఱ్వురు మహోగ్రదానవులును విష్ణు
మాయవలన వచ్చి మహియందు దేవకీ, వనిత కుదయమైరి వరుసతోడ. 35

క. మును కంసునితో నాడిన, తనసత్యము దప్పనీక తనయులఁ దోడ్తోఁ
గొని చని వసుదేవుం డా,తని కిచ్చిన వాఁడు వారిఁ దడయక చంపెన్. 36

ఉ. ఏడవగర్భ మాజలరుహేక్షణ దాల్చిన లోకమంతయున్
వేడుక నొందె భూసతికి వింత విలాసము తొంగలించె నీ
రేడుజగంబులుం బొగడ నీశ్వరుఁ డప్పుడు దేవబృందముల్
చూడఁగ యోగనిద్ర దెసఁ జూచి ముదం బొదవంగ నిట్లనున్. 37

సీ. భూభార ముడుపంగ భూమిఁ బాతాళాధిపతి యైనశేషాహిపతి మదీయ
తామసోద్వృత్తుఁడై ధరణీతలంబున జన్మింప దేవకీజఠరమునను
బెరుగుచు నున్న యాపిన్న పాపని నీవు గొనిపోయి నందగోకులమునందు
వర్తించుచున్న యావసుదేవపత్నులలోన రోహిణి యనులోలనేత్ర

తే. యుదరమున నొరు లెఱుఁగక యుండబెట్టు, కంసుభయమున దేవకీకమలముఖికిఁ
గడుపు దిగఁబడిపోయె నక్కట యటంచు, వెల్లివిరిగాఁగ నాడుదు రెల్లవారు.

తే. గర్భసంకర్షణం బైన కారణమున, నాకుమారుండు సంకర్షణాఖ్యమహిమ
గలిగి ధవళాద్రినిభమైనగాత్రమునను, భూమిలోపల భద్రుఁడై పుట్టఁగలఁడు.

వ. ఏను ప్రావృట్కాలంబున శ్రావణమాసంబున శుక్లపక్షాష్టమియందు మహానిశీథ

---

భజియించుచున్=కొలుచుచు, ఉగ్రాహితానీకము=భయంకరులైన శత్రువులసమూహము, పౌరిమార్పం గలవారు = చంపఁగలరు. 31 పంపునన్ = ఆజ్ఞచేత, డాసి=చేరి. 33 వార్తలు = వృత్తాంతములు. 34 నాటుకొన్నదిగులుపెంపునన్ = స్థాయిపడిన భయాతిశయముచేత. 37 తొంగలించెన్ = అతిశయించెను. 38 తామసోద్వృత్తుఁడు=తమోగుణముయొక్క విజృంభణముగలవాఁడు, జఠరమునన్ = కడుపునందు, వెల్లివిరి = ప్రసిద్ధము. 39 గర్భసంకర్షణంబు = గర్భముయొక్క లెస్సగా ఆకర్షించుట, ధవళాద్రినిభము = తెల్లనికొండను పోలినది, గాత్రమునన్ = దేహముతో. 40 ప్రావృట్కాలంబునన్ = వానకాలమునందు, మహానిశీథసమయంబునన్ = మంచియర్ధరాత్రి

సమయంబున దేవకీదేవియందు జనియించెదఁ దత్కాలంబున నీవును యశోదా
దేవి గర్భంబున నుదయింపుము. మదీయశక్తిప్రేరితుండయి వసుదేవుండు బాల
వేషంబుననున్న నన్నుం గొనిపోయి నందు భార్యశయనంబున నునిచి నిన్నుం
గొనివచ్చినఁ గంసుండు తొల్లింటియట్ల వధ్యశిలాతలంబున వైచిన. 40

తే. అపి మాయామహాశక్తి వగుచు నరిగి, దుర్గవై యష్టభుజములతోడ నిలిచి
యొగసిపోయెద వింద్రాదులెల్ల నిన్ను, జయజయధ్వానములతోడ సన్నుతింప.

క. క్రమమున శుంభనిశుంభాదిమహారాక్షసుల నెల్లఁ దెగటార్చి త్రిలో
కములకు నభయం బిచ్చుచుఁ, బ్రమదంబుననుండు నీకు భద్రము లొదవున్.

వ. మఱియు నీవు నానాస్థానంబులందును భూతి సన్నతి క్షాంతి వృద్ధి ధృతి లజ్జా
పుష్టి రుషా నీతి ప్రశ్రయ ఆర్య దుర్గ దేవగర్భ అంబిక భద్రకాళి భద్రక్షమ
క్షేమంకరి అనునామంబులం బరఁగి ప్రాతరపరాహ్ణకాలంబులందు భక్తిపరిపూర్ణ
హృదయులై సురామాంసోపహారంబులం బూజించువారికి నభీష్టఫలంబు లిచ్చు
చుండు మని పనిచిన. 43

క. శ్రీవల్లభుండు పనిచిన, కైవడి నాయోగనిద్ర గ్రక్కునఁ జని యా
దేవకిగర్భములోని మహావీరుని శేషమూర్తి యగునాశిశువున్. 44

క. కొనిపోయి కడురహస్యంబున రోహిణిగర్భదేశమున నునిచెను గం
సునిభీతిఁ గడుపు దిగఁబడె, నని దేవకిఁ జూచి వగచి రందఱుఁ గరుణన్. 45

శ్రీకృష్ణావతారఘట్టము.

క. దేవసమానుం డగువసుదేవునిపుణ్యమున విష్ణుదేవునిమహిమన్
దేవకి యష్టమగర్భము, పావనముగఁ దాల్చె జగతి ప్రస్తుతిసేయన్. 46

సీ. కోరి దేవతలకోర్కులు వృద్ధిఁ బొందినగతి నాడునాటికిఁ గౌను బలిసెఁ
గంసాదివీరులగర్వంబు పొలియించు పోలుపునఁ జను మొనల్ నలుపులయ్యె
వసుదేవు సత్కీర్తి వన్నియ కెక్కినవిధమునఁ జెక్కులు వెలుకఁబాఱె
దనుజశుద్ధాంతకాంతలు చిన్నవోయెడువడువున వదనంబు వాడువాఱె

తే. గోపకాంతలయాసలు కొనలుసాగు, చందమునఁ గోర్కు లెంతయు సందడించెఁ
గడుపులోపల సర్వలోకములు నిడిన, బాలకునితల్లి యైనయప్పద్మముఖికి. 47

---

కాలమున, వధ్యశిలాతలంబునన్ = చంపుడుబండమీఁద. 42 తెగటార్చి = చంపి, ప్రమదం బునన్ =సంతోషముతో, భద్రములు=శుభములు, ఒదవున్=కలుగును. 43 ప్రాతరపరాహ్ణకాలంబు లందున్ = ప్రొద్దుటివేళలను మాపటివేళలను, సురా = కల్లు, ఉపహారంబులన్ కానుకలచేత. 47 నాడునాటికిన్ = దినక్రమమున, కౌను = నడుము, పొలియించుపోలుపునన్ = నశింపఁజేయు విధమున, వన్నియకెక్కినవిధమునన్ = ప్రసిద్ధివహించినట్లు, చెక్కులు = చెక్కిళ్లు, వెలుకఁబాఱెన్ =తెల్లఁదనము పొందెను, దనుజశుద్ధాంతకాంతలు = రాక్షసులయొక్క అంతఃపురస్త్రీలు, వాడు వాఱెన్ = వాడెను, కొనలుసాగు = సెలవేఱు, సందడించెన్ = అతిశయించెను, ఇడిన = ఉంచు

వ. ఇట్లు సకలలోకోపకారభూతుం డయిన భూతేశ్వరుండు దేవకీగర్భంబున నర్భకుండై జన్మించుసమయంబున. 48

ఆ. నందగోపపత్నియందు వైష్ణవశక్తి, యైనయోగనిద్ర యవతరించె
నంబుజాక్షుఁ డుదయ మైనలగ్నంబున, గ్రహవితతులు వక్రగతులు విడిచె. 49

ఆ. సకలభువనపంకజము లుల్లసిలఁజేయ, విష్ణుసూర్యుఁ డుద్భవించఁజేయు
పూర్వసంధ్యకరణిఁ బొలిచి తేజోరాశి,యై వెలింగె దేవకీవధూటి. 50

వ. ఇట్లు జాజ్వల్యమాన యైనయమ్మానవతింజూచి దుర్నిరీక్ష్యులై సహస్రాక్షప్రముఖదేవగణంబులు గగనంబుననుండి యిట్లనిరి. 51

చ. కడుపున సర్వలోకములు గైకొని దాఁచినయాదిమూర్తి నీ
కడుపున నుద్భవించు నటు గాన జగంబులకెల్లఁ దల్లివై
పొడమితి విప్డు డీపరమపూరుషుఁ డచ్యుతుఁ డుద్భవించఁగా
జడిసి ప్రసూతివేదనలసంకటపాటు వహింపకుండుమీ. 52

వ. అని యనేకప్రకారంబులం గొనియాడుచున్నసమయంబున. 53

ఉ. నల్లనిమేను పూర్ణశశినవ్వెడుమోము నురంబు మచ్చయుక్
దెల్లనికన్నులుం గరుణదేఁటెడుచూపులు పచ్చపట్టురం
జిల్లుకటిప్రదేశమును జేతులు నాలుగు నై విభూతితో
నెల్లజగంబులం బలిమి నేలెడువాఁ డుదయించె బాలుఁడై. 54

వ. ఇట్లు సకలభువనరక్షణదక్షుం డైన పుండరీకాక్షుండు శంఖచక్రగదాభయచారుహస్తుండును వినమితాఖిలదేవగణమస్తుండును నై జన్మించె నప్పుడు నానాలోకంబులకు నాహ్లాదంబయ్యె సాధుజనులకుఁ బరమసంతోషంబుగలిగెఁ జండమారుతంబులు ప్రశాంతంబులయ్యె యమునానదీప్రముఖమహావాహినులు ప్రసాదవాహినులయ్యె సముద్రంబులు నిజశబ్దవాద్యంబులు మొరసె గంధర్వులు సంగీతంబులు చేసిరి యప్సరోగణంబులు నృత్యంబులు సలిపిరి భూనభోంతరవర్తులయినదేవతలు పుష్పవర్షంబులు గురియుచు దివ్యదుందుభులు మొరయించిరి

---

కొనిన. 48 భూతేశ్వరుఁడు = పంచమహాభూతములకు ఒడయఁడైనవాఁడు, అర్భకుండు = శిశువు. 50 భువనపంకజములు = లోకములనెడు కమలములను, ఉల్లసిలఁజేయక్ = వికసింపఁజేయుటకు, పూర్వసంధ్య = ప్రాతస్సంధ్య, పొలిచి=తోఁచి. 51 జాజ్వల్యమాన = జ్వలించుచున్నది, సహస్రాక్షప్రముఖ=ఇంద్రుఁడు మొదలుగాఁగల. 52 పొడమితివి = పుట్టితివి, జడిసి = వెఱచి. 54 నవ్వెడు= అపహసించునట్టి, తేఁటెడు = తేటయయ్యెడు, విభూతితోక్ = సంపదతో. 55 వినమితాఖిలదేవగణమస్తుండు = మిక్కిలి వంపఁబడినయెల్ల దేవతాసమూహములతలలుగలవాఁడు - ఎల్లదేవతలచేత మ్రొక్కించుకొనువాఁడు, చండమారుతంబులు = భయంకరములైన తీక్ష్ణవాయువులు, ప్రశాంతంబులయ్యెక్ = అణఁగెను, మహావాహినులు = పెద్దయేళ్లు, ప్రసాదవాహినులు = తేటనీటిప్రవాహముగలవి, భూనభోంతరవర్తులు = భూమియందునాకాశమునందును మెలఁగువారు, కురియుచు=కురియిం

యజ్ఞంబులు ప్రదక్షిణార్చులై వెలింగె మేఘంబులు మందగర్జితంబులై వర్షించె నప్పుడు. 55

తే. దేవకీవసుదేవులు దివ్యమూర్తియైన యావాసుదేవునియమితమహిమ
చూచి తమలోన నెంతయుఁ జొక్కి మ్రొక్కి, పలికి రత్యంతసంతోషభరితు లగుచు.

ఉ. దేవ జగజ్జనస్తుతివిధేయ చరాచరభూతనాథ ల
క్ష్మీవసుధాకళత్ర సరసీరుహసన్నిభచారునేత్ర నా
నావిబుధావనస్ఫుటఘృణారసపూరితవాసుదేవ మా
కీవు జనించినాఁడవఁట యెంతకృతార్థులమో కదా హరీ. 57

ఆ. దివ్యమూర్తి నధికతేజంబుతో నిట్టు, లున్నఁ గంసుఁ డెఱిఁగి మున్న వచ్చి
మమ్ము నిలువనీక మాప్రాణములమీఁద, వచ్చునంతపనులు వాఁడు సేయు. 58

ఉ. కావున నిట్టిరూపము జగన్నుత మాని నరార్భకుండవై
నీవు నటింపుమన్న జలజేక్షణుఁ డవ్వసుదేవదేవకీ
దేవుల నెంతయుం గరుణ దేఱెడు చూపులఁ జూచి మీకు నే
లా వెఱవంగఁ గంసునిబలంబుఁ జలంబును మీఱఁ జంపెదన్. 59

వ. అని యభయం బిచ్చి మనుష్యబాలవేషంబు గైకొని యూరకుఁడె నంత. 60

క. శ్రీధరునియోగమాయా, బోధవలన దేవకీవిభుండు ప్రయత్నం
బాధిక్యంబుగఁ గంసభ, యాధీనం బైనచిత్త మల్లలనాడన్. 61

క. బాలుఁ గపటక్రీడా, లోలుఁ నానానిశాటలోకసమీర
వ్యాళుఁ భక్తజనావన, శీలుఁ గొని చనియెఁ గంసచిత్తనిమీలున్. 62

వ. ఇ ట్లొక్కరుండును నయ్యర్ధరాత్రంబునఁ గారాగృహంబు వెడలి వచ్చునప్పుడు.

క. ఆనగరంబునఁ గలిగిన, నానాజంతువులు కమలనాభునిమాయా
ధీనత నిద్రామోహితు,లై నిశ్చలవృత్తి నుండి రాసమయమునన్. 64

సీ. ఏపుతోఁ జెఱసాలయింట నల్దిక్కులఁ గాపున్నవారలఁ గన్ను మొఱఁగి
పారికాఁపులతోడఁ బరగడంబులు వచ్చియున్నవారల నెల్ల నోసరించి

---

చుచు, ప్రదక్షిణార్చులు = ప్రదక్షిణముగా వెలుఁగునట్టి మంటలుగలవి, మందగర్జితంబులు = మెల్లని యుఱుములుగలవి. 56 చొక్కి = పరవశులై. 57 చరాచరభూతనాథ = చరములును అచరములునైన ప్రాణులకు ప్రభువైనవాఁడా. 58 ప్రాణములమీఁద వచ్చునంతపనులు ప్రాణాంతములైనపనులు. 59 నరార్భకుండవు = మనుష్యశిశువవు, నటింపుము = ప్రవర్తింపుము. 61 అల్లలనాడన్ = తత్తఱింపఁగా. 62 లోలుఁ =ఆసక్తుని, నిశాటలోకసమీరవ్యాళుఁ = రాక్షససమూహమనెడు వాయువునకు సర్పమైనవానిని - సర్పములు వాయువును హరించునట్లు రాక్షసులను హరించువాఁడనుట, అవన = రక్షణమునందు, నిమీలుఁ = మూయువానిని - జడత్వము నొందించువానిననుట. 63 ఒక్కరుండును = ఒక్కఁడే. 65 ఏపుతోఁ - హెచ్చరికతోననుట, కాఁపు = కావలి, కన్ను మొఱఁగి = ఏమఱించి, పాఱికాఁపులతోడఁ = పరిచారకులతో, పరగడంబులు =

కరదీపికలతోడఁ బురిరాజవీథులవర్తించు తలవరివారిఁ ద్రోచి
కోటవాకిట నున్న కొలువుమోసలలోని ద్వారపాలుర నిద్రఁగూలఁజేసి
తే. బీగములు వుచ్చి గడియలు పెకలఁజేసి
బోరుతలుపులు దెఱచి గొబ్బునఁ బురంబు
వెడలె నానకదుందుభి విష్ణుమాయ
యఖిలమును గప్పి తనకుఁ దోడై నటింప. 65

వ. అంత. 66

క. సంపాదితశంపావళిఁ, బెంపారిన మేఘచయము పృథివియు నభముర్
గంపింపఁగ బెట్టుఱుముచు, నంపాచారంపువాన లప్పుడు గురిసెన్. 67

ఆ. వసుజనయునుమీఁదఁ జినుకులు పడకుండ, గాలి సోఁకకుండ ఘనసహస్ర
భోగమయకుటీరములు మాటుగాఁబట్టి, నయ్యె నంత దేవుఁ డాకసమున. 68

ఆ. విష్ణుమహిమవలన వేగంబె మోఁకాలి, బంటనీళ్లఁ దఱిసి భానుపుత్త్రి
యైనయమున దాఁటి యవ్వలిదరి కేగె, దేవనిభుఁడు దేవకీవరుండు. 69

క. హరిసేవకులకు భవసాగరకోట్లర కాలిబంటిగావఁట హాహా!
హరితండ్రికి యమునానది, యరయఁగ మోఁకాలిబంటి యగుటది యరుదే. 70

వ. అని దేవతలు గొనియాడుచుండి రప్పుడు. 71

క. వానలలో మొగమడిచిన, గానంగా రాని యంధకారములోనర్
దానొక్కరుండుఁ బోవుచు, నానదితీరమున నోలలాడెడుచోటన్. 72

ఆ. నందుఁ డాదిగాఁగఁ గొందఱుఁ గొల్లలు, పగిదిధనము దీర్పఁ బాలుఁ జమురు
నులుప గొంచుఁ గంసుఁ డున్నచోటికిఁ బోవు, వారిఁ గాంచె ననతిదూరమునను.

వ. కని తన్నెఱింగించుకొనక చని గోకులంబు ప్రవేశించి నందగోపమందిరంబుఁ జొచ్చె నప్పుడు సద్యః ప్రసవవేదనాఖేదమానసయు యోగనిద్రామోహిత యునై. 74

క. తన కాఁడుబిడ్డపుట్టుట, యును నెఱుఁగక నిద్రవోవుచున్న యశోదం
గనుఁగొని శయ్యాతలమునఁ, దనయుని నిడి కూఁతుఁగొని ముదంబున వెడలెన్.

---

పరస్థలవాసముగా, ఓసరించి = తొలఁగించి, కరదీపికలతోడర్ = చేదివటీలతో, త్రోచి = తఱిమి- ఆవలికిదాఁటిపోనిచ్చియనుట, కొలువుమోసల = చావడిముందరిచోటు, పెకలర్ = పెల్లగిల, బోరు= పెద్ద, గొబ్బునర్ = తటాలున. 67 సంపాదిత = కలిగింపఁబడిన, శంపావళిర్ = మెఱుపుచాలు చేత, పెంపారిన = సర్వత్రవ్యాపించిన, బెట్టు = భయంకరముగా, అంపాచారంపు = నిరంతరధారలు గల. 68 భోగమయ = ఫణారూపములైన, కుటీరములు = ఎత్తుడుగుడిసెలను. 69 తఱిసి = చేరి. 72 ఓలలాడెడుచోటర్ = స్నానముచేయునట్టి సమయమందు. 73 పగిదిధనము = పన్నురూకలు, ఉలుప=ఉపాయనము. 74 సద్యః=అప్పుడు, ఖేదమానస = సంకటముతోడి మనసుగలది.

తే. గొల్లపల్లియలో నున్నగొల్లవారు, చొక్కుచల్లినకైవడి నొక్కరైన
మేలుకొనక నిద్రింప నామేటి యపుడు, తిరిగి చెఱసాలలోని కేతెంచియుండె. 76

ఉ. కావలివారు మేలుకొని కంసునిపాలికిఁ బోయి దేవకీ
దేవి ప్రసూతియయ్యె నని తెల్పిన వాఁడును నిప్పుద్రొక్కిన
ట్లై వెసఁ బాఱుతెంచి హృదయంబునఁ గొంకక కల్కిచిల్కపై
బావురుఁ బిల్లి బిట్టుఱుకుభంగి నరిష్టము సొచ్చె నుద్ధతిన్. 77

క. వచ్చినకంసునిఁ బొడఁగని, వెచ్చని నిట్టూర్పు గదుర విహ్వలమతితో
ఱిచ్చవడి బాష్పధారలు, పిచ్చిల నయ్యిందువదన బెగడుచుఁ బలికెన్. 78

ఆ. అన్న నిన్ను వంటి యన్నకుఁ దోఁబుట్టి, యాఁడుబిడ్డపోఁడిమంద లేక
సుతులఁ గన్నకడుపు చుఱ్ఱునఁ గాలఁగా, నలమటింప వలసె నకట నాకు. 79

తే. ముద్దుకొడుకుల నార్వుర ముందు దింటి
వింతపాపంబు సేయంగ నేమి గలిగె
యాఁడుఁబడుచిది యీబిడ్డనైనఁ గాచి
విడువు నాయుల్లమునఁ గొంత యుడుకు దీఱ. 80

వ. అని బహుప్రకారంబుల విలాపించుచు హాహాకారంబుల నక్కుమారిక నక్కున
నిడి పెనంగుచున్న యన్నలినలోచన నదల్చుచు బిట్టుదిట్టుచు శిశువుకడకా
లొడిసి తిగిచి బిరబిరం ద్రిప్పి చట్రాతితోడ వ్రేసిన నక్కుమారికయును. 81

క. ఆకాశంబునఁ గడుభయ, దాకారముతోడ నిలిచి యాయుధనికర
స్వీకారాష్టభుజంబులు, గైకొని కోపించి నవ్వి కంసునిఁ బలికెన్. 82

క. నన్నేల యింతసేసితి, మున్నిటి నీవైరి దివిజముఖ్యులకెల్లన్
బెన్నిధి యిప్పుడు పెరుగుచు, నున్నాఁడు నినున్ వధింప నొకచో శిశువై. 83

వ. అనిపలికి యతండు చూచుచుండ గంధర్వవరులచేత దివ్యంబులైనగంధమా
ల్యంబులం బూజితయై యదృశ్యయయ్యె నప్పుడు. 84

ఉ. గ్రక్కున నేటుదాఁకినమృగంబునుబోలె నతండు తద్దయున్

---

76 చొక్కు = మైమఱపుకలుగఁజేయుపొడి, మేటి = గొప్పవాఁడు. 77 ప్రసూతియయ్యెన్ = కనియెను, వెసన్ = వడితో, పాఱుతెంచి=పరుగెత్తివచ్చి, కొంకక = శంకింపక, బావురుఁబిల్లి=గండుపిల్లి, బిట్టుఱుకు = తటాలున దుముకునట్టి, అరిష్టము = పురిటింటియందు, ఉద్ధతిన్ = దిట్టతనముతో. 78 విహ్వల = విచారముచేత కలఁతనొందిన, ఱిచ్చవడి = నిశ్చేష్టురాలై, బాష్ప = కన్నీటియొక్క, పిచ్చిలన్ = ఉబికిరాఁగా, బెగడుచున్ = బెదరుచు. 79 అలమటింపవలసెన్ = దుఃఖింపవలసి వచ్చెను. 80 తింటివి = చంపితివనుట, ఉడుకు = తాపము. 81 అక్కునన్ = ఱొమ్మునందు, చట్రాతితోడన్ = చట్టురాతిమీఁద. 82 స్వీకార=పట్టిన, కైకొని = వహించి, కంసునిన్ = కంసునితో. 83 మున్నిటి = మునుపు ఆకాశవాణిచెప్పిన, పెన్నిధి = పెద్దనిధివంటివాఁడు. 85 ఏటు=

స్రుక్కి మనంబులోనఁ గడుశూరతయున్ బలమున్ బ్రతాపమున్
మొక్కలువోవఁగాఁ గొలువు మోసలలోనికిఁ బోయి మంత్రులున్
దక్కినవారుఁ గొల్వ వెడదండితనంబున నుండి యుద్ధతిన్. 85

వ. తనకుం బరమాప్తులైనపూతనారిష్టప్రలంబకేశిధేనుకాదులైనరక్కసులం బిలి
పించి సవినయంబుగా నిట్లనియె. 86

చ. వినుఁ డసురేంద్రులార నెఱవీరుఁడనై జగమెల్ల నేలుచున్
ఘనమహిమం జెలంగుననుఁ గయ్యములోన వధించుయత్నముల్
పనివడిచేసినారఁట సుపర్వులు నేను శ్రుతాశ్రుతంబుగా
నొనరఁగ వింటి నాకడిమి కోర్వఁగ నెంతటివారు దేవతల్. 87

తే. మీఱెఱుంగరె వజ్రి నామీఁదవచ్చి, వేయిమాఱులదాఁకను వీఁపుపోట్ల
తోడఁ బాఱుట లిటువంటి తులువవచ్చి, సిగ్గుచెడ కిఁక నేరీతిఁ జెనకు నొక్కొ.

తే. బ్రహ్మవిష్ణుమహేశ్వరప్రభృతులైన
దివిజవర్గంబు నాకును దృణకణాయ
మాన మటువంటి పటువిక్రమప్రతాప
శాలి యగునాకు నెదురె యీజగతి నొరులు. 89

క. బంధురయశుఁడై నజరాసంధుం డొకరుండు తక్క సమరంబుల గ
ర్వాంధు లగునృపపిశాచపు, టింధనములు నిలువఁగలవె యే ననుశిఖికిన్. 90

ఉ. కావున నన్ను మార్కొన జగంబుల నెవ్వఁడు లేఁడు నేడు మా
దేవికిగన్న బిడ్డ ననుఁ దిట్టుచు నన్ననిఁ జంపనెవ్వఁడో
దేవుఁడు బాలుఁడై వసుమతిన్ జనియించినవాఁ డటంచు నా
తో వివరించి పోయె నిది తొల్లియు నారదుచే నెఱింగితిన్. 91

ఉ. మీరిఁక నేటనుండియును మేదినిలోఁ గలపిన్నబిడ్డలన్
వారక చంపుఁ డంచు బలవంతులఁ దెంపునఁ బంపువెట్టినన్
వారలు పెక్కురూపముల వచ్చి శిశుప్రకరంబు నెల్ల సం
హారము చేయుచున్ రుధిరమానిరి మానిరి పుణ్యకర్మముల్. 92

---

బాణప్రయోగముదెబ్బ, స్రుక్కి=డస్సి - పౌరుషముపోయినవాఁడై, మొక్కలువోవఁగాన్ = వ్యర్థములై పోఁగా, కొలువుమోసలలోనికిన్ = కొలువుకూటముముందరిచావడిలోనికి, వెడదండితనంబునన్ = అల్పపౌరుషముతో. 87 నెఱవీరుఁడను = మహాశూరుఁడను, పనివడి = పూని, సుపర్వులు = దేవతలు, శ్రుతాశ్రుతంబుగాన్ = వినీవిననట్టు—జాడగాననుట, ఒనరఁగన్ = యుక్తముగ, కడిమికిన్ = పరాక్రమమునకు. 88 వజ్రి = ఇంద్రుఁడు, చెనకునొక్కొ = ఎదిరించునో. 89 తృణకణాయమానము = గడ్డిపోఁచనుపోలినవారు. 90 ఇంధనములు = సమిధలు, శిఖికిన్ = అగ్నికి. 91 వివరించి = విశదపఱచి - చెప్పియనుట. 92 వారక = సంకోచింపక, పంపువెట్టినన్ =

వ. అంత కంసాసురుండు శుద్ధాంతమందిరంబునకుం బోయి దేవకీవసుదేవుల రావించి మిథ్యావినయంబున నిట్లనియె. 93

చ. కటకట మిమ్ముఁబంటిగుణగణ్యుల బుణ్యులఁ జెప్పరానిసం
కటములఁబెట్టి యెట్టికొఱగాములుచేసితిఁ బెక్కు నాకు నీ
కిటుకున నేమి మేలు గలిగెన్ సుతులందఱుఁ జచ్చిరంచు ము
చ్చటచెడి వంతనొందకుఁడు సర్వము దైవము సేఁతగావునన్. 94

వ. అని యాశ్వాసించి వారల కారాగృహనిరోధంబు మాన్పి యుద్విగ్నచిత్తుఁడై యుండె 95

వసుదేవుఁడు శ్రీకృష్ణునిఁజూడ గోకులంబునకు వచ్చుట.

క. వసుదేవుఁ డంతఁ దనబా, లసఖుం డగునందుగోకులమునకుఁ జని యిం
పెసలార గోపగోపీ, విసరంబులు సంతసిల్ల వేడుకతోడన్. 96

క. నందునిఁ బుత్రవిభూతిము, కుందుని సేవావిధేయగోపాలజనా
నందునిఁ గరుణారసని, ష్యందునిఁ బొడగాంచె నధికసంభ్రమ మొదవన్. 97

వ. కని యతనిచేతఁ దగుతెఱంగున సంభావితుండై యావృద్ధగోపదంపతులు సంతసిల్లి మానుషవేషంబు ధరించి యున్నకపటబాలకునిఁ దనచేతికిచ్చిన నెత్తుకొని ముద్దులాడుచు వారి కిట్లనియె. 98

మత్తకోకిల. మీకుఁ గల్గినభాగ్యదేవత మిమ్ము ధన్యులఁజేయఁగా
నీకుమారునిఁ దెచ్చి ముప్పున నిచ్చె నీతనిఁ జూచినన్
నాకునైనను బుత్రమోహము నాటియున్నది యిట్టి య
స్తోకపుణ్యుఁడు ముద్దుసేఁతలఁ జొక్కఁజేయఁడె మీమతుల్. 99

ఆ. ఇతనిఁ జూచి మీకు నెంతమోహముగల
దంతకంటె మాకు నధికమైన
మోహరసము మీరి మోచియున్నది యీకు
మారుఁ డొక్కరూప మాకు మీకు. 100

---

ఉత్తరువుచేసిపంపఁగా, అనిరి = త్రాగిరి. 93 శుద్ధాంత = అంతఃపురమునందలి. 94 కొఱగాములు = అకృత్యములు, కిటుకునన్ = అకృత్యముచేతననుట, వంతన్ = సంతాపమును, సేఁత= కృత్యము. 95 ఆశ్వాసించి = ఊఱడించి, నిరోధంబు=నిర్బంధము, ఉద్విగ్నచిత్తుండు = వేదననొందిన మనసుగలవాఁడు. 96 గోకులమునకున్ = గొల్లపల్లెకు, ఇంపెసలారన్ = ప్రియము అతిశయింపఁగా, విసరంబులు = సమూహము. 97 పుత్రవిభూతిముకుందునిన్ = పుత్రసంపదయైన విష్ణుమూర్తిగలవానిని, విధేయ = అడఁకువగల, నిష్యందునిన్ = జాఱుటగలవానిని, సంభ్రమము = త్వర. 98 సంభావితుండు = గౌరవింపఁబడినవాఁడు. 99 ముప్పునన్ = ముసలితనమునందు, నాకునైనను= నాకుఁగూడ, అస్తోక = అల్పముగాని, ముద్దుసేఁతలన్ = ఇంపుపుట్టించునట్టిచేష్టలచేత, చొక్కన్= పరవశతనొంద. 100 మీరి=మీఱి, మోచి=అంటి.

వ. అని పలికి మఱియు నిట్లనియె. 101

తే. నందగోపకరోహిణీనందనుండు, పెరుగుచున్నాఁడు మీయొద్ద గరిమతోడ
నీకుమారునిఁ బెంచిన ట్లాకుమారు, నరసి రక్షింపు మీమది బేరుకులేక. 102

క. అని యిట్లు పలికి మంతన,మున కాతనిఁ బిలిచి మీరు మొల్లమిఁగలవా
రని కంసుఁ డెఱిఁగియుండును, జన దిచ్చట నుండ నొండుచాయకుఁ జనుఁడీ.

క. నెట్టన వర్షావధికిం, బెట్టంగలయప్పనములు పెట్టియు మధురా
పట్టణసమీపమున మీ, రొట్టినసంపదలతోడ నుండఁగ నేలా. 104

తే. పావకుండును గపటంపుభూవరుండుఁ, దమ్ముఁ గడుఁజేరి మందెమేలమ్ముతోడ
నున్న వారికిఁ గీడుసేయుదురు వారి, కంచితస్నేహమున మంట లధికమగును.

మ. అని గర్భీకృతవాక్యపద్ధతుల నధ్యాహారముల్ సేయ హా
యిని నందాదులు గోసమూహములతో నేపారి దూరంబుగాఁ
జని రమ్యాటవులందు నుండిరి యథేచ్ఛావృత్తితోడన్ దృణం
బును నీరున్ గలతావులన్ బసులగుంపుల్ మేసి సొంపారఁగన్. 106

—పూతనావధశకటాసురవిధ్వంసనాదివివరణము.—

వ. అంత నానందగోకులంబున నత్యంతసుందరాకారంబున నందనందనుండు పెరుగు
చుండుట విని పూతన మనోహరం బైనయాకారంబు దాల్చి యర్ధరాత్రసమ
యంబున యశోదానివాసంబు సొచ్చి. 107

తే. నిద్రవోవంగ మెల్లన నిమిరి యెత్తి, మేలుకొనఁజేసి చెక్కులు మీటి మీటి
విష మమర్చినచన్ను తావిషధిశయను, నోరిలోపల నిడి చేత నొక్కుటయును.

తే. చన్నుఁబాలతోఁగూడ నాజంతయొడలి
ప్రాణవాయువు లన్నియు బలిమిఁ గ్రోలె
నప్పు డుద్విగ్నచిత్తయై యసురవనిత
బిట్టు రవమున హా యని పృథివిఁ గూలె. 109

వ. ఇవ్విధంబున. 110

క. పూతనఁ గంసవచోమృత, వేతనఁ బ్రాణప్రయాణవిహ్వలచేతో

102 బెరుకు = భేదము. 103 మంతనమునకున్ = రహస్యస్థలమునకు, మొల్లమి = ధనసంపద. 104 నెట్టనన్=తప్పక, వర్షావధికిన్=సంవత్సరాంతమునకు, పెట్టంగలయప్పనములు పెట్టియున్=ఇయ్యవలసిన పన్నులు ఇచ్చియు, ఒట్టిన = అధికమైన. 105 మందెమేలమ్ముతోడన్ = సరసత్వముతో, స్నేహమునన్ = మిత్రత్వముచేత, నూనెచేత, మంటలు=మనస్తాపములు, మండుటలు. 106 గర్భీకృతవాక్యపద్ధతులన్ = లోపలవిశేషార్థము కలిగియుండు మాటలరీతులను, అధ్యాహారములు = ఊహలు, హాయిని=నిశ్చింతతో. 108 నిమిరి = తడవి, మీటి=వ్రేళ్లతో తాటించి, విషధిశయనునిన్ = ప్రళయసముద్రమునందుపండుకొనువాఁడైన శ్రీకృష్ణునియొక్క, నొక్కుటయున్ = ఒత్తిపట్టఁగా. 109 జంత = ధూర్తురాలియొక్క, క్రోలెన్ = త్రాగెను, బిట్టు = అధికమైన. 111 కంసవచోమృతవేతన=

యాతనఁ బాతకజాతని, కేతనఁ బరిమార్చె గరుడకేతనుఁ డలుకన్. 111

మ. ఘనవజ్రాహతిఁ గూలు నీలగిరిశృంగప్రాయమై విహ్వల
ధ్వనితో నిట్లు వసుంధరం బడినఁ దద్ధ్వానంబు ఘోరంబుగా
విని గోగోపకగోపికానికరముల్ విభ్రాంతిమై బిట్టు మే
ల్కని చూడన్ జను దెంచి రర్భకుల కెల్లన్ వెక్కసిన్ రక్కసిన్. 112

వ. అంత యశోదానందు లప్పాపాత్మురాలియంకంబున నిశ్శంకితుండై యాడు
చున్న యర్భకు నెత్తుకొని భూతభయనివారణంబుగా గోపుచ్ఛంబు సురాళించి
గోమయంబునఁ దిలకంబు పెట్టి నారాయణస్తోత్రకవచంబులు పఠియించి దమ
గృహోపకరణంబులు నిండిన బండి క్రింద నుయ్యాలతొట్టిలోనం బెట్టి. 113

క. రక్కసురాలికళేబర, మొక్కయెడకు నీడ్చి యిట్టియుత్పాతము నే
డిక్కడికి నెట్లు వాటిలె, నొక్కో యని గోపవృద్ధు లున్నట్టియెడన్. 114

క. ప్రకటముగఁ గపటబాలుఁడు, వికటముగాఁ బాదపద్మవిక్షేపములన్
నికటమున సకలపరికర, శకటంబై యున్న యట్టిశకటముఁ దన్నెన్. 115

ఆ. నిండుబండి నేడు నిష్కారణం బేలఁ, బొరలె నొక్కొ యనుచుఁ బొక్కుపడుచు
నున్న గోపసతులయొద్దకు నచ్చోట, నాడుచున్న పడుచు లరుగుదెంచి. 116

ఆ. ఈయశోదపట్టి యిప్పు డేమెల్లను, జూచుచుండ బండిఁ ద్రోచెఁ బొరల
ననుచుఁ జెప్పిపోయి రప్పు డచ్చటనున్న, వ్రేత లెల్లఁ జూచి వెఱఁగుపడిరి. 117

ఆ. ఆయశోద వచ్చి యాబండిలో నిండి, యుండినట్టి కుంభభాండతతుల
పాలు నెయ్యి నేలపాలైనఁ జిడిముడి, పడుచుఁ బడుచుమీఁద నడిచిపడుచు. 118

వ. వచ్చి యచ్చిన్నిపాపనిపాదవిక్షేపంబువలన విధ్వస్తంబు లయినసమస్తవస్తువులను
బొందుపఱిచి దధిగంధపుష్పాక్షతంబులచేత శకటంబుఁ బూజించిన. 119

ఉ. గోపిక లెల్ల నచ్చటికిఁ గూడి యశోద వినంగ నమ్మ నీ

---

కంసునిప్రియవాక్యముల నెడు సంబళముగలది, విహ్వల = స్వాధీనముగాని, చేతోయాతన=మనోవేదన గలది, పాతకజాతనికేతన=పాపసమూహములకునిల్లైనది. 112 ఘనవజ్రాహతిన్=గొప్పవజ్రాయుధము యొక్క దెబ్బచేత, శృంగప్రాయము = శిఖరమువంటిది. ధ్వానంబు = ధ్వని. ఘోరంబుగాన్=భయంకరముగా. విభ్రాంతిమైన్ = దిగ్భ్రమముతో, బిట్టు = తటాలున, అర్భకుల కెల్లన్=పసిబిడ్డల కెల్లను, వెక్కసిన్=హింసకలుగఁజేయుదానిని. 113 అంకంబునన్=ఒడిలో, నిశ్శంకితుండు=భయపడనివాఁడు, సురాళించి=దిగదుడిచి, 114 కళేబరము=దేహము, వాటిలెన్=కలిగెను. 115 ప్రకటముగన్=ప్రసిద్ధముగా, వికటముగాన్ = పొరలి యెగుడుదిగుడుగాపడఁగా, విక్షేపములన్=ఎగఁజాచుటలచేత, నికటమునన్ = సమీపమున, సకలపరికరశకటము=ఎల్లవస్తువులను వహించినది. 116 పడుచులు = బాలకులు వ్రేతలు = గోపికలు, వెఱఁగుపడిరి = ఆశ్చర్యపడిరి. 118 కుంభభాండతతుల = కడవలయందును బానలయందునునుండిన, చిడిముడిపడుచున్ = ముఖవికారమును కలుగఁజేసికొనుచు, అడిచిపడుచున్ = కోపగించుకొనుచు. 119 విధ్వస్తంబులు = మిక్కిలి చెదరిపడిపోయినవి, పొందుపఱిచి = అనువుగా

పాపఁడు మొన్న మేరుగిరిపాటినిశాచరి నంతసేసె నే
డేపునఁ గట్టుబండి నిదె నిండఱు సూడఁగ నింతసేసె వీఁ
డోపిక ముందఱన్ బ్రతికియుండిన నెవ్వరి నెంతసేయునో. 120

రామకృష్ణుల జాతకర్మ నామకరణాదిప్రశంసనము.

వ. అని యిట్లు సల్లాపంబులుచేసి రంత వసుదేవుండు నిజపురోహితుఁ డయినగర్గు రావించి తనపుత్రులైనరోహిణీదేవకీనందనులకు నామకరణంబులు సేయుటకు నియోగించి నందగోకులంబునకుం బంచిన. 121

క. గర్గుఁడు పరివేష్టితముని, వర్గుడు సంపాదితాపవర్గుఁడు భవనై
సర్గుఁడు పరతత్వకళా, మార్గుఁడు చనుదెంచె నందుమందిరమునకున్. 122

వ. వచ్చి యభ్యాగతవ్యాజంబున యశోదానందులం బొడగాంచి యెవ్వరు నెఱుంగకుండ వసుదేవనందను లిరువురకు జాతకర్మాదికృత్యంబులు నిర్వర్తించి రోహిణీనందనునకు రామనామంబును దేవకీనందనునకుఁ గృష్ణాభిధానంబును జేసి పోయె నంత. 123

క. ఆరామకృష్ణు లిరువురు, గారాముస నందగోపకవ్రజమున నొ
ప్పారుచు నాసితనీలశరీరంబులతోడఁ బెరిగిరి ముదం బొప్పన్ 124

సీ. ఉయ్యాలతొట్టిలో నునిచి చేతులు వట్టియూఁచి యాడెడుపాట నుబ్బ నేర్చెఁ
బసిఁడికుందియనలోపలఁ బట్టుపొత్తులయొత్తున నొఱగి కూర్చుండ నేర్చె
నించు కించుకదూర మిందు రమ్మని పిల్వ నల్లనల్లన దోఁగియాడ నేర్చె
వ్రేలు చేతికి నిచ్చి విద్దెంబు లాడంగ నిలిపిన గొంకుచు నిలువ నేర్చె
తే. వేడ్కమాటల విందులు విందులనుచుఁ, బిలిచి చేచాఁప నడుగులు పెట్ట నేర్చెఁ
దల్లిదండ్రులమనములు పల్లవింపఁ, గృష్ణుఁ డొప్పారె శైశవక్రీడలందు. 125

వ. మఱియు నానందనందనుండు రోహిణీనందనసమేతుండయి యథాకాలంబుల

---

నుంచి. 120 మేరుగిరిపాటి = మేరుపర్వతమంత, అంతసేసెన్ = అంతటియవస్థను పొందించెను-చంపెననుట, కట్టుబండిన్ = గృహోపకరణము లుంచుకొనెడుబండిని, ఓపికన్ = సమర్థతచేత, ముందరన్ బ్రతికియుండినన్ ఓపికన్ ఎవ్వరినెంతసేయునోయని యన్వయము. 122 పరివేష్టితమునివర్గుఁడు = చుట్టుకోఁబడిన మునిసమూహముగలవాఁడు, సంపాదితాపవర్గుఁడు = సంపాదింపఁబడిన మోక్షముగలవాఁడు-మోక్షమును పొందఁగలవాఁడనుట, భవనైసర్గుఁడు = శివస్వభావముగలవాఁడు-శివునిఁబోలినవాఁడనుట, పరతత్వకళామార్గుఁడు = పరతత్వవిద్యయొక్క మార్గమును తెలిసినవాఁడు. 123 అభ్యాగతవ్యాజంబునన్ = తనంతట ఇల్లువెదకుకొని వచ్చినయతిథియను నెపముచేత, నిర్వర్తించి = జరపి. 124 గారామునన్ = గారాబముతో. 125 ఉబ్బన్ = సంతోషింప, కుందియనలోపలన్ = కూర్చుండ నేరనిపసిబిడ్డలు కూర్చుండుటకై ఒకతట్టుదారి యేర్పఱచి చేయఁబడిన తొట్టిలో, పొత్తులయొత్తునన్ = పొత్తిగుడ్డలయొక్క ఒత్తుడుచేత, విద్దెంబులు = వెలికిల పండుకొని కాళ్లయడుగులను బిడ్డల కడుపున కానించి పైకెత్తిడించియాడించునాటలు, కొంకుచున్ = భెదరుచు, శైశవక్రీడ

గోకరీషధూళిధూసరితశరీరంబుతోడ వాడవాడలం బరువులు వెట్టుచు వెండి యునుం గ్రీడ లాడుచున్న లేఁగదూడలతోఁకలు పీఁకలం బట్టుకొని వెనుచనిన నవి యఱచుచుం దుల్లమల్లాడుచుం బాఱిపోయినఁ బోనీక యాఁగియును పిలికి తెచ్చి పసిండిభాండంబులనిండంబోసినపాలలోనఁ దననీడచూచి బూచివచ్చె నని విచ్చలవిడిఁ బెచ్చుపెరిగి నెచ్చెలులతోడం జెప్పియును చిలికి చిలికివెలికి వచ్చిన గొల్లగుబ్బెతల మొఱంగి పెరుంగుబానలోనం దనపాదంబులు వెట్టి బిట్టు వెద చల్లియును గోవులం గావంబోయినమగల తగులున కాసపడి నిజకుటీరద్వారం బులకవాటంబులు వాటంబులుచేసి చనిన జవరాండ్రయిండ్లు సొచ్చి సమస్తం బును విధ్వస్తంబుచేసియును ఏమఱించి వచ్చి కాఁగుచున్న కాఁగులమీఁదిమీఁఁ గడలు మెల్లమెల్లనె ఫుడుకవెరఁజి యారగించియును మందపాలకుం బోయిన యిందువదనలమందిరంబులు మొఱంగి సొచ్చిన నెఱింగి పొరుగులచంచలాక్షు లదలించుచుఁ జిట్టకంబులకుఁ బట్టుకొనవచ్చిన మచ్చికలతోడి యిచ్చకంబులు చేసియును పసులమందకుం బోవుప్రేతలు తనకు నందరాకుండ కుండలంబెట్టి యుట్టిమీఁద నిడినవెన్న యులూఖలంబులు దాపులుగా నిడి యెక్కి నిక్కి యందుకొని యన్నయుం దానును గడుపుకొలందియు నారగించియు ఇట్లు బహుప్రకారంబులఁ గపటబాలక్రీడలాడుచున్న నీలవర్ణుదుండగంబులకు వేసఱి యొక్కనాఁడు. 126

వెన్నుఁ డొకయింటిలోఁ జొచ్చి వెన్న దినఁగ
నెఱిఁగి కొందఱు గోపిక లేగుదెంచి
వీఁడె కృష్ణుఁడు పెనుదుండగీఁడు మనకుఁ
జిక్కెఁ బోనీకుఁడీ యంచుఁ జేరవచ్చి. 127

తే. పట్టవచ్చినఁ గనుఁబ్రామి పాఱిపోయి, జననియంకతలంబున సాధువృత్తి
ముద్దుచూపుచు నొయ్యారమున నటింప, గోపకాంతలు గుంపులుగూడి వచ్చి. 128

—గోపికలు శ్రీకృష్ణునిదుండగములు యశోదతోఁ జెప్పట.—

ఆ. అయ్యశోదఁ జూచి యమ్మ దయ్యపుబిడ్డ, నెట్లుగంటి కృష్ణుఁ డెదురులేక
వచ్చి వెన్నలెల్ల ముచ్చిలుచున్నాఁడు, మమ్ము నిండ్లలోన మనఁగనీక. 129

---

లందుర్ = పసిబిడ్డల యాటలయందు. 126 గోకరీషధూళి ధూసరిత శరీరంబుతోడర్ = ఎండిన ఆవుపేఁడ వల్లనైనదుమ్ము చుట్టుకొనుటచేత ఇంచుక తెల్లనైన దేహముతో, పీఁకలర్ = నిక్కులతో, దుల్లర్ = పీడ, మల్లాడుచుర్ = పెనఁగులాడుచు, ఆఁగియును = నిలిపియు, గుబ్బెతలర్ = స్త్రీలను, మొఱఁగి = ఏమఱించి, తగులునకుర్ = కూటమికి, కుటీర = గుడిసెలయొక్క, వాటం బులుచేసి = ఓరవాకిలిగా వేసికొని, జవరాండ్ర = యౌవన స్త్రీలయొక్క, విధ్వస్తంబు = పాడు, వెరఁజి = ఊడ్చియెత్తి, చిట్టకంబులకుర్ = వేడుకలకు, ఇచ్చకంబులు = ప్రియములు, ఉలూఖలం బులు = ఱోళ్లు, దాపులు = సమీపములు, పొ, తాఁపలు = మెట్టు, దుండగంబులకుర్ = దుష్ట చేష్టలకు. 127 దుండగీఁడు = దుష్టుఁడు. 128 కనుఁబ్రామి = ఏమఱించి, అంకతలంబులర్ =

ఆ. ఉవిద నీకుఁ దెలియదో కాని యేయింట, నైనఁ జొచ్చి యెప్పుడైనవచ్చి
వెదకి వెదకి వెన్న వెరఁజాడుచున్నాఁడు, నీసుతుండు మమ్ము నిలువనీక. 130

ఆ. చూచి చూచి యేము రాచకుమారుని, నాడ వెఱతు మైన నాడకుండ
రాదు కృష్ణుచేతిరాయిడి యింతంత, యనఁగ రాదు మూకు మనఁగ రాదు. 131

వ. అని యింత నిలువక గోపబాలికలు కపటబాలునికోమలాంగుళీరేఖాచిహ్నితంబు లగునవనీతభాండంబులు చూపిన యశోదాదేవి కొడుకుమీఁదం గోపించి యిట్లనియె. 132

మత్తకోకిల. ఎల్లభాగ్యములుం గృహంబున నెప్పు డుండఁగ నేలరా
గొల్లపల్లియ యంతయుం గలగుండుపెట్టి సమస్తముం
గొల్లలాడెదు నిన్ను నేగతిఁ గుస్తరించి యదల్చినం
దల్లిదండ్రులయాజ్ఞ నిల్వవు దంటదయ్యపుబిడ్డఁడా. 133

తే. ఏల పొరిగిండ్లు చొచ్చెద వేల వెన్న, లెల్ల వెరఁజెదవింటిలో నేలయుండ
వేల యీసరివారిలో నింతఅట్టు, చేసెదవు నీచరిత్రంబు చెప్ప నరుదు 134

క. అని దామపాశమున న్యాతని నెన్నఁడు ముగ్గఁగట్టి తక్కినకొన త్రా
డొనరఁగ నులూఖలముతో, జనని వెసం ముడిచి నిలిపె సదనమునందున్. 135

శ్రీకృష్ణుండు ఉలూఖలబద్ధుండై యమళార్జునభంజనంబు చేయుట.

క. ఉనిచి కడుఁగోపసంభ్రమ,మున చిడిముడిపడుచునుండెఁ బురుషోత్తముఁడుం
జనని తనుఁబట్టి కొట్టునొ, యనుభయమునఁ బాఱిపోయినట్లు రయమునన్. 136

తే. గొల్లపడుచులు చని గుండుగూడి చూడ
ఱోలు దామెనత్రాడును లీలతోడ
నీడ్చికొనివచ్చి దమయింటియెదురుకట్లఁ
దనరు యమళార్జునంబులఁ దగులఁ బెట్టి. 137

క. బద్ధులఁ దొలుపుట్టుకవెడ, బుద్ధుల నొండొంటితోడఁ బురుణించినపె
న్నుద్ధుల మద్దుల ముద్దుల, సుద్దులబాలకుఁడు ద్రోచె క్షోణిఁబడంగన్. 138

వ. ఇవ్విధంబున నయ్యమళార్జునంబులు రెండునుం గటకటధ్వానంబులతోడ విఱిగిన

తొడమీఁద. 130 వెరఁజాడు = ఊడ్చియెత్తు కొనితిను. 131 రాయిడి = బాధ. 132 కోమలాంగుళీరేఖాచిహ్నితంబులు = మెత్తని వ్రేళ్లగీఱగుఱుతులు గలవి. 133 భాగ్యములు = సంపదలు, కలగుండుపెట్టి = కలయవెదకి, కుస్తరించి = పట్టుపఱిచి, దంట = దిట్టతనముగల. 134 అట్టు = అల్లరి. 135 దామపాశము = దామెనత్రాటితో, ఉగ్గం = బిగియ. 137 గుండుగూడి = చుట్టుచుట్టుకొని, ఎదురుకట్లం = ఎదుటి ప్రదేశమునందు, ధవళార్జునంబులం = తెల్లమద్దిచెట్లను. 138 బద్ధులం = అశాశ్వతములైన, తొలుపుట్టుక వెడబుద్ధులం = పూర్వజన్మమునందు దుర్బుద్ధులైన, పురుణించిన = సరిపోలిన, ముద్దుల సుద్దుల బాలకుఁడు = ఒప్పిదములైన వృత్తాంతములు గలపిన్నవాఁడు, క్షోణిం = భూమిమీఁద. 139 యమళార్జునంబులు = జంటమద్దిచెట్లు,

నాఘోషంబు ఘోషంబునకెల్ల నత్యంతవిభీషణంబయ్యె నప్పు డచ్చటివార
లాబాలగోపాలంబుగా వచ్చి చూచి ఆచ్చెలువడియుండి రంత. 139

ఆ. పెద్దఱోలితోడ బిగువు దామెనతోడc, బడినమద్దిచెట్లనడుమ ముద్దు
లైనతొక్కుc బలుకులాడుచు నిలుచున్న, కపటబాలుదుండగములు చూచి. 140

ఉ. గోపిక లయ్యశోదకడకుం జని నీతనయుండు వాcడె నే
డాపెనుమద్దిమ్రాcకుల రయంబునc బెల్లగిలంగc ద్రోచినాc
డీపసిబిడ్డ దయ్యము సుమీ యని పల్కిన యామ్మగాత్మి యు
ద్దీపితశోకసంభ్రమవిధేయమతిన్ బఱతెంచి గ్రక్కునన్. 141

వ. ఉలూఖలంబులతోడc గట్టువడియున్న బాలకృష్ణుని యుదరబంధం బైనదామంబు
విడిచి యెత్తుకొని యక్కునం జేర్చి మూర్ధాఘ్రాణంబు చేసి యానందబాష్పధారా
సారంబున నతని నభిషేకించె నిట్లు దామం బుదరబంధనం బగుటం జేసి కృష్ణుండు
దామోదరుం డనం బరcగె నప్పుడు. 142

నందాదిగోపకులు రామకృష్ణసమేతులై బృందావనంబునకుcబోవుట.

క. వారక యందఱుc జూడcగ, ధారుణిపై మద్దిచెట్లు తమయంతన ని
ష్కారణము విఱిగిపడు టా, భీరవరుల్ చూచి భయము పెద్దయుc గదురన్.

క. నా డర్ధరాత్రిపూతన, పోడిమిచెడె మొన్న బండి పొరలcగcబడియెన్
నే డిదె యీమద్దులకును, మూcడెను నిష్కారణంబు మూలాగ్రముగన్. 144

తే. ఇంక నిచ్చోటనుండిన నేమికీడు
పుట్టునో యొండుచోటికిc బోవవలయుc
బూరియును నీరుc గడుc బరివోయెc బసులు
కందుచున్నవి మనకేల యిందునుండ. 145

చ. తొలుకరివానలుం గురిసి తోరపుc బూరియుc దేటవారియున్
గలిగిననెంతయున్ గుబురుకానలు వానలు లేకయుండినన్
కొలమున నెమ్మెయిన్ బసరముల్ చెడ వెన్నcడు నెల్లియాలగుం
పుల గదలించి బృందకును బోద మటంచు వినిశ్చితాత్ములై. 146

ఘోషము = ధ్వని, గొల్లపల్లె, భీషణంబు = భయంకరము, ఆచ్చెలువడి = చేష్టలు దక్కినవారై. 140 తొక్కుcబలుకులు = వచ్చిరానిమాటలు. 141 ఉద్దీపితశోక సంభ్రమవిధేయమతిన్ = మిక్కిలి యతిశయించిన దుఃఖమునకును తొట్రుపాటునకును లోcబడినమనసు గలదై. 142 ఉదర బంధంబు = నడుముకట్టు, దామంబు = దామెన, అక్కునన్ = ఱొమ్మునందు, ఆసారంబునన్ = ఎడతెగని వానచేత. 143 నిష్కారణము=కారణము లేక, ఆభీరవరులు = గొల్లదొరలు, పెద్దయున్= మిక్కిలి, కదురన్ = కలుగcగా. 144 పోcడిమిచెడెన్ - చచ్చెననుట, మూcడెను - కీడుకలిగెననుట, మూలాగ్రముగన్ = తుదముట్ట. 145 పరివోయెన్ = కొల్లపోయెను - తగ్గి పోయెననుట, కందుచున్నవి = కృశించుచున్నవి. 146 తోరపు = అధికమైన, ఎల్లి = రేపు.

వ. ఉండి రమ్మఱునాటివేకువ నతిరతిశ్రాంతులైనకాంతలతోడం గవలుగూడి నిద్రాసక్తులైయుండి వేగుఁబోకను శునకభ్రాంక్రియానాదంబులకు బిట్టులికి మేల్కని గృహాంగణప్రదేశంబులం దమసఖులతోడం ద్రిమ్మరువారును ప్రయాణసందర్భంబులు డెందంబున సందడింప సరగునం బెరుగులు భాండంబుల నిండించి బంధురంబు లయినమంథంబులు వన్ని యాలీఢపాదంబులతోడఁ గృష్ణలీలలు వాడుచుం జిలుకుచు చిలుకుచూపుల గోపికలవచనరచనామృతపానంబుల మేనులెఱుంగక చొక్కుచున్నవారును రాత్రి కదలిపోయి చెదరి కదుపులంగలసిన మొదవుల వెదకితెచ్చి తమతమవెరవుల నిరవులఁ గూడం దోలువారును లేఁగదూడలకు మెంపుచు గుంపులై యఱ్ఱులెత్తి యంబేయని యఱచుచు జిఱ్ఱజిఱ్ఱన నట్టాడు ధేనువులఁ బేరువేరం బిలుచువారును దూడలం గుడువవిడిచి దుగ్ధదోహనంబునకుం జేరవచ్చిన బెదరి పసులసందునం బాఱిపోవు గోవావుల వెనుదగిరి సాదుసుల చాటునం బొంచికూడ ముట్టితలకోలలు వెట్టి యాఁగువారును మస్తరించుచు నుఱ్ఱుద్రాళ్లంగట్టి కుక్కుటాసనంబునం గూర్చుండి భాండంబులు జానులగ్నంబులు చేసి ఘుమఘుమధ్వానంబున ఫేనంబు లొదువ పాలుపిదుకువారును పచ్చిపాలలో నుడుకువంటకంబు నులివేఁడిగాఁగలిపి గొల్లగుబ్బెతలు వడ్డింప గ్రామ్యాహారంబులతోడ వలయాకారంబులుగా గొంతులుగూర్చుండి పాణిపాత్రంబులవరుసతోడ నారగించువారును దామెనలుచుట్టి తలకోలలుగట్టి మూపులంబెట్టుకొని యీలలు వెట్టుచు గోగణంబులఁ జెదరందోలి వెనుకచిక్కిన బక్కపసులఁగూడం బిలుచువారును దధితక్రాజ్యపూరితంబు లైన భాండప్రకరంబులు సుకరంబులుగా నమర్చినశకటంబుల సాదుబుద్ధులు గల యెద్దులంగట్టి సరళపథంబున నడపించువారును బేగడలతోడి బిల్లలచెప్పులు దొడిగి చెంగావికాసెకోకలుకట్టికొని

---

147 శ్రాంతలు = అలసినవారు. కవలు = జతలు, వేగుఁబోకన్ = తెల్లవాఱుకట్ల, భ్రాంక్రియా=భ్రాం అనునట్టి, బిట్టులికి = మిక్కిలి యదరిపడి, త్రిమ్మరు = తిరుగు, సందడింపన్ = మెదలఁగా, సరగునన్ = శీఘ్రముగ, బంధురంబులు = పొడవులైకొంచెము వంగినవి, మంథంబులు = కవ్వములు, ఆలీఢపాదంబు = ముందరికి చాఁచి నిలుపఁబడిన కుడికాలు, చిలుకుచూపుల = బాణములను పోలినచూపులు గల, చెదరి = తొలఁగి కదుపులన్=పసులగుంపులను, మొదవులన్ = పాఁడియావులను, మెంపుచున్= ఎదురుకొని వచ్చుచు, నట్టాడు = మెలఁగునట్టి, ధేనువులన్ = వేఁగటి యావులను, దుగ్ధదోహనంబునకున్ = పాలుపితుకుటకు, గోవ = బెదరుగల, తలకోలలు = కొనను ఉచ్చువేసిన త్రాళ్లు గట్టిననిడుపాటికఱ్ఱలు, (ఈకోలలు గోవావుల కొమ్ములకు తగిలించి కదలనీక పట్టుకొందురు) మస్తరించుచున్ = చనువుపఱుచుచు, కుక్కుటాసనంబునన్ = కాలిమడమలమీఁద పిఱ్ఱలుమోప, జానులగ్నంబులుచేసి = మోఁకాళ్లమీద పొందికగానుంచుకొని, ఫేనంబులు = నురుఁగులు, ఉడుకువంటకంబు = వేఁడియన్నము, నులివేఁడిగాన్ = కొంచెము వెచ్చగానుండునట్లు, గ్రామ్యాహారంబులతోడన్ = మాంసాద్యాహారములతో, పాణిపాత్రంబులన్ = దోసిళ్లయందు, సుకరంబులుగాన్ =

భారంబువలన పీఁకలుగల కోరకావళ్లు మోచికొని యొండొరులతోడఁ బంతంబులాడుచు గునిసి గునిసి నడుచువారునుం గలిగి గోష్ఠినంబు మశకమక్షిక కాకకంకసమాకీర్ణంబులవలన సర్వశూన్యంబగునట్లుగాఁ గదలి బృందావనంబునకుం జని. 147

తే. యమునచేరువ నొక్కరమ్యప్రదేశ, మున విశాలస్థలంబున నొనర విడిసి
యర్ధచంద్రాభముగ శకటాళి నిలిపి, పారివెలుఁగులు దొడ్లు నేర్పడ నమర్చి. 148

ఉ. గోవుల లేఁతపూరిగల కొండలదండల మేపి తెచ్చి నా
నావిమలోద యైనయమునానదిలోపల నీళ్లువెట్టి త
త్పావనతీరదేశములఁ బాటల నాటల క్రీడలాడి బృం
దావనభూమియందుఁ బ్రమదంబున గోపకు లుండి రిమ్ములన్. 149

క. ఆరాముఁడు కృష్ణుఁడు నా, భీరకుమారకులఁగూడి బృందాటవి నే
పారుచు దూడలఁ గాచిరి, గారవమున జగముగావఁ గలవారయ్యున్. 150

సీ. బర్హిపత్రములు సంపాదించి శృంగార మొనరించుచుండుదు రొక్కవేళ
మురళీరవంబులు మొరయించి తమలోన నుల్లాస మొనరింతు రొక్కవేళఁ
గాకపక్షంబులఁ గమ్మపూవులుచుట్టి యొయ్యారులై యుందు రొక్కవేళ
నిడుపున నాకులు మడిచి పీఁకెలు చుట్టి యూఁదుచు నటియింతు రొక్కవేళ
తే. నిగురుపాన్పులపైఁ బొదరిండ్లలోన, నొలసి నిద్రించుచుండుదు రొక్కవేళ
రామకృష్ణులు బాల్యాభిరామవర్తనములఁ బెంపారి బృందావనంబునందు. 151

వ. ఇవ్విధంబున వినోదించుసమయంబున, 152

సీ. వసుధాభిహతపూర్వవాతసంఘాతంబు సంచితోదగ్దిశాచంచలంబు
పర్జన్యధనురాత్తపశ్చిమాకాశంబు సంఛాదితాఖిలాశాఘనంబు
పటపటధ్వానవిభ్రాజితస్తనితంబు ప్రస్ఫుటద్బహుళతేరేమ్మదంబు
ప్రశమితాంభోజాతబంధుమయూఖంబు చంద్రనందనశుక్రసంయుతంబు

---

పొందికగా, సరళపథంబునన్ = చదరమైనమార్గమున, బేగడ = కాకిబంగారు, పీఁకలు = వంగుటలు కోరకావళ్లు = మీఁది వంపుగానుండు బద్దలు గలకావళ్లు, గునిసిగునిసి=క్రుంగుచు నిక్కుచు, గోష్ఠినంబు = మునుపటిమంద. కంక = బోరువ. 148 అర్ధచంద్రాభముగ = అర్ధచంద్రాకారముగా, పారివెలుఁగులు = కంపకోటలు. 149 దండలన్ = సమీపములందు, విమలోద = తేటనీళ్లుగలది, ఇమ్ములన్ = నెమ్మదిగా. 151 బర్హిపత్రములు = నెమిలియీఁకలు, మురళీ = పిల్లంగ్రోవి, కాకపక్షంబులన్ = పిల్లజుట్లయందు, ఒయ్యారులు = విలాసవంతులు, పీఁకెలు చప్పటగా మడిచి యూఁదెడు సాధనములు. 153 అభిహత = ఎదురుతాఁకునట్టి, పూర్వవాత = తూర్పుగాలియొక్క ఉదగ్దిశా = ఉత్తరపుదిక్కుయొక్క, పర్జన్యధనురాత్త = ఇంద్రధనుస్సుచే పొందఁబడిన, సంఛాదిత = లెస్సగాకప్పఁబడిన, అఖిలాశా = సమస్తదిక్కులుగల, ఘనంబు = మేఘము, విభ్రాజితస్తనితంబు = ప్రకాశింపఁజేయఁబడినయురుములు. ప్రస్ఫుటద్బహుళతేరేమ్మదంబు = చక్కగాతోఁచుచు నధికమైనట్టి మెఱపులు, ప్రశమితాంభోజాత బంధుమయూఖంబు = చల్లగాఁ జేయఁబడిన సూర్య

తే. భూరిధారానితాంతోగ్రవారివృష్టి, పూరితాఖిలనిమ్నగాంభోచయంబు
సంతతధ్వానదర్దురసంచయంబు, గలిగి వర్షాగమంబు ప్రకాశమయ్యె. 153

చ. అమరిన లేఁతపచ్చికబయళ్లను దట్టములైన యింద్రగో
పములు నటింపఁగా నవనిభాగము తద్దయుఁ జూడ నొప్పెఁ గ్రొ
త్తమరకతంబులన్ విఘటితం బగుపేటికయందుఁ బద్మరా
గము లనురత్నముల్ దఱుచుగా నమరించినసోయగంబునన్. 154

క. నీలాంబుదముల క్రేవలఁ, గ్రాలెడుకొక్కెరలగుంపు కడుఁజూపట్టెన్
మాలిన్యమతులచే నుపలాలితులై యున్న నిష్కళంకులభంగిన్. 155

క. కడునధికవృష్టిగురియఁగ, వడితో నదులెల్ల నుబ్బి వఱదలు వాఱెన్
నడుమంత్రపుసంపదగల, వెడఁగుమతులు నుబ్బి వెల్లివిరిసినభంగిన్. 156

ఆ. పూరి మిగులఁ బెరిగి పొరియంగఁబడిన మా
ర్గముల మేర లెఱుఁగరాకయుండె
నల్పబుద్ధియుక్తు లాడిన మాట ల
ర్థాంతరములఁ బొంది యణఁగినట్లు. 157

తే. నీలజలధరములలోన నిర్మలేందు, మండలము గానరాకుండె మలినహృదయు
లైనదుర్జనకోటితో నాడినట్టి, సత్యసంధప్రగల్భవాక్సరణి యట్లు. 158

వ. ఇట్టి జలధరకాలంబున సహోదరులైనరామదామోదరులు గోపాలురం గలసి గోవులం గాచుచుఁ బరిమళకదంబంబు లయినకదంబదామకంబుల శృంగారించుకొనియును బర్హిపత్రంబులు విచిత్రంబుగా గాత్రంబు నలంకరించుకొనియును యీలలువెట్టుచు సాళగంబులతోడ నేలపాటలు పాడుచుఁ బిసాళించియును సైరికవేషంబుల గైరికనికరంబులు శరీరంబులఁ దోరంబుగా నలందియును

---

కిరణములుగలది, చంద్రనందన = బుధునితోడను, భూరిధారానితాంతోగ్రవారివృష్టి = ఎడతెగని ధారలచేత నధికమైన నీళ్లతోడివాన, పూరితాఖిలనిమ్నగాంభోచయంబు = నిండింపఁబడిన యెల్లనదులలోని నీళ్లసముదాయముగలది. వర్షాగమంబు - వానకాలము అనుట. 154 ఇంద్రగోపములు= పట్టుపురుగులు, విఘటితము = విశేషముగా కూర్పఁబడినది. పేటిక = పెట్టె, పద్మరాగములు = కెంపులు, సోయగంబునన్ = అందముగా - విధముగా. 155 నీలాంబుదముల క్రేవలన్ = నల్లమబ్బులపార్శ్వములందు, గ్రాలెడు = ప్రకాశించునట్టి కొక్కెరల = కొంగలయొక్క, మాలిన్యమతులచేన్ = కపటబుద్ధిగలవారిచేత, ఉపలాలితులు = ఊఱడింపఁబడినవారు, నిష్కళంకులు = కపటములేనివారు. 156 వఱదలు = వెల్లువలు, నడుమంత్రపు = నడుమవచ్చిన, వెడగుమతులు = అల్పులైనబుద్ధి తక్కువవారు, వెల్లివిరిసిన = ప్రసిద్ధినొందిన. 157 పొరియంగఁబడిన = కప్పుకొన్న. 158 ఇందుమండలము = చంద్రబింబము. 159 జలధరకాలంబునన్ = వానకాలంబునందు, కదంబంబులు = సమూహములుగలవి, కదంబదామకంబులన్ = కడపపువ్వులదండలను, బర్హిపత్రంబులు = నెమలియీఁకలు, గాత్రంబులన్ = దేహములయందు, సాళగంబులతోడన్ = మేలనములతో, పిసాళించి = అతిశయించి, సైరిక = దున్నెడువారివలె, గైరికనికరంబులు = కావిరాల

జీమూతంబులు గర్జించినయాకారంబులఁ గ్రేళ్లుదాఁటియును తమతోడియాభీర కుమారులు పాడినం దోడున శిరఃకంపంబులుచేసి మెచ్చుచు వినోదకృత్యంబు లాడియును కలాపంబులు విచ్చి విలాసంబులుగా నాడుచున్నమత్తమయూరం బుల వెనువెంటం దగిలియును నిట్లు నానావిధంబు లయినబాల్యవినోదంబులం బరమసంతోషచిత్తులై యుండి రంత. 159

కాళియమర్దనము.

ఉ. శ్రీవిభుఁ డొక్కనాఁడు విలసిల్లెడుచిత్తముతోడ లాంగలిన్
గోవుల గాన నంపి యొకకొందఱు బాలురతోడఁగూడి బృం
దావనమెల్లఁ జూచి యమునానదికిం జని తత్సమీపనీ
పావళినీడలం గడువిహారముసేయుచు నున్నయత్తఱిన్. 160

ఉ. ఆరయ నమ్మహాతటినియం దొకచోట హ్రదంబులోపలన్
దారుణ మైనహాలహలతాపవిషోల్బణ మైనగాలిచేఁ
జేరువ నున్నవృక్షముల జీవములం బరిమార్చుచుండు దు
ర్వారుఁడు కాళియాహి యనువాఁడు భయంకరవేషధారి యై. 161

ఆ. ఉగ్రభుజగవిషసముజ్జ్వాల లెప్పుడు, నిగిడి వేఁడిసెగల పొగల మిగుల
నుడికి పొరలఁబడుచు నుండు నాయుదకంబు, లధికతప్తతైల మనఁగ మెఱసి. 162

ఉ. అట్టి హ్రదంబు తద్దయు రయంబున డగ్గఱి క్రూరకర్ముఁడై
యిట్టి భుజంగుఁ డిందు వసియించుటఁజేసి కళిందకన్యము
చ్చుట్టును బాడువాఱి కడుశూన్యము నొందును వీని నెమ్మెయిన్
బట్టి వధింతు నంచుఁ జలపట్టి యదూద్వహుఁపట్టి దిట్ట యై. 163

ఉ. తటమునఁ బూచి యేచిన కదంబమహీరుహశాఖయెక్కి యు
త్కటగతి కుప్పి గంతు గొని తద్ధ్రదమెల్ల గలంచుచుండె ను
ద్భటపటుగంధసింధురము పల్వలముం గలగుండువెట్టి ప
ర్యటనముసేయునట్లు జలమంతయు భగ్గున మంట లుబ్బగన్. 164

సముదాయములను, తోరంబుగాన్ = దట్టముగా, జీమూతంబులు = మేఘములు, క్రేళ్లుదాఁటి యును = కేకలువేయుచు కుప్పిగంతులు వేసియు, ఆభీరకుమారులు = గొల్లపిల్లకాయలు, కలా పంబులు = పింఛెములు, మత్తమయూరంబుల = మత్తుగొన్న నెమిళ్లయొక్క. 160 లాంగలిన్ = బలరాముని, నీపావళి = కడపచెట్లచాలుయొక్క. 161 తటిని = యేఱు, హ్రదంబులోపలన్ = మడుఁగులో, హాలహల = హాలాహలమనెడు విషముయొక్క, ఉల్బణము = ఉప్పొంగినది. 162 విషసముజ్జ్వాలలు = విషముయొక్కచక్కగా మీఁదికెగయునట్టి మంటలు, అధికతప్తతైలము=మిక్కిలి తెర్లిననూనె. 163 కళిందకన్య = యమునానది, ముచ్చుట్టును = మూఁడుప్రక్కలను, యదూద్వహు పట్టి = శ్రీకృష్ణుఁడు. 164 తటమునన్ = గట్టునందు, ఏచిన = అతిశయించిన, కదంబ = కడపచెట్టు యొక్క, ఉత్కటగతిన్ = ఉద్ధతితోడిరీతితో, గంధసింధురము=ఏనుఁగు, పల్వలమున్ = పడియను,

చ. కడుఁ బెనుమంట లైనయుదకంబు తొలంకున వారిబిందువుల్
మిడిసి సమీపభూజములమీఁద వెసంబడి మండుచుండ నె
క్కుడురభసంబుతో దివియకోలలకై వడి భంగసంగతిన్
బొడమినఫేనముల్ మెఱసె బోరనఁ జల్లిన నిప్పులోయనన్. 165

ఉ. అంతట కాళియాహివిభుఁ డారవముల్ విని కోపతప్తుఁడై
సంతతకాలకూటనిభచండవిషోల్బణఫూత్కృతుల్ జగం
బంతయు మూఁడఁజేయఁగ రయంబునవచ్చె ననేకభృత్యులన్
గాంతలుఁ బుత్రులుం గొలువఁగా పటుకోపపరీతచిత్తుఁడై. 166

ఉ. మించి మహోగ్రపావకసమేతవిషానలముల్ ముఖంబుపై
నుంచియు దంష్ట్రలం గఱచియున్ బెనుతోఁకను వీఁపుతో విభా
ళించియు గాలుఁజేయు మెదలింపకయుండ శరీరమెల్ల బం
ధించియు నిట్లు దుర్దశకుఁ దెచ్చెను గృష్ణుని లోకజిష్ణునిన్. 167

ఉ. అమ్మురవైరి యిట్లు విషమాహికిఁ జేపడి వెల్ల లేక దుః
ఖమ్మున నున్నవాఁడనుచు గ్రక్కున గోపకుమారు లందఱున్
గ్రమ్మిన శోకవార్ధి కడగానక యేడ్చుచుఁ బాఱుతెంచి ఘో
షమ్మునఁ జెప్పనాపిడుగుచందపుమాటల కుల్కి యత్తఱిన్. 168

ఉ. నందయశోదలున్ బరిజనంబులుఁ దక్కినగోపబాలికా
బృందము సీరపాణియును బెద్దయు నేడ్చుచు శోకవార్ధినం
దంద మునుంగుచున్ బటురయంబొదవం జని కాంచి రంత గో
విందునిఁ గాళియాహిఫణవేష్టితచారుముఖారవిందునిన్. 169

మ. ఘనదర్వీకరభోగవేష్టనముచేఁ గంపించుచున్నట్టి యా
తనయుం గన్గొనినప్పు డాత్మల యశోదానందు లత్యంతదుః
ఖనితాంతాత్మకులైరి గోపకులు శోకవ్యాకులాలోలవ
ర్తనులై యేడ్చిరి గోపికాజనులు చింతాక్రాంతులై యెంతయున్. 170

వ. ఇవ్విధంబున నాక్రోశించుచున్నవారల వారింపనోపక బలభద్రుండు దామోదరు
నవలోకించి యిట్లనియె. 171

---

కలగుండుపెట్టి=కలఁచి, పర్యటనముసేయు = తిరుగు. 165 తొలంకునన్ = తొనుకుటచేత, మిడిసి= మీఁదికెగసి, దివియకోలలకైవడిన్ = దివటీలవలె, భంగసంగతిన్ = అలలచేరికచేత, బోరనన్=అధికముగా. 166 చండ = తీక్ష్ణమైన, మూడఁజేయన్ = నశింపఁజేయఁగా. 167 విభాళించియున్ = చఱచియు, లోకజిష్ణునిన్ = లోకమునందలివారి (నందఱను) జయించు స్వభావముగలవానిని. 168 చేపడి=చిక్కి, ఉల్కి = భయపడి. 169 పటురయంబునన్ = మిక్కిలి వడితో, వేష్టిత=చుట్టఁబడిన. 170 ఘనదర్వీకరభోగవేష్టనముచేన్ = గొప్పసర్పదేహము చుట్టుకొనుటచేత, శోకవ్యాకులాలోలవర్తనులు = శోకముచేత కలఁతనొంది, మిక్కిలి చలించుచున్న ప్రవర్తనముగలవారు. 171 ఆక్రో

ఉ. నెట్టన నీమహత్త్వమును నీభుజశక్తియు నీచలంబు నీ
గుట్టు నెఱుంగలేక పటుఘోరవిషాహికిఁ జిక్కితంచు నీ
చుట్టలుఁ దల్లిదండ్రులును శోకపయోధి మునుంగుచున్నవా
రట్టె మహాత్మ యెంతదడ వైనను మానుషలీల లేటికిన్. 172

శా. భూలోకంబున దుష్టశాత్రవచయంబుం జంపి ధర్మజ్ఞులన్
బాలింపంగ జనించినాఁడవు మహీభారావతీర్ణక్రియా
శీలత్వంబు వహించి నీ విపుడు లక్ష్మీనాథ యీపాముతో
బాలక్రీడలు సల్ప నేమిటికి నిర్బంధించి మర్దింపవే. 173

చ. అనవుడు లేతనవ్వొలయ నాజలజాక్షుఁడు దివ్యమూర్తిఁ గై
కొని తనువుబ్బఁజేయుటయు ఘోరభుజంగమబంధనంబు లె
ల్లను వెస వీడె నప్పుడు బలంబుఁ జలంబును మీఱ పన్నగేం
ద్రునిశిరముల్ పదంబులును ద్రొక్కి విచిత్రగతుల్ చెలంగఁగన్. 174

తే. కడఁగి హస్తంబులను రెండుకడలనున్న, రెండుతలలును వెసఁబట్టి దండి మెఱయ
నడిమి శిర మెక్కి కడుఁగఠినంబులైన, పాదఘట్టనములచేతఁ బగులదన్నె. 175

క. తల యీగతి నలినలియై, సొలవక నెత్తురులు గ్రక్కుచును దైన్యముతో
పొలుపఱిన కాళియాహిని, పెలుచన నొక్కింత వెలితి పీనుఁగుఁ జేసెన్. 176

మ. వివశుండై పెనుమూర్ఛనొందినవిభున్ వీక్షించి యత్యంతశో
కవిలాపంబులతోడ నంగలతికల్ కంపింప నాగేంద్రమా
నవతుల్ వచ్చి భుజంగరాజశయనున్ నాళీకపత్రాక్షు యా
దవచూడామణిఁ జేరి యిట్లనిరి తాత్పర్యంబుతో మ్రొక్కుచున్. 177

ఉ. దేవ సమస్తలోకనుత దివ్యమునీంద్రమనోనివాస ల
క్ష్మీవర వాసుదేవ సరసీరుహనేత్ర యనాథనాథ లో
కావనదక్ష నిర్జరగణాధిప కేశవ యీశ పీతవ
స్త్రావృత దేవకీసుత దయాపర మమ్ము ననుగ్రహింపవే 178

తే. నిఖిలలోకాశ్రయం బైననీపదోగ్ర, ఘట్టనంబున నెట్లోర్చుఁ గమలనాథ
యల్పబలుఁ డైనయీకాళియాహిశిరము, హస్తిమశకాంతరము నీకు నాతనికిని.

---

శించుచున్ = ఏడ్చుచు. 172 నెట్టనన్ = దృఢముగా, పయోధిన్ = సముద్రమునందు, అట్టె=అత్యంతము, మానుషలీలలు = మనుష్యక్రీడలు. 173 శాత్రవచయంబు = పగవారికూటమిని. 174 ఒలయన్ - కలుఁగఁగాననుట, బంధనంబులు = కట్లు. 177 నలినలియై = నజ్జునజ్జై - మిక్కిలి నలఁగి, సొలవక = తగ్గక, పొలుపఱిన=బాగుచెడిన - దీనత్వమునొందిన, పెలుచన=క్రూరత్వముతో, 177 వివశుఁడు = పరవశుఁడు, అంగలతికలు = తీఁగలవంటిదేహములు, నాళీకపత్రాక్షున్=తామర ఱేకులవంటికన్నులుగలవానిని. 178 లోకావనదక్ష = లోకులను రక్షించుటకుఁ జాలినవాఁడా, పీత

క. దేవర కడుఁగోపంబున, నీవిధమున నాజ్ఞ పెట్ట నీక్షణమందున్
జీవంబు విడుచుచున్నాఁ, డీవాతాశనుఁడు కోప మేటికిఁ గృష్ణా. 180

ఆ. మాకు పురుషభిక్ష మన్ననతోఁ గృప, సేయుమయ్య యనుచుఁ జిన్నవోయి
మ్రొక్కుచున్నఁ గరుణ మొలచుచిత్తంబుతోఁ, గాళియాహివిభునిఁ గాచి విడిచె.

క. ముక్కున నోరున నెత్తురు, గ్రక్కుచుఁ దలదిమ్ముపట్టి కడుదీనతతో
నొక్కింత యీరెలుంగున, నక్కమలదళాక్షుఁ జూచి యతఁ డిట్లనియెన్. 182

క. ఏ నేమితప్పుచేసితి, నోనలినదళాక్ష నీనియోగంబునఁగా
దే నాడు జలధినుండుట, మాని యిటకు వచ్చినాఁడ మగువలు దానున్. 183

ఆ. ఓరపడగఁబెట్టి యోరంతప్రొద్దును, గుటిలవృత్తితోడఁ గ్రూరకర్మ
ములకు నోర్చి లోకములకుఁ గీడొనరించు, పాపజాతిజాతి పాఁపజాతి. 184

వ. అట్టి మాజాతిరూపానురూపస్వభావంబులు దప్పి యన్యథామార్గంబుల నాజ్ఞ పెట్టుట యుచితంబుగాక నన్ను నిట్టిక్రూరజాతియందుఁ బుట్టించిన నీవు మానడవడులకు విరోధించి యిట్లు చేసినయపరాధంబు నిరూపింపక రక్షించి వలయు పనులకు నియోగింపు మనినఁ గరుణించి కృష్ణుం డిట్లనియె. 185

క. నీ వింక నిందు నుండక, నావచనముఁ బూని యంగనామిత్రసుపు
త్రావళితో జలరాశికి, వేవేగమ కదలిపొమ్ము విషధరముఖ్యా. 186

క. నీపడగమీఁద నుండెడు, నాపదచిహ్నములు చూచినను గరుడుఁడు ని
న్నేపున భక్షింపఁడు నా, నాపన్నగవరులనట్టులడుచు నతండున్. 187

వ. అని యానతిచ్చినఁ బ్రసాదంబని యాప్రొద్దె కదలి చని సముద్రంబ ప్రవేశించెనంత.

క. మడుఁగు వెడలి హరివచ్చినఁ, గడుమోదముతోడ గోపికలు గోపకులున్
వడి గ్రుచ్చికౌఁగిలించిరి, కొడుకుం దలిదండ్రు లెత్తికొనిరి ముదమునన్. 189

వ. ఇవ్విధంబునం గాళియాహిమర్దనుం డైనజనార్దనుం బ్రశంసించుచు నతండు చేసిన పరాక్రమంబు లుగ్గడించుచుఁ బ్రమోదభరితమానసులై గోకులంబునకువచ్చి సుఖంబుండి రంత. 190

## ధేనుకాసురసంహారము.

ఉ. గోవులఁ గాచుచున్ బలముకుందులు తొల్లిటియట్ల గోపపు
త్రావళిఁ గూడి శైశవవిహారవినోదములం గడింప బృం

---

వస్త్రావృత = పీతాంబరమును తాల్చినవాఁడా. 180 ఆజ్ఞపెట్టన్ = శిక్షింప, వాతాశనుఁడు = సర్పము. 182 ఈరెలుంగునన్=అల్పస్వరముతో. 183 నీనియోగంబునన్=నీయాజ్ఞచేత, తానున్= నేనును. 184 ఓరంతప్రొద్దును = ఎల్లప్పుడును, కుటిలవృత్తి = వంకరనడత, పాపజాతి=దుర్జనత్వము గల, పాఁపజాతి = సర్పకులము. 186 విషధరముఖ్యా = సర్పశ్రేష్ఠుఁడా. 188 ప్రసాదంబు= చిత్తము. 190 ప్రశంసించుచున్ = కొనియాడుచు, ఉగ్గడించుచున్ = చెప్పుకొనుచు. 191 మహోగ్రనిశాటకోటికిన్ = మిక్కిలి క్రూరులైన రాక్షసులసమూహమునకు, తాళవనంబునకున్ = తాటి

దావనభూమినుండి యొకనాడు మహోగ్రనిశాటకోటికిం
దావలమై మహింబరఁగుతాళవనంబున కేగి యచ్చటన్. 191

క. పచ్చనికసవులు పసులను, విచ్చలవిడి మేయఁదోలి వేడుకతోఁ గ
న్నిచ్చకువచ్చిన యచ్చటి, మెచ్చులతాళములలోన మెలఁగుచు నున్నన్. 192

క. కొందఱు గోపులు రామము, కుందుల కడ కేగుదెంచి గోగణములతో
నిందు మనమున్న నొప్పమి, చెందుఁ జుమీ యసురకోటిచేఁ బశుతతికిన్. 193

ఆ. ధేనుకాదు లైనదానవు లీతాళ,వనములోన నున్నవారు దీని
సొచ్చి వాసవాదిసురగణంబులకైన, వెక్కసంబు బ్రతికి వెడలి చనుట. 194

చ. అని వినిపించినన్ బలము రాంతకు లుక్కునఁ జేరి యవ్వనం
బునఁ గల దైత్యకోటి బొరివుచ్చక లోకము బాదమానదం
చు నరిగి చండకేసరికిశోరయుగంబును బోలె భీకర
ధ్వను లొనరించుచున్ జెలఁగి తాళవనాంతరభూమి సొచ్చివన్. 195

ఉ. ఆనినదంబు బిట్టు విని యప్పుడు గార్దభరూపధారులై
ధేనుకముఖ్యరాక్షసులు తీవ్రగతిం బఱతెంచి దేవకీ
సూనునిఁ దన్నుచున్ గఱచుచున్ సమరం బొనరింపఁ జొచ్చినన్
భానునిభప్రతాపబలభద్రుఁడు యాదవవీరుఁ డుగ్రుఁడై. 196

క. తనుఁబొదివి బిట్టుకదిసిన, ఘనగార్దభదైత్యకోటికడకాళ్లం గై
కొని త్రిప్పి త్రాటిమ్రాఁకుల, కొనలు దునిసి నేలమీఁదఁ గూలఁగ వైచెన్. 197

క. ధేనుకుఁడు చటులగార్దభ,మై నిష్ఠురవృత్తితోడ నాహవమునకున్
బూని చనుదెంచుటయు హరి, వానిం గడకాలువట్టి వడిగా నింగిన్. 198

చ. బిరబిరఁ ద్రిప్పివైచుటయు బెట్టుగ నెత్తురు నోరఁ గ్రక్కుచున్
ధరణితలంబునంబడియెఁ దక్కినరక్కసులెల్ల భీతులై
యరిగి ప్రలంబుఁ జేరి శరణాగతులై యనిలోన ధేనుకా
సురవరుచావు చెప్పుటయు శోకసమాకులుఁడై ప్రలంబుఁడున్. 199

బలభద్రుండు ప్రలంబాసురుని సంహరించుట.

వ. మాయోపాయంబుల బలభద్రకృష్ణులఁ బరిభవించువాఁడై తదీయరంధ్రాన్వే

తోపునకు. 192 కన్నిచ్చకువచ్చిన = చూపునకుమనోజ్ఞమైన. 193 గోపులు = గొల్లవాండ్రు, ఒప్పమి = చెఱుపు. 194 వెక్కసము = కష్టతరము. 195 ఉక్కునన్ = బలముతో, పొరివుచ్చక = చంపక, చండకేసరికిశోరయుగంబు = కోపించినసింహపుపిల్లలజంట, చెలఁగి = విజృంభించి. 196 నినదంబు = ధ్వని, బిట్టు = అకస్మాత్తుగా, సమరంబు = యుద్ధము, భానునిభప్రతాప బలభద్రుఁడు = సూర్యునితో సమానమైన ప్రతాపముగలవాఁడైన బలరాముఁడు. 197 తునిసి = తునిఁగి. 198 నిష్ఠురవృత్తితోడన్ = పరుషప్రవర్తనముతో, నింగిన్ = ఆకాశమునందు. 200 పరిభవించువాఁడు = భంగపెట్టఁదలఁచినవాఁడు, రంధ్రాన్వేషణంబు = సందువెదకుట, నిష్కంటకంబు = బాధ

షణంబు సేయుచుండె నిట్లు తాళవనంబు నిష్కంటకంబుచేసి దైత్యకంటకు లచ్చటం బసులగుంపుల నింపుల మేపుచుఁ దాళఫలంబులు సమస్తజనులకుఁ జూఱలువిడిచి యిష్టవినోదంబులం దగిలియుండి రంత. 200

ఆ. సీరచక్రపాణు లిరువురు విజయసం,పన్ను లై చెలంగి పసుల మేపు
చుండి యొక్కనాఁడు భాండీరవటమున, కరిగి యచట నిష్టమైనగతుల. 201

సీ. కోలక్రోఁతులు బిల్లగోళ్లుదూరనఁ గోల లందలంబులు మఱికుందికాళ్లు
పుట్లచెండ్లుప్పనఁబట్టె లాలంకులు గుడుగుడుగుంచాలు గుంటచాళ్లు
చీఁకటిమొటికిళ్లు చిమ్ముబిల్లలు నెట్లు బొట్టనఁగోలలు బొమ్మరాలు
కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు

తే. గుళ్లు దాఁగిలి ముచ్చులు గోడిపట్టె, లేలపాటలు సరిబేసు లీలకూఁత
లాదిగా శైశవక్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. 202

వ. ఇవ్విధంబున వినోదించుచున్న నొక్కనాఁడు ప్రలంబుండు గోపబాలవేషంబు గైకొని వారలలోపల వర్తించుచుండె. 203

క. ఇరువురు నిరువురు జోడై, బెరసి యొకరినొకరు మోచి పెద్దయుదూరం
బరుగుచు గెల్చుచు నోడుచు, నరుదగుక్రీడలఁ జెలంగి రందఱుఁ దమలోన్ 204

ఆ. హలిప్రలంబు మోచె హరి సుదాముఁడు మోచె
నిట్టు లొక్కరొకరి నెక్కివచ్చు
వారి మోచివచ్చు వారలోడిన వారి
భుజములందు నెక్కి పోవునపుడు. 205

చ. చెలఁగి సుదాము నెక్కి హరి సీరధరుండు ప్రలంబు నెక్కి వి
చ్చలవిడి నందఱుం దగినచందములన్ దమతోడియుద్దులన్
బలువిడి నెక్కిపోవునెడ బంధురవిక్రముఁ డైనదానవుం
డలుకమెయిన్ హలాయుధుని నప్పుడు మూఁపునఁ దాల్చె దండితోన్. 206

క. ఘనశకటచక్రనిభమగు, కనుఁగవయును దగ్ధశైలగాత్రము వికటా
ననమును లంబోదరమును, గనకాభరణములు బూని గగనమునందున్. 207

తే. పూర్ణచంద్రసమేతమై పొలుచు వర్ష, కాలమేఘంబుకైవడి కపటదనుజుఁ
డభ్రమార్గంబునందు హలాయుధప్ర,యుక్తుఁడై చనె లోక మోహో యనంగ.

---

లేనిదిగా, దైత్యకంటకులు = రాక్షసులకు హింసకులు, ఇంపులన్ = మనసువచ్చినట్లు, చూఱలువిడిచి= కొల్లపెట్టి, తగిలి=ఆసక్తులై. 201 సీరచక్రపాణులు = బలరాముఁడును కృష్ణుఁడును. 202 శైశవక్రీడలు = పసితనపుఆటలు, దారకులన్ = పిన్నవాండ్రను. 204 బెరసి=కూడుకొని. 205 హలి = బలరాముఁడు, ఉద్దులన్ = జతలను. 206 బంధురవిక్రముఁడు = మంచిపరాక్రమము గలవాఁడు, దండితోన్ = సామర్థ్యముతో. 207 దగ్ధశైలగాత్రము = కాలినకొండను బోలినదేహము, వికటాననము = వికృతమైనముఖము, లంబోదరము = వ్రేలుచున్నకడుపు. 208 కాలమేఘంబు=నల్లనిమబ్బు, అభ్రమార్గంబునన్ = ఆకాశమునందు, ప్రయుక్తుఁడు = చక్కగా కూడుకొన్నవాఁడు.

క. బలభద్రుని భరియింపఁగ, నలవుచెడి ప్రలంబదైత్యుఁ డయ్యెడ ధరణీ
తలమునకు వచ్చె నప్పుడు, జలజాక్షుం డెచ్చరింపఁ జటులప్రౌఢిన్. 209

వ. దనుజునిశిరోరుహంబులు వామహస్తంబునం జుట్టి పట్టి చరణంబులఁ గంఠంబు బిగియించినం గళవట్టి గ్రుడ్లు వెలికుఱికి కదలనేరక యున్నసమయంబున దామోదరచోదితుండై బలభద్రుండు. 210

క. ఘనతరకోపారుణలోచనములఁ గల్పాంతకాలశమనునిగడతో
నెనవచ్చుముష్టిచేతను, దనుజునిమస్తకము బెట్టిదంబుగఁ బొడిచెన్. 211

క. పొడిచిన మెదడును నెత్తురు, వడి దొరుఁగఁగ శిరము పగిలి వాఁడు ధరిత్రిన్
బడి చచ్చె గోపబాలకు, లుడుగక బలభద్రుఁ బొగడుచుండిరి వేడ్కన్. 212

వ. ఇవ్విధంబున. 213

క. బలభద్రుఁడు మర్దించెను, బలవద్రిపుభయదభూరిబాహువిడంబున్
ఘనదనుజజనకదంబున్, లలితేతరదుర్గుణావలంబుఁ బ్రలంబున్. 214

మ. బలవద్వైరిమదప్రభంజనకళాపారీణు లారామకృ
ష్ణులు గోపాలకుమారులం గలిసి తేజోమూర్తులై నందగో
కులవాసుల్ గొనియాడ నిష్టగతులన్ గోపాలవేషంబులన్
బొలుపై యుండిరి తల్లిదండ్రులకు సమ్మోదంబు సంధిల్లగన్. 215

శరత్కాలవర్ణనము.

వ. అంత శరత్కాలంబు ప్రవేశించిన. 216

క. అడవులలోన ముదంబులు, విడిచి మయూరములు మౌనవృత్తుల నుండెన్
గడునొప్పనిసంసారము, లుడిగిన యోగీంద్రు లూరకుండినకరణిన్. 217

తే. భానుదీప్తుల వేఁడిచేఁ బల్వలంబు, లెండి పిండలివండుగా నింకిపోయె
దారుణం బైనసంసారతాపములను, నలఁగి చిక్కినదుర్గృహస్థునివిధమున 218

ఆ. నీరదములు లేక నిర్మలాకారమై, యాకసంబు చూడ నతిశయిల్లె
విగ్రహంబు లెల్ల విడిచి సౌమ్యజ్ఞాన, యుక్తుఁడైనదివ్యయోగిఁబోలె. 219

---

209 అలవు=శక్తి. 210 కళవట్టి=స్మృతిచెడి, వెలికుఱికి = బయటికుబికి, చోదితుండు = ప్రేరేపింపఁబడినవాఁడు. 211 కల్పాంతకాలశమనుని = ప్రళయకాలపుయమునియొక్క, ఎనవచ్చు = సమానముగు, బెట్టిదంబుగన్ = పరుషముగా. 214 బలవద్రిపు...విడంబున్ = బలవంతులైన శత్రువులకు భయమును పుట్టించునట్టి నిడుపులైన బాహువులచేత ఒప్పువానిని, ఘనదనుజజనకదంబున్ = గొప్పవారైనరాక్షసుల సమూహములుగలవాని, లలితేతరదుర్గుణావలంబున్ = మంచికంటె ఇతరములైన చెడ్డగుణములకు నాధారమైనవానిని. 215 ప్రభంజన = మిక్కిలి భంగపెట్టుటయనెడు, పొలుపై= ఒప్పిదముగలిగి, సమ్మోదంబు=సంతోషము. 217 ముదంబులు=సంతోషములు. 218 పిండలివండుగాన్= పిడుచగట్టినవండు మట్టిగలవిగా. 219 నీరదములు = మేఘములు, విగ్రహంబులు = వాదములు.

ఆ. సూర్యదీప్తినల్ల శోషించుచున్న పద్మాకరంబులెల్ల నతిశయిల్లె
బెక్కులంపటములఁ జిక్కి మమత్వముల్, మానకున్న జనులమనసు లట్ల. 220
క. అమలోదకములలోపలఁ, గుముదములు వికాసవృత్తిఁ గోమలై యుండెన్
విమలాత్మునిసంగతమున, నమరి వికాసమున నున్న యధికులఁబోలెన్. 221
ఆ. తొల్లి విడిచి యున్న తోయజాకరముల,యందు మరలఁ జేరె నంచపిండు
పూర్వసంచితాశములకు యోగజ్ఞాను,లంద మగుడనిల్చు నవ్విధమున. 222
క. సలిలంబు వినిర్మలమై, పొలుపారెను విష్ణుభక్తిపూతంబై ని
శ్చలయోగవిద్య పెంపునఁ, జెలువొందెడు యోగివరుల చిత్తములగతిన్. 223
ఆ. నేలమీఁదియదను నింగిపై ఘనములు, జలముగలుగుటయును బొలిసిపోయె
నింద్రియంబులందు నింద్రియార్థములు ప్ర,త్యాహతంబులైనయవ్విధమున. 224
వ. ఇట్టి శరత్కాలంబు వ్రజనివాసు లయిననందాదిగోపాలవర్గంబు లనర్గళంబు లయినప్రయత్నంబులతోడఁ బురుహూతప్రీతిగా యాగంబు చేయం దలంచి సకలపదార్థంబులు సంపాదించుచున్న యప్పుడు యజ్ఞమూర్తియైన నారాయణుండు నందున కిట్లనియె. 225

## శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట.

ఆ. ఏమిఫలము గోరి యింద్రునిఁగూర్చి యీ, యాగకర్మ మిప్పు డాచరించు
చున్నవారు చెప్పుఁడన్న నాదామోద,రునకు నందగోపుఁ డొనరఁ బలికె 226
సీ. దేవతాధీశచోదితములై మేఘముల్ వసుమతీతలమున వానగురియు
వానగల్గిన మహీవలయంబు సస్యసమృద్ధయై ధాన్యంబు మిగులఁగల్గు
ధాన్యంబు గల్గిన ధరణీప్రజలకెల్ల సంతతానందంబు సలుపుచుండుఁ
బ్రజలకానందంబుపాటిల్లినను దేవసంతర్పణంబులు సాగివచ్చు
తే. నావులెల్లను బ్రతుకు క్షీరంబు వలసి
నటులఁ బిదుకును మొదవులు నట్టులైన
నెల్లప్రజలకు మనకు నచ్చికములేక
యుండఁగలుగు మహిమ యుల్లసిల్ల. 227
వ. కావున లోకోపకారంబుగా నేఁటేఁట నింద్రోత్సవంబుసేయుదు మనిన ముకుందుండు పురందరునకుఁ గోపంబు పుట్టునట్టుగా నందున కిట్లనియె. 228
ఆ. పైరువలన మనము బ్రతికెడువారము, గాము విపణివర్తకంబుచేత

220 సూర్యదీప్తిన్ =ఎండచేత, అల్లన్ =మెల్లగా-దినక్రమము ననుట, లంపటములన్ = విషయాశల యందు, మమత్వములు=మమకారములు. 221 అమల = నిర్మలమైన, కోమలై = మనోజ్ఞమై, సంగతమునన్ =సహవాసముచేత. 222 తోయజాకరములయందున్ = సరస్సులయందు, అంచపిండు=హంసల గుంపు, అందన్ = పొందుటకు. 224 అదను=సమయము, పొలిసిపోయెన్ = నశించెను, ప్రత్యాహతంబులు=సంకోచింపఁబడినవి-అణఁగినవనుట. 225 అనర్గళంబులు=ధారాళములు, పురుహూత=ఇంద్రునికి. 227 పాటిల్లినను=కలిగినను. అచ్చికము = కొఱఁత. 229 విపణివర్తకంబుచేతన్=బజారు బేరముచేత.

జీవనంబు నడుపమూవులే దైవంబు, లనుచు నుండువారమగుటఁ జేసి. 229

వ. అన్వీక్షకీత్రయీవార్తాదండనీతులను విద్యాచతుష్టయంబునందు వార్త యను విద్య కృషివాణిజ్యగోపాలనంబులవలనను వృత్తిత్రయాశ్రయంబై యుండుకర్షకులకు గృషియును విపణిజీవులకు వాణిజ్యంబును మనకు గోపాలనంబును బరమవృత్తులగు నీమూఁడు దెఱంగులవారికిం దమతమవృత్తులే పరమదైవంబులగు నవియె వారికి బూజనీయంబులయి యభీష్టఫలంబుల నొసంగుచుండు. 230

ఆ. తనకు నిష్టమైనదైవంబు కృపచేత, బ్రతికి యన్యదైవభజనసేయు
వార లిందు నందు వరపుణ్యహీనులై, పొలిసి తమ్ముదారె పోదు రనఘ 231

ఆ. సీమ యగును పైరుచేసినచోటెల్ల, నందు నుండియయ్యె నడవిబీడు
కాననాంతమద్రికటకంబులును బర్వతములు మనకుఁ బరమదైవతములు. 232

తే. ఇల్లు ముంగిళ్లు మొదలుగా నెల్లవియును
విడిచి పశులకై వడి నడవులందుఁ
గొండలందును వర్తించుచుండు మనకుఁ
బరమదైవంబు లగుఁగదా పర్వతములు. 233

ఉ. కొండలు కామరూపములఁ గ్రుమ్మరుచున్ విపినాంతరంబులం
దుండుమహాపరాధులవనౌకసులం జటులోగ్రగండభే
రుండగజేంద్రదుష్టమృగరూపములన్ వధియించుసజ్జనుల్
నిండినభక్తిఁ గొల్చినను నెక్కొనఁజేయు ననేకభాగ్యముల్. 234

క. కావునఁ బర్వతములకును, గోవులకుఁ బ్రియంబుగాఁగఁ గోరి మఘంబుల్
గావింత మెన్నివిధముల, భావించిన నింద్రుతోడి పని మనకేలా. 235

ఆ. భూసురులకు మంత్రపూజలు హలపూజ, కర్షకులకు గోనికాయశైల
పూజమనకు నధికపుణ్యఫలంబుల, నొసఁగు విపినచరుల కొండువలదు. 236

వ. కావున నొండువిచారంబులు విడిచి మీరు సర్వఘోషసమేతంబుగా గోవర్ధనశైలంబునకు నుత్సవంబు సాటించి గాటంబుగా వేఁటలం జంపి బహుప్రకారంబు లయినపూజలతోడ జాతరలు చేసి యాగమోక్తప్రకారంబున హోమకృత్యంబు నిర్వర్తించి పాయసాపూపవ్యంజనరంజితంబులుగా బ్రాహ్మణులకు

---

230 వృత్తులు = జీవనోపాయములు, పూజనీయంబులు = పూజింపఁదగినవి. 231 భజన=సేవ, పొలిసితమ్ముఁదారేపోదురు = తమకుఁదామే నశింతురు. 232 సీమ=దేశము, అద్రికటకంబులు = కొండనడుములు. 234 కామరూపములన్ = ఇష్టమువచ్చినయాకారములతో, వనౌకసులన్ = వనమునందుండువారిని, చటులోగ్ర = కఠినములును భయంకరములునైన, నెక్కొనన్ = నిలుకడనొందునట్లు. 236 విపినచరులకున్ = అడవియందు మెలఁగువారికి, ఒండు=ఇతరము. 237 సర్వఘోషసమేతంబుగా = ఎల్లమందలతోడ, గాటంబుగాన్ = విశేషముగా. వేఁటలన్ = పొట్టేళ్లను, జాతరలు = ఉత్సవములు, పాయస = పరమాన్నము, అపూప = పిండివంటలు, వ్యంజన = కూరలు,

భోజనంబులు పెట్టించి గంధపుష్పాక్షతల నలంకరించిన మొదవులతోడ గిరి ప్రదక్షిణంబుచేసిన మనకు శోభనంబు గలుగుననిచెప్పిన నతనివచనంబు లాదరించి సాధువాదంబులఁ గొనియాడి. 237

క ఆగోవిందుఁడు చెప్పిన, లాగున నంబాదిగోకు లావాసులు నా
నాగతుల నాచరించిరి, గోగిరియజ్ఞములు భక్తి కొనసాగంగన్. 238

వ. ఇట్లు గోవర్ధనమహోత్సవంబుచేసి గర్జితాభ్రంబులచందంబున నర్తనంబులుచేయు దుర్దమవృషభంబులతోడ సర్వాలంకారశోభితంబులైనగోగణంబులు మున్నుగా సమస్తగోపాలవర్గంబులు పర్వతప్రదక్షిణంబులుచేసి యనేకస్తోత్రంబులతోడ నమస్కారములు చేసి రంత. 239

క. ఆపర్వతాగ్రమునఁ దన,రూపము బలభద్రసోదరుఁడు చూపుచు నా
గోపాలవర్గమునకును, నేపార ననేకఫలము లిచ్చి చనుటయున్. 240

వ. ఇవ్విధంబున. 241

క. గోవర్ధనశైలమునకు, గోవులకును మఘముచేసి గోపాలురతో
నావులగుంపులతోడను, గోవిందుఁడు మరలివచ్చె గోకులమునకున్. 242

క. వాసవుఁడు నందగోపుఁడు, చేసినయపరాధమునకుఁ జిత్తములోనన్
గాసిలి మేఘగణంబుల,లో సంవర్తాఖ్యజలదలోకముఁ బెలుచన్. 243

క. రప్పించి యధికసంభ్రమ, ముప్పొంగఁగ నందగోపుఁ డున్నవ్రజముపై
దెప్పరపుటాలవర్షము, గుప్పింపుఁడు గోగణములు గోవులు మడియున్. 244

క. ఇది యనుచితకృత్యంబని, మదిఁ దలఁపక యరుగుఁ డభ్రమాతంగముపై
ముదమొప్ప నెక్కి యేనుం, గదలి మిముం జూడ వత్తుఁ గడునెచ్చరికన్. 245

వ. అని యనేకప్రకారంబుల బుజ్జగించుచు నెచ్చరించిన ప్రసాదంబని యాసంవర్తన మేఘగణంబు చని పర్జన్యుండు మెచ్చునట్లు నిర్ఘాతవాతవర్షంబులు గురియం జొచ్చిన. 246

మ. శతమన్యుండు తటిత్కరావళులచే ఝంఝాగతిం గొట్టఁగా
నతిభీతిన్ మొఱవెట్టెనో యనఁగ నుద్యల్లీల గర్జించి యు
ద్ధతవృత్తిన్ జటులాంబుదంబులు తదీయానేకభూషామణి
ప్రతతుల్ రాలినయట్లు రాలె పిడుగుల్ ప్రస్ఫీతమై భూస్థలిన్. 247

రంజితంబులు = మనోజ్ఞములు, శోభనంబు = శుభము. 238 కొనసాగంగన్=అతిశయింపఁగా. 239 గర్జితాభ్రంబులచందంబునన్ = ఉఱుముచున్న మేఘములవలె, దుర్దమ = అణఁపరాని. 243 గాసిలి=కోపించి, పెలుచన్ = ఉద్ధతితో. 244 దెప్పరపు = ఆపదనొందించునట్టి, గుప్పింపుఁడు=కురియుఁడు, మడియన్=చావఁగా. 247 శతమన్యుఁడు=ఇంద్రుఁడు, తటిత్కరావళులచేన్=మెఱుపులనుచేతులచేత, ఝంఝా=వానగాలి, చటులాంబుధంబులు = భయంకరములైనమేఘములు, ప్రస్ఫీతము = మిక్కిలి

మ. ధరణీదిగ్గగనంబు లేకముగ నుత్పాతాంబుదశ్రేణి ని
ర్భరవృత్తిఁ క్షణమాత్రలో నిబిడధారాసారపూరంబుగాఁ
గురిసెన్ వానలు చండవాతములతో ఘోరాంధకారంబుతో
నురునిర్ఘాతతటిత్పరంపరలతో నొక్కుమ్మడిన్ బెట్టుగన్. 248

వ. ఇట్లు మహోత్పాతవర్షంబులు గురియునప్పు డత్యంతదుర్నిరీక్ష్యప్రకంపితశంపాతేజంబులవలనను బధిరీకృతసమస్తభూతవ్రాతఘుమఘుమారావస్తనితశబ్దంబులవలనను మహోగ్రతుంగశృంగమహీధరచూర్ణితనిర్ఘాతపాతమహోగ్రధ్వానంబులవలనను చండశుండాలశుండాదండసమానధారాసారకరకావర్షంబులవలనను దుర్దినీభూతసకలదిశాపరిచ్ఛిన్నజీమూతజాతఘనాంధకారంబులవలనను బ్రమసి నందగోకులంబునం గలనానాగోగణంబులును జచ్చియును నొచ్చియును వడఁకులుపట్టియును మెడలు మడంగియును నఱచియునుం బఱచియును జెల్లాచెదరయ్యును వఱదలంగలసియును నిట్లు బహువిధంబుల నింద్రజాలంబు చూపిన విధంబునఁ బసులు నేలపాలైనం గనుగొని గోపికాగోపవర్గంబు లార్తనాదంబులతోడ నున్నంజూచి దామోదరుఁ డిట్లనియె. 249

క. తనయాగము విఘ్నము చేసినకీడున వజ్రి యింత చేసెను మీగో
ధనమును మిమ్మునుగా చెద,మనికితములు మానుఁ డనుచు మదిఁ గృప మెఱయన్.

క. గోపాలురు వెఱఁగందఁగ, గోపీజనవల్లభుండు గొడుగుగఁ బట్టెన్
గోపీగోపకగోగణ, గోపనసద్వర్తనమును గోవర్ధనమున్. 251

వ. ఇట్లు గోవర్ధనశైలంబుఁ జేతికి సకలచరాచరభూతసంజాతకంజాతభవాండభారవహనప్రశస్తం బైనయపసవ్యహస్తంబున విచిత్రంబుగాఁ దాళచ్ఛత్రంబునుం బోలె గోపాలగోపాంగనాగోగణంబులమీఁద పురందరచోదితసంవర్తధారాధరప్రయుక్తం బైనయమ్మహావర్షంబు గురియకుండఁబట్టె ని ట్లేడహోరాత్రం

---

వెలుఁగునట్టినది. 248 ఉత్పాతాంబుదశ్రేణి=ప్రళయమేఘపఙ్క్తి, నిబిడ = దట్టమైన, చండ=వేగముగల, ఉరు=అధికమైన, ఒక్కుమ్మడిన్ = ఒక్కసారిగా. 249 దుర్నిరీక్ష్యప్రకంపితశంపాతేజంబులవలనను = చూడశక్యముగాని మిక్కిలి చలించునట్టి మెఱుపుల వెలుఁగులవల్లను. బధిరీకృత = చెవుడుగలుగఁ జేయఁబడిన, వ్రాత=సమూహముగల, స్తనిత=ఉఱుములయొక్క, తుంగ=ఉన్నతమైన, చూర్ణిత=పొడి చేయఁబడిన, నిర్ఘాతపాత = పిడుగుపడుటయొక్క, శుండాలశుండాదండ = ఏనుఁగుతొండముతోడ, కరకా = వడగండ్లతోడి, దుర్దినీభూత = సూర్యప్రకాశములేని పగలుకలదిగానగుచున్న, అపరిచ్ఛిన్న= కమ్ముకొనుటచే మితిలేని, జీమూతజాత = మేఘసముదాయముచేనైన, వఱదలన్=ప్రవాహములలో, ఆర్తనాదంబులతోన్ = మొఱ్ఱోయనుకూఁతల చప్పుళ్లతో. 250 కీడునన్ = లోపముచేత, మనికితములు = సందేహములు. 251 గోపన = దాఁచుటచేత, 252 సంజాత = పుట్టిన, కంజాతభవాండభారవహనప్రశస్తంబు = బ్రహ్మాండముయొక్క భారమును వహించుటచేత మెచ్చుపడిసినది, తాళచ్ఛత్రంబు = తాటాకుగొడుగు, ధారాధరప్రయుక్తంబు = మేఘములవలన ప్రయోగింపఁబడినది,

బులు సుత్రాముండు పరుషంబుగఁ గరకావర్షంబు గురియించి గోష్ఠంబునకు నేయపాయంబును జేయనేరక విషణ్ణహృదయుండై మేఘంబుల వారించిన నాక్షణంబ. 252

క. ఆకాశంబు పయోదా, నీకంబులు లేక మిగుల నిర్మలమయ్యెన్
భీకరతరసంసార, వ్యాకులములు లేనియోగి యాత్మయుఁ బోలెన్. 253

క. ఈవిధమున నాఘోషము, గోవిందుఁడు గాచి కరుణ కొనసాగంగా
గోవర్ధనాద్రిఁ దొల్లిటి, తావున నిడి మహిమతో విడంబించుటయున్. 254

శ్రీకృష్ణునిసన్నిధికి నింద్రుండు వచ్చుట.

ఆ. పాకశాసనుండు పరమానురాగంబు, తోడ నందసుతునిఁ జూడఁగోరి
యభ్రగజము నెక్కి యరుదెంచి పొడగాంచె, నఖిలలోకజిష్ణుఁ డైనకృష్ణు 255

క. గరుడుఁడు గగనమునను నె,వ్వరికిం గానంగరాక వరపక్షములన్
గరువమున నీడపట్టఁగఁ, బరమానందమున నున్న భవ్యునిఁ గాంచెన్. 256

వ. ఇట్లు కనుంగొని యైరావతావతరణంబుచేసి సకలభువననిక్షేపీకృతోదరుండైన దామోదరు నాలింగనాద్యుపచారంబుల సంభావించి యిట్లనియె. 257

ఉ. ఏపున నాదితేయ దనుజేంద్రగణంబులు దేఁజూడఁగా
నోపని యమ్మహీధరము నొక్కకరంబునఁ దాల్చి గోపికా
గోపకగోనికాయములకున్ బటువృష్టిభయంబు మాన్చి యు
ద్దీపితబాహుగర్వమునఁ దేజము నొందితి నందనందనా. 258

తే. ఇట్టి యద్భుతకర్మంబు లీవుబాల్య, కాలమున నాచరించితి గానఁ గృష్ణ
భావికాలంబునందు భూభార ముడుప, నీవు చాలుదు వని నిశ్చయించినాఁడ.

క. నీవు జగంబులు మెచ్చఁగ, గోవర్ధనపర్వతంబు గొడుగుగ నిడి యీ
గోవులఁ గాచితి గావున, గోవిందుఁడ వైతి నందగోపకుమారా. 260

క. అనఘాత్మ గోగణంబుల, యనుమతమున నీకు గోగణాధిపతిత్వం
బొనరింతు నుపేంద్రత్వం, బున నుండుము సకలలోకములు జయపెట్టన్. 261

వ. అనిపలికి యైరావతంబుచేతం బవిత్రోదకంబులు దెప్పించి యభిషేకించె నదినిమిత్తం బుగాఁ గృష్ణుం డుపేంద్రుండును గోవిందుండును ననంబరఁగె నప్పుడు గోగణంబు లత్యంతప్రసన్నమూర్తులై యయ్యాదిమూర్తికి క్షీరధారాభిషేకంబుచేసె సురాసురయక్షగంధర్వకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరగణంబులు గగనమార్గంబున నిలిచి

సుత్రాముండు = ఇంద్రుఁడు, పరుషంబుగన్ = గడుసుగా, కరకావర్షంబు=వడగండ్లవాన, గోష్ఠంబునకున్ = మందకు, విషణ్ణ = విషాదమునొందిన. 253 పయోదానీకంబులు= మేఘసమూహములు. 254 విడంబించుటయున్ = ఒప్పఁగా 255 పాకశాసనుండు = ఇంద్రుఁడు, అభ్రగజమున్=ఐరావతమును. 257 అవతరణంబుచేసి = దిగి, నిక్షేపీకృత = నిక్షేపముగాఁ జేయఁబడిన. సంభావించి = గౌరవించి. 261 జయపెట్టన్ = జయజయయని పొగడఁగా. 262 ప్రసన్నమూర్తులు = కళంకములేని యాకృతి

జయజయశబ్దంబులఁ బుష్పవర్షంబులు గురియుచు దివ్యదుందుభినినాదంబులు
రోదసీకుహరంబునం బెరయ మొరయించి రప్పుడే కాంతంబున శచీకాంతుండు
లక్ష్మీకాంతున కిట్లనియె. 262

ఉ. ఈజగతీభరం బుడుప నీవు గడంగెడునాడు నీకుఁ దో
డై జయలక్ష్మిఁ జేకొనఁగ నర్జుననామముతో మదంశజుం
డై జనియించినాఁడు పృథయందుఁ గుమారుఁడు వానిఁ గావు మీ
యాజులలోన శాత్రవభయంబునఁ బొందకయుండఁ గేశవా. 263

సీ. అనిన నుపేంద్రుఁ డయ్యమరేంద్రుతోడ నిట్లను నేను నెఱుఁగుదు నవ్విధంబు
పాండవకౌరవుల్ బలసి యష్టాదశాక్షౌహిణీబలముతో నాహవంబు
గావించునప్పుడు కవ్వడితోఁ బాండుసుతుల కేపురకు నెచ్చోటఁ గీడు
రాకుండ నారసి రక్షింతు నాశరీరప్రాణముల యట్లు రమణతోడ

తే. భూమిభారంబు సర్వంబుఁ బొలియఁజేసి, యేను బరమపదంబున కేగునంత
కాలమును భూమి నేలింతుఁగాని మాన, వారికీర్తులు ధరణిలో వన్నె కెక్క.

వ. ఇప్పుడే నరిష్టకంసకేశినరకాసురాదు లైనవారలం బరిమార్చి పదంపడి భారత
యుద్ధంబునఁ బ్రజాక్షయంబుసేయువాఁడ నర్జుననిమిత్తంబుగా నీకు నింతపరి
తాపంబు వలవదని చెప్పినఁ బురందరుండు సంతుష్టహృదయుండై యతనిం
గౌఁగిలించి యామంత్రితుండై యైరావతంబు నెక్కి దేవలోకంబునకుం బోయె
నంత. 265

మ. అమరేంద్రాదులకైన భారమగుకార్యంబుల్ ముకుందుండు బా
ల్యమునం జేసినఁ జూచి గోపవరు లత్యాశ్చర్యచేతస్కులై
సముదగ్రోచ్చరవంబులం బొగడి యాసర్వేశ్వరుః మూఁగి యో
విమలాకారవికారదూరకరుణావిర్భూతదామోదరా. 266

ఆ. కొండ గొడుగుఁ జేసి గోవులతోఁగూడ, మమ్ముఁ గాచినట్టి మహితకృత్య
మమరు లైననోప రట్టిపౌరుషము నీ, వాచరించు టెల్ల నద్భుతంబు. 267

క. మాగొల్లపల్లెలోపల, నీగతిఁ గ్రీడించుచున్న నీ వమరుఁడవో
నాగేంద్రుఁడవో సిద్ధుఁడ, వో గంధర్వుఁడవొ దానవుండవొ చెపుమా 268

ఆ. నిను మనుష్యమాత్రుఁడని నమ్మఁగారాదు, మాకు నీస్వరూపమహిమయెల్ల
నిజము చెప్పకున్న నీకు నీపాదంబు, లాన తండ్రియాన యావులాన. 269

---

గలవి, రోదసీకుహరంబునన్ = భూమ్యాకాశ మధ్యమ నెడుగుహయందు, బెరయన్ = వ్యాపిం
పఁగా. 263 జగతీభరంబు = భూభారము, ఆజులలోనన్ = యుద్ధములయందు. 264 కవ్వ
డితోన్ = అర్జునునితో, పొలియన్ = నశింప. 265 పదంపడి = పిమ్మట, ఆమంత్రితుఁడు =
పంపఁబడినవాఁడు. 266 భారము = అశక్యము, చేతస్కులు = మనసు గలవారు, సముదగ్రోచ్చర
వంబులన్ = గంభీరములైన గట్టిచప్పుళ్లతో, మూఁగి = చుట్టుకొని.

చ. అనవుడుఁ గొంతసేపు జలజాయతలోచనుఁ డూరకుండి గ్ర
క్కున నలవోకగాఁ బ్రణయకోపము గైకొని వారితోడ ని
ట్లను నను నొత్తి మీరడుగు టర్హమె నందునకున్ యశోదకున్
దనయుఁడఁగాని కాను మఱితక్కినవారలలోన నెవ్వఁడన్. 270
క. నాయందు మీరు బాంధవు, లై యుండుట నీతిగాక యన్యవిచార
ప్రాయవిధినీయపృచ్ఛలు, సేయుటయే నీతియేమి చెప్పుదు మీకున్. 271
ఆ. అనుచు వారిమతుల కాంధ్యంబు గల్పించి, వలయుభంగి బాంధవంబు నడపి
నందనందనుండు బృందావనమున గో,పాలబాలకేళిఁ దేలుచుండె 272

శ్రీకృష్ణుండు వేణుగానముసేయఁగా గోపికలు విని మోహించుట.

వ. అంత వికాసభాసురకుముదసౌరభసంవాసితసకలదిశాభాగంబును నిందీవరమక రందబైందవానందసుందరేందిందిరఝంకారరావంబును షోడశకళాపూర్ణచంద్ర చంద్రికాసాంద్రసమస్తభువనతలంబును నైన శరత్కాలంబునఁ గృష్ణుండు గోపికా జనమనోహారంబయిన సౌకుమార్యంబుతోడ వినోదించుచుండి యొక్కనాఁడు నిశాసమయంబున. 273

ఉ. పున్నమవన్నెశంభుతలపువ్వు ముకుందునిచూపు దట్టపున్
వెన్నెలదుంప జక్కవలవేసడి చీఁకటిమూఁకవిప్పు వా
రాన్నిధియుబ్బుతామరలరాయడి వేల్పులపంట మింటిపైఁ
దిన్ననిపూర్వచంద్రికలు దిక్కులకున్ వెదచల్లుచుండఁగన్. 274
మ. తనసౌందర్యవికాసయౌవనము కందర్పాభిరామంబుగాఁ
దనయొయ్యారపునీతి గోపికలచిత్తప్రీతి గావింపఁగాఁ
దనసంగీతవచోవిలాసము సుధాధారాప్రపూరంబుగా
వనజాతాక్షుఁడు సర్వమోహనకళావర్ధిష్ణుఁడై పెంపుతోన్. 275
సీ. పరఁగు షడ్జాదిసప్తస్వరంబులు మంద్రమధ్యతారకతానమార్గములును
బురుషాంగనారాగములు ముప్పదియురెండు వానిమిత్రంబులు వరుస నెఱిఁగి
కాలక్రియామానగతులతోఁ దాళంబు లెఱిఁగి మూర్ఛనవృత్తు లేర్పరించి
గీతంబు దరువు జక్కిణిచిందు మొదలుగా నొక్కొక్కవర్ణంబు నుగ్గడించి

270 అలవోకగాన్=విలాసముగా, ప్రణయకోపము=ప్రేమతోఁగూడిన కోపము. అపృచ్ఛలు=తగని ప్రశ్నలు. 272 అంధ్యము=గుడ్డితనము-అజ్ఞానమనుట. 273 సంవాసిత = చక్కఁగా పరిమళింపఁజేయఁబడిన. మకరందబైందవ=పూఁదేనెబిందువులవల్లనైన, చంద్రికా=వెన్నెలచేత. 274 దుంప-రాశియనుట, వేసడి=చెఱుపరి, చీఁకటిమూఁకవిప్పు = చీఁకటిని పోఁగొట్టువాఁడు, వారాన్నిధియుబ్బు=సముద్రమును ఉప్పొంగునట్లుచేయువాఁడు, రాయడి=పీడ, వేల్పులపంట=దేవతలఫలము, తిన్నని = సౌమ్యములైన. 275 ఒయ్యారపు = విలాసముయొక్క, ప్రపూరంబు = మేలైన ప్రవాహము, వర్ధిష్ణుఁడు = వృద్ధిపొందు నిచ్ఛగలవాఁడు, 276 తాన = మెట్టువరుసలయొక్క. మూర్ఛన = రాగములయారోహణావ

తే. శుద్ధసాళగసంకీర్ణశోభితముల
శ్రుతులు చెడకుండఁ జెవులకు సొగసు గులుక
వేణునాదంబు మొరయించె రాణ మెఱయ
మదనగోపాలమూర్తి యమ్మాధవుండు. 276

వ. ఇట్లు సకలజనప్రమోదంబుగా వేణునాదంబు పూరించిన గోపాలగోపాంగనాగోగణంబులును బశుపక్షిమృగాదినానాజంతుజాలంబును బర్వతవృక్షలతాగుల్మాది సమస్తస్థావరభూతంబులును దమకుఁ దారె చొక్కి చిత్రరూపంబుల చందంబుల నుండి రప్పుడు వల్లవపల్లవాధరలమ్మోహనాకారునందు బద్ధానురాగలై. 277

క. పెనిమిటికి నత్తమామల,కును దలిదండ్రులకు బంధుకోటికిఁ దోఁబు
ట్టిన మగవారికి వెఱవక, ననుపునఁ జని రతని వేణునాదంబునకున్. 278

సీ. ప్రాణేశ్వరుని శయ్యపైనుండి యొకయింతి కృష్ణలీలలు సాళగించి పాడె
నత్తమామలు చూడ నలివేణి యొక్కతె తతకారములుచేసి తాళ మొత్తెఁ
దల్లిదండ్రులమ్రోలఁ దమకించి యొకలేమ లీలాగతుల సుమాళించి పాడెఁ
జుట్టంబులెల్లను జూడ నొక్కమృగాక్షి మెల్లనఁ దలయూఁచి మెచ్చె నతని
తే. వనజనయనుమీఁదివలపున నొకకొమ్మ, యిల్లు వెడలివచ్చి యెదురుకట్ల
పెద్దవార లున్నఁ బెద్దయు శంకించి, మమతతోడ మేను మఱచియుండె. 279

క. వల్లవసతియొక్కతె తన,వల్లభునిరతిప్రసంగవైభవములపొం
దొల్లక మెల్లనె లక్ష్మీ,వల్లభునిం జూడవచ్చె వల పేపారన్. 280

ఆ. లేఁగదూడ నొక్కలేమచిక్కముతోడఁ, గుడువ విడిచె నొక్కకోమలాంగి
కాఁగి పొంగుచున్న గాఁగులపాలలో, నీరుచల్ల మఱచి నిలిచియుండె. 281

ఆ. ఆవుఁ బిదుకఁబోయి యలివేణి యొక్కతె, దూడ వెనుక కాళ్లతోడ నావు
నడగఁగట్టి యొద్ది యాఁబోతుఁ దలఁగోలఁ, బట్టి యుఱ్ఱుగట్టి బయలు బితికె. 282

ఆ. వనితయొకతె పతికి వడ్డించి వడ్డించి, బానతోడ నున్న యానవాలు
కుమ్మరించి తోడికోడండ్రువదినెలు, మేలమాడుచుండ మేను మఱచె. 283

ఆ. మందలోననుండి మగఁడేలరాఁడొకో, యనుచు నత్త మొఱఁగి యరిగె నొకతె
యావు వెదకి తెత్తునని యొక్కగొల్లత, విభునిఁ గికురువెట్టి వెడలిపోయె. 284

ఆ. మగఁడుచూడ నత్తమామలు కోపింప, నిండ్లు విడిచి మీకు నేల పోవఁ
బోలఁతులార యనుచు బుద్ధిచెప్పఁగఁబోయి, నట్లుపోయె నొక్కయబ్జవదన. 285

---

రోహణములయొక్క, సాళగ=కలగలుపుతోడి రాగాలాపముచేతను, రాణ=మనోజ్ఞత. 277 గుల్మాది= పొదలు మొదలైన, స్థావర = తమయున్నచోట నుండి కదలనేరని, చొక్కి = పరవశత్వము నొంది. 278 ననుపునన్ = మోహముచేత. 279 సాళగించి = రాగమును ఆలాపనచేసి, తతకారము = తత అనుధ్వని, సుమాళించి = చొక్కి, ఎదురుకట్ల = ఎదుట, 283 ఆనవాలు = నానబియ్యము, మేలము = ఎగతాళి. 284 మొఱఁగి = ఏమఱించి, కికురువెట్టి = మోసపుచ్చి.

వ. మఱియు ననేకప్రకారంబుల నాభీరవారిజాక్షు లమ్మదనగురుకడకుం జని
యతనిం బరివేష్టించి మురళీనాదంబు వినుచుఁ జిత్రరూపంబులచందంబున నుండి
రంత. 286

మ. మురళీనాదముచేత గోపికలకున్ మోహంబు పుట్టించుచున్
సరసత్వంబున మేనిచక్కఁదనమున్ సంగీతపాండిత్యమున్
బెరయన్ వారలు దన్నుఁగూడి నడవన్ బృందాటవీమధ్యభా
సురరమ్యస్థలులందుఁ గ్రీడ సలిపెన్ సొంపారి లీలాగతిన్. 287

క బృందావనమున నీగతి, బృందారకచక్రవర్తి ప్రియమున గోపీ
బృందయుతుండై మోహము, చెందఁగఁ బుష్పాపచయము సేయుచునుండెన్.

ఉ. వ్రేతలఁగూడి యిట్లు వనవీథులఁ బూఁబొదరిండ్లు దూఱియున్
జేతులు వ్రేసి పాఱియును జెచ్చెర దాఁగిలి ముచ్చులాడియున్
గీతము నేర్చి యొండొరుల గెల్వఁగఁ జేసియు నిట్లు శంబరా
రాతిగురుండు యౌవనము రంజిలఁగా విహరించె నొక్కెడన్. 289

ఉ. వల్లవకాంత యోర్తు యదువల్లభునిం దననేర్పు చూపి రం
జిల్లఁగఁ జేసి తోడిసరసీరుహనేత్రను గానకుండఁ దా
నల్లనఁ గొంచుఁబోయి సముదంచితశీతలవారిబిందువుల్
చల్లుచు నున్నయయ్యమునసైకతభూములఁ గ్రీడలాడఁగన్. 290

ఉ. గోపమృగాక్షులందఱు ముకుందునిఁ గానక తద్వియోగసం
తాపము లంతకంతకు మనంబున నివ్వటిలంగ నవ్విభుం
డేపొల మేగెనో వెదకరే చెలులార యటంచు మాధవీ
నీపరసాలసాలరమణీయతలంబులఁ జూచి యొక్కెడన్. 291

క. గోపసతి యొకతె గాంచెను, జాపకలశవజ్రశంఖచక్రజలజరే
ఖాపరిశోభితమహిమలఁ, జూపట్టెడుహరిపదముల చొప్పొకచోటన్. 292

చ. కని తనుఁగూడివచ్చు చెలికత్తియలన్ గుమి గూర్చి మీకుఁ గృ
ష్ణునిపదపంకజాతముల చొప్పిదె చూపెద భాగ్యరేఖలన్
దనరుచు నున్న దెవ్వతకుఁ దాఁబ్రియుఁడై రతిసల్పఁబోయెనో
గొనకొని యొక్కయింతి యడుగుంజనుచున్నది దీనివెంబడిన్. 293

క. చనుఁగవయు గొప్పపిఱుఁదును, ఘనభారము లగుటఁ జేసి కడుఁగుంగిన యా
వనితపదంబులు కుఱుచై, చనుచున్నవిహారిపదముల సవ్యములందున్. 294

సీ. మునివ్రేళ్లు భూమిపై మోవ నిచ్చుట నిక్క యల్లచెట్టున బువ్వు లందికోసె

286 ఆభీరవారిజాక్షులు = గోపికలు, మురళీ = పిల్లంగ్రోవి. 288 బృందారక చక్రవర్తి=దేవతలలో శ్రేష్ఠుఁడైన కృష్ణుఁడు, పుష్పాపచయము - పువ్వులుగోయుట. 291 వియోగ = విరహమువలని, నివ్వటిలంగన్ = అతిశయింపఁగా. 292 చొప్పు = జాడ. 295 మోవన్ = ఆనఁగా, సరులు

నచట నయ్యింతి యొయ్యారంపుఁ గొప్పులో వెనుకదిక్కుననుండి విరులు దుఱిమె
సరులు చిక్కులువడ్డఁ జక్కఁద్రోయఁగఁబోలు నెదురులై యున్నవి యివె పదమ్ము
లివె తనపాదంబు లవిగ్రుంగియున్నవి యువిదకుఁ గైదండ యొసఁగఁబోలు
తే. నడచి బడలినసతిఁ దనతొడలమీఁద, నునిచి కౌఁగిటఁజేర్చి కూర్చుండె నచట
నలిగి మరలినప్రియురాలి యలుకదీర్చి, యల్ల పొదరింటిలో రతు లనుభవించె.
చ. అని తనతోడియింతులకు నంబుజలోచనుచొప్పుఁ జెప్పుచుఁ
జని చని ముందటం గనిరి చంద్రనిభాస్యలు మందవాతసం
జనితకళిందజాసలిలసంభృతశీకరశీతలంబులై
తనరుచు నున్నయట్టి సికతామయవేదుల నున్న వెన్నునిన్. 296
ఉ. పెన్నిధిఁ గాంచి సంతసిలుపేదలకైవడి గోపికాజనుల్
వెన్ననిఁ జూచి చిత్తములవేడుక లుల్లసిలంగ నిప్పుడీ
వెన్నలదొంగఁ జూడఁగలిగెఁ మనపాలిటిభాగ్య మబ్బెనో
కన్నియలార యంచుఁ బులకల్ తనువల్లుల నివ్వటిల్లఁగన్. 297
సీ. తరళాక్షి యొక్కతె త్రస్తరిగావించెఁ జేయెత్తి యంజలిచేసె నొకతె
యాలింగనముచేసె యలరించె నొక్కర్తు తనమోవి చవిచూపి తనిపె నొకతె
పులకాంకురంబులు పొదలించె నొకలేమ చూపులు నాటించి చొక్కె నొకతె
యొకతె పువ్వులదండ యుపధాన మొనరించె నొకయింతి తరులకు నొయ్యఁ బిలిచె
తే. నతని వదనాంబుజముదరహాసరసము
కాంత యొక్కతె నేత్రభృంగములఁ దనిపె
నివ్విధంబున గోపికలెల్ల నధిక
సంభ్రమంబుననుండి రాసమయమునను. 298

## రాసక్రీడావిహారము.

క. ఎందఱు గోపవధూమణు, లందఱకును నన్నిరూపులై యప్పుడు గో
విందుఁడు రాసక్రీడా, నందంబున రతులు సలిపె ననువేపారన్. 299
క. ఒక్కొకకృష్ణుఁడు గోపిక, యొక్కతెయును వరుస నిలిచి యొండొరుకరముల్
మక్కువఁ గైకొని యందఱు, నక్కజముగ రాసమండలాకృతిబెరయన్. 300
వ. ఇట్లు రాసమండలప్రమాణంబుచేసి పెద్దయుం బ్రొద్దు నటియించి యత్యంతపరిశ్రాంతలైనయక్కాంతల నాలింగనంబునం జుంబనసంభాషణసంభోగాది విశేషంబులం దనిపి సేదలుదేర్చి తాళమానంబుగా నందఱు రాససంగీతంబుచేసి ప్రభాతసమయంబున గోకులంబునకు వచ్చి యథాప్రకారంబున నుండి రిట్లు ప్రతిరాత్రంబును గోపికలతోడఁ గైశోరవినోదంబుల రాసక్రీడలాడుచుండె. 301

---

= హారములు, కైదండ = చేయూసరా. 296 కళిందజా = యమునయందలి, శీకర = తుంపురులచేత, సికతామయ = ఇసుకదిన్నెలనెడు. 298 త్రస్తరి = క్రిందు, పొదలించెఁ = వృద్ధిపొందించెను, ఉపధానము = తలగడ. 301 పరిశ్రాంతలు = బడలికనొందినవారు, సేదలు = బడలికలు,

తే. అఖిలభూతమయుం డైనయమ్మహాత్ముఁ, డనిలమునుబోలె సకలమునందు నుండుఁ
గాన గోపాంగనలతోడఁ గలసి రతులు, సలిపె లోకాపవాదంబు గలుగకుండ.
వ. ఇవ్విధంబున వినోదించుసమయంబున. 303

## అరిష్టాసురవధ.

సీ. మీఱిన క్రొవ్వాఁడికోఱకొమ్ములపుట్టలాడ కాడకును గోరాడియాడి
కడునుబ్బునను గణింగని ఱంకెవేయుచు ధరణీతలము కాలఁ ద్రవ్వి త్రవ్వి
కాలాహికంబె భీకరమైనవాలంబు దిక్కులు కంపింపఁ ద్రిప్పి త్రిప్పి
చటులతరస్కంధసంఘర్షణంబునతోడ మ్రాఁకులు గూలఁ ద్రోచి త్రోచి
తే. నీలమేఘంబుకైవడిఁ గ్రాలుచున్న, రూపమున భీకరాకృతి చూపి చూపి
వృషభరూపంబు గైకొని వెస నరిష్టుఁ, డేపుతో గోకులంబున కేగుదెంచె. 304
క. కంజాకరంబుఁ జొచ్చిన, కుంజరమునుబోలెఁ బసులగుంపులలో లీ
లం జొచ్చి గోగణంబుల, భంజించుచునుండె నధికభయదాకృతితోన్. 305
వ. అప్పు డాభీరవరు లత్యంతభయాకులమానసులై మొఱవెట్టుచుఁ గృష్ణుని
మఱుంగుసొచ్చినం గరుణించి. 306
మ. హరి గోపాలుర నోడకుండుఁడని కోపాటోపసంపీడితా
ధరుఁడై యావృషభాసురుం గదిసి యుద్యద్ఘోరహుంకారము
ద్ధురతన్ జేసినకృష్ణు కుక్షిపయి దైత్యుం డుద్ధతిన్ గ్రుచ్చినన్
మురవిధ్వంసి నిశాచరాధమునికొమ్ముల్ వట్టి బిట్టార్చుచున్. 307
ఉ. మిక్కుటమైనతీవ్రమున మింటిపయిన్ వెసఁ ద్రిప్పి నేలతో
నుక్కణఁగంగ వైచుటయు నొక్కట ముక్కున నోర నెత్తురుల్
గ్రక్కుచుఁ బ్రాణముల్ విడిచెఁ గంజదళాక్షునిఁ జూచి గోపకుల్
మ్రొక్కుచు హస్తపద్మములు మోడ్చి నుతించి రనేకభంగులన్. 308
క. హరి బిట్టుగిట్టిచంపెను, బరమమునివ్రాతశాపపన్నగదష్టున్
సురసంఘస్ఫీతరిష్టున్, దురహంకృతచేష్టు లోకదుష్టునరిష్టున్. 309

## కంసుండు నారదువలన రామకృష్ణులప్రభావము విని సహింపక ధనుర్యాగ వ్యాజంబున వారల మధురకుఁ దోడ్కొనిరమ్మని యక్రూరు నంపుట.

వ. అంత నొక్కనాఁడు నారదుండు కంసుపాలికిం బోయి యతండు చేయుసత్కారం
బులు వడసి యతనితోడ వైష్ణవాంశంబుల దేవకీదేవియందు రామకృష్ణులు

---

కైశోర = పసితనపు. 304 కోరకొమ్ములన్ = మీఁదికి నిక్కిన కొమ్ములతో, స్కంధసంఘర్షణంబునన్ మూఁపురాపిడిచేత, క్రాలు = ప్రకాశించు. 305 కంజాకరంబు = తామరకొలను, కుంజరము=ఏనుఁగు. 308 తీవ్రమునన్ = వాఁడిమితో. ఉక్కణఁగంగన్ = చావ. 309 దష్టున్ = కఱవఁబడినవానిని, సురసంఘస్ఫీతరిష్టున్ = దేవతాసమూహమునకు మిక్కుటమైన కత్తియైనవానిని. 311 విధ్వంసుఁడు = చెఱుచువాఁడు, నృశంసుఁడు = హింసకుఁడు.

జన్మించి నందగోకులంబునం బెరుగుటయును గృష్ణుండు పూతనచన్నుఁబాల
తోడంగూడఁ బ్రాణంబులు గ్రోలుటయును శకటపరివర్తనంబు సేయుటయును
యమళార్జునంబులఁ గూలఁద్రోచుటయు యమునాహ్రదంబున నున్న కాళియాహి
మర్దించుటయు ధేనుకాసురుం బరిమార్చి తాళవనంబు నిష్కంటకంబు సేయుట
యును భాండీరవనంబున నున్న ప్రలంబుని బలభద్రుచేతం జంపించుటయును
బర్జన్యప్రయుక్తం బైనవర్షంబువలన నందగోకులనివాసులకు నుపద్రవంబుగా
కుండ గోవర్ధనశైలంబు ఛత్రంబుగాఁ బట్టుటయును గోపికాజనసమేతుండై
రాసక్రీడలవినోదించుటయును అరిష్టాసురుం బరిమార్చుటయును మొదలుగా
సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిపోయిన. 310

క. కంసుఁడు భోజేంద్రకులో,త్తంసుఁడు శక్రాదిదేవతాగణశుభవి
ధ్వంసుఁడు భగినీపుత్రనృ,శంసుఁడు నానాసురప్రశంసుఁడు కినుకన్. 311

సీ. ఆనకదుందుభి ననరాని వినరాని దుర్వాక్యసూచులఁ దూలపుచ్చి
వృష్ణిభోజాంధకవీరవర్గము నెల్లభంగుల సకలసంపదలు గొనియె
నందగోపునియాలమందల నన్నింటి బలిమిఁ గైకొని వీరభటుల నిలిచెఁ
దనమేలు చూడఁజాలనివీరవర్గంబు క్రొవ్వాఁడి గొఱ్ఱులగ్రుచ్చఁ బనిచె
తే. ధర్మమార్గంబుదప్పనితండ్రి నుగ్ర,సేనుశృంఖలాబద్ధునిఁజేసి బంది
గమున నిడి మేటిదైత్యులఁ గాపువెట్టి, గంసుఁ డత్యంతభీకరాకారుఁ డగుచు.

ఉ. జన్నము పేరుచెప్పి పటుసత్త్వసమగ్రులరామకృష్ణులన్
మిన్నక పిల్వఁబంచి బలిమిన్ వధియించెద నొండె నట్లుగా
కున్నను జెట్లచేత వధ మొందగఁజేసెద నొండెఁ బోరిలో
నెన్నివిధంబులం బగఱ నేపణఁగించెద నిన్ని నేర్పులన్. 313

వ. అని యిట్లు తనలో విచారించి. 314

సీ అక్రూరుఁ బిలిచి యిట్లను నన్నుఁ జంపుటకై విష్ణుదేవునియంశమునను
వసుదేవదేవకీవరపుత్త్రులై రామనారాయణులు పుట్టి నందగోప
గోకులంబున బెరుగుచునుండి నావారి నందఱఁ జంపినా రనుచు నేఁడు
నారదుం డేతెంచి నాతోడ సకలంబు నేకాంతమునఁ జెప్పి యిప్పు డేగె
తే. నెంతచేసిరి చూచితే యీవుదక్క, నకట నాతండ్రి యుగ్రసేనాదులైన
యాదవులు నాకుఁ గీడుసేయంగఁ బూని, యున్న వా రింక నేమని యుగ్గడింతు

మ. అది యట్లుండెను గాందినీసుత ధనుర్యజ్ఞంబు గావింపఁగా
నిదె యొల్లుండి యుపక్రమించెదను నీవే తన్నిమిత్తంబుగా
ముద మొప్పన్ రథమెక్కి వే గదలి రాముం గృష్ణునిన్ నందగో
పదురాత్ముం గొనిరమ్ము వచ్చినను దత్పాపాత్ములం జంపెదన్. 316

---

312 సూచులన్ = సూదులచేత, శృంఖలాబద్ధునిన్ = సంకెలవేయఁబడినవానిని, బందిగమునన్ = కారాగృహమునందు, పగఱన్ = శత్రువులను.

క. ముష్టికచాణూరాదుల, ముష్టిహతులనైనఁ బ్రాణములు గొనిపింతున్
దుష్టాత్ములలోకములన,వష్టంభం బైనఁ బ్రాభవము నాకొదవన్. 317

సీ. తొలివోలి రామకృష్ణులఁ జంపి మఱి దేవకీవసుదేవుల గీటణంచి
నందగోపాదుల నందఱఁ బెదపెద కొఱ్ఱుల నిడి వారి గోధనంబు
హరియించి మాతండ్రి యగునుగ్రసేనునితోఁగూడ నాకతిద్రోహులైన
యదువంశజులనెల్లఁ బొదివిడామెనకట్టుగాఁగట్టి వెసఁ గులక్షయము చేసి

తే. యేచి నిష్కంటకం బైనయీజగంబు, నేన యేలెద లోకంబులెల్లఁ బొగడ
నీవు నాకుఁ బ్రియంబుగా నీప్రయోజనంబు గావించుటకుఁ బయనంబుగమ్ము.

క. చాలఁగ నేతులు పెరుగులు, పాలును గోపకులచేతఁ బట్టించుక ర
మ్మాలస్యముసేయక యని, లాలనగావించుటయుఁ జెలంగుచు మదిలోన్. 319

వ. పరమభాగవతుం డైననాశ్వఫల్గునందనుండు దనకుఁ గృష్ణసందర్శనంబుగలిగెఁ గృతార్థుండనయితి నని సంతసిల్లుచు రథారూఢుండై మధురాపురంబు నిర్గమించె నప్పుడు. 320

కేశి యనువాని వధించుటవలన నారదుండు కృష్ణునికిఁ గేశవుఁ డని పేరిడుట.

మ. అట కంసాసురదూత కేశి యనువాఁ డశ్వాకృతిన్ దారుణ
స్ఫుటహేషారటనంబు లాకసమునన్ బూరింపఁగాఁ జేయుచున్
సటలం బుట్టినగాలిచే జలధిసంఛన్నంబు గావించుచున్
జటులోదగ్రఖురాగ్రఘట్టనల భూచక్రంబు భేదించుచున్. 321

మ. చని బృందావనవీథిలో మెఱయు గోష్ఠం బుద్ధతిన్ జొచ్చి గ్ర
క్కున గోవిందునిమీఁద వచ్చునెడ నాగోపాలగోపాంగనా
జనులెల్లన్ మొఱవెట్టుచున్ బఱచినన్ సంరంభచండప్రతా
పనిరూఢుం డగునవ్విభుం డసురుపైఁ బ్రస్వేదకోపంబునన్. 322

మ. ఎదు రేతెంచి యదల్చుచున్న హరిపై హేషారవోద్వృత్తుఁడై
వదనద్వారము విచ్చి బిట్టు గఱవన్ వల్గింపఁగా లీలతో
యదుచూడామణి ముష్టిహస్తము తదీయాస్యంబునన్ జొన్పినన్
రదముల్ శారదవారిభృచ్ఛకలవిభ్రాంతిన్ వెసన్ డుల్లినన్. 323

ఉ. అక్కమలాయతాక్షుఁడు భయంకరబాహువు దైత్యుకుక్షిలోఁ
గ్రుక్కినఁ దద్దయున్ బలిసి రోగముపేక్షలచేత మేనికిన్
వెక్కసమైనచందమున విహ్వలభావముఁ జేసి దేహమున్

---

317 అవష్టంభము = ఆవలంబము. 321 హేషారటనంబు = సకిలింతచప్పుడు, సటలన్ = జూలువలన, సంఛన్నంబు = చక్కఁగా కప్పఁబడినది, ఖురాగ్ర = గిట్టమొనలచేనైన. 322 సంరంభ = వేగిరపాటుతోడి, చండ = వేండ్రమైన, ప్రస్వేద = మిక్కిలి వేండ్రమైన. 323 వల్గింపఁగాన్ = చుట్టు పరుగుపాఱఁగా, శారదవారి భృచ్ఛకలవిభ్రాంతిన్ = శరత్కాల మేఘఖండము లనెడుభ్రమగల్గించుటతో, డుల్లినన్ = రాలఁగా. 324 విహ్వలభావమున్ =

వ్రక్కలు వాపి చంపె సురవర్గము కో యని యార్చుచుండఁగన్. 324

ఉ. ఆదనుజేంద్రు నిట్లు దెగటార్చి వికాసవిభాసి యైనదా
మోదరు విక్రమక్రమము నున్నతి గోపకగోపికాజనుల్
సాదరచిత్తులై పొగడి రప్పుడు నారదమౌనివచ్చి యం
భోదపథంబునన్ నిలిచి పోరునఁ గృష్ణునిఁ బ్రస్తుతించుచున్. 325

చ. కలహము నాకుఁ గన్గొనఁగఁ గల్గిన నంతియె చాలు నెమ్మెయిన్
బిలువని పేరఁటం బరిగి ప్రేమముతోఁ గనుఁగొందు గావునన్
జలరుహనేత్ర యీహయనిశాచరవీరుని చావు చూడఁగా
వలసి యతిప్రయత్నమున వచ్చితిఁ జూచితిఁ జాలమెచ్చితిన్. 326

ఉ. ఓశతపత్రనేత్ర కరుణోదయనందకుమార దేవతా
ధీశునకైన మార్కొని జయింపఁగరాని బలాఢ్యుఁడైన యీ
కేశిని జిత్రయుద్ధమున గీటణఁగించితి గానఁ బెంపుతో
గేశవనామకంబు గలిగించితి నీకు జగత్ప్రసిద్ధిగన్. 327

ఉ. నిక్కముగాఁగఁ గంసునకు నీకును నాలుగుమూడునాళ్లలో
నక్కజమైన యుద్ధ మగునప్పుడు వానికిఁ బూని భూపతుల్
స్రుక్కక యెందఱేనియును రూపఱిపోయెద రట్టివైభవం
బొక్కటియుం గనుంగొనఁగ నుత్సవ మేర్పడ నేగుదెంచెదన్. 328

వ. నీకు నభ్యుదయం బగుఁ బోయివచ్చెద నని నారదుండుపోయె నంతట. 329

అక్రూరుండు వ్రేపల్లెకువచ్చి భగవత్సందర్శనంబు సేయుట.

మ. అరదంబెక్కి ప్రమోద మేర్పడఁగ నయ్యక్రూరుఁ డేతెంచుచున్
బరమాహ్లాదము భక్తియుక్తియును దాత్పర్యంబుఁ జిత్తంబులో
బెరయన్ గృష్ణునిఁ బుండరీకనయనున్ బీతాంబరున్ ధారుణీ
ధరునిన్ జూడఁగ నేడుగల్గెను గృతార్థంబయ్యె నాజన్మమున్. 330

సీ. తలఁచినమాత్రఁ బాతకముల నెడఁబాపు సుజనవత్సలు నేడు చూడఁగలిగె
బ్రహ్మాదులకునైనఁ బ్రణతులకోపనిమురవిరోధికి నేడు మ్రొక్కఁగలిగె
నఖిలవేదాంతవిద్యారహస్యంబుల ప్రౌఢతో నేడు మాటాడఁగలిగెఁ
బ్రాపంచికముఁ దృణప్రాయంబు గావించు ప్రభువుమన్నన నేడు పడయఁగలిగె

తే. సత్వగుణలేశములచేత జగముఁ గాచు
పురుషవర్యుండు నను నేడు ప్రోవఁగలిగె
నెంత భాగ్యోత్తరుఁడనొకో యేను గమల
నాభుసేవించి భక్తి యొనర్పఁగలిగె. 331

---

వివశతను. 325 అంభోదపథంబునన్ = ఆకాశమార్గమున, పోరునన్ = మిక్కిలి. 328 అక్కజము = అధికము, స్రుక్కక = వెనుదీయక, బెరయన్ = నిండుకొనఁగా. 331 ఓపని = అనువుపడని, ప్రౌఢ = ప్రౌఢుఁడు, ప్రాపంచికమున్ = ప్రపంచమునందలి వ్యవహారమును.

వ. అని యివ్విధంబున విష్ణుభక్తియుక్తంబైనడెందంబు పరమానందంబునం బొందఁ
దదనులాపంబులు చింతించుచు నరిగి యరిగి నందగోకులంబునకువచ్చె నంత. 332

చ. పడమటివంకఁ గ్రుంకఁ జను భాస్కరబింబముఁ దూర్పుకొండపైఁ
బొడిచినచంద్రమండలముఁ బొల్పెసలారెఁ బయోజసంభవుం
డెడపకరాసిమాసగతు లెక్కవతక్కువ లైనకాలముల్
తడఁబడు నంచుఁ దూన్చునెడఁ ద్రాసునఁ దేలెడు చిప్పలో యనన్. 333

వ. ఇట్టి సాయంకాలసమయంబున రామకృష్ణులు వల్లవకుమారసమేతులై పసులకదు
పులనెల్లను గోష్ఠంబునకుఁ దెచ్చి తమతమవెరవులం గుదురఁద్రోలి దుగ్ధదోహ
నంబునకు సమకట్టుచున్నసమయంబున. 334

మ. కనియెన్ భాగవతోత్తముండు త్రిజగత్కల్యాణవర్ధిష్ణునిన్
వనజాతాసనవాసవప్రభృతిదేవప్రాభవాధిష్ణునిన్
ఘనగర్వాంధనిశాచరేంద్రవరభాగ్యప్రక్రియాజిష్ణునిన్
కనదంభోధరకృష్ణునిన్ సుజనరక్షౌత్కృష్ణునిన్ గృష్ణునిన్. 335

మ. లలితాంభోరుహపత్రనేత్రుఁ గరుణాలంకారు నాజానుబా
హులతాశోభితుఁ బీతవస్త్రకటిభారోదగ్రుఁ గస్తూరికా
తిలకున్ మండితమందహాసవదనున్ దేదీప్యమానప్రభా
కలితున్ భూషితవన్యపుష్పుఁ ద్రిజగత్కల్యాణపారీణునిన్. 336

సీ. అరుణారుణచ్ఛాయ లగుపాదములు నేల మూఁది చక్కఁగ నిలుచున్నవానిఁ
బరిమళించుచునున్న విరితెల్లదామర నెలమితో నవతంస మిడినవాని
గోధూళిపొదివినకుండలంబులతోడ నింద్రనీలచ్ఛాయ నెసఁగువాని
వక్షంబునందు శ్రీవత్సచిహ్నము క్రేవబెడఁగుగా వనమాల యిడినవాని

తే. పేరుకొని లేఁగటావులఁ బిలిచి పిలిచి, పిచ్చలించుచుఁ గ్రేపుల విడుచువాని
క్షీరకలశంబు నుభ్రాల్లఁ జేతఁబట్టి, యమరు గోపాలకృష్ణు నల్లంతఁ గాంచె.

---

332 అనులాపంబులు = మాటిమాటికి మాటలాడుటలు. 333 ఎడపక = ఎడపడక. 334 దుగ్ధదోహనంబునకున్ = పాలుపిదుకుటకు. 335 వర్ధిష్ణునిన్ = వృద్ధిపొందించుశీలముగలవానిని, వనజాతాసన = బ్రహ్మ, ప్రాభవాధిష్ణునిన్ = ప్రభుత్వము నధిష్ఠించియుండువానిని, ప్రక్రియా = అధికారమును, జిష్ణునిన్ = జయించు శీలముగలవానిని, కనదంభోధరకృష్ణునిన్ = ప్రకాశించునట్టి మేఘమువలె నల్లనైనవానిని, తృష్ణునిన్ = ఆసక్తిగలవానిని. 336 అంభోరుహపత్ర = తామరరేకులవంటి, ఆజానుబాహులతా = మోఁకాళ్లనుతాఁకునట్టి చేతులనెడుతీఁగలచేత, పీతవస్త్రకటిభారోదగ్రున్ = పచ్చని వస్త్రముగల పిఱుఁదులచేత ప్రకాశించువానిని. మండిత = అలంకరింపఁబడిన, దేదీప్యమానప్రభాకలితున్ = మిక్కిలి వెలుఁగునట్టి కాంతితో కూడుకొన్నవానిని, వన్య = అడవియందుఁబుట్టిన, 337 అరుణారుణ = సూర్యునియొఱుపువంటి యొఱుపుగల, విరి = వికసించిన, అవతంసము = శిరోభూషణముగా, కుంతలంబులతోడన్ = ముంగురులతో, క్రేవన్ = పార్శ్వమునందు, పిచ్చలించుచున్

వ. మఱియును. 338

క. కైలాసనగమునందును, గ్రాలెడు ప్రావృట్పయోధరముచందమునన్
లాలితకటిభాగంబున, నీలాంబర మమరు రాముని౦ బొడగాంచెన్. 339

వ. ఇవ్విధంబున నయ్యిరువురం బొడగాంచి యక్రూరుండు. 340

మ. భగవంతుం డగువిష్ణుదేవుఁడు మహీభారంబు వారింపఁగా
జగతీమండలి రామకృష్ణు లనఁగా జన్మించె నీమూర్తులై
జగదేకస్తుతిపాత్రులన్ భువనరక్షాదక్షులన్ సంతసం
బిగురొత్తం గనుఁగొంటి నాకొదవె కాదే జన్మసాఫల్యముల్. 341

వ. అని తలంచి దంతురీభూతపులకితశరీరుండై రథంబు డిగ్గి వినయసంభ్రమభక్తి తాత్పర్యంబులు చిత్తంబునం బెనంగొనవచ్చి దామోదరునకు సాష్టాంగదండ ప్రణామంబుచేసిన. 342

క. బలి యవని దానధారా, జలములు చిలికించి యతని శతమన్యునిగాఁ
నిలిపి కులిశాబ్జరేఖలు, గలశ్రీహస్తములు నెత్తి కౌఁగిటఁ జేర్చెన్. 343

వ. తదనంతరంబ గాందినేయుండు రౌహిణేయునకు నభివాదనంబుచేసిన నతండును నట్లగారవించి కుశలం బడిగి యర్ఘ్యప్రకారంబుల మన్నించి యాత్మీయమంది రాంగణంబున నొక్కరమ్యప్రదేశంబున నమ్మువ్వురుం గూర్చుండి యిష్టసల్లాపం బులు నేయుచుండి తగుతెఱంగున మజ్జనభోజనంబులు దీర్చి పథశ్రాంతివలననైన బడలిక తమ కరుణామృతసేచనంబుల నపనయించి యతనితోడ మధురాపురంబునఁ బుట్టినవిశేషంబు లడుగుటయుఁ జక్రధరునకు నక్రూరుం డిట్లనియె. 344

తే. నీవు సర్వజ్ఞమూర్తివి నీకుఁ దెలివి
పడని యదియేమి యున్నది పద్మనాభ
యయిన నావిన్నపం బెల్ల నాదరించి
వినుము నీచిత్త మటమీఁదిపనులు నడప. 345

వ. అని పలికి కంసుండు నారదప్రచోదితుండై యాదవసభామధ్యంబున దేవకీవసు దేవుల నుదాసీనంబు లాడుటయు పితృగౌరవంబు విచారింపక యుగ్రసేనుని నిగళప్రాప్తునింజేసి కారాగృహంబున నునుచుటయును తనతోడ బంధుద్రోహంబు సేయ విచారించుటయు నద్దురాత్మునిదుర్మంత్రంబున నుపాయనంబులు గొని

---

= త్వరపడుచు. 339 ప్రావృట్పయోధరము = వానకాలపుమబ్బు. 342 దంతురీభూత = ఎగుడు దిగుడుగా నైన. 343 శతమన్యునిఁగాన్ = ఇంద్రునిఁగా, కులిశాబ్జరేఖలు = వజ్రమువలెను కమలమువలెను కనఁబడుగీఱలు. 344 గాందినేయుండు = అక్రూరుఁడు, అభివాదనంబు = నమస్కారము, పథశ్రాంతి = మార్గశ్రమము, సేచనంబునన్ = తడుపుటచేత, అపనయించి = పోఁగొట్టి. 346 ప్రచోదితుండు = ప్రేరేపింపఁబడినవాఁడు, ఉదాసీనంబులు = చెప్పరానిమాటలు, నిగళప్రాప్తునిన్ = సంకెళ్లువేయఁబడినవానిఁగా, విచారించుట = ఆలోచించుట, దుర్మంత్రంబు=దురాలో

ధనుర్యజ్ఞ వ్యాజంబున నందాదిగోపకులతోడఁ దముం బిలువవచ్చుటయును
విన్నవించిన నాప్రపంచవేది యతని కిట్లనియె. 346

క. నీ విపుడు నాకుఁ జెప్పిన, యీవచనము లెల్ల నేను నెఱుఁగుదు నక్రూ
రా వినుము కంసు నసువులు, లేవనియుండుదువుగాని లెక్కింపకుమీ. 347

తే. నీవు మెచ్చంగ నెల్లుండి నేను గంసు, ప్రాణములు గొని మానవప్రతతు లెల్ల
నుల్లసిల్లంగ భూమికి నుగ్రసేనుఁ, బట్టభద్రునిఁ జేసెదఁ బ్రాభవమున. 348

ఉ. ఎల్లి ప్రభాత కాలమున నిచ్చటఁ గల్గిననెయ్యిపాలు కా
వళ్ల నమర్చికొన్చనఁగ వల్లవులన్ సమకట్టి సంబరం
బెల్లవిధంబులన్ మెఱయ నేనును నీవును నందసీరులున్
గొల్లలలోనఁ బెద్దలునుగూడి రయంబునఁ బోద మర్థితోన్. 349

వ. అనిపలికి యారాత్రి నందుమందిరంబున నందఱు వసియించి మఱునాఁడు ప్రభాత
సమయంబునఁ గాలోచితకృత్యంబులు దీర్చి దధిక్షీరాజ్యాద్యుపాయనంబుల
తోడం దగువారిముందర ననిపి యక్రూరుండు సారథిగా బలభద్రసహితం
బుగా రథారోహణంబుచేసి చనునప్పుడు. 350

## గోపికలు శ్రీకృష్ణవిరహాభీతలై చింతించుట

ఉ. అచ్చటిగోపభామలు మురారిప్రయాణము చూచి యెంతయున్
ముచ్చట లగ్గలింప మరుమోహనబాణవిభిన్నచిత్తలై
వెచ్చనియూర్పులు న్నిగుడ వేదనలం దురపిల్లి కన్నులన్
బిచ్చలుబాష్పవారిఁ దమబింకపుఁజన్నులు దొప్పఁదోఁగఁగన్. 351

క. విరహాగ్నివలన దేహము, లరవరలై హస్తభూషణావళు లెల్లన్
హరిఁ గోరి జాఱిపడఁగా, నరుదుగ నొకచోటఁగూడి యందఱుఁ దమలోన్. 352

ఉ. ఇందునిభాస్యలార మన కెల్ల మనోహరమూర్తియైన యీ
నందతనూభవుండు కరుణారస మించుక యైన లేక తా
నిందఱఁగూడి యామధుర కిచ్చ మెయిం జనుచున్నవాఁడు సొం
పొందఁగ వీనితోఁ గలసియుండుట కింకొకనాఁడు గల్గునే. 353

ఆ. పౌరసతుల సరసభాషామృతంబుల, సోన లితని చెవులసోఁకె నేని
గొల్లసతులతోడి కూరిమి దలపోసి, యితఁడు చౌకసేయ కేలమాను. 354

ఆ. ఏమిసేయువార మీతనిఁ బెడఁబాసి, కంతుసాయకముల గాసిపడక

---

చన, వ్యాజంబునన్ = నెపముచేత, ప్రపంచవేది = సర్వము తెలిసినవాఁడు. 347 అసువులు = ప్రాణములు. 349 ఎల్లి = రేపు, సంబరంబు = వేడుక. 351 అగ్గలింపన్ = అతిశయింప, విభిన్న = మిక్కిలి భేదిల్లిన, దురపిల్లి = శోకించి, పిచ్చిలు = స్రవించు, బింకపు = బిగువులైన, తొప్పఁదోఁగఁగన్ = మిక్కిలి తడియఁగా. 352 అరవరలు = కృశించినవి. 354 సోనలు = ధారలు, చౌక = అలక్ష్యము. 355 కంతుసాయకములన్ = మన్మథుని బాణములచేత.

పడఁతులార యెట్లు బ్రతుకువారము దైవ, మేల వాపె నొక్కొ యితని మనల.

తే. నందసూనుండు పౌరాంగనావిలాస, నిగళములఁ జిక్కి యచ్చట నిలుచుఁగాక యిచటి కేటికిఁ దావచ్చు నుచితవాక్య, చతురవచనలు లేని గొల్లతలకడకు. 356

క. ఈరీతి మనకు విరహము, ప్రేరేప యశోదపట్టిఁ బెడఁబాపిన యీ క్రూరుని నక్రూరుం డని, యేరీతిం బిలువవచ్చు నింతులు వినరే. 357

తే. కొండఱము పోయి కృష్ణుని కొంగుపట్టి
యాఁగి మము నిట్లు విరహాగ్నిఁ గ్రాగఁజేసి
యేలపోయెదు మము డించి యేము వత్తు
మనిన మనపెద్ద లచట నేమందురొక్కొ. 358

ఆ. మాధవుండు లేని మనగొల్లపల్లియ, నేడు మొదలుగాఁగ నెలఁతలార చిన్నవోయియుండుఁ జెల్లఁబో యీదైవ, మెంతకీడుచేసె నిపుడు మనకు. 359

వ. అని యిట్లత్యంతవిరహవ్యథాధీనహృదయ లగుచు ఘోషకాంతలు ధేనుకాంతకు వలనుచూచుచు దృష్టికగోచరం బగుటంజేసి మగిడి తమతమనివాసంబులకువచ్చి యథాప్రకారంబుల నుండి రంత. 360

## అక్రూరునకు యమునానదీజలమునందు శ్రీకృష్ణభగవంతుఁడు ప్రత్యక్షమగుట.

క. సారథియై యక్రూరుఁడు, తేరితురంగముల నధికతీవ్రతఁ బఱపఁగ వారలు మధ్యాహ్నమునకు, బోరనఁ గాళిందిదరికిఁబోయి మునీంద్రా. 361

క. అరదము దిగి యక్రూరుఁడు, హరితో మాధ్యాహ్నికాదు లగుకృత్యంబుల్ పరిపాటిఁ దీర్చివచ్చెద, నరగడియకు మీరు నిలువుఁ డని చని భక్తిన్. 362

ఉ. ఆనదిలోపల న్మునిఁగి యాచమనం బొనరించి నిశ్చల
ధ్యానసమాధినుండి పరతత్త్వమహత్త్వము నాసికాగ్రసం
ధాననిరీక్షణంబుగ నొనర్చుచు వెండియుఁ దీర్థమాడినన్
మానుగఁ గానవచ్చెఁ బరమం బగువైష్ణవతత్త్వ మేర్పడన్. 363

సీ. కుందేందుధవళితాంగుని నీలపరిధానపరిశోభితునిఁ గదంబప్రసూన
వనమాలికాభూషితుని రత్నకుండలాంచితగండమండలు నతుల వికసి
తాంభోజదళనేత్రు రంభాదిదేవాంగనాజనస్తోత్రు ఫణాసహస్ర
భాసితు వాసుకిప్రముఖనానాపన్నగేశ్వరపరివృతు నిద్ధచరితు

తే. ముసలలాంగలపాణి తమోగుణప్రశస్తు నాద్యు ననంతు సమస్తభువన భారవహు బలభద్రునిఁ బరమపురుషు, దివ్యతేజోవికాససందీప్తుఁ గాంచె 364

---

356 నిగళములన్=సంకెళ్లయందు. 358 ఆఁగి=నిలిపి, క్రాఁగన్=తపింప. 359 చెల్లఁబో=అయ్యో. 361 బోరనన్ = క్రమముగా. 362 పరిపాటిన్ = క్రమముగా. 363 నాసికాగ్రసంధాననిరీక్షణంబుగన్ = ముక్కుమొనను గూర్చిన చూపుగలుగునట్లుగా. 364 కుందేందు ధవళితాంగునిన్ = మల్లెపువ్వులవలెను చంద్రునివలెను తెల్లనైన దేహముగలవానిని, పరిధాన = కట్టువస్త్రముచేత, కదంబప్రసూన = కడిమిపువ్వులచేసైన, అంచితగండమండలున్ = ఒప్పిదములైన. గండస్థలములు

వ. మఱియు నాబలభద్రునియుత్సంగంబున నతసీకుసుమవర్ణుండును వనమాలావిరాజితుండును పీతాంబరధరుండును నై శక్రచాపతటిన్మాలికాపరిశోభితంబైన నీలమేఘంబుచందంబున నున్నకృష్ణునిం బొడగాంచి పులకదంతురాంచితశరీరుండై నాసికాగ్రంబున దృష్టి నిలిపి పెద్దయుం బ్రొద్దుచూచి సంశయాద్భుతచిత్తంబున లేచి బహిఃప్రదేశంబునం జూచిన. 365

ఆ. తేరిమీఁద నధికదివ్యతేజోవిలా
సముల నున్న రామచక్రధరులఁ
దెలియఁ జూచి మఱియు సలిలంబులోపల
మునిఁగి కాంచెఁ దొంటిమూర్తి యుగము. 366

చ. కనుఁగొని యద్భుతంబును వికాసము భక్తియుఁ జెంగలింప న
య్యనఘుఁడు యోగదృష్టిఁ బరమార్థమహామహిమాఢ్యులైన యా
ఘనులవికాసమూర్తు లొడికంబుగఁ గన్గొని వారియందు నె
మ్మనమున యందు నొందఁగ నమర్చి కడుం దడ వుండి పెంపుతోన్. 367

వ. మనోమయంబు లైనగంధపుష్పధూపదీపనైవేద్యనమస్కారాద్యుపచారంబులు గావించి కృతార్థుండై జలంబులు వెడలి దామోదరుపాలికివచ్చి గమనంబునకు సంభ్రమించుచున్న యక్రూరునకుఁ జక్రధరుం డిట్లనియె. 368

క. నీవదనంబు వికాసము, శ్రీ వెలయుచు నున్న దిపుడు చెచ్చెర యమునా
పావనజలంబులోపల, భూవినుతవిశేష మేమి పొడగంటివొకో. 369

చ. అనవుడు గాందినీతనయుఁ డమ్మురమర్దనుఁ జూచి నీవెఱుం
గని.పనియేమియున్నది జగన్నుత నన్నుఁ గృతార్థుఁజేయఁగా
మనమునఁ గల్గి యీసలిలమధ్యమునం దటువంటి నీపురా
తన మగుదివ్యమూర్తి విదితంబుగఁ జూపితి వద్భుతంబుగన్. 370

క. నీకరుణ యివ్విధంబున, నేకొఱంతయు లేకయున్న యేను దురాత్ముం
డై కపటవృత్తు లుడుగని, యాకంసునిఁ గొలిచియుండ నర్హుఁడ నైతిన్. 371

ఆ. వలసినట్లు తనకు వర్తింపఁగాఁ జెల్ల, దొడలి సుఖము లాసపడఁగ రాదు
పరులఁ గొలిచి కుడిచి బ్రతికెడువాఁడు జీవన్మృతుండు వాఁడె వారిజాక్ష. 372

---

గలవానిని, వికసిత = వికసించిన, ఇద్ధ = ప్రకాశించునట్టి. 365 ఉత్సంగంబునన్ = ముందటి భాగమునందు, శక్రచాపతటిన్మాలికాపరిశోభితంబు = ఇంద్రధనుస్సుచేతను మెఱుపుచాలు చేతను ప్రకాశించునది, అద్భుత = ఆశ్చర్యముఁనొందిన. 367 చెంగలింపన్ = హెచ్చుగా, ఒడికంబుగన్ = చక్కగా, వారియందున్ = నీళ్లలో. 369 వికాసము = తేటదనము. 370 విదితంబుగన్ = తెలియఁబడునట్లు, అద్భుతంబుగన్ = వింతగా. 372 జీవన్మృతుండు = బ్రతికియుఁ జచ్చిన

వ. అని యిట్లు పలుకుచున్న యతనిచిత్తంబున నున్నఖేదం బుడిపి నారాయణుండు
మన్నించె నిట్లు వారలు రథారూఢులై యచ్చోటుగదలి సాయాహ్నకాలంబు
నకు మధురాపురంబున కరిగి రప్పుడు సీరి చక్రుల కక్రూరుం డిట్లనియె 373
ఆ. అరదమెక్కి మీర లరుగుదెంచినఁ గంసుఁ, డలిగి నన్ను నేమియైనఁబలుకుఁ
గానఁ బాదచారులై నడతెండు మీ, యుపదలెల్లఁ గొనుచు నిపుడు పురికి. 374
వ. మీరు దేవకీవసుదేవులం బొడగనుటకై తదీయనివాసంబునకుఁ బోయిన మీ
మీఁదివిరోధంబున నావృద్ధదంపతుల కద్దురాత్ముం డైనకంసుం డుపద్రవంబు
సేయందలంచుఁ గావున నవ్విధంబు పరిహరించునది యని నిర్దేశించి యామంత్రి
తుండై కంసుపాలికిం జని తనపోయివచ్చినవృత్తాంతంబును రామదామోదరాను
గమనంబునుం జెప్పి నిజనివాసంబునకుం జనియె నంత. 375

శ్రీకృష్ణుండు మధురాపురంబుఁ బ్రవేశించి రజకుని వధించి చలువవలువలు గొనుట.

ఉ. గోపకుమారకుల్ బలసి కొల్వఁగఁ గృష్ణుఁడు సీరపాణితో
నాపురిరాజమార్గమున నంచితమోహనదివ్యమూర్తియై
యేపున మత్తదంతిగతి నేగుచునుండెను భక్తిసంభ్రమ
స్థాపితచిత్తులై నిలిచి సర్వజనంబులుఁ జేరి చూడఁగన్. 376
క. చనుదెంచుచున్న సమయం, బున నొకరజకుండు మడుఁగుపుట్టంబులు కం
సునినగరికిఁ గొనిపోవఁగఁ, గనుఁగొని వస్త్రములు దనకుఁ గట్టఁగ నడిగెన్. 377
క. నీచగుణవర్తి గావున, నాచాకి వివేకహీనుఁడై మురవైరిన్
జూచి నిరసించి మదమున, నేచినదుర్వాక్యసరణి నిట్లని పలికెన్. 378
మ. విను మాయేలికకంసుఁ డీవచనముల్ విన్నన్ నినున్ బ్రాణముల్
గొను గోపాల మదించి గోధనములన్ గోల్పోయెదో పోయెదో
యనుచుం బల్కినశౌరి కోపహృదయుండై తచ్ఛిరం బుద్ధతిన్
దునియంగొట్టెఁ బతాకహస్తనిహతిన్ దోరంబు లీలాగతిన్. 379
తే. సీరపాణికి నందులో జిలుఁగువన్నె, పట్టుపచ్చడ మొక్కటి గట్టనిచ్చి
పసిఁడి చెఱఁగులపచ్చనిపచ్చడంబు, తాను ధరియించెఁ గృష్ణుఁ డుద్దండమునను.
వ. తక్కిన వస్త్రంబు లన్నియు వల్లవకుమారుల కొసంగి పుష్పలావికగృహంబున
కుంబోయి తమకు ముడువందగిన సురభికుసుమనికరంబు లడిగిన వాఁడు భయ

---

వాఁడు. 373 ఖేదంబు = విచారమును. 374 నడతెండు = రండు, ఉపదలు = కానుకలు.
375 పరిహరించునది=మానుకోవలసినది, నిర్దేశించి=చెప్పి, ఆమంత్రితుండు = సెలవుపొందినవాఁడు.
376 బలసి = చుట్టుకొని, ఏపునన్ = విజృంభణముతో, మత్తదంతిగతిన్ = మదపుటేనుఁగువలె.
377 రజకుండు = చాకలవాఁడు, మడుఁగు పుట్టంబులు = చలువవస్త్రములు. 378 నిరసించి = తిరస్కరించి, ఏచిన=మీరిన - తనయధికారమునకు మించినయనుట. 379 ఏలిక = ఏలినవాఁడు - రాజు, ప్రాణముల్ గొనున్ = చంపును. 380 జిలుఁగువన్నె = చిత్రవర్ణముగల, ఉద్దండమునన్ = ఉద్ధతితో. 381 పుష్పలావిక = పువ్వులవానియొక్క, సురభి = పరిమళముగల, మోఁకరించి =

భక్తితాత్పర్యంబులతోడ మోఁకరించి కరంబులు నేలనూఁది నమస్కరించి పరిమళ
మిళితంబులైనపూవుదండ లొసంగి వారిజాక్షున కిట్లనియె. 381

శా. దేవా దేవరవంటివారు కరుణాదృష్టిన్ ననున్ బుణ్యనిన్
గావింపంగఁ దలంచి పుష్పములకుం గామించి యేతెంచి నా
రీవేళన్ మిముఁ బూజసేయఁ గలిగెన్ హేలావినోదాత్మ నా
సేవల్ గైకొనుమంచు మ్రొక్కినఁ గృపాచిత్తంబునన్ గృష్ణుఁడున్. 382

క. అతనికిఁ గులాభివృద్ధియు, నతులితమోక్షంబుఁ గలుగునట్టివరంబుల్
ధృతి నొసఁగి శౌరి యామంత్రితుఁడై పురవీథి నరుగు దేరఁగ నెదురన్. 383

శ్రీకృష్ణుండు తనకు పరిమళగంధం బొసంగిన కుబ్జను సుందరాంగిగాఁ జేయుట.

ఉ. దేవకిపట్టి గాంచెను ధృతిన్ మృగనాభియు హైమవారియున్
గోవజవాదియుం బునుఁగుఁ గుంకుమపంకముఁ గప్పురంబుఁ గ్రొ
త్తావులు పిక్కటిల్లఁగఁ గదంబముగూర్చినచందనంబు హే
లావిధిఁ జంద్రకాంతపుశిలామయపాత్రికఁ దెచ్చుజవ్వనిన్. 384

వ. ఒక్కకుబ్జకాంతం గనుంగొని చందనం బడుగుటయు నయ్యిందువదన ముకుందుని
సౌందర్యంబు మెచ్చుచు నిట్లనియె. 385

సీ. నిత్యకృత్యంబుగ నేరుపుతో నేను దిగిచినగంధంబు మృగమదంబు
మొదలుగాఁ బరిమళంబులు కదంబముగూర్చి సూడిదగాఁగఁ గంసునికినిచ్చి
కడలేనిమన్ననల్ గైకొనుచున్న నీ విట్లుంగవా కాని యెల్లవారు
వినియుండుదురు మీరు వేడుకపడియున్న నీకానివస్తువు లేమిగలవు
ఆ. నాకు మిమ్మువంటిలోకోత్తరుల కియ్యఁ గలిగె నింతకంటె ఘనతగలదె
యనుచుఁ గోరలోనిఘనసారగంధంబు, వలసినట్ల యొసఁగె వారలకును. 386

క. తనువున నెఱపూఁతలుగా, నొనరఁగ గంధంబుఁ బూయుచుండి వినోదం
బున సల్లాపములాడుచు, వనజాక్షుఁడు కుబ్జకాంతవరచిబుకంబున్. 387

తే. తనకరాంగుళములఁబట్టి దానిపాద
యుగముపై నిజచరణంబు లొనరఁబెట్టి
నిక్కఁ దిగిచి విక్షేపణ మక్కజముగఁ
జేయుటయు మోహనాకృతిఁ జెలఁగెఁ దరుణి. 388

---

మోఁకాళ్లు నేల మోపనిలిచి, ఊఁది = ఊని. 382 కామించి = కోరి, హేలావినోదాత్మ =లీలచే కాలముగడుపుటయందు మనసుగలవాఁడా. 384 మృగనాభి = కస్తూరి. హైమవారి = పన్నీరు, గోవ = మనోజ్ఞమైన, క్రొత్తావులు = అపూర్వవాసనలు, కదంబము = నానావిధపరిమళము, హేలావిధిన్ = విలాసముగా, పాత్రికన్ = గిన్నెయందు. 385 కుబ్జకాంతన్ = మఱుగుజ్జుదానిని. 386 తిగిచిన = తీసిన, మృగమదంబు = కస్తురి, సూడిద = కానుక. 387 సల్లాపములు = ముచ్చటలు, చిబుకంబున్ = గడ్డమును, 388 విక్షేపణము = ఎగయనెత్తుట.

ఆ. కృష్ణుకొంగుఁ గేలఁ గీలించి నేఁడు మా,యింట విడిచి చేసి యేగుఁ డెల్లి
యనిన నేఁడు దీర దరుగుము నీవంచుఁ, బలికి మాధవుండు బలుఁడుఁ దాను. 389

వ. ఒండొరు చేతులు వ్రేసి పెద్దయెలుంగున నవ్వుచుం జని రాజద్వారంబున నున్న ధను శ్శాలలోపలి కరిగి యచ్చట గంధపుష్పంబుల నలంకృతంబైన కంసుని ధనువుఁ గనుంగొని యమ్మహోత్సవంబుఁ జూచువారిచేత ధనుర్మహత్త్వంబు విని. 390

శ్రీకృష్ణుండు కంసుని ధనుర్యాగార్థ మలంకరింపఁబడినవిల్లు విఱుచుట.

క. శ్రీపతి యాచాపము గొని, మోపెట్టి చెలంగ మౌర్వి మ్రోయించుచు
నాటోపంబు మెఱయఁగాఁ దెగ, వాపినల స్తకము పటురయంబున విఱిగెన్. 391

తే. ఆయుధాగారరక్షకు లైనవారు
కలహ మొనరింపఁ దమమీఁదఁ గడఁగుటయును
వారినందఱఁ దెగటార్చి ఘోరసింహ
నాద మొనరించెఁ బౌరజనములు పొగడ. 392

తే. అపుడు హతశేషు లగువార లరిగి కంసు, గాంచి యారామకృష్ణులు గబ్బితనము
తోడ నరుదెంచి చేసిన దుండగములు, విన్నవించినఁ బటుకోపవివశుఁ డగుచు. 393

ఉ. భూరినియుద్ధకౌశలము పొంపిరివోయి వెలుంగుచున్న చా
ణూరుని ముష్టికుం బిలిచి నూతనవస్తువు లిచ్చి నామదిన్
వైరము రేఁచుచున్న బలవంతుల నాబలభద్రకృష్ణులన్
మీరు వధింపుఁ డెల్లి కడుమీరిన మీభుజదర్ప మేర్పడన్. 394

ఉ. ఏపున దొమ్మినైన మఱియొక్కటి పోరుననైన వైరులన్
రూపఱఁ జేసి నాహృదయరోగము మాన్పుఁడు మీరు నేఁడు నా
కీపగదీఱఁ జేసితిర యేని మదీయవిభూతి కెల్ల మీ
ప్రాపులు కాపులై నిలుచు బ్రహ్మకునైనఁ జలింపకుండుడున్. 395

క. ఎల్లి ప్రభాతంబున మీ, మల్లురతోఁ గూడి రంగమధ్యంబున మీ
రెల్లవిధంబులఁ జంపుఁడు, గొల్లపడుచులను నియుద్ధకుశలత మెఱయన్. 396

వ. మఱియుఁ గువలయాపీడం బనుగంధసింధురంబు మావంతునిచేతఁ బ్రచోదితంబయి రంగద్వారంబున నిలిచి బలభద్రకృష్ణులు వచ్చినప్పుడె వధియింపంగల యది సమస్తసైన్యంబులు కట్టాయితంబయి బలసి నగరివాకిటికి వచ్చునది యని నియమించి

391 మోపెట్టి = ఎక్కుపెట్టి, మౌర్వి=అల్లెత్రాడు. 392 తెగటార్చి = చంపి. 393 హతశేషులు= చావఁగా మిగిలినవారు, గబ్బితనము = గాంభీర్యము. 394 నియుద్ధకౌశలము = బాహుయుద్ధము నందలి నేర్పు, పొంపిరివోయి = అతిశయించి, రేఁచు = పెంచు. 395 దొమ్మినైనన్ = గుంపుగాఁ బోయి ఆక్రమించునట్టియుద్ధమునందైనను, ఎక్కటి = ఒంటరి, రూపఱన్ = నశింప, ప్రాపులు = తోడుపాటులు. 396 గొల్లపడుచులన్ = గొల్లపిల్లకాయలను. 397 గంధసింధురము = మదపుటేనుఁగు, కట్టాయితంబు = మిక్కిలి సిద్ధపడినది, శుద్ధాంతమందిరంబునన్ = అంతఃపురమునందు.

కృష్ణునితో వైరానుబంధంబునసైన కోపంబు ప్రేరేప శుద్ధాంతమందిరంబునకుం
జని యుచితమార్గంబుననుండి మఱునాఁడు ప్రభాతసమయంబున. 397

## శ్రీకృష్ణబలభద్రులు కువలయాపీడం బనుగజంబును చాణూరముష్టికులను మల్లులను జంపుట.

ఉ తమ్ములు బంధుమిత్త్రులును దాను నమాత్యచయంబు రాజలో
కమ్మును బౌరులుం గొలువఁ గంసుఁడు రంగసమీపతుంగమం
చమ్మున నెక్కి యుండెను విశాలసమున్నతభర్మరమ్యహా
ర్మ్యమ్ములనుండి చూడఁగఁ బురాంగనలుం మఱి రాజపత్నులున్. 398

వ. మఱియు వసుదేవాక్రూరాదియాదవులును నందాదిగోపకులును మొదలుగా సమస్త జనంబులును నయ్యైప్రదేశంబులఁ జూచుచుండిరి. మల్లయుద్ధసన్నద్ధులై చాణూర ముష్టికాదివీరులు మల్లప్రాశ్నికులతోడ రంగమధ్యంబు ప్రవేశించిరి. కువలయా పీడగజేంద్రంబుతోడ మావంతుండు వచ్చి రంగద్వారంబున నోలసియుండె. సమస్తసైన్యంబులును జతురంగసమేతంబుగాఁ గట్టాయితంబయియుండె. అప్పుడు రాజానుమతంబున బలసి బలభద్రదామోదరులు గోపాలకుమారులతోఁ గూడ వచ్చి రంత. 399

సీ. కంసచాణూరాదికపటాయితశ్రేణి కలఁగుచు మృత్యువుగాఁ దలంప
సురపథంబుననుండి చూచి వియచ్చరౌఘము పరదైవముగాఁ దలంపఁ
గృతకృత్యు లగు దేవకీవసుదేవులు గరువంపుఁబుత్త్రుఁడుగాఁ దలంప
గోపాంగనాజనకోటి మోహనరూపకందర్పనిభమూర్తిగాఁ దలంపఁ
తే గోరి యాభీరదారకకోటి తమ్ముఁ
గలసి యాడెడుచెలికానిఁగాఁ దలంప
భూమిభారావతరణుఁడై భుజగనాథ
శయనుఁ డరుదెంచె బలభద్రసహితుఁ డగుచు. 400

వ. అప్పుడు. 401

ఉ. ఏపున రామకేశవుల నెక్కటి మారొకని బాహుశౌర్యముల్
చూపెడుమల్లు రెవ్వ రనుచుం జనులెల్లఁ దలంచుచుండఁగాఁ
బాపవిచారులై యచటిప్రాశ్నికవర్గము కంసుచే నను
జ్ఞాపరులై సమస్తజనసంఘములుం వెఱఁగందిచూడఁగన్. 402

క. నారాయణుతోడను జాణూరుఁడు మఱి రోహిణీతనూజునితో దు
ర్వారబలుఁ డైనముష్టిక, వీరుఁడు యుద్ధంబు సేయ విభజించుటయున్. 403

వ. అచ్చటి పెద్ద లయ్యుద్ధులంజూచి. 404

---

398 భర్మహార్మ్యమ్ములనుండి = బంగారుమేడలలోనుండి. 399 ప్రాశ్నికులతోడం = సభికులతో, కలిసి = కూడి. ఆభీరదారకకోటి = గొల్లపిల్లకాయలగుంపు.

ఉ. భూరినియుద్ధచాతురిని బ్రోడలుచూడఁగ ముష్టికుండుఁ జా
ణూరుఁడు వీరితో యదుతనూభవు లెంతయుఁ బిన్నబిడ్డలే
పోరెడువారలంచుఁ దలపోయుచు నుండిరి యొక్క మ్రోఁతగా
నారభసంబు కంసుహృదయంబునకుం బగయయ్యె నత్తఱిన్. 405

క. మావంతునిచేఁ బ్రేరిత,మై వెసఁ బఱతెంచి కువలయాపీడగజం
బావసుదేవతనూజుల, పై వెసఁగవియుటయు వారు పటుకోపమునన్. 406

ఉ. పొంగుచు నైపుణంబులును భూరిబలంబులు నివ్వటిల్ల మా
తంగవిషాణముల్ పెఱికి తత్క్షణమాత్రన దానిఁ జంపి ప్రో
త్తుంగతదీయదంతములు దోల నమర్చినఁ జూడ నొప్పి రా
చెంగటఁ గాలదండములు చేకొనియున్న యమద్వయం బనన్. 407

వ ఇట్లు విజృంభించి రంగమధ్యంబున నిలిచి చాణూరముష్టికులతోడం దలపడి భద్రమూర్తులైన కృష్ణబలభద్రులు పెద్దయుం బ్రొద్దు పోరి రప్పు డన్యోన్య భుజాస్ఫాలనధ్వానంబులును సముద్దండసింహనాదంబులును సకలసామాజికానేక కలకలంబులును భేరీమృదంగతూర్యాదివాద్యఘోషంబులును వియచ్చరజయ జయశబ్దంబులును దివ్యదుందుభినినాదంబులును మేదురంబయి రోదసీకుహరంబు నిండె నప్పుడు. 408

మ. హరి చాణూరునితో నియుద్ధకుశలుండై పెద్దయుంబ్రొద్దు భీ
కరవృత్తిన్ సరిపోరుచున్న సుర లాకాశంబునన్ నిల్చి యా
దురితాత్మున్ వధియించి కంసునసువుల్ త్రుంగించవే వేగనం
చు రణోద్యుక్తునిఁజేసిరన్ నగుచు యాశోదేయుఁ డుగ్రాకృతిన్. 409

మ. చతురుండై కడకాలు బిట్టొడిసి యాచాణూరునిన్ బల్విడిన్
శతవారంబులు ద్రిప్పెఁ గర్ణముఖనాసాగర్తలన్ ఘోరశో
ణితముల్ గాఱఁగ నంగముల్ దునిసి క్షోణీమండలిన్ రాల దై
వతలోకంబు నభంబునన్ నిలిచి కైవారంబు గావింపఁగన్. 410

క. హరి చాణూరునిఁ జంపిన, కరణిన్ హలపాణి ముష్టికనిశాచరునిన్
బరిమార్చి వారల కళే,బరయుగమీడ్చుచును రంగభాగమునందున్. 411

వ. తమతోడిగోపబాలురనెల్లను బలాత్కారంబునం జేతులుపట్టి రంగస్థలంబునకుం దిగిచి వారలుందామును నుగ్రసేననందనుకర్ణంబులకసహ్యంబులునేయుచు బేరెంబులు పాఱుచుండి రప్పుడు కంసుండు కోపరక్తలోచనుండై తనయమాత్యులం బిలిచి యిట్లనియె. 412

405 రభసంబు = సందడి. 407 నైపుణంబులు = నేర్పులు, విషాణములు = కొమ్ములు, దోలన్ = చేతులయందు, చెంగటన్ = సమీపమునందు. 408 వియచ్చర = దేవతలవలని. 409 త్రుంగించవే = చంపవయ్యా, యాశోదేయుఁడు = యశోదకొడుకైన కృష్ణుఁడు. 410 శతవారంబులు = నూఱుమార్లు, గర్తలన్ = రంధ్రములనుండి, కైవారంబు = స్తోత్రము. 411 కరణిన్ = విధమున.

సీ. వసుదేవుఁ దేవకీవనితనుఁ జెఱసాల నునుపుఁడు మాతండ్రి నుగ్రసేనుఁ
దలనఱకుఁడు నందుఁ దక్కినగోపులనెల్లను సంకెళ్లనిడి తదీయ
గోధనంబులనెల్లఁ గొల్లలాడుఁడు యదువృష్ణిభోజాంధకవీరవరులఁ
గొట్టులనిడుఁడు గ్రక్కున నేను బలభద్రకృష్ణులఁ బోనీక గీటణంతు
తే. ననుచు సంభ్రమించి ఘనవాద్యరవములు, మొరయకుండఁజేసి కరితురంగ
రథపదాతిచయము రావించుచున్న యా, కన్నెఱింగి కోపకలితుఁ డగుచు. 413

## శ్రీకృష్ణుండు కంసుని సంహరించుట.

మ. లలిమీఱన్ హరి కంసుమంచమునకున్ లంఘించి యమ్మేటియు
జ్జ్వలమాణిక్యకిరీటముర్వరపయిన్ జాఱన్ శిరోజాతముల్
బలిమింబట్టి వెసన్ బడందిగిచి లీలన్ వక్షమున్ మస్తమున్
నలియంబెట్టుగఁ గుప్పిగంతుగొని విన్నాణంబు గావించినన్. 414
వ. ఇట్లు విచిత్రంబుగా సకలలోకవిధ్వంసుండైనకంసుండు ప్రాణపరిత్యాగంబుచేసె
నప్పుడు. 415
క. కురిసెన్ బువ్వులవానలు, మొరసెన్ సురదుందుభులు సముజ్జ్వలమహిమన్
బెరసెన్ గంధర్వనుతుల్, సరసన్ వినువీదియందు సంభ్రమములతోన్. 416
క. అవలీలను బలభద్రుఁడు, బవరంబునఁ గంసునను జుఁ బరిమార్చినయా
దవవరులును నందాదులు, నవిరళసంతోషహృదయులైరి మునీంద్రా. 417
ఆ. అంత రామకృష్ణు లవ్వసుదేవదే, వకులకడకు వచ్చి వారిపాద
పంకజాతములకుఁ బ్రణమిల్లుటయు వేడ్కఁ, గౌఁగిలించి హర్షకలితు లగుచు.418
వ. కరంబులు మొగిచి నిలిచి యిట్లనిరి 419
సీ. అనిమిషాసురకోట్లకైన నసాధ్యంబులైనయంతేసికార్యములు మీరు
చిఱుతప్రాయంబునఁ జేయుట లెంతయు నద్భుతంబులు పుట్టినట్టి మీరు
పరమపూరుషు లబ్జభవముఖ్యులకుఁ దండ్రియగువాసుదేవునియపరమూర్తు
లగుమిమ్ముఁ బుత్రకు లనుచు మోహావేశమతులఁ జెందితిమి మీమాయవలన
తే. నిట్టి మాయపరాధంబు లెల్ల మఱచి
కరుణమెఱయ రక్షింతురు గాక యనుచుఁ
బరమవిజ్ఞానచిత్తులై భక్తినున్న
తల్లి దండ్రులఁ జూచి యాధన్యమతులు. 420
వ. పెద్దయుం బ్రొద్దు గొనియాడి రప్పుడు కృష్ణుండు కృతాంజలియై మీరిట్లు పలు
కుట కర్తవ్యంబుగాదు మాయందుఁ బుత్రస్నేహంబు వాటించి గారవింతురు
గాక యనుచు వారివివేకంబు గప్పునట్లుగాఁ దనమాయాయవనికచేత నాచ్ఛా

---

413 కన్న=జాడ. 414 శిరోజాతములు = తలవెండ్రుకలు, మస్తమున్=తలయును. 415 విధ్వంసుఁడు = చెఱుచువాఁడు. 416 బెరసెన్=వ్యాపించెను, సరసన్=సమీపమునందు. 421 కర్తవ్యంబు=

దించి బంధుమిత్రపౌరజనంబుల నయ్యైతెఱంగుల సంభావించె నప్పుడు. 421

సీ. కంసు నంతఃపురకాంత లెంతయు దుఃఖపరవశలై వచ్చి ప్రాణవల్ల
భునికళేబరముపైఁ బొరిఁబొరిఁబడి శోకముల ముఖంబులు నురములును మోదు
కొనుచుఁ బెద్దయుఁ బ్రొద్దు ఘనవిలాపంబులు గావించుచుండఁగఁ గమలనయనుఁ
డతికృపామూర్తియై యశ్రుధారాపూరితాయతలోచనుం డగుచు వచ్చి

ఆ. యేడ్పు లుడిపి వారినెల్ల నయ్యైవిధంబులను గారవించి పుచ్చి బంధు
మిత్రసచివులెల్ల మెచ్చ జగంబెల్ల, నభినుతింప నుచితమగువిధమున. 422

ఆ. మును యయాతిశాపమున యదువంశంబు, వారలకును రాజ్యవైభవములు
చేకొనంగఁ దగవుచెల్లక యుండుట, దలఁచి తదభిలాష తనకులేక. 423

ఉగ్రసేనుండు యాదవరాజ్యమందు పట్టాభిషిక్తుఁ డగుట.

వ. కారాగృహంబున నిగళబద్ధుండై యున్నయుగ్రసేనుని విడిపించి తదీయరాజ్యంబున కభిషిక్తునిం జేసి యతనిచేతఁ గంసునికిఁ బరలోకక్రియలు సేయించి యత్యంత కృపాతరంగితలోచనుండై యతని సింహాసనాసీనుం జేసి సమస్తరాజలోకంబును గనిపించి యిట్లనియె. 424

ఉ. ఈయదువృష్ణిపుంగవులు నేనును రాముఁడు నెల్లవారలున్
బాయక నిన్నుఁ గొల్చి నిరపాయత నుండెద మింక నెన్నఁడున్
మాఱయెడ శంకయున్ భయము మాని పనుల్ గొనుఁ డీజగంబు ని
త్యాయతబాహుశౌర్యగతమై విలసిల్లుచు నుండఁ జేసెదన్. 425

ఆ. అనుచు నుగ్రసేను ననునయోక్తులచేతఁ
దేర్చి యపుడు వాయుదేవుఁ బిలిచి
నిర్జరేంద్రుకడకు నీవు నాపనుపున
నరిగి యమ్మహాత్ము నర్థి గాంచి. 426

ఆ. యాదవులకుఁ గర్త యగునుగ్రసేనుని, కమరసభ సుధర్మ యడిగితెమ్ము
నావుడును నతండు దేవేంద్రు నడిగి సు, ధర్మఁ దెచ్చె నవనితలమునకును. 427

క. అమ్మహనీయసభామ,ధ్యమ్మున యాదవులు గొలువ హరి ప్రాపునలో
కమ్మలర నుగ్రసేనుం, డమ్మధురానగర మేలె నతులవిభూతిన్. 428

క. అనవుడు మైత్రేయుం డి,ట్లను మునివర లోకవంద్యుఁ డైనయశోదా
తనయుని శైశవశుభవ,ర్తనములు విన మిగుల నద్భుతము మది గొదవెన్. 429

తే. అమ్మహాత్ముఁడు తరువాత హాలధరుండు
దాను నేమేమిచేసిరి తత్కథాక్ర
మములు విశదంబుగా నను క్రమముతోడఁ
జెప్పి నన్నుఁ గృతార్థునిఁ జేయుమనిన. 430

---

యుక్తము, యవనికచేతన్ = తెరచేత, ఆచ్ఛాదించి = కప్పి. 422 అశ్రు = కన్నీళ్లయొక్క-

చ. శరనిధిమేఖలాఖిలరసావలయప్రచురప్రతాపభా
స్కర చతురప్రబంధకవికల్పితకావ్యరసజ్ఞతాధురం
ధర జగరక్షపాలబిరుదప్రకటీకృతభూమిభృత్సభాం
తర జగనబ్బగండ వనితాజనమోహనపుష్పసాయకా. 431

క. లలితకృపారసనేత్రా, త్ఫలవిష్ణుపురాణసంహితశ్రవణకుతూ
హలచదలువాడ రాఘువ,విలసత్కారుణ్యలబ్ధవిగతస్తబ్ధా. 432

లయగ్రాహి. శ్రీరమణపాదసరసీరుహమదభ్రమర వారిధిగభీర చటులారిబలదుష్కాం
తారపవమానహిత మేరునగధైర్య ఘనసారశరదభ్రబలవైరిగజవాణీ
పారదమరాళనిభచారుతరకీర్తియుత సూరినుత పంటకులనీరనిధిరాకా
కైరవహితప్రతిమ ధీర బసవప్రభుకుమార రిపుభంజనకుమార సుకుమారా. 433

గద్యము. ఇది శ్రీమదమరనామాత్యపుత్ర హారితసగోత్రపవిత్ర సుకవిజనవిధేయ వెన్నెలకంటి సూరయనామధేయప్రణీతం బైన యాదిమహాపురాణం బగు బ్రహ్మాండంబునందలి పరాశరసంహిత యైన శ్రీవిష్ణుపురాణంబునందుఁ గంసుఁ డశరీరవాణి పలుకుల కులికి దేవకీవసుదేవులఁ గారాగృహంబున నునుచుటయు భూమిదేవి దేవతలతోడం జని వైకుంఠంబున విష్ణుదేవునకుఁ దనభారదుఃఖంబు చెప్పుటయు రామకృష్ణులజన్మంబును పూతనవధయును శకటపరివర్తనంబును యమళార్జున పాతంబును బృందావనగమనంబును కాళియాహిమర్దనంబును ధేనుకాసురవధయును ప్రలంబనిధనంబును గోవర్ధనధారణంబును రాసక్రీడావిహారంబును కేశి దనుజవినాశంబును అక్రూరుండు రామకృష్ణులమధురానగరంబునకుఁ దోడుకొని పోవుటయును కంసుమరణంబును ఉగ్రసేనుని యాదవరాజ్యంబునకుఁ బట్టంబు గట్టుటయు నన్నది సప్తమాశ్వాసము.

---

పూరిత = నిండింపఁబడిన. 431 శరనిధిమేఖలాఖిలరసావలయ = సముద్రము మొలనూలుగాఁ గల సకలభూమండలమునందు. 433 పవమానహిత = అగ్నిదేవుఁడా, ఘనసార=కర్పూరముతోడను, బలవైరిగజ = ఐరావతముతోడను, పారద = పాదరసముతోడను, మరాళ = హంసతోడను, నిభ = సమానమైన, రాకాకైరవహితప్రతిమ = పున్నమనాటి చంద్రునిబోలిన.



శ్రీ ర స్తు.

# శ్రీ వి ష్ణు పు రా ణ ము

## అ ష్ట మా శ్వా స ము.

---



మహిత యాశ్రితామర
భూమీరుహ పంటవంశభూషణ సుగుణ
స్తోమ పటుప్రాభవజిత
రామభగీరథదిలీప రాఘవభూపా. 1

వ. సకలపురాణవిద్యాధురంధరుం డైనపరాశరుండు మైత్రేయున కిట్లనియె నట్లుగ్ర
సేనుని యాదవరాజ్యంబునకుఁ బట్టంబుగట్టి యతనిచేత ననేకయజ్ఞంబులు సేయిం
చుచు నెదురులేనివిభవంబుతో నుండి. 2

శ్రీకృష్ణబలరాములు సాందీపునియొద్ద విద్యాభ్యాసంబుసేసి సాందీపునికి
మృతపుత్రుని బ్రదికించి యిచ్చుట.

ఆ. ముసలచక్రధరులు ముద మొప్ప విద్యార్థు, లై యవంతిపురికి నరిగి వేద
శాస్త్రనిరతుఁ డైనసాందీపుని న్నిజా, చార్యుఁగా వరించి సరసమతుల. 3

క. అఱువదినాలుగువిద్యలు, నఱువదినాలుగుదినంబులందుఁ గ్రమముతో
నెఱిఁగిన సాందీపుఁడు కడు, వెఱఁగుపడి తదీయమతి వివేకంబులకున్. 4

తే. అద్భుతమనస్కుఁడై యున్నయట్టి గురునిఁ
జూచి మీ కెద్ది యిష్టంబు సుజనవినుత
తత్ప్రయోజనములు గురుదక్షిణలుగఁ
జేసెదము చెప్పుమనుటయుఁ జెలఁగి యతఁడు. 5

తే. ఈలవణసాగరముపొంత నీప్రభాస
మనుమహాతీర్థమున మృతుఁడయ్యె నాసు
తుండు కడుబాలుఁ డాసుతుఁ దోడితెచ్చి
నాకుఁ గృపసేయవలయు మన్ననల ననిన. 6

ఉ. బోరన నస్త్రశస్త్రములు పూని రయంబున నేగుఁదేరఁగా

---

1 అమరభూమీరుహ = కల్పవృక్షమా. 3 ముసలచక్రధరులు = బలరామకృష్ణులు.
5 అద్భుతమనస్కుఁడు = ఆశ్చర్యము నొందినమనసు గలవాఁడు, చెలఁగి = సంతోషించి.
6 పొంతన్ = సమీపమున, మన్ననలన్ = గౌరవములతో. 7 బోరనన్ = తటాలున.

వారిధి భీతినొంది యదువర్యులఁ గాంచి ధరామరాత్మజుఁ
దారుణశంఖరూపమున దైత్యుఁడు పంచజనాభిధానుఁ డీ
నీరుననుండి చంపె నని నిక్కముగా నెఱిఁగించిపోయినన్. 7

క. శరనిధి చొచ్చి ముకుందుఁడు, సరభసగతి నరిగి పంచజనరాక్షసునిన్
బరిమార్చి తదస్థి భయం,కరనాదముతోడ మెఱయఁగాఁ జేయుటయున్. 8

క. ఆనాదము దానవులకు, హానియు నాదిత్యవరుల కభివృద్ధియునై
మానుగ నయ్యదువర్యుఁడు, తా నరిగి రణమున దండధరు నోర్చి వెసన్. 9

తే. యాతనాగతుఁడై నరకాంతరమునఁ, బూర్వదేహంబుతో నున్న భూసురేంద్ర
బాలకునిఁ దెచ్చి గురుని కర్పణముచేసి, యెలమితో మధురాపురి కేగుదెంచె. 10

జరాసంధుండు పదునెనిమిదిమాఱులు మధురాపురముపై దండెత్తివచ్చి యోడిపోవుట.

వ. అంత జరాసంధుండు కంసుభార్య లయినయస్తిప్రాప్తులు తనదుహితలగుటంజేసి పుత్త్రికారత్నంబుల వైధవ్యంబు మనంబు నెరియించినఁ గృష్ణుతోడివిరోధంబున బలిప్రముఖం బ[illegible]న మాగధబలంబులో నిరువదిమూఁడక్షౌహిణులతోడ మధురాపురంబుపై విడిసిన నల్పపరివారంబుతోడఁ బురంబువెడలి రామదామోదరులు ప్రతిబలంబుతో మహాఘోరయుద్ధంబుసేయ సమకట్టుచున్న నమరపథంబున నుండి. 11

తే. దారుణాక్షయబాణతూణీరములును
శార్ఙ్గధనువును గదయును సన్నిధాన
మైన హరిపూనె ముసలంబు హలము నింగి
నుండివచ్చిన బలభద్రుఁ డూనరఁ దాల్చె. 12

తే. ఇట్లు దివ్యాస్త్రములు పూని యేపు మిగిలి
యాజరాసంధుతోడ మహారణంబు
చేసి దర్పించి కడుఁబరాజితునిఁజేయు
టయును నతఁ డోడిపాఱె మహాభయమున. 13

వ. ఇవ్విధంబున నతండు యాదవుతోడ బద్ధవైరుండై పదునెనిమిదిమాఱు లెత్తివచ్చి సంగ్రామంబుచేసి రామకృష్ణులచేత నోటువడి పోయె నంత. 14

8 శరనిధి=సముద్రము, తదస్థి=వానియెముక. 9 ఆదిత్యవరులకున్=దేవతాశ్రేష్ఠులకు, మానుగన్=ఒప్పిదముగా, ఓర్చి = ఓడించి-గెలిచి, వెసన్ = శీఘ్రముగా. 10 యాతనాగతుఁడు = తీవ్రవేదనను పొందినవాఁడు, ఎలమితోన్ = క్షేమముతో. 11 వైధవ్యంబు = విధవాత్వము, ఎరియించినన్ = సంతాపము నొందఁజేయఁగా, అమరపథంబు = ఆకాశము. 12 దారుణ = భయంకరములైన, తూణీరములు = అమ్ములపొదులు, నింగి = ఆకాశము. 13 ఏపు = విజృంభణము, దర్పించి = గర్వించి, పరాజితునిఁజేయన్ = ఓడఁగొట్టగా. 14 ఎత్తి = దండెత్తి, ఓటువడి = అపజయము

ద్వారకానిర్మాణ కాలయవనవధ ముచికుందానుగ్రహాదివివరణము.

సీ. కల్పాంతకాలభీకరమూర్తి యగుకాలయవనుండు నానొక్కయవనవిభుఁడు
నారదమునిచేతఁ బ్రేరితుండై మ్లేచ్ఛకోటిసహస్రంబు గొలువ మధుర
పై దండువెడలి యుద్భటశక్తి నేతెంచుచుండుటఁ దెలిసి దామోదరుండు
చటులశౌర్యుఁడు జరాసంధునిపగమీఁద నిదియుఁ బాటిల్లె నింకెట్టులొక్క
తే. వచ్చు నేరికి సాధింపవశముగాని, దుర్గ మొక్కటి గావింతు దుష్టశాత్ర
వుల కజేయంబుగాను నజ్జలధిలోన, ననుచుఁ దలపోసి యాలవణాబ్ధియందు. 15
వ. ద్వాదశయోజనవిశాలంబై ప్రాకారవప్రమహోద్యానతటాకానేకసుందర మంది
రం బగుచు నమరావతికంటె రమ్యంబుగా ద్వారకాపురంబు నిర్మించి మధురా
పురంబున నున్నసమస్తజనంబుల నందునుండ నియమించి చతురంగసమేతంబుగా
దుర్గరక్షసేయ బలభద్రునిం జాలించియుండె నంత. 16
ఆ. కాలయవనుఁ డపుడు ఘనసైన్యములతోడ
మధురమీఁద విడిసి మలయుటయును
వాని నుపమచేత వధియింపఁగాఁ దగు
ననుచుఁ దలఁచి కృష్ణుఁ డాక్షణంబ. 17
తే. ఒగి నిరాయుధహస్తుఁడై యొక్కరుండు, కాలయవనునికడ కేగి గబ్బితనము
వెలయఁ దనపేరు చెప్పి గర్వించి తన్నుఁ, దఱిమి పట్టంగ నోపినఁ దగిలి రమ్ము. 18
చ అనుటయుఁ గోపదీప్తహృదయంబున నానృపుఁ డమ్మురాంతకుఁ
వెనుకొని పాఱుచుండ యదువీరవరుం డెలయించుకొంచుఁ జ
య్యన నొకశైలగహ్వరమునందుఁ బ్రవేశముజేసెఁ జేసినఁ
గనుఁగొని వాఁడు నాబిలము గ్రక్కునఁ జొచ్చి చనంగ నచ్చటన్. 19
వ. తొల్లి దేవాసురయుద్ధంబున నింద్రునకు సహాయంబై రాక్షసులఁ బెక్కండ్రంజంపి
సంగరపరిశ్రాంతుండై దేవతలవలనఁ బెద్దగాలంబు సుఖనిద్రఁ జెందునట్లును బలా
త్కారంబునఁ దన్ను మేలుకొలిపినవారు తనయుగ్రదృష్టివలన భస్మం బగు
నట్లుంగా వరంబుగొని తదీయగిరికందరంబున విశాలవేదికాతలంబున ముసుంగు
వెట్టుకొని నిద్రించుచున్న ముచికుందుం గనుంగొని కృష్ణుండని నిశ్చయించి
వామపాదంబునం దన్నుటయును. 20

టీక. 15 కల్పాంతకాలభీకరమూర్తి = ప్రళయకాలమునందలియమునివలె భయంకరమైన ఆకృతి గలవాఁడు, యవనవిభుఁడు = అరబ్బీదొర, ఉద్భటశక్తిన్ = అణఁపరాని బలిమితో, దుర్గము = పర్వతములు (లేక) నీళ్లు ఆవరించియుండుటచే చొరశక్యముగాని పట్టణము. 16 వప్ర = కోట కొఱడు, చాలించి=నిలిపి. 17 మలయుటయున్ = ముట్టడింపఁగా, ఉపమచేతన్ = ఉపాయము చేత. 18 ఒగిన్ = పూనికతో, గబ్బితనము = గాంభీర్యము, తన్నున్ - నన్ననుట, తగిలి = వెంటనంటి. 19 వెనుకొని = వెంబడించి, ఎలయించుకొంచున్ = వెంటఁదీసికొనుచు, గహ్వరము

మ. అవనీనాథుఁడు బిట్టు మేలుకొని కోపాటోపముల్ చూడ్కులన్
నివుడన్ దారుణవృత్తిఁ గాలయవనున్ వీక్షించినన్ వాఁడు భీ
మవిశాలానలకీల లంగమునఁ గ్రమ్మం గూలె నాలోన యా
దవచూడామణి తత్ప్రదేశమున నుద్యన్మూర్తియై నిల్చినన్. 21

క. జననాయకుఁ డెవ్వఁడవని, తనునడిగిన శౌరి కరుణ దళుకొత్తంగా
మనుజేశ్వర వసుదేవుం, డనుయాదవుసుతుఁడఁ గృష్ణుఁ డందురు నన్నున్. 22

మ. అనినన్ దిగ్గనలేచి సంభ్రమముతో సాష్టాంగదండంబు చే
సి నితాంతప్రమదంబు చిత్తమున నుత్సేకింపఁగాఁ బద్మలో
చనునిన్ గృష్ణుని వాసుదేవుని జగత్స్రష్టన్ సమస్తామరా
వనకేళీరతునిన్ గృపానిరతునిన్ వర్ణించి సద్భక్తితోన్. 23

సీ. దనుజారిఁ జూచి యిట్లను దేవ నేఁదొల్లి యింద్రునిపనుపున నీగుహాంత
రమున నిద్రింపంగ సమకట్టివచ్చుచో గార్గ్యుండు నన్నుఁ బొడగాంచి విష్ణు
దేవుఁడు యదువంశదీపకుండై దేవకీదేవి కుదయించి కృష్ణుఁ డనఁగ
నిరువదియెనిమిదివరదివ్యయుగములు వరుసతోఁ జనఁగ ద్వాపరయుగాంత
తే. మున మహీభార ముడుపంగ జననమొందు,నతఁడు నీకును బ్రత్యక్షమై శుభంబు
లొసఁగునని చెప్పె నట్టిపుణ్యోదయుండ, వీవు నాపాలఁ గలిగితి దేవదేవ. 24

వ. అని యిట్లుపలికినఁ బ్రసన్నుఁడై సర్వభూతేశ్వరుం డైనముకుందుండు ముచికుం
దున కిట్లనియె. 25

తే. ధరణినాయక మత్ప్రసాదమున దివ్య, భోగములఁ జెంది సత్కులంబున జనించి
వైభవంబు జాతిస్మరత్వంబుఁ గలిగి, యభిమతం బైనలోకంబులందునుండు. 26

ఆ. మోక్ష మంత్యకాలమునఁ గృపచేసితి, ననుచు వరము లొసఁగి యరిగె శౌరి
రాజవరుఁడు గహ్వరము నిర్గమించి క, న్గొనియె నల్పులైన మనుజతతిని. 27

మ. కని తొల్లింటివిధంబుగాక పెరమార్గం బైనకాలంబుగ
న్గొని యింకన్ గలికాలమయ్యెడుఁగదా కొన్నాళ్లకంచున్ మనం
బున శంకించి యధర్మమార్గమగు నాభూమిన్ బ్రవర్తింప రో
సినవాఁడై చని గంధమాదనగిరిన్ జేరెన్ దపోనిష్ఠకున్. 28

వ. ఇట్లు నరనారాయణస్థానంబునం దపంబు సేయుచుండె నటఁ గృష్ణుం డుపాయం
బున రిపుం బరిమార్చి తదీయంబైన సకలసంపదలునుం గొని. 29

ఉత్సాహ. అరిగి యుగ్రసేనునకుఁ బ్రియంబుతోడ నన్నియున్

---

నందున్=గుహయందు. 21 నివుడన్ = వ్యాపింపఁగా - తోఁచఁగాననుట, ఉద్యన్మూర్తి = ప్రకాశమానమైన యాకృతి గలవాఁడు. 23 ఉత్సేకింపఁగా = అతిశయింపఁగా, జగత్స్రష్టన్ = లోకములను సృజించువానిని, అవన = రక్షించుటయందు. 26 మత్ప్రసాదమునన్ = నాయనుగ్రహముచేత. 27 నిర్గమించి = వెడలి, తతి = సమూహము. 28 పెర = వేఱైన, రోసినవాఁడై=

వరుస నుపద యిచ్చె యాదవప్రవీరవంశమే
యరులవలన భయములేక యంబుజాక్షరక్షణ
స్ఫురణవలన నధికవృద్ధిఁ బొందె ద్వారకాపురిన్. 30

వ. అంత నొక్కనాఁడు. 31

బలభద్రుండు వ్రేపల్లెకు వచ్చియుండి వరుణదేవునివలన వరంబుగొనుట.

క. బలభద్రుండు ప్రశాంతాఖిలవిగ్రహుఁ డైనదేవకీసుతు నచటన్
నిలిపి యదువరులు దన్నుం, గొలువంగా నరిగె నందగోకులమునకున్. 32

వ. అరిగి యశోదానందులకు నమస్కరించి తనకు బాలసఖులయిన గోపకుమారుల నయ్యైప్రకారంబుల నాదరించి గోపికాజనంబులకు మనోహరంబు లయినవస్త్రభూషణంబు లొసంగి గోగణంబుల కుశలం బరయుచు నిష్టవినోదంబులం దగిలి కతిపయదినంబు లుండునంత. 33

మ. వరభూషాదులరత్నదీధితులు దుర్వారంబులై దిక్కులం
బరువుల్ వెట్టఁగ నుత్తమాంగనవపుష్పశ్రేణిసౌరభ్యముల్
గరుసుల్ మీఱఁగ గ్రాహవాహనపరిష్కారంబు తోరంబుగా
వరుణుం డక్కడి కేగుదెంచెఁ బ్రమదవ్యాపార మేపారఁగన్. 34

వ. ఇట్లు వచ్చి యత్యంతవినయపూర్వకంబుగా నతనిం బొడఁగాంచి యనేకమణిమయభూషణజాలంబు లొసంగి యిష్టవినోదంబుల నున్నవరుణదేవునకు బలదేవుం డిట్లనియె. 35

తే. అనఘ పూర్వంబునందు నీయందుఁ బుట్టి, నట్టి వారుణిసేవ ప్రియంబుతోడఁ
జేయుదురు కొంద ఱార్యులు సిద్ధమతులు, వారి కేమిఫలంబులు వచ్చునొక్కొ.

క. నావుడు నావరుణుఁడు బల, దేవున కిట్లనియెఁ దొల్లి దేవతలును దై
త్యావళియు నార్తిఁ దరువఁగ, నావారుణి యుద్భవించె నమృతముతోడన్. 37

మ. పరమానందకరంబు రోగహరణోపాయంబు నానారసో
త్కరమత్యంతబలప్రహేతువు జగత్కల్యాణరూపంబు ని
ర్జరసేవ్యంబు వరాంగనాజనరతస్వచ్ఛందమానందసుం
దరమామద్యము మద్యపానరతుఁ డేతన్మాత్రుఁడే లాంగలీ. 38

మ. సురసేవించి కదా సురాసురవరస్తోమంబు లెల్లప్పుడున్
బరమానందపరంపరాభినయులై భాసిల్లుచున్నారు సు
స్థిరతన్ దొల్లిటిశుక్రశాపభయబుద్ధిన్ మద్యపానక్రియా
పరతన్ జెందనివానిజన్మము వృథాపాకంబు నీలాంబరా. 39

---

రోతపడినవాఁడై. 30 ఉపద = కానుక. 32 ప్రశాంతాఖిలవిగ్రహుఁడు = మిక్కిలియణఁగిన కలహములు గలవాఁడు. 34 సౌరభ్యములు = పరిమళములు, గరుసులు= మేరలు, గ్రాహవాహనపరిష్కారంబు = మొసలివాహనము యొక్క అలంకారము, తోరంబు - మితిమీఱినదనుట. 38 ఉత్కరము = రాశి, స్వచ్ఛందము = స్వతంత్రమైనది. 39 అభినయులు = ప్రకాశింపఁజేయు

క. నీవింక నేటినుండియు, నావచనము లాదరించి నచ్చినమతితో
దేవతలకైనదొరకని, యావారుణి సేవసేయు మతులితభక్తిన్. 40

క. అని వారుణీమహత్త్వము, గొనియాడి తదీయపానగోష్ఠీరతికిఁ
మన మలరి యున్న బలభద్రునికోర్కి యొనర్పఁగా వరుణదేవుండున్. 41

తే. నెమ్మితోడ బృందావననీపకోట, రమ్మునను వారుణీకలశమ్ము నిలిపి
పోయె నామద్యగంధమపూర్వ మగుచు, నవ్వనంబున బెరసె నయ్యవసరమున. 42

ఉ. సింధురవైరివిక్రముఁడు సీరధరుం డొకనాఁడు వృష్ణిభో
జాంధకవీరులం గలసి యచ్చటఁ ద్రిమ్మరువారిపాలికిఁ
గంధవహుండు దెచ్చె నధికప్రమదాభినయానుబంధముల్
బంధురషట్పదాంధము నపారమదాంధము సీధుగంధమున్. 43

వ. ఇట్లతిమనోహరం బైనమదిరాగంధం బాఘ్రాణించి యవ్వలను గైకొని చని కదంబ
తరుకోటరంబుననున్న దివ్యహాలాకుంభంబుఁ గనుంగొని వరుణప్రయుక్తంబుగా
నెఱింగి తదాసక్తచేతస్కుండై కైకొని చని. 44

మ. యమునాతీరమునందు నందమగుబృందారణ్యనీపప్రదే
శమునన్ నిర్మలచంద్రకాంతమణిరాజద్వేదిపైఁ బూర్ణచం
ద్రమయూఖంబులు దట్టమై వొలయ నుద్యల్లీలతో మద్యపా
నము చేసెన్ బలభద్రుఁ డంగనలతో నానావిధోల్లాసియై. 45

వ. అప్పుడు. 46

చ. కమలనిభాస్యయోర్తు చషకంబున మద్యము నిండఁబోసి యిం
దమనుచు నొక్కచంద్రముఖిఁ దార్కొని యిచ్చినవారివక్త్రయు
గ్మము ప్రతిబింబముల్ దనరెఁ గంజసుధాకరు లబ్జనామలా
భములకుఁ బోరుచున్ బుడుకుబానకునందు మునింగిరో యనన్. 47

వారు. 40 నచ్చిన = నమ్మిన. 42 నీపకోటరమ్మునన్ = కడపచెట్టుతొఱ్ఱయందు, బెరసెన్ = వ్యాపించెను. 43 సింధురవైరివిక్రముఁడు = సింహపరాక్రమముగలవాఁడు, అధికప్రమదాభినయానుబంధముల్ = మిక్కిలి సంతోషమును తోఁపించునట్టి సంబంధముకలదానిని, బంధురషట్పదాంధముల్ = మనోజ్ఞమైనతుమ్మెదలకు అన్నమైనదానిని, సీధు = మద్యముయొక్క - కల్లుయొక్క. 44 మదిరా = కల్లుయొక్క, అవ్వలనుగైకొని = ఆదిక్కునుబట్టి, హాలాకుంభంబున్ = కల్లుకుండను, ప్రయుక్తంబు = చక్కగా చేర్పఁబడినది, చేతస్కుండు = మనసు గలవాఁడు. 45 రాజద్వేది= ప్రకాశించుచున్నయరుఁగు, మయూఖంబులు = కిరణములు, పొలయన్ = ప్రసరింపఁగా, ఉద్యల్లీలతోన్ = వృద్ధిబొందుచున్నవిలాసముతో. 47 చషకంబునన్ = త్రాగెడుగిన్నెయందు, తార్కొని= ఎదుర్కొని, వక్త్రయుగ్మము = మొగములజంటయొక్క, కంజసుధాకరులు = కమలమును చంద్రుఁడును, పుడుకుబానకున్ = (ఆయుస్సునిచ్చునట్టిదైన) అమృతఘటముకొఱకు.

మ. మదిరాపానముచేత నొక్కసతి తామత్తిల్లి వేఱొక్కతెన్
హృదయేశుండని కౌఁగిలించె నది దానిం బ్రాణనాథుం డటం
చొదవన్ గొమ్మని మోవి యిచ్చె నటు లన్యోన్యప్రవృత్తక్రియల్
ముదితల్ కొందఱు చూచి నవ్వి సరసంబుల్ పల్కి రత్యున్నతిన్. 48

వ. ఇవ్విధంబున నయ్యిందువదనలవిలాసంబులును బహువిధోల్లాసంబులును పరస్పర కోలాహలహాసంబులును సరససంగీతవిద్యావికాసంబులును బెరయ మద్యపానంబు చేయుచున్న నయ్యిందువదనలుం దానును బరమసంతోషహృదయులై నృత్తగీత వాద్యవిశేషంబులఁ బెద్దయుం బ్రొద్దువర్తించి శరీరోద్గతంబులైన ఘర్మకణంబులు మౌక్తికాహారంబుల నలంకరింప వారిజాక్షులుం దానును వారివిహారంబున కుద్యోగించి మదిరాపానపరవశత్వంబునఁ బోవనోపక యున్నతవచనంబుల యమునాతటినిఁ బేరెలుంగునం బిలిచిన రాకున్నం గోపించి. 49

క. ఈలాంగలపాతముచేఁ, గాళిందీ నిను సహస్రగతులుగఁ బఱపన్
జాలుదు నావిధ మెఱుఁగక, యేలా మదియించి తనుచు నెంతయు బలిమిన్. 50

క. యమునాతీరమునకు వచ్చి మహాలాంగలము పూని చెచ్చెరఁ దత్కూ
లమునఁ దగిలించి తిగిచిన, నమరులు వెఱఁగంది చూడ నవ్వాహినియున్. 51

సీ. పెదపెదపాయలై బృందావనంబునఁ బ్రవహించి కడుననూపంబుచేసె
బలభద్రుఁ డంగనాపరివృతుఁడై యందు జలకేళి లీలమై సలుపుచున్న
నపుడు కాళింది భయభ్రాంతయై నిజరూపంబుఁ బొడచూపి యాపురాణ
పురుషునిఁ బ్రార్థించి శరణంబువేడిన నభయదానం బిచ్చి యనిపి పుచ్చి
తే. మోదమున మద్యపానవినోదగోష్ఠిఁ, దగిలి రేవతీసతియును దాను సురత
కేళిఁ దేలుచుఁ దనివోని క్రీడ సలిపె, మమతలగ్గలమైన సౌమ్యాకృతులను. 52

వ. ఇవ్విధంబున వినోదింపుచున్నంత నొక్కనాఁ డతనికడకు వరుణదేవుండు వచ్చి నీలోత్పలావతంసంబును కనకరత్న కుండలయుగళంబును నీలాంబరంబును ధవళచ్ఛత్రంబును నొసంగిపోయినఁ గైకొని మహనీయవిభవంబున మెఱసి నందగోపవ్రజంబున మాసద్వయం బుండి కృష్ణసందర్శనకుతూహలుండై ద్వారకానగరంబున కరిగియుండునంత. 53

### రుక్మిణీకల్యాణము.

ఉ. అంచితుఁడై విదర్భవిషయంబునకుండినమన్ పురంబు పా

---

48 మత్తిల్లి = మత్తుకొని. 49 హాసంబులు = నవ్వులు, బెరయన్ = కూడుకొనఁగా, ఉద్గతంబులు= పొటమరించినవి, ఘర్మకణంబులు = చెమటబొట్లు, వారివిహారంబునకున్ = జలక్రీడకు, ఉన్నత = గంభీరములైన. 50 పఱపన్ = ప్రవహింపఁజేయ, మదియించితి = మదించితివి. 51 కూలమునన్ = గట్టునందు, తిగిచినన్ = లాగఁగా, వాహిని = ఏఱు. 52 అనూపము = అంతట నీళ్లు గలదిగా, తనివోని = తృప్తి కలుగని, అగ్గలము = అధికము, 54 విషయంబునన్ = దేశమునందు.

లించును భీష్మకుండు సుఖలీల నతండు తపంబు భక్తిఁ గా
వించి సురూపవైభవవివేకుల రుక్మిని రుక్మిణీసతిన్
గాంచి ప్రియంబుతోఁ బెనిచె గౌరవమున్ గుతుకంబు నేర్పడన్. 54
తే. అంత రుక్మిణి పెండ్లిప్రాయమున నున్న, నాలతాంగి మనోహరంబైనసౌకు
మార్యములు గోరి ఘనులైనమనుజనాథు, లడుగ నంపిన నీకుండు నవ్విభుండు.
క. హరిఁ గోరె రుక్మిణీసతి, హరియును నయ్యింతిఁ గోరె నయ్యిరువురు నీ
వెరపున మోహమువలనను, బరస్పరము లైనతగులు వాయక యున్నన్. 56
క. హరి దనకు నడుగ నంపిన, హరిపగతుం డైనరుక్మి యతనికి నీకా
హరిమధ్యకు శిశుపాలుఁడు, వరుఁ డని యాతనికి నిచ్చువాఁడై యుండెన్. 57
వ ఇట్లు జరాసంధప్రచోదితుండై వివాహంబునకు శిశుపాలుం బిలువంబంపిన నతండు సకలమేదినీపతులతోడఁ గదలి కుండినపురంబునకు వచ్చె కృష్ణుండు బలభద్రాక్రూరకృతవర్మసాత్యకిప్రముఖు లగుయాదవులతోడఁగూడి కట్టాయితం బై వివాహసమయంబున నేమఱియున్న రాజమందిరంబు చొచ్చి యానవోఢం దనరథం బెక్కించుకొని యుద్ధసన్నద్ధుండై యరిగిన. 58
మ. బలవద్వైరినిదాఘమేఘుఁ డగునాపద్మాక్షుమీఁదన్ సము
జ్జ్వలులై చైద్యుఁడు దంతవక్త్రుఁడు జరాసంధుండు సాళ్వుండు పే
రలుకం దాఁకి రణంబు సేసిరి యవశ్యాయాంబుదవ్రాతముల్
జలజాప్తుం గని బిట్టుముట్టినగతిన్ సన్నద్ధులై యుద్ధతిన్. 59
వ. ఇట్లు పొదివి మహాఘోరయుద్ధంబు సేసిన బలభద్రసాత్యకికృతవర్మాదులు నయ్యూథంబుపయిం గవిసి ప్రచండకోదండనిర్ముక్తనిశాతసాయకపరంపరలు గురియించి రథికులం బరిమార్చియు సారథుల రూపుమాపియు సిడంబులఁ ద్రుంచియు ఛత్రంబుల ఖండించియు చక్రరక్షకుల విదళించియు ఏనుంగులఁ బీనుంగులు గావించియు దంతంబుల రాల్చియు తొండంబులఁ ద్రుంచియు కుంభంబులఁ బగిలించియు తురంగంబుల రూపఱ నేసియు రౌతుల ప్రాణంబులు గొనియు పక్కెరలు చెక్కలు చేసియు కవచంబులు చించియు పదాతులబారి సమరియు చక్రకుంతపట్టసప్రాసకోదండగదాదండశూలాదిసాధనంబులు విటతాటంబులు చేసియు నిట్లు విజృంభించిన సంగ్రామం బతిదారుణం బయ్యె నయ్యాహవంబునకు నోహటించి యందఱు బహుముఖంబులం బఱచిరి శిశుపాలుండును సిగ్గువడి నిజపురంబున కరిగె నంత రుక్మియును. 60

---

56 తగులు = మనస్సంగము. 58 ప్రచోదితుండు = ప్రేరేపింపఁబడినవాఁడు, నవోఢన్ = పెండ్లికొమార్తెను. 59 నిదాఘ = వేసంగికాలమసెడు, అవశ్యాయ = మంచు. 60 యూథంబు = సేనాసమూహము, నిర్ముక్త = విడువఁబడిన, నిశాత = వాఁడియైన, సాయక = బాణములయొక్క, సిడంబులన్ = ధ్వజములను, విదళించి = నఱికి, రూపఱన్ = స్వరూపనాశమగునట్లు, పక్కెరలు = గుఱ్ఱములకవచములు, బారిసమరి = చంపి, విటతాటంబులు = తుత్తుమురులు, ఓహటించి=విముఖులై.

క. హరిఁ జంపక కుండినపురిఁ, జొరనను చుఁ బ్రతిజ్ఞ సేసి శూరతతో నా
సరసీరుహలోచను నిర్భరశక్తిం దాఁకి బాహుబల మేపారన్. 61

మ. తురగస్యందనపత్తివారణములం దోర్దర్పోద్ధతి మేకొల్పి యా
హరితోడన్ బటుఘోరసంగరము సేయం బూనినన్ యాదవే
శ్వరచూడామణి శాతబాణముల నాసైన్యంబు దైన్యంబునన్
బొరయంజేసి విరోధిఁ బట్టుకొని సొంపుం దెంపు నేపారఁగన్. 62

క. ఆవనిత చూచుచుండఁగ, వావిరియై పాఱవాతి వాఁడిశరమునన్
బావా మేలము సూ యని, తేవులుగా నతనితల గొఱిగి పోవిడిచెన్ 63

తే. ఇట్లు విజయంబు గైకొని యేగుదెంచి, ద్వారకానగరమున నాతలిరుబోణి
రాక్షసవివాహమున నభిరామలీలఁ, బరిణయం బయ్యె జగములు ప్రస్తుతింప. 64

## ప్రద్యుమ్నానిరుద్ధాదులచరిత్రములు.

క. ముదమున నాలలితాంగికి, నుదయించెను రూపవైభవోపేతుండై
మదనాంశమున విరోధి, ప్రదమనుఁ డగుధర్మమూర్తి ప్రద్యుమ్నుఁ డనన్. 65

సీ. అతఁడు జన్మించిన యాఱవదినమున శంబరుం డనఁగ రాక్షసవరుండు
తనకు నాబాలుచేతను జావుగలదని యశరీరి పలికిన యర్ధరాత్ర
సమయమునం దరిష్టముఁ జొచ్చికొనిపోయి వనరాశిలోఁ బాఱవైచుటయును
మీనమామిషబుద్ధి మ్రింగె జాలరి దానిఁ బట్టి యాదైత్యునిపట్టి కిచ్చి

తే. చనియె నాయింతియును జలచరము దఱుగు
నపుడు ప్రాణంబుతో నున్నయట్టి శిశువుఁ
జూచి వెఱఁగందుచున్న యచ్చోటి కమర
మౌని యగునారదుఁడు వచ్చి మంతనమున. 66

మ. హరికిం బుత్రుఁడు వీఁడు వీనిఁ బ్రమదం బాఱంగ రక్షింపుమీ
యరవిందానన యంచుఁ జెప్పుటయు నయ్యబ్జాక్షి యాఁగాక యం
చు రహస్యంబునఁ జెప్పినన్ దెలిసి రక్షోనాథుఁ డవ్వీరునిన్
బరిమార్పన్ సమకట్టి తాను మడిసెన్ బ్రద్యుమ్నుచేఁ బోరిలోన్. 67

ఉ. ఆవసుదేవపౌత్రుని మహత్త్వముఁ గన్గొని యామృగాక్షి మా
యారతి పుష్పసాయకశరాహతినొంది తదీయరూపరే
ఖావిభవంబు మెచ్చుచును గ్రక్కున మేఘపథంబునందు ల
క్ష్మీవిభుఁ డేలు ద్వారవతికిన్ జని యంతిపురంబులోపలన్. 68

ఉ. వాలినఁ గృష్ణుభార్య లగువారిరుహానన లద్భుతక్రియా

62 పత్తి = పదాతి, మేకొల్పి=పూనుకొనునట్లుచేసి. 63 వావిరి = ధూర్తుఁడు, మేలముసూ=ఎగతాళి సుమీ. 65 ప్రదమనుఁడు = చక్కగా నణఁగఁగొట్టువాఁడు. 66 అరిష్టము = పురిటిల్లు, వనరాశిలోన్=సముద్రమునందు, ఆమిషబుద్ధిన్ = మాంసమను తలంపున, జాలరి = చేఁపలనుబట్టువాఁడు. 68 మేఘపథంబునందున్ = ఆకాశమార్గమునందు.

లోలతఁ జూచుచుండిరి త్రిలోకమనోహరమూర్తి యైనయా
బాలునిఁ జూచి రుక్మిణి యపారవిషాదము మానసంబునన్
గ్రాలఁగఁ బుత్త్రునిం దలఁచి కన్నుల బాష్పము లొల్కుచుండఁగన్. 69

క. ఈలలితాత్ముం డెవ్వరి, బాలుఁడొకో వీనిఁ గన్న పద్మానన ము
న్నేలీలఁ దపము చేసెనొ,కో లోకమువారికంటెఁ గోరిక మీఱన్. 70

తే. శివుఁడు చిచ్చుఱకంటఁ బ్రేల్చినప్రసూన
సాయకుఁడు వచ్చి క్రమ్మఱ జననమందఁ
బోలుఁ గాకున్న నిటువంటిపుణ్యమూర్తి
కలఁడె లోకంబులందు నేకాలమునను. 71

తే. నాకుమారుని దైవంబు నాఁచుకొనక
యున్న వీనిప్రాయంబున నుండకున్నె
యనుచు దుఃఖించుచున్న యయ్యవసరమున
నందసుతుఁ జూడఁ జనుదెంచి నారదుండు. 72

తే. శంబరునిచేత నా దరిష్టంబులోనఁ
గోలుపోయినబాలుఁ డీకొడుకుఁగుఱ్ఱ
యనుచుఁ బ్రద్యుమ్నువృత్తాంత మాలతాంగి
తోడ వివరించి యమ్మునీంద్రుండు మఱియు. 73

ఉ. ఈకమలాక్షుఁ డాదిహరి నీవు రమాసతి వీనికుమారకుం
డాకుసుమాస్త్రుఁ డీయతివ యారతి గావున మీమహత్త్వముల్
నాకును శక్యమే పొగడ నన్నుఁ గృతార్థునిఁ జేయుఁ డంచు నా
పోకలప్రోక యైనముని పోయెఁ బురందరరాజధానికిన్. 74

వ. తదనంతరంబ కృష్ణుండు ప్రద్యుమ్నునకు నమ్మాయావతిం బాణిగ్రహణంబు సేయించె మఱియు నారుక్మిణియందుఁ జారుదేష్ణుండును చారుదేహుండును వీర్యవంతుండును సుషేణుండును చారుగుప్తుండును భద్రచారుండును సుచారుండును మహాచారుండు నన నెనమండ్రుకుమారులను చారుమతి యనుకన్యకనుం బడసె మఱియును. 75

ఉ. ఆనలినాక్షు పెద్దకొడు కంచితరూపవిలాసచారుతే
జోనిధి పెండ్లియాడె నతిశోభనమూర్తిని రుక్మికూఁతురిన్
మేనఱికంబుగా నఖిలమేదినినాథులు చూచుచుండఁగా
నానలినాయతాక్షిని స్వయంవర మైనవివాహసంపదన్. 76

క. మించిన యాప్రద్యుమ్నుఁడు, గాంచెన్ బుత్త్రకుని రుక్మికన్యకయందున్

69 విషాదము = విచారము, క్రాలఁగన్ = వర్తింపఁగా. 71 చిచ్చుఱకంటన్ = అగ్నినేత్రముచేత, ప్రేల్చిన=దహించిన. 74 పోకలప్రోక = తనయందు రాశిగాఁగూడుకొన్న బహుచేష్టలుగలవాఁడు,

బ్రాంచద్వివేకశుద్ధు ను,దంచితవిభ వానిరుద్ధు నయ్యనిరుద్ధున్. 77

తే. రుక్మిణీసతి యనిరుద్ధు రుక్మిమనుమ,రాలి నుద్వాహ మొనరించి లీలతోడ
సకలలోకంబులును దన్ను సన్నుతింప, నుజ్జ్వలం బైనమహిమతో నుండునపుడు.

నరకాసురవధప్రస్తావము.

సీ. మహిమతో ముడిచిన మందారసుమపుసౌరభము తుమ్మెదల రా రమ్మనంగ
దివ్యభూషణరత్నదీప్తులు తోరమై సకలదిక్కులఁ బ్రతిచ్ఛాయ లెసఁగఁ
గరపంకజంబునఁ గ్రాలెడిదంభోళిమెఱుఁగులు కడుమిఱుమిట్లు గొనఁగ
గంధర్వకిన్నరగానసనాదంబులు చెవుల కానందంబు సేయుచుండ
తే. దివ్యదుందుభిరవములు దిక్కులెల్లఁ, బిక్కటిల్ల దిగీశులు బెరసి కొలువ
నభ్రమాతంగపతి నెక్కి యమరలోక, నాయకుఁడు వచ్చె ద్వారకానగరమునకు.

ఉ. వారిజనాభుఁ డప్పుడు దివస్పతిరాక యెఱింగి గ్రక్కునన్
సీరధరాదు లైనయదుసింహులుఁ దక్కినబంధుమిత్రులున్
బౌరులు తోడరా నుచితభంగి నెదుర్కొని తోడితెచ్చి బం
గారుమెఱుంగు లుప్పతిలుగద్దియపై నిడి పూజ లిచ్చినన్. 80

క. సురలోకసార్వభౌముఁడు, పరితోషము నొంది దిగధిపతులున్ దానున్
హరిఁ బ్రస్తుతించి యవ్విభు, కరుణ వడసి వినయపూర్వముగ నిట్లనియెన్. 81

ఉ. యాదవవంశశేఖరుఁడవై విలసిల్లి యనాథు లైననా
నాదివిజవ్రజంబులకు నాథుఁడవై యుదయించియున్న య
య్యాదిమపూరుషుండవుగదా జలజాయతనేత్ర లోకముల్
నీదయచేతఁ గాదె రమణీయగతిన్ విలసిల్లు నెంతయున్. 82

ఆ. అమరవరులు సోమయాజులు యజ్ఞాంశ,ములు కృశానురూపముల భుజింతు
రవ్విధంబులెల్ల ననఘాత్మ నేటితో, మానవలసెఁ గాదె మాకునెల్ల. 83

సీ. విను మవ్విధంబు పృథ్వీపుత్త్రుఁ డగు నరకాసురేంద్రుఁడు జగదహితకారి
తనవంటిదుష్టదైత్యశ్రేణితోఁగూడి ప్రాగ్జ్యోతిషం బనుపట్టణమున
వసియించి గర్వదుర్వారుఁడై లోకంబు కెల్ల నుపద్రవం బెపుడుఁ జేయు
యజ్ఞభాగంబుల కర్హుండుదానని సవనాదు లెవ్వియు సాగనీఁడు
తే. సంగరమున సిద్ధసాధ్యబృందారక, మనుజవసుల నెల్ల మదమణంచి
సుందరాంగకముల శోభిల్లుకన్యల, నపహరించి తనగృహమున నునిచె. 84

77 ప్రాంచద్వివేకశుద్ధున్ = ఒప్పిదమైన తెలివిచేతస్వచ్ఛమైనవానిని, ఉదంచిత విభవానిరుద్ధున్ = మిక్కుటమైన భోగముచేత అడ్డగింపఁబడనివానిని - ఎల్లభోగములుగలవానిననుట. 79 దంభోళి = వజ్రాయుధము, బెరసి = పరివేష్టించి, అభ్రమాతంగపతిన్ = ఐరావతమును. 81 పరితోషము = సంతోషము. 83 కృశాను = అగ్ని. 84 జగదహితకారి = లోకమునకుఁ గీడుచేయువాఁడు, సవనాదులు = యజ్ఞములు మొదలగునవి,

వ. మఱియు సలిలప్రదం బయినవరుణదేవుని ధవళాతపత్రంబును దివ్యరత్నమయం బయిన మందరాచలశృంగంబును నమృతస్రావంబు లైనమజ్జననికుండలంబులును గైకొని యెదురులేక మదీయరాజ్యలక్ష్మీవిభవంబులకుఁ బరమచిహ్నంబయిన యైరావతంబుఁ గైకొనుతలంపునఁ దెంపుచేయుచున్నవాఁడు. నీవు దుష్టనిగ్రహ శిష్టానుగ్రహంబులు చేయువాఁడవు కావున నెఱింగింపవలసె నీయుపద్రవంబు మాన్చి జగంబులకు భద్రంబుసేయు మనిన జనార్దనుండు దయార్ద్రచిత్తుండై యతనికరంబు తనహస్తంబునఁ గీలించి యిట్లనియె 85

తరల. జగములెల్లను దోఁడువచ్చిన సంగరాంగణభూమిలో
జగదుపద్రవకారియైన నిశాచరుణ్ నరకాసురుణ్
దెగి వధించెద నింతవట్టును నిశ్చయంబు మనంబులో
వగవకుండుము పొమ్ము నీవని వారిజాక్షుఁడు పల్కెనన్. 86

క. పురుషోత్తముఁడు సంతోష, స్ఫురితుండై యుల్లసిల్లెఁ బురుషోత్తముఁ డా
దరమొప్పఁ దలఁచె వినతా, వరతనయునిఁ బక్షిలోకవరు సత్వాఢ్యున్. 87

చ. తలఁచిన వచ్చి తార్క్ష్యుఁడు ముదంబునఁ దామరసాక్షుసన్నిధిన్
నిలిచిన శత్రుభంజనవినిశ్చయబుద్ధి మనంబులోపలన్
దలకొన సత్యభామయును దాను దశాధిపు నెక్కి శౌరి యా
బలరిపుఁ గూడి యేగె బహుభంగుల లోకము ప్రస్తుతింపగన్. 88

వ. ఇవ్విధంబునఁ బ్రాగ్జ్యోతిషపురంబున కరిగి రప్పు డింద్రుం డుపేంద్రుని వీడ్కొని నిజలోకంబునకుం బోయె కృష్ణుండును యుద్ధసన్నద్ధుండై ప్రకంపితాఖిలనిశాచర సంఘంబయిన శంఖంబు పూరించిన. 89

ఉ. ఆనినదంబుచేత జగమంతయుఁ గంపము నొందె గోత్రభృ
త్సానులయందు నెల్లఁ బ్రతిశబ్దము లొక్కట నుప్పతిల్లె నా
దానవనాథుపీట బెడిదంబుగ నుల్కలు రాలుచుండె నం
భోనిధు లెల్ల మ్రోసె మునిపుంగవు లెంచిరి సంతసిల్లుచున్. 90

వ. తదనంతరంబున. 91

మ. నరకప్రేరితులై రథేభభటగంధర్వాదిసంఘంబుతో
గిరిభేదిప్రతికూలు రమ్మురహయగ్రీవుల్ రణోద్యోగవి

85 ధవళాతపత్రంబు=తెల్లగొడుగు, భద్రంబు=మేలు, దయార్ద్ర=దయారసముచేత తడిసిన-దయగల. 86 తెగి=తెగఁబడి, ఇంతవట్టును=ఇదంతయు, 88 భంజన=భంగపెట్టుటయందు, తలకొనన్=పుట్టఁగా, దశాధిపున్=పక్షిరాజైన గరుత్మంతుని. 89 ప్రకంపితాఖిలనిశాచరసంఘంబు = మిక్కిలివడఁకింపఁబడిన రాక్షససమూహములుగలది. 90 గోత్రభృత్సానులయందున్=కొండచఱులయందు, ఒక్కటన్= ఒక్కసారిగా, పీటన్ = పట్టణమునందు, బెడిదంబుగన్ = భయంకరముగా, ఉల్కలు = కొఱవులు, ఎంచిరి = పొగడిరి. 92 రథేభభటగంధర్వాది = రథములు ఏనుఁగులు కాలుబంట్లు గుఱ్ఱములు మొదలైన, గిరిభేదిప్రతికూలురు = ఇంద్రశత్రువులు - రాక్షసులు, గ్వడ్భంజనాచిరచక్రాసల

స్ఫురితస్వాంతులు వచ్చి కేశవునితోఁ బోరాడి దివ్యభంజనా
చిరచక్రానలవిస్ఫులింగముల భస్మీభూతులై రెంతయున్. 92

వ ఇట్లు శతసహస్రబలంబులతోడ నమ్మగలు దెగుటంజూచి. 93

చ. నరకుఁడు రోషశోకములు నాటినచిత్తముతోడ నుగ్రుఁడై
హరిరథమత్తవారణభటావళితోఁ బటుదైత్యదానవే
శ్వరనికరంబుతో మెఱసి సంగరభూమికి నేగు దెంచి ని
ర్భరగతిఁ దాఁకె శాత్రవధరాధరభంజనజిష్ణుఁ గృష్ణునిన్. 94

వ. ఇట్లు తాఁకి మహాఘోరయుద్ధంబుచేసి యనేకశస్త్రాస్త్రజాలంబులు జగదాభీలంబులుగా బెరసి కురిసినం దెమలక కమలనాభుండును శార్ఙ్గధనుర్విముక్తచండకాండపరంపరలచేత నిలింపవిరోధియూథంబులఁ గృతాంతునంతికంబునకుబనిచి.

క. శక్త్రాదిసుతులు పొగడఁగఁ, జక్రధరుఁడు భంజితారిచక్రం బగునా
చక్రంబుఁ బూని రాక్షస, చక్రేశ్వరుశిరము నఱికె సక్రోధమునన్. 96

వ. అప్పుడు. 97

ఉ. కాటుకకంటనీరుఁ జనుఁగట్టునఁ బొసినచీరకొంగుఁ బెన్
బీఁటలతోడివాతెఱయుఁ బెద్దయుఁ దూలెడు మేను వెన్నుపై
వాటమునై నునుల్ గురులు వాడినమోమునుగల్గి పుత్రశో
కాటవిలోనఁ జిక్కి వసుధాంగన వచ్చె ముకుందు పాలికిన్. 98

వ. ఇట్లు వచ్చి సాష్టాంగదండప్రణామంబుసేసి గద్గదకంఠంబున 99

ఉ. అమ్మదిరాక్షి యిట్లనియె నంబురుహాయతనేత్ర మున్ను నీ
విమ్ముల సూకరాకృతివహించినకాలమునందు నీప్రసా
దమ్మున నీనిశాటుఁడు ముదమ్మున నా కుదయించె నేడు నీ
విమ్మెయి వీని నేల వధియించితి తప్పు సహింపఁ జెల్లదే 100

విస్ఫులింగములన్ = శత్రునాశమునందు ఎడలేనిచక్రాయుధమువలనఁ బుట్టినయగ్నివలని మిడుఁగుఱుల చేత. 93 మగలు = శూరులు, తెగుట=చచ్చుట. 94 హరి=గుఱ్ఱములు, మత్తవారణ = మదపు టేనుఁగులు, మెఱసి=బయలుపడి, నిర్భరగతిన్ = చలింపనివిధమున, శాత్రవధరాధరభంజనజిష్ణున్= శత్రువులనుకొండలను భంగించుటయందు ఇంద్రుఁడైన. 95 జగదాభీలంబు = లోకభయంకరము, తెమలక=చలింపక, విముక్త = విడువఁబడిన, చండకాండ = కఱకైనబాణములయొక్క, నిలింప విరోధియూథంబులన్ = రాక్షససేనలను, కృతాంతునంతికంబునకున్ = యమునియొద్దకు. 96 భంజితారిచక్రము=భంగింపఁబడినశత్రుసమూహముగలది, చక్రేశ్వరు=రాజుయొక్క. 98 బీఁటలతోడి= బీఁటికలతోఁగూడిన, వాతెఱ= పెదవి, తూలెడు= తేరిపోవునట్టి, వాటములు=జాఱినవి. 100 ఇమ్ములన్ = ఒప్పిదముగా, ప్రసాదమ్మునన్ = అనుగ్రహముచేత, నిశాటుఁడు = రాక్షసుఁడు, చెల్లదే = తగదా,

క. తనయుండు తప్పుచేసిన, జనకుఁడు తగుబుద్ధిచెప్పఁ జనుగాక రణం
బున నిట్లు పగతుకైవడి, మనమున దయలేక పిలుకుమార్పం దగునే. 101

వ. అనిన నవ్విశ్వంభరుండు విశ్వంభర కిట్లనియె. 102

ఉ. నాదెస భక్తిచాలనిజనంబులు చుట్టములైన నేమి కం
సాదుల యట్ల చంపుదు మదాప్తచయంబు లలంతులైన ప్ర
హ్లాదవిభీషణాదిసుకృతాత్ములకైవడి నాదరింతు శా
తోదరి పుణ్యశీలుఁడు మహోన్నతిఁ బొందఁడె యేయుగంబులన్. 103

వ. కావున సకలలోకాపకారి యగునరకాసురుండు వధకు నర్హుండుగాని పుత్త్ర
స్నేహంబున రక్షింపందగఁడు వీనికై శోకింపఁదగదు నేను భూమిభారం బుడి
గింప మనుష్యరూపంబున నవతరించుట నీవెఱుంగవే యనిన ధరణి ధరణీధరున
కిట్లనియె. 104

క. నరకుఁడు చేసినతప్పును, పరికింపక వానిసుతుని బహురాజ్యరమా
భరితునిఁగాఁ బాలింపుము, శరణాగతరక్ష యనుచుఁ జాగిలి మ్రొక్కెన్. 105

ఆ. శౌరి యాధరిత్రి కోరినలాగున, నరకసుతుని రాజ్యభరితుఁజేసె
నదితి కుండలమ్ము లమ్మురారాతికి, నిచ్చి యాలతాంగి యేగుటయును 106

శతాధికషోడశసహస్రకన్యాపరిగ్రహేంద్రలోకగమనాదిశ్రీకృష్ణదివ్యచరితానువర్ణనము.

వ. కృష్ణుండు ప్రాగ్జ్యోతిషపురంబు ప్రవేశించి నరకాసురసంపాదితంబులైనశతాధిక
షోడశసహస్రకన్యాజనంబులను చతుర్దంతదంతావళంబు లాఱువేలును సర్వ
లక్షణసంపన్నంబులైనకాంభోజహయంబులు రెండువేలును మనోహరంబులైన
కనకరత్నరాసు లసంఖ్యంబులును నరకకింకరులచేత ద్వారకానగరంబున కనిచి
పుచ్చి. 107

క. వరుణునిగొడుగును మందర,గిరి మణిశృంగంబు గొనుచు గిరిరిపుఁ జూడన్
హరి యేగె గరుడవాహన, పరిశోభితుఁ డగుచు సత్యభామయుఁ దానున్. 108

మ. చని దేవేంద్రపురోపకంఠమున నాసర్వంసహామండలా
వనకేళీరతుఁడైనకేశవుఁడు దుర్వారధ్వనుల్ దిక్కులె
ల్లను భేదింపఁగఁ బాంచజన్య మవలీలన్ బిట్టు పూరించినన్
విని బృందారకవల్లభుండు ప్రమదావిర్భూతచేతస్కుఁడై. 109

క. కొనిపోయి రత్నసింహా,సనమున నాసీనుఁజేసి జలజాక్షునక
య్యనిమిషపతి యర్ఘ్యాద్యులు, తనగురుఁ డగుగురునిచేతఁ దగఁ గల్పించెన్. 110

తే. ఇట్లు పూజితుఁడై యాదవేశ్వరుండు
తీపు లూలికెడుసరససల్లాపవిధులఁ

---

101 పగతుకైవడిన్ = శత్రువువలె, పిలుకుమార్పన్ = చంప. 103 నాదెసన్ = నాయందు, అలంతులు=అల్పులు. 107 దంతావళంబులు = ఏనుఁగులు. 108 గిరిరిపున్ = ఇంద్రుని. 109 ఉపకంఠమునన్ = మొగసాలయందు, ప్రమదావిర్భూత చేతస్కుఁడు = సంతోషముపుట్టిన మనసుగల

బెద్దదడ విం్రదు్రఁడును దానుఁ బ్రొద్దు వుచ్చి
కుండలము లదితి కర్పింపఁగోరి యపుడు. 111

చ. అనఘ సితాద్రిశృంగశిఖరాకృతి నెంతయుఁ జూడ నొప్పు న
య్యనిమిషమాతయున్న యెడ కాహరితో హరి కూడివచ్చి పెం
పునఁ బ్రణమిల్లి యవ్వేలఁది భూరిసుధామయకుండలద్వయం
బనుపమలీల నిచ్చి నరకాసురుచావు నెఱుంగఁ జెప్పినన్. 112

క. ప్రీతాత్మ యగుచు నిర్జర,మాత జగన్నాథుఁ డైనమధుసూదను వి
ఖ్యాతచరిత్రునిఁ ద్రిజగ,త్పూతాత్మునిఁ జూచి హర్షమున నిట్లనియెన్ 113

సీ. భూతేశ భూతాత్మ భూతనాథస్తుత సర్వేశ సర్వజ్ఞ సర్వవినుత
నిర్ద్వంద్వ నిశ్చల నిగమార్థగోచర యవ్యయ యచ్యుత యాదిదేవ
త్రిదశనాథ త్రిలోకదేవ త్రివిక్రమ పరమ పరాపర పరహితార్థ
కమలాక్ష కమలేశ కమలరాశినివాస నరసింహ నరవంద్య నరకదమన

తే భక్తరక్షణ భవనాశ భవ్యరూప, నిగ్రహానుగ్రహవిధేయ నిత్యనిపుణ
కరుణతో నన్ను రక్షించి కావు మనుచు, భక్తితోఁ గొనియాడె నప్పరమసాధ్వి.

తే. అర్థితోఁ గల్పవృక్షంబు నాశ్రయించి, యల్పదానంబు కౌపీన మడిగినట్లు
నాఁడు నిన్ను దయార్ద్రమానసునిఁ జేసి, కొడుకుగాఁ గోరితిని ముక్తి గోరలేక.

చ అనుటయు దేవమాతవదనాబ్జమునం దనచూడ్కి నిల్పి యా
ననమున మందహాసము పెనంగఁగ నిట్లనుఁ దల్లి యివ్విధం
బునఁ బలుకంగ నేమిటికిఁ బుణ్యచరిత్రవు దేవమాతవై
ఘనతపమించి పుణ్యమును గాంచితి మోక్షము నీకుఁ బెద్దయే. 116

వ. అని పలుకుసమయంబున శచీదేవి సత్యభామం దోడుకొని వచ్చి యదితిం బొడ
గానిపించిన నద్దేవియుఁ గోడలి నాదరించి యిట్లనియె. 117

ఆ. ముదిత మత్ప్రసాదమున సార్వకాలంబు, ముదిమియును విరూపమును దొలంగి
సంతతానవద్యసౌభాగ్యమూర్తివై, యుల్లసిల్లు మనుచు నొసఁగె వరము. 118

క. తదనంతరంబ సురపతి, యదితియనుమతమున యాదవాధీశుని స
మ్మద మొప్ప వీడుకొలిపినఁ, గదలెఁ గృష్ణుండు ద్వారకాపురమునకున్. 119

వ. ఇట్లు సత్యభామాసమేతుండై గరుడారోహణంబుచేసి చనునప్పుడు అనవరత

---

వాఁడు. 112 సితాద్రి=వెండికొండయొక్క, హరితో = ఇంద్రునితోఁగూడ, పెంపునఁ = గౌరవముతో. 114 భూతనాథస్తుత = శివునిచే నుతింపఁబడినవాఁడా, నిర్ద్వంద్వ = సుఖదుఃఖములు మొదలైన ద్వంద్వములు లేనివాఁడా, నిగమార్థగోచర=వేదార్థములయందు కనఁబడువాఁడా, అవ్యయ=నాశరహితుఁడా, త్రిదశనాథ = దేవతలకు ప్రభువైనవాఁడా, పరాపర = మాయాతీతుఁడా, పరహితార్థి=పరుల మేలుకోరువాఁడా, నిత్యనిపుణ=శాశ్వతమైన నేర్పుగలవాఁడా. 115 అర్థితోఁ=కోరికతో. 118 అనవద్య = నింద్యముగాని, సౌభాగ్య = సౌందర్యముగల.

దివ్యగంధప్రసూనబంధురంబును వికసితకుసుమ నిష్యందమకరంద పానానంద
మిళిందఝంకారంబును మందమలయానిలప్రకంపితబాలపల్లవశోభితలతాన్త
నాభిరామంబును నైన పాకశాసనునియారామంబు పొడగని యందుఁ గొండొక
సేపు వసియించునప్పుడు. 120

ఉ. ఆతరళాక్షి గాంచె సముదాళిపరీతము నందనాంతర
ఖ్యాతము కీరకోకిలనికాయనికేతము నాశ్రితామర
వ్రాతము పుష్పసౌరభపరాగసమేతము బాలపల్లవ
ద్యోతము దుగ్ధసాగరపయోవనజాతము పారిజాతమున్. 121

క. కని సత్యభామ తద్దయు, ననురాగము బొంది యాదవాధీశున కి
ట్లను నీభూరుహమీనం, దనవనమున కెల్ల భూషణం బయ్యెఁగదా. 122

తే. సంతతముఁ గడివోనివాసనలు గలుగు
పారిజాతమహీజపుష్పములు ముడిచి
సఖులు దాను సుఖకేళి సలుపుచున్న
యమరపతిభార్య యెంత భాగ్యవతియొక్కొ. 123

తే. అమరపతికంటె సకలభోగముల నీవ, యెక్కుడని కొనియాడుదు రెల్లవారు
నట్టి నీపత్నినయ్యు నే నతనికాంతఁ, బోల లేనైతి నత్యంతభోగములను 124

సీ. ద్వారకాపురికి నీపారిజాతముఁ గొని యరిగి మదీయగృహాంగణమున
నుపవనంబులలోన నునిచిన నేను నీకారుణ్యమునఁ జేసి కమలనాభ
యీతరుపుష్పంబు లెలమితోఁ గొనివచ్చి చెలికత్తె లెత్తులుచేసి యొసఁగ
ముడిచి యొక్కొకవేళ ముదముతో నారుక్మిణీమిత్రవిందాదిభామినులకుఁ
తే. బెట్టి పంపఁగ వారు నా పెంపు సూచి, సిగ్గుపడుచుందు రట్లుగాఁ జేసితేని
యనఘ నీపాల నాకును జనవు గలదు, సవతు లెవ్వారు నాతోడ సవతుగారు. 125

## పారిజాతాపహరణము.

చ. అనవుడు సత్యభామ పలు కాదరణీయముచేసి దేవకీ
తనయుఁడు పారిజాతవసుధారుహముం దనరాజధానికిం
గొని చనఁబూని యాతరువు కూఁకటివేళ్లకుఁ బెల్లగించి కై
కొని బలముం జలంబు నొడఁగూడఁగఁ బోవఁగ నున్నయత్తఱిన్. 126

---

120 దివ్యగంధప్రసూనబంధురంబు=మేలైనవాసనగలపువ్వులచేత ఒప్పిదమైనది, నిష్యంద=జాఱుచున్న, మిళింద = తుమ్మెదలయొక్క, బాలపల్లవ = లేఁతచిగుళ్లచేత. 121 సముదాళిపరీతము = మదముతోఁ గూడిన తుమ్మెదలచేత ఆవరింపఁబడినది, నికేతము = ఇల్లైనది, పరాగ = పుప్పొడితోడ, బాలపల్లవద్యోతము = లేఁతచిగుళ్లచేత ప్రకాశించునది, దుగ్ధసాగరపయోవనజాతము = పాలసముద్రమునందలి పాలసముదాయమునందు జనించినది. 123 కడివోని = తఱుఁగని. 125 అంగణమునం = ముంగిటియందు, ఎత్తులు = దండలు పెంపు=ఆధిక్యము, సవతు = సమానము. 126 ఆదరణీయము = ఆదరింపఁదగినది, వసుధారుహముం = వృక్షమును, కూఁకటివేళ్లకుం = క్రిందుగుదువేళ్లతో.

క. వనరక్షకు లడ్డముగాఁ, జనుదెంచి ముకుందుఁ గాంచి శతమఖుసతి కై
కొనఁగఁదగు దీనిపువ్వులు, మనుజసతులు ముడువ నర్హమా తలపోయన్. 127

మత్తకోకిల. నీకు దేవధనంబు లేటికి నిర్జరేంద్రుఁడు విన్నఁ జీ
కాకుసేయక కొంచుఁబొమ్మని గారవింపఁడు గావునన్
నాకవల్లభుతోడ మైత్రి యొనర్పఁగోరెదవేని యీ
పోకలెల్లను మాని నెమ్మదిఁ బొమ్ము నీవని పల్కినన్. 128

క. వనజనయనుఁ డొండేమియు, ననక నగుచు నూరకుండె నాదిత్యుల కి
ట్లను సత్యభామభావము, మనమునఁ బెనఁగొనఁగఁ గఱుకుమాటలతోడన్. 129

క. ఎక్కడిదేవేంద్రుఁడు మఱి, యెక్కడిపౌలోమి వీరి కీభూజాతం
బెక్కడి దీలోకములో, నెక్కుడు వీరేల యైరి యెవ్వరికంటెన్. 130

తే. జలధిఁబుట్టిన యీపారిజాతవృక్ష, మఖిలలోకమ్ములకు సమ మదియుఁగాక
నామగఁడు శౌరి మీశచీనాథుకంటె, బల్లిదుండౌట యెఱుఁగరె యెల్లవారు.

క. నామగఁడు సకలలోక, గ్రామణి దేవేంద్రుఁ డాదిగాఁగలదివిజ
స్తోమములు గొలువనుండుట, యేమీ పౌలోమి యెఱుఁగదే మఱచెనొకో. 132

క. తనమగఁడు బాహువిక్రమ, ఘనుఁ డయ్యెడు నేనిఁ గృష్ణుఁ గయ్యములో మా
ర్కొని గెలిచి పారిజాతము, గొనిపోవుంగాక యేల గొణుఁగులు తనకున్. 133

క. అనుసత్యభామపలుకులు, విని వనరక్షకులు పోయి విబుధేశకులాం
గన యైనశచికిఁ జెప్పినఁ, గినియుచు నద్దేవి వజ్రికిం జెప్పుటయున్. 134

మ దివిజాధీశ్వరుఁ డంత్యకాలశిఖిలీలన్ మండుచున్ దేవతా
నివహంబుల్ రథపత్తివారణహయానీకంబుతోఁ గొల్వ రా
నవలీలన్ జనుదెంచి యాదవకులాధ్యక్షున్ వెసం దాఁకినన్
బవరం బచ్చట నయ్యె నింగియును భూభాగంబుఁ గంపింపఁగన్. 135

వ. ఇట్లు దలపడి ఖడ్గపరశుకుంతప్రాసతోమరగదాచక్రకచభల్లపరిఘాదిసాధనంబులు బెట్టిదంబులుగాఁ బ్రయోగించిన సకలశత్రుమర్దనుం డైన జనార్దనుండు చటుల దనుజశుద్ధాంతకాంతావిభవశూన్యం బయినపాంచజన్యంబు ఘోషంబుచేత దిశలనెల్లఁ బ్రతిశబ్దంబు గల్పించి శార్ఙ్గంబు గుణధ్వనిచేసి శతసహస్రాయుత నిశాతసాయకంబులు గురిసి యాకాశంబు నిరవకాశంబుఁ జేసిన నాదైవతలోకంబు తమతమశస్త్రాస్త్రంబులు దివ్యమంత్రపూర్వకంబులుగా నడరించిన నవి బహు

128 చీకాకు=గాసి, నాకవల్లభుతోడన్ = ఇంద్రునితో, పోకలు=చేష్టలు, 129 ఆదిత్యులకున్=దేవతలతో, కఱకు = కఠినములైన. 130 పౌలోమి = శచి, ఎవ్వరికంటెన్ = ఎల్లవారికంటెను. 134 కినియుచున్ = కోపగించుకొనుచు. 135 శిఖి = అగ్ని, బవరంబు = యుద్ధము, నింగి = ఆకాశము. 136 భల్ల=బల్లెము, చటుల=భయంకరులైన. శుద్ధాంతకాంతా = అంతఃపురస్త్రీలయొక్క, శూన్యము= లేకుండఁజేయునది, కురిసి = కురియించి, నిరవకాశంబు = ఎడములేనిది, దైవతలోకంబు = దేవతల

సహస్రరూపంబులయి తన్నుం బోదివిన వానినిజబాణానలంబునకు నింధనంబులుగాఁ
జేసి వెండియు వసురుద్రాదిత్యగణంబుల గంధర్వసిద్ధవిద్యాధరాది యోధవీరుల
నాయోధనపరాఙ్ముఖులం జేసె వెండియు. 136

క. వినతాతనయుఁడు తుండంబున ఱెక్కలచేత నఖరముల రిపుసేనన్
దునిమి యణంచియుఁ జించియుఁ, బెనుపీఁగుపెంటఁ జేసె భీషణవృత్తిన్ 137

ఉ. అంత బలాంతకుండు సముదంచితబాహుబలప్రతాపదు
ర్దాంతగతిన్ సితద్విపకులాధిపు నెక్కి నిలింపసేనతో
నెంతయుఁ దీవ్రకోపమున నేగి సముద్ధతశక్తితోడఁ గం
సాంతకుమీఁద వైచె సముదగ్రరుచుల్ వెలుఁగొంద వజ్రమున్. 138

వ. అమ్మహనీయసాధనంబు మాధవునియందుఁ గృతఘ్నునకుం జేసినయుపకారంబునుం
బోలె నిష్ఫలంబయ్యె నంత నమ్మహాత్ముండు సకలసాధుసుదర్శనం బయినసుదర్శనంబు
గైకొనిన సకలభూతంబులు హాహాకారంబుల నాక్రోశించుచుండె నంత నింద్రాణి
భయాకులితమానస యై సకలశరణాగతరక్షణదక్షుం డగుపుండరీకాక్షునకు
వినయవినమితోత్తమాంగ యగుచు నిట్లనియె. 139

ఉ. దేవ ముకుంద కృష్ణ జగతీధర కేశవ వాసుదేవ పు
ణ్యావహ పద్మనాభ జలజాయతలోచన వాసుదేవ యీ
దేవవరేణ్యుతప్పులు మదిన్ బరికింపక భర్తృభిక్ష నా
కీవలయున్ జుమీ యనుచు నెంతయు మ్రొక్కుచు విన్నవించినన్. 140

ఉ. శౌరి పులోమజావిమలసంస్తుతు లెంతయు నాదరించి పెం
పారెడుచల్లచూపుల సురాధిపునిన్ గడు నాదరించి నీ
వీరసమెత్తి యీపనికి నేటికివచ్చితి వింద్ర నాకు నీ
భూరుహ మిచ్చినం దఱఁగిపోయెడినే భవదీయసంపదల్. 141

మ. పురుహూతా విను పారిజాతకుసుమంబుల్ సత్యభామామనో
హరముల్ గావున నిమ్మహీజము మదీయద్వారకన్ నిల్పి యీ
యరవిందాననకోర్కి దీర్చెద మహాత్మా దీనికై నీవు కో
పరసావేశముఁ జెందనేటికి నిలింపప్రేరితోద్యోగి వై. 142

సీ. అనుటయు దేవేంద్రుఁ డంబుజాక్షునిఁ జూచి యీపారిజాతమహీరుహంబు
నధమలోకం బగునట్టిమర్త్యమునకుఁ గొని చన్న నిన్ను నేమనఁగవచ్చు
నైనను నీపత్ని యగుసత్యభామకుఁ బ్రీతి గావున నిది పెద్దలెస్స

---

సమూహము, అదరించినన్ = ప్రయోగింపఁగా, ఆయోధన = యుద్ధమునకు. 137 తుండంబునన్ ముక్కుచేత. 138 సితద్విపకులాధిపున్ = వెల్లయేనుఁగును, నిలింపసేనతోన్ = దేవతాసైన్యముతో. 139 ఆక్రోశించు = మొఱపెట్టు, ఇంద్రాణి=ఇంద్రునిభార్య, వినయవినతోత్తమాంగ = అడఁకువచేత మిక్కిలి వంపఁబడిన శిరస్సుగలది. 141 ఈరసమెత్తి = ఈర్ష్యకలిగి. 142 మనోహర

కమలాక్ష నీపరోక్షమున నీవృక్షంబు క్రమ్మఱ నాకలోకమునఁ జేరు
ఆ. ననిన వాసుదేవుఁ డట్లకాకని యింద్రు, వీడుకొలిపి తరువు వేగ గొనుచు
ధరణి కరుగుదెంచి ద్వారకాపురసమీపమున శంఖ మొత్తె పటురవమున. 143

వ. ఇవ్విధంబునం జని యంతఃపురసమీపంబున సత్యభామానివాసంబున భాసిల్లు నుద్యానవనమధ్యంబునఁ బారిజాతమహీజంబుఁ బ్రతిష్ఠించి నరకాసురపురంబునఁ దెచ్చిన పదాఱువేలు న్నూర్వురఁగన్యకల నొక్కముహూర్తంబున వివాహంబయి వారికిం బ్రత్యేకంబ గృహంబులును రమ్యహర్మ్యంబులు నుపవనంబులును కేళీజలాశయంబులును పరిచారికాజనంబులును వస్త్రభూషణాదినానాపదార్థంబులును గొఱంతలేకుండ నొసంగి యవ్విశ్వరూపుం డందఱకు నన్నిరూపంబులుగాఁ గామకేళీసుఖంబులు సంపాదించుచుండె నంత. 144

తే. నళిననాభుఁడు నరకకన్యకలయందుఁ
బ్రియతనూజుల ముప్పదిరెండువేల
మీఁద నిన్నూర్వురను గాంచె మేటిఘనుల
వార లత్యంతశౌర్యదుర్వారు లైరి. 145

వ. మఱియుఁ బ్రద్యుమ్నాదు లయినరుక్మిణీతనూజులును భానుకాదు లయినసత్యభామాకుమారులును సాంబాదు లయినజాంబవతీపుత్రులును నాగ్నజితీసూను లయినభానువిందాదులును సంగ్రామజితాదు లయినశైబ్యాత్మజులును ప్రకాశాదు లయినలక్ష్మణాపత్యంబులును శ్రుతాదు లయినకాళిందీసుతులును మొదలుగాఁ గృష్ణుం డెనుబదివేలయొక్కవేలు న్నూర్వురుకుమారులం బడసి లబ్ధసంతానుండయి యుండునాకాలంబున. 146

ఆ. బలితనూజుఁ డైనబాణాసురుఁడు పెక్కు, వేలవత్సరములు నీలకంఠు
నకుఁ దపంబుసేయ నగజాధినాథుండు, మెచ్చి వానియెదుర వచ్చి నిలిచి. 147

వ. సహస్రబాహుత్వంబును గాణపత్యంబును కౌమారత్వంబును మొదలుగా ననేకవరంబు లొసంగి మఱియు వాని నగరద్వారపాలత్వంబు నియ్యకొని తదీయరాజ్యవిభవంబునకు నొకకీడుఁ బొరయకుండ రక్షించుచుండ. 148

క. బాణుఁడు బాహాశౌర్య, త్రాణపరాయణతతోడ దనుజులు గొలువన్
శోణపురంబునఁ గడున, క్షీణమహీరాజ్యమహిమఁ జేకొని బలిమిన్. 194

ఉ. ఆలము గోరిపోయినసురాంతకుఁ గన్గొని స్వర్గమర్త్యపా
తాళనివాసు లైనబలదర్పసమేతులు వానిడాకకున్
జాలక జాలిఁబొంది తమసంపదలెల్లను దెచ్చియిచ్చినన్

---

ములు = ఇంపైనవి, నీపరోక్షమునన్ = నీకుఁబిమ్మట. 144 ప్రతిష్ఠించి=నాటి, జలాశయంబులు = సరస్సులు, సంపాదించుచు = కలుగఁజేయుచు. 147 నీలకంఠునకున్=శివునిఁగూర్చి, గాణపత్యంబు= ప్రమథగణాధిపతిత్వము. 150 ఆలము=యుద్ధము, డాకకున్ = పరాక్రమమునకు, జాలి = విచా

వాలినబాహుగర్వమున వైరములేని రమావిభూతితోన్. 150
ఆ. ఇట్లనేకకాల మేపున రాజ్యంబు, చేసి కడుమదించి యాసురారి
యుద్ధ మాత్మఁగోరి యొకనాఁడు పార్వతీ, విభునికడకు నేగి విన్నవించె. 151
ఉ. చేతులు వేయు నాకుఁ గృపచేసితి బాహుబలంబు భీకరా
రాతులమీఁదఁ జూపి సమరంబులలో జయలక్ష్మిఁబొందు పు
ణ్యాతిశయంబు లేదు త్రిపురాంతక మన్నతోడ నింక నా
చేతులతీఁటవో రణము సేయఁగ నాకు ననుగ్రహింపవే. 152
చ. అనవుడు నవ్వి శంభుఁడు సురారికి నిట్లను నీమయూరకే
తనము ధరిత్రిపైఁబడిన దానవనాయక నీకుఁ బ్రీతిగా
ఘనతర మైనసంగరము గల్గెడు పొమ్మని పల్కినన్ ముదం
బునఁ దనమందిరంబునకుఁబోయి నిజాంకముఁ జూచు నత్తఱిన్. 153
ఆ. అనఘ యేమిచెప్ప నమ్మయూరధ్వజ, మవనిమీఁదఁ గూలె నప్పురమునఁ
గలిగె సమరసూచకంబు లనేకముల్, బాణుఁ డాత్మలోనఁ బరిణమింప. 154
తే. అంత నొకనాఁడు సంతోష మావహిల్లఁ, బార్వతీపరమేశ్వరుల్ బహువిధముల
దనుజకన్యలు నప్సరాంగనలుఁ గొలువ, నుపవనక్రీడ సలుపుచునున్న వేళ. 155
క. బాణునిసుత యుష దనకున్, బ్రాణేశుఁడు లేమి దుఃఖపరవశ యగుచున్
రాణ చెడియుండఁ గని య,య్యేణాక్షిం జూచి గౌరి యిట్లని పలికెన్. 156
వ. వైశాఖశుక్లపక్షంబున ద్వాదశినాటిరాత్రి కలలోన నెవ్వఁడేని నీసురతసౌఖ్యంబు లనుభవించు నతండు నీకుఁ బతియగునని చెప్పె ఉషాకన్యయుఁ దదీయ వాక్యంబులకు సంతోషించి యుండె నంత. 157
మత్తకోకిల. గౌరిచెప్పిన నాటిరాత్రి వికాసభాసురమూర్తి యై
మారసన్నిభుఁ డైనయొక్కకుమారచంద్రుఁడు వచ్చి య
న్నీరజాననతోడికూటమి నిల్పి తత్సురతంబులన్
గారవించి యదృశ్యుఁడయ్యెను గన్నుమూయువిధంబునన్. 158
ఉ. అక్కమలాక్షి మేలుకని యద్రిజ చెప్పినమాటలన్ని యున్
నిక్కములయ్యె నన్నుఁ దననేర్పునఁ బొందినప్రాణవల్లభుం
డెక్కడనున్నవాఁడొ యతఁ డిచ్చటికేగతి నేగుదెంచునో
యక్కట మూఁగగన్నకల యయ్యెను నాకల యేమిసేయుదున్. 159
క. అని చింతించుచుఁ జని యొ,య్యన బాణాసురునిమంత్రి యగునాకుంభాం
డునిపుత్త్రి చిత్రరేఖకు, మనసునగలకోర్కి యెల్లమానుగఁ జెప్పెన్. 160
తే. చిత్రరేఖయు బాణునిపుత్త్రి తనకుఁ, బ్రాణసఖిగాన నయ్యింతిపలుకు లెల్ల

---

రము, వాలిన= హెచ్చిన. 153 నిజాంకమున్ = తనటెక్కెమును. 154 పరిణమింపన్ = కృతార్థత్వమునొందఁగా. 156 రాణ = ఒప్పిదము. 158 మారసన్నిభుఁడు = మన్మథునిఁబోలినవాఁడు.

నాదరించి నీ కింతేల యమ్మ వగవ, నేను గలుగంగ నీవిభు నిపుడె తెత్తు. 161

క. ఏడెనిమిదిదినముల నీ, రేడుజగంబులను వ్రాసి యిచ్చెద నీకుఁ
జూడుము చిత్రపటములోఁ, బ్రోడండై నిన్నుఁ బొందిపోయినవానిన్. 162

ఉ. ఆతనిఁదెచ్చి నీకుఁ బ్రియమారఁగఁ బెండిలి యేనుజేసెదన్
బ్రీతివసింప నుండుమని పెంపునఁ జిత్రపటంబునందు వి
ఖ్యాతిగ మూఁడులోకములఁ గల్గినయట్టిమహానుభావులన్
బ్రాఁతిగ వ్రాసి కొమ్మనుచు బాణతనూభవచేతి కిచ్చినన్. 163

వ. ఉషాకన్యయు స్వర్గపాతాళలోకంబులం దనమనోహరుం గానక భూలోకం బవ లోకించుచు ద్వారకాపురంబుఁ బరికించి యందు ననిరుద్ధుం గనుంగొని లజ్జావనత వదనయును బులకాంకురదంతురితశరీరయు నై చిత్రరేఖకు నతనిం జూపిన నమ్మాయలాఁడి యక్కుమారునిం జొక్కుపెట్టి తెచ్చుతలంపున ద్వారకానగ రంబునకుం జని యంతఃపురంబున నంగనాజనపరివృతుండయి నిద్రించుచున్న యక్కుమారుందెచ్చి చెలికిఁ గానుకగా నిచ్చె అప్పు డుష యనిరుద్ధునియందు సురతసౌఖ్యంబులు సలిపి కొన్నాళ్లు చనిన పిదప. 164

క. కన్యాంతఃపురములలో, నన్యపురుషుఁ డుంట యెఱిఁగి యసురేశుఁడు లో
కన్యాయముదప్పిన నిజ, సైన్యంబులతోడవచ్చి సమరము సేయన్. 165

మ. అనిరుద్ధుం డతిఘోరదర్పమున దైత్యశ్రేణిపై ఖేటకం
బును వాలుం గొనివచ్చి పెల్లదిరి యార్పుల్ నింగిముట్టంగఁ ద
ద్ఘనసైన్యంబులనెల్ల నేలఁ గలిపెన్ గల్పాంతకాలాగ్ని కా
ననభూముల్ దహియించుచందమున నానాచిత్రయుద్ధంబులన్. 166

క. అప్పుడు బాణుఁడు కన్నుల, నిప్పులు రాలంగ నతని నిశితాస్త్రములన్
నొప్పించి వేఁడి కోపము, ముప్పిరి గొన నాగపాశముల బంధించెన్. 167

తే. అట్లు బంధించి కారాగృహంబునందుఁ
గూఁతుతోఁగూడ యాదవకులజు నునిచి
రాక్షసులను బెక్కండ్రను రాకుమారుఁ
మీఁదఁ బై కావలుంచి సోమించియుండె. 168

వ. అంత నొక్కనాఁడు నారదుండు కృష్ణునిపాలికింబోయి 169

సీ. కరుణతో నచలేంద్రకన్యక యుషతోడఁ బలికినవిధమును బాణపుత్రి
కలలోన ననిరుద్ధుఁ గలిసినచందంబుఁ జిత్రపటంబునఁ జిత్రరేఖ
లోకంబులెల్ల నాలోకింపఁజేయుటయును దైత్యతనయ ప్రద్యుమ్నతనయుఁ
జూపినఁ గుంభాండు సుత వానిఁ గొనివచ్చునప్పుడు దన కెదురైనక్రమము

---

163 బ్రాఁతిగన్ = ప్రియముగా, కొమ్ము = తీసికొనుము. 164 చొక్కుపెట్టి = దేహము తెలియ కుండునట్లుచేసి, చెలికిన్ = స్నేహితురాలికి. 166 ఖేటకము = డాలువాఱు, వాలు = ఖడ్గము, ఆర్పులు=సింహనాదములు. 168 సోమించి = తృప్తినొంది.

తే. సుషయు ననిరుద్ధుఁడును గూడియుండుటయును
గయ్యమైనవిధంబు రాక్షసుఁడు నాగ
పాశబద్ధునిగాఁజేసి బందిగమున
నిడుటయును జెప్పి మునినాథుఁ డేగుటయును. 170

బాణాసురయుద్ధము.

క. ఆమఱునాఁడు ముకుందుఁడు, రామప్రద్యుమ్ను లుగ్రరణకోవిదు లు
ద్దామగతిఁ గూడి రాఁగ మ,నోముదమున గరుడవాహనుండై యరిగెన్. 171

వ. ఇట్లు శోణితపురంబున కరిగి బధిరీకృతనిశాచరసైన్యంబయిన పాంచజన్యంబు
పూరించుటయును. 172

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె గోత్రవ్రాతముల్ గ్రుంగె భా
స్కరు నశ్వంబులు త్రోవ దప్పె నుడుసంఘంబుల్ వెసండుల్లె సా
గరముల్ ఘూర్ణిలె నాకమెల్ల బెదరెన్ గంపించె శేషాహి భీ
కరమై బాణుపురంబులోఁ దొరిఁగె నుల్కాపాతముల్ బెట్టుగన్. 173

వ. అప్పుడు. 174

ఆ. దనుజనాథు రాజధాని రక్షింపంగ, భూతనాథువలనఁ బుట్టి నట్టి
మూఁడుకాళ్లు తలలు మూఁడును గల్గిన, జ్వరమువచ్చి తాఁకె సరభసమున. 175

ఆ. తాఁకి యాజ్వరంబు తనచేతనున్నభ,స్మము సమంత్రకముగఁ జటులవృత్తి
నొఱులెఱుంగకుండ నురుసత్వనిధియైన, సీరపాణిమీఁదఁ జిమ్ముటయును. 176

మ. జ్వరహస్తప్రవిముక్తభస్మనిహతిన్ సంతాపముం బొంది భీ
కరదావానలరేఖనంగ మొలయంగా భీతచేతస్కుఁడై
హరి చూడంగ హలాయుధుం డొఱఁగినన్ హాహానినాదంబు లం
బరభాగంబునఁ బుట్టె దేవతలచేఁ బ్రస్ఫీతమై యెల్లెడన్. 177

ఉ. అప్పుడు పద్మనాభుఁడు హలాయుధుఁ గన్గొని రోషశోకముల్
కప్పికొనంగ వచ్చి తనకౌఁగిటఁజేర్చిన యమ్మహాత్ముఁడున్
దెప్పిఱి లేచి యార్చె మఱిదేవతలున్ వినువీథి చక్కటిన్
జొప్పడ నాపురాణపురుషుం గొనియాడిరి తాపసోత్తమా. 178

మ. పరమాత్ముం డగుశౌరి యప్పు డనలప్రాయంబు మాహేశ్వర

170 బందిగమునన్=కారాగృహమునందు. 172 బధిరీకృత = చెవుడుపఱుపఁబడిన. 173 గోత్రవ్రాతములు = కొండలసమూహములు, ఉడుసంఘంబులు = నక్షత్రసమూహములు, డుల్లెన్ = రాలెను, ఘూర్ణిలెన్ = కలఁగెను, తొరిఁగెన్ = వర్షించెను, ఉల్కాపాతములు = కొఱవులయొక్క పడుటలు. 175 భూతనాథువలనన్=శివునివలన. 176 చిమ్ముటయుఁన్=ఎగఁజల్లఁగా. 177 ప్రవిముక్త=విడువఁబడిన, నిహతిన్ = దెబ్బచేత, రేఖన్ = విధమున, ఒలయఁన్ = ఆవరింపఁగా, ఒఱఁగినన్ = చొక్కిపడఁగా, ప్రస్ఫీతమై=మిక్కిలి యధికమై. 178 చక్కటిన్ = సమీపమునందు.

జ్వరదర్పం బణఁపం దలంచి నిజతేజస్స్ఫూర్తి శోభిల్ల దు
ర్భరహైమం బగునట్టిశీతము జనింపంజేసి పొమ్మన్న ని
ష్ఠురవృత్తిన్ జని పట్టితెచ్చి కొను మంచున్ శౌరి కొప్పించినన్. 179

చ. జ్వరము పయోజనాభునకుఁ జాఁగిలిమ్రొక్కి నుతించి యేను నీ
శరణము వేఁడికొంటి ననుఁ జంపక కావు మటంచుఁ బల్కినన్
హరి కరుణారసంబున భయంపడకుండ ననుగ్రహించె స
త్పురుషులు దీనమానసులఁ బ్రోవక మానుదురే సురేశ్వరా. 180

క. జ్వరశీతంబుల రెంటిని, సరిగా మన్నించి శౌరి జగతీస్థలిపై
నురుతరరోగమ్ములతోఁ, దిరుగుఁడు హరిభక్తిలేని దీనులకడలన్. 181

క. అని యానతిచ్చి వీడ్కొలిపిన నారోగములు రెండు పృథివీస్థలి వి
ష్ణుని భక్తిఁ గొలువనేరని, జనులం బాధించుచుండె సన్మునితిలకా. 182

వ. అంత. 183

మ. అట బాణాసురుపంపునన్ సకలదైత్యానీకముల్ దారుణ
స్ఫుటరోషంబున వచ్చి యాదవులతోఁ బోరాడినన్ మాధవో
త్కటకల్పాంతదవానలంబు నిఖిలాస్త్రజ్వాలలం గాల్చెఁ ద
చ్చటులారణ్యము తాళకేతనమరుత్సంప్రేరితంబై వెసన్. 184

ఉ. అంతఁ బురాంతకుండు ప్రమథావళి గొల్వఁగఁ గార్తికేయుఁడున్
దంతిముఖుండుతో నడవ దానవనాథునిపంపు పూని య
త్యంతభయంకరస్ఫురణనాహవభూమికి నేగుదెంచి కం
సాంతకుఁ దాఁకి పోరె విబుధావళి యచ్చెరువంది చూడఁగన్. 185

వ. ఇవ్విధంబున బినాకశార్ఙ్గపాణులు తలపడి పరస్పరజయకాంక్షులయి యనేకదివసంబులు మహాఘోరయుద్ధంబు సేసిన సకలలోకంబుల మహోత్పాతంబులు పుట్టె నప్పుడు గగనవాణీవచనప్రబోధితుం డై పురాంతకుండు సురాంతకుకడకుం బోయి యిట్లనియె. 186

ఉ. చేతులతీఁటవో రణముసేయఁగ నిమ్మని నీవు వాఁడు నా
చేత వరంబు గొంటి వది సిద్ధముగా నిపు డుగ్రశాత్రవ
వ్రాతభయంకరుండు యదువర్యుఁడు వచ్చినవాఁడు వీఁడె నీ
చేతులతీఁటవో రణము చేయుము పొమ్ము నిశాచరేశ్వరా. 187

క. అనిపలికిన బలిపుత్రుఁడు, దనచేతులలావు నమ్మి ధవళాంశుధరుం
బనిచి నిజసైన్యములతోఁ, జని కృష్ణునిఁ దాఁకి పోరె సరభసవృత్తిన్. 188

184 పంపునన్=ఆజ్ఞచేత, తాళకేతన = బలరాముఁడ నెడు. 186 పినాకశార్ఙ్గపాణులు = శివుఁడును కృష్ణుఁడును, గగనవాణీవచన ప్రబోధితుండు = ఆకాశవాణిమాటలచేత దెలుపఁబడినవాఁడు, సురాంతకుకడకున్ = బాణాసురుని యొద్దకు. 188 లావు=బలము, ధవళాంశుధరున్=శివుని

వ. ఇవ్విధంబున మహాఘోరయుద్ధంబు సేయునప్పుడు. 189

ఆ. హరి సుదర్శనమున నసురేశ్వరుని వేయి, చేతులందు రెండుచిక్క నఱకెఁ
బార్వతీశుఁ డపుడు పఱతెంచి బాణునిఁ, గావు మనుచు వాసుదేవుఁ బలికె. 190

వ. కృష్ణుండు మహేశ్వరప్రార్థితుండై బాణాసురుం గాచిపుచ్చి కారాగృహంబున నున్న యుషాకన్యకానిరుద్ధులం దోడ్కొని ద్వారకానగరంబునకు వచ్చి సుఖంబుండె నంత. 191

క. వారాణసిపుర మేలెడు, ధీరాత్ముఁడు పౌండ్రవాసుదేవుఁ డనంగాఁ
బేరుగలరాజు తనతోఁ, నే రాజులుఁ బోలరని మునీశ్వర యుండున్. 192

శ్రీకృష్ణుండు పౌండ్రకవాసుదేవుని సంహరించుట.

తే. వాసుదేవాభిధానగర్వమునఁ జేసి
పాంచజన్యసుదర్శనప్రముఖనిఖిల
చిహ్నములుఁ బూని రాజ్యంబు సేయుచుండె
నన్యభూపాలకులు దన్ను నపహసింప. 193

వ. ఇవ్విధంబున నద్దురాత్ముండు దురహంకారంబునఁ దనకొలంది తా నెఱుంగక కృష్ణుని మహానుభావత్వంబునకు నసహ్యపడి యతని పరిభవించుతలంపున నొక్క దూతతోడ సమస్తంబు నిర్దేశించి కృష్ణునిపాలికిం బనిచిన వాఁడును సకల బంధుమిత్రసమేతుండయి పేరోలగంబుననున్న కృష్ణునిం గాంచి యిట్లనియె. 194

క. విను పౌండ్రవాసుదేవుఁడు, నను నీకడ కనిచె నందనందన నీతోఁ
బనివడి నీవారెల్లను, వినఁగా ననుమన్నమాట వినుమా తెలియన్. 195

మ. జగదేకప్రభుఁడన్ సముజ్జ్వలరమాసంపన్నుఁడన్ శంఖచ
క్రగదాశార్ఙ్గధరుండఁ గౌస్తుభమణిగ్రైవేయుఁడన్ నేమహో
రగవైరిధ్వజచారుపీతవసనప్రాప్తుండ శ్రీవత్సచి
హ్నగరిష్ఠుండను వాసుదేవుఁడ నృపుల్ నాతోడ నీడౌదురే. 196

చ. బెదరక వాసుదేవుఁ డనుపేరును జక్రముఁ బాంచజన్యమున్
గదయును శార్ఙ్గచాపమును గైకొనియుండిన నోర్వవచ్చునే
యదుకులజుండ నీకు నివి యర్హమె యిన్నియు నుజ్జగించి స
మ్మదమున నన్నుఁ గొల్వ మనుమానము మానుము నందనందనా. 197

---

194 కొలంది=అంతరము, అసహ్యపడి=రోసి, నిర్దేశించి=చెప్పి, పేరోలగంబునన్=పెద్దకొలువునందు. 195 పనివడి=ప్రయత్నపూర్వము. 196 మహోరగవైరిధ్వజ = గొప్పదైన గరుడధ్వజమును, చారుపీతవసనప్రాప్తుఁడన్ = మనోజ్ఞమైనపచ్చనివస్త్రమును పొందినవాఁడను, గరిష్ఠుఁడన్ = మిక్కిలి గౌరవముగలవాఁడను. 197 ఉజ్జగించి=విడిచి.

మ. అటుగా కొండుదలంపు గైకొని మదీయంబైన సామర్థ్యమే
మిటికిం గైకొనకుండితేని నిను నెమ్మేనైన సుగ్రాజిం బ్ర
స్ఫుటశస్త్రాస్త్రహతిన్ వధించి వరుసన్ భూతంబులన్ దృప్తి సే
యుటకుం బూనుదు నీశ్వరాదులు సహాయుల్ గాఁగ నేతెంచినన్. 198

క. అనియె ననిపల్కుటయు నవ్వనజాయతలోచనుండు వానికిఁ దా ని
ట్లను మీయేలిక కోపించిన నెవ్వరికైన నేమిసేయఁగవచ్చున్. 199

ఆ. శంఖచక్రములును శార్ఙ్గంబు గదయును
నిచట విడువ నచటి కేనువచ్చి
పోరిలోనఁ దన్నుఁ బొడగాంచి ప్రాణముల్
విడుచునట్లుగాఁగ విడుచువాఁడ. 200

మ. మదవద్వైరికులంబు నాహవములన్ మర్దించి మత్కీర్తిసం
పదఁ బొందించితి నెల్లలోకముల మద్బాహాబలస్ఫూర్తిచే
నిది నాకొక్కటియుం గొఱంత యగునే యెల్లుండిలోఁ దీర్చెదన్
వెదకంబోయినతీఁగె కాళ్లఁ బెనఁగెన్ వేయేల యూహింపఁగన్. 201

క. మీయేలిక కీమాటలు, పోయి యెఱింగింపుమన్న బోరనఁ జని వాఁ
డాయంబుజనాభునభి, ప్రాయంబును దెలియఁజెప్పెఁ బౌండ్రునితోడన్. 202

సీ. తదనంతరంబ మాధవుఁడు యాదవకోట్ల నిలిపి యాచతురంగబలముతోడ
బలభద్రసాత్యకిప్రముఖుల నిజరాజధానికిఁ గాపిడి వైనతేయు
నెక్కి యెక్కుడుఁడు దేవేంద్రాదిదివిజులు జయపెట్టఁ జక్రాదిసాధనములు
గైకొని గగనమార్గంబునఁ జని పౌండ్రవాసుదేవుని పురద్వారసీమ

ఆ. నిలిచి సకలదిశలు పెలుచఁ జెవుడ్పడ, నసురవరులగుండె లవియుచుండఁ
గాశిజనులు బెదరి కంపింప శాత్రవ, సంఘభయద మైనశంఖ మొత్తె. 203

మ. అట కాశీపతియున్ మురాంతకుఁడు యుద్ధార్థంబుగా నేగుదెం
చుటకున్ జిత్తములోనఁ గోపములు నిష్ఠ్యూతంబులై యుండఁ బ్ర
స్ఫుటనాగాశ్వవరూథినీభటచయంబుల్ గొల్వఁగా వచ్చెఁ ద
మ్మటభేరీముఖవాద్యఘోషము నభోభాగంబునన్ నిండఁగన్. 204

వ. ఇట్లువచ్చి యబ్బలంబు నిబ్బరంబుగాఁ గృష్ణునిమీఁదం బురికొల్పిన 205

ఆ. పౌండ్రవాసుదేవపవనప్రయుక్తమై, యబ్బలంబులనుమహాభ్రపటలి
కమలనాభపర్వతముమీఁదఁ బైకొని, యంపవాన గురిసె నతిరయమున. 206

---

198 ఒండు=ఇతరమైన, ఎమ్మేనైనన్ = ఏవిధముచేతనైనను, ఉగ్రాజిన్=భయంకరమైన యుద్ధము నందు. 203 సీమన్ = ప్రదేశమునందు, అవియుచుండన్ = భేదిల్లుచుండఁగా. 204 నిష్ఠ్యూతంబులు = వెడలఁగ్రక్కఁబడినవి, నాగ = ఏనుఁగులయొక్కయు. 206 మహాభ్రపటలి = గొప్ప మేఘముల సముదాయము, పైకొని = ఆక్రమించి, అంపవాన=బాణవర్షము.

వ. అప్పు డప్పుండరీకాక్షుండు దుర్నిరీక్ష్యుండై శార్ఙ్గంబు గుణధ్వనిచేసి కనకపుంఖ నానావిధబాణంబుల నబ్బలంబుఁ బీనుంగుపెంటలుచేసె నయ్యవసరంబున. 207

క. ఆపౌండ్రవాసుదేవమహీపాలుఁడు నిజబలంబు నెల్లను బాహా
టోపమున శౌరి చంపినఁ, గోపించి రథంబు దోలుకొని యేతెంచెన్. 208

వ. అప్పుడు. 209

సీ. చక్రాదిసాధనసముదగ్రహస్తునిఁ గౌస్తుభగ్రైవేయకప్రభాసు
గరుడకేతన పరిష్కారరథస్థునిఁ గనకరత్నోజ్జ్వలఘనకిరీటు
సురభిచందనలిప్తశోభితగాత్రుని దివ్యవిభూషణదీప్తమూర్తి
రమణీయపీతాంబరస్రస్తకటిభాగు శ్రీవత్సచిహ్నవిశేషవక్షు

తే. వాసుదేవాభిధాను దుర్వారఘోర, సమరసన్నద్ధు నానాస్త్రశస్త్రజాల
ధరునిఁ బౌండ్రునిఁ జూచి యాధరణిధరుఁడు, మందహాసవికాసాననేందుఁడయ్యె.

వ. ఇవ్విధంబునం గనుంగొని వాని కిట్లనియె. 211

ఆ. దూతచేత నీవు తొల్లి చెప్పంపిన, మాట కింతయైన దాఁటరాదు
గాన నేడు రణముఖంబున నీమీఁదఁ, జక్ర మిపుడు విడుతు సరభసమున. 212

వ. అనిపలికి సంభూతమహోత్పాతభూతధాత్రీచక్రం బయినచక్రంబు ప్రయో
గించిన. 213

క. మండితమణిమయకాంచన, కుండలముకుటములతోడఁ గూడఁగ నాభూ
మండలపతి తల ధాత్రీ, మండలమునఁ గూలె సమరమండలి పొగడన్. 214

మ. జలజాతాక్షుఁడు శార్ఙ్గముక్తనిఖిలాస్త్రశ్రేణి నిశ్రేణిగా
నలఘుప్రౌఢిఁ దదీయసైన్యములతో నాధారుణీవల్లభుం
జెలికాఁ డున్న సురాలయంబునకుఁ బుచ్చెం దేవతాసంఘముల్
బళిరే యంచు ననేకభంగుల నుతింపం దేవమార్గంబునన్. 215

క. హరి యాబలుమస్తకముం, జరణాంగుష్ఠమున మీటె సరభసగతి నం
బరవీథి నరిగి కాశీపురిలోపలఁ బడఁగ విప్రపుంగవ బలిమిన్. 216

వ. ఇవ్విధంబున విజయలక్ష్మీసమేతుం డగుకృష్ణుండు ద్వారకానగరంబునకు వచ్చి
యథోచితప్రకారంబున నుండె నంత. 217

క. పౌండ్రునితనూభవుఁడు తమ, తండ్రిపగఁ దలంచి శౌరిఁ దాఁ జంపుటకై
పుండ్రేక్షుచాపహరునకుఁ, బండ్రెండేఁడులు తపంబు పాయకచేసెన్. 218

---

207 కనకపుంఖ = బంగారు పింజగల. 210 పరిష్కార = అలంకారముగల, స్రస్త = జాఱిన - జాఱుగాగట్టఁ బడినయనుట, ధరణిధరుఁడు = కృష్ణుఁడు. 213 భూతధాత్రీచక్రంబు = భూమండలముగలది. 214 మండిత = అలంకరింపఁబడిన, మండలి = సమూహము. 215 నిశ్రేణి = నిచ్చెన, సురాలయంబునకుం = స్వర్గమునకు. 218 పుండ్రేక్షుచాపహరునకుం = శివునిఁ

ఆ. మృడునివలన వరముఁ బడసి యాదవులతో, నబ్జనాభు గెలుచునట్టి కృత్తి
కలుగఁజేసి ద్వారకానగరంబుపై, ననుపుటయును గృష్ణుఁ డది యెఱింగి. 219

క. యదువరులకెల్ల సంతస, మొదవఁగ నాకృత్తిపైఁ బ్రయోగించె వెసన్
మదవదరివిభవక్రము, ముదితాఖిలదేవచక్రముఁ జక్రంబున్. 220

వ. ఇట్లు ప్రయోగించిన సుదర్శనంబు సకలలోకదర్శనీయంబయి చని కృత్తితోడఁ బౌండ్రనందనుం బరిమార్చి కాశీపురంబు భస్మంబుచేసి క్రమ్మఱి దామోదరు పాలికిం జనుదెంచె నివ్విధంబున. 221

క. వారిజనాభుఁడు చేసిన, పౌరుషము లమానుషములు బలభద్రునిదు
ర్వారపరాక్రమములు వి,స్తారఫణితిఁ జెప్ప దేవతలకున్ వశమే. 222

మ. ధరణీభారము మాన్పఁగాఁ దలఁచి యాదామోదరుం డిమ్మెయిన్
నరరూపంబున నుద్భవించి యనిలోనన్ దేవగంధర్వుల
చ్చెరువొందన్ నిజబాహువిక్రమము లుత్సేకింప విద్వేషులన్
బరిమార్చెన్ బలమిత్రపౌత్రకసుహృద్బంధుప్రయుక్తంబుగన్. 223

వ. మఱియు సకలలోకత్రాణపరాయణుం డయిననారాయణుండు భూభారంబు మాన్చుట తనకు నవశ్యకర్తవ్యంబు గావున ద్వాపరయుగాంతంబున జ్ఞాతులయిన పాండవకౌరవులరాజ్యభాగంబునకునై యన్యోన్యవిరోధంబులు గల్పించి సముద్రముద్రితం బయిన మహీచక్రంబునం గలరాజులతోడంగూడ నేడు పదునొకొం డక్షౌహిణు లుభయంబులం గూర్చి మహాఘోరయుద్ధంబు సేయించి సవ్యసాచికి సారథియై పాండవుల నెపం బిడి పరస్పరయుద్ధంబుల నందఱం బరలోకగతులం జేసె పదంపడి యాదవులలోన నొండొరులకు విరోధంబులు గల్పించి యందఱ నిరవశేషంబుచేసి తానును బలదేవుండు మున్నుగాఁ బరమపదంబునకుం జనియె నని మైత్రేయుం డిట్లనియె. 224

## దుర్వాసఋషిశాపవ్యాజంబున యాదవవంశము పరిసమాప్తినొందుట.

మ. మునినాథోత్తమ యాదవార్తులభయంబుల్ మాన్పు నాకృష్ణుఁ డే
మినిమిత్తంబున నాత్మవంశజుల కెమ్మై పోరు గావించి చం
పెను రాముండును దాను నెట్లు సుగతిప్రీతాత్ములై పోయిరో
వినిపింపం దగునన్న నాతనికి నావిప్రోత్తముం డిట్లనున్. 225

తే. అనఘ యాదవవంశ మత్యంతవృద్ధిఁ
బొంది యింద్రాదిసురలచే బోలుపోక

గూర్చి. 219 మృడునివలనన్ = శివునివలన 220 మదవదరివిభవక్రమున్ = మదించిన శత్రువులయైశ్వర్యమును చెఱుచుదానిని, ముదిత = సంతోషింపఁబడిన. 222 అమానుషములు = మనుష్యులకు అవిషయములైనవి. 223 ఉత్సేకింపన్ = అతిశయింప. 224 అవశ్యకర్తవ్యంబు = తప్పక చేయఁదగినపని. 226 బోలుపోక = భేదింపరాక, తలఁపుచేసెన్ = తలఁచెను.

యున్న నొకనాఁడు చూచి దామోదరుండు
తనమనంబున నిట్లని తలఁపుచేసె. 226

క. ఈవంశంబు వినాశము, గావింపక యున్నఁ దగవుగాదు ధరిత్రీ
దేవికి భారము మానదు, గావున నవ్విధము సేయఁగాఁదగు నంచున్. 227

తే. తనమనంబున నిబ్భంగి దలఁచుచున్న, యవసరంబున దుర్వాసుఁ డనుమునీంద్రుఁ
డొక్కనాఁ డప్పురంబున కొంటి నరిగి, కృష్ణు దర్శింపఁగోరి వాకిటికిఁ జనిన. 228

తే దైవకృతమునఁజేసి యాదవకుమార, వరులు కొందఱు సాంబుని వనితరూపు
గా నలంకార మొనరించి మౌనివరుని, కర్థి మ్రొక్కించి నవ్వుచు ననిరి వారు.

ఆ. అనఘ యీలతాంగియందుఁ గుమారకుఁ, డెన్నఁ డుద్భవించు నెఱుఁగఁజెప్పు
డనినఁ దెలిసి మౌని ఘనకోప మాత్మలో, నెసఁగ వానితోడ నిట్టు లనియె 230

మ. ఇది మిథ్యాసతి లోహరూప ముసలం బీయింతిగర్భంబులో
నుదయంబయ్యెడు నిందుచేత నుడియందుగ్రాహవక్షోణిలో
యదువంశంబు సపుత్త్రబాంధవముగా నంతంబునం బొందుఁ ద
ప్పదు బ్రహ్మాదులువచ్చి మాపినను నాపల్కంచు నత్యుగ్రుఁడై. 231

క. శాపం బిచ్చి యథేచ్ఛం, దాపసవరుఁ డరిగె నపుడు తద్దయు భయసం
తాపములతోడ యాదవు, లేపెల్లను బొలిసి శౌరి కెఱిఁగించుటయున్. 232

ఉ. శ్రీరమణీశ్వరుండు మునిసేఁతకు శాంతియొనర్ప నేర్చియున్
నేరని యట్లు చిత్తమున నివ్వెఱఁగందుచు నుండె నప్పుడ
ప్పౌరులు బంధువర్గమును బ్రార్థనచేసిన మాఱుమాట లే
కూరకయుండెఁ గాని మఱియొండొకకార్యము సేయఁ డెన్నఁడున్. 233

వ. అంతఁ గొన్నిదినంబులకును. 234

ఉ. జాంబవతీయుగర్భమున సంభవ మొందె మహోగ్రలోహరూ
పంబును గల్గురోఁకలి తపస్విమహోగ్రపుకోప మెల్లఁ గా
నంబడెనో యనంగను ఘనం బగునంధకభోజవృష్ణివం
శంబులపాలి మృత్యువని సర్వజనంబులుఁ దన్నుఁ జూడఁగన్. 235

క. అమ్ముసల ముగ్రసేనుని, సమ్ముఖమునఁ బెట్టుటయు విషాదము భయముం
గ్రమ్మంగఁ జేవచెడి యుల్లమ్మున దుఃఖించె యదుకులమునకు నెల్లన్. 236

చ. మది నొకతెంపుచేసి తనమంత్రులఁ గన్గొని వేగపోయి మీ
రిది కరసాన రూపుసెడ నెంతయుఁ ద్రెవ్వఁగఁబట్టి యారజం
బుదధిజలంబులం గలిపి యాఱడి నెమ్మది నుండుఁ డంతలో

---

227 తగవు = యుక్తము. 228 దర్శింపన్ = చూడ. 231 నుడియందున్=మాటలో=మాటమాత్రమున ననుట. 233 చేఁతకున్ = పనికి, నివ్వెఱఁగందుచున్ = నిశ్చేష్టతనుపొందుచు. 236 చేవచెడి = నిస్సారుఁడై. 237 కరసానన్ = గఱుకులుగలసానయందు, త్రెవ్వఁగఁబట్టి = అఱుగ

యదుకులమాపదంబో లఁగి యభ్యుదయంబును బొందుచుండెడిన్. 237

వ. అని నిర్దేశించుటయు వార లమ్ముసలంబు రజంబునేసి సముద్రజలంబులం గలిపి రారజంబు దైవకృతంబునంజేసి ముయ్యంచుతుంగరాయై యుండె నమ్ముసల శేషం బొక్కింత చిక్కిన నొక్కమత్స్యంబు మ్రింగిన కొండొకకాలంబునకు వేఁటకరులు దానిగర్భగతంబయిన యినుపములికి యొక్కలుబ్ధకున కిచ్చిన వాఁడునుం దాని దనశరంబునం దమర్చియుండె నంత. 238

సీ. అఖిలంబునందుభూతాక్రోశములుపుట్టెఁ బగలు చుక్కలు గానఁబడియె దివిని
గలిగె నుల్కాపాతములు పెక్కుదిక్కులఁ బురవీథి మృగధూర్తములు చరించె
నిండి మేఘంబులు నెత్తురు వర్షించె సందడించుచుఁ బిశాచములు దిరిగెఁ
బ్రతికూలనిర్ఘాతపవన ముగ్రతవీచె గ్రహములన్నియు వక్రగతుల నడచె

తే. నిండ్లపై నెక్కి శునకంబు లేడ్చుచుండె
మలినమై యగ్నిహోత్రముల్ మండఁదొణఁగెఁ
గాకఘూకనినాదముల్ గలయఁబర్వె
ద్వారకానగరంబునఁ దలుచుగాఁగ. 239

వ. ఇట్లనేకదుర్నిమిత్తంబులు యదువంశవినాశకంబులయి కానిపించిన నొక్కనాఁ డుద్ధవుండు కమలోదరుపాలికిం జని యేకాన్తంబున నిట్లనియె. 240

శా. ఓనారాయణ నీవెఱుంగనివిధం బొం డెద్దియుం గల్గునే
యైనం జెప్పెద యాదవాన్వయవినాశార్థంబు సూచించుచున్
నానాదిక్కుల దుర్నిమిత్తములు గానన్వచ్చె నీపుత్రమి
త్రానీకంబుల చేటుగాదె యని దుఃఖావేశుఁడై పల్కినన్. 241

ఉ. అమ్మురవైరి యాతనిముఖాబ్జమునం దనచూడ్కినిల్పి మో
దమ్ము దలిర్ప నిట్లనియె ద్వాపరమంతయుఁ జెల్లె నింక కా
ల మ్మెడలేదు యాదవకులం బొకయించుకదప్ప భూమిభా
రమ్మఖిలమ్ము మాన్చి సమరమ్మునఁ జంపితి నెల్లవారలన్. 242

క. ఈవంశంబు వినాశము, గావింపఁ దలంపుచేసికాదే మునిశా
పావసరమున నశక్తుని, కైవడిఁ బ్రతికారరహితకరుఁడను నైతిన్. 243

క. నీవును మద్భక్తుండవు, గావున సాయుజ్యపదవిఁ గావించెద స
ద్భావమున నన్నుఁ దలఁపుచుఁ, గావింపుము తపము కొంతకాలము భక్తిన్ 244

వ. ఏనును మానుషదేహంబువిడిచి దివ్యపదంబున కరిగెద మత్పరోక్షంబున ద్వారకాపురంబు సముద్రంబునం గలయంగలయది యీవాక్యంబులు పరమరహస్యంబులు సుమ్మీ యని వీడుకొలిపిన నతం డచ్చోటువాసి గంధమాదనంబునకుం జని బదరికాశ్రమంబున నరనారాయణస్థానంబునఁ దపంబు సేయుచుండె నంత

రాచి, రజము = దుమ్ము, అభ్యుదయంబున్ = శుభమును. 238 ముయ్యంచు = మూడంచులుగల. 239 మృగధూర్తములు = నక్కలు. 240 కమలోదరుపాలికిన్ = కృష్ణునియొద్దకు. 243 ప్రతి

నొక్కనాఁడు దేవలోకంబుననుండి యొక్కదూతవచ్చి సముచితప్రకారంబునం గమలనాభునిం గాంచి దేవేంద్రునివచనంబుగా నేకాంతంబున నిట్లనియె. 245

సీ. వసుమతీభారంబు వారించుకొఱకునై మనుజవేషమున జన్మంబుఁ బొంది
యఖిలభూతములకు నన్యోన్యవైరంబు గల్పించి నానాప్రకారములను
రమణీజనావశిష్టము లగునట్లుగా నందఱఁ బరిమార్చి తాహవమున
నియ్యాదవుల నింక నేయుపాయంబుననైనను మృతిఁబొందునట్లుచేసి

తే. మనుజలోకసుఖంబులు మాని నీవు, పరమపదమున కరుగుము పద్మనాభ
నీవు మహిమీఁద నూతేండ్ల కెక్కుడుండఁ,దగునె కాలక్రమంబులు దలఁపఁపలదె.

వ. అనిన నాదేవదూతకు వాసుదేవుం డిట్లనియె. 247

క. దేవేంద్రునివచనస్థితి, గావించెద యాదవప్రకాండమునెల్లన్
వేవేగ నేడుదినముల,లో వధ మొందించువాఁడ లోకోన్నతిగన్. 248

ఆ. ఏను బరమపదముకేతెంచుచున్వాఁడ, నివ్విధంబుఁ జెప్పు మింద్రుతోడ
ననుచు దేవదూత ననిచిన వాఁడేగి, దివిజవిభునితోడఁ దెలియఁజెప్పె. 249

వ. అంత యాదవులు విష్ణుమాయాప్రేరితులై సముద్రతీరంబునఁ బ్రభాసతీర్థంబునఁ గృతస్నానులై మహోత్సవవ్యాజంబున మద్యపానంబుజేసి శరీరంబు లెఱుంగక యొండొరులకు వివాదంబులు పుట్టి యనేకశస్త్రాస్త్రంబులను ముష్టిఘట్టనంబులను శిలాఘాతంబులనుం బోరాడి మఱియును. 250

తే. ఆపయోనిధితీరంబునందు మొలిచి, యున్నముయ్యంచుతుంగమహోగ్రగతులఁ
బూని పోరాడఁ దొడఁగిన భూరివజ్ర,ధారలై తాఁకు హరిమహత్త్వమునఁజేసి.

వ. ఇట్లు నిరవశేషంబుగా యాదవలోకంబు పరలోకప్రాప్తిం బొందె. 252

తే. శంఖచక్రగదాశార్ఙ్గసాధనములు, హరికి వలగొని మ్రొక్కి మాయమును బొందె
దనుజవైరియు సీరియు దారుకుండు, రథముపై నెక్కి జలధితీరమునఁ జనిరి. 253

సీ. అప్పుడు బలభద్రుఁ డలసుఁడై యొకతరుచ్ఛాయఁ గూర్చుండె నాసమయమునను
హలపాణివదనగహ్వరముననుండిశేషాహి నిజాకృతి నవతరించి
వారాశిలోఁ జొచ్చి వాసుకిమొదలుగాఁ బన్నగేంద్రులు దన్ను బలసి కొలువఁ
జనుచుండ నెదురుగా జలరాశి యేతెంచి యతిభక్తి నర్ఘ్యపాద్యాదివిధులఁ

తే. బూజ లిచ్చుటయును బ్రీతిఁ బొంది నాక
లోకమున కేగుటయుఁ బద్మలోచనుండు
తాను బరలోకమున కేగఁ దలపుచేసి
సూతుఁ డగుదారకునిమోముఁ జూచి పలికె. 254

---

కారరహితకరుఁడను - ప్రతికారము చేయనివాఁడననుట. 246 అవశిష్టము = మిగులుగలది. 248 ప్రకాండము = సమూహము. 253 వలగొని = ప్రదక్షిణముచేసి. 254 అలసుఁడు = బడలిక బొందినవాఁడు, వారాశిలోన్ = సముద్రమునందు, బలసి = చుట్టుకొని.

క. ఏ నిక ద్వారావతికిఁ, రాను బరమపదమునకును రయమునఁ బోవం
గా నుద్యోగముచేసితి, నీ నీరధితీరభూమి నెంతయు గరిమన్. 255

ఉ. ద్వారవతీపురంబున కుదగ్రగతిం జని యుగ్రసేనుఁడుం
బౌరులు మద్గురుండు తగుబంధుజనంబులు వించునుండ దు
ర్వారబలాఢ్యులై నయదువంశ్యులచావును మత్పరోక్షముం
సీరధరుండు పోవుటయుఁ జెప్పు సవిస్తరభంగి నేర్పడన్. 256

వ. అర్జునుండువచ్చి మదీయవనితాజనంబులం దనపురంబునకుఁ దోడుకొనిపోవంగల వాఁడు సవ్యసాచి వెడలునపుడు ద్వారకాపురంబు సముద్రంబునం గలసిపోవం గలయది యాదవులకుఁ బరలోకక్రియలు నిర్వర్తించి వజ్రుండు వజ్రధరనందను తోడనె యరుగంగలవాఁడు నీవు నాయందుఁ బరమభక్తుండవు గావున నవ్యయ లోకంబులు గృపసేసితి నరుగుమనిన దారుకుండు పునఃపునఃప్రదక్షిణప్రణామ పరుండయి వీడుకొని చనియె నంత. 257

## శ్రీకృష్ణనిర్యాణము.

క. పరమాత్ముఁ డగుముకుందుఁడు, పరమబ్రహ్మైక్యతత్వభావనమతితో
నురుతరయోగాసనతత్పరుఁడై కూర్చుండె సురలు బ్రస్తుతిసేయన్. 258

క. కోపనుఁ డగుదుర్వాసుని, శాపము ప్రేరేచుచుండ జడుఁ డనుమ్లేచ్ఛుం
డాపొలమున వేఁటాడుచు, శ్రీపతిపదము గని మృగము చెవి యని యేసెన్.

వ. ఇట్లేసి యామ్లేచ్ఛుండు డగ్గఱవచ్చి. 260

తే. శంఖచక్రగదాభయచారుహస్తు, సజలజలదాభగాత్రుని సకలలోక
వంద్యు శ్రీవత్సలాంఛను వాసుదేవు, విష్ణుఁ బొడగాంచి సంతోషవివశుఁ డగుచు.

వ. పునఃపునః ప్రణామంబులు సేయుచున్నకిరాతునకుఁ బ్రసన్నుండయి యుత్తమ
లోకంబునకుఁ గృపసేసి యున్న సమయంబున. 262

క. అనిమిషవనితలు నాకం,బున నుండి విమాన మొకటి బోరనఁ గొనివ
చ్చిన నెక్కి దేవునాజ్ఞను, చనియెఁ వైకుంఠమునకు శబరుఁడు మహిమన్. 263

క. పరమాత్ముఁ డపుడు సచరా,చరభూతము లుల్లసిల్లి జయ పెట్టంగా
గరుడారూఢుం డగుచును, పరమపదంబున వసించెఁ బ్రమదం బొప్పన్. 264

క. దారుకుఁ డవ్విధమున నా,ద్వారవతికిఁబోయి యదుకదంబము చావుఁ
సీరి పరోక్షంబును నం,భోరుహలోచనుఁడు సిద్ధిఁ బొందినవిధమున్. 265

క. వినిపించిన వసుదేవుం,డును బౌరులుఁ నుగ్రసేనుఁడును బంధులుఁ జే
ర్చినదుఃఖవార్ధిలోపల, మునుఁగుచు నట్లున్న సమయమున నచ్చటికిన్. 266

ఆ. వాసుదేవుఁ జూడ వాసవపుత్రుండు, ద్వారవతికి వచ్చి దారుకాఖ్యు

256 పరోక్షము=నిర్యాణము. 257 అవ్యయ=చెడని. 259 ప్రేరేచు=పేరేపించు. 261 సజలజలదాభగాత్రునిఁ = నీళ్లతోడి మేఘమువలె నల్లనైన దేహముగలవానిని, లాంఛనుఁ = చిహ్నముగలవానిని, వివశుఁడు = పరవశుఁడు. 265 కదంబము = సమూహము.

వలన యదుకులంబు పొలిసినచందంబు, విని నితాంతదుఃఖవివశుఁ డగుచు. 267

వ. ఉగ్రసేనవసుదేవులతోడ రామకృష్ణులకళేబరంబులకడకుం జని తనమనంబున. 268

క. ఇల నుత్పత్తిస్థితిలయ,ములకుం దాకర్త యైనమురవైరియఁటే
జలధిదరి నొకకిరాతుని,వలన నధమవృత్తిఁ జావవలసెను నకటా ! 269

వ. అని దుఃఖించె నప్పుడు రుక్మిణీసత్యభామాదిభార్యలెనమండ్రును గృష్ణునితోడ సహగమనంబుచేసిరి రేవతియును బలభద్రునితోడ ననలముఖంబునఁ బరలోకంబున కరిగె దేవకీవసుదేవులు నుగ్రసేనాదిపరమబంధుజనంబులును వారియట్ల పుణ్యలోకంబునకుం జనిరి అప్పు డర్జునుండు వజ్రుచేత సకలయాదవులకుఁ బరలోకక్రియలు సేయించి ద్వారవతికి వచ్చె నంత. 270

తే. వాసుదేవుండు పరలోకవాసి యైన
దివసమునఁ బారిజాతంబు దివికి నరిగె
ద్వాపరం బంతయును సమాప్తమునఁబొందెఁ
గలియుగంబు బ్రవేశించి కానిపించె. 271

వ. అర్జునుండును ద్వారకానగరంబునఁ గలసమస్తజనంబుల వెడలించి యొక్క రమ్యప్రదేశంబున నునిచె నప్పుడు వాసుదేవుని యంతిపురంబుదక్క నప్పురంబు సముద్రంబునం గలసెను. 272

సీ. వాసుదేవుఁడు భక్తవత్సలుఁ డెప్పుడు నచ్చోట ప్రత్యక్షమై వసించు
నదికారణంబుగ నమ్మహాస్థానంబు పుణ్యంబులకు జన్మభూమి యయ్యె
నచ్చోట విష్ణువిహారస్థలముగాన సతతంబు పాపనాశము సమస్త
సుఖనివాసంబు నై సొంపారునమ్మహాదేశంబు ప్రజలమందిరములందు
తే. బహుళధనధాన్యసంపదల్ పరఁగియుండు, నమ్మహాక్షేత్రసందర్శనానురాగ
మానసుం డగుచు వచ్చినమానవునకుఁ, బద్మలోచనుఁ డిచ్చుఁ గైవల్యపదము.

## అర్జునపరాజయము.

క. సురరాజతనయుఁ డప్పుడు, హరిభార్యలనెల్లఁ గొని రయంబున నరిగెఁ
శరచాపహస్తుఁడై సిం,ధురపురిమార్గంబు పూని దోర్బలశక్తిన్. 274

వ. ఇట్లు మహారణ్యమధ్యంబున నరుగునప్పు డచ్చేరువపల్లెలబోయలు మూఁకలుగూడి యడ్డంబుసని సవ్యసాచి కిట్లనిరి. 275

మ శరచాపంబులు పూని పౌరుషమహోత్సాహైకశీలుండవై
యరవిందాక్షునిభార్యలం గొని మహోగ్రారణ్యదేశంబులో
నరుగంజూచెదు తొంటిబీరములు నీ కాలాగునం జెల్లునే
గరిమన్ వీరలఁ గొంచు నిన్ను నరుగంగా నిత్తురే లుబ్ధకుల్. 276

మ. అని గర్వించి కిరాతదస్యులు మహోగ్రాకారులై పద్మనా

267 పొలిసిన=నశించిన, నితాంత = మేరలేని. 274 సింధురపురి=హస్తినాపట్టణము. 277 దస్యులు=

ఘనిభార్యానివహంబులందు నొకరిఁ బోనీక కొల్లాడినన్
ఘనుఁ డప్పార్థుఁడు గాండివంబుగొని వీఁకన్ నారి యెక్కింపఁబో
యిన దోశ్శక్తి దొలంగివో నబలుఁడై యెంతేని దుఃఖంబునన్. 277

ఆ. నలిననాభుతోడ నాబాహుశక్తియుఁ, బోలియఁబోలు ననుచు భూరిదివ్య
బాణపూర్ణమైనతూణీరములుచూడ, నవియు రిత్తలయ్యె నద్భుతముగ. 278

ఆ. మహితదివ్యబాణమంత్రాధిదేవత, లందునొకఁడుఁ దోఁపదయ్యె మదిని
నమరరాజతనయుఁ డప్పుడు జీవన్మృతుండుఁబోలె నుండె దండి వొలిసి 279

వ. ఇట్లెత్తువడినమత్తమాతంగంబునుంబోలె బలారాతినందనుండు గాండీవంబు వీచుచు నదల్చుచున్నయతనిం గయికొనక చోరు లన్నవనీతచోరుభార్యలఁ జెఱలుగొనిపోయి రంత. 280

క. శ్రీపతి భార్యలఁ గోల్పడి, యాపార్థుఁడు చిన్నవోయి యప్పుడు చనియెన్
ఏఁపున గోవులఁ గోల్పడి, గోపాలకుఁ డరిగినట్లు ఘోరాటవిలోన్. 281

వ. ఇట్లరిగి తనకు నభిముఖుండయివచ్చు కృష్ణద్వైపాయనుం బొడగాంచి విన్ననై కృష్ణాదియాదవులు పరలోకగతులగుటయుఁ గృష్ణునిభార్యలం గిరాతులపహరించుటయుఁ దనబలంబు చేవయఁడంగుటయుఁ జెప్పిన నమ్మునీంద్రుం డింద్రనందనున కిట్లనియె. 282

ఆ. కాలగతుల దైవఘటనల నొక్కొక్క, వేళ నధికుఁడైనవీరముఖ్యుఁ
డల్పబలునిచేత నవమానముసఁ బొందు, నపుడ హానిబలము నడఁగునొక్క.

సీ. మధుకైటభులతోడ మచ్చరంబునఁబోరి యిందిరాధీశుండు క్రిందుపడఁడె
యొక్కొక్కవేళ రాహుగ్రహంబున కోడి భానుశీతాంశులు పట్టువడరె
వృత్రాసురునితోడి వైరంబునకుఁగాక బలవైరి భీతుఁడై పాఱిపోఁడె
గంగాతనూజుతో సంగరం బొనరించి పరశురాముఁడు మున్ను పంతమోడె

తే. ద్రోణభీష్మాదు లగుమేటి దొరలు నీమహోగ్రబాణములకుఁగాక యోటువడరె
వారలెల్లను బాహుగర్వప్రతాప, ఘనులుగారనవచ్చునే కౌరవేంద్ర. 284

క. ఒడలెల్ల నేలపాలై, మడియును జన్మంబులెల్ల మరణములై యె
ల్లెడలం జెల్లును దీనికి, వడి సుఖదుఃఖములు నెందవలదు కుమారా. 285

క. హరిభార్యలు బోయలచేఁ, బరిభవమునఁ బొంది కోలుపడి రని మదిలోఁ
బరితాప మొందకుము భూసురశాపము మున్ను గలదు సూ వారలకున్. 286

### అష్టావక్రచరిత్రము.

వ. అదియెట్లనినం దొల్లి యష్టావక్రుం డనుబ్రాహ్మణుండు హేమనగసమీపంబున

---

దొంగలు, వీఁకన్ = కడఁకతో. 278 రిత్తలు=వట్టివి. 279 ఒకఁడున్ = ఒకటియును, జీవన్మృతుండు=బ్రతికియుఁ జచ్చినవాఁడు, దండి = బలిమి. కైకొనక = లక్ష్యపెట్టక, నవనీతచోరు = కృష్ణునియొక్క. 281 ఏఁపునన్ = సంతాపముచేత. 282 విన్ననై = చిన్నవోయి, చేవ= సారము. 286 పరిభవమునఁబొంది = భంగపడి, కోలుపడిరి = కొల్లగొనఁబడిరి.

నొక్కనలినాకరంబునఁ గంఠపర్యంతజలంబులలోన విశీర్ణపింగళజటాధరుండయి యనేకకాలంబు ఘోరతపంబు సేయుచున్న నతనికడకు రంభాతిలోత్తమాదు లయిన యప్సరాంగనానివహంబు వచ్చి నృత్తగీతవాద్యంబుల నతనిచిత్తంబు ప్రసన్నంబగునట్లుగాఁజేసి రంభాతిలోత్తమాదులు నిజనివాసంబులకుం బోయిరి. అందుఁ గొందఱు దేవాంగన లమ్మునితోడి దేవా దేవదేవుం డయినవిష్ణుదేవునకు దేవీజనంబులమయియుండ నను గ్రహింపవలయు ననినఁ బ్రసన్నుండై. 287

క. హరి యదువంశంబున ద్వాపరయుగమునఁ గృష్ణుఁ డనఁగఁ బ్రభవించు నతం డిరవంద మీకుఁ బ్రాణేశ్వరుఁడై యిష్టోపభోగవాంఛలు సలుపున్. 288

తే. అని వరం బిచ్చి యాచమనార్థముగను, గొలనితీరంబునకు వచ్చి నిలిచియున్న మౌనిపలుకుంట్లతోనున్న మేను జూచి, నలినవదనలు కలకలనవ్వుటయును. 289

క. అవ్వనజనేత్ర లీగతి, నవ్విన లజ్జించి మౌనినాథుఁడు తనలో నివ్వటిలునలుక పెంపున, జవ్వనులకు నలిగి యొక్కశాపం బిచ్చెన్. 290

వ. నన్ను నవమానించి నవ్వితిరి గావునఁ గృష్ణునిపరోక్షంబునఁ గిరాతులచేతఁ జెఱలు పోవం గలవారలని పలికి పదంపడి యనుగ్రహించి మానభంగంబులు గాక నాక లోకసుఖంబు లనుభవించెదరని చెప్పి మునీంద్రుండు వోయె నదికారణంబుగా వారి కివ్విధంబు వాటిల్లె నయ్యిందువదనలందఱు ప్రాణపరిత్యాగంబుచేసి నాక లోకంబునకుం జనిరి మఱియును. 291

ఆ. కలియుగంబుఁ జొచ్చెఁగాన మీ రెల్ల నీ, వసుధయందు నుండవలవదింక నధికతపము చేసి యవ్యయసౌఖ్యప,దములఁ బొందవలయు ధర్మయుక్తి. 292

ఆ. ఈతెఱంగు నీవజాతశత్రునితోడఁ, దెలియఁజెప్పు మనుచు దివ్యమౌని చనియె నపుడు సవ్యసాచి వజ్రుఁడుఁ దాను, హస్తినగరమునకు నరుగుదెంచి. 293

ఆ. పాండవాగ్రజునకుఁ బద్మలోచనునివృత్తాంత మెల్లఁ జెప్పి వ్యాసమౌని కలఁకదేర్చి తన్నుఁ బలికినపలుకును, విశదముగను విన్నవించుటయును. 294

వ. వ్యాసోపదేశంబున ధర్మనందనుం డభిమన్యునందనుం డైనపరీక్షిత్తునిం గౌరవ రాజ్యంబునకుఁ బట్టంబుగట్టి భీమార్జుననకులసహదేవద్రౌపదీసమేతుండై తపోవ నంబున కరిగె అని యిట్లు కృష్ణుచరిత్రంబులు చెప్పినమైత్రేయుండు పరమానంద పరిపూర్ణహృదయుండై పరాశరున కిట్లనియె. 295

క. పరమాత్ముఁ డైనవిష్ణుని, చరితము లన్నియును నీప్రసాదంబున వి స్తరఫణితి వినఁగఁగలిగెను, హరిభక్తియుఁ గలిగెఁ గడుఁ గృతార్థుఁడ నైతిన్.

ఆ. ఇంక నొక్కయర్థ మేను నిన్నడుగంగఁ, గోరియున్న వాఁడ గురుగుణాఢ్య కలియుగంబునందుఁ గలధర్మములు జగ,త్ప్రళయలక్షణములు దెలుపవలయు.

287 నలినాకరంబునన్ = సరస్సునందు, విశీర్ణపింగళజటాధరుఁడు = విరియఁదీయఁబడిన గోరోజనపు వన్నెగల జడలు ధరించినవాఁడు, దేవీజనంబులము = భార్యలము. 290 నివ్వటిలు = అతిశయించు.

## కలియుగధర్మము.

క. అనవుడు నతఁ డమ్మునిసుతుఁ, గనుఁగొని యిట్లనియెఁ గలియుగంబున ధర్మం
బొనరంగ నేకపాదమ్మున నడచుటఁ జేసి ధర్మములు లేకుండన్. 298

ఆ. అవనియందు వైదికాచారములు తపో
యజ్ఞములును దేవతార్చనాగ్ని
హోత్రములు వివాహయోగ్యదాంపత్యక్రి
యలుఁ దొలంగిపోవుఁ గలియుగమున. 299

క. గురుశిష్యవర్తనంబులు, పరిభవములు వొందు విష్ణుభక్తియు వేదాం
తరహస్యంబులుఁ జెడు సంకరమగువర్ణాశ్రమములు కలియుగవేళన్. 300

సీ. కులహీనులకుఁ గన్యకల నిత్తు రధికులు బలవంతుఁ డగువాఁడె యిలకుఁ గర్త
ద్విజనామమాత్రులు దీక్షితు లగుదురు మనుజు లేవేల్పునైనను భజింతు
రాచరించినదె ప్రాయశ్చిత్తమగుఁ బల్కినవిశాస్త్రములు చెప్పినదియె నీతి
దానంబు గావించి తపములు విడుతురు ధర్మ మేలాగువర్తనములైన
తే. ధనముగలవాఁడె రాజు మాగ్ధ్యమున నున్న
వాఁడె హీనుఁడు కల్లాడువాఁడె ప్రోడ
పాపవర్తను లగువారె భాగ్యవంతు
లెలమి గలవారె పూజ్యులు కలియుగమున. 301

క. కులసతుల విడిచి పురుషులు, కులహీనులయిండ్లఁ బోయి కూటికొఱకుఁ గ
న్నెలఁ బెండ్లియాడియుందురు, నిలువరుసలుఁ బౌరుషములు నెడలి మునీంద్రా.

ఆ. అర్థ మిచ్చెనేని యధమాధమునినైన, నాశ్రయింపఁ జూతు రార్యమతులు
సూనృతంబుబలము శూరత్వమును లేదు, కల్లతనముగలదు కలియుగమున. . 303

సీ. పతిభక్తి యుడిగి సంతతమును దమయిచ్చవచ్చినతెరువుల వ్యభిచరించి
పెక్కుబిడ్డలఁ గాంచి పేదఱికము చేత బడలుచు జీవనోపాయములకు
వెరవేమియును లేక విచ్చలవిడి నీచకర్మంబులకుఁ జొచ్చి గాసిపడుచుఁ
దల్లిదండ్రుల నన్నదమ్ముల నత్తమామల బంధుజనులఁ బుత్రులను విడిచి
తే. యుండుదురు రెండుచేతుల నొక్కపరియ
మస్తకము గోఁకికొందురు మగువలెల్లఁ
గల్లలాడుచుఁ బరుషవాక్యములతోడ
నలిగియును భాగ్యహీనలై కలియుగమున. 304

క. స్నానము సంధ్యయు జపమును, మాని దురాచారులై సమంజసకులధ
ర్మానుష్ఠానము లొల్లక,హీనత వర్తింపుదురు మహీసురులెల్లన్. 305

293 అజాతశత్రునితోడన్ = ధర్మరాజుతో. 301 ఎలమి = సంపద. 302 ఇలువరుసలు = పెద్దలనాటనుండి జరగుమర్యాదలు. 304 ఒక్కపరియ = ఒక్కసారే, కల్లలు = అసత్యములు.

సీ. తఱుచు వానలు లేవు ధరణిఁ బంటలు పండ రాజు లన్యాయవర్తనము లుడుగ
రుర్వీసురులు వేదమొల్లరు దుర్భిక్షమగు నెల్లకాలంబు తగవు లెడలి
వార్తావిహీనులై వైశ్యులు శూద్రుల యట్లవర్తింపుదు రధమజాతి
నాశ్రయింపుదురు ధనార్థులై యధికులు కడునీతిబాధయుఁ గలిగియుండు
తే విప్రవరులకు శూద్రులు వేదశాస్త్ర, ధర్మములు చెప్పుదురు తల్లిదండ్రులందు
భక్తి చెడి యత్తవారలప్రాపు గోరి, మెలఁగుదురు సర్వజనములు కలియుగమున.
తే. కాంత కైదునాఱేండ్లకుఁ గలుగు సుతుఁడు
పదియు పండ్రెండునేండ్లలో ముదిమి చెందు
మనుజుఁ డిరువదియేండ్లలో మరణమొందుఁ
దాపసోత్తమ కలియుగాంతంబునందు. 307
సీ. వేదశాస్త్రంబులు విప్లవంబును బొందుఁ బాషండమతములు ప్రబలి వచ్చు
నాదిదేవుం డైనహరిఁ గొల్వ రెవ్వరు సేవింతు రల్పంపుదైవములను
శూద్రులుఁబోలె భూసురులు వర్తింతురు సకలవిద్యలు నీచజాతి నేర్చు
నుత్తము లగుక్షత్రియులు చెడిపోదురు మ్లేచ్ఛు లేలుదురు భూమీతలంబు
తే. పుణ్యవంతుల కాయువు పొలిసిపోవు, పాపకర్ముఁడు నూఱేండ్లు బ్రతికియుండు
నల్పబుద్ధులు నల్పభాగ్యములుగాని, మతులు సిరులును పసలేవు మనుజులకును.
ఆ కృతయుగాదులందు నతులప్రయత్నంబు, సేయకున్న మేలు చెప్పలేదు
కలియుగంబునందు సులభయత్నంబున, వలన నధికమైనఫలముగలుగు. 309
తే అనఘ యేతన్నిమిత్తమైనట్టి యొక్క
కథ వివఱింతు విను మాదికాలమునను
మునులు కొందఱు సభగూడి వినుతఫలము
నల్పధర్మక్రియలు నెట్టు లబ్బు నొక్కొ. 310
తే. అనుచుఁ దమలోనిసంశయం బపనయించు, కొనఁగ నేరక నాసుతు ననఘమూర్తి
యైన యట్టివేదవ్యాసు నడుగఁగోరి, కడుఁ బ్రయత్నంబుతోఁ జని గంగయందు.
క. మౌనంబుతోడ నర్ఘ్యస్నానం బొనరించుచున్న సాత్యవతేయుం
గానిచి యమ్మౌని యనుష్ఠానాంతమునందు నడుగఁ జనుఁ బను లనుచున్. 312
తే. తపసులెల్ల గంగానదీతటమునఁ దరు
షండములలోనఁ బ్రవిమలసైకతముల
యందుఁ గూర్చుండి రప్పు డంతయు నెఱింగి
వ్యాసమునిపతి యెఱుఁగనివాఁడుఁబోలె. 313
వ. వారలందఱు వినఁ "గలిస్సాధు శూద్రస్సాధుస్త్రియస్సాధు" వనుచు ముమ్మాఱు
మునింగి వెడలి కాలోచితకృత్యంబులు దీర్చి బ్రహ్మసభకుఁ బ్రదక్షిణప్రణామంబు

308 విప్లవంబును=చేటును. 311 అపనయించుకొనఁగన్ = పోఁగొట్టుకొన. 312 కానిచి = చూచి.
313 తటమునన్ = గట్టునందు, షండము=సమూహము, సైకతములయందున్ = ఇసుకదిన్నెలయందు.

లాచరించి వారిచేత సంభావితుండై కూర్చుండి యుచితసల్లాపంబులు సేయుచున్న
సమయంబున నమ్మును లతని కిట్లనిరి. 314

ఆ. సొరిదిఁ గలియుగంబు శూద్రులు కాంతలు, సాధు లనుచు నేటిజలములోనఁ
దీర్ఘమాడునపుడు తెలియంగఁ బలికితి, రివ్విధంబు మాకు నెఱుఁగవలయు. 315

వ. అనిన మందస్మితవదనారవిందుండై సత్యవతీనందనుండు వారల కిట్లనియె. 316

సీ. కృతయుగంబున భక్తిగీలించి పదియేండ్లు ధ్యానంబుచేసిన నలరు శౌరి
త్రేతాయుగంబునఁ బ్రీతితో నేఁడాది మఖముచేసిన మెచ్చు మాధవుండు
ద్వాపరంబున రేపు మాపును నెలనాళ్లు పూజచేసినఁ బ్రీతిఁబొందు విభుఁడు
కలియుగంబున భక్తి నెలకొన నొకనాటిసంకీర్తనకు మెచ్చు శార్ఙ్గధరుఁడు

ఆ. మొదలఁజెప్పినట్టి మూఁడుయుగంబులఁ, గడుప్రయాసపడినఁగాని యల్ప
ఫలముచేర దధికఫలమప్రయాసతఁ, గలుగుఁగానఁ గలియుగంబుమేలు. 317

మ. చతురామ్నాయములుం బఠించి క్రతుదీక్షాదక్షులై యుత్తమ
వ్రతముల్ సేయుచు దేవతాతిథిసపర్యల్ భక్తి గావించి శా
శ్వతయోగంబును బ్రహ్మచర్యముఁ గులాచారంబుఁ దోరంబుగాఁ
బ్రతిభం జేయుట నిత్యకర్మములు విప్రక్షత్రవిడ్జాతికిన్. 318

తే. వసుధ బ్రాహ్మణక్షత్రియవైశ్యులకును, నైజములు నిత్యకర్మముల్ నడపుటెల్ల
నందు నొక్కటి వెలితైన నధికమైనఁ, బాతకము చెందుఁ జేసినఫలము లేదు. 319

ఆ వినుఁడు పాకయజ్ఞమును విప్రసేవయుఁ. జేసి యధికఫలముఁ జెందు శూద్రుఁ
డవి దొఱంగెనేని నణుమాత్రమైనను, బాతకంబు వానిపాల లేదు. 320

క. వెలయఁగఁ గర్మాకర్మంబులు పేయాపేయములును భోజ్యాభోజ్యం
బులు విప్రానులకరణిని, గలుగవు శూద్రులకుఁ బుణ్యగతులును గలుగున్.

క. ఉపవాసాయాసంబులు, తపములు యజ్ఞములు దానధర్మంబులు లే
క పరమపుణ్యు లగుదు ర,చ్చపుశూద్రులు సాధు లగుదు రవనీస్థలిలోన్. 322

క. మనమును బలుకును గర్మంబును నేకముగా మనోవిభునిఁ గొల్చినయా
వనిత నిరాయాసంబునఁ, దనపతియును దాను శుభపదంబున నుండున్. 323

క. క్రతువులు జపములుఁ దపములు, వ్రతములుఁ జేయక యథాభివాంఛితమతితోఁ
బతిభక్తిఁ బుణ్యఫలశా,శ్వతు లగుదురు గాన సతులు సాధులు సుండీ 324

చ. అనవుడు సంతసిల్లి మునులందఱు సత్యవతీతనూభవుం
వినుతు లొనర్చి నిర్మలవివేకమహాత్మక యేము గోరివ

314. బ్రహ్మసభకుం=బ్రాహ్మణగోష్ఠికి. 318 చతురామ్నాయములుం=నాలుగువేదములును, సపర్యలు= పూజలు, విడ్జాతి = వైశ్యజాతి. 320 దొఱంగెనేనిం = విడిచెనేనియు. 321 పేయాపేయములు= త్రాగఁదగినవి త్రాగరానివి, భోజ్యాభోజ్యంబులు = భుజింపఁదగినవి భుజింపరానివి. 324 యథాభివాంఛితమతితోం = కోరఁదగినవానిఁ గోరునట్టిబుద్ధితో. 325 ఏము = మేము, చరితార్థులు =

చ్చిన పనులెల్ల నీ విపుడు చెప్పినపల్కులలోఁ బ్రకాశమ
య్యెను జరితార్థులైరి విను మిందఱు నీవలన న్నిజంబుగన్. 325

క. అని కృష్ణద్వైపాయన, మునివరుఁ బూజించి ప్రమదమునఁ దాపసులె
ల్లను దమతమనెలవులకున్, జనిరి తదీయంబులైనసల్లాపములన్. 326

క. అనిచెప్పి పరాశరుఁ డమ్మునిపుత్రునిఁ జూచి పాపములను నిలయమై
యొనరినకలియుగమందును, ఘనమొక్కటి గలిగియుండి గణనకు నెక్కున్. 327

క. పరమరహస్యం బీకథ, పరిపాటిగ నీకుఁ దేటపడఁ జెప్పితి నా
హరిసంకీర్తన మఱవక, చరితార్థం డగుచు నుండు సన్మునితిలకా. 328

మ. అనినన్ శిష్యుఁడు సంతసం బొదవ నయ్యాచార్యునిం జూచి యి
ట్లనుఁ గల్పాంతమునన్ జగంబుల కపాయం బెమ్మెయిం గల్గు న
వ్వనజాయతనేత్రుఁ డెవ్విధమునన్ వర్తించు నాకేర్పడన్
వినుపింపం దగునన్న నాతనికి నవ్విప్రోత్తముం డిట్లనున్. 329

నైమిత్తికప్రాకృతాత్యంతికము లనెడు మూఁడు ప్రళయముల వివరణము.

చ. అనఘ నిమిత్తమాత్రముననైన పటుప్రతిసంచరక్రియల్
వినుము మహాయుగంబు లొకవేయి చనంగ దినంబునందు న
వ్వనరుహసూతి కప్పు డనివార్యగతిన్ హరి తామసంబు పెం
పొనరఁగ రుద్రరూపమునఁబొంది భయంకరమై చెలంగినన్. 330

క. త్రాణలు చెడి దుఃఖంబులు, ప్రాణభయంబులును గలిగి బడలిక లొదవన్
క్షోణిఁ జరాచరచయములు, క్షీణప్రాయంబులై నశించు మునీంద్రా. 331

క. ఇలపై శతసంవత్సరములు వానలులేక భూతముల నన్నింటిన్
బొలియించు నరాజకములు, గలుగుఁ బ్రజానాశమునకుఁ గారణములుగన్. 332

క. జలహీతు వేయికిరణం, బులలోపల నధికతీవ్రములు నత్యుష్ణం
బులు నైనయేడురశ్ములు, నలినాప్తుఁడు నిలిచి క్రోలు నానాజలముల్. 333

ఉ. స్థావరజంగమంబులరసంబులు సప్తసముద్రవాహినీ
గ్రావగతోదకంబులు నగాధరపాతళజీవనంబులున్
ద్రావఁగ నెల్లలోకములు దగ్ధము నొందినయట్లు యుండు న
ద్దేవునిదీప్తులేడు నవతీర్ణము నొందుఁ బ్రచండమూర్తులై. 334

క. ఆసప్తప్రళయార్క, వ్యాసమయూఖౌఘతీవ్రవహ్నిజ్వాలా
న్యాసముల మూఁడుజగములు, భూసురపుంగవ వినాశమునఁ బొందుఁ జుమీ.

---

నెఱవేఱిన ప్రయోజనము గలవారు. 330 తామసంబు = తమోగుణము. 331 త్రాణ = శక్తి. 333 రశ్ములన్ = కిరణములచేత, క్రోలున్ = పీల్చును. 334 గ్రావగత = కొండలను బొందిన, జీవనంబు = నీళ్లు, అవతీర్ణమున్ = దిగుటను, ప్రచండమూర్తులు = తీవ్రమైన యాకృతిగలవి. 335 వ్యాస = విస్తారముగా ప్రసరించిన, న్యాసములన్ = ఉంచుటలచేత.

మ. నదులున్ గొండలు వార్ధులున్ వనములున్ నానాతటాకంబులున్
త్రిదశవ్రాతము మానవప్రతతియున్ దిర్యక్సమూహంబులున్
దుదగా నన్నియు భస్మమైన మహిఁ జెందున్ గూర్మపృష్ఠాకృతిన్
మద మేపార జనార్దనుం డపుడు భీమప్రౌఢసంరూఢుఁడై 336

క. కాలాగ్నిరుద్రుఁడై బలు, కీలల క్రొమ్మంటలోలిఁ గ్రిక్కిఱియంగా
భూలోకంబున నించినఁ, ద్రైలోక్యంబునకుఁ బుట్టు దహనక్రీడల్. 337

క. శేషునిముఖనిశ్వాసవి,భీషణవాయువుల నాగబృందాలయమున్
శోషింపఁజేయు నప్పుడు, వైషమ్యము నొంది వాయువహ్నులు గూడన్. 338

క. పైకొని చిచ్చును గాలియు, నేకంబై ముజ్జగంబు నేర్చుచు నుండున్
లోకాలోకాంతరభూ, లోకము ప్రోయిఁబోలె మండు లోకేశనుతా. 339

క. మును వోయి మహర్లోకం,బున నున్న సనందనాదిమునిబృందంబుల్
ఘనదహనార్చులకోర్వక, జనలోకంబునకుఁ బోయి సంచారింతుర్. 340

వ. అప్పుడు రుద్రరూపియై జనార్దనుండు. 341

క. తనముఖనిశ్వాసంబున, ఘనతరసంవర్తమేఘగణములు విద్యు
జ్జనితస్తనితంబులుగా, జనియింపఁగఁ జేయుఁ జటులసంరంభమునన్. 342

వ. అవియును ననేకరూపంబులతోడ నానావర్ణసమేతంబులయి మహాఘోరసంరావంబులు గల్పించుచు సమస్తదిశాపరిపూర్ణంబులయి మహాంధకారంబులు గల్పించుచు విభీతకఫలప్రమాణంబులయిన యాసారవర్షంబులు గురిసి మహాప్రచండప్రళయదహననిచయంబులు వారించి భువర్లోకపర్యంతం బేకోదకంబు సేయు నప్పుడు. 343

క. హరి తనముఖనిశ్వాసో,త్కరములచే వాయువులను గల్పించి భయం
కరవారిధరచయంబులు, విరియఁగ నూఱేండ్లు బిట్టు వీచు మునీంద్రా. 344

తే. అట్టి ప్రళయానిలంబు జనార్దనుండు, మగుడఁ గ్రోలి సమాధానమతిఁ జెలంగి
జలధిఁ బవళించు నాశేషశయ్యయందు, వేయిదివ్యయుగంబులు విప్రముఖ్య. 345

వ. ఇవ్విధంబునం బవళించి యాత్మమాయామోహితుండయి వాసుదేవాత్మకంబయిన పరతత్వంబుఁ జింతించుచు జనలోకనివాసులయిన సనందనాదిమునిబృందంబుల చేత వర్ణితుండయి యోగనిద్రం జెంది నిశాతీతకాలంబునఁ బ్రబుద్ధుండయి రాజస

336 వార్ధులు=సముద్రములు, కూర్మపృష్ఠాకృతిన్ = తాఁబేటి వీఁపు చిప్పవలె. 337 బలుకీలల క్రొమ్మంటలు= మిక్కుటపు సెగలతోడి క్రొత్తమంటలు, ఓలిన్ = క్రమముగా, క్రిక్కిఱియంగాన్ = మిక్కిలి క్రమ్ముకొనఁగా. 338 నాగబృందాలయమున్ = పాతాళమును, వైషమ్యమును = విషమభావమును, (విషమము= సరితప్పినది.) 342 సంవర్త = ప్రళయసంబంధియైన, విద్యుజ్జనితస్తనితంబులుగాన్ = మెఱపులవలనఁ బుట్టినయుఱుములు గలవిగా, 343 సంరావంబులు = ధ్వనులు, విభీతకఫలప్రమాణంబులు = తాండ్రకాయలంతలేసి, ఆసారవర్షంబులు=ముసురువానలు. 344 వారిధరచయంబులు=మేఘసమూహములు, విరియఁగన్ = విరిసిపోఁగా. 345 సమాధానమతిన్ = నెమ్మదిగా. 346 ప్రబుద్ధుండు =

గుణంబువలన బ్రహ్మరూపంబు ధరియించి ప్రజాసృష్టి యొనర్చునని యిట్లు నైమిత్తికప్రళయంబుఁ జెప్పి యిట్లనియె. 346

ఆ. విప్రముఖ్య ప్రాకృతప్రళయంబు నీ, కేర్పరించువాఁడ నింక వినుము
మత్పితామహుఁడు జగత్పితామహుచేత, వినఁగఁ దెలివిపడఁగ వింటిఁ దొల్లి.

క. మును చెప్పిన నైమిత్తిక, మనుప్రళయము కరణి నూఱు హాయనములు భూ
మిని వాన గురియకుండిన, నొనరఁగ జగములకు నగు మహోపద్రవముల్. 348

వ. అప్పు డవనికిం బ్రధానగుణం బయినగంధతన్మాత్రగుణంబు జలంబులు గొనిన నాజలం బగ్ని యందుఁ గలయు ననలంబునకుఁ దన్మాత్రగుణం బయినరూపంబు వాయువుఁ గొనిన ననలంబును ననిలంబునందుఁ గలయు సమీరంబునకుఁ దన్మాత్రగుణం బయినస్పర్శంబు నాకాశంబుఁ గొనిన సమీరం బాకాశంబునందుఁ గలయు నభంబునకుఁ దన్మాత్రగుణం బయినశబ్దంబు భూతాదిచేత గ్రసింపంబడు నట్టి భూతాదియు బుద్ధియుక్తంబైన మహద్వస్తువువలన గ్రహింపంబడు నిట్టి సప్తావరణకంబయిన బ్రహ్మాండంబు మహార్ణవంబున మునింగి ప్రకృతియందు లీనంబగు. 349

సీ. మునినాథ యీవిశ్వమునకుఁ బ్రధానకారణభూతమైనట్టి ప్రకృతితత్వ
మవ్యక్తపురుషునియందు లీనంబగు నమ్మహాత్ముఁడు శుద్ధుఁ డక్షరుండు
భవ్యుఁ డేకాకి సర్వవ్యాపియై యుండు నతఁడు సర్వాత్మకుఁ డయినయట్టి
పరమాత్మునంశసంభవుఁ డట్టి పరమాత్మునకు నామజాతు లెన్నఁడును లేవు

తే. జ్ఞానమయుఁడు సత్తామాత్రుఁడై నిరస్త
భంగిఁ జెలువందు పరముఁడు బ్రహ్మ యీశ్వ
రుం డనంగను నెగడు నిరూఢవాచ
కములకును వాచ్యుఁడై యుండు నమలగతిని. 350

తే. అట్టి పరమాత్ముఁడన విష్ణుఁ డవ్విభుండు, నిఖలవేదాంతవేద్యుండు నిర్మలుండు
ముక్తికాముల కాహరి భక్తియుక్తి, వలనఁ బునరాగమనములు గలుగకుండు.

క. ఆపరమాత్ముఁడు విష్ణుని, లోపల లీనమును బొందు లోకస్తుతుఁడై
దీపించు హరి సమస్త, వ్యాపియునై యెన్నఁడును లయము లేదు సుమీ. 352

వ. అని యిట్లు ప్రాకృతసంచరం బెఱింగించి పరాశరుండు వెండియు నాత్యంతిక ప్రళయంబుఁ జెప్పువాఁడై మైత్రేయున కిట్లనియె. 353

మేలుకొన్నవాఁడు. 347 ఏర్పరించువాఁడఁ = విశదముగఁ జెప్పెదను. 348 హాయనములు= సంవత్సరములు. 350 అవ్యక్త = తెలియరాని. శుద్ధుఁడు = పరిశుద్ధుఁడు. అక్షరుండు = నశింపని వాఁడు. భవ్యుఁడు = శుభస్వరూపుఁడు, ఏకాకి = ఒంటివాఁడు, సర్వవ్యాపి = అంతటనిండియుండు వాఁడు, నామజాతులు = పేరుపుట్టుకలు. 351 పునరాగమనములు = మరలవచ్చుటలు. 352 లీనము = ఐక్యము. 353 సంచరంబు ప్రళయము.

తే. అనఘ యాధ్యాత్మికంబును నాధిభౌతి
కంబు నాధిదైవికమునాఁ గలుగునట్టి
వ్యథలు తాపత్రయంబులై యఖిలజంతు
వుల మహాదుఃఖములఁ బెట్టి యలఁపుచుండు. 354

క. శారీరమానసములన, నారయ నిరు దెఱఁగులందు నాధ్యాత్మికమా
శారీరము రోగములు మ, హారోష క్రోధమదము లగుమానసముల్. 355

క. ఇలఁబరులవలనఁ బ్రాణికిఁ, గలదుఃఖము లాధిభౌతికములన వాత
జ్వలనాదులపీడలనొ, ప్పలవడియుండుటయె యాధిభౌతికమయ్యెన్. 356

దేహధారికిఁ గలుగుగర్భజన్మజరాదిక్లేశములవివరణము.

వ. ఇట్టి తాపత్రయంబు శరీరికి గర్భజన్మజరాజ్ఞానమృత్యునారకసంభవంబులైన
యనేకభేదంబుల నత్యంతదుఃఖంబు లాపాదించు నెట్లనిన. 357

సీ. కోమలదేహంబుతో మలమధ్యంబునందు మావినిఁబుట్టి యధికభుగ్న
మున నురమును బృష్ఠమునుఁ గూడి కంఠంబు కడుపులోన నడంగి కరచరణము
లంగంబుతోఁ గూడి యరఁటిపూవునుబోలె ముడిఁగి మూత్రములోన ముద్దగట్టి
తీక్ష్ణోష్ణతువరామ్లతిక్తామ్లములు తల్లి భుజియింపఁ దద్దుఃఖములకు నోర్చి

తే మేనఁ బ్రాణంబు గలిగియు మెలఁగరాక, వర్ధిలుచును బ్రజాపతి వాతనిహతి
చేతఁ దలక్రిందుగాఁబడ సూతిమారు, తమునఁ ద్రెళ్లింప మూర్ఛిల్లి ధరణిఁ ద్రెళ్లు.

తే. బాహ్యవాయువు సోఁకి విభ్రష్టమైన, యెఱుకతో దేహమంతయు నిఱచఁబట్టి
క్రకచములఁ గోసినట్టులఁ గంటకముల, నూఁదినట్లనయవంబులు నొచ్చుచుండు.

ఆ. ఒడలు గోఁకికొనఁగ నొడికిలఁ బవళింప, శక్తిలేక పెక్కుసంకటములఁ
బొంది స్నానపానభోజనోపాయంబు, లకు స్వతంత్రవృత్తి యొకటిలేక. 360

క. ప్రువ్వులు నీఁగెలు దేహము,నొవ్వం గఱవంగ మిగుల నొచ్చి యధముఁడై
యివ్విధమున దుఃఖము లెడ, త్రెవ్వక వర్తించు జన్మదివసమునందున్. 361

తే. ఆధిభౌతికతాపంబులందుఁ గంది
సంతతంబును నజ్ఞానసంవృతాత్ముఁ

---

355 శారీరమానసములు = శరీరసంధులు మనస్సంబంధులునైనవి. 356 వాతజ్వలనాదుల=వాయువు ఉష్ణము మొదలగువానివలని, నొప్పలపడు = బాధకలుగు. 357 ఆపాదించున్ = కలిగించును. 358 కోమల=లేఁతయైన, భుగ్నమునన్ = వంకరచేత, తీక్ష్ణ=కారము. ఉష్ణ = వేఁడియైన, తువర = వగరు, అమ్ల = పులుసు, తిక్తామ్ల = చేఁదుతోడిపులుసు, (ఇవిగలవస్తువులను,) వాతనిహతిచేతన్ = గాలి దెబ్బచేత. సూతిమారుతమునఁ ద్రెళ్లింపన్ = ప్రసూతివాయువుచేత పడఁద్రోయఁగా. 359 విభ్రష్టము = మిక్కిలిచెడినది, ఇఱచఁబట్టి = చలిచే మొద్దుపాఱి, క్రకచములన్ = ఱంపములచేత, కంటకములన్ = ముండ్లచేత, ఊఁదినట్లు = పొడిచినట్లు. 361 ప్రువ్వులు = పురుగులు, ఎడత్రెవ్వక = ఎడతెగక, 362 కంది = తపించి, సంవృత = కప్పఁబడిన.

డగుచుఁ దాఁ దన్నె ఱుంగక యధికమూఢ
వృత్తితో బాల్యముననుండి విప్రముఖ్య. 362

తే. యావనాదికాలంబుల నధికమత్తుఁ
డగుచు ధర్మవిరోధంబు లైనయర్థ
కామములు సంతరించుచుఁ గడయు గుఱుతు
లేని యీషణములచేత లీనుఁడగుచు. 363

వ. శిశ్నోదరపరాయణుండై నరకప్రాప్తి హేతుభూతంబు లైనకర్మంబు లాచరించుచు
వార్ధకంబున. 364

సీ. చంచలత్వముఁ బ్రతిశ్యాయంబు గలుగును దంతంబు లూడును దల వడంకు
సకలాంగకంబులఁ జపలత్వమలఁ జెడు శిరమును గడ్డంబు నరసియుండు
పెద్దవిన్నపము చెప్పినఁగాని వినరాదు చెలువెలుం గిడకున్నఁ జెడును దృష్టి
శిథిలమై దేహంబు చిక్కి బీదనరంబు లవయవంబుల దట్ట మగుచునుండు

తే. వెన్నె ముక వంగు నాసలు విస్తరిల్లు, నల్పభోజన మగు నిద్ర యణఁగిపోవు
నడువఁ గానోపఁ దూఁతకోలిడకయున్న, ముదిసి ముప్పుననరుఁడిట్లు ముట్టఁబడును.

వ. ఇట్లు వార్ధకదుఃఖంబు లనుభవించి యవసానకాలంబున. 366

సీ. పలుకులు బొట్రిలు నెలుఁగుసన్నం బగు నలఁత దేహంబున నగ్గలించుఁ
గంపించు సకలాంగకములు నాఁకలి చెడు దాహంబు పొడము సత్వంబు పొలియుఁ
బరవశత్వం బంతఁ బొటిల్లుఁ జచ్చినవారితో భాషించు నోర లాల
దొరుఁగు వివర్ణంబు దోఁచుఁ జేతులుకాళ్లు మిగుల శైత్యములగు మీఁదుచూచు

తే. ముక్కు గర్ణయుగంబును ముణఁగివచ్చు
మర్మముల్ చించునట్టి యామయము పెరిగి
అంపములచందముల విదారింపుచుండు
మరణ మాసన్నమైనను మానవునకు. 367

క. ధనధాన్యగృహసుహృజ్జన, తనయక్షేత్రాంగనావితానంబులపై
ఘనమైన మమత వొడమును, జనులకుఁ బరలోకగమనసమయమునందున్. 368

క. వ్యానాదిప్రాణంబులు, దానంబునఁగూడ దండధరకింకరపీ
డానికరదుఃఖ యగుచును, మేను విడుచు యాతనాసమేతుం డగుచున్. 369

---

363 సంతరించుచున్ = సేకరించుచు-కూర్చుచు, గుఱుతు=గుఱి-మేర, ఈషణములచేతన్=పుత్రాదుల పలనియాశలచేత, లీనుఁడు=అణఁగినవాఁడు. 365 ప్రతిశ్యాయంబు = పీనసరోగము, పెద్దవిన్నపము= గట్టిగా, బీదనరంబులు = సారహీనములైననాడులు, ఊఁతకోల = ఊనుకొనుకఱ్ఱ, ముప్పునన్ = ముసలితనమునందు. 367 బొట్రిలు = బొట్రుపడు, అగ్గలించున్ = అతిశయించును, సత్వంబు = దేహబలము, లాల=జొల్లు, దొరుఁగున్ = కాఱును, వివర్ణంబు=వికారవర్ణము, విదారింపుచుండున్ = భేదించుచుండును. 368 వితానంబులు = సమూహములు, మమత=మమకారము.

వ. ఇవ్విధంబున యాతనాశరీరంబులఁ బ్రవేశించినజంతువులను యామ్యకింకరులు భయంకరమ్ములైనకాలపాశంబుల సకలావయవంబులు బంధించి ప్రచండదండంబులఁ గొట్టుచు బెట్టిదిచ్చికొని దక్షిణాభిముఖులై దుష్ప్రవేశంబులు దుర్గమంబులు నైన వాలుకావహ్నియంత్రశస్త్రాస్త్రభీషణంబులైన యథోచితమార్గంబులం గొని పోయి నరకంబులం ద్రోచి. 370

సీ. బలుఱంపముల దేహములు ద్రెవ్వఁగోసి యూషరకర్దమంబులఁ జదియఁ ద్రోచి
పటుకుఠారములచేఁ బరమెండెములుచేసి తలగానరా నేలఁ ద్రవ్వి పాఁతి
వాఁడి కొఱ్ఱుల నాటవైచి మేడెములోనఁ బులులముందఱఁగట్టి పొరలఁ ద్రోచి
క్రొవ్వాఁడి యినుపముక్కుల కాకములచేతఁ బొడిపించి యుచ్చులు మెడలఁ బెట్టి

తే. వ్రేలఁగట్టి దంచనముల వ్రేసి తప్త, తైలకుండంబులోఁ ద్రోచి దారుణాస్త్ర
శస్త్రనిహతుల నొంపించి జంతుతతుల, బాధ సేయును గాలుని భటచయంబు 371

వ. మఱియు ననేకపాపహేతూద్భవంబులైనదుఃఖంబు లనేక కాలం బనుభవించి తదను భూతావసానకాలంబునఁ గ్రమ్మఱ గర్భంబు ప్రవేశించి యెప్పటియట్ల జరామరణ నరకసంభవంబులైనదుఃఖంబు లనుభవించుచుండు. 372

క. పుట్టును జావును జావును, బుట్టుకయునుగాని జీవముల కొకచోటన్
నెట్టుకొని యుండఁజెల్లదు, ముట్టినకర్మములు మూరి మోచినకతనన్. 373

తే. అర్థ మార్జించునప్పుడు నది సురక్ష, తంబు గావించునప్పుడుఁ దద్వియోగ
మైనయప్పుడు దుఃఖంబె కాని తనకుఁ, గలిమి సుఖ మని చెప్పుట కానిపలుకు. 374

ఆ. ప్రాప్తిలేమి మేలుపడయుదు నని ప్రయా, సంబుతోడఁ దిరిగి సంఘటింప
కున్న దుఃఖపడుచునుండుఁ గోరనినాఁడు, కోరనైతి ననుచుఁ గోరుచుండు. 375

క. వనితలఁ జెలులుం జుట్టలుఁ, దనయులు క్షేత్రములు నిల్లు ధనధాన్యములున్
దనకును బోయినవచ్చిన, ఘనదుఃఖమె కాని మేలు కలుగదు సుమ్మీ 376

ఆ. పరమదుఃఖపాదపమునకు బీజముల్, కర్మచయము లిట్టుగాననుభయ
కర్మమయశరీరకార్పాసబీజంబుఁ, బోలె నవధిలేక పుట్టుఁ బొలియు. 377

జన్మజరాదిక్లేశనివృత్తిహేతుభూతభగవచ్ఛబ్దవాసుదేవశబ్దవాచ్యవస్తువివేచనము.

తే. గర్భజన్మజరామృత్యుకాలముల శ,రీరి సంసారమార్తాండఘోరతాప
ములకుఁ జిక్కక ఘనమైన మోక్షతరువు, నీడనుండక సుఖమేల నివ్వటిల్లు. 378

---

370 యామ్యకింకరులు=యమునిభటులు, కాలపాశంబులన్=యముని సంబంధులైనత్రాళ్లచేత, దండంబులన్=దుడ్డుగఱ్ఱలచేత, దుష్ప్రవేశంబులు = చొరరానివి, దుర్గమంబులు=పొందరానివి, వాలుకా = ఇసుక. 371 త్రెవ్వన్=తెగునట్లు, ఊషరకర్దమంబులన్ = చవుటిబురదలయందు, చదియన్=చదికిలఁబడునట్లు పరమెండెములు=పరపుగలకబంధములు, మేడెము=గుదద్వారము. 372 అనుభూతావసానకాలంబునన్=అనుభవము తీరునట్టికాలమునందు. 373 నెట్టుకొని=నిలుకడకలిగి, చెల్లదు = సరిపడదు, మూరి=మీఱి. 374 కాని = యుక్తముకాని. 377 పాదపమునకున్ = వృక్షమునకు, కార్పాస

క. ఈయాత్యంతికదుఃఖము, పాయ నుపాయంబు వినుము పరమం బగుపా
రాయణభగవన్నామము, ధ్యేయం బని జ్ఞానవిదులు తెలిసిరి మొదలన్. 379

క. భగవత్ప్రాప్తికి హేతువు, లగుకర్మజ్ఞానయుగ్మ మాగమములచేఁ
దగులు వివేకముచేతను, జగతీసురముఖ్య చెప్పఁజను పూర్వమునన్. 380

వ. అది యెట్లంటేని యాగమమయంబును జ్ఞానమయంబును నైన శబ్దబ్రహ్మపర
బ్రహ్మంబులు రెండును దారుణంబైన యజ్ఞానమహాంధకారంబునకు సూర్యదీప్తుల
విధంబునఁ దేజరిల్లు శబ్దబ్రహ్మనిష్ఠాత్ము లగుమహాత్ములకుఁగాని పరబ్రహ్మస్వరూ
పంబు దెలియదు కావున నీరెండుతెఱంగులు ఋగ్యజుస్సామవేదంబులయందును
వేదవాదులచేతఁ జెప్పంబడునని చెప్పి మఱియు నిట్లనియె. 381

క. అనఘ యథర్వణవేదం,బున నివి యపరాపరాఖ్యములుగాఁ జెప్పం
జనుఁ బరమముక్తిహేతువు, వినుము పరము కర్మకాండవేదమయ మగున్. 382

క. పరవిద్య యనఁగ బ్రహ్మ, స్వరూప మగునట్టిపరము సర్వజ్ఞానో
త్కరమతులు దెలిసి తక్కిన, వెరవులకుం జనరు సద్వివేకము పేర్మిన్. 383

క. అవ్యయ మచింత్య మజరం, బవ్యక్తమరూప మజరమతిశుద్ధమజం
బవ్యాహత మనపాయము, భవ్యమకారణము సూవె బ్రహ్మం బనఘా. 384

ఆ. అదియె బ్రహ్మతత్త్వ మదియె పరమధామ
మదియె మోక్షవృక్ష మదియె విష్ణు
పదము చిద్వికాస మది భగవద్వాచ్య
మదియె తెలిసికొనుము హృదయమునను. 385

వ. స్వరూపరహితం బైనభగవద్వాచకం బుపచారమాత్రం బగునివ్వచనం బత్యంత
శుద్ధంబగు నణిమాదిమహైశ్వర్యధుర్యంబునునైన బ్రహ్మంబు నందచెప్పంబడుం
గావున భగవన్నామధేయంబునకు నిర్వచనంబు చెప్పెద. 386

క. విను సంభవంబు భర్తయు, నను రెండు భకారమునకు నర్థము పుట్టిం
చి నడపి లయముం బొందిం,చినకతమున నర్థయుక్తిఁ జెప్పఁగ నమరున్. 387

క. తుర్యము విజ్ఞానమునై,శ్వర్యము సంపదయు యశము వైరాగ్యంబుఁ
వీర్యము నను నీయాఱును, నార్యా భగ మనుచు విబుధులాడిరి మొదలన్. 388

తే. షడ్గుణైశ్వర్యమయచరాచరమహాప్ర
పంచమునఁ దాను దనలోఁ బ్రపంచమునువ
సించియున్న కారణమునఁజేసి బుధుల
చే భగవదర్థ మీరీతిఁ జెప్పఁబడును. 389

వ. ఇట్టి భగవద్వాచకంబు పరబ్రహ్మస్వరూపి యైనవాసుదేవవాచకంబుగాని యితర

---

బీజంబు = పత్తివిత్తు. 379 ఆత్యంతిక = మేరలేనిదైన, ధ్యేయంబు = ధ్యానింపఁదగినది, తెలిసిరి =
తెలిసికొనిరి. 384 అజరము = ముదిమిలేనిది, అజంబు = పుట్టుకలేనిది, అవ్యాహతము = కొట్టు

దేవతావాచకంబుగా దీయర్థంబు తొల్లి జనకసంభవుం డైనకేశిధ్వజుం డను
రాజర్షి ఖాండిక్యజనకున కుపదేశించెనని మైత్రేయుం డిట్లనియె. 390

కేశిధ్వజఖాండిక్యజనకసంవాదము.

క. మునివల్లభ కేశిధ్వజుఁ, డనఁగా ఖాండిక్యజనకుఁ డనఁగా నెవ్వా
రనఘాత్మ వారలకు యో,గనిమిత్తము వాద మేల గలిగెను మొదలన్. 391

క. అనవుడుఁ బరాశరుం డి, ట్లను జనకునికి కులజుఁ డైనయమితధ్వజుఁ డ
త్యనఘుని ఖాండిక్యుని లో,కనుతుఁ గృతధ్వజునిఁ గాంచె గాదిలిసుతులన్. 392

వ. వారిరువురుం దండ్రిపరోక్షంబునఁ బైతృకంబైన రాజ్యంబు సమభాగంబుగా నను
భవించుచుండ నాకృతధ్వజనందనుం డైనకేశిధ్వజుండు మహాతపోధనుండును
ఆత్మవిద్యాపరాయణుండును, బలపరాక్రమధుర్యుండును నై యవిద్య వలన
సంసారంబుఁ దరియింతునని నిశ్చయించి తండ్రి పిమ్మట నాత్మీయరాజ్యభోగంబు
ననుభవించుచుండె. 393

తే. కర్మమార్గమునను ఖాండిక్యజనకుండు, వసుధ యేలుచుండె; వారిలోనఁ
గడువిరోధమైన, ఖాండిక్యు గెలిచి కే, శిధ్వజుండు వాని సిరులు గొనియె. 394

క. ఖాండిక్యుఁడు సకలమహీ, మండలమును గోలుపోయి మంత్రులుఁ దానుc
జండతరదుర్గములలో, నుండెను కేశిధ్వజుండ యుర్వర యేలన్. 395

శా. ఆకేశిధ్వజుఁ డొక్కనాఁ డొకమహాయజ్ఞంబు గావింపఁగా
నాకాలంబున ఘర్మధేనువు మహోగ్రారణ్యదేశంబులోఁ
జీకాకై పులిచేతఁ బట్టువడి చచ్చెన్ జచ్చినన్ దీనతన్
భూకాంతుండు మఖంబు మాని మిగులన్ దుఃఖాకులస్వాంతుఁడై. 396

వ. తదీయదోషంబునకుం దగిన ప్రాయశ్చిత్తంబు ఋత్విజుల నడిగిన వారెఱుంగక
కశేరుం జెప్పిన నారాజమ్మునీంద్రు నడిగె నతండు భార్గవు నడుగుమనియె భార్గ
వుండు శునకునిం జెప్పిన నారాజు శునకు నడిగిన నతం డిట్లనియె. 397

మ. అవనీనాయక గోవధంబునకుఁ బ్రాయశ్చిత్తసత్కర్ముల్
వివరింపంగ భవద్విరోధి యగుఖాండిక్యుండు దానేర్చువా
నివివేకంబునఁ బోల వెట్టి మతులన్ నీవేగి యారాజయో
గివరున్ వేఁడుము వానిచిత్త మకలంకీభూత మెప్పట్టునన్. 398

క. అనిచెప్పి శునకుఁ డెందేఁ, జనియెను గేశిధ్వజుండు సందేహము లె
ల్లను విడిచి పూర్వవైరము, మనమునఁ జొరనీక కడుసమంజసవృత్తిన్. 399

---

పడనిది, భవ్యము = మేలైనది. 393 అవిద్యవలన = కర్మానుష్ఠానమువలన, తరియింతును = దాటుదును,
396 ఘర్మధేనువు = ప్రవర్గ్యమునందలి హవిర్విశేషముకొఱకు పాలుపిదుకునట్టియావు, (ఘర్మము=ప్రవ
ర్గ్యమునందలిహవిర్విశేషము, ప్రవర్గ్యము = అగ్నిష్టోమాద్యంగభూతమైన యాగవిశేషము.) 398 అక
లంకీభూతము = కళంకము లేనిది. 399 సమంజస = యోగ్యమైన.

వ. కృష్ణాజినపరివృతుండును మృగశృంగహస్తుండును నై రథంబెక్కి యొక్కం
డును ఖాండిక్యుకడకు నరిగె నిట్లనతిదూరంబునవచ్చు కేశిధ్వజుం బొడగాంచి
పూర్వవైరంబు దలంచి ససంభ్రమంబుగా మంత్రులు తమరాజుతో నిట్లనిరి. 400

మ. మనశత్రుం డిదె జోడుమైఁ బొదివి భీమం బైనఖడ్గంబు గై
కొని తేరెక్కి రణంబుసేయ నిదె పైకొన్నాఁడు వీఁడొంటిపా
టునఁ జిక్కెన్ వధియింతమంచుఁ గడు నాటోపంబు దీపింప బో
రున శస్త్రాస్త్రచయంబు గైకొని మహారోషంబునన్ జేరినన్. 401

క. వారలఁ గనుఁగొని వినయము, తోరంబుగ నతఁడు పలుకు దోర్బలమున మీ
తో రణముచేసి గెలువం, గారాను విరోధ మాత్మఁ గలుగదు నాకున్. 402

ఆ. క్రతువు సేయునపుడు ఘర్మధేనువు పులి, చేతఁ జచ్చె నందుఁ జెందునట్టి
పాతకంబు నన్నుఁ బాయఁ బ్రాయశ్చిత్త, విధు లొనర్పఁదగినబుధుల నరసి 403

క. శునకమునివలన ఖాండిక్యునికందువ యెఱిఁగి శాస్త్రకుశలుండగు నీ
తనిచే ధర్మరహస్యము, లొనరంగా నెఱుఁగవచ్చుచున్నాఁడఁ జుఁడీ. 404

వ. అనుటయు. 405

క. ఎక్కడి ధర్మరహస్యము, లెక్కడి చుట్టఱిక మింక నేటి వినయముల్
మొక్కలపు శత్రుఁ డొంటిన్, జిక్కినఁ జంపుటయె నీతి సిరులు వలసినన్. 406

క. అని మంత్రు లిట్లు పలికిన, విని ఖాండిక్యుండు మీరు వెఱ్ఱులు దోషం
బునవచ్చు నల్పసుఖములు, గని పుణ్యము పారలౌకికము లుడుగుదురే. 407

ఉ. వైరి నిరాయుధుం డగుచు వచ్చినఁ గాచుటకంటెఁ బుణ్యముల్
చేరునె క్రూరకర్మములచేఁ బరమార్థరహస్యవేది యీ
ధీరుఁడు పూర్వవైరము మదిం దలపోయక సాధువేష మే
పారఁగవచ్చి నన్నొకరహస్యమువేఁడినఁ జెప్ప టొప్పదే. 408

ఆ. అనుచు వారుఁ దాను నతనికి నెదురేగి
తోడుకపోయి ప్రియముతోడఁ బూజ
లొసఁగి కుశల మడిగి యున్నఖాండిక్యునిఁ
గాంచి కేశిధ్వజుఁడు గారవమున. 409

క. తన చను దెంచినకార్యము, వినుపించిన నవ్విభుండు వేదోక్తముగా
ఘనపాపంబులు పాపఁద,గిన ప్రాయశ్చిత్తమునకుఁ గ్రియ లెఱిఁగించెన్. 410

వ. కేశిధ్వజుండు నతనివలన సమస్తంబును నెఱింగి మగిడి నిజనివాసంబునకు వచ్చి
యథోక్తప్రకారంబులైన ప్రాయశ్చిత్తంబువలన దోషరహితుండై యజ్ఞంబు
సాంగోపాంగంబుగా నాచరించి ఋత్విజులకు సదస్యులకు యథోక్తదక్షిణ
లొసంగి దీనానాథజనంబులకుఁ గోరినధనంబు లెల్ల నొసంగి కృతకృత్యుండై
యొక్కనాఁడు. 411

401 బోరునన్ = దబ్బున. 404 కందువ = జ్ఞానముయొక్కస్థితిని. 406 మొక్కలపు=ముష్కరుఁడైన.

మ. అనురక్తిఁ దనపాతకంబులకుఁ బ్రాయశ్చిత్తకర్మంబు చె
ప్పినఖాండిక్యుని కిష్టమైనయవి సంప్రీతిఁ సమర్పింతు నే
నని కేశిధ్వజుఁ డాదరం బొదవ భృత్యామాత్యవర్గంబుతోఁ
జని వైదేహకులావతంసుఁ గని శశ్వద్భక్తితో నిట్లనున్. 412

ఆ. ఆత్మఁ బూర్వవైర మణుమాత్రమును లేక, పాతకంబుఁ దనకుఁ బాపినట్టి
గురుఁడవట్టి నీకు గురుదక్షిణార్థమే,మైన నిచ్చువాఁడ నడుగవలయు. 413

తే. అనిన మంత్రులు ఖాండిక్యునాననంబు
చూచి మును గోలుపడిన యస్తోకరాజ్య
మహిమ లన్నియు నాతని మగుడ నడుగు
మనిన నవ్వుచు వారితో నాతఁ డనియె. 414

తే. అర్థమార్జించుటయు రాజ్య మాసపడుట
యును బ్రధానులమత మదియొల్ల నితని
వలనఁ బరమార్థయోగంబుఁ దెలిసి బ్రహ్మ
పదము నొందెద నీయల్పఫలము లొల్ల. 415

మ. అని కేశిధ్వజుఁ జూచి యిట్లను మహాత్మా నాకు నీచేత మో
క్షనిరూఢం బగుయోగమార్గ మెలుఁగంగా వేడ్కమై యున్నదీ
వినుతం బైనరహస్యముఁ దెలిపినఁ విజ్ఞానపారీణుఁగా
నొనరింపం దగునన్న నాతనికి నయ్యుర్వీశ్వరుం డిట్లనున్. 416

ఆ. రాజవల్లభులకు రాజ్యవైభవముల, కంటెఁ బ్రియము లెవ్విగలవు నీవు
పరులయొత్తులేని ధరణి నన్నడుగక, యనఘ యోగవిద్య యడిగి తేల. 417

వ. అనిన ఖాండిక్యుం డిట్లనియె. 418

ఆ. శత్రువరులఁ బోరఁ జంపుటయును బ్రజా,పాలనంబు భూమి యేలుటయును
ధరణివల్లభులకు ధర్మంబు లివి యుప,భోగకారణములు భోగులకును. 419

సీ. అవనీశ వినుమ విద్యకు మూలమగు సిరిబంధంబు కడలేనిపాతకముల
వలనఁ గల్గినయర్థములు ధర్మములకు నిరోధంబులగు సత్పురుషులు క్షత్ర
బంధులఁ బ్రార్థించి వడసిన యర్థముల్ మేలుగాఁ దలఁపరు మీఁదు దెలిసి
కావున నజ్ఞానకారణం బైనయీరాజ్యంబు మమతలఁ గ్రాఁగనున్న
తే. చెడుగుగోరు నహంమానసీధుపాన, మత్తచిత్తులనడతలు మాకు లేవు
దివ్యయోగంబు మా కుపదేశ మిమ్ము, తక్కినవి యేమియిచ్చినఁ దలఁప నొల్ల
వ. అనినం గేశిధ్వజుం డిట్లనియె. 421

414 అస్తోక = అధికమైన. 417 ఒత్తు = ఒత్తడి - తొందర. 420 క్షత్రబంధులన్ = నీచులగు రాజులను, మీఁదు = అనాగతమును, అహంమానసీధుపానమత్తచిత్తులనడతలు = నేననుగర్వమనెడు మద్యపానముచేత మత్తుగొన్నమనసుగలవారి ప్రవర్తనములు.

కేశిధ్వజుండు ఖాండిక్యజనకునకు యోగవిద్య నుపదేశించుట.

ఆ. ఏనవిద్యవలన నెప్పుడు మృత్యువు, నోడుతు ననుచుఁ దలఁచుచుంటఁ జేసి
యవనిరాజ్యమెల్ల నంచితైశ్వర్యమై, కానిపించు నంతకాలములను. 422

ఆ. ఆత్మగాని వస్తువం దాత్మ యిది యని, తలఁపుసేయుటయును దనకు రాని
సొమ్ము తనది యనెడిచులుకఁదనంబు బీ, జము లవిద్యయనెడిసాలమునకు. 423

క. ఈపాంచభౌతికంబై, దీపించినదేహమునను దేహి మహామో
హోపాధికుఁడై యహమిక, యాపాదించుచు దురాత్ముఁడై యెల్లపుడున్. 424

ఆ. పంచభూతములకు బాహ్యమైయున్న నీ, యాత్మయందు నున్నయాత్మబుద్ధి
నీకళేబరముల నెవ్వఁడు సేయును, వసుధ గుమతి యైనవాఁడె కాక. 425

ఆ. ఈకళేబరముల కెప్పుడు నుపభోగ, కారణంబులైన దారగృహధ
నాదులందు మమత లనయంబుఁ గావించు, వాఁడె దుర్వివేకి వసుమతీశ. 426

క. పురుషుఁ డుపభోగవాంఛాపరుఁడై దేహముల నిలిచి బహుకర్మంబుల్
పరువడి నొనర్చుఁ గర్మోత్కరములు బంధములకెల్లఁ గారణమయ్యెన్. 427

క. పార్థివమగు నీదేహము, పార్థివవర్గములచేతఁ బరితుష్టమగున్
స్వార్థముగ మద్గృహంబులు, పార్థివ మృజ్జలముచేతఁ బదిలమగుగతిన్. 428

ఆ. శతసహస్రకోటిసంఖ్యలు గలుగుసం,సారవర్గములను సంచరించి
ప్రాణివాసనలను రేణువులోఁ జిక్కి, మోహగహనమధ్యమునఁ జరించు. 429

---

422 అవిద్యవలనన్ = వర్ణాశ్రమవిహితకర్మానుష్ఠానమువలన, మృత్యువున్ = జ్ఞానవిరోధియు పునర్జన్మకారణంబునగు ప్రారబ్ధకర్మమును, ఒడుతున్ = గెలిచెదను, అంచితైశ్వర్యమై = పూజింపఁబడిన ఐశ్వర్యముగలదై - భగవత్ప్రీత్యర్థయజ్ఞాది సత్కర్మోపయుక్తమగుటవలన నీరాజ్యైశ్వర్యమునకు పూజితత్వము. [ఏతత్కథాసంగ్రహము - కేశిధ్వజుండను రాజయోగి తాను మిక్కిలి జ్ఞాననిష్ఠుండైనను అవిద్యచేత మృత్యువును తరించి విద్యచేత మోక్షమును బొందుదురు అనునీయర్థముగల ఉపనిషద్వాక్యమునను సరించి భగవత్ప్రీణనబుద్ధిచే బహువిధములైన యజ్ఞములు సేయుచుండ నందొకయజ్ఞంబున ఘర్మధేనువునకు పులివలన నపాయము సంభవింపఁగాఁ దత్ప్రాయశ్చిత్తక్రమమును కర్మనిష్ఠాగ్రేసరుఁడైన ఖాండిక్యజనకునివలనఁ దెలిసికొని యాయజ్ఞమును సమాప్తినొందించి తనకు ప్రాయశ్చిత్తక్రమంబు నుపదేశించినఖాండిక్యజనకునకు గురుదక్షిణ సమర్పింప నుద్యుక్తుండై వచ్చియిష్టమైనదానిఁ గోరుమని ప్రార్థించెను. ఆరాజర్షి నిస్పృహుండుగావున రాజ్యాదులేవియునొల్లక యోగవిద్య నుపదేశింపుమని వేఁడగా నట్లే కేశిధ్వజుం డాయనకు యోగవిద్య నుపదేశించెను. అవిద్య యనఁగా వర్ణాశ్రమోచితశ్రౌతస్మార్తకర్మము. విద్యయనఁగా జ్ఞానము. మృత్యువనఁగా సంసారము]. 423 అట్టికర్మమును ఆత్మానాత్మభేదములేక అహంకారమమకారాదులతోఁ జేసిన నది బంధహేతువగునని యవిద్యాస్వరూపమును జెప్పుచున్నాఁడు. ఆత్మకానివస్తువందు = ఆత్మకాని దేహమునందు, ఆత్మయిదియని = ఈదేహము నేనని, అవిద్యయనెడు = సంసారమే ఫలముగాఁగల కామ్యకర్మమనెడు సాలమునకున్ = వృక్షమునకు. 427 పరువడిన్ = క్రమముగా, బంధములకు = పునర్జన్మరూపమైన బంధములకు. 428 పార్థివమగు నీదేహము = పృథివీసంబంధియైన యీశరీరము, పార్థివవర్గముల చేత = పృథివీసంబంధములైన అన్నపానాదిసమూహములచేత, పార్థివ = రాజా.

ఆ. కన్నులందు ధూళిగప్పినతెరువరి, వేఁడి నీళ్లవలన విశదదృష్టి
నొందినట్లు కర్మయుతమైన యజ్ఞాన, మనఘ బోధవలన నణఁగిపోవు. 430
వ. అజ్ఞానంబు విడిచినపుడె మోక్షంబు గలుగును. 431
క. శీతలజలములు దహనము, చేతం గడునుష్ణమైన చెలువున మమకా
రాతిశయం బగు ప్రకృతిప,రీతంబై కుందుఁ బో శరీరి నరేంద్రా. 432
వ. కావునసకలకల్మషవియోగంబును గైవల్యమార్గసంయోగంబునునైనయోగంబు
నేర్పుటకంటె మోక్షసాధనంబు లేదనినఁ గేశిధ్వజునకు ఖాండిక్యుం డిట్లనియె. 433
ఆ. నిమికులంబునందు నీకంటె యోగవి,ద్యాఘనుండు పుట్టఁ డవనిలోనఁ
గాన యోగవిద్యగారవంబున నాకుఁ, జెప్పి ననుఁ గృతార్థుఁ జేయవలయు 434
వ. అనిన నతండు ప్రసన్నహృదయుండై ఖాండిక్యున కిట్లనియె. 435
సీ. జగతీశ బంధమోక్షములకు హేతువు చిత్త మాచిత్త మశేషవిషయ
తతిఁగూడెనేని బంధము నొందుఁ గూడక యున్న మోక్షంబును నొందుచుండు
గావున మనసు నానావిషయములకుఁ బోనీక బ్రహ్మంబుఁ బొందెనేని
నాత్మభావముఁ బొందు నయము సూదంటురాతికి వశమైనట్లు ప్రకటమైన
తే. వాసనలచేత నాత్మభావమునఁ బొందుఁ
బ్రాణి యాత్మప్రయత్న సంపదలఁ గడు న
పేక్షగలబుద్ధితోనుండి యెల్లప్రొద్దు
నొనర బ్రహ్మంబుఁ దలఁచుట యోగమగును. 436
ఆ. అట్టి యోగవిద్యయందు నిరూఢుఁడై, యున్న వాఁడె దివ్యయోగనిరతుఁ
డతఁడె మోక్షయుక్తుఁ డతఁడె సమాధిసం,పన్నుఁ డతఁడె బ్రహ్మపారగుండు. 437
ఆ. యోగపరుఁడు దివ్యయోగవిద్యాభ్యాస, మాచరించుచుండ నంతరాయ
మయ్యెనేని వాని కన్యజన్మమునందు, నైన ముక్తి గలుగు మానవేంద్ర. 438
ఆ. అప్రతిగ్రహంబు నతిశౌచమును నహింస,యు నిజంబు బ్రహ్మచర్యమతము
నాత్మవశముఁ జేయునదియు నస్తేయంబు, యోగఫలము గోరకుండుటయును. 439

యమనియమాదియోగలక్షణములు.

క. ఏచిన నియతియుఁ దపమును, శౌచము వేదమును గలిగి సంతోషముతో
వాచవులు విడిచి బ్రహ్మముఁ, జూచుట యమయోగమండ్రు సుజనులు మొదలన్.
తే. మనుజవల్లభ యవియె కామ్యంబులైన
కడువిశేషఫలంబులు గలుగఁ జేయు
వినుము కామ్యంబు లగునేని వినుతమోక్ష
సిద్ధి గావించుఁ బ్రాణికి సిద్ధముగను. 441

---

432 పరీతంబై = చుట్టఁబడినదికాఁగా. 436 అయము = ఇనుము. 438. అంతరాయము = విఘ్నము.
439 అప్రతిగ్రహంబు = దానముపుచ్చుకొనమి, అస్తేయము = దొంగిలింపమి.

క. సకలాసనములలోపల, నొకభద్రాసనము పూని యోగియు గుణపం
చకయుతముగఁ దనచిత్తముఁ, బ్రకటబ్రహ్మమునఁ గూర్పఁబడ నియమ మగున్.

ఆ. ఒలసి ప్రాణవాయువులఁ దనవశముగాఁ, జేసి బ్రహ్మతత్త్వసిద్ధిఁ గాంచి
యోగమార్గసరణినుంట ప్రాణాయామ, యోగమండ్రు పరమయోగవిదులు.

తే. ఊర్ధ్వముఖమైనప్రాణవాయువు నధోము
ఖమున వర్తిలునయ్యపానము పరస్ప
రాభిభవములు గాకుండ నాసమాన
మొనరనిలుపుట లంబనయోగమండ్రు. 444

క. ఆలంబయోగవిద్యా, శీలతశబ్దాదులకు వశీకర మగున
క్షాళిఁ దనవశముఁజేయుట, వాలినఁ బ్రత్యాహారాఖ్యవరయోగమగున్. 445

తే. ఇట్టియోగంబులెల్ల నరేంద్ర పరమ
పావనుం డైనయుంపిరాపతికి స్థూల
రూపములు వీనినెఱుఁగక రూఢిగాఁగ
సూక్ష్మరూపంబు దెలియదు సులభముగను. 446

క అనవుడు ఖాండిక్యుం డిట్లను సకలాధారుఁ డైనహరి నేగతి భా
వనచేసి యోగి మోక్షం,బునఁ బొందు నెఱుంగవలయుఁ బో నాకనినన్. 447

## భావనాత్రయవివరణము.

వ. కేశిధ్వజుం డిట్లనియె. 448

సీ. యోగిచిత్తంబున నోరంతప్రొద్దును దీపించు విష్ణునిదివ్యమూర్తి
స్థూలరూపంబును సూక్ష్మరూపంబును నైయుండు నిది యపరాపరాఖ్య
సంజ్ఞలఁ జెప్పంగఁ జను నివియన్నియు భావనాత్రితయసంపత్తివలన
నెఱుఁగంగఁదగు నివి యేర్పడఁ జెప్పెదఁ బ్రహ్మభావనయును బరమకర్మ

తే. భావనయు బ్రహ్మకర్మాఖ్యభావనయు న
నంగ నీభావనలచేత నంగజాత
గురుఁడు భావింపఁగాఁబడి పరమమైన
మోక్షపద మిచ్చు ముక్తికాముకులకెల్ల. 449

చ. హరిపదభక్తులైనసనకాదిమునీంద్రులు బ్రహ్మభావనా
పరులు పురందరాదినిరపాయచరిత్రులు కర్మభావనా
పరిచితు లబ్జజాదు లగుభవ్యవివేకులు బ్రహ్మకర్మత
త్పరతరదివ్యభావనలఁ బాటిలినారు పురాతనంబులన్. 450

---

443 ఒలసి=ఆకర్షించి. 445 అక్షాళిక=ఇంద్రియసమూహమును. 450 అబ్జజాదులు=బ్రహ్మ మొదలగు

క. ఈమూఁడుభావనలచే, నేమఱక ముకుందుఁ దలఁచి యెప్పుడు యోగ
శ్రీమహితబుద్ధినుండుట, భూమీశ్వర ధారణాఖ్యమునగఁ జెప్పఁబడున్. 451

తే. ఈచరాచరమైనట్టి యీప్రపంచ
మీశ్వరునిస్థూలరూపంబ యెఱిఁగికొనుము
మానవేంద్రసత్తామాత్ర మైనమూర్తి
నమరుసూక్ష్మరూప మైనపరాపరములు. 452

తే. స్థూలసూక్ష్మరూపంబులతోడి వాసు
దేవు నెవ్వాఁడు భావనాత్రితయకలిత
బుద్ధిఁ దలపోయు నతఁడెపో భూవరేణ్య
ధ్యాని యాత్మజ్ఞులకు నీమతంబు మేలు. 453

తే. విష్ణుశక్తి చరాచరవితతియందుఁ, దారతమ్యప్రవృత్తులఁ దనరియుండు
నట్టి జగదాత్మకుం డైనయాదిదేవు, భేదవాదులు చూతురు భేదముగను. 454

వ. ఇవ్విధంబునఁ జెప్పంబడిన యోగవిద్యాభ్యాసంబువలన జితశ్రము లయినమహాత్ముల
యాత్మయందుఁ బ్రకాశితుండయి పరమాత్ముం డయినలక్ష్మీకాంతుండు మనోజని
తంబు లయినకిల్బిషంబుల నణంచి పరమసాధనంబు లైనశుభంబులఁ గావించునని
యిట్లు సంక్షేపరూపంబుగా నధ్యాత్మవిషయం బుపదేశించినఁ గృతార్థుండై
ఖాండిక్యుం డిట్లనియె. 455

క. నృపచంద్ర నీవు నాకిపు, డుపదేశము చేసినట్టి యోగమువలనన్
విపులజ్ఞానము వొడమెను, ప్రసన్నమయ్యె మనసు పద్మాక్షునిపై. 456

వ. అని బహుప్రకారంబులం బూజించినం బ్రీతుండై కేశిధ్వజుండు నిజపురంబున కరిగె
ఖాండిక్యుండును దనరాజ్యంబునకుఁ గుమారునిం బట్టంబు గట్టి యోగవిద్యా
భ్యాసంబువలన సకలసుఖంబులం బడసి సుఖంబుండె నంత. 457

క. ఘననుతుఁ డగు కేశిధ్వజ, జనకుఁడు తనమిథిల కరిగి సత్కర్మములన్
వనజాయతాక్షు నారాధన సేయుచుఁ బెక్కుసప్తతంతులు సేసెన్. 458

ఆ. ఇవ్విధమున నతఁ డనేకయజ్ఞంబులు, చేసి వాసుదేవుచేత సకల
వైభవములుఁ బడసి ప్రాభవం బేపార,లీలతో ధరిత్రి యేలుచుండె. 459

వ. ఇవ్విధంబున జనకచక్రవర్తి సకలశోభనకరుం డయినలక్ష్మీవల్లభుకృపాకటాక్షంబు
వలన ననేకపుత్రపౌత్రాభివృద్ధియును సముద్రవేలావలయిత వసుంధరాచక్ర
సామ్రాజ్యలక్ష్మీనివాసంబును అణిమాదిమహైశ్వర్యధుర్యప్రాభవంబును గలిగి
సకలలోకంబులు జయపెట్ట మిథిలాపురంబున రాజ్యంబు సేయుచుండె ననిపలికి
పరాశరుండు వెండియు నిట్లనియె. 460

---

వారు. 458 సప్తతంతులు = యజ్ఞములు. 460 జనకచక్రవర్తి = జనకచక్రవర్తివంశజాతుఁడగు

తే. సర్గమన్వంతర ప్రతిసర్గములును, వంశవంశానుచరితాభివర్ణనములు
నీకు నే వినిపించితి నిపుణఫణితి, నింక నెయ్యది విన నీకు నిష్టమనిన. 461

క. మైత్రేయుఁ డతని కిట్లను, ధాత్రీసురముఖ్య నీకతంబున జగదే
కత్రాణపరాయణుఁ డగు, ధాత్రీధరుకథలు వింటి ధన్యుఁడనైతిన్. 462

క. నాకింక నడుగఁదగినవి, యేకథలును లేవు చిత్త మెంతయు విశదం
బై కడలేక వివేక, శ్రీకంబై యున్నయది విశుద్ధచరిత్రా. 463

శా. దేవా నాహృదయంబులోనఁ గలసందేహాపనాయార్థమి
చ్ఛావృత్తిన్ గడుదుస్తరంబు లగుపృచ్ఛల్ పెక్కుగావించి మీ
భావం బెంతయు నొవ్వఁజేసితిఁ గృపాపారీణతన్ మన్ననల్
గావింపం దగునన్న నమ్ముని కృపాలంకారుఁడై యిట్లనున్. 464

క. నీవు మును నాకుఁజేసిన, సేవవలన దేవతలకు సిద్ధింపని యీ
శ్రీవిష్ణుపురాణము సద్భావముతోఁ జెప్పవలసెఁ బరమప్రీతిన్. 465

## శ్రీవిష్ణుపురాణపఠనశ్రవణలేఖనాదిఫలవివేచనము.

సీ. దేవగంధర్వదైతేయాప్సరస్సిద్ధ సాధ్య కిన్నరయక్షసన్మునీంద్ర
దనుజపలాశవిద్యాధరపశుపక్షిమృగసరీసృపపశు మేదినీశ
పుణ్యనదీనదారణ్యవర్ణాశ్రమసాగరగ్రహతారకాగజేంద్ర
వర్ణాశ్రమాచారవసుమతీవల్లభజననస్థితులులయసంచరాగ్ని
తే. హోత్రమన్వంతరర్తుమాసత్రికాల, వేదశాస్త్రపురాణముల్ విష్ణుమూర్తు
లేతదాఖ్యానములు విన్న నెల్లవారు, సకలశుభములు గాంతురు సన్మునీంద్ర. 466

ఉ. ఈసకలంబునన్ వినుతికెక్కిన విష్ణుపురాణసంహితన్
వ్రాసినఁ బేరుకొన్న వినినన్ బఠియించిన భక్తిఁ నర్చనల్
చేసినఁ బుణ్యవంతులకుఁ జెందు శుభంబులు భక్తవత్సలుం
డాసరసీరుహాక్షుఁడు దయన్ గృపజేయు నభీప్సితార్థముల్. 467

ఆ. అశ్వమేధవేళనవభృథస్నానంబు, చేసినట్టిఫలముఁ జెందు నరుఁడు
విమలభక్తితోడ విష్ణుపురాణంబు, సంతసమున విన్నఁ జదువుకొన్న. 468

క. మైత్రేయ ప్రయాగఁ గురు, క్షేత్రంబునఁ బుష్కరమునఁ గేశవపూజా
స్తోత్రములఁ గొలుచు ఫలము సర్వత్రగలుగు నరున కీపురాణము విన్నన్. 469

ఆ. అనఘ యేఁడుకాల మగ్నిహోత్రము సువృత్త ముగ నాచరించు తత్ఫలంబు
గాంచు మానవుం డొకానొకవేళ నే, తత్పురాణకథలు దగిలి విన్న. 470

---

కేశిధ్వజుఁడు. 463 వివేకశ్రీకంబు = వివేకసంపదగలది. 464 సందేహాపనాయార్థము = సందేహములఁబోఁగొట్టుటకొఱకు. 466 పలాశ = దిక్పాలకుఁడగునైరృతుఁడు. 470 తగిలి = ఆసక్తి

ఆ. ఒనర జ్యేష్ఠమాసమున సితద్వాదశి, యందు యమునఁ దీర్థమాడి మధుర
కరిగివిష్ణుఁ గొలిచినట్టి ఫలంబులు, కలుగు నీపురాణకథలు విన్న. 471

క. ఈవిష్ణుపురాణములో, నేవంకను నొక్కకథ సమాహితబుద్ధిన్
భావించి విన్న వారికి, భావజగురుఁ డశ్వమేధఫలము నొసంగున్. 472

క. శ్రావణమాసంబున నరుఁ, డీవిష్ణుపురాణకథల నేకాధ్యాయం
బేవంకఁ బఠనచేసినఁ, బోవును దుస్స్వప్నదోషములు మనుజులకున్. 473

శా. వేదోక్తంబుల బ్రాహ్మణోత్తముల కుర్వీదానగోదానక
న్యాదానంబులు మేరగాఁ గలుగుదానంబుల్ ప్రమోదంబుతో
నాదిత్యగ్రహణంబునన్ యమునలో నర్పించుపుణ్యంబు లా
పాదించున్ నరుఁ డీపురాణ మతితాత్పర్యంబుతో వ్రాసినన్. 474

క. దురితములు పాయుఁ గీర్తియు, హరిభక్తియుఁ గలుగు నాయురారోగ్యము భా
సురతేజంబును బొందును, నరులకు నీకథలు విన్న నతిమోదమునన్. 475

క. విను నేను బులస్త్యమహా, మునివరమున నీపురాణము సమస్తంబున్
ఒనరఁగ నినువంటితపో,ధనునకు వినిపింపఁ గంటి ధన్యుఁడనైతిన్. 476

క. ఈకలియుగాంతమునను శ,మీకుఁడు నీచేత విని సమీచీనవచ
శ్శ్రీకరముగఁ బౌరాణికుఁ, డై కృతయుగమునను జదువు నతఁ డెల్లెడలన్. 477

ఉ. కావున నీపురాణము జగన్నుతమై కలికాలదోషముల్
పోవఁగఁజేయు భక్తిపరిపూతముగా వినినన్ బఠించినన్
నీవు మహానుభావుఁడవు నీజననంబు పవిత్రమయ్యె ల
క్ష్మీవిభుభక్తి నేమఱకు చిత్తములోపలఁ దాపసోత్తమా. 478

క. అని యిబ్భంగిఁ బరాశర,ముని మైత్రేయునకు వేదమూలంబై పెం
పొనరినవిష్ణుపురాణము, వినిపించె సమాప్తముగ వివేకప్రౌఢిన్. 479

ఉ. సత్యవచోవిలాస రిపుశాసన సంగరపార్థ పల్లవా
దిత్య సమస్తబాంధవవిధేయ వనీపకపారిజాత సా
హిత్యకళాభివర్ధన మహీనుత వెన్నెలగంటిసూరయా

---

గలిగి. 471 సితద్వాదశి = శుక్లపక్షద్వాదశి. 472 ఏవంకన్ = ఏతట్టయినను. 474 మేర గాన్ = మొదలుగా, తాత్పర్యంబుతోన్ = తత్పరత్వముతో. 476 ఒనరఁగన్ = ఒప్పిదముగా. 477 సమీచీనవచశ్శ్రీకరముగన్ = మంచివాక్సంపదనుగలుగఁజేయునట్లు. 480 సత్యవచోవిలాస = సత్యవాక్యమే లీలాప్రవర్తనముగాఁగలవాఁడా, రిపుశాసన = పగవారిని శిక్షించువాఁడా, సంగరపార్థ = యుద్ధమునందు అర్జునుఁడా, పల్లవాదిత్య = పల్లవాదిత్యుఁడు అనుబిరుదుపేరుగలవాఁడా, వనీపకపారిజాత = యాచకులకు కల్పవృక్షమైనవాఁడా, సాహిత్యకళాభివర్ధన = సాహిత్యవిద్యను అభివృద్ధిపొందించు వాఁడా, మహీనుత = లోకులచేత కొనియాడఁబడువాఁడా, వెన్నెల...పయోరుహా = వెన్నెల

మాత్యకవిత్వవైభవరమాపరిశోభితహృత్పయోరుహా. 480

క. తిరుమలతాతయవంశా,భరణశ్రీసింగరార్యపరమగురుకృపా
పరిపూర్ణహృదయయాచక, వరచేతఃకమలినీదివాకరమూర్తీ. 481

శ్రీరమణవృత్తము. సంగరధనంజయవిశాలమహిమాస్పదప్రశస్తగుణశోభితమహీభృ
త్పుంగవసభాభినయభూరిగుణమండిత నభోమణినిభప్రకటతేజ
స్సంగత మహాసుకవిసన్నుతచరిత్ర రిపుశాసనపరాక్రమకనద్ది
వ్యాంగదసముజ్జ్వలమహామణివిభాంచితపదాంబురుహ భావభవరూపా. 482

గద్యము. ఇది శ్రీమదమరనామాత్యపుత్ర హారితగోత్రపవిత్ర సుకవిజనవిధేయ వెన్నెలకంటిసూరయనామధేయప్రణీతంబైన యాదిమహాపురాణంబగు బ్రహ్మాండంబునందలి పరాశరసంహితయైన శ్రీవిష్ణుపురాణంబునందు బలదామోదరులు సాందీపునివలన విద్యాభ్యాసంబు సేయుటయు కాలయవనువధయును బలభద్రుండు వరుణదేవుచేత వరంబులుగొనుటయు రుక్మిణీకల్యాణంబును నరకాసురవధయును పారిజాతాపహరణంబును బాణాసురయుద్ధంబును పౌండ్రవాసుదేవునిమరణంబును దూర్వాసుశాపంబున యాదవులు పరలోకగతులగుటయు రామకృష్ణులపరోక్షంబును అష్టావక్రుచరిత్రంబును కలియుగధర్మంబును నైమిత్తికప్రాకృతాత్యంతికప్రళయంబులును కేశిధ్వజఖాండిక్య జనకసంవాదంబును యోగవిద్యాప్రశంసయు నన్నదిసర్వంబును అష్టమాశ్వాసము.

---

కంటిసూరయమంత్రియొక్క కవిత్వవైభవమనెడులక్ష్మిచేత మిక్కిలి వికసించిన హృదయకమలముగలవాఁడా. 481 యాచకవరచేతఃకమలినీదివాకరమూర్తీ = యాచకులయొక్క మంచిమనస్సులనెడు తామరకొలఁకులకు సూర్యస్వరూపుఁడా. 482 సంగరధనంజయ=యుద్ధమునందు అర్జునుఁడా, విశాలమహిమాస్పద = మిక్కుటమైనమహిమకు ఉనికిపట్టయినవాఁడా, ప్రశస్తగుణశోభిత=మేలైనగుణములచేత ప్రకాశించువాఁడా, మహీభృత్పుంగవసభాభినయభూరిగుణమండిత = రాజశ్రేష్ఠులగోష్ఠికిఁదగిన అభిప్రాయమునుసూచించెడి గొప్పగుణములచే అలంకరింపఁబడినవాఁడా, నభోమణినిభప్రకటతేజస్సంగత = సూర్యునితేజస్సువంటి తేజస్సును బయలుపఱచునట్టి తేజస్సుతో కూడినవాఁడా, మహాసుకవిసన్నుతచరిత్ర = గొప్పవారైనమంచికవులచే స్తోత్రముచేయఁబడినచరిత్రముగలవాఁడా, రిపు... పదాంబురుహ=శత్రువులనుశిక్షించునట్టిపరాక్రమముచేత ప్రకాశమానమై అప్రాకృతమైన భుజకీర్తులయందు వెలుఁగునట్టి గొప్పమణులయొక్క కాంతులచేత ఒప్పునట్టి పాదపద్మములుగలవాఁడా, పాదాక్రాంతులైన శత్రువులుగలవాఁడా యనుట. భావభవరూపా=మన్మథునిసౌందర్యమువంటి సౌందర్యముగలవాఁడా.

ఇది శ్రీమత్కౌశికకులతిలకానంతార్యవిరచితంబైన శ్రీ విష్ణుపురాణటీకాసంగ్రహము

శ్రీవిష్ణుపురాణము సంపూర్ణము.

---

కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్
కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే.
యదక్షరపరిభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తు తే.

శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణే నమః



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1939.

# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యము.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము | 1 | 4 |
| డిటో కాలికోబైండు | 1 | 10 |
| అడవిమల్లెలు, ఎనమండ్రనారాయణమూర్తిగారిది | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణం | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| డిటో కాలికోబైండు | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీగిడుగురామమూర్తి పంతులు గారి విమర్శతో నున్నది. | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది.) | 0 | 4 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము. | 0 | 1 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | 4 | 0 |
| ,, అత్యుత్తమప్రతి,2సంపుటములు | 6 | 8 |
| ,, 3 సంపుటములు | 7 | 8 |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము- | | |
| 7 సంపుటముల ప్రతి | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటం | 2 | 0 |
| ఆరణ్యపర్వము | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| భీష్మద్రోణపర్వములు | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 2 | 0 |
| శాంతిపర్వము | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 3 | 12 |
| శాంతిసప్తకము | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | 1 | 8 |
| ఆంధ్రభారత విమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికో | 1 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) వావిళ్ల రామస్వామి శాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించినారము | 4 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | 0 | 4 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | 0 | 12 |
| ,, కాలికోబైండు | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 0 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | 0 | 2 |
| ,, టీకానుక్రమణికాసహితం | 0 | 6 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | 0 | 6 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథ కృతము | 1 | 8 |
| కవికర్ణరసాయనము, (మాంధాత చరిత్రలోనిది) | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికో | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దశసరి కాగితములు | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | 1 | 8 |
| డిటో కాలికోబైండు | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, | 0 | 6 |
| డిటో కాలికోబైండు | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలి సొంపు; పీఠిక అతివిపులము | 7 | 8 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనకృతము, కాలికోబైండు | 1 | 4 |
| భాస్కరరామాయణము | 4 | 0 |
| గయోపాఖ్యానము, రామనామాత్యప్రణీతము | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | 1 | 4 |
| డిటో రెండవ భాగము, సాధారణప్రతి | 1 | 6 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వం | 1 | 0 |
| డిటో కాలికోబైండు | 1 | 6 |
| తెనుఁగుసమస్యలు | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కనిప్రతి | 1 | 8 |
| డిటో కాలికోబైండు | 1 | 12 |
| దశావతారచరిత్ర, చక్కనికూర్పు | 2 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | 0 | 8 |
| దశరాపద్యములు | 0 | 1 |
| నరసభూపాలీయము, అట్టబైండు | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికో | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము | 1 | 0 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | 0 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవిది | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 4 |
| డిటో కాలికోబైండు | 0 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 2 |
| డిటో వేంకటనాథరాజకవివరకృతము | 1 | 4 |
| డిటో కాలికోబైండు | 1 | 10 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

# ఆంధ్ర గ్రంథములు

## వచన గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశ స్కంధములు, ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 3 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 3 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 3 | 0 |
| ,, భీష్మద్రోణపర్వములు | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 3 | 0 |
| ,, శాంతిపర్వము | 4 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 4 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు | (అచ్చు) | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 1 | 12 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 1 | 12 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 4 | 0 |
| అరేబియన్‌నైట్సుకథలు | 1 | 4 |
| న్యాయవిచారము, ప్రహసనం | 0 | 4 |
| తులసీదాసురామాయణము | 8 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |
| ద్వాదశోపనిషత్తులు, వచనం | 3 | 8 |
| భారతరమణీమణులు, 1 భా॥ | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | 6 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | 0 | 8 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 0 |
| నీతిరత్నాకరము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 0 | 12 |
| సంగ్రహభారతము | 1 | 4 |
| సంగ్రహభాగవతము | 1 | 4 |
| ప్రాచీనదేశచరిత్రలు | 1 | 12 |
| పతివ్రతలచరిత్రలు | 2 | 0 |
| దక్కనుపూర్వకథలు | 2 | 0 |
| భోజునికథలు | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 0 | 12 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు | 1 | 8 |
| దశకుమారచరిత్రము | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | 0 | 14 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| రాజశేఖరుడు, గోపాలుడు | | 0 | 8 |
| విక్రమార్కునికథలు | | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు | | 0 | 8 |
| తాతాచార్యులకథలు | | 0 | 6 |
| వైద్యులకథలు | | 0 | 4 |
| బేతాళునికథలు | | 0 | 8 |
| వీరాంగనలు | | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | | 0 | 3 |
| నలుగురుమంత్రులకథలు | | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | | 0 | 6 |
| రేచుక్కపగటిచుక్కకథ | | 0 | 3 |
| సత్యసేనవిజయము | | 0 | 4 |
| ఋషులచరిత్ర | | 0 | 8 |
| పురాణగాథలు I | | 0 | 12 |
| ,, II | | 0 | 12 |
| బాజీరాయని చరిత్ర | | 0 | 14 |
| రఘువంశకథ | | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర | | 1 | 0 |
| వివేకానందవిజయము | | 2 | 0 |
| పరిహాస్యవినోదకథలు | | 0 | 12 |
| ఈసబునీతికథలు, 1-వ భా॥ | | 0 | 6 |
| డిటో 2-వ భా॥ | | 0 | 8 |
| పంజాబుఅల్లరి | | 0 | 8 |
| శుకసప్తతికథలు | | 0 | 6 |
| మర్యాదరామన్నకథలు | | 0 | 3 |
| మైరావణచరిత్ర | | 0 | 1 |
| షేక్స్పియర్ నాటకకథలు | | 1 | 8 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | | 0 | 12 |
| ప్రహ్లాదచరిత్ర, ప్రతిమలతో | | 0 | 6 |
| శకుంతల | ,, | 0 | 6 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| నల | ,, | 0 | 8 |
| సావిత్రి | ,, | 0 | 6 |
| హరిశ్చంద్ర | ,, | 0 | 8 |

**నవలలు.**

| | | | |
|---|---|---|---|
| సీతారామము | | 1 | 4 |
| ఐవన్హో, | నవల | 0 | 8 |
| మదాలస | ,, | (అచ్చు) | |
| సుజనరంజని | ,, | 0 | 8 |
| విజ్జలదేవి | ,, | 1 | 8 |
| ఉన్మాదిని, | నవల | 0 | 4 |
| రాధారాణి | ,, | 0 | 4 |
| అస్తమయము | ,, | 1 | 8 |
| దుర్గేశనందని | ,, | 0 | 12 |
| కపాలకుండల | ,, | 0 | 12 |
| లక్షణ | ,, | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ | ,, | 1 | 8 |
| లీల | ,, | 0 | 6 |
| రాజర్షి | ,, | 1 | 0 |
| తారాబాయి | ,, | 0 | 14 |
| దిలారాము | ,, | 1 | 4 |
| కోవలన్ కన్నకి | | 0 | 12 |
| మనోహరి | ,, | 0 | 14 |
| వీరబాల | ,, | 0 | 8 |
| ఆనందమఠ | ,, | 0 | 12 |
| లాలాబాయి | ,, | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము | ,, | 1 | 8 |
| రోషినార | ,, | 0 | 12 |
| బాలాదిత్య | ,, | 2 | 0 |
| దేశభక్తుడు | | 1 | 0 |
| శంభుతోనొకనాటిసహవాసం | | 0 | 4 |
| చంద్రగుప్తుడు, నవల | | 2 | 8 |